

# భాగవత సుధాలహరి

- డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు

# భాగవత సుధాకరం

## ద్వితీయస్కంధము - ప్రథమసంపుటము


వ్యాఖ్యాత:

సరస్వతీపుత్ర

డా. పుట్టపర్తి నారాయణాచార్యులు






ప్రచురణ:

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1990

# ముందుమాట

ఏతావతాల మఘ నిర్హరణాయ పుంసాం,
సంకీర్తనం భగవతో గుణకర్మనామ్నామ్.

(భాగవతం 6-3-23)

భగవంతుడి గుణ కర్మ నామాలను కీర్తించడంద్వారా పాప పంకిలాన్ని ప్రక్షాళనం చెయ్యవచ్చని వ్యాసవచనం. భారతాది గ్రంథాలలో ధర్మనిరూపణాది విషయాలకు ప్రాధాన్యం లభించింది. ధర్మస్వరూప నిరూపణాదులవల్ల కలగని చిత్తశాంతి కృష్ణ కథాప్రధానమైన శ్రీమద్భాగవత రచనవల్లనే పారాశర్యుడికి సమకూడిందని భాగవత ప్రథమస్కంధం ప్రస్ఫుటం చేస్తున్నది.

భగవంతుడి దశావతారాలు ప్రసిద్ధాలు. చతుర్వింశత్యవతారాలనుకూడ భాగవతం పేర్కొన్నది. అవతార స్వరూపనిరూపణచేసిన ద్వితీయస్కంధంలో ఆ పురుషోత్తముడి లీలావతారాలు అసంఖ్యేయాలు అని చెప్పడంకూడా జరిగింది. కాని శ్రీకృష్ణావతారం పూర్ణావతారంగా పేనుతి కెక్కింది. 'కృష్ణస్తు భగవాన్ స్వయమ్' అన్నమాట ఈ సత్యాన్ని దృఢీకరిస్తుంది.

వ్యాసభగవానుడు భగవంతుడి గుణాలను, కర్మలను, నామాలను వివిధ రీతుల్లో వర్ణిస్తూ భాగవతరచన కావించాడు. అందులోనూ కృష్ణావతార కథనానికి తన రచనలో ఇంచుమించు అర్థభాగాన్ని వినియోగించాడు.

అవ: జనులు దమ తమ వాసనల ననుసరించి నిర్వహించెడు స్వాభావికములైన కర్మలు జన్మ జరావ్యాధి మరణములకుఁ గారణ భూతము లగును. అందుచేత నవి వర్జింపఁ దగినవి. ఈ విషయముఁ జెప్పఁదలఁచికొన్న భగవంతుఁడైన శుకాచార్యుఁడు 'బ్రూహి యద్వా విపర్యయం' - వినఁదగనిది చింతింపరానిది యైన విషయమునుగూడ వివరింపవలెనని యడిగిన పరీక్షిన్మహారాజు ప్రశ్నమున కుత్తరముఁ జెప్పుచున్నాఁడు-

ఓ రాజశ్రేష్ఠా! గృహాదులందుఁ దాత్పర్యమున్న వారికి కుటుంబ సంరక్షణార్థమై హింసాది వ్యాపారములు చేయవలసియే యుండును. వానినుండి తప్పించికొనుటకు వీలు లేదు. అందుచేత నంతఃకరణ మాలిన్య మేర్పడును. తత్కారణముగా నాత్మతత్త్వము నరయుటకు వారికి సాధ్యముగాదు. వీరికి ఇట్టి వారికి శ్రవణీయములు ఆలోచనీయములైన ప్రాకృతకార్యము లెన్నియో యుండును. గృహస్థునకు నైదు విధములైన పాపము లంటియే యుండును. అవి లేనిది వానికి నిర్వహణమే గాదు. వీనినే పంచసూనము లందురు.

పంచసూనా గృహస్థస్య చుల్లీ పేష ణ్యుపస్కరాః,
ఖండనీ చోదకుంభశ్చ బధ్యతే యాశ్చవాహయన్.

అని స్మృతి వాక్యము. చుల్లి, పేషణి, ఉపస్కరము, ఖండని, ఉదకుంభము-ఇవి యీ పంచసూనముల పేరులు. గృహమేధ శబ్దమందున్న మేధ శబ్దమునకే హింస యని పేరు. ఈ పంచసూనములతో ననేకములైన సూక్ష్మప్రాణులు నశించును. తనుక హింసలేక గృహస్థ ధర్మానుష్ఠాన మశక్యమని భావము.

నిద్రయా హ్రియతే నక్తం వ్యవాయేన నవం వయః,
దివా చార్థేహయా రాజ న్కుటుంబభరణేన చ. 3

నక్తం = రాత్రిలో, వయః = ఆయుస్సు, నిద్రయా = నిద్రచేతను, వ్యవాయేన చ = స్త్రీసుఖము చేతను, హ్రియతే = హరింపఁ బడుచున్నది, దివా = పగలు,

కుటుంబభరణముచేతను (హ్రీయతే).

అవ: ఇట్టి ప్రాకృత కార్యములకు లోఁబడియున్న విషయములను వినుట ఆలోచించుట మొదలైనవి, ఆయుస్సును వ్యర్థ మొనర్చెడు ప్రయత్నము మాత్రమే యని చెప్పుచున్నాఁడు-

ఓ రాజా! రాత్రులందు నిద్రతోను, స్త్రీ సహవాసముతోను ఆయువు క్షీణమగును. పగలు ధనసంపాదనమునకు, కుటుంబభరణమునకు నై ప్రయాస. వీనితో నాయువు గళిత మగును.

> దేహాపత్యకళత్రాది ష్వాత్మసై న్యేష్వసత్స్వపి,
> తేషాం ప్రమత్తో నిధనం పశ్యన్నపి న పశ్యతి. 4

దేహాపత్యకళత్రాదిషు=తనదేహము, సంతానము, భార్యమొదలైన, ఆత్మసైన్యేషు=తనపరివారము, అసత్స్వపి=నశించిపోవుననియే యైనను, ప్రమత్తః=కార్యాకార్యము లెఱుఁగు వివేకములేనివాఁడై, తేషాం=వారియొక్క, నిధనం=వినాశమును, పశ్యన్నపి=చూచుచున్నవాఁడైనను, న పశ్యతి=గమనింప నేరఁడు.

అవ: నశ్వరములైన కుటుంబాదులకై యాయుష్కాలమును మానవుఁడు వెచ్చించును. దీనికిఁ గారణ మేమి? దానినే చెప్పుచున్నాఁడు-

తన శరీరము, పుత్త్రులు, భార్య మొదలైన తనకు సంబంధించియున్న యే వస్తువు గూడ నశించిపోవునదే. వీ రందఱును నశించిపోవు వారని యెఱిఁగియు వారియం దాసక్తుఁడై యుండుటయే ప్రమాదము. తన మాతాపితలు నశించిరి. వారిని దానే చూచినాఁడు. అట్లే తన దేహము, తన చుట్టునున్నవా రందఱును నశించువారే. కాని తన దేహమును, వారును శాశ్వతమైనట్లు జీవియేదియో ప్రాకులాడును. అవివేకమునకున్న శక్తి యట్టిది.

'భక్త్యా భాగవతం జ్ఞేయం న వ్యుత్పత్త్యా న టీకయా 'అని అభియుక్తోక్తి. వ్యాఖ్యానాలతోనూ, పాండిత్యపటిమతోనూ భాగవతం అర్థం కాదు. భక్తిపూర్ణులు మాత్రమే దానిని ఆకళింతకు తెచ్చుకోగలరు. 'కలౌ భక్తిః కలౌ భక్తిః భక్త్యా కృష్ణః పురస్థితః' అన్నట్లు ఈ కలియుగంలో భగవత్‌సాక్షాత్కారానికి భక్తియోగమే ప్రధానసాధనం.

శ్రీ వేదవ్యాసమునీంద్రుడు భాగవతరచనలో ఉపయోగించిన భాష, ఆ రచనావిధానం అత్యంత విశిష్టమైనది. ఇక్కడ ఆయనది సమాధిభాష. భారత రామాయణాదులు చదివేటప్పుడు ఒకపద్ధతిలో సంస్కృతం మనకు సాక్షాత్కరిస్తుంది. శ్రీమద్భాగవతంలో రచన అలా కాకుండా ఒక విచిత్రమైన విశిష్టమైన, పద్ధతిలో సాగిపోతుంది. అంత సులభంగా అర్థమయ్యే భాష కాదది.

అందుకే పోతనామాత్యుడు 'భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు శూలికైన తమ్మి చూలికైన' అని వక్కాణించాడు. ఆయన భగవత్ప్రేరణవల్ల భాగవతానువాదానికి పూనుకున్నాడు. విబుధజనులవల్ల విన్నంత, తన కవగతమైనంతగా ఆయన అనువాదం సాగించాడు. అది కమనీయకావ్యచూడామణిగా వెలుగొందింది. శ్రీధరాది వ్యాఖ్యాతల వివరణను తనఅనువాదంలో పోతనగారు పొందుపరిచారు. ఆంధ్రదేశంలో ఏ గ్రంథానికీలేని వ్యాప్తి మహాభాగవతానికి లభించింది.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు ధార్మికసాహిత్య ప్రచారానికి ఉద్యమించి ప్రసిద్ధ గ్రంథాలను ప్రచురిస్తున్నారు. ఆ

సరస్వతీపుత్ర డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులవారి సర్వతోముఖ ప్రతిభా పాండిత్యాలు అందరికీ తెలును. వారు సంస్కృతాంధ్ర మూలరచనలు రెండింటికీ ప్రతిపదార్థ తాత్పర్య వివరణాత్మకమైన సురుచిరవ్యాఖ్య ప్రథమ, ద్వితీయ, తృతీయ స్కంధాలకు సమకూర్చారు.

ప్రథమస్కంధం ఐదు సంపుటాలలో వెలువడింది. ఇది ద్వితీయస్కంధ ప్రథమసంపుటం. ఇందులో ఒకటినుంచి అయిదు అధ్యాయాలకు నారాయణాచార్యులవారి వ్యాఖ్య పాఠకులు చవి చూడగలరు: ఆస్వాదించి ఆనందించగలరని ఆశిస్తున్నాము.

తిరుపతి,
30-8-90

ఎం. వి. ఎస్. ప్రసాద్, ఐ. ఏ. ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# పీఠిక

శ్రీనివాసుని యనుగ్రహముతో ప్రథమస్కంధము ముగిసినది. ఎన్ని స్కంధములు భగవంతుఁడు నాతోఁ జేయించునో చెప్పలేను. భాగవతపురాణములో అనేక క్లిష్టఘట్టములు వచ్చును ద్వితీయ, తృతీయ స్కంధములు పండితులనే కలవరపెట్టినవి యని పెద్దలందురు. ద్వితీయ స్కంధమును వ్యాఖ్యానించి విద్వాంసులలో నగ్రేసరుఁడైన శ్రీధరుఁడు గూడ 'ఏదో నా శక్తి కొలది యొనర్చినా'నని వినయమును గనుపఱచినాఁడు విజయధ్వజకారుఁడు గూడ దాదాపు నట్లే యొనర్చెను. ఇఁక నాబోటి వాని కథ యేమున్నది? వారితోఁ బోల్చినపుడు నేనల్పులలో నల్పుఁడను.

విశిష్టాద్వైతవ్యాఖ్యయైన వీరరాఘవీయమును జాల తక్కువగనే వాడుకొన్నాను. విజయధ్వజ వ్యాఖ్యలో నుదహరించిన అనేక శ్లోకములు ఎచ్చటనుండి తెచ్చికొన్నవో ఆయనయే చెప్పలేదు. అవి మధ్వాచార్యులు రచించిన భాగవతనిర్ణయము నుండి తెచ్చికొన్నవి. ఆ గ్రంథమునందవి యే యే పురాణముల లోనివో విపులముగఁ జెప్పఁబడినది. విశేషములు గావలసినవారు 'భాగవత తాత్పర్యనిర్ణయ'మను గ్రంథమును జూచికొనవచ్చును. ముందే మందమతిని. నాకుఁ గూడ నింకను మఱికొన్ని విషయములు చేర్పవలెననియే యాశ. కాని, యిట్లు చేర్చుచుఁ బోయినచో భాగవతము నా జీవితకాలములోనే ముగియుదేమో అను సందేహము పీడించుచున్నది. నా సాధ్యమైనంతవఱకుఁ జేసినాను. నా పరిశ్రమకు విజ్ఞులు ప్రమాణము.

'భాగవత సుధాలహరి' ప్రచురణపట్ల మిక్కిలి శ్రద్ధ వహిస్తున్న తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం. వి. ఎస్. ప్రసాద్, ఐ.ఏ.ఎస్., గారికి, పౌరసంబంధశాఖాధికారి డా. రావుల సూర్యనారాయణమూర్తి గారికి నా ధన్యవాదాలు. పుస్తకమును అందంగా అచ్చొత్తించి ఇచ్చిన టి.టి.డి ప్రెస్ మేనేజరు శ్రీ ఎం. విజయకుమార్ రెడ్డి గారికి, వారిసిబ్బందికి నా కృతజ్ఞతలు.

సుధాలహరి విషయంలో ముదివర్తి కొండమాచార్యులు తీసుకొంటున్న శ్రద్ధ నా కృతజ్ఞతకు మించినది. అవ్యాజమైన వారి అనుగ్రహమునకు వైష్ణవునిగా నే నివ్వగలిగినది ఒకసాష్టాంగ నమస్కారము తప్ప వేరే ఇతరము లేదు.

ఇట్లు
"పుట్టపర్తి"

# భాగవత సుధాలహరి
## ద్వితీయ స్కంధము
## ప్రథమాధ్యాయము

* * *

శ్రీ శుక ఉవాచః

వరీయానేష తే ప్రశ్నః కృతో లోకహితో నృప!
ఆత్మవిత్సమ్మతః పుంసాం శ్రోతవ్యాదిషు యః పరః. 1

నృప!=ఓ రాజా! తే=నీచేత, పుంసాం=పురుషులకు, శ్రోతవ్యాదిషు=వినఁదగినవానిలో, పరః యః ప్రశ్నః=ఉత్కృష్టమైన యేప్రశ్న, కృతః=చేయఁబడినదో, ఏషః=అది, వరీయాన్=శ్రేష్ఠమైనది, లోకహితం=లోకహితమైనది, ఆత్మవిత్సమ్మతః=బ్రహ్మవేత్తలైనవారికి సమ్మతమైనది.

శుకుఁ డన్నాఁడు: 'రాజా! మనుష్యుఁడు వినఁదగినది, చింతింపఁ దగినది, నిధిధ్యాసన మొనర్పఁదగినది యయిన పరతత్త్వమును గూర్చి నన్నుఁ బ్రశ్నించితివి. ఈ ప్రశ్న చాల శ్రేష్ఠమైనది. ఎందువలన ననఁగా నిది లోకహితము. బ్రహ్మవేత్తలైన వారికి సమ్మతమైన విషయము.

శ్రోతవ్యాదీని రాజేంద్ర! నృణాం సంతి సహస్రశః,
అపశ్యతా మాత్మతత్త్వం గృహేషు గృహమేధినామ్. 2

రాజేంద్రా!, ఆత్మతత్త్వం=ఆత్మస్వరూపమును, అపశ్యతాం=తెలియనట్టియు, గృహేషు=గృహస్థితులై యున్న, గృహమేధినాం=గృహస్థులై గృహస్థధర్మముల ననుసరించుచున్నట్టి, నృణాం=మనుష్యులకు, శ్రోతవ్యాదీని=వినఁదగినవి, సహస్రశః=వేలకున్నవి.

అవ: జనులు దమ తమ వాసనల ననుసరించి నిర్వహించెడు స్వాభావికములైన కర్మలు జన్మ జరావ్యాధి మగణములకుఁ గారణ భూతము లగును. అందుచేత నవి వర్జింపఁ దగినవి. ఈ విషయముఁ జెప్పఁదలఁచికొన్న భగవంతుఁడైన శుకాచార్యుఁడు 'బ్రూహి యద్వా విపర్యయం'- వినఁదగనిది చింతింపరానిది యైన విషయమునుగూడ వివరింపవలెనని యడిగిన పరీక్షిన్మహారాజు ప్రశ్నమున కుత్తరముఁ జెప్పుచున్నాఁడు-

ఓ రాజశ్రేష్ఠా! గృహాదులందుఁ దాత్పర్యమున్న వారికి కుటుంబ సంరక్షణార్థమై హింసాది వ్యాపారములు చేయవలసియే యుండును. వానినుండి తప్పించికొనుటకు వీలు లేదు. అందుచేత నంతఃకరణ మాలిన్య మేర్పడును. తత్కారణముగా నాత్మతత్త్వము నరయుటకు వారికి సాధ్యముగాదు. వీరికి ఇట్టి వారికి శ్రవణీయ ములు ఆలోచనీయములైన ప్రాకృతకార్యము లెన్నియో యుండును. గృహస్థునకు నైదు విధములైన పాపము లంటియే యుండును. అవి లేనిది వానికి నిర్వహణమే గాదు. వీనినె పంచసూనము లందురు.

పంచసూనా గృహస్థస్య చుల్లీ పేష ణ్యుపస్కరాః,
ఖండనీ చోదకుంభశ్చ బధ్యతే యాశ్చవాహయన్.

అని స్మృతి వాక్యము. చుల్లి, పేషణి, ఉపస్కరము, ఖండని, ఉద కుంభము-ఇవి యీ పంచసూనముల పేరులు. గృహమేధ శబ్దమం దున్న మేధ శబ్దమునకే హింస యని పేరు. ఈ పంచసూనములతో ననేకములైన సూక్ష్మప్రాణులు నశించును. గనుక హింసలేక గృహస్థ ధర్మానుష్ఠాన మశక్యమని భావము.

నిద్రయా హ్రియతే నక్తం వ్యవాయేన నవం వయః,
దివా చార్థేహయా రాజ న్కుటుంబభరణేన చ. 3

నక్తం = రాత్రిలో, వయః = ఆయుస్సు, నిద్రయా = నిద్రచేతను, వ్యవా యేన చ = స్త్రీసుఖము చేతను, హ్రియతే = హరింపఁ బడుచున్నది, దివా = పగలు,

అర్థేహయా-ధనమునందలి యాశచేతఁ జేయుపరిశ్రమతో, కుటుంబభరణేన చ-కుటుంబభరణముచేతను (హ్రియతే).

అవ: ఇట్టి ప్రాకృత కార్యములకు లోఁబడియున్న విషయములను వినుట ఆలోచించుట మొదలైనవి, ఆయుస్సును వ్యర్థమొనర్చెడు ప్రయత్నము మాత్రమే యని చెప్పుచున్నాఁడు-

ఓ రాజా! రాత్రులందు నిద్రతోను, స్త్రీ సహవాసముతోను ఆయువు క్షీణమగును. పగలు ధనసంపాదనమునకు, కుటుంబభరణమునకై ప్రయాస. వీనితో నాయువు గళిత మగును.

దేహాపత్యకళత్రాది ష్వాత్మసైన్యేష్వసత్స్వపి,
తేషాం ప్రమత్తో నిధనం పశ్యన్నపి న పశ్యతి. 4

దేహాపత్యకళత్రాదిషు-తనదేహము, సంతానము, భార్యమొదలైన, ఆత్మసైన్యేషు-తనపరివారము, అసత్స్వపి-నశించిపోవుననియే యైనను, ప్రమత్తః-కార్యాకార్యము లెఱుఁగు వివేకములేనివాఁడై, తేషాం-వారియొక్క, నిధనం-వినాశమును, పశ్యన్నపి-చూచుచున్నవాఁడైనను, న పశ్యతి-గమనింప నేరఁడు.

అవ: నశ్వరములైన కుటుంబాదులకై యాయుష్కాలమును మానవుఁడు వెచ్చించును. దీనికిఁ గారణ మేమి? దానినే చెప్పుచున్నాఁడు-

తన శరీరము, పుత్రులు, భార్య మొదలైన తనకు సంబంధించియున్న యే వస్తువు గూడ నశించిపోవునదే. వీ రందఱును నశించిపోవు వారని యెఱిఁగియు వారియం దాసక్తుఁడై యుండుటయే ప్రమాదము. తన మాతాపితలు నశించిరి. వారిని దానే చూచినాఁడు. అట్లే తన దేహము, తన చుట్టుపక్కల వా రందఱును నశించువారే.

తస్మాద్భారత సర్వాత్మా భగవాన్ హరిరీశ్వరః,
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ స్మర్తవ్యశ్చేచ్ఛతాఽభయమ్. 5

**తస్మాత్=అందుచేత, భారత !=భరతవంశమువందు జన్మించిన వాఁడా, అభయం=భయనివృత్తిని, ఇచ్ఛతః=కోరుచున్నవానిచేత, సర్వాత్మా=సర్వమందును ఆత్మస్వరూపమైయున్న యట్టి, భగవాన్=ఐశ్వర్యపూర్ణుఁడును, ఈశ్వరః=సర్వనియంతయునైన, హరిః=శ్రీకృష్ణుఁడు, శ్రోతవ్యః=వినఁదగినవాఁడు, కీర్తితవ్యః=కీర్తింపఁదగినవాఁడు, స్మర్తవ్యః=స్మరింపఁదగినవాఁడు.**

అందుచేత జననమరణరూపమైన భయమునుండి తప్పించుకొనవలెనని కోర్కిగల మనుష్యుఁడు మృగప్రాయమైన జీవితమునుపేక్షింపవలెను. సకలమున కాత్మస్వరూపుఁడును సకలైశ్వర్య పరిపూర్ణుఁడును, సకలమును దాని దాని హద్దులలో నుంచి మర్యాదను సంరక్షించు నీశ్వరుఁడు నైన శ్రీహరిని గూర్చి వినుటయుఁ, గీర్తించుటయు, స్మరించుటయుఁ జేయఁదగును. సంసార భయమును దీర్చి రక్షించు సిద్ధౌషధ మిదే.

ఏతావాన్ సాంఖ్యయోగాభ్యాం స్వధర్మపరినిష్ఠయా,
జన్మలాభః పరః పుంసా మంతే నారాయణస్మృతిః. 6

**సాంఖ్యయోగాభ్యాం=సాంఖ్యము-యోగము వీనిచేతను, స్వధర్మ పరినిష్ఠయా=స్వధర్మమందున్న శ్రద్ధచేతను, ఏతావాన్=ఈ మాత్రమే, పుంసాం=పురుషునకు, అంతే=మరణకాలమందు, నారాయణస్మృతిః=శ్రీమన్నారాయణుని గూర్చిన జ్ఞాపకము, పరః=శ్రేష్ఠమైన, జన్మలాభః=జన్మముయొక్క లాభము.**

అవ: స్మరణమాత్రముతో ముక్తి ననుగ్రహించు భగవంతుని మహిమను వర్ణించుట సాధ్యము గాదని చెప్పుచున్నాఁడు-

సాంఖ్యము, యోగము, స్వధర్మపరినిష్ఠ-వీనితో నేర్పడెడి లాభమింత మాత్రమే: మరణ సమయమందు శ్రీమన్నారాయణ స్మృతి.

ఇదే యుత్తమజన్మ లాభము. దీనికన్నను శ్రేష్ఠమగు శ్రేయస్సు మఱి యొకటి లేదు.

ప్రాయేణ మునయో రాజన్నివృత్తా విధినిషేధతః,
నైర్గుణ్యస్థా రమంతేస్మ గుణానుకథనే హరేః. 7

**రాజన్—ఓ రాజా!, విధినిషేధతః = 'విధి', 'నిషేధము' అను నీ రెంటి నుండియు, నివృత్తాః—విడివడినవారును, నైర్గుణ్యస్థాః—నిర్గుణస్వరూపమున నున్న వారునునైన, మునయః—మునులు, ప్రాయేణ—సామాన్యముగా, హరేః—శ్రీహరి యొక్క, గుణానుకథనే—గుణములను గీర్తించుటయందు, రమంతే—రమింతురు, స్మ—ఈ విషయము ప్రసిద్ధము.**

అవ: హరికీర్తనమే యుత్తమమైన శ్రేయస్సు. ఈ విషయ మందు సదాచారమును బ్రమాణముగాఁ జెప్పుచున్నాఁడు—

రాజా! విధినిషేధముల నుండి విముక్తులై సర్వము బ్రహ్మ స్వరూపముగా వీక్షించి నిర్గుణబ్రహ్మమందే యానందము ననుభవిం చెడు మహామునులును శ్రీహరి గుణకీర్తనమునందే రమింతురు.

**ఇదం భాగవతంనామ పురాణం బ్రహ్మసమ్మితమ్,
అధీతవాన్ ద్వాపరాదౌ పితుర్ద్వైపాయనా దహమ్. 8**

**బ్రహ్మసమ్మితం— 1. పరబ్రహ్మతోఁదుల్యమైనట్టియు, 2. వేదములతో సమానమైనట్టియు, భాగవతం నామ—భాగవతమను పేరుగల, ఇదం పురాణం— ఈ పురాణమును, పితుః—తండ్రియైన, ద్వైపాయనాత్—వ్యాసభగవానుని నుండి, ద్వాపరాదౌ — ద్వాపరము ఆదిగా నున్న, (కాలే—కాలమందు), అహం—నేను, అధీతవాన్—అధ్యయన మొనర్చితిని.**

భాగవతము భగవత్స్వరూపమైనది. భగవంతునిచే నారదున కనుగ్రహింపఁబడినది. వేదములతో సమానమైనది. ఈ మహాపురా ణమును ద్వాపరాంతమందు నా తండ్రియైన వ్యాసభగవానుని నుండి నేను నేర్చితిని.

యందు భక్తిగలవాఁడవు. దీనియందు శ్రద్ధగల వారందఱికిని ముక్తి నొసఁగుటలో నేకాధికారియైన శ్రీకృష్ణపరమాత్మయందు ఫలేచ్ఛ లేనట్టి భక్తి యేర్పడును. శుకాచార్యుఁ డుపదేశించినది పరీక్షిత్తునకేయైనను లోకమున కందఱికిని నిది మహోపకారకమగుచున్నది. ఈ విషయము 'మహాపౌరుషికః' అను పదముచే సూచితము. పరమశివుఁడు జ్ఞాన ప్రదాతయనియు, శ్రీమహావిష్ణువు ముక్తిదాత యనియుఁ బ్రసిద్ధమే.

ఏతన్నిర్విద్యమానానా మిచ్ఛతా మకుతోభయమ్,
యోగినాం నృప నిర్ణీతం హరే ర్నామానుకీర్తనమ్. 11

**ఇచ్ఛతాం=ఇచ్ఛ గలిగినట్టియు, నిర్విద్యమానానాం=విరక్తులైన, యోగినాం=యోగులకు, అకుతోభయం=సకల భయములను నశింపఁజేయునట్టి, హరేః =శ్రీహరియొక్క, నామానుకీర్తనం=నామసంకీర్తనము, ఏతత్=ఇది, నిర్ణీతం =సాధనముగా నిర్ణయింపఁబడినది.**

ఇహలోకసుఖములం దాసక్తిగలవారి కా సుఖములు దయ చేయును, విరక్తులైన వారికి భక్తిదాన మొసఁగును. జ్ఞానులైన యోగులకు నానందప్రదాన మొడఁగూర్చును. సకల భయములను దొలఁగించి పరమపదమునిచ్చు శక్తి గలిగిన శ్రీహరి కీర్తనము వారి వారి కర్హములైన ఫలము లొడఁగూర్చును. ఇది యొకటే సర్వ శ్రేయస్సాధనము. శ్రీహరి మాహాత్మ్య మెఱిఁగిన సర్వు లొనర్చిన నిశ్చయ మిది. అందుకే సాధకులకును సిద్ధులకును దీనిసమించిన పరమశ్రేయోమార్గము లేదు.

కిం ప్రమత్తస్య బహుభిః పరోక్షైర్హాయనై రిహ,
వరం ముహూర్తం విదితం ఘటతే శ్రేయసే యతః. 12

ప్రమత్తస్య=సంసారాదులందుఁ బ్రమత్తుఁడైనటి వానికి, పరోక్షైః=

సమయమే, వరం=శ్రేష్ఠము, యతః=ఎందువలన ననఁగా, శ్రేయసే=శ్రేయస్సు కొఱకు, ఘటతే=అగుచున్నది కదా!

అవ: మిగిలిన ఆయుస్సు కొంచెఁదియే గదా! ఇంత యల్ప కాలములో నేమి సాధింపఁగలను' అని యధైర్యపడకు మని ధైర్య మిచ్చుచున్నాఁడు-

శ్రేయోమార్గమును మనస్సునకుఁ బట్టించి కొనకయే యవి జ్ఞాతములై యనేక వత్సరములు గడచిపోయినవి. ఆ దీర్ఘకాలము వ్యర్థమైపోయెనే తప్ప దానినుండియు ఫలమేమియు లేదు. హరి చింతనతోఁ గడపు నల్పకాలమే యైనను నదియే సార్థకమైన కాలము. జ్ఞానపూర్ణమైన యీ యల్పకాలములోనే జన్మలాభమును సాధింప వచ్చును.

ఖట్వాంగో నామ రాజర్షిః జ్ఞాత్వేయత్తామిహాయుషః,
ముహూర్తాత్సర్వముత్సృజ్య గతవా నభయం హరిమ్.13

ఖట్వాంగః నామ = ఖట్వాంగుఁడను పేరుగల, రాజర్షిః=రాజశ్రేష్ఠుఁడు, ఆయుషః=ఆయుస్సుయొక్క, ఇయత్తాం=అవధిని, జ్ఞాత్వా=తెలిసికొని, ఇహ= ఈ భూమియందు, ముహూర్తాత్=ముహూర్తములోనే, సర్వం=సమస్తమును ఉత్సృజ్య = ఉపేక్షించి, అభయం = భయరహితస్థానమైన, హరిం=శ్రీమహా విష్ణువును, గతవాన్=పొందినవాఁడయ్యెను.

ఖట్వాంగుఁడను రాజర్షి దేవతలతోఁ జేరి యసురుల సంహ రించినాఁడు. అప్పు డమరులు సంతోషించి యాతనిని వర మడుగు మనిరి. అతఁడు 'నా కింక జీవితకాల మెంత యున్నదని' ప్రశ్నిం చెను. దేవత 'లొక ముహూర్త కాల' మన్నారు. వెంటనే యాతఁడు విమానములో భూమికి వచ్చినాఁడు. మానసికబంధములను వదల్చి కొన్నాఁడు. సర్వభయములను నశింపఁజేసి రక్షించెడు శ్రీహరి నాతఁడు శరణుఁ జొచ్చెను. రజోగుణప్రధానమైన స్వర్గమందున్నచో

తవ త్వేతర్హి కౌరవ్య! సప్తాహం జీవితావధిః,
ఉపకల్పయ తత్సర్వం యత్తావ త్సాంపరాయికమ్. 14

కౌరవ్య!=కురుకులశ్రేష్ఠుఁడా!, తవ=నీకు, ఏతర్హి అపి=ఇప్పుడుగూడ, సప్తాహం = ఏడుదినములు, జీవితావధిః =జీవితసమయమున్నది, తత్సర్వం = అందుచే సమస్తమైన, యత్ సాంపరాయికం= ఏది పరలోక హితసాధనమో, తత్=దానిని, తావత్=అంతలోనే, ఉపకల్పయ = సంపాదించికొనుటకై వెచ్చింపుము.

పూరువంశశ్రేష్ఠుఁడవైన రాజర్షీ! నీ కింకను జీవిత మేడు దినములున్నది. పరలోకహితమును సాధించుటకా యాయుష్కాలమును జక్కఁగా నుపయోగించికొమ్ము. అది చాలును.

అంతకాలే తు పురుష ఆగతే గతసాధ్వసః,
ఛింద్యా దసంగశస్త్రేణ స్పృహాం దేహే చ యేఽనుతమ్.15

అంతకాలే ఆగతే=అవసానకాలము సమీపించిన దగుచుండఁగా, పురుష =పురుషుఁడు, గతసాధ్వసః=భయరహితుఁడై, దేహే=దేహమునందును, తం అను = దాని ననుసరించియున్న, యే = ఏ విషయములు గలవో వానియందలి, స్పృహాం=ఆశను, అసంగశస్త్రేణ=అనాసక్తియనెడు శస్త్రముచేత, ఛింద్యాత్= ఛేదింపవలెను.

అవసానకాలము సమీపించినదని యెఱిఁగిన పురుషుఁడు మరణభయమును దొలఁగి ఇహలోకసుఖములం దిచ్ఛను, స్వశరీరమందాసక్తిని, దానికి సంబంధించిన పుత్త్రాదులందుఁ గల స్నేహమును, అనాసక్తి యను శస్త్రముచే ఛేదింపవలెను.

గృహాత్ ప్రవ్రజితో ధీరః పుణ్యతీర్థ జలాప్లుతః,
శుచౌ వివిక్త ఆసీనో విధివత్కల్పితాసనే. 16

గృహాత్ = గృహమునుండి, ప్రవ్రజితః = వదలిపోయినవాఁడై, పుణ్యతీర్థజలాప్లుతః = పవిత్రజలములందు స్నాన మొనర్చి, శుచౌ = శుద్ధమైనదియు,

వివిక్తే = ఏకాంతమైనదియునైన ప్రదేశమందు, విధివత్ = శాస్త్రానుసారముగా, కల్పితాసనే=కల్పింపఁబడిన యాసనమందు, ధీరః=ధీరుఁడై, ఆసీనః=కూర్చున్న వాఁడు గావలెను.

ఇంతమాత్రమే చాలదు. వాఁడు గృహమును వదలిపోవలెను. గృహమం దున్నచో నెప్పుడేమియు దానియం దాసక్తి యేర్పడుట కవకాశ మున్నది. అందుచే దానినివీడి దూరముగాఁ బోవలెను. పుణ్యతీర్థమంద స్నాన మొనర్పవలెను. జనసంచారములేని శుద్ధప్రదేశ మందు విధిప్రకారము గల్పించుకొన్న యాసనమునఁ గూర్చుండి ధీరుఁడై బుద్ధిప్రవృత్తిని చలింపనీయక ధారణ యొనర్పవలెను.

ఇక్కడ నష్టాంగయోగముల సూచించుచున్నాఁడు. బ్రహ్మచర్యాది నియమములు ధీరుఁ డనెడు పదముచే సూచితములు. సదాచారమును 'పుణ్యతీర్థ నిషేవణాత్' అనునది సూచించుచున్నది.

అభ్యసేన్మనసా శుద్ధం త్రివృద్బ్రహ్మాక్షరం పరమ్,
మనో యచ్ఛేజ్జితశ్వాసో బ్రహ్మబీజ మనుస్మరన్. 17

త్రివృత్=మూఁడువృత్తులతోఁ గూడినదియు, శుద్ధం=పరిశుద్ధమైనదియు, పరం=శ్రేష్ఠమునైన, బ్రహ్మాక్షరం=మంత్రాక్షరమును, మనసా=మనస్సుతో, అభ్యసేత్=అభ్యసింపవలెను, బ్రహ్మబీజం=బ్రహ్మబీజమును, అవిస్మరన్=మఱచిపోకయే, జితశ్వాసః=శ్వాసమును జయించినవాఁడై, మనః=మనస్సును, యచ్ఛేత్=నియమింప వలెను.

అవ: జపగర్భమైన ప్రాణాయామ మభ్యసింపవలెనని యుపదేశించుటకై జప్యమైన మంత్రమును సూచించుచున్నాఁడు-

అకార ఉకార మకారములను మూఁడు మాత్రలతోఁ గూడిన దోంకారము. ఇదే బ్రహ్మవాచకము. పరిశుద్ధమైన ప్రణవమును మనస్సుతో జపింపవలెను. బ్రహ్మబోధకమైన యీ బీజాక్షరమును

మనస్సుచంచలతను మాన్పి బీజాక్షరమందే సమగ్నముగు నట్లొనర్ప వలెను.

నియచ్ఛేద్విషయేభ్యోఽక్షాన్మనసా బుద్ధిసారథిః,
మనః కర్మభిరాక్షిప్తం శుభార్థే ధారయేద్ధియా 18

బుద్ధిసారథిః=బుద్ధియను సారథితోఁ గూడినవాఁడై, మనసా=మనస్సుతో, అక్షాన్ = ఇంద్రియములను, విషయేభ్యః = విషయములనుండి, నియచ్ఛేత్= నియమింపవలెను, కర్మభిః=వివిధములైన కర్మలచేత, ఆక్షిప్తం=చలితమైన, మనః=మనస్సును, ధియా=బుద్ధిచేత, శుభార్థే=పరిశుద్ధ వస్తువగు భగవద్రూప మందు, ధారయేత్=ధారణ మొనర్పవలెను.

నిశ్చయాత్మకబుద్ధిని సారథిగా గైకొనవలెను. అనఁగా సహాయముగాఁ దీసికొనవలె నన్నమాట. దాని సాయముతో మన స్సును విషయములనుండి మరలింపవలెను. దీనికే ప్రత్యాహార మని పేరు. పిదపఁ గూడ కర్మవాసనలతోఁ జలితమైన మనస్సును భగవ త్స్వరూపమందే నిలుకడగా నిలుపవలెను. దీనికే ధారణ అని పేరు.

తత్రైకావయవం ధ్యాయే దవ్యుచ్ఛిన్నేన చేతసా,
మనో నిర్విషయం యుంక్త్వా తతః కించన న స్మరేత్.19

తత్ర=దీనియందు, అవ్యుచ్ఛిన్నేన=విచ్ఛేదములేనట్టి, చేతసా=మనస్సుతో ఏకావయవం=ఒక్కొక్క యవయవమును, ధ్యాయేత్=ధ్యానింపవలెను, మనః= మనస్సును, నిర్విషయం=విషయరహితముగా, యుక్త్వా=యోజింపఁజేసి, తతః =తరువాత, కించన=దేనిని, న స్మరేత్=స్మరింపరాదు.

అవ: ధ్యానమును వివరించుచున్నాఁడు-

భగవద్రూపమందు పాదాదులగు నొక్కొక్క యవయవమును సమగ్రరూపమునుండి చలింపని మనస్సుతోఁ గ్రమముగా ధ్యానింప వలెను. ఇట్లు ఒక్కొక్క యవయవమందును స్థిరమై నిలిచిన మనస్సు

ఈ స్థితిలో మనస్సు భగవచ్ఛ్రీవిగ్రహమును తదవయవమును దప్ప మఱియొక్క దానిని భావింపనే రాదు. ఈ స్థితినే సమాధియందురు.

పదం తత్పరమం విష్ణోర్మనో యత్ర ప్రసీదతి,
రజస్తమోభ్యా మాక్షిప్తం విమూఢం మన ఆత్మనః. 20

రజస్తమోభ్యాం=రజస్తమోగుణములచేత, ఆక్షిప్తం=చలితమైనదియు, విమూఢం=అంధకారమందు మున్గినదియునైన, ఆత్మనః మనః=తన మనస్సును, ధీరః=ధీరుఁడు, ధారణయా = ధారణతో, యచ్ఛేత్ = జయింపవలెను, యా= ఏ ధారణ, తత్కృతం = రజస్తమస్సులతో నేర్పడు, మలం = దోషమును, హంతి=హరించుచున్నది.

అవ: గుణముల శక్తివలన మనస్సు తర్వాత గూడఁ జలించి నచో ధారణ నావర్తింప వలెనని యుపదేశించుచున్నాఁడు-

రజోగుణము చెలరేఁగినపుడు మన స్సొకదానియందును నిలుకడగా నుండక రెపరెప లాడును. తమోగుణాధిక్యముచే నేర్పడునదే నిద్ర. ఇట్లు గుణముల ప్రాబల్యముతోఁ జలితము మోహితము నైన మనస్సును ధారణతోనే జయింపవలెను. అధైర్యపడి పోరాదు. రజస్తమోగుణములతో విక్షేపము లయము అను రెండు దోషములేర్పడుచున్నవి. వీనినిఁ దొలఁగించు సాధనము ధారణ యొక్కటే;

యచ్ఛేద్ధారణయా ధీరో హంతి యాతత్కృతం మలమ్,
యస్యాం సంధార్యమాణాయాం యోగినో భక్తిలక్షణః.21
ఆశు సంపద్యతే యోగ ఆశ్రయం భద్రమీక్షతః.

సంధార్యమాణాయాం=చక్కఁగా ధారణచేయఁబడినట్టి, యతః=దేనినుండి భద్రం = సుఖరూపమైన, ఆశ్రయం = విషయమును, ఈక్షతః = వీక్షించుచున్న,

యోగినః=యోగియైన వానికి, భక్తిలక్షణః=భక్తియను లక్షణముతోడి, యోగః= యోగము, ఆశు=శీఘ్రముగా, సంపద్యతే=ప్రాప్తించుచున్నది.

ఈ ప్రకారము ధారణ నభ్యసించునపుడు సుఖస్వరూపమైన యొక యాశ్రయము మనస్సునకు సిద్ధించును. మనస్సు దానిని వదలి పోక దానియందే ప్రీతిగలదై యుండును. ఇట్లు సుఖవిషయమును వీక్షించుచున్న యోగికి భక్తిలక్షణమైన యోగము త్వరలోసిద్ధించును.

రాజోవాచ:

> యథా సంధార్యతే బ్రహ్మన్ ధారణా యత్ర సమ్మతా,
> యాదృశీ వా హరే దాశు పురుషస్య మనోమలమ్. ౭౮

బ్రహ్మన్=బ్రహ్మజ్ఞానము గలవాఁడా!, యథా=ఎట్లు, యత్ర=ఎచ్చటి, యాదృశీ=ఎట్టి; ధారణా=ధారణ, పురుషస్య=మనుష్యునియొక్క, మనోమలం =మనస్సుయొక్క మలమును, ఆశు=శీఘ్రముగా, హరేదితి=హరించునని, సత్పురుషులకు సమ్మతమో (దానిఁ జెప్పుము).

అవ: సంక్షేపముగా నష్టాంగయోగమును రాజు విన్నాఁడు. దానిని గూర్చి విస్తారముగా వినవలెనని యాతని యభిప్రాయము. అందుకై ప్రశ్నించుచున్నాఁడు. రా జడిగిన ప్రశ్నగూడ అన్యుల హితము నుద్దేశించియే యని తెలియవలెను.

బ్రహ్మర్షీ! భక్తిని జనింపఁ జేయునదని సజ్జను లందఱు సమ్మతించిన ధారణ నే విధముగా నొనర్పవలెను? దేని నాశ్రయించి చేయవలెను? ఆ ధారణ యెట్టిదిగా నున్నచో పురుషుని మనోమలమును అనఁగాఁ జలనరూపముగా నున్న మనోదోషమును నశింపఁ జేయును? దీనిని విస్తరించి చెప్పవలెను?

ఋషి రువాచ:

> జితాసనో జితశ్వాసో జితసంగో జితేంద్రియః,
> స్థూలే భగవతో రూపే మన స్సంధారయేద్ధియా. ౭౯

**జితాసనః=ఆసనమును జయించిన వాఁడును, జితశ్వాసః=శ్వాసమును జయించినవాఁడును, జితసంగః=సంగమును జయించినవాఁడును, జితేంద్రియః = ఇంద్రియములను జయించినవాఁడును నైన, భగవతః = భగవంతునియొక్క, స్థూలేరూపే=స్థూలమైన రూపమునందు, మనః=మనస్సును, ధియా=బుద్ధిచేత, సంధారయేత్=చక్కఁగా గదింపవలెను.**

శుకబ్రహ్మ యన్నాఁడు: 'సాధకుఁడు ముందుగా నాసనమును జయింపవలెను. అనఁగా నొకే యాసనమం దెంతసే పున్నను శారీరకబాధ తలఁగిపోయెడు స్థితికి రావలెనని యభిప్రాయము. శ్వాసప్రశ్వాసములను నిర్జింపవలెను. ప్రాకృతజన సంసర్గమును వదలవలెను. ఇంద్రియములను వాని విషయముల నుండి నిలుకడ సేయవలెను. తరువాత భగవంతుని ప్రపంచాకారమైన స్థూలరూపము నందు బుద్ధితోఁ గూడ మనస్సును లగింపఁజేయవలెను. భగవంతుని ప్రపంచాకారమైన స్థూలరూపమునకే విరాడ్రూప మని పేరు.

> విషయస్తస్య దేహోఽయం స్థవిష్ఠస్య స్థవీయసామ్,
> యత్రేదం దృశ్యతే విశ్వం భూతం భవ్యం భవచ్చ సత్. 24

**తస్య=ఆ యీశ్వరునియొక్క, అయం విశేషః దేహః=ఈ స్థూలరూపము, స్థవీయసాం=ఎక్కువ స్థూలరూపములైన వాని కంటెను, స్థవిష్ఠః=స్థూలమైనది, యత్ర=దేనియందు, సత్=కార్యరూపమైన, భూతం=ఏర్పడినదియు, భవ్యం= ఏర్పడనున్నదియు, భవత్=ప్రవర్తించుచున్నదియు, ఇదం విశ్వం=ఈ సమస్త లోకమును, దృశ్యతే=కనిపించుచున్నదో-**

కార్యస్వరూపమై యింతకు మునుపున్నదియు, ఉండఁబోవునదియు, నుండుచున్నదియునైన యీ సమస్త ప్రపంచమును భగవంతుఁడైన యుదిపొవమందే యున్నదు... మహాస్థూలములైన వాని

కన్పించుచున్న సర్వమును, భక్తియోగమును బొంద నిచ్ఛగించెడు మానవునకు విషయమైయున్న దీ స్వరూపమే. అమరులు మనుష్యులు మృగములు పక్షులు-ఈరీతిగా వివిధాకారములచే శోభించుచుండుటచే దీనిని విరాడ్రూపమని జ్ఞాను లందురు. వివిధ నామరూప ప్రసిద్ధుల కధిష్ఠానమైన సగుణబ్రహ్మనే విరాట్పురుషు డనియు బిల్తురు. 24

అండకోశే శరీరేఽస్మిన్ సప్తావరణసంయుతే,

వైరాజః పురుషో యోఽసౌ భగవాన్ ధారణాశ్రయః. 25

**సప్తావరణ సంయుతే — ఏడావరణములతోఁ గూడినట్టి, అండకోశే— అండకోశమునకు సంబంధించినదియైన, అస్మిన్ శరీరే—ఈ శరీరమందు, వైరాజః —వైరాజుఁడని పేరుగల, యః పురుషః—ఏ పురుషుఁడు గలఁడో, అసౌ భగవాన్ —ఆ భగవంతుఁడు, ధారణాశ్రయః—ధారణ కాశ్రయమైనవాఁడు.**

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తత్త్వము అనెడు సప్తావరణములతోఁ గూడిన దీ శరీరము. దీనికే యండకోశ మనిపేరు. లోకరూపమైన ఈ శరీరమందుఁ బ్రకాశించుచున్న పురుషునే వైరాజపురుషుఁ డందురు, ఈ పురుషుఁడు గూడ ధారణాశ్రయుఁడే యనుట యౌపచారికము. పరమార్థముగ నున్న యాశ్రయము సర్వజీవ నియంతయైన భగవంతుఁడే. భగవంతుని లోకాకారమైన స్థూలరూపమందు మనస్సును లగింపఁ జేసినప్పుడు ఆ లోకమందు వ్యాపించియు ఒక్కొక్క ఆకృతియందును చేతన రూపముగాఁ బ్రకాశించుచున్న వైరాజుఁడను పేరుగల సూక్ష్మరూపము నందు ప్రేమలక్షణమైన భక్తి జనించును. శరీరము బాహ్యభాగముగా కోడి మొదలగువాని గ్రుడ్డువలెను, దానిలోపలఁ గాలు సేతులు మొద లైన వానితోఁ గూడి యుండియు నొక భాగము 'అమ'తోఁ గూడి నదియునైన యొకా నొక యాకృతి విశేషమునే యండమని యం

లతోఁ గూడియున్న వాఁడును నైన బ్రహ్మమే యీ కోశమందలి జీవుఁడు. ఆ జీవునకే క్షేత్రజ్ఞుఁ డనిపేరు. ఆ క్షేత్రజ్ఞుఁడు అనుభవించుటకు యోగ్యమైన ప్రకాశించుస్వరూపమే విరాడ్రూపము. ఇందులో ఉపాస్యరూపముతో శోభించుపురుషుఁడే వైరాజపురుషుఁడు. ఈ భగవంతునే యుపాసింపవలెను.

పాతాళమేతస్య హి పాదమూలం
పఠంతి పార్ష్ణిప్రపదే రసాతలమ్,
మహాతలం విశ్వసృజోఽథ గుల్ఫౌ
తలాతలం వై పురుషస్య జంఘే. 26

**విశ్వసృజః=సమస్తప్రపంచమును సృష్టించిన, ఏతస్య=పరమేశ్వరుని యొక్క, పాదమూలం=పాదముల క్రిందిభాగము, పాతాళం=పాతాళ మనియు, పార్ష్ణిప్రపదే = పార్ష్ణియు, ప్రపదమును, (పార్ష్ణి = పాదము వెనుకభాగము, ప్రపదము=పాదము ముందుభాగము), రసాతలం=రసాతల మనియు, గుల్ఫౌ= గుల్ఫములు, మహాతలం=మహాతల మనియు, పురుషస్య=పురుషుని యొక్క, జంఘే=జంఘలు, తలాతలం=తలాతల మనియు, వదంతి=చెప్పెదరు.**

విరాడ్దేహము, దాని యందున్న జీవుఁడు- వానియందుఁ గల యంతర్యామి యీ మూఁడును, వేఱు వేఱు కాదు; ఒక్కటే. వీని నొక్కటిగనే భావించి యుపాసింపవలెను. ఈ యభిప్రాయము మనస్సులో నుంచికొని ఈ లోకము సర్వేశ్వరుని యవయవముతే యని చెప్పుచున్నాఁడు. సమస్త ప్రపంచమును సృష్టించిన పురుషుని యొక్క పాదముక్రిందిభాగము పాతాళము. దానిముందు భాగము,

రూరుద్వయం వితలం చాతలం చ,
మహీతలం తజ్జఘనం మహీపతే
నభస్థ్సలం నాభిసరో గృణంతి. 27

విశ్వమూర్తేః=లోకమే యాకృతిగాఁగల వానియొక్క, ద్వేజానునీ=రెండు మోఁకాళ్ళను, సుతలం=సుతలము, ఊరుద్వయం=తొడలజంట, వితలం చ అతలం చ=వితలము, అతలము, మహీపతే!=ఓరాజా!, మహీతలం=భూమి, తజ్జఘనం=వాని మొలకట్టు, నభస్థ్సలం=ఆకాశము, నాభిసరః=సరోరూపమైన నాభియని, గృణంతి=పలికెదరు.

ఓ రాజా! ప్రపంచస్వరూపుఁడైన భగవంతుని రెండు మోఁకాళ్లును సుతలము, వితలము, అతలము రెండు తొడలయొక్క క్రింది పై భాగములు. భూతలమే జఘనము. ఆకాశ మాతని సరోరూపమైన నాభి. 27

ఉరస్థ్సలం జ్యోతిరనీక మస్య
గ్రీవామహద్వదనం వై జనోఽస్య,
తపోలలాటం విదురాదిపుంస
స్సత్యంతు శీర్షాణి సహస్రశీర్ష్ణః. 28

ఉరస్థ్సలం=వక్షస్థ్సలము, జ్యోతిరనీకం=జ్యోతిస్సులయొక్క సమూహము (స్వర్గము), అస్య=అతనియొక్క, గ్రీవా=కంఠము, మహః=మహర్లోకము, అస్యవదనం=వానిముఖము, జనః=జనోలోకము, ఆదిపుంసః=ఆదిపురుషునియొక్క, లలాటం=నుదురు, తపః=తపోలోకము, సహస్రశీర్ష్ణః=అనేకములైన శిరములుగల వానియొక్క, శీర్షాణి=తలలు, సత్యం తు=సత్యలోకమని, విదుః=తెలియుదురు.

ఆదిపురుషుని వక్షస్థ్సలమే నక్షత్రరూపజ్యోతిస్సమూహము గల స్వర్గము. కంఠము మహర్లోకము. ముఖము జనోలోకము. లలాటము

తపోలోకము. సహస్రశీర్షుఁడైన వాని యనంత శిరస్సులు సత్యలోక మని మహాత్ము లందురు.

ఇంద్రాదయో బాహవ ఆహురుస్రాః
కర్ణౌ దిశః శ్రోత్ర మముష్యశబ్దః,
నాసత్యదస్రౌ పరమస్య నాసే
ఘ్రాణోఽస్య గంధో ముఖ మగ్నిరిద్ధః. 29

ఇంద్రాదయః=ఇంద్రుఁడు మొదలైన, ఉస్రాః=దేవతలు, అముష్య=వానియొక్క, బాహవః=బాహువులు, శబ్దః=శబ్దము, శ్రోత్రం=శ్రోత్రమను నింద్రియము, కర్ణౌ=రెండుచెవులు, దిశః=దిక్కులు, పరమస్య=పరమపురుషుని యొక్క, నాసే=నాసికాద్వారములు, నాసత్యదస్రౌ=అశ్వినీదేవతలు, అస్య=అతనియొక్క, ఘ్రాణః=ముక్కు, గంధః=గంధము, ఇద్ధః=దీప్తుఁడైన, అగ్నిః=అగ్ని, ముఖం=వదనము.

ఇంద్రాదిదేవత లాతని బాహువులు. దిశలే కర్ణములు. శబ్ద మాతని శ్రోత్రేంద్రియము. ఇరువు రశ్వినీ దేవతలును పరమేశ్వరుని నాసాపుటములు. గంధమే భగవంతుని ఘ్రాణేంద్రియము. దీప్తిగల యగ్ని భగవంతుని ముఖము.

ద్యౌరక్షిణీ చక్షురభూత్పతంగః
పక్ష్మాది విష్ణోరహనీ ఉభేస్య,
తద్భ్రూవిజృంభః పరమేష్ఠి ధిష్ణ్య
మాపోఽస్య తాలూరస ఏవ జిహ్వా. 30

ద్యౌః=అంతరిక్షము, అక్షిణీ=రెండు నేత్రగోళములు, చక్షుః=నేత్రము, పతంగః = సూర్యుఁడుగా, అభూత్ = ఏర్పడెను, విష్ణోః = విష్ణువుయొక్క, పక్ష్మణీ=కంటిరెప్పలు, ఉభే అహనీ=రేయి పగ లనెడు వవి, తద్భ్రూవిజృంభః =అతని కనుబొమ్మలు, పరమేష్ఠిధిష్ణ్యం = బ్రహ్మస్థానము, అపః=జలము, అస్య

అంతరిక్షలోకము సర్వవ్యాపియైన భగవంతుని నేత్రగోళము. సూర్యుఁడు నేత్రేంద్రియము. ఱెప్పపాటులు రేయుంబగళ్లు. బ్రహ్మ స్థానము భగవంతుని కనుబొమలు. జలము భగవంతుని తాలువు. రసము పరమాత్ముని జిహ్వ యనెడు నింద్రియము.

ఛందాం స్యనంతస్య శిరోగృణంతి
దంష్ట్రా యమస్స్నేహ కళాద్విజాని.
హాసో జనోన్మాదకరీ చ మాయా
దురంతసర్గో యదపాంగమోక్షః. 31

ఛందాంసి=వేదములు, అనంతస్య = అపరిచ్ఛిన్న స్వరూపుఁడైన పరమాత్మయొక్క, శిరః=శిరస్సు అని, గృణంతి = చెప్పెదరు, దంష్ట్రా = కోఱ, యమః=యముఁడు, స్నేహకలాః=స్నేహలేశములు, ద్విజాని=పండ్లు, హాసః= మందహాసము, జనోన్మాదకరీ = జనుల నున్మత్తులుగా నొనర్చెడు, మాయా = మాయయనెడుశక్తి, దురంతసర్గః=అంతములేని సృష్టి, యదపాంగమోక్షః=మీ కడగంటిచూపని, గృణంతి=అందురు.

వేదములే యపరిచ్ఛిన్నుఁడైన పరమాత్ముని శిరస్సు. యముఁడే దంష్ట్ర. పుత్త్రాది స్నేహలేశములే వాని పండ్లు. జనులను మోహింపఁ జేయు మాయమే మందహాసము. అంతములేనిసృష్టియే వానికటాక్ష పాతము.

వ్రీడోత్తరోష్ఠో ఽధర ఏవ లోభో
ధర్మస్తనో ఽధర్మపథశ్చ పృష్ఠః,
కస్తస్య మేఢ్రం వృషణౌ చ మిత్రౌ
కుక్షిస్సముద్రా గిరాయో ఽస్థి సంఘాః. 32

వ్రీడా = లజ్జయే, అధరోష్ఠః =క్రింది పెదవి, ఉత్తరోష్ఠః = పైపెదవి, లోభః=లోభము, ధర్మః = ధర్మము, అస్య=వీవియొక్క, స్తనః=స్తనము, అధర్మపథః=అధర్మమార్గమే, అస్యపృష్ఠః=వాని వెనుకటిభాగము, కః=బ్రహ్మ,

వృషణౌ=వృషణములు, సముద్రాః=సముద్రములు, కుక్షిః=కడుపు, గిరయః=
పర్వతములు, అస్థిసంఘః=ఎముకల సమూహము.

పరమేశ్వరుని యుత్తరోష్ఠము లజ్జ. అధరోష్ఠము లోభము. ధర్మము వాని స్తనము. అధర్మమార్గమే వాని పృష్ఠము. బ్రహ్మదేవుఁడు గుప్తాంగము. మిత్రావరుణులు వృషణములు. సముద్రములు కుక్షి. పర్వతములే యస్థి సమూహములు.

నద్యోఽస్య నాడ్యోఽథ తనూరుహాణి
మహీరుహా విశ్వతనోర్నృపేంద్ర,
అనంతవీర్య శ్వసితం మాతరిశ్వా
గతిర్వయః కర్మగుణప్రవాహః. 33

నృపేంద్ర=ఓ రాజశ్రేష్ఠుఁడా!, విశ్వతనోః=విశ్వమే శరీరముగాఁ గల పరమేశ్వరుఁడైన, అస్య=అతనియొక్క, నాడ్యః=నాడులు, నద్యః=నదులు, మహీరుహాః=వృక్షములు, తనూరుహాణి=రోమములు, అనంతవీర్యః=గొప్ప శక్తితోఁగూడిన, మాతరిశ్వా=వాయువు, శ్వసితః=ఊపిరి, వయః=వయస్సు, గతిః=గమనము, గుణప్రవాహః=త్రిగుణముల ప్రవృత్తి, కర్మ=కార్యము.

ఓ రాజశ్రేష్ఠా! నదులే భగవంతుని నాడులు. వృక్షములు రోమములు. గొప్పశక్తిగల వాయువు పరమాత్ముని యుచ్ఛ్వాస నిశ్వాసములు. కాలగతియే వయస్సు. ప్రాణుల జననమరణ రూపమైన సంసారమే లీల.

ఈశస్య కేశా న్విదురంబువాహా
న్వాసస్తు సంధ్యాం కురువర్య భూమ్నః,
అవ్యక్త మాహూర్హృదయం మనశ్చ
స చంద్రమా స్సర్వవికార కోశః. 34

అంబువాహాన్=మేఘములను, ఈశస్య=పరమేశ్వరునియొక్క, కేశాన్ =కేశములుగా, విదుః=తెలియుదురు, కురువర్య!=కురుశ్రేష్ఠా!, సంధ్యాం= సంధ్యను, భూమ్నః = సర్వవ్యాపియైన భగవంతునియొక్క, వాసస్తు = వస్త్ర మునుగా (విదుః), అవ్యక్తం = అవ్యక్తమైన దానిని, హృదయం = హృదయ మునుగా (విదుః), సర్వవికారకోశః=సర్వల వికారములకును జననస్థానమైనః సః చంద్రమాః=అ చంద్రుఁడే, మనశ్చ=మనస్సుగను, ఆహుః=అందురు.

ఓ కురుశ్రేష్ఠా! మేఘములే సర్వవ్యాపియైన భగవంతుని కేశజాలము. ఉభయసంధ్య లాతని వస్త్రములు. అవ్యక్త మని చెప్పఁ బడుచున్న ప్రధానతత్త్వమే హృదయము. సకల మనోవికారములకు జన్మస్థానమై ప్రసిద్ధుఁడైన చంద్రుఁడే భగవంతుని మనస్సు. 34

విజ్ఞానశక్తిం మహిమామనంతి
సర్వాత్మనో ఽనంతఃకరణం గిరిత్రమ్,
అశ్వాశ్వతర్యుష్ట్రగజా నఖాని
సర్వే మృగాః పశవః శ్రోణిదేశే. 35

మహిం=మహితత్వమును, సర్వాత్మనః = సర్వాత్ముఁడైన భగవంతుని యొక్క, విజ్ఞానశక్తిం=చిత్తమనియు, గిరిత్రం=రుద్రుని, అంతఃకరణం= అహంకార మనియు, అశ్వ అశ్వతరీ ఉష్ట్రగజాః = గుఱ్ఱము, కంచరగాడిద, ఒంటె, ఏనుఁగు మొదలైన, సర్వే మృగాః=సమస్త మృగములు, నఖాని= గోళ్లనియు, పశవః=పశువులు, శ్రోణిదేశే=కటిప్రదేశమునుగా, ఆమనంతి= చెప్పుదురు.

అన్నిటియందు నాత్మస్వరూపుఁడుగాఁ బ్రకాశించు భగవంతుని చిత్తము విజ్ఞానశక్తియైన మహత్తత్త్వము. రుద్రుఁ డాతని యంతః కరణము, అశ్వము, గాడిద మొదలైన మృగము లాతని [illegible] గాడిదకు గుఱ్ఱముచే జనించిన సంతాన మశ్వతరి. [illegible] పశువులు పరమాత్ముని శ్రోణిదేశము.

గంధర్వ విద్యాధర చారణాప్సర
స్స్వరస్మృతి ర్హ్యసురానీకవీర్యః. ౩౮

వయాంసి=పక్షులు, విచిత్రం=నానావిధములుగా నున్న, తద్వ్యాకరణం=ఆ భగవంతుని శిల్పవిద్య, మనుః=స్వాయంభువ మనువు, మనీషా=ఆతని బుద్ధి, మనుజః=మనుష్యుఁడు, నివాసః=వాసభవనము, గంధర్వవిద్యాధరచారణాప్సరః=గంధర్వులు, విద్యాధరులు, చారణులు, అప్సరసలు, అసురానీకవీర్యః=రాక్షసుల సైన్యము లనెడు బలముతోఁ గూడిన ప్రహ్లాదుఁడు, స్వరస్మృతీః=స్వరములు, స్మృతులు నని (అహః)

పక్షివర్గములే భగవంతుని శిల్పవిద్య. మనువే బుద్ధి. భగవంతుని వాసభవనము మనుష్యవర్గము. గంధర్వాదులైన దేవయోని విశేషము-భగవంతుని షడ్జాది స్వరములు. అసుర సైన్యాధిపతియైన ప్రహ్లాదుఁడు పరమాత్ముని స్మృతి.

బ్రహ్మాఽఽననం క్షత్రభుజో మహాత్మా
విడూరు రంఘ్రి శ్రితకృష్ణవర్ణః,
నానాభిధాభిజ్యగణోపపన్నో
ద్రవ్యాత్మకః కర్మవితానయోగః. ౩౯

బ్రహ్మ=బ్రాహ్మణుఁడు, ఆననం=ముఖము, క్షత్రభుజః=క్షత్రియుఁడనెడు భుజముతోఁగూడినట్టియు, విడూరుః=వైశ్యుఁడనెడు ఊరువులతోఁ గూడినట్టియు, అంఘ్రిశ్రిత కృష్ణవర్ణః=పాదముల నాశ్రయించియున్న కృష్ణవర్ణునితోఁ గూడిన వాఁడును, నాభిధాభిజ్య గణోపపన్నః=నానావిధములైన పేరులతోను వసురుద్రాదిత్యాదిదేవతలతోను గూడిన, ద్రవ్యాత్మకః=ద్రవ్యరూపమైన, వితానయోగః=యాగముల ప్రయోగమే, కర్మ=ఆతని కార్యము.

నుష్ఠింపఁబడునవియు నైన యోగాదులె పరమాత్ముని కర్మము.

ఇయానసౌ వీశ్వరవిగ్రహస్య
యస్సన్నివేశః కథితో మయా తే,
సంధార్యతే ఒస్మిన్ వపుషి స్థవిష్ఠే
మనస్స్వబుద్ధ్యా న యతోఒస్తి కించిత్. 38

ఈశ్వరవిగ్రహస్య=పరమేశ్వరునియొక్క, ఇయాన్=ఇంతమాత్రమైన, సౌ సన్నివేశః=ఈ విన్యాసము, అవయవకల్పనము, తే=నీకు, కథితః=చెప్పఁడినది, యతః=దీనికంటె, కించిత్=అన్యమైన దల్పము గూడ, న=లేదు, విష్ఠే=సర్వమునకంటెను స్థూలమైన, అస్మిన్ వపుషి=ఈ శరీరమందు, మన=మనస్సును, సంధార్యతే=ధారణచేయఁబడుచున్నది.

ఓ రాజా! ఈశ్వరునియొక్క యీ మాత్రమగు నవయవ ల్పనము నెఱింగించితిని. దీనికంటె నితర మేమియు లేదు. అతి స్థూలమైన యీ శరీరమందు మనస్సును నిల్పవలెను.

స సర్వధీవృత్త్యనుభూత సర్వ
ఆత్మా యథా స్వప్నజనేక్షితైకః,
తం సత్యమానందనిధిం భజేత
నాన్యత్ర సజ్జేద్యత ఆత్మపాతః. 39

సర్వధీ వృత్త్యనుభూత = సర్వుల బుద్ధివృత్తులచేత ననుభవింపఁబడిన సర్వమునుగలవాడును, ఏకః=కేవలుఁడును నైన, ఆత్మా=ఆత్మస్వరూపుఁడు, స్వప్నజనేక్షితాయథా = స్వప్నమందు జనులచేఁ జూడఁ బడుచున్న వానివంటి వాఁడు, సత్యం=నాశరహితుఁడును, ఆనందనిధిం=ఆనందముయొక్క విగ్రహ

స్థానమును నైన, తం=వానిని, భజేత=భజింపవలెను, అన్యత్ర=ఇతరమందు, న సజ్జేత్=తగుల్కొనరాదు, యతః=ఎందుకనఁగా, ఆత్మపాతం=ఆత్మయొక్క పతన రూపమైన సంసారము, భవతి=ఏర్పడును.

అవ: చిత్తస్థైర్యమునకై విరాట్పురుషుఁడు జీవుఁడు ఈశ్వరుఁడు ఈ మూటిని అభేదముగనే యుపాసింప వలెనని చెప్పిన తరువాత దేహమును జీవుని ఈశ్వరునందు నిలిపి సర్వాశ్రయుఁడైన యా యీశ్వరునే ధ్యానింపవలెనని యుపదేశించుచున్నాఁడు.

అందఱి బుద్ధివృత్తులచేతనుఁ దెలిసికొనఁ బడునదియు ననుభ వింపఁబడునదియు సర్వమును గేవలమైన ఈశ్వరుఁడే. నానాత్వమును స్వప్నమందు జీవునిచేతఁ గల్పింపఁబడెడు నగరసముద్రాదులవలె కేవల కల్పనమే. త్రికాలాబాధితమైన యానందముచేఁ గూడుకొన్న యా పరమేశ్వరునందే సర్వకాలములందును మనస్సును నిల్పవలెను. ఉప లక్షణభూతములైన దేహేంద్రియాదులపై నాసక్తి యుండరాదు. అట్లున్నచో జననమరణ రూపమైన సంసారముతోడి సంబంధము తప్పదు. ఆ స్థితినుండి తప్పించికొనఁ దలఁచినవారు సర్వాత్మనా సర్వేశ్వరునే యుపాసింపవలెను. నిర్గుణమందు మనస్సు నిల్పుట బహుప్రయాసము. అందుచే దేనియందు మనస్సు లగించునో యది సర్వమును ఈశ్వరుని యవయవమే యనుబుద్ధి నేర్పఱచి కొన్నచో మనోదోషము నశించును. వృత్తి శుద్ధ మగును. ఇదియే ధారణకు ప్రథమాంగము.

శ్రీధరీయము:

> ద్వితీయే తు దశాధ్యాయైః శ్రీభాగవతమాదితః,
> ఉద్దేశలక్షణోక్తిభ్యాం సంక్షేపేణోపవర్ణ్యతే.
>
> తత్ర తు ప్రథమేఽధ్యాయే కీర్తనశ్రవణాదిభిః,
> స్థవిష్ఠే భగవద్రూపే మనసో ధారణోచ్యతే.

యన్నామకీర్తనం దానతపోయోగాదిసత్ఫలమ్,
తం నిత్యం పరమానందం హరిం నర మనుస్మరేత్.

ఉక్తః పూర్వముపోద్ఘాతః ప్రసంగేన శుకాగమః,
రాజ్ఞా పృష్టం సృణాం కృత్య మథాహ శుకసన్మునిః.

తాత్పర్యము: ద్వితీయస్కంధమం దున్నవి పది యధ్యాయములు. వీనిలో లక్షణము నుద్దేశము నను నీ రెండును సంక్షేపముగా వర్ణింపఁబడినవి. ప్రథమాధ్యాయమందుఁ గీర్తన శ్రవణాదులతో లోక రూపమై స్థవిష్ఠమైన భగవద్రూపమునందు మనస్సుయొక్క ధారణ వర్ణింపఁబడినది. దాన తపో యోగాది సత్ఫలము నామకీర్తనమే. ఆ నామకీర్తనము మనుష్యునితోఁ జేయింపవలెను.

పూర్వస్కంధమందు ఉపోద్ఘాతము వివరింపఁబడినది. ప్రాసంగికముగా నచ్చటికి శుకుఁడు వచ్చెను. నరులకు సర్వోత్తమమైన కర్తవ్య మేదో పరీక్షిత్తు శుకునిఁ బ్రశ్నించినాఁడు. శుకబ్రహ్మ సమాధాన మిచ్చుచున్నాఁడు. **2**

రా జడిగిన ప్రశ్నను శుకాచార్యుఁ డభినందించుచున్నాఁడు. నీ చేతఁ బురుషులకు శ్రోతవ్యములైన విషయములలో నేది యుత్కృష్టమైనదో దానికి సంబంధించిన ప్రశ్నయే యడుగఁబడినది. అందుకే యిది సర్వోత్తమమైన ప్రశ్న. లోకహిత మైనది. ఎందుకనఁగా నిది మోక్షహేతువు. ఆత్మవిదులైన బ్రహ్మవేత్తలకును సమ్మతమైనది. ఈ రెండు కారణములచేత నీవు ప్రశ్నించిన విషయము 'వరియాన్' సర్వోత్తమమైనదని భావము.

'బ్రూహి యద్వా విపర్యయం' అనునదియుఁ బరీక్షిత్తు వేసిన ప్రశ్నయే. వేసి ననుష్ఠింపరాదో వానినిఁ గూడఁ దెల్పుమన్నాఁడు. ఆ ప్రశ్నకు స్వాభావిక క్రియలకు సనర్థహేతుత్వమును ప్రతిపా

సంసారులకు గృహస్థాశ్రమమునుబూని తద్గతములైన పంచసూనము లనెడు పాపములకుఁ బాత్రులైన వా రనుట. గృహమేధి శబ్దములోని 'మేధి' శబ్దము హింసార్థకము, 2

అవ: అందుచేత వ్యర్థముగా నాయుస్సు గడచిపోవు నను చున్నాఁడు-

నక్తం = రాత్రియందు, వయః = ఆయుస్సు, నిద్రచేఁ గాని, వ్యవాయము చేఁ గాని గుంచింపఁబడుచున్నది, దివా=పగలు, యద్వయః=ఏ యాయువుగలదో, అది అర్థేహయా = ధనమును సంపాదించుటకై చేయు ప్రయత్నము చేతను, అర్థము సిద్ధింపఁగాఁ గుటుంబ భరణముచేతను గడచిపోవుచున్నది. దివా చార్థేహయా కుటుంబ భరణేన చ. ఇచటి రెండు 'చకార'ములును అనుక్త సముచ్చయార్థములు, 3

అవ: నశ్వరమైన కుటుంబమునకై యాయుస్సు నెందుకు వ్యయపఱుపవలెను? దాని కుత్తర మిచ్చుచున్నాఁడు-

ఆత్మనః సైన్యేషు=తన పరికరములు, అసత్సు అపి = మిథ్యాభూతములైనను, ప్రమత్తః=ప్రసక్తుఁడైనవాఁడు, తేషాం నిధనం పశ్యన్నపి = పిత్రాది దృష్టాంతముచే వారి నాశము స్పష్టముగాఁ జూచుచున్నను, న పశ్యతి=అనుసంధాన మొనర్పఁడు. 4

అవ: ఈ రీతిగా విపర్యయప్రశ్న కుత్తరమిచ్చి 'శ్రోతవ్యాదిషు యః పరః' అనుదానికి సమాధాన మిచ్చుచున్నాఁడు-

తస్మాత్ = తక్కిన కార్యములు వ్యర్థముగా నాయుర్హరణ మొనర్చుటచేత, సర్వాత్మా=అను విశేషణముచే శ్రేష్ఠత్వమును జెప్పుచున్నాఁడు. భగవచ్ఛబ్దముచేత సౌందర్యము వివక్షితము. ఈశ్వరుఁడు

-అందుచే వాని నవశ్యము గొలువవలెను. హరిశబ్దముచేత బంధహారిత్వము సూచితము. అభవం=అపునర్భవరూపమైన మోక్షము. 5

అవ: దీనికంటెను భిన్నమైన శ్రేయస్సు లేదనుచున్నాఁడు-

ఏతావాన్, ఏతావానేవ జన్మనః లాభః=ఫలం, ఇంతే జన్మకు లాభము. ఏది? నారాయణ స్మృతిః=మరణకాలమందు నారాయణ స్మృతి. సాంఖ్యాదులతో నిది సాధ్యమేగదా! వానికి స్వతంత్రముగా జన్మలాభత్వము లే దనుచున్నాఁడు. సాంఖ్య మనఁగా నాత్మానాత్మ వివేకము. యోగ మష్టాంగరూప మైనది. స్వధర్మ మనఁగా విహితానుష్ఠానము. వీని యన్నిటికిని మరణకాలమున నారాయణస్మృతియే ప్రధానఫలము. దాని మహిమము వర్ణించుట కసాధ్యము. 6

అవ: పైఁ జెప్పిన విషయమును సదాచార ప్రమాణముగా నిచ్చుచున్నాఁడు-

విధినిషేధతః=అనుచోటు వర్ణాధిక్య మార్షము, నైర్గుణ్యే బ్రహ్మణి నిష్ఠితా అపి-నిర్గుణబ్రహ్మము నుపాసించువారైనను, స్మ=ఇది ప్రసిద్ధమైన విషయము. 7

అవ: మఱి యీ విషయము నపూర్వముగఁ జెప్పుచున్నావా? కాదు. ముందుఁ జెప్పఁబడినవే యనుచున్నాఁడు-

ఇదం=భగవత్ప్రోక్తమై తన్నామైక ప్రధానమైన భాగవత శాస్త్రమును పురాణమును, బ్రహ్మసమ్మితం=సర్వవేద తుల్యమైనది. లేక సత్యస్వరూపమైన బ్రహ్మ సత్యం సమ్యక్ మితం ఏన-సత్యమైన బ్రహ్మము దీనియందుఁ జక్కఁగా వివరింపఁబడినది. ఇది నీ కెట్లు సంప్రాప్తించినది? దాని కుత్తరమే అధీతవాన్-నేను జక్కఁగా నభ్యసించితిని కదా! ఎప్పుడు? ద్వాపరాదౌ=ద్వాపరః అదిః=యస్య కాలస్య తస్మిన్=ద్వాపరయుగము దేని కాదియో యా కాలమందు,

అవ: నీవు సిద్ధుఁడవు గదా! నీ కధ్యయనమందుఁ బ్రవృత్తి యే ట్లేర్పడినది? దాని కుత్తర మిచ్చుచున్నాఁడు-

గృహీతచేతాః-గృహీతం చేతః యస్య సః = ఆకర్షింపఁబడిన మనస్సు గలవాఁడు. 9

మహాపౌరుషికః_మహాపురుషుఁడు విష్ణువు. అతనికి సంబంధించినవాఁడు మహాపౌరుషికుఁడు. పరమ భాగవతుఁడని తాత్పర్యము. యత్ర=దేనియందు, శ్రద్దధతాం=శ్రద్ధగలిగిన వారికి, సతీ =అహైతుకమైన, మతిః స్యాత్=భాగవత శ్రవణమందుఁ దీవ్రేచ్ఛ గలవారికిఁ బరమపురుషునియం దహైతుకమైన భక్తి యేర్పడుచున్నదని భావము. 10

అవ: సాధకులకును సిద్ధులకును గూడ నింతకంటె నుత్తమమైన శ్రేయస్సులేదని చెప్పుచున్నాఁడు-

ఇచ్ఛతాం=సకాములైన వారికి ఆ యా ఫలములను సాధించికొనుటకు సాధ్య మిదే, నిర్విద్యమానానాం=ముముక్షువులైన వారికి మోక్షసాధన మిదియే, యోగినాం=జ్ఞానులకు, అకుతోభయం=దేని నుండియు భయపడ నవసరము లేనట్టి ఫలముగూడ నిదియే. దీనికిఁ బ్రమాణ మవసరము లేదని భావము. 11

అవ: ఆయువు కొద్దిగనే మిగిలి యున్నది గదా! ఈ స్వల్ప వ్యవధిలో నే నేమి సాధింతు ననుట కుత్తర మిచ్చుచున్నాఁడు-

మూఁడు శ్లోకములలో నీ యుత్తరము.

మా శుచః=ఈ విషయమై దుఃఖింపవలదు, పరోక్షైః=అలక్షితములైన, హాయనైః=సంవత్సరములచేత, విదితం=వ్యర్థముగా గతించు

చున్నదని తెలిసికొనఁబడిన, యతః = ఏ జ్ఞానముచేత, ఘటతే = యత్న మొనర్చుచున్నావు?

అనేకసంవత్సరములు మానవునకుఁ దెలియకయే గడచిపోయినవి. వ్యర్థముగాఁ గడచిపోవుచున్నవని తెలిసికొన్ననాఁడు జ్ఞానపూర్వకముగా భగవంతుని బొందుటకు యత్నించుచున్నాఁడు. ఇదియే సార్థకమైన సమయమని భావము. 12

ఖట్వాంగుఁడను నొక రాజర్షి యుండెను. అతఁడు దేవతల పక్షము వహించి రాక్షసుల నిర్జించెను. వారు ప్రసన్నులై వరము గోరు మనిరి. నా యాయువెంత తెల్పుమన్నాఁడు. వారు ముహూర్త మనిరి. ఆ రాజతిశీఘ్రముగా విమానమున భువికి వచ్చి హరిని శరణుఁజొచ్చి మోక్షము నందినాఁడు. 13

తవతు = నీ కన్ననో, ఏతర్హ్యపి = ఇంకనుగూడ, తావత్ = అంత్యకాలములో, సాంపరాయికం = పారలౌకికమైన సాధనమును, ఉపకల్పయ = సంపాదించికొమ్ము. 14

అవ: వైరాగ్యమును దెల్పుచున్నాఁడు-

గతసాధ్వసం = మృత్యుభయశూన్యుఁడై, అసంగ = అనాసక్తత యనెడు నా శస్త్రముచేత, స్పృహాం = సుఖేచ్ఛను, తం దేహం అను = తన దేహమును నాశ్రయించికొని యున్న పుత్ర కళత్రాదు లందలి స్పృహను, ఛింద్యాత్ = ఛేదింపవలెను. 15

గృహాత్ప్రవ్రజితః = గృహము నుండి నిర్గతుఁడైన వాఁడై, గృహమునం దున్నచో మఱల నెప్పటికైన నాసక్తి యేర్పడుటకు వీలుండునని భావము. 2. అష్టాంగ యోగమును గూర్చి చెప్పుచున్నాఁడు. ధీరః = ఇది బ్రహ్మచారికి నియమోపలక్షణము, పుణ్యతీర్థజలా

నెఱిఁగించుచున్నాఁడు-

త్రివృత్ - త్రిభిః అకారాదిభిః వర్తితం గ్రథితం = మూఁడైన అకార ఉకార మకారములచేతఁ గూర్పఁబడినట్టి, బ్రహ్మాక్షరం=ప్రణవమును, మనసా అభ్యసేత్ =మనస్సుతో నావర్తింపవలెను. మనస్సుచే నింద్రియప్రత్యాహారమును జెప్పుటకు ప్రాణాయామముతో మనోనియమమును దెల్పుచున్నాఁడు. మనః యచ్ఛేత్ =మనస్సును నియమింపవలెను. ఎట్లు? బ్రహ్మబీజం అనుస్మరన్నేవ=ఓంకారమును స్మరించుచునే. ప్రణవావర్తనమును వదలక మనస్సును దాని విషయములనుండి మరలింపవలెనని భావము, జితశ్వాసః=జయింపఁబడిన యుచ్ఛ్వాస నిశ్వాసములు గలవాఁడై. 17

అవ: ప్రత్యాహారము నెఱిఁగించుచున్నాఁడు-

విషయేభ్యః అక్షాన్ నియచ్ఛేత్ =విషయములనుండి ఇంద్రియములను మరలింపవలెను. బుద్ధిసారథిః = నిశ్చయాత్మకమైన బుద్ధిని తోడు దీసికొన్నవాఁడై యని యర్థము. కర్మభిః=అ యా వాసనలనుండీ, ఆక్షిప్తం=ఆకృష్టమైన మనస్సును, ధియా=నిశ్చయాత్మకబుద్ధిచేత, శుభార్థే=భగవద్రూపమందు, ధారయేత్ =నియమింపవలెను. 18

అవ: ఈ రీతిగా నియమింపఁబడిన మనస్సునకు సంచారమెక్కడ నేర్పఱుపవలెను? దానికే ధ్యానమును జెప్పుచున్నాఁడు-

ఏకం =పాదాద్యవయవమును, అవ్యుచ్ఛిన్నేన=సమగ్రమైన రూపమునుండీ, అవిముక్తమైన మనస్సుతో నాత్మవిశేషమందు, సామాన్యముగాఁ జిత్తస్థిరీకరణము ధారణ, అవయవవిభావనతో దానిని

దార్ఢ్య మొనర్చుట ధ్యానము. దానియందు మనోవృత్తి విలయమే సమాధి. దానినే వివరించుచున్నాఁడు. నిర్విషయం మనః యుక్త్వా నిర్విషయమైన మనస్సును సమాధానపఱచి స్థిరమైన మనస్సునందు స్ఫురత్పరమానంద మూర్తిమైన యాకారమును ప్రతిష్ఠించి యని యర్థము. ప్రసీదతి = ఉపశమించుచున్నదో - గుణములు తలెత్తుటచే మఱల మనస్సు క్షోభించినచో ధారణచే స్థిర మొనర్పవలె ననుచు న్నాఁడు. రజస్తమోభ్యా మాక్షిప్తం=రజస్సుచే విక్షిప్తమైనది, తమ స్సుచే విమూఢమైనది, అట్టి తన మనస్సును, నిరుంధ్యాత్ = అడ్డగింప వలెనని భావము.

తత్కృతం = రజస్తమస్సులచేతఁ జేయఁబడిన, యతః = ఏ ధారణముచేయఁబడుచుండఁగా, భద్రం=సుఖాత్మకమైన, విషయం పశ్యతః=విషయమును జూచుచున్న సాధకునకు తత్రైవప్రీతిర్భవతి= దానియందే యనురాగ మేర్పడుచున్నది. 21

యథా=దేనియందు, యాదృశీ=ఎట్టి, ఇతికర్తవ్యతా విషయ తద్విశేషములను గూర్చిన ప్రశ్న ఇది- 22

యథా అనుట కుత్తర మిచ్చుచున్నాఁడు. 'జితాసనో జిత శ్వాసః జితసంగో జితేంద్రియః' ఇవన్నియు-మొదటిప్రశ్నకు సమా ధానములు. యాదృశీ అనుటకు సమాధానము - విశేషతః = విరాడ్దే హము స్థూలములైన వానికంటెను స్థూలతరమైనది, సత్ = అనఁగా కార్యమాత్రము. ఇది యుపలక్షణముగా నిచ్చుట విషయమైనది. 23

నికరముగాఁ జెప్పినచో విరాడ్జీవ నియంతయైన భగవంతుఁడే విషయ మనుచున్నాఁడు, అండకోశే = అండకోశాంతర్వర్తియైన కటాహమందు, మొదలు పృథివ్యావరణము. తరువాత అప్తేజో వా

విరాడ్దేహము, తజ్జీవుఁడు, తదంతర్యామి- ఈ ముప్పురికి నభేద మారోపించి యుపాసనము సేయఁదగునని చెప్పుచున్నాఁడు- పాతాళమే పాదము, పాదముక్రిందిభాగము, పాతాళాదులకు తదవయవత్వము విధింపఁ బడుచున్నది. పాతాళాది అతలాంతములు అథస్థానమునుండి యారంభమగు భూరంధ్రములు. పఠంతి=అనుటతో ప్రమాణము నిచ్చుచున్నాఁడు. నే ననుటగాదు. పెద్దలు చెప్పినమాట యని తాత్పర్యము, పార్ష్ణిప్రపదే=పాదము పశ్చాత్పురోభాగములు.27

ఊరుద్వయం = దాని యథోభాగము వితల మని ఉత్తరభాగ మతలమని తెలియవలెను నభస్థ్సలం=భువర్లోకము, నాభిసరః=నాభి యనునదే సరస్సు. 27

ఉరస్స్థలం=వక్షోదేశము, జ్యోతిరనీకం=జ్యోతిస్సుల సమూహము, స్వర్గమనిభావము. 28

ఉస్రాః=దేవతలు, వారు తేజోమయశరీరులు. అందుచే బాహువులు, దిశః=దిక్కులు, శ్రోత్రము నధిష్ఠించిన దేవతలు, కర్ణౌ=శోత్రాధిష్ఠానము, శబ్దము శ్రోత్రవిషయము, నాసత్యదస్రౌ=అశ్వినీదేవతలు, ఇద్ధః = దీప్తము, ద్యౌరక్షిణీ = అంతరిక్షము చంద్ర సూర్య అధిష్ఠానభూతము, అక్షిణీ=నేత్రగోళకములు, చక్షురింద్రియము సూర్యగోళకము.

ఛందాంసి = ఛందః ప్రధానులైన దేవతలు, శిరః = బ్రహ్మరంధ్రము, స్నేహాకళాః=పుత్త్రాది స్నేహలేశములు. 31

అధర్మపథః=అధర్మపథము, కః=ప్రజాపతి, మిత్రౌ=మిత్రావరుణులు, అనంతవీర్యస్య=వయః, కాలః=వయస్సేకాలము, తస్య గమనం= దాని గమనము, గుణప్రవాహః = ప్రాణులయొక్క సంసారము, కర్మ=అ సంసారముయొక్క క్రియ, 32

భూమ్నః=ప్రభువైన వానియొక్క, అవ్యక్తం=ప్రధానము, సః=ప్రసిద్ధుఁడైన, చంద్రమాః=చంద్రుఁడు, హృదయభూతుఁడు,

సర్వాపేక్షంత కమని చెప్పఁబడుచున్నాఁడు. ఎందుకు? ధూమాదిమార్గ
మగుటవలన; ఇది యర్చిరాదిమార్గమునకంటె భిన్నము. 34

విజ్ఞానశక్తిం=జ్ఞానరూపమైన భగవచ్ఛక్తిని, చిత్తమును, మహిం
=మహత్తత్త్వమునుగా, ఆమనంతి=చెప్పెదరు; అంతఃకరణం=అహం
కారము, గిరిత్రం=రుద్రుఁడు. గర్దభమువలన బడబయం దుత్పన్న
మైన సంతాన మశ్వతరి. 35

వయాంసి=పక్షులు, వ్యాకరణం 'నామరూపే వ్యాకరవాణి'
అనెడు శ్రుత్యుక్తమైన శిల్పనైపుణ్యము. 36

**యేన శుక్లకృతా హంసాః శుక్లాశ్చ హరితీకృతాః,**
**మయూరాశ్చిత్రితా యేన సనో వృత్తిం విధాస్యతి.**

బ్రహ్మ=బ్రాహ్మణుఁడు, ఆననం=ముఖము, క్షత్రం భుజో
యస్యసః=క్షత్రియుఁడే భుజములుగాఁ గలవాఁడు, విట్=వైశ్యః,
ఊరూతదస్య=వైశ్యుఁ డూరువులైనవాఁడు, అంఘ్రిశ్రితాః కృష్ణవర్ణాః
యస్యసః=పాదములు శూద్రుఁడైనవాఁడు, అనేకరూపములైన అభిధాః
=పేరులుగల, అభిజ్ఞ్యాః=దేవతలు, వారియొక్క, గణ=వసు రుద్రాది
గణములచేత, ఉపపన్నః=కూడుకొన్న, ద్రవ్యాత్మకః=హవిస్సాధ్య
మైన, వితానయోగః=యజ్ఞప్రయోగము, తస్య కర్మ=అతని కార్యము.
37

ఇయాన్=ఇంతమట్టుకు, సన్నివేశః=అవయవ సంస్థానము;
అస్మిన్=దానియందు, బుధ్యా=బుద్ధిచేత, మనః సంధార్యతే=మనస్సు
నెలకొల్పఁ బడుచున్నది. ఎవరిచేత? ముముక్షుభిః=మోక్షాసక్తులగు
వారిచేత, యతః=దానికంటె, అతిరిక్తం న=భిన్నమైనది లేదు. 38

ఇంతకు ముందు చిత్తస్థైర్యార్థమై విరాడ్దేహ జీవేశ్వరుల కభేద
ముగా నుపాసన చెప్పఁబడినది, ఇప్పుడు దేహ-జీవుల నీశ్వరునందు

సర్వధీవృత్త్యనుభూత సర్వః=సర్వుల బుద్ధివృత్తులచేత, ఎవనిచే సర్వమును అనుభవింపఁ బడుచున్నదో, సః ఏకః ఏవ సర్వాంతరః ఆత్మా=సత్యస్వరూపుఁడైనవాఁడే భజింపఁదగినవాఁడు. తక్కిన వారి యందు భజనీయత్వ ముపలక్షణము, అన్యత్ర న సజ్జేత్=ఇతరులయం దాసక్తి యుండరాదు. యతః ఆత్మపాతః=ఏ సంగముచేత, ఆత్మపాత రూపమైన సంసార మేర్పడుచున్నదో- కేవలుఁడైన వానికి తత్తదిం ద్రియములచేత సర్వానుభూతియందు దృష్టాంత మిచ్చుచున్నాఁడు. స్వప్నే=స్వప్నమందు, జనానాం ఈక్షితా యథా=జనులు ద్రష్టలై యున్నట్లు, స్వప్నమందు జీవుఁ డనేక జీవులలోఁ గలసియున్నట్లు, ఆ యా యింద్రియములచేత సర్వము నాడించినట్లు; అట్లే ఈశ్వరున కును విద్యాశక్తి బలముచే బంధ మేర్పడదని భావము. 39

వంశీధరునిభావార్థ దీపికా వ్యాఖ్య :

అపిమే భగవాన్ ప్రీతః కృష్ణః పాండుసుత ప్రియః- ఇత్యాది వాక్యములతో రాజు కృష్ణపరమాత్మయందే తనకు రతి గలదని చెప్పి నాఁడు 'శ్రోతవ్యాదిషు యః పరః'-శ్రోతవ్యములైన వానియందు శ్రేష్ఠమైనది కృష్ణకథాశ్రవణమే. మహారాజుయొక్క యభిప్రాయము శుకబ్రహ్మ గమనించెను. గమనించి పరీక్షిత్తును విషయాభిముఖునిగాఁ జేయుచుఁ గృష్ణకథావిషయమం దాతని యధికారిత్వమును సూచించు 'వరీయాన్' అని యారంభించుచున్నాఁడు-

వర్ణాశ్రమసాధారణ ధర్మప్రశ్నము పరము; స్వాశ్రమ ధర్మ ప్రశ్నము పరతరము. దానియందును నిష్కామముగా తదాచరణము నకు సంబంధించిన ప్రశ్న పరతమము. భగవద్విషయకమైన ప్రశ్న సర్వోత్తమ మైనది. ఈ యర్థమందే 'యసున్' ప్రత్యయము విధింపఁ

చినదే. ప్రశ్న ఉత్తమము గాదు. శ్రోతవ్యాదులలో నుత్తమ మైనది. ప్రశ్నను వినుట గూడఁ బరమ పురుషార్థ సంధాయక మని చెప్పు చున్నాఁడు. సర్వావతార కథలకంటెను కృష్ణకథాప్రశ్నము పరమో త్తమ మైనది. లోకహితము గూడ సాధించు ప్రశ్న నడిగితివి. కృష్ణావ తారము గొప్పగా లోకహితమును సాధించినది. తథాభూతుఁడైన నందసూనుని యందు నీ ప్రేమ నిబద్ధమైనది. ఇఁక నీకుఁ గృతార్థ త్వముగాక మఱియేమున్నది!

వైయాసకే రితి వచ స్తత్త్వనిశ్చయ మాత్మనః,
ఉపధార్య మతిం కృష్ణే ఔత్తరేయస్సతీం వ్యధాత్.

సతీ విద్యమానాం– అంతకు ముందేయున్న కృష్ణగతమైన మతిని విశేషముగా ధరించెనని తాత్పర్యము. ఈ యభిప్రాయమునే పరీక్షిత్తుపై వెల్వరించుచున్నాఁడు.

హరే రద్భుతవీర్యస్య కథాలోకసుమంగళాః,
కథయస్వ మహాభాగః యథాఽహ మఖిలాత్మని.
కృష్ణే నివేశ్య నిస్సంగం మన స్త్యక్షే కళేబరమ్.

అట్లే, 'కథితోవంశవిస్తారః' అనుచు 'సమ్యగ్వ్యవసితాబుద్ధిః' ఇత్యాదులు పల్కుచున్నాఁడు ఇంతకు పూర్వము నానావతారకథలు విన్నాను. వానితో సంతోష మేర్పడినది. కాని వసుదేవనందనుని కథ యందే నైష్ఠికమైస్థాయీరూపమైన రతి యేర్పడినది. ఈ బుద్ధి 'సమ్య గ్వ్యవసితా'– పరమ రసవిదగ్ధమైనదని భావము. ఆత్మవిత్సమ్మతః–నీ సభయందుఁ గూర్చున్న బ్రహ్మవేత్త లందఱికిని సమ్మతమైనదని అర్థము. ఈ కృష్ణ కథాశ్రవణమునకే యందఱిచ్చటఁ జేరినారని భావము. సత్పురుషులు వేసెడు ప్రశ్నాదికములు గూడ శ్రవణీయములై కీర్త నీయములై స్మర్తవ్యములై ప్రచారములోనికి వచ్చినవి. అందుకే నీ వడిగినప్రశ్న సర్వోంతిమముగా ప్రశస్తమైనదని భావము. నీప్రశ్నకు నే నుత్తరము చెప్పఁబోవుచున్నాను. ఆ యుత్తరమును గూడ శ్రవణా దుల నొనర్చి భక్తులు సర్వరీతులఁ దరించిపోదురు. ఇట్లే పైన–

వాసుదేవకథాప్రశ్నః పురుషాన్ త్రీన్ పునాతి హి,
వక్తారం పృచ్ఛకం శ్రోతౄన్ తత్పాదసలిలం యథా.

అనుచున్నాఁడు. 'నృపా! లోకమునకు హిత మొనర్చుటచేత నీ నృప త్వము సార్థక మగుచున్న'దని భావము.

ద్వితీయ స్కంధమందు భగవచ్ఛరణ ప్రాప్తియే సిద్ధి యని ప్రతిపాదింపఁ బడుచున్నది. దానికి మార్గము తన్నామశ్రవణ కీర్త నాదులే. ఇవియే సర్వోత్కృష్ట మైనవి. ఈ విషయమును బ్రతిపా దింపఁ బోవుచున్నవాఁడై- 'బ్రూహి యద్వా విపర్యయం' అన్న పరీక్షిత్తు ప్రశ్న ననుసరించి కర్మయోగమును జెప్పఁబోవుచున్నాఁడు. 1

గృహమేధీ-'మే ధృహింసాయాం' అని ధాతువు. రాజేంద్ర! రాజులు బహుకార్య నిమగ్నులు. వారి కాత్మజ్ఞానము దొరకుట దుష్క రము. ఇఁక రాజేంద్రుని విషయమునఁ జెప్పవలసిన దే మున్నది? 2

కర్మనిష్ఠులైన వారికి స్త్రీసంగము నిషిద్ధము గాదు. కర్మయోగ మందు కుటుంబభరణము విహితము. 'అప్యకార్యశతం కృత్వా భర్త వ్యామను రబ్రవీత్'-అనఁగా అకార్యశతముచే నైనను కుటుంబమును బోషింపవలెనని భావము. మోహ మను మద్యపానోన్మత్తుఁడై పురు షుఁడు గృహమునం దాసక్తుఁ డగుచున్నాఁడు. భర్తృహరి యిట్లు న్నాఁడు-

ఆదిత్య స్య గతాగతై రహరహ స్సంక్షీయతే జీవితం
వ్యాపారై ర్బహుకార్య భార గురుభిః కాలో న విజ్ఞాయతే,
దృష్ట్వా రోగ జరా విపత్తి మరణం త్రాసశ్చ నోత్పద్యతే
పీత్వా మోహమయీం ప్రమాదమదిరా మున్మత్తభూతం జగత్.

ఇది సామాన్యుల విషయము. భగవద్భక్తుఁడు భగవదున్ముఖములైన దేహాదులతో నప్రమత్తుఁడై కాలమునే జయింపఁ గలుగుచున్నాఁడు.

నాచార్యు లీ సందర్భమందు రెండు ప్రశ్నలు వేసికొన్నారు. 1. ర్వాత్మనా కిం కర్తవ్యం, 2. మ్రియమాణశ్చ కిం కర్తవ్యం. సర్వా ం కర్తవ్య మనఁగా దేనినిఁ జేయకున్నచో నే పురుషార్థము గూడ ంపదో యది. దీనినే పదునాల్గు శ్లోకములచేత నిరూపింపఁ బోవు న్నాఁడు. 'ఓ రాజా! సర్వాత్మనా కిం కర్తవ్యం' అని నీవు వేసిన న చాల శ్రేష్ఠమైనది. అది ముఖ్యముగా నీ మేలుకొఱకే యుప ంగింపఁ బడుచున్నది. ఓయి రాజేంద్ర! బహువిధ మార్గముల నరించిన పురుషులను జూచితివి. అనేక శాస్త్రముల నీ జన్మములో న్నావు. కాని వానితో నీకుఁ గాని వారికిఁ గాని ఏ పురుషార్థము ంపలేదు. పరీక్షిత్తు అడిగిన ప్రశ్నలలో 'యచ్ఛ్రోతవ్య మతో ం యత్కర్తవ్యం నృభిః ప్రభో!' అను దానిలో 'నృభిః' అని ంవచన మున్నది. దానిని జ్ఞాపక మొనరించుచు 'నృణాం తి సహస్రశః' అనుచున్నాఁడు. 'సంతి సహస్రశః' నేను చెప్పు ముందే యనేక సహస్రజనులతో ననేకములు వినియున్నావని ంము. 'అపశ్యతాం ఆత్మతత్త్వం' అనారోపితమైన యాత్మతత్త్వ ము దెలియనివారు; ఎందుకుఁ దెలియలేరు. తచ్ఛాస్త్రభావాత్ - కి సంబంధించిన శాస్త్రము లేకపోవుటవలన. లోకవ్యవహారమం క్మ యారోపితమైనట్లుగనే గన్పించుచున్నది 'గృహేషు గృహ ంనాం' - వారికి గృహస్థులకు వివిక్తమైన యాత్మస్వరూపము దెలి ంటకు వీలులేదు. వారు గృహములచే నాక్రాంతమతులు గృహోప క్తములైన విషయములే వారు దెలిసికొందురు. వివిక్తాత్మజ్ఞానము హామేధికి బాధకమైనట్లు 'గృహేషు' అనుచోట నిమిత్తసప్తమి. ము గృహైకనిష్ఠతో గృహమేధులైనారని భావము. వారికి లోక ములైన గ్రంథములచేతనే ప్రయోజనము. మా వాక్యముతో వారి ంక్ష లేదు. సత్సంగసాధనీభూతమైన సమయము వారికి లేదు. రి యా సమయమును ఇతరు లపహరింతురు. రాత్రిసంబంధమైన ాయుస్సు వారికిఁ దెలియకయే గడచిపోవుచున్నది. దినసంబంధ

మైన యాయువు అర్థహతో గమించును. కనుక సజ్ఞానముతోఁ గాని యన్యథా జ్ఞానముతోఁ గాని వారి యాయువంతయు గతించినట్లే. 'వ్యవాయేన చ వా వయః' అనుచోట నున్న వయశ్శబ్దము పురుషార్థసాధనీభూత తారుణ్యమును జెప్పుచున్నది. ముసలివాఁ డేమి సాధించును గనుక! బాలకుఁ డేమి సేయును! 'దేహాపత్య కళత్రాదిషు'–దేహమందు మువ్వురు ముఖ్యులు. దేహము, పుత్త్రులు, భార్య. తక్కినయందఱీ మువ్వురికి సంబంధించిన వారే. ఈ మువ్వురును స్వభావముచేతను గుణముచేతను దుష్టులే. ఎందుకనఁగా నాత్మనాశము గలిగించువారు. ఎక్కడఁగూడ సైన్యములు పాలకుని రక్షించును. ఈ సైన్యము లట్టివిగావు. పాలకుఁడైన వానినే యితరులచేతఁ జిక్కు వడఁ జేయును. కనుక వీరంద అసత్పురుషులు. మఱి వీరిని గృహస్థుఁ డెందుకు పోషించుచున్నాఁడు? 'ప్రమత్తః'–ఎక్కువగా మదిరను సేవించినవాఁడు వస్త్రము జాఱిపోయినను గమనింపఁడు. తన శరీరమును స్పృశించుచున్నను ఎఱుఁగఁడు. అట్లే గృహస్థుఁడును మృతి చెందుచున్న వారిని జూచుచునే మఱల నట్టి వారి రక్షణకొఱకై యత్నించుచున్నాఁడు. అందుచే నట్టివారి సంభాషణ బాహ్యాంతర దోష వ్యాపృతమైనది. ఆయువును వృథా హరించును. వారి మాటలు వినువారిని గృహములకే యంటుకొనిపోవున ట్లొనర్చును. మఱి వారి నడిగి యేమి ప్రయోజనము? 3

అవ: కనుక కృతార్థుఁ డగుటకుఁ గర్మాదికములను వదలిపెట్టి భక్తినే సాధింప మనుచున్నాఁడు–

భారత!–భరతవంశమునందుఁ బుట్టినవా రందఱు హరిభక్తులు. అందుకే నీ ప్రశ్నకు నే నుత్తరము చెప్పఁబోవుచున్నా నని భావము.

పరమాత్ముఁడు నైన హరి శ్రోతవ్యుఁడని భావము. రాగానుగభక్తి యందు అభయం నిష్కృపముగా, ఇచ్ఛతా=ఆశించుచున్న అనఁగా భగవంతునియందుఁ బరమ కఠోరమైన లోభమును బెంచికొన్న, పుంసా=పురుషునిచేత, భగవాన్ శ్రోతవ్యః=పరమసుందరుఁడైన నంద సూనుఁడు శ్రోతవ్యుఁడని భావము. 'భగం స్త్రీకామ మాహాత్మ్య వీర్యయత్నార్క కీర్తిషు' అని యమరము. ఇఁక మూఁడవది వైధభక్తి 'నబిభేత్యస్మాదిత్యభయః' శ్రీహరి - 'ముహూర్తాత్సర్వ ముత్సృజ్య గతవా నభయం హరిం' అని పైని జెప్పఁబోవుచున్నాఁడు. ఇచ్ఛతా =అభయమైన యాత్మత్రాణము నిచ్ఛించుచున్నవానిచేత, నీశ్వరుఁ డైన హరి యాశితవ్యుఁడైన పురుషునిచేత శ్రోతవ్యుఁడని తాత్పర్యము రెండు చకారములచేత. మొదటిదాని యందును 'చ' కార మధ్యా హృతమైనది. శ్రవణము కీర్తన స్మరణములు వీనిని మార్చి మార్చి చేయవలెనని భావము. ౫

**వల్లభాచార్యులు :**

ప్రమాణబలముతో ప్రమేయమునకు బలము హెచ్చుచున్నది. ప్రమేయవిషయమందు యుక్తి బలిష్ఠము. ఇదిగో యుక్తి. త్రైవర్ణికులే యభయమును గోరువారను నియమము లేదు. పూర్వపుణ్యములతో నితరులకును నభయేచ్ఛ సిద్ధింపవచ్చును. వారి కుపాయము వేదమందుఁ జెప్పలేదు. అందుచే వారికి సాధనము నిర్ణయించి నచో దానితోనే త్రైవర్ణికులకును బురుషార్థము సిద్ధింపవచ్చును. భగవంతుఁడు సర్వాత్మకుఁ డగుటచేత నతని విషయమే యేదో చెప్పవచ్చును. ఒకని యాత్మనుగూర్చి మఱియొకఁ డెందుకు వినును? 'ఆత్మావా అరే శ్రోతవ్యః', 'ఆత్మలాభాన్నపరం విద్యతే'

'తరతి శోక మాత్మవిత్' ఇత్యాది శ్రుతు లున్నవిగదా! సర్వుల యందును నొక్కటిగా నున్న యాత్మస్వరూపుఁడే శ్రోతవ్యుఁడు. కనుక శ్రుతులయందలి యాత్మపదము సర్వాత్మపదము. ఆత్మన్‌శబ్ద మిచ్చట జాతివాచకమని చెప్పుటకు వీలులేదు. భగవాన్ = షడ్గుణై శ్వర్య సంపన్నుఁడు. హరిరీశ్వర:-హరిత్వము అనఁగా సర్వదుఃఖము లను హరించు స్వభావము. ఈశ్వరత్వ మనఁగా సర్వఫలప్రదాతృ త్వము. వాఁడే వినుటకుఁ దగినవాఁడు. 'అంతే నారాయణస్మృతిః'. ఇదియే యుత్కృష్టమైన జన్మలాభము. సర్వధర్మానుష్ఠానముతోఁ బంచాగ్నివిద్యతోఁ బ్రతిపాదింపఁ బడినట్లు ఉత్తమదేహజన్మమే ఫలము. యోగమునకుఁ గూడ నింతే.

'శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టో౽భిజాయతే' అని యారంభించి 'అనేకజన్మ సంసిద్ధః తతో యాతి పరాంగతిమ్' అని యుపసంహార మొనర్చుటచేత యోగముతోఁ గూడ నంతిమజన్మ మును సాధింపవచ్చును. సాంఖ్యము గూడ నింతే. 'బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే' అని యారంభించి 'జ్ఞాని భ్యో౽పిమతో౽ధికః' అని ముగించుచున్నాఁడు. ఇది యోగప్రశంసా వాక్యము. దీనితోఁగూడ సిద్ధించునదంతిమజన్మయే. భగవద్ధర్మము లైన వ్రతోపవాసములతోఁ గూడ లభించునది భగవదీయమైన దేహము. కనుక అంతిమదేహ సాధనమందు పై సర్వములు నుపక్షీణ ములే. కాని 'అంతే యామతి స్సాగతిః' అను న్యాయముతోను, 'యం యం వాపి స్మరన్ భావం' అను భగవద్వాక్యముతోను నీ యంతిమజన్మ లన్నిటికిని మరణకాల భగవత్స్మరణమే సార్థకఫలము. అప్పుడు ఆ దేహ మనంతిమమైనను నంతిమముగాఁ బర్యవసించి మహాఫలము నిచ్చుచున్నది. కనుక మరణకాలమందు భగవన్నా మము జ్ఞాపక ముండుటకు సర్వకాలములందును భగవత్స్మరణ మొనర్పవలెనని భావము. కీర్తన గూడ నట్టిదే. ఎన్నఁ డంతిమజన్మ

నందికొన్నారో, జీవన్ముక్తులలో అట్టివారు గుణాతీతస్థితియందే యిచ్ఛ గలవారై యుందురు. వారికిఁ దర్వాతి జన్మముయొక్క సంభావన గూడ లేదు. అట్టి వారుగూడ శ్రవణానంతర మేర్పడెడు కీర్తనయందలి పరమానంద రసమునం దాసక్తులై సాధనదశయందే గాక సిద్ధావస్థయందును నీ సుఖ మెట్లుండునో చూతమని యాసక్తితో రమించుచుందురు. 'అంతే నారాయణస్మృతిః'-జ్ఞానయోగముల వ్యవసాయమందు సనకాదియోగీశ్వర, ప్రాచీనబర్హి ప్రముఖులవలె నారాయణస్మృతిః=శుద్ధభక్తి యేర్పడవలెనని భావము. జ్ఞానులును భక్తిని వదలి మఱల జ్ఞానాదులందుఁ దగుల్కొనరని భావము. అందుకే 'ఏతావానేవ యజతా మిహ నిశ్శ్రేయసోదయః భగవత్యచలోభావో యద్భాగవత సంగతః' అనుచున్నాఁడు.

భగవద్రూప గుణ మాధుర్యానుభవము బ్రహ్మసాయుజ్యమున కంటెను శ్రేష్ఠ మనుచు గొప్పవారి యనుభవములను సూచించుచున్నాఁడు.

'ప్రాయేణ' అను శ్లోకముచేత 'నైర్గుణ్యేస్థితాః'- ముక్తులైనను, 'గుణానుకథనే' = హరి గుణములను మఱి మఱి చెప్పుకొనుటయందే, వర్ణించుటయందే రమించుచున్నారు. నిర్విశేషసుఖమునందుఁ గాదని యర్థము. భాగవతం-భగవంత మధికృత్య కృతం లేక భగవతాప్రోక్తం అని సమాసము.

గిరిధరకృత బాలప్రబోధిని :

భగవద్భజనవిముఖుఁడై గృహోద్యానసక్తుఁ డైనటువంటి వానికి పురుషార్థ హేతువైనను ఆయుస్సు వ్యర్థముగనే గడచిపోవుచున్నది. అందుచే మానవుఁడు నిర్భయమైనపదము నిచ్ఛింపవలెను. అట్టి పదము శ్రీహరియే. తన్ను శరణుఁజొచ్చిన వారియొక్క స్వప్రాప్తి ప్రతిబంధకములైన దురితములను హరించును. అప్పుడు తత్ఫలమైన

సంసారము నశించును. అట్టి శ్రీకృష్ణుఁడే శ్రోతవ్యుఁడు. కీర్తితవ్యుఁడు. స్మర్తవ్యుఁడు. ఈశ్వరుఁ డగుటచే దుఃఖహర్త. ఈశ్వరుఁ డగుటకు హేతువు- నిరవధికషడ్గుణైశ్వర్య సంపూర్ణత్వము పరమేశ్వరుఁడు దుఃఖములఁ బోఁగొట్టువాఁడైనను దుఃఖప్రదులైన దుష్టు లనేకులు గదా! మఱి సర్వథా దుఃఖనివృత్తి యెట్లగును? అందుకే యను చున్నాఁడు- 'సర్వాత్మా'- సర్వులయం దంతర్యామిగ నున్నాఁడని యర్థము, కనుక వాఁడు ప్రసన్నుఁడైనచో దుఃఖప్రదుఁడు మఱి యెవ్వఁడుగూడ నుండఁడు. 'శ్రవణం కీర్తనం విష్ణోస్స్మరణం పాద సేవనమ్ అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్మని' తొమ్మిది విధములైన భక్తు లున్నవిగదా! వీనిలో దేని నాశ్రయించినను సర్వ యత్వము ప్రాప్తించును. మఱి యిచ్చట శ్రవణ, కీర్తన, స్మరణములు మూఁడే చెప్పఁబడినవి. ఇది ఎట్లు పొసఁగును? శ్రవణము లేనిది స్మరణ కీర్తనములు సంభవింపవు. స్మరణ లేనిది కీర్తన శ్రవణములు గల్గవు. కీర్తనము లేకున్నచో శ్రవణ స్మరణములు గల్గవు. కనుక నీ మూఁటిలో పరస్పర నిర్వాహకత్వ మున్నదని తెల్పుటకే మూఁటినే గ్రహించినాఁడు. తక్కిన భక్తులుగూడ వీని మూలముననే యుద్భవిం చుచున్నవి. అందుచేఁ బూర్వవాక్యక్షతి యేర్పడదని సమాధానము. కనుక సంసారభయజ్ఞాన మేర్పడినది మొదలు తన్నివృత్తికై దేహ పాతపర్యంతము యథాసంభవముగా శ్రవణాదుల యావృత్తి యేర్పడ వలెను. అది లేనిది సంసారభయ నివృత్తి గలుగదు. నిరతిశయా నందప్రాప్తి యేర్పడదు. అనేకజన్మల ననుష్ఠింపఁబడిన సాంఖ్యయోగ స్వధర్మానుపాలనాదులతో జనులకు సర్వోత్కృష్టమైన నారాయణ స్మృతిరూపమైన ఫల మేర్పడుచున్నది. దేహత్యాగ సమయమందు నారాయణస్మృతి సర్వోత్కృష్టమైన లాభము. సాంఖ్యము- ఆత్మా

యవి యేవియు సర్వోత్కృష్ట ఫలములు గావని తెలుపుటకే 'పరం' అనుచున్నాఁడు. జన్మమధ్యమం దొకసారి నారాయణస్మృతి ప్రాప్తించినను మరణకాలమందా స్మృతిలేనిచో యది సర్వోత్కృష్ట ఫలము గాదు. అట్టి వానికి భగవత్ప్రాప్తి యేర్పడదు. ఈ విషయమును దెల్పుటకే 'అంతే' యనుచున్నాఁడు-

**యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్,**
**తం తమే వైతి కౌంతేయ సదా తద్భావభావితః.**

అని గీతావాక్యము. ఈ విషయమందు సదాచారము ప్రమాణముగా నిచ్చుచున్నాఁడు. 'ప్రాయేణ' అను శ్లోకముతో రాజన్! ఓ రాజా! నీవు రాజవగుటచే నట్టి విషయము లనేకులతో వినియుందువు. నైర్గుణ్యస్థాః = త్రిగుణాతీతుఁడైన బ్రహ్మయందు దునికి యేర్పఱచి కొన్నవారు. అందుచేత విధినిషేధాత్మకమైన వేదము నుండి నివృత్తులు; తదుక్త పుణ్యపాప సంబంధరహితులు, అట్టి మునయః= మనన శీలురైనవారు, సదసద్వివేకము గలవారు - వారుగూడ ప్రాయేణ = ముఖ్యముగా, హరిలీల యను కథనమునందే రమింతురు. కీర్తన శ్రవణాద్యభ్యాసము లేనిదే స్మరణ మేర్పడదు గనుక మొదలు కీర్తన శ్రవణాదులందే ప్రవృత్తులగుచున్నారని భావము. వారు మాత్రమే గాదు; నేను గూడ నట్టివాఁడనే. అందుకే భాగవతమును బఠించితిని. భగవత్ప్రోక్తమై భగవత్ప్రతిపాదకమై భగవత్ఫలకమైనదే భాగవతము.

మహాపౌరుషికః = మహాపురుషుఁడైన కృష్ణునిఁ బొందుటకు కర్తుఁడైన వాఁడు, యస్య = ఏ శ్రీభాగవతమందు నీకు శ్రద్ధగలదో లేక భాగవతమును వినఁగోరుచున్న వారియందు నీకుఁ బరిశుద్ధమైన భక్తి గలదో, అందుచేత నీకు భాగవతమును జెప్పుచున్నానని భావము. కనుకనే జన్మాద్యస్య యతః అను శ్లోకము మొదలు విష్ణురాత మమూముచత్ ' అను శ్లోకపర్యంతమున్న భాగవతమును శుక బ్రహ్మ యెత్తిఁగించినాఁడు. ప్రథమస్కంధము నుండి ద్వాదశాంత

మన్నమాట. అప్పుడే 'అంబరీష! శుకప్రోక్తం నిత్యం భాగవతం శ్రుణు' అను వాక్యము సంగత మగుచున్నది. 9_12

ఈ శాస్త్రమందు భక్తి గదా ప్రతిపాదింపఁబడినది! మఱి నామానుకీర్తనమునే చెప్పుచున్నావే!' అని ప్రశ్న. ఇదియే రాజులలోఁ జక్రవర్తివలె సర్వశ్రేష్ఠమైనదని భావము. భక్త్యంగములలో శ్రవణ కీర్తన స్మరణములు మూఁడును ముఖ్యము. వానినే పై శ్లోకమందుఁ జెప్పినాఁడు. వానిలోఁ గూడ గీర్తన ముఖ్యమని దీనితోఁ దెల్పు చున్నాఁడు. ఆ కీర్తన నామలీలా గుణములతోఁ గూడినదిగా నుండ వలెను. స్వీయభక్తి కనురూపమైన నామకీర్తనము గావచ్చును. నిరం తర సంకీర్తనము ప్రధానము. దీనిని బూర్వాచార్యులే గాదు. నేను గూడ ననుష్ఠించితినని శుకబ్రహ్మ యనుచున్నాఁడు. కీర్తనమునకుఁ గాల దేశ పాత్ర ఉపకరణా ద్యపేక్షలేదు. శుద్ధ్యశుద్ధి భయములేదు. అందుచే నిది యకుతోభయమైనది. సాధకులును సిద్ధులును ముము క్షువులును ముక్తులును- అందఱు ననుష్ఠింపఁ దగిన పరమ శ్రేయస్సా ధనము. నిర్విద్యమానానాం=మోక్ష పర్యంతమున్న సర్వకాలముల చేతను నాకృష్టులై చిక్కి బాధపడుచున్నవారు, ఏకాంత భక్తులకుఁ గూడ నిదియే త్రోవ. స్వర్గమోక్షాద్యర్థులకు గూడ నిదియే త్రోవ. ఆత్మారాములైన యోగులకుఁ గూడ నిదియే యాశ్రయణీయము. ఇది నిర్ణీతము. దీని నెవ్వరును గాదనుటకు వీలులేదు.

## విశిష్టాద్వైత భాగవతచంద్రికా వ్యాఖ్య:

వరీయాన్=సర్వోత్కృష్టమైనది, శ్రోతవ్యాదిషు-శ్రోతవ్యకీర్త నీయ స్మరణాదులందు, పరః=ఉత్కృష్టమైనది, నీ చేతనడుగఁబడిన

పుత్త్ర కళత్త్రాదుల మరణము గన్నులారఁ జూచినను మాన
వుఁడు మఱల సంలగ్నుఁ డగుచున్నాఁడు. నాశోత్తరక్షణమే విషయ
ములు వాని సీడ్చుచున్నవి. తన శరీరముగూడ పతనమగునని తలఁ
పక దేహము నిత్యముగనే యెంచి పతితుఁ డగుచున్నాఁడు. అందు
చేత- 4

భగవాన్ = షడ్గుణైశ్వర్య సంపన్నుఁడును, ఈశ్వరః = నిఖిల
జగన్నియంతయు, హరిః=ఆశ్రితపాపహరుఁడును నైన శ్రీమన్నా గా
యణుఁడు శాస్త్రముఖము నుండిగాని, ఆచార్యముఖము నుండి గాని,
శ్రోతవ్యః=వినఁదగిన వాఁడు; తత్కల్యాణగుణగణ ప్రకాశక నామో
చ్చారణాదులతోఁ గీర్తితవ్యుఁడు. తనకు దేహప్రదానము మొదలైన
సర్వవిధోపకార కర్తగా స్మర్తవ్యుఁడు. 5

సాంఖ్య=దేహవిలక్షణ ఆత్మజ్ఞానము; దానిచేతఁ దెలియఁబడు
నది సాంఖ్యము. ఇది గీతాశాస్త్రమందు మొదటి యాఱధ్యాయము
లలోఁ బ్రతిపాదింపఁబడినది. ఆత్మతత్త్వావలోకనము యోగము. ద్వితీయ
షట్కప్రతిపాద్యమైనది భక్తియోగము. ఈ యోగ భక్తియోగముల
కంగ భూతమైనదే స్వధర్మ పరినిష్ఠ. స్వధర్మః= తన కనుష్ఠేయమైన
వర్ణాశ్రమ రూపధర్మము. 'అమానిత్వ మదంభిత్వ' మిత్యాదులచేత
గీతాశాస్త్ర తృతీయషట్క ప్రతిపాదితము. దానియందు పరినిష్ఠ;
తత్పరిత్యాగ అభావబుద్ధి; వీనితో నంతమునందు నారాయణస్మృతి
యేర్పడును. షట్కత్రయ ప్రతిపాద్యమైన సాంఖ్య భక్తియోగ
బలముచేత, శరీరవియోగకాలమందే నారాయణస్మృతి యేర్పడునో
అదే యుత్కృష్టమైన జన్మగాఁ బరిణమించును. కర్మభూమియందు
మనుష్యాది శరీర పరిగ్రహమునకు సర్వోత్కృష్టమైన లాభ మిదే.
మ్రియమాణుఁడగు వాని కింతకు మించిన యనుష్ఠేయము లేదు. 6

నైర్గుణ్యస్థాః=సత్త్వరజ స్తమోరూప గుణత్రయరహితులు. శుద్ధ
సత్త్వప్రధాను లన్నమాట. విధినిషేధతః నివృత్తాః = శాస్త్రీయమైన

లైన సనకసనందనాదులును హరిగుణానుకథనమునందు రమింతురు. శాస్త్రీయములైన సర్వధర్మముల నతిక్రమించినను భగవత్కల్యాణ గుణ వశీకృతులై యా గుణముల యమృత రసాస్వాదముచే నేర్పడిన పరమానందానుభవముచేత సదా తృప్తులై సర్వవిషయములను సులభముగా వర్జింతురు. కనుక, భగవత్కల్యాణ గుణానుభవమే సర్వోత్కృష్టమైన లాభమని యర్థము. 7

నైర్గుణ్యేపరినిష్ఠితోఽపి = సనకాదులవలె త్రిగుణాతీతుఁడైన భగవంతునియందు నిష్ఠగలవాఁడ నైనను వారివలెనే నారాయణుని యొక్క రామకృష్ణా ద్యవతారముల యందుఁ బ్రదర్శితములైన లీలల చేత నాకర్షింపఁ బడినవాఁడనై భాగవతమును బఠించితిని. 9

నిర్విద్యమానానాం = దేహగేహాదులందు హేయతా బుద్ధిగల వారికి. 11

ప్రమత్తస్య=స్వాత్మత్రాణ పద్ధతి తెలియని వానికి, ఆయుః= ఆయుస్సు, భిన్నఘటమునుండి నీటివలె కలాకాష్ఠాదిరూపముగా కంటి కగుపడకయే పోవుచున్నది. బ్రహ్మానుభవము లేక గడచిన యాయువంతయు నిరర్థకమే. బ్రహ్మతత్త్వమును దెలిసికొన్న యొక్కముహూర్తమైనను అగణిత కోటిసంవత్సరముల కంటెను శ్రేష్ఠమనిభావము. 12

**ఆత్మానం రథినం విద్ధిశరీరం రథమేవ చ,**
**బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవ చ**
**ఇంద్రియాణి హయానాహుః విషయాంస్తేషు గోచరాన్,**

అనెడు శ్రుత్యర్థ మిచ్చట ననుసంధించి కొనవలెను. 'మనః కర్మభి రాక్షిప్తం' పుణ్య పాప రూపమైన బహుజన్మానుష్ఠితమైన కర్మ

వాసనలచేత, ఆక్షిప్తం=బలాకృష్టమైన, మనః=మనస్సును శుభార్థి యైన పురుషుఁడు సదసద్వివేచన చతురమైన బుద్ధిచేత నిశ్చలమొనర్ప వలెనని భావము. 18

అవ్యచ్ఛిన్నేనచేతసా = నిరంతర సంలగ్నమైన మనస్సుచేత, ఏకావయవం=హస్తపాదాద్యవయవ సహితమైన, వాసుదేవుని రూప మును స్మరింపవలెను. 19

విష్ణోఃపదం=భగవంతుని చరణారవిందమును, 'సంచింతయే ద్భగవత శ్చరణారవింద' మ్మని పైని చెప్పఁబోవుచున్నాఁడు. అనేక జన్మార్జిత పాపము నివృత్తియగు నటుకును తీవ్రధారణచేత, మన స్సును నియమింపవలెనని తాత్పర్యము. 20

యస్యాం = ఏ ధారణ, సంధార్యమాణాయాం = చక్కఁగా సంపాదిత మగుచుండగా, భద్రం=మాంగల్య పరమకాష్ఠాభూతమైన, ఆశ్రయం = చిత్తాలంబనము–అనఁగా కేయూరమకరకుండల శ్రీవత్స కౌస్తుభ ముక్తా దామోదరబంధన పీతాంబరాది దివ్య పరికరాలంకృత మైన భగవ ద్దివ్యమంగళ విగ్రహరూపమైన పరమ ప్రాప్యవస్తువును, ఈక్షతః = ధ్యానదశలోఁ జూచుచున్నట్టి, యోగినః=యోగికి– భక్తి లక్షణమైన యోగము సిద్ధించుచున్నదని భావము. 21

స్థూలప్రపంచమందు నిరంతరము సక్తుఁడైన వానికి సర్వవిష యములనుండి పరాఙ్ముఖత్వము తొందరగా సిద్ధింపదు. భగవంతుని సూక్ష్మరూపమందు దృష్టి యదుకదు. పూర్వవాసనలు వాని నిడ్చు చుండును. కనుక వాని కనుకూలమైన స్థూలరూపమునే తొలుత

వాసము పెట్టుకొన్నవాఁడై- 23

భూతం = ప్రాక్కల్పాదులం దున్నదియు, భవ్యం = భావి కల్పాదులందు రాఁబోవునదియు, భవత్ = వర్తమానకల్పాదియం దున్నదియు నైన, లేక యీ కల్పమందే అతీతానాగత వర్తమానమైన సమస్తవిశ్వమును- విరాడ్రూపుని స్థూలరూపమందున్నవి, స్థవీయసాం స్థవీయస్య = పెద్దలలో పెద్ద, 'జ్యాయాన్ పృథివ్యాః, జ్యాయాన్ అంతరిక్షాత్, జ్యాయానేభ్యో లోకేభ్యః' అను శ్రుత్యనుసారము నిఖిల ప్రపంచధారకుఁ డగుటచే నతిస్థూలుఁడైన భగవంతునికిఁ బ్రపంచము దేహమే; భక్తియోగము నభ్యసించు వానికి స్థూలరూప ముపాస్యము. ఆరూఢునికి సూక్ష్మరూపమే. 24

సూర్యుఁడాతని దక్షిణనేత్రము. దీనితోఁ జంద్రుఁడు వామ నేత్రమని చెప్పినట్లైనది. 'అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ' అని శ్రుతి. 29

మాయా=ప్రకృతి, 'మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయి నంతు మహేశ్వరం' అని శ్రుతి. ద్విజాని యనుచోట క్లీబత్వ మార్షము. 30

మనుర్మనీషా = స్వాయంభువ మనువే బుద్ధి, 'యద్వైకించ మనురవదత్ తద్భేషజం' అనిశ్రుతి. కనుక మనువు బుద్ధిమంతులలో నగ్రగణ్యుఁడు. అందుచే మనువే బుద్ధి యనుచున్నాఁడు. మనుజో నివాసః=మనుష్యజన్మమందే జ్ఞానభక్త్యాదుల సంభవము. 31

**విజయధ్వజము:**

పరీక్షి త్తడిగిన ప్రశ్న కుత్తరము చెప్పఁబోవుచు శుకబ్రహ్మ రాజు నభినందించుచున్నాఁడు. లేక భాగవతసంహితాప్రారంభము

నృప ! లోకహితం=జగత్తునందలి సజ్జనులకు హితమగునట్లు, కృతః=నీవు చేసిన, ఆత్మవిత్సమ్మతః = 1. ముఖ్యముగాఁ బరమాత్మ -జ్ఞానులని ప్రసిద్ధులైన బ్రహ్మాదులకు సమ్మతమైన (ఆత్మవిత్), పుంసాం=పరమాత్మను దెలిసికొన్న జనులకు, శ్రోతవ్యాదిషు=వినఁ దగినవియును, జప్యములు-మననము సేయఁదగి నవియును నైన విష యములందు, యత్పరః=ఏ సర్వోత్తముడైన శ్రీహరి, ఆత్మవిత్సమ్మతః =అపరోక్షజ్ఞానులకు సమ్మతమైనవాఁడో, అందుచేత, ఏషః=ఈ, తే ప్రశ్నః=పరమాత్మను విషయీకరించిన నీ ప్రశ్న, అనఁగా 'మ్రియ మాణస్య యత్కార్యం' 'యచ్ఛ్రోతవ్యం' అని ప్రథమస్కంధాంత మందు నీ వడిగినప్రశ్న. వరీయాన్=శ్రేష్ఠమైనది, రాజేంద్ర !, ఇహ= ఈలోకమందు, నృణాం శ్రోతవ్యాని సహస్రశ స్సంతి-మ్రియమాణు లును=చావఁబోవు వారునునైన సర్వులకును, శ్రీహరియే శ్రోతవ్యము లగు విషయములలో సత్యుత్తమవిషయమని, జ్ఞానులకు సమ్మతమైన వాఁడు. లోకహితం అనుటతోఁ బరీక్షిత్తుప్రశ్న యాతనికే గాక లోక మునకును హితకరమైనదని భావము. 1

పరమాత్ముని గూర్చిన యజ్ఞానముతో గంటువడిన యీ సంసారము ఆతని శ్రవణాదులు లేనిదే పోదు. అందుచేత, నడుగఁ దగిన విషయములలో శ్రీహరియే యుత్తముఁడు. ముఖ్యముగా జ్ఞాను లకు సమ్మతమైనవాఁడు అని ముగింపఁ బోవుచున్నవాఁడై. యజ్ఞా నులు లోకమం దొనర్చెడు వ్యాపారమును జెప్పుచున్నాఁడు-

ఆత్మతత్త్వం = 1. శ్రీహరియొక్క యనారోపితమైన జ్ఞానా నందాత్మకమైన రూపమును, 2. లక్ష్మీ, బ్రహ్మ మొదలైన చేతనుల యొక్క, యెప్పటికిఁ దొలఁగని తారతమ్య భావములో నుండుటను,

నిద్రయా—అవిద్యయనెడు బంధక ప్రకృతిచేత, అపశ్యతాం—తెలియ నేరని, గృహేషు—గృహస్థాశ్రమమందే యుండెడు, గృహమేధినాం —తమ పాపపరిహారమునకై పంచ మహాయజ్ఞము లొనర్పవలెనని శ్రుతులందుఁ జెప్పిన కర్మల నొనర్చెడు, పుంసాం—జనులకు, నిద్ర యావ్యవాయేన చ నక్తం నవం వయశ్చ, హ్రియతే. రాజన్! దివాచ అర్థేహయా — శ్రీహరి యారాధనమున కుపయోగింపఁబడిన ద్రవ్య సంపాదనయొక్క ఆయాసముతోను, కుటుంబభరణేన వా—అకర్తవ్య ములైన యనేకములైన పనులను జేసియైనను సంసారమును రక్షిం చుకొనవలెనను మనువు మాటల ననుసరించుటతోను, హ్రియతే. ౭,౩

తాత్పర్యము: పరమాత్మ జ్ఞానములేనివారు తారతమ్యాను సారముగా జీవుల స్థానమానములను దెలియనివారు, కుటుంబపోష ణమం దాసక్తులై పంచమహాయజ్ఞము లొనర్చికొనుచు గృహస్థ ధర్మమునందే నిరతులై రాత్రులందు నిద్రచేతను, యౌవనమును విషయ భోగములచేతను, పగళ్లను ద్రవ్య సంపాదనముచేతను, కుటుంబపోషణముచేతను వ్యర్థ మొనర్చికొందురు.

అవ: పరమాత్మను దెలిసికొనకుండుటకుఁ గారణమును దెల్పుచున్నాఁడు-

అపి — ఈ స్థితి చాలనింద్యము, ఆత్మదైన్యేషు — 1. తనను దీనునిగా నొనర్చెడు, స్వయముగా దీనభావముతోఁ గూడికొన్న, అసత్సు—అమంగళకరులైన సంసారులకు సహాయకులైన, తేషు— ఎల్లరను, అజ్ఞానమందు ముంచుటలోఁ బ్రసిద్ధులైన, దేహాపత్యకళ త్రాదిషు ప్రసక్తః—అత్యంతము నాసక్తుఁడైనవాఁడు, నిధనం = తన వినాశమును, పశ్యన్నపి న పశ్యతి—'అపి' అను శబ్దప్రయోగముచేత, నసత్యమైనవి యనియును యర్థమును జెప్పరాదని సూచించు

తేషుప్రసక్తోనిధనం, అని వీరి పాఠము. ఆత్మనైన్యేషు అని శ్రుథియు.
ఆత్మదైన్యేషు అని వీరు. 4

భారత! తస్మాత్ =శ్రీమన్నారాయణుని శ్రవణాదులులేనిచో సంసారము నశింపదు. అందుచేత, అభయం=నిత్యమును భయముతో కూడిన యీ సంసారమునుండి విముక్తిని, ఇచ్ఛతాం=అపేక్షించు చేతనుని చేత, సర్వాత్మా = 1. సర్వులందును వ్యాప్తుఁడైనవాఁడు. సర్వుల యభీష్టములను దీర్చెడువాఁడును నైన, భగవాన్=నిరతిశయ మైన యైశ్వర్యము మొదలైన గుణములుగల, 2. బ్రహ్మ మొదలగు చేతనులకును పూజ్యుఁడైన, హరిః=స్మరణమాత్రముచేతనే సంసారము యొక్క సమస్త క్లేశములను బోఁగొట్టెడి, ఈశ్వరః= సమస్త జగత్తుల కును నియామకుఁడైన, హరిః శ్రోతవ్యః, చ=ఇంకను, స్మర్తవ్యః= శ్రవణము మొదలైన మూఁటిచేత, అజ్ఞానము సంశయము మొదలైన వానినిఁ దొలఁగించికొనవలెను.

**శ్రుత్వా మత్వా తథా ధ్యాత్వా తదజ్ఞాన విపర్యయౌ,**
**సంశయం చ పరాణుద్య లభతే బ్రహ్మదర్శనమ్.**

అని చెప్పినట్లు హరికథాశ్రవణముచే జ్ఞానమును, కీర్తనమును మననముచేత సంశయభ్రాంతులను బోఁగొట్టుకొని స్మరణరూపమైన ధ్యానముతో శ్రీహరి సాక్షాత్కారమును బొందును. 'సర్వాత్మా భగవాన హరిః ఈశ్వరః' అనెడు నీ నాల్గు విశేషణములతో శ్రోత వ్యుఁడు వేఱు, జప్యుఁడు వేఱు అనెడు సందేహమును బరిత్యజించి యీ నాల్గింటికిని విషయ మొక్కఁడే యని సూచించుచున్నాఁడు. 'హరిః' 'భగవాన్' అని చెప్పుటతో సహంకార రూపముతో సర్వ వ్యాపియు రుద్రుఁడునునైన దానివలన రుద్రుఁడే ముఖ్యశ్రోతవ్యుఁడని యర్థ మెందుకుఁ గాదు అనెడు సందేహమును బరి[illegible] సూర్యాదు లెందుకు కారాదు! తన్నివారణమున[illegible] యీశ్వరశబ్దము[illegible] ఈశుఁ డనఁగా రుద్రుఁడు. అతనికంటె శ్రేష్ఠుఁ[illegible] యీశ్వరశబ్దము

యొక్క యౌగికార్థము. అందుచేత నీశ్వరశబ్దము రుద్రునందు రూఢమను సందేహముగూడ నిరస్తమైనది. 5

అవ: ఈ విషయమే వేద ఇతిహాస పురాణములందు తత్తాత్ప ర్యముగాఁ బ్రతిపాదితమైనదని చెప్పుచున్నాఁడు. లేక అవసానకాల మందు నారాయణస్మరణ మేర్పడునట్లు బహుశాస్త్రాభ్యాస మొనర్ప వలెనని చెప్పుచున్నాఁడు-

సాంఖ్యయోగాభ్యాం-తత్త్వజ్ఞానము లేక యోగశాస్త్రమందుఁ జెప్పిన భగవత్పూజాపరమైన యోగానుష్ఠానములచేతను స్వధర్మపరి నిష్ఠయా, అంతే నారాయణస్మృతిః. ఏతావాన్, ఇంతయే. పుంసాం =ముముక్షుజీవులకు, పరః జన్మలాభః. అందుచేతనే వేదాది శాస్త్రము లందంతకాలములో శ్రీమన్నారాయణుని స్మరించియే తీఱవలెననియు వేఱొకమార్గము లేదనియుఁ జెప్పఁబడినది. అందుకే మ్రియమాణుఁడు వరింపఁదగిన దేది? ఈ ప్రశ్న కుత్తరము గూడఁ బ్రసిద్ధమైనదే యనునది సిద్ధమైనది. 6

అవ: ఎట్లు చూచినను నారాయణునే స్మరింపవలెనని కైముత్య న్యాయముతోఁ జెప్పుచున్నాఁడు-

రాజన్! మునయః=తమకు యోగ్యమైన జ్ఞానమును బొంది, విధి నిషేధతః - విధినిషేధరూపములై వేదముల నుండి, నివృత్తాః= దూరమందున్న, నైర్గుణ్యస్థాః = ప్రాకృత గుణరహితుఁడైన శ్రీహరి యనుగ్రహించిన మోక్షమును బొందిన ముక్తులును, ప్రాయేణ= ఎక్కువగా, హరేః గుణానుకథనే, రమంతే స్మ=వానిని మాటిమాటి కిని స్మరించికొని చెప్పుదురు. కొంతకాలము ధ్యానముచేయుటచేత, 'ప్రాయేణ' చాలమట్టుకని చెప్పఁబడినది. కనుక, నింకను దమ యోగ్యతకుఁ దగినట్లు జ్ఞానమును సంపాదించికొనవలసిన సాధన

కారంభించుచున్నాడు-

ఇదం=నేను చెప్పవలెనని మనస్సునం దేర్పఱచికొన్న, భాగ వతంనామపురాణం బ్రహ్మసమ్మితం = వేదముల వ్యాఖ్యాన రూప మగుటచే వానితో సమానమైనది. దీనిని ద్వాపరాదౌ=ద్వాపర యుగ మందుఁ గృష్ణావతారమునకు ముందే, పితుః ద్వైపాయనాత్ అహం అధీతవాన్. 'వ్యాసః షట్ శతవర్షీయో ధృతరాష్ట్రమజీ జనత్' అనెడు ప్రమాణముచేత, ద్వాపరాంతమందు వ్యాసావతార మగుట చేతను, ద్వాపరాదౌ అనెడు పదమునకు ద్వాపరాంతమనియే యర్థము. 8

అవ: మీరు భాగవతాధ్యయన మెందుకొనర్చితిరి? దానికి సమాధానము-

రాజర్షే!=రాజైనను జ్ఞానియైన యోయి పరీక్షిత్తా!, నైర్గుణ్యే= నాకుఁ దప్పక మోక్ష మేర్పడునని, పరినిష్ఠితః అపి=నిశ్చయముగల వాఁడనైనను, ఉత్తమ శ్లోకలీలయా గృహీతచేతాః, యత్ ఆఖ్యానం అధీతవాన్. యత్ర=ఏ భాగవతమందుఁ జెప్పఁబడిన శ్రీహరి విష యములందు, శ్రద్దధతాం ఆశు సతా, మతిః ముకుందే స్యాత్. తత్=ఆ భాగవతమును, యత్=ఏ కారణముచేత, భవాన్=నీవు, మహాపురుషికః=హరి భక్తులయందు త్తముఁడవో ఆ కారణముచేత. తే అహం అభిధాస్యామి. 'మహాపౌరుషికః' శ్రీధరులు, 'మహాపురుషికః' విజయధ్వజులు. 9, 10

ఇది నీకు మాత్రమేగాదు. అందఱు యోగులకును నిదే నిశ్చ యము. నృప! నిర్విద్యమానానాం, అకుతోభయం=మోక్షమును, ఇచ్ఛతాం, యోగినాం=జ్ఞానులకు, హరేర్నామాను కీర్తనం, ఏతత్,

నిర్ణీతం = అంత్యకాలమందు శ్రీహరి స్మరణకుఁ గారణమని నిశ్చిత మైనది, 11

అవ : దీనిచేత భాగవతశ్రవణ మొనర్చవలె నను టు చెప్పినట్లైనది. ఐనను నాకు అత్యంత మల్పకాలమే యాయు వుండుటచేత నిది సాధ్యముగాదే యను విషయమునకు సమాధానము-

ప్రమత్తశ్చ, బహుభిః పరోక్షైః హాయనైః ఇహ కిం ప్రయోజనం?, యతః = ఏ ముహూర్తము నుండి, శ్రేయసే=శ్రీహరి స్మరణ రూపమైన మోక్షకరమైన పనికి, ఘటతే = అనుకూల మగునో, తత్ ఏకం ముహూర్తం-ఆ రెండు గడియల కాలమును, విదితం = ఉత్తమ మని ప్రఖ్యాతమైనది. 12

అవ : ఈ విషయమునే కథామూలకముగా దృఢపఱచు చున్నాఁడు-

ఖట్వాంగో నామ రాజర్షిః, ఇహ = ఈ మనుష్యలోకమందు, ముహూర్తాత్ (ప్రాక్) చచ్చుటకొక ముహూర్తముముందే, ఆయుషః ఇయత్తాం జ్ఞాత్వా,సంగం=రాజ్యకోశాదు లందభిమానమును,విసృజ్య =వదలి, హరిం=శ్రీహరి నుద్దేశించి, ఉత్సృజ్య=ఇంద్రియములను పణముగాఁ బెట్టి, అభయం = 1. ఏ భయమును లేని మోక్షమును, 2. పరమపురుషార్థమైన శ్రీహరిని, గతవాన్=పొందినవాఁ డయ్యెను. 13

అవ: నీకు ఖట్వాంగునికంటెను హెచ్చుగనే యాయువున్నది కనుక సంతాప పడవలసినది లేదు. అందుచేత సమస్తమును హరి చరణారవింద స్మరణమునకు విషయముగా నొనర్చికొమ్మని చెప్పు చున్నాఁడు-

కౌరవ్య! ఏతర్హి= ఇప్పుడు, తవాఽపి = నీకైతేనో, సప్తాహం

వెల్లను, సాంపరాయికం—1. ముందేర్పడఁబోవు ముక్తి కాలమునకు సంబంధించినదిగా సమస్త కాలమును శ్రీహరి స్మరణమునకే విషయముగా, 2. మరణరూపమైన యాపత్కాలమందు శ్రీహరి స్మరణ యేర్పడు నట్టిదిగా, ఉపకల్పయ — మరణపర్యంతము భాగవతమును వినుటయందుఁ దత్పరుఁడవు గమ్మని యర్థము. 14

అవ: మరణకాలమును దెలిసి శ్రీహరిస్మరణ మొనర్ప వలెనని యిచ్ఛించువారికి మొదటి సాధనము వైరాగ్యమని చెప్పుచున్నాఁడు—

పురుషః అంతకాలే—ఆగతే తు—వచ్చినదని, తానై గాని యితరుల నుండిగాని తెలిసికొన్నపుడు, గతసాధ్వసః—దేహము నాశమగునను భయమును వదలి, అసంగశస్త్రేణ—భార్యాపుత్రుల యభిమానమునకు విరోధియైన వివేకశస్త్రముతో, దేహేస్పృహాం అను—ఆ దేహమును, అను—అనుసరించి సంబంధులైన, యే—భార్యాపుత్రులందును, చ—అభిమానమును, ఛింద్యాత్—ఛేదింపవలెను. 15

అవ: తర్వాత చేయఁదగిన దానినిఁ జెప్పుచున్నాఁడు—

ధీరః—ప్రతిబంధకము దొలఁగించుకొనెడు సామర్థ్యముగలవాఁడై, గృహాత్—భార్యాదులైన గృహములనుండి, ప్రవ్రజితస్సన్—సన్న్యాస మనిపించికొనెడు వైరాగ్యమును బొంది, పుణ్యతీర్థజలాప్లుతస్సన్—1. భాగవతము మొదలైన పవిత్రశాస్త్రములను మాటికి మనన మొనర్చికొనుచు, గంగ మొదలైన పవిత్రతీర్థములందు స్నానముచేసి బాహ్యాంతర మలములను వదల్చుకొని, వివిక్తే—దుర్జనసంబంధము లేని ప్రదేశమందు, విధివత్—ఎక్కువ యెత్తును, తక్కువయునుగా నుండరాదు అనెడు శాస్త్రవిధుల ననుసరించి, కల్పితాసనే ఆసీనః (భవేత్). ఇట్లు స్థిరాసనమును గల్పించికొన్న తర్వాత చేయఁదగినది చెప్పుచున్నాఁడు. విహితశ్వాసః—రేచకపూరకాదులతోఁ బ్రాణాయామ మొనర్చి వాయుదేవుని యనుగ్రహమును బొంది, మనః యచ్ఛేత్.

దెచ్చు, శుద్ధం=నిర్దోషమును, పరం=సర్వోత్తమమును, బ్రహ్మ=గుణ పరిపూర్ణమైన నారాయణుఁడనెడు వస్తువును, అనుస్మరన్=స్మరించుచు, త్రివృత్, బ్రహ్మాక్షరం=పరబ్రహ్మను జెప్పుటచే సర్వగతమనిపించికొన్న, పరం=ఉత్కృష్టమైన యోంకారమును, మనసా=మనస్సుచేత, అభ్య సేత్=ఆవృత్తి యొనర్పవలెను-జపింపవలెనని భావము. 16, 17

అవ: ధ్యానప్రకారమును జెప్పుచున్నాఁడు-

బుద్ధిసారథిః=బుద్ధిమంతుఁడైన సత్పురుషుఁడు, మనసా=జితమైన మనస్సుచేత, అక్షాన్ విషయేభ్యః నియచ్ఛేత్ కర్మభిః ఆక్షిప్తం. అట్లు విషయములనుండి మరలించిన తర్వాత మఱల విషయములవైపు మరలెడు మనః, ధియా=తన బుద్ధిచేత, శుభార్థే=పరమ మంగళ వస్తువనిపించికొన్న శ్రీహరియందు, ధారయేత్=నిల్పవలెను. 18

అవ: ఇట్లు శ్రీహరియందు నియతమైన మనస్సున్న యోగి గూడ ధ్యానము సేయవలె ననుచు ధ్యానము నభ్యసింప వలసిన ప్రకారమును జెప్పుచున్నాఁడు-

తత్ర=పూర్తిగా, సకలములైన యవయవములను ధ్యానించుట కశక్తుఁడైనచో, అవ్యుచ్ఛిన్నేన=విషయములచే నాకర్షింపఁబడని, చేతసా=మనస్సుచేత, పదావయవం=శ్రీహరి పాదము మొదలైన యొక్కొక్క యవయవమునే, ధ్యాయేత్=అనాయాసముగా స్మరణకు వచ్చునట్లు ధ్యానింపవలెను.

ధ్యానము యొక్క పక్వావస్థను దెల్పుచున్నాఁడు.

తతః=అట్లు అభ్యాస బలముతోఁ బూర్తిగా నవయవముల నన్నిటిని స్మరించెడు సామర్థ్యము గలిగిన తర్వాత, నిర్విషయం=విష

యముల నుండి పూర్తిగాఁ దొలఁగి స్థిరమైనట్టి, మనః=మనస్సును, యుక్త్వా=శ్రీహరి సమస్తావయవములను ధ్యాన మొనర్చినదిగాఁ జేసి, యత్ర=ఏ శ్రీహరి ధ్యానమందు, మనః=మనస్సును, ప్రసీదతి =అతిశయమైన సుఖమును బొందునో, ఆ మహావిష్ణువుయొక్క పరమం పదం=పాదములు మొదలుకొని శిరఃపర్యంతమైన పుణ్యరూపమును, సంస్మరేత్=భక్తితో స్మరింపవలెను, తతః=దానిని వదలి,కించిత్= దేనినిగూడ, న సంస్మరేత్=స్మరింపఁగూడదు.

తాత్పర్యము: ఇట్లు బుద్ధిని సారథిగా నొనర్చికొన్న పురుషుఁడు తనకు వశమైన మనస్సుతో నింద్రియములను విషయముల నుండి మరల్చి సంసారమునకుఁ దగినంత మాత్రమే బహిర్ముఖమై కర్మలచే నాకృష్టమైన మనస్సును తనబుద్ధితో పరమ మంగళకరుఁడైన శ్రీహరియందే నిలుపవలెను. ఇట్లు నిలిపిన తర్వాతఁ బరమాత్ముని సమస్తములైన యంగములను ధ్యానించుటకు సమర్థుఁడైనపుడు విషయ సంపర్కములేని మనస్సుతో నాతని పాదము మొదలైన యొక్కొక్క యవయవమునే ధ్యానింపవలెను. ఇట్లు అభ్యాస క్రమముతో సమస్తములైన యవయవములను ధ్యానించెడు శక్తి సంపాదించి విషయరూపమైన మనస్సును శ్రీహరి సమస్తావయవములను ధ్యాన మొనర్చునట్లు చేసి యాతని సమగ్రరూపమును స్మరింపవలెను. అప్పుడు మనస్సు నిరతిశయసుఖము నందును. 19

అవ: అఖండ ధ్యానోపాయమును జెప్పుచున్నాఁడు-

రజస్తమోభ్యాం అక్షిప్తం=చంచలమై విమూఢమైన, ఆత్మనః మనః ధీరః ధారణయా-తైలధారవలె నవిచ్ఛిన్నమైన మనస్సుతో, యచ్ఛేత=విషయములనుండి మరల్చి ధ్యానమగ్న మగున ట్లొనర్పవలెను. యాసా=ఆ ధారణ, తత్కృతం=రజస్తమస్సులతో నేర్పడెడు రాగమును-అవిద్య మొదలగు, మలం=దోషములను, హంతి=పోఁగొట్టుచున్నది.

తాత్పర్యము: రజోగుణప్రభావముతో మనస్సు విషయలగ్న మగును. తమోగుణముతోఁ గర్తవ్యాకర్తవ్యములను దెలియక విమూఢ మగును. అట్టి మనస్సును తైలధారవలె నవిచ్ఛిన్నమగు ధ్యానముతో శ్రీహరియందు నిలుపవలెను. ఈ సంతతధ్యానము మనోమలరూప ములైన రాగము అవిద్య మొదలైన దోషములను సంపూర్ణముగాఁ దొలఁగించును. ఈ రీతిఁ బరమాత్మునందు మనస్సును నిలుపువాఁడే ధీరుఁ డనిపించికొనును. ఈ విధముగా సంతతధ్యానరూపమైన ధార ణతో సర్వజగత్తునకును ఆశ్రయుఁడును బరమ మంగళస్వరూపుఁ డును నైన శ్రీహరి నాశ్రయించిన యోగికి హరిభక్తి బహుశీఘ్ర ముగా సిద్ధించును, దానితో నపరోక్షజ్ఞానములు తప్పవు. 20

అవ: మనస్సును విషయముల నుండి తొలఁగించికొనుటయే ధారణఫలము గాదు. నిరంతరమైన భక్తిరూపమైన యోగము గూడ సిద్ధించునని చెప్పుచున్నాఁడు-

యస్యాం=ఏ ధారణను, సంధార్యమాణాయాం=సంతతము ననుష్ఠింపఁగా, ఆశ్రయం=సమస్త ప్రపంచమున కాశ్రయమైనట్టియు, భద్రం=మంగళకరుఁడునైన శ్రీహరిని, ఈక్షతః=చూచుచున్న, భక్తుఁ డైన ముముక్షువునకు, భక్తిలక్షణః=భక్తి యనెడు, యోగః=పరమా త్మను బొందెడు నుపాయము, ఆశు=శీఘ్రముముగా, సంపద్యతే=ఏర్ప డును. 21

అవ: హెచ్చువిషయము దెలియవలెనను నిచ్ఛతోఁ బరీక్షిత్తు శుకునిఁ బ్రశ్నించుచున్నాఁడు-

బ్రహ్మన్, ధారణా = మనస్సునందు సంతతస్మరణ, యథా (కథం) సంధార్యతే=ఎట్లు ధరింపఁబడుచున్నది?, యత్ర=ఏ విష యమందు, అది, సమ్మతా=ఉత్తమమని యోగుల సమ్మతికి విషయ మైనది? పురుషస్య=ధ్యాన మొనర్చెడు పురుషుని, మనోమలం=మనో

దోషమును, యాదృశీవ=ఏ ధారణవలె, ఆశు=శీఘ్రముగా, హరేత్ =పోఁగొట్టును?

ఈ శ్లోకమందలి యథా, యత్ర, యాదృశీ-ఈ పదములను ప్రశ్నార్థకము లని తెలియవలెను.

తాత్పర్యము: రా జనుచున్నాఁడు: శుకాచార్యా! ఈ ధారణ యందలి విశేషమును దెలియఁ గోరుచున్నాను. అట్టి ధ్యానమును బొందుట యెట్లు? ఎచ్చట నీ ధారణ మొనర్పవలెను? మానవుని మనోమాలిన్యమును బోఁగొట్టు ధారణ యెట్టిది? **22**

అవ: మూఁడు ప్రశ్నలలో మొదటిదానికి సమాధాన మిచ్చు చున్నాఁడు-

జితాసనః జితశ్వాసః జితసంగః జితేంద్రియః, సంధారయేత్ =ధారను నిలుపవలెను.

రెండవప్రశ్నకు సమాధానము-

స్థూలే=పెద్దదైన, భగవతః=శ్రీహరియొక్క, రూపే = రూప మును ధ్యానించుటయందు, ధియా=బుద్ధిచేత, మనః సంధారయేత్. **23**

అవ: క్రమముగా మూఁడవ ప్రశ్నకు సమాధానము-

భూతం భవ్యం భవచ్చ యత్ ఇదం=ఏ జడచేతనాత్మక ప్రపం చము, యత్ర=ఏ బ్రహ్మాండమందు, దృశ్యతే = కన్పించుచున్నదో, అయం= అట్టి యీ బ్రహ్మాండము, స్థవీయసాం=అత్యంతస్థూలము కంటెను, స్థవిష్ఠః=ఎక్కువస్థూలమైన, విశేషః=శిలారూపమైన ప్రతిమ వలె, తస్య=సర్వాంతర్గతుఁడైన శ్రీహరియొక్క, దేహః = శరీరము- స్వరూపదేహము గాదని యర్థము. 'శిలావత్తచ్చ దేహోఽయం అండ కోశస్తు తాదృశః' అనెడు ప్రమాణవచన ముండుటచే దీని కట్లే యర్థ మొనర్పవలెను.

తాత్పర్యము: నీ మొదటిప్రశ్న కిది సమాధానము - ఆసన జయమును సంపాదించి శ్వాసను వాయువుయొక్క అనుగ్రహముతో జయించి విషయాసక్తిని వదలి ఇంద్రియములను వశపఱచికొని ధ్యానము నొనర్పవలెను. రెండవప్రశ్న కుత్తరము: బుద్ధి నుపయోగించి భగవంతుని స్థూలప్రకృతియందు మనస్సు నుంపవలెను. త్రికాలము లందున్న జడచేతనాత్మకప్రపంచమును లోన నిముడ్చికొన్న బ్రహ్మాండము స్థూలమైన వస్తువుకంటె నత్యంతస్థూలమైనది. ఇది పరమాత్మునకు శిలాప్రతిమ యున్నట్లు సర్వత్ర వ్యాపించిన శ్రీహరికి ప్రతిమారూపమైన దేహము; స్వరూపదేహము గాదని యర్థము. 24

సప్తావరణ సంయుతే = ఏ డావరణములతోఁ గూడిన, శరీరే = జీర్ణమై పోయెడు, అస్మిన్ అండకోశే = ఈ బ్రహ్మాండమందు, యః వైరాజః = 1. విశేషముగాఁ బ్రకాశించుటతో విరాట్టు అనిపించికొన్న బ్రహ్మాండమం దుండుటచేతను, 2. అందఱకంటెను శ్రేష్ఠుఁ డగుటచే వైరాజుఁ డని పిలువఁబడెడు, పురుషః = బహుకర్మ ఫలముల నొసఁగుటచేఁ బురుషుఁ డనిపించికొన్న శ్రీహరి యుండునో, అసౌ భగవాన్ = సర్వైశ్వర్య సంపన్నుఁడైన శ్రీహరియే, ధారణాశ్రయః = ధారణకు విషయమైనవాఁడు. వానినిగూర్చి యొనర్చిన ధ్యానమే మనోమలములను బోఁగొట్టునని భావము.

తాత్పర్యము: భూమి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తత్త్వము అనునవే సప్తావరణములు. ఇవి కవచమువలె బయటనున్న యావరణములు. నాశశీలము లగుటచే వీనికి శరీరమని పేరు. దీనిలో విశేషప్రకాశము గలవాఁడై, వ్యాపకుఁడై, సర్వోత్తముఁడై, యందఱి కర్మములకును ఫల మొసఁగెడి శ్రీహరి

ఉపదేశించిన రూపముయొక్క ధ్యానరీతిని జెప్పుచున్నాఁడు—
వీనిలో పాతాళము మొదలుకొని సత్యలోకము వఱకున్న లోకములు
బ్రహ్మాండ మనెడు ప్రతిమకు పాదము మొదలు తల వఱకున్న
యంగములు. అంతే గాని బ్రహ్మాండ మందున్న శ్రీహరియొక్క
స్వరూపాంగములు గావు. అవి పరమాత్ముని ఆ యా యంగముల
నుండి పుట్టి ఆ యవయవములనే యాశ్రయించికొని యుండును.
అందుచేత నవియుఁ జిదానందాత్మకమైన శ్రీహరి యంగములును
నొకటే యని తెలియరాదు. భగవంతుని పాదములు అను మాటను—
'బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్' అను వాక్యమునువలె నర్థముఁ చేసి
కొనవలెను. అట్లే యింద్రాది దేవతలకును శ్రీహరి యవయవ,
ఇంద్రియ గోళములతో నభేదమని యర్థ మొనర్పరాదు. వా రా
యా యింద్రియముల నుండి పుట్టిన వారి నాశ్రయించికొని యుం
దురు. అందుచేత నా యా యవయవ కథలును. ఇంతమాత్రమే
వారి యధికారము. అందుకే వా రా యంగములకంటె భిన్నులగుట
చేత నింద్రియములే వారని స్వరూపైక్యపరముగా నర్థముఁ జేసికొన
రాదు. 'ప్రతిమాపేక్షయాంగాని భూరాదీని' ఇత్యాది ప్రమాణము
లున్నవి. ఏతచ్ఛ — ఈ యండముయొక్క లోపలనున్న శ్రీహరి
యొక్క, పాదమూలం = చిదానంద స్వరూపమైన పాదముయొక్క
మూలమునుండి పుట్టినదిగాను, దానినే యాశ్రయించికొని యున్నది
గాను, పాతాళం—పాతాళలోకమును, పఠంతి=జ్ఞానులు సజ్జనుల కుప
దేశింతురు. ఉపదేశమునొందిన శిష్యులు గూడ నట్లే యుపాసింతురు.
ఇఁక పైనిఁగూడ నిట్లే యర్థ మొనర్చికొనవలెను. రసాతలం = రసా
తలమును, పార్ష్ణిప్రపదే = వీని పాదమునకు ముందు వెన్కభాగము
లని, పఠంతి, విశ్వసృజః—జగత్తును సృష్టించు శ్రీహరియొక్క, గుల్ఫౌ
=శ్రేష్ఠమైన గుల్ఫములని, మహాతలం పఠంతి. పురుషస్య జంఘే
ఇతి. తలాతలం పఠంతి.

తాత్పర్యము : బ్రహ్మాండమందున్న పాతాళాది లోకములు- ఆ పరమాత్ముని ప్రతిమయందు గన్పించు నవయవరూపములు వాని స్వరూపభూతములైన యా యా యంగములయందు జన్మించి, ఆ యంగములనే యాశ్రయించికొని యుండునవి. అనఁగాఁ బరమాత్ముని స్వరూపాంగములవలె చిదానందాత్మకములు గావని పిండితార్థము. అట్లే యింద్రాది దేవతలు గూడఁ బరమాత్ముని యా యా యంగములనుండి పుట్టిన వాని నాశ్రయించికొని యుండి వాని కధీనమై యుండువారు. అంతే గాని వారే పరమాత్ముని యవయవములు గారు.

శ్రీహరి స్థూలప్రతిమకు సంబంధించిన పాదమూలమే పాతాళము, పాదాగ్రమే రసాతలము. ఆ విశ్వకర్త ప్రతిమకు సంబంధించిన మడమ మహాతలము. తలాతలము లా పురుషుని జంఘలు. 26

విశ్వమూర్తేః-ద్వైజానుని సుతలం పఠంతి, వితలం అతలం చ ఊరుద్వయం. ఊరువు క్రిందిభాగము వితలము. పై భాగ మతలము. మహీపతే! మహీతలం జఘనం పఠంతి. ఈ భాగమును విశేషముగా నుపాసింపవలెనని తెలుపుటకే 'మహీపతే!' అని సంబోధనము.

ద్యౌః అస్య అక్షిణీ అహుః, పతంగః అస్య చక్షురభూత్. ఉభే అహనీ విష్ణోః పక్ష్మాణి చ, పరమేష్ఠిధిష్ణ్యం అస్య భ్రూవిజృంభః, అపః తాలుః జిహ్వా ఏవ రసః. 30

ఛందాంసి=గాయత్రి మొదలైన ఛందస్సులను (వేదములను) అనంతస్య శిరః గృణంతి. అర్యమేందూ దంష్ట్రా-దంష్ట్రనుండి పుట్టిన వారు (బహురూపము లున్నవా రగుటచే మఱల వానిఁ జెప్పినాఁడు) ఉడుగణాః ద్విజాః జనోన్మాదకరీ మాయా చ హాసః యత్ అపాంగ మోక్షః, దురంతసర్గః - 'అర్యమేందూ ఉడుగణాః' అనుచోట న్యాయముగా ప్రగృహ్యసంజ్ఞ రావలెను. దానిని వదలి సంధిచేసినాఁడు. ద్విజాని అనుచోట నపుంసకలింగ మున్నది. ఈ రెండును దాని వైలక్షణ్యమును జూపుటకే యని తెలియవలెను. 'దంష్ట్రా యమః స్నేహకళా ద్విజాని' అని శ్రీధరులు. 'దంష్ట్రార్యమేందూడుగణా ద్విజాని' అని విజయధ్వజులు. 30

వ్రీడా ఉత్తరోష్ఠః, అధర ఏవ లోభః, ధర్మః స్తనః చ, అధర్మ పథః పృష్ఠః, కః తస్య మేఢ్రం, వృషణౌ, చ మిత్రః-మిత్రుఁ డనెడు దేవత. కుక్షిః సముద్రాః గిరయః అస్థిసంఘాః. ఈ శ్లోకమందలి ఏవ కారము నిర్ధారణార్థకము. 32

నద్యః అస్యనాడ్యః, తనూరుహాణి మహీరుహాః నృపేంద్ర! - విశ్వతనోః=1. ఆ యా పదార్థములయందు వ్యాపించిన దేహముగల 2. విశ్వమునే ప్రతిమగాఁ బొందియున్న, అస్య వీర్యంచ అన్నం, మాతరిశ్వా శ్వసితం, గతిః=వాని గమనము, వయః=ప్రాణుల జీవనమున కవధియైన యాయుస్సు, కర్మ=వాని క్రియనుండి, సత్త్వగుణప్రవా

అంబువాహాన్-ఈశస్య కేశాన్ విదుః, కురుపర్యః. సంధ్యే తు=రెండు సంధ్యలును, భూమ్నః వాసః అవ్యక్తం. మూలప్రకృతినే హృదయం అహుః. సర్వవికార కోశః=అన్ని వికారముల కాశ్రయమైన (ఇది మనోభిమాన ప్రయుక్తముగాఁ జెప్పిన మాట). చంద్రమా తు మనః. 'వాసస్తు సంధ్యాం' అని శ్రీధరులు. 'వాసస్తు సంధ్యే' అని వీరు. విజ్ఞానశక్తిం=బ్రహ్మను, సర్వాత్మనః మతిం అమనంతి. గిరిత్రః=1. కైలాసపర్వతమును రక్షించెడి, 2. వాయుదేవునిచే రక్షితుఁడైన రుద్రుఁడు, అంతఃకరణం=శ్రీహరి యంతఃకరణము నుండి పుట్టినవాఁడు. 'నఖాని అశ్వాశ్వ తర్యుష్ట్రగజాః'-సర్వేమృగాః పశవః శ్రోణిదేశే. 'విజ్ఞానశక్తిం మహిం' అని శ్రీధరులు, 'మతిం' అనివీరు. వచాంసి=లౌకిక వైదికములైన రెండుతెగల వాక్కులును. విచిత్రం తద్వ్యాహరణం మనుః 'వాయుదేవుఁడు' తేవాయవే మనవేఽబాధితాయ' అనిశ్రుతి. స్వాయంభువమనువు, మనీషా-మనుజః నివాసః వచాంసి తద్వ్యాహరణం-అని విజయధ్వజులు. 'వయాంసి తద్వ్యాకరణం' అని శ్రీధరులు. మహాత్మా-బ్రహ్మాననః, క్షత్రభుజః, విడూరుః, అంఘ్రిశ్రితకృష్ణవర్ణః, స్వాహాస్వధా వీర్యగుణోపపన్నః-దేవతల నుద్దేశించి యిచ్చెడుస్వాహాకారము-పితరుల నుద్దేశించి యొసఁగెడు స్వధాకారము. వీనికిఁ గారణభూతమైన వీర్యముతోఁ గూడినవాఁడు. హవ్యాత్మకః=హవిస్సుకుఁ గారణమైన మధ్యదేహము గలవాఁడు. కర్మవితానయోగః=అగ్నిష్టోమము మొదలైన కర్మసమూహమునకుఁ గారణమైన యుపాయము గలవాఁడు. 'బ్రహ్మాననం' అని శ్రీధరులు. 'బ్రహ్మాననః' అని విజయధ్వజులు. 'నానావిధాభిజ్య గణోపపన్నో ద్రవ్యాత్మకః' అని శ్రీధరులు, 'స్వాహాస్వధా వీర్యగుణోపపన్నో హవ్యాత్మకః' అని వీరు. 34

ఈశ్వరవిగ్రహస్య = వైరాజు డను శ్రీహరి ప్రతిమారూపమైన దేహమునకు సంబంధించి, యః సన్నివేశః అసౌ, ఇయాన్=ఇట్టిది, తే మయా కథితః యతః=ఆ పరమాత్ముని విగ్రహముకంటె, స్థవిష్ఠం =1. ఉత్తమమైనది, 2. స్థూలమైనది, కించన నాస్తి. యోగిభిః=జ్ఞానుల చేత, మనః అస్మిన్ స్థవిష్ఠే=సర్వోత్తమమైన, వపుషి=విగ్రహమందు, స్వబుద్ధ్యా=తన బుద్ధిచేత, సంధార్యతే=మనో, నిర్మలత్వమునకై నిలుపఁబడుచున్నది.

శ్రీపోతన్నగారు:

శ్రీమద్భక్త చకోరక
సోమ! వివేకాభిరామ! సురవినుతగుణ
స్తోమ! నిరలంకృతాసుర
రామా! సీమంతసీమ! రాఘవరామా!

వచ: మహనీయ గుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణవ్యాఖ్యాన వైఖరీసమేతుండైన సూతుం డిట్లనియె. అట్లు పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె-

క్షితిప! నీ ప్రశ్నంబు శ్రేష్ఠతమంబగు
నాత్మవేదులు మెత్తు రఖిలశుభద
మాకర్ణనీయంబు లయుతసంఖ్యలు గల
వందు ముఖ్యంబిది యధికతరము
గృహముల లోపల గృహమేధులగు నరు
లాత్మతత్త్వము లేశమైన నెఱుఁగ
రంగనారతుల నిద్రాసక్తిఁ జను రాత్రి
పోవుఁ గుటుంబార్థ బుద్ధి నహము

పశు కళత్ర పుత్త్ర బాంధవ దేహాది
సంఘమెల్లఁ దమకు సత్య మనుచుఁ
గాఁపురములు సేసి కడపటఁ జత్తురు
కవియుఁ గాన రంతకాలసరణి.

కావున సర్వాత్ముండు మ
హావిభవుఁడు విష్ణుఁ డీశుఁ డాకర్ణింపన్
సేవింపను వర్ణింపను
భావింపను భావ్యుఁ డభవభాజికి నధిపా।

జనులకెల్ల శుభము సాంఖ్యయోగము దాని
వలన ధర్మనిష్ఠవలన నయిన
నంత్యకాలమందు హరిచింత సేయుట
పుట్టువునకు ఫలము భూవరేంద్ర।

అరసి నిర్గుణబ్రహ్మంబు నాశ్రయించి
విధినిషేధనివృత్తి నద్విమలమతులు
సేయుచుందురు హరిగుణచింతనములు
మానసంబుల నేప్రొద్దు మానవేంద్ర।

ద్వైపాయనుఁడు నాదుతండ్రి ద్వాపరవేళ
బ్రహ్మసమ్మితమైన భాగవతము
పఠనంబు సేయించె బ్రహ్మతత్పరుఁడనై
యుత్తమశ్లోక లీలోత్సవమున
నాకృష్టచిత్తుండనై పఠించితి నీవు
హరిపాదభక్తుండ వగుటఁజేసి
యెఱిఁగింతు వినవయ్య। యీ భాగవతమున
విష్ణుసేవాబుద్ధి విస్తరిల్లు
మోక్షకామునకును మోక్షంబు సిద్ధించు
భవభయంబులెల్లఁ బాసిపోవు
యోగిసంఘమునకు నుత్తమవ్రతములు
వాసుదేవనామ వర్ణనములు.

హరినెఱుంగక యింటిలో బహుహాయనంబులు మత్తుఁడై
పొరలుచుండెడి వెఱ్ఱి ముక్తికిఁ బోవనేర్చునె? వాఁడు సం
సరణముం బెడఁబాయఁ డెన్నఁడు సత్య మా హరినామ సం
స్మరణ మొక్క ముహూర్త మాత్రము చాలు ముక్తిదమౌ నృపా।

కౌరవేశ్వర ! తొల్లి ఖట్వాంగుఁడను విభుం డిల నేడుదీవుల నేలుచుండి
శక్రాదిదివిజులు సంగ్రామభూముల నుగ్రదానవులకు నోడివచ్చి
తమకుఁ దోడడిగిన ధరనుండి దివికేగి దానవవిభుల నందఱ వధింప
'వరమిత్తు' మనుచు దేవతలు సంభాషింప జీవితకాలంబు సెప్పుఁడిదియ

వరము నాకు నొండు వరమొల్ల ననవుఁడు
నాయు వొక ముహూర్త మంతతడవు
గల దటంచుఁ బలుక గగనయానమున న
మ్మానవేశ్వరుండు మహికి వచ్చి.

గిరులం బోలెడి కరులను
హరులం దన ప్రాణదయితలై మనియెడు మం
దరులను హితకరులను బుధ
వరులను వర్జించి గాఢవైరాగ్యమునన్.

గోవిందనామ కీర్తనఁ
గావించి భయంబుఁ దక్కి ఖట్వాంగ ధరి
త్రీవిభుఁడు సూఱగొనియెను
గైవల్యముఁ దొల్లి రెండుగడియలలోనన్.

వచ: వినుము. నీకు నేడు దివసంబులకుం గాని జీవితాం తంబు గాదు. తావత్కాలంబునకుం బారలౌకిక సాధనభూతంబగు పరమకల్యాణంబు సంపాదింపవచ్చు. అంతకాలంబు డగ్గఱినం బెగ్గడిలక దేహి దేహ పుత్త్ర కళత్రాది సందోహంబు వలని మోహపాశంబు నిష్కామకరవాలంబున నిర్మూలనంబు సేసి, గేహంబు వెడలి పుణ్యతీర్థ జలావగాహంబు సేయుచు నేకాంత శుచిప్రదేశంబున విధివత్ప్రకారంబునం గుశాజిన చేలంబులతోడం గల్పితాసనుండై మానసంబున నిఖిల జగత్పవిత్రీకరణ సమర్థంబయి యకారాది త్రివర్ణ కలితంబయి బ్రహ్మబీజంబైన ప్రణవంబు సంస్మరించుచు వాయువుల జయించి విషయంబుల వెంటనంటి పాఱెడి యింద్రియంబుల బుద్ధిసారథియై

మనోనామకంబులయిన పగ్గంబుల బిగ్గంబట్టి మ్రొగ్గం దిగిచి దట్టంబు లయిన కర్మఘట్టంబుల నిట్టట్టుమెట్టెడు మనంబును శేముషీబలంబున నిరోధించి భగవదాకారంబుతోడ బంధించి, నిర్విషయంబయిన మనంబున భగవత్పాదాద్యవయవంబులం గ్రమంబున ధ్యానంబుసేయుచు రజస్తమోగుణములచేత నాక్షిప్తంబును విమూఢంబును నగు చిత్తంబున ధారణావశంబునం దద్గుణంబులవలన నయ్యెడి మలంబులం బోనడచి నిర్మలచిత్తంబునం బరమంబైన విష్ణుపదంబునకుం జను. ధారణానియమంబు గలుగ సుఖాత్మకంబగు విషయంబు నవలోకించు యోగికి భక్తిలక్షణంబైన యోగంబున వేగంబ మోక్షంబు సిద్ధించు ననిన యోగీంద్రుం డిట్లనియె-

ధారణ యే క్రియ నిలుచును?
ధారణ కేరూప? మెద్ది ధారణ యనఁగా?
ధారణ పురుష మనోమల
మేరీతి హరించు? నాకు నెఱిఁగింపఁగదే!

వచ: అనిన విని రాజునకు నవధూతవిభుం డిట్లనియె-

పవనము నియమించి పరిహృతసంగుఁడై
యింద్రియముల గర్వమెల్ల మాపి
హరి విశాలరూపమందుఁ జిత్తముఁ జేర్చి
నిలుపవలయు బుద్ధినెఱపి బుధుఁడు.

వచ: వినుము భగవంతుండైన హరి విరాడ్విగ్రహంబునందు భూత భవిష్య ద్వర్తమానంబైన విశ్వంబు విలోక్యమానంబగు. ధరణీ సలిల తేజ స్సమీరణ గగనా హంకార మహత్తత్త్వంబు లనియెడి సప్తావరణంబులచేత నావృతంబగు మహాండకోశంబైన శరీరంబునందు ధారణాశ్రయం బయిన వైరాజపురుషుండు దేజరిల్లు. అమ్మహాత్మునికిఁ బాదమూలంబు పాతాళంబు; పార్ష్ణిభాగపాదాగ్రభాగంబులు రసాతలంబు; గుల్ఫంబులు మహాతలంబు; జంఘలు

తలాతలంబు; జానుద్వయంబు సుతలంబు; ఊరువులు వితలాతలం
బులు. జఘనంబులు మహీతలంబు. నాభివివరంబు నభస్స్థలంబు.
వక్షంబు గ్రహతారకాముఖ జ్యోతిస్సమూహ సమేతంబగు నక్షత్ర
లోకంబు. గ్రీవంబు మహర్లోకంబు. ముఖంబు జనలోకంబు. లలా
టంబు తపోలోకంబు. శీర్షంబు సత్యలోకంబు. బాహుదండంబు
లింద్రాదులు. కర్ణంబులు దిశలు. శ్రవణేంద్రియంబు శబ్దంబు. నా
సాపుటంబు లశ్వినీదేవతలు. ఘ్రాణేంద్రియంబు గంధంబు. వదనంబు
వహ్ని. నేత్రంబు లంతరిక్షంబు. చక్షురింద్రియంబు సూర్యుండు.
రేయుంబగళ్లు ఱెప్పలు. భ్రూయుగ్మవిజృంభణంబు బ్రహ్మపదంబు.
తాలువులు జలంబులు. జిహ్వేంద్రియంబు రసంబు. వేదంబులు
భాషణంబులు. దంష్ట్రలు దండధరుండు. దంతంబులు పుత్త్రాదిస్నేహ
కళలు. నగవులు జగన్మోదకరంబులైన మాయావిశేషంబులు. కటా
క్షంబు లనంతసంసర్గంబులు. పెదవులు వ్రీడాలోభంబులు. స్తనం
బులు ధర్మమార్గంబులు. వె న్నధర్మమార్గంబు. మేఢ్రంబు ప్రజాపతి.
వృషణంబులు మిత్రావరుణులు. జఠరంబు సముద్రంబులు. శల్య
సంఘంబులు గిరులు. నాడీనివహంబులు నదులు. తనూరుహంబులు
తరువులు. నిశ్వాసంబులు వాయువు. ప్రాయంబు నిరవధికమైన
కాలంబు. కర్మంబులు నానావిధజంతు నివహసంవృత సంసరణం
బులు. శిరోజంబులు మేఘంబులు. కట్టుపుట్టంబులు సంధ్యలు.
హృదయంబు ప్రధానంబు. సర్వవికారంబులకు నాశ్రయంబయిన
మనంబు చంద్రుండు. చిత్తంబు మహత్తత్త్వంబు. అహంకారంబు
రుద్రుండు. అశ్వాశ్వతర్యుష్ట్రగజంబులు నఖంబులు. కటిప్రదేశంబు
పశుమృగాదులు. విచిత్రంబులైన యాలాప నైపుణంబులు పక్షులు.
బుద్ధి మనువు. నివాసంబు పురుషుండు. షడ్జాదులైన సర్వవిశేషంబులు
గంధర్వవిద్యాధరచారణాప్సర స్సమూహంబులు. స్మృతి ప్రహ్లాదుండు.
వీర్యంబు దైత్యదానవానీకంబయి యుండు. మఱియు న మ్మహా

విధంబులైన వసురుద్రాది దేవతాభిధానంబులును, ద్రవ్యంబులు హవిర్భాగంబులును, కర్మంబులు యజ్ఞప్రయోగంబులును నగు. ఇట్టి సర్వమయుండైన పరమేశ్వరుని విగ్రహంబు బుద్ధిమంతుఁడై ముముక్షువైన వాఁడు మనంబున ననుసంధానంబు సేయవలయు నని వక్కాణించి వెండియు నిట్లనియె—

హరిమయము విశ్వమంతయు
హరి విశ్వమయుండు సంశయము పనిలే దా
హరిమయము గాని ద్రవ్యము
పరమాణువులేదు వంశపావన! వింటే.

కలలోన జీవుండు గౌతూహలంబునఁ
బెక్కుదేహంబులఁ బేరు వడసి,
యింద్రియంబులవెంట నెల్లవృత్తంబులు
వీక్షించి మఱి తన్ను నెఱుఁగు కరణి
నఖిలాంతరాత్మకుఁడగు పరమేశ్వరుఁ
డఖిలజీవుల హృదయముల నుండి
బుద్ధివృత్తులనెల్ల బోద్ధయై వీక్షించు
బద్ధుండుగాఁడు ప్రాభవమువలన

సత్యఁ డానందబహుళవిజ్ఞానమూర్తి
యతని సేవింప నగుఁగాక యన్యసేవఁ
గలుగనేరవు కైవల్య గౌరవములు
పాయ దెన్నఁడు సంసారబంధ మధిప!

అర్థము: శ్రీమద్భక్తచకోరక సోమ = శోభాయుక్తుఁడైన భక్తులనెడు చకోరకపక్షులకు చంద్రునివంటివాఁడా!, వివేకాభిరామ! = సదసద్విచారముతో సుందరుఁడైనవాఁడా!, సురవినుత గుణస్తోమ =

దేవతలచే స్తుతింపఁబడిన గుణముల సమూహముగలవాఁడా!, నిర
లంకృత=అలంకారము లేనివిగాఁ జేయఁబడిన, అసురరామా=రాక్షస
స్త్రీలయొక్క, సీమంతసీమ= పాపటగల వాఁడా!, రాఘవరామా!=
రఘువంశమందుఁ బుట్టిన రామచంద్రుఁడా!.

తాత్పర్యము: భక్తు లను చకోర పక్షులకు చంద్రునివంటి
వాఁడా! సదసద్విచారముచేత నందమైనవాఁడా! దేవతలచే పొగడఁ
బడిన కల్యాణగుణముల సమూహముగలవాఁడా! మాంగల్య సూచక
ములైన భూషణములు, కుంకుమము మొదలైనవి లేనివిగాఁ జేయఁ
బడిన రాక్షసస్త్రీల పాపటలు గలవాఁడా! రఘువంశమందుఁ బుట్టిన
రామా! ఈ భాగవతకృతి నీ పాదములకడ సమర్పించితినని భావము.

విశేషములు: చకోరపక్షులు వెన్నెలఁ గ్రోలి బ్రదుకు ననుట
కవిసమయ సిద్ధము. ముత్తైదువులు పాపటయందు కుంకుమము
ధరించుటయు, పాపటబొట్టును గట్టుకొనుటయు లోకప్రసిద్ధము.

మహనీయగుణగరిష్ఠులు=సద్గుణములచేత గొప్పవారు. నిఖిల
పురాణవ్యాఖ్యాన వైఖరీసమేతుఁడు=సమస్త పురాణములను వ్యాఖ్యా
నించుటయందు సమర్థమైన వాగ్విలాసము గలవాఁడు.

క్షితిప!=ఓ రాజా!, శ్రేష్ఠతమము=అన్నిటికంటెను శ్రేష్ఠతమ
మైనది ఆత్మవేదులు=బ్రహ్మను దెలిసికొన్నవారు-అనఁగా ముక్తులు.
అఖిలశుభదము=సమస్తశుభములను గలిగించునది, ఆకర్ణనీయంబులు
= వినఁదగినవి, అయుతసంఖ్యలు గలవు = వేలకున్నవి, అందున్
= వానిలో, ఇది ముఖ్యంబు = ఈ ప్రశ్న సర్వోత్తమమైనది, అధిక
తరము=అన్ని విషయములకంటెను గొప్పది, గృహమేధులు=గృహ
స్థాశ్రమము లందుండువారు, ఆత్మతత్త్వమున్ = పరబ్రహ్మయొక్క
స్వభావమును, లేశమైనన్ ఎఱుఁగరు = కొంచెమును గూడఁ దెలి

సక్తిన్ = నిద్రయందలి యాసక్తిచేతను, రాత్రి చనున్ = రాత్రివేళలు గడచిపోవును, కుటుంబార్థబుద్ధిన్=కుటుంబము కొఱకై ద్రవ్యమును సంపాదించెడు యత్నముతో, అహము పోవున్=దినముగడచిపోవును, పశుకళత్ర ........ దేహాదిసంఘము = పశువులు, భార్యలు, పుత్త్రులు వారి ననుసరించిన బంధువులు – ఈ యన్ని బంధములకును మూల కారణమైన తనదేహము మొదలైనవి, సత్యమనుచున్=మరణధర్మము లేనివని, కాఁపురమున్ చేసి=కుటుంబములం దెక్కువ యాసక్తితోఁ గాఁపురము లొనర్చుచు, కడపటున్ చత్తురు=కడపట నశింతురు, అంత కాల సరణిన్=మరణమువచ్చు పద్ధతిని, కనియున్ కానరు=చూచుచుం డియుఁ దెలిసికొనరు.

విశేషములు: 'వరీయా నేష తే ప్రశ్నః' అనుటకుఁ దెనుఁగు– 'నీ ప్రశ్నంబు శ్రేష్ఠతమంబు' అనునది. అఖిల శుభదము – నీకే గాక సమస్త ప్రపంచమునకును శుభములు గల్గించునది. 'కృతోలోక హితః' అని మూలము. ఆకర్ణనీయంబు లయుత సంఖ్యంబులు గలవు. 'శ్రోతవ్యాదిషు యః పరః' అనునది దీనికి మూలము. 'నృణాం సంతి సహస్రశః' అనునదియు. గృహమేధులు–'మేధృ హింసాయాం' అని ధాతువు. గృహస్థాశ్రమములందుండి దానితో సంప్రాప్తించెడు– పంచసూనములను పాపములకు లోఁగి వానినిఁ బోఁగొట్టుకొనుటకు పంచయజ్ఞము లొనర్చికొనుచు బాధపడుచుండువారు. పంచసూన ములు–

పంచసూనా గృహస్థస్య చుల్లీ పేషణ్యుపస్కరాః,
ఖండనీ చోదకుంభశ్చ బధ్యంతే యాశ్చవాహయన్.

(శుద్ధితత్త్వము) వానిని బోఁగొట్టు కొనుటకు ప్రాయశ్చిత్తము వైశ్వదేవము.

సాధారణముగా గృహస్థుఁడు పంచప్రకారములైన యజ్ఞములు ప్రతిదినము నొనర్పవలెను. అవి ఇవి-

> బ్రహ్మయజ్ఞో నృయజ్ఞశ్చ దేవయజ్ఞశ్చ సత్తమః,
> పితృయజ్ఞో భూతయజ్ఞః పంచయజ్ఞాః ప్రకీర్తితాః.

కనియున్ కానరు=తమ యెదుటనే పిత్రాదుల మరణములు చూచుచున్నను దమకుఁ గూడ నదేగతి ప్రాప్తించునని తెలియనేరరు. 'పశ్యన్నపి న పశ్యతి' అని మూలము. పశు కళత్ర .... దేహోత్థ సంఘము - దేహమే ముఖ్యబంధకము. అనఁగా నది శాశ్వత మనెడు బుద్ధి. దాని ననుసరించియే కళత్రాదులు.

తాత్పర్యము: ఓ రాజా! నీ వడిగిన ప్రశ్న సర్వోత్తమమైనది. బ్రహ్మవేత్త లందఱు నీ ప్రశ్నకు సమ్మతింతురు. నీకే గాక సమస్త ప్రపంచమునకును శుభములు చేకూర్చును. ఆత్మతత్త్వము నెఱుఁగని మనుష్యులకు వినఁదగిన వనేకములు-వేలు గలవు. వానివలన నేమి ప్రయోజన మున్నది? నిరంతరము గృహములలోఁ జిక్కి పంచ సూనము లొనర్చుచు వానినిఁ బోఁగొట్టుకొనుటకుఁ బ్రాయశ్చిత్తము లొనర్చుచుండెడి గృహస్థులు ఆత్మతత్త్వమును లేశమైన నెఱుఁగరు. రాత్రులు నిద్రలతో గతించి పోవుచున్నవి. స్త్రీ చాపల్యములతో యౌవనము గడచిపోవుచున్నది. పగటిపూఁట కుటుంబభరణమునకై ధనసంపాదనము. ఆ కుటుంబము నెట్లు పోషింపవలెననియే చింత. ఇన్ని దుఃఖములకుఁ గారణము దేహబుద్ధి. అనఁగా దన దేహము శాశ్వతమైన దనెడు భ్రమ. దానియం దాసక్తి. దాని నాశ్రయించి పశువులు, కళత్రము, పుత్త్రులు మొదలైనవారు కాఁపురములు సేయుచునేయుందురు. తమ యెదుటనే పిత్రాదులు గతించిపోదురు. వారికి వలెనే దనకు నే నాఁడో మరణము దప్పదు. కాని జీవి యా రాఁబోవు మరణమును గూర్చి యాలోచింపఁడు. తనదేహము శాశ్వత మనెడు బుద్ధినే పెంచికొనును. నానా యవస్థల పాలగును. మూలములో

మఱియొక చమత్కారమున్నది 'దేహాపత్య కళత్రాదిష్వాత్మసైన్యేష్వ సత్స్వపి' అని మూలము సైన్యము లెప్పుడును దమ నాయకుని రక్షించికొనుచుండే యప్రమత్తులుగా నుందురు. కాని యీ సైన్యము లట్టివి గావు. తమ నాయకునకే వినాశ మొడఁగూర్చును అందుకే అసత్సు=నమ్మఁదగినవి గావని తాత్పర్యము.

కావునన్ = అందుచేత, సర్వాత్ముఁడు = సర్వులయందు నాత్మ రూపముగా నున్నవాఁడు, మహావిభవుఁడు=గొప్పయనుభావము గల వాఁడు, ఈశుఁడు = సర్వనియంతయైనవాఁడు, భావ్యుఁడు=తగిన వాఁడు, అభవభాజికిన్=పునర్జన్మము లేకుండఁ జేసికొనవలె ననుకొను వానికి; దీని మూలము. తస్మాద్భారత సర్వాత్మా భగవాన్ హరిరీశ్వరః శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ స్మర్తవ్యశ్చేచ్ఛతాఽభవమ్ అనునది. ఇందలి 'భగవాన్ సర్వాత్మా ఈశ్వరః' అను మూఁడును హరికి విశేషణములు. సర్వాత్మా అనుటతో సర్వశ్రేష్ఠత్వమును జెప్పుచున్నాఁడు. 'భగవాన్' అనుటతో సౌందర్యము సూచితము. ఈశ్వరుఁడు సర్వనియంతయైన వాఁడు, అందుచేత నాశ్రయింపఁదగినవాఁడు, హరిః=బంధహారి యైనవాఁడు తెనుఁగులో విష్ణుశబ్దమునకుఁ దక్కినవి విశేషణములని భావింపవలెను. ఇట్లు చెప్పుటలో నర్థవిశేష మేమి? ఆకర్ణింపఁ దగిన వాఁడు వేఱు, సేవ్యుఁడు వేఱు, వర్ణింపఁ దగినవాఁడు వేఱు అనెడు చిక్కు దొలఁగి పోవుచున్నది, అన్నిటికిని విష్ణువొక్కఁడే యాశ్రయ మనుట సిద్ధించును.

తాత్పర్యము: కనుక సర్వాత్ముఁడును భగవంతుఁడును సర్వ నియంతయు బంధహారకుఁడు నైన శ్రీమహావిష్ణువే కీర్తితవ్యుఁడు, శ్రోతవ్యుఁడు.

సాంఖ్యయోగము గీతలోని మొదటి యధ్యాయములతోఁ బ్రతిపాదింపఁబడినది. 'సాంఖ్య' మను యోగపద్ధతి జనులకెల్లన్

చేత, ధర్మనిష్ఠ వలననైననుఁ=స్వధర్మమునందలి యాసక్తి, తేన్నార్వా హణము, వీనిచేతనైనను, అంత్యకాలమందున్ = మరణకాలమందు, హరిచింతసేయుట = సర్వబంధములను దొలఁగించెడు శ్రీమన్నారాయణ స్మృతి, పుట్టువునకున్=జన్మమునకు, లాభము.

విశేషములు : మూలమందు 'సాంఖ్యయోగాభ్యాం స్వధర్మ పరినిష్ఠయా' అని కలదు. సాంఖ్యం = ఆత్మానాత్మ వివేకః యోగః అష్టాంగః' అని శ్రీధరులవ్యాఖ్య. పోతన్న రెంటిని గలిపి సాంఖ్య యోగ మనివేసినాఁడు. అనఁగా నష్టాంగయోగమం దాతని కెక్కువ తాత్పర్య మున్నట్లు కన్పింపదు. శ్రీధరులు సాంఖ్యమునకుఁ గాని, యోగమునకుఁగాని స్వాతంత్ర్యము లేదనియు నా రెంటికిని ఫలము మరణకాలమందు నారాయణస్మృతిని గల్పించుటయే యనియుఁ జెప్పెను. తెనుఁగులోఁగూడ నట్లే యర్థము చేసికొనవలెను.

తాత్పర్యము : సాంఖ్యయోగము వలనఁ గాని, స్వధర్మము ననుష్ఠించుటచేతఁ గాని కల్గఁ బోయెడి ఫలము మరణ కాలమందు నారాయణస్మృతియే. అది సిద్ధించుటకు జన్మమంతయు శ్రవణకీర్త నాదుల నొనర్పవలెను. శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టో ఒభి జాయతే' అని యారంభించి 'అనేక జన్మసంసిద్ధః తతో యాతి పరాం గతిమ్' అని యుపసంహార మొనర్చుటచేత యోగముచేత సాధింపఁ బడున దంతిమ దేహమే. 'బహూనాం జన్మనామంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే' అను వాక్యముచేతను 'జ్ఞానిభ్యోపి మతోధికః' అను ప్రశంసావాక్యముచేతను సాంఖ్యముచేత సాధింపఁబడునదియు నంతిమ జన్మయే. భగవద్ధర్మములైన వ్రతోపవాసాదులచేత భగవ దీయ దేహము సాధింపఁ బడుచున్నది. కనుక 'యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్, తం తమేవైతి కౌంతేయ! సదా తద్భావ భావితః' అను వాక్యము చేతను, 'మన్మనా భవ మద్భక్తో

ఉసిమే' అనుటచేతను, 'మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వ తమ్, నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః' ఇత్యాదుల చేతను పై విషయమే చెప్పఁబడుచున్నదని తెలియవలెను.

అరసి=విచారించి, జ్ఞానపూర్వకముగా నని యర్థము. నిర్గుణ బ్రహ్మంబున్ = గుణాతీతమైన నిర్గుణబ్రహ్మమును, ఆశ్రయించి= తమ కధిష్ఠానముగా నేర్పఱచికొన్నవారలై, విధినిషేధ నివృత్త సద్విమల మతులు = వేదములు విధించెడు, విధి, నిషేధము అను నీ రెంటి నుండియు,నివృత్త=మరలిన, సత్ =శుభకరమైన, విమల=స్వచ్ఛమైన, మతులు=బుద్ధిగలవారు, మానసంబులన్=మనస్సులందు, ఏ ప్రొద్దున్ =నిరంతరమును, హరిగుణచింతనములు = హరిగుణములనుగూర్చిన స్మరణములు చేయుచుందురు, మానవేంద్ర =రాజశ్రేష్ఠుఁడా!

తాత్పర్యము : త్రిగుణాతీతమైన నిర్గుణబ్రహ్మమునే ధ్యానమం దుంచికొని వేదము విధించెడు విధినిషేధముల నుండి నివృత్తులై స్వచ్ఛమైన బుద్ధిగలవారై నిరంతరమును మనస్సులందు హరిగుణ చింతనములు సేయుచుందురు.

వేదము కొన్నిటిని నిషేధించుచున్నది. 'సత్యం వద, ధర్మం చర' ఇత్యాదులు విధులు. కలంజ భక్షణాదులు నిషేధములు. ఈ రెంటి నుండియుఁ దప్పించికొన్నవారు విధి నిషేధాత్మకములైన వేదబోధిత ములైన కామ్యకర్మలనుండి తప్పించికొన్న వారని యర్థము. హరి గుణచింతనము లనఁగా హరిరూపమును ధ్యానించుటతోఁ గూడ హరి గుణములను ధ్యానించుట, ఏ ప్రొద్దున్=సర్వకాల సర్వావస్థలందును శుద్ధ్యశుద్ధుల వివక్షలేక మనస్సుతో గుణచింతనము లొనర్చుచుండవలె నని యర్థము. బాహ్యముగఁ గూడ గుణచింతనాదులకు శుద్ధ్యశుద్ధి నియమము లేదు. స్మర్తవ్యః విష్ణుః విస్మర్తవ్యో న జాతుచిత్ సర్వే

విధినిషేధా స్స్య రేతయో రేవ కింకరాః అని ప్రమాణము. నిర్గుణ బ్రహ్మోపాసకులకు గుణచింతనముతో నేమి పని? ఆత్మానుభవముతో నేర్పడెడు నానందమే వేఱు. గుణకీర్తనముతో నేర్పడెడు నానందము భిన్నము. అందుచే నిర్గుణోపాసకులైన వారును గుణానుకథనమందు రమింతురు. ఆత్మానుభూతితో నేర్పడెడు సుఖమునకంటెను గుణానుకథన సుఖమే గొప్పదని తాత్పర్యము. సద్విమలమతులు=వేదచోదితములైన విధినిషేధముల నుండి నివృత్తులైనంత మాత్రముతో నిష్టము వచ్చినట్లు ప్రవర్తించువారు గారని తాత్పర్యము. వారి మనస్సులు హరి చింతనతో విమలములై యుండును. నిరంతరము సన్మార్గమందే వారి చిత్తవృత్తులకుఁ బ్రవృత్తి. వారు చెప్పినది చేసినది ఈ రెండును ధర్మములైనను సాంప్రదాయికమైన ధర్మమునకు వారెప్పుడును భిన్నముగా చెప్పరు. ఆచరింపరు. వారి సంస్కారవిశేషములే యా రీతిగాఁ బరిణతములై యుండును. విధినిషేధములు మాకులేవని ఇష్టము వచ్చినట్లు ప్రవర్తింపఁ జూచు ధూర్తులను గుఱించి తుకారాముఁ డిట్లు మందలించు చున్నాఁడు-

> పరిమళ ష్టాణూని చోఱూనయేఫూల్ ఖావూవయే మూళ్ అవడతే
> మోతియాంచే పాణీచాహూనయే స్వాద్ యంత్రభేదూని నాదసాహూనయే
> కరఫల ష్టాణూని ఇచ్ఛూనయేకామ్ తుకాష్టాణే వర్మదావూలోకా.

ఓయి మానవుఁడా! వాసనలు బాగా వచ్చునని పూలను నలుపవద్దు. రుచి యెక్కువేమో యని ఫలవృక్షముల మూలములను ద్రవ్వుటకు యత్నింపకుము. ముత్యములోని నీరు ద్రావకుము. యంత్రమును భేదించి నాదసౌభాగ్యమును జూడవలదు. కర్మఫలమని నీ యిష్టము వచ్చినట్లు భోగముల ననుభవింపకుము. సాధనయొక్క మర్మ మిదే సుమా!

నాదు తండ్రి ద్వైపాయనుఁడు – నా తండ్రి పరాశరాత్మజుఁడైన వ్యాసుఁడు, ద్వాపరవేళన్ – ద్వాపరాంతమందు, బ్రహ్మసమ్మిత

చదివించెను, బ్రహ్మతత్పరుఁడనై=బ్రహ్మమునం దాసక్తి గలవాఁడనై, ఉత్తమశ్లోక లీలోత్సవమునన్=ఉత్తమమైన కీర్తిగల భగవంతుని లీలా ఉత్సవముచేత, ఆకృష్టచిత్తుండనై=ఆకర్షింపఁబడిన మనస్సు గలవాఁడనై, పఠించితన్=చదివితిని, హరిపాద భక్తుండవగుటఁ జేసి=నీవు శ్రీహరికి సర్వోత్తముఁడవైన భక్తుఁడ వగుటచేత, ఎఱిఁగింతున్ వినవయ్యా!, ఈ భాగవతమునన్=ఈ భాగవతమును నిరంతర మధ్యయనము చేయుటచేత, విష్ణుసేవాబుద్ధి విస్తరిల్లు=శ్రీమహావిష్ణు సేవయందాసక్తి యభివృద్ధి పొందును, మోక్షకామునకును=మోక్షము గోరువానికి—వ్యధికరణ బహువ్రీహి, మోక్షంబు సిద్ధించున్=మోక్షప్రాప్తి యేర్పడును, భవభయంబులెల్లన్=సంసారభయము లెల్లను, పాసిపోవున్=తొలఁగును, యోగిసంఘమునకున్=భక్తి జ్ఞాన కర్మయోగులకు, వాసుదేవ నామవర్ణనములు=శ్రీమహావిష్ణువుయొక్క నామసంకీర్తనములు, ఉత్తమవ్రతములు=గొప్పవైన వ్రతములు.

తాత్పర్యము: ఓ మహారాజా! నా తండ్రి ద్వాపరాంతమందు సర్వవేదసారమై వేదస్వరూపముతో సమానమైన యీ భాగవతమును నా కుపదేశించినాఁడు. భాగవతము శాస్త్రమగుటచే స్వబుద్ధికి శాస్త్రార్థములను గ్రహించుట దుష్కరము గనుక నా తండ్రినుండి యీ శాస్త్రము నభ్యసించితిని. దీనిని నే నభ్యసించుట కంతమాత్రమే కారణము గాదు. ఇందు వర్ణింపఁబడు సగుణబ్రహ్మ సర్వమనోహరమైనది. ఆత్మానుభూతికంటె నీ యానందము విలక్షణము. అందుకే యుత్తమశ్లోకుఁడైన పరమాత్ముని లీలావిశేషములు నన్నాకర్షించినవి. ఉత్తమములైన కీర్తులుగల హరి భక్తుల లీలలు గూడ నన్నాకర్షించినవి. అందుచే నైర్గుణ్య పరినిష్ఠితుఁడ నైనను భాగవతశాస్త్రమును బఠించితిని. నీవు హరి భక్తుఁడవు. నీ వంటి వారికే భాగవత మర్థమగును. యోగ్యుఁడైన యధికారి దొరకినపుడు దా నెఱిఁగిన రహస్యములు

వినిపింపవలెనని యెవ్వనికైనను బుద్ధి వొడమును. పరమోత్తమమైన యీ భాగవతశాస్త్రము హరి స్వరూపము. పన్నెండు స్కంధములు నాతని స్వరూపము. అందుకే బ్రహ్మసమ్మిత మనుటలో నాశ్చర్యము లేదు. దీనిని నిరంతరము పఠించుటచేత విష్ణుసేవాసక్తి యేర్పడును. మోక్షమును గోరువారికి ముక్తి సిద్ధించును ముక్తులైన వారికి విలక్షణమైన యానంద మేర్పడును. సంసార కష్టములతో విసిగినట్టి ముముక్షువులకు దీని ప్రభావముచే భవభయములు దొలఁగును. జ్ఞానులకును భక్తులకును వాసుదేవుని నామ వర్ణనములు ఉత్తమము లైన వ్రతములు.

బ్రహ్మసమ్మితం - 'బ్రహ్మసత్యం సమ్యక్ మితం యేన' సత్యపదార్థమైన బ్రహ్మము చక్కఁగా దీనియందుఁ బ్రతిపాదింపఁ బడుచున్నది గనుక బ్రహ్మసమ్మితమని శ్రీధరులు. సర్వోపనిషత్సారభూత మగుటచే వేదముతో సమానమైనది. దీనియందలి స్కంధములన్నియు భగవంతుని యవయవ రూపములని ముందే వ్యాఖ్యలో నిరూపించినాను. భాగవతము 'భగవంత మధికృత్య కృతం', 'భాగవతాః ప్రోక్తః' 'భాగవత ఇదం' అని మూఁడు రీతులుగా వ్యాఖ్యాతలు చెప్పిరి. భగవంతుఁడు చతుశ్శ్లోకీరూపముగా మొదలు బ్రహ్మ కుపదేశించెను. బ్రహ్మదేవుఁడు వ్యాసున కుపదేశించినాఁడు. అతఁడు చతుశ్శ్లోకిని విస్తరించి యష్టాదశ సహస్రగ్రంథముగాఁ జేసినాఁడు. తండ్రినుండి శుకునకుఁ బ్రాప్తమైనది. శుకుఁడు పరీక్షిత్తున కుపదేశించెను. సూతుఁడు శౌనకాదుల కుపదేశించినాఁడు, ఇది పరంపర. కనుక ప్రథమోపదేశకుఁడు శ్రీమన్నారాయణుఁడు. భగవంత మధికృత్య కృతం - భగవంతుని యొక్కయు, భగవద్భక్తులయొక్కయు లీలలను వర్ణించుటకై యేర్పడినది. భాగవత ఇదం- భాగవతము కేవలము భగవద్విషయమునే చెప్పును. ఇతర మేమియు నిందులో లేదు. బ్రహ్మతత్త్వరూఁడన్నై సగుణ బ్రహ్మయం దాసక్తి గలవాఁడనై - 'ఉత్తమ శ్లోక లీలయా' అని

ఆకృష్ట యనుటకంటె 'గృహీత' యనునది మెఱుఁగైన పదము. 'కృష్ణగ్రహ గృహీతాత్మా 'అని ప్రహ్లాదచరిత్రలోను వచ్చును. విష్ణుసేవా బుద్ధి విస్తరిల్లు-'స్యాన్ముకుందే మతిస్సతీ' అని మూలము. మోక్షకామి= మోక్షమునందుఁ గోర్కిగలవాఁడు. ఈ భాగమునకు మూలశ్లోక మిది-

ఏతన్నిర్విద్యమానానా మిచ్ఛతా మకుతోభయమ్,
యోగినాం నృప! నిర్ణీతం హరే ర్నామానుకీర్తనమ్.

సంసారమునకు సంబంధించిన కష్టములకుఁజిక్కి వానినిఁ బోఁగొట్టు కొనుటకై భగవంతుని భజించువారు నిర్విద్యమానులు. మోక్షమును గోరువారు ముముక్షువులు. ముక్తులైనవారు యోగులు. ఈ ముప్వ రికిని హరినామ కీర్తనము ప్రశస్తమైన మార్గము. కనుక పోతన్నగారి గీతమునకు శ్లోకానుగుణముగనే యర్థము చెప్పికొనవలెను. నిర్విద్య మానానాం అనువారిని గూర్చి భవభయంబులెల్లన్ పాసిపోవున్ అని చెప్పుచున్నాఁడు. మొదటి పాదముచేత ముముక్షువులను జెప్పుచు న్నాఁడు. యోగిసంఘమునకున్-అనునది ముక్తులకు సంబంధించిన విషయము. వాసుదేవ నామవర్ణనములు సర్వోత్తమము లైనవి.

వేదాక్షరాణి యావంతి పఠితాని ద్విజాతిభిః,
తావంతి హరినామాని కీర్తితాని న సంశయః. (విష్ణుధర్మము)

ఋగ్వేదో హి యజుర్వేదః సామవేదో హ్యథర్వణః,
అధీతాస్తేన యే నోక్తం హరిరిత్యక్షరద్వయమ్. (స్కాందపురాణము)

మా ఋచో మా యజుశ్శాఖా మా సామ పఠ కించన,
గోవిందేతి హరేర్నామ గేయం గాయస్వ నిత్యశః.

(పాద్మం-రామాష్టోత్తర శతనామస్తోత్రమ్)

అవమన్యచ యే యాంతి భగవత్కీర్తనం నరాః,

ఇత్యాది శ్లోకము లిక్కడ ననుసంధేయములు. నామాపరాధములు లేక నామస్మరణ చేయుట మంచిది. నామాపరాధములు కొన్ని యీ క్రిందివి-

సతాం నిందా నామ్నః పరమమపరాధం వితనుతే,
యతః ఖ్యాతిం యాతం కథముసహతే తద్విగర్హణమ్,
శివస్య శ్రీవిష్ణో ర్య ఇహ గుణనామాది సకలం,
ధియాభిన్నం స్మృత్యే సఖలు హరినామా ఒహితకరః.

గురువు నవమానించుట, శ్రుతిశాస్త్ర నింద, నామమాహాత్మ్య మర్థవాద మనుకొనుట, హరి నామములందుఁ గల్పనాబుద్ధి, నామ బలమును బాపములకై వినియోగించుట, నామజపమును ధర్మవ్రత-త్యాగహుతాది సర్వశుభక్రియలతో సమానమైనదని యనుకొనుట, శ్రద్ధలేని వానికి విముఖుఁడైన వానికి నుపదేశించుట. విష్ణుయామళ మందీ శ్లోక మున్నది-

మమనామాని లోకేఽస్మిన్ శ్రద్ధయా యస్తు కీర్తయేత్,
తస్యాపరాధ కోటీంస్తు క్షమామ్యేవ న సంశయః.

ఇక్కడ నామాపరాధ భిన్నములైన పాపములని యర్థము.

హరిన్ ఎఱుంగక = స్వామిని గూర్చిన ధ్యానమేలేక, బహు హాయనంబులు=ఎక్కువ సంవత్సరములు, మత్తుఁడై=సంసారమునం దెక్కువ యాసక్తి గలవాఁడై, వెఱ్ఱి=వెఱ్ఱివాఁడు, ముక్తికిన్ పోవన నేర్చునె=ముక్తి నందునా? వాఁడు ఎన్నఁడున్ సంసరణమున్ పెడఁ బాయఁడు = వాఁ డెన్నటికీ గాని జన్మ మరణ రూపమైన సంసార బంధమునుండి విముక్తుఁడు గాలేఁడు. ఆ హరినామ సంస్మరణము= ఆ శ్రీమహావిష్ణువు నామకీర్తనము, ముక్తిదము=మోక్ష మిచ్చునది.

తాత్పర్యము: రాజా! హరినిగూర్చిన ధ్యానమేలేక సంసార మం దాసక్తుఁడై యెన్ని సంవత్సరములు బ్రతికినను మరణమే ... వాఁ

డెన్నఁడును ముక్తి నందలేఁడు. జన్మమరణ రూపమైన సంసారము నుండి వానికి విముక్తి లేదు. త్రికరణశుద్ధిగా హరినామస్మరణ మొక్క ముహూర్తము చేసినను నది ముక్తి నొసంగ సమర్థమై యుండును.

తొల్లి = పూర్వకాలమందు, శక్రాది దివిజులు = దేవేంద్రుఁడు మొదలైన దేవతలు, సంగ్రామభూములన్ = యుద్ధరంగము లందు, ఉగ్రదానవులకున్ = భయంకరులైన రాక్షసులకు, దానవవిభులన్ = రాక్షసరాజులను, ఒండువరము ఒల్లన్ = వేఱువరము సమ్మతింపను, గగనయానమునన్ = విమానముచే,

తాత్పర్యము: ఓ నృపాలా! పూర్వకాలమున ఖట్వాంగుఁడను నొక రా జుండెను. అతఁడు సమస్తభూమి నేలుచుండినాఁడు. 'సప్త ద్వీపా వసుంధరా'. దేవతలకు రాక్షసులకు యుద్ధము జరిగినది. రాక్షసుల కోడివచ్చి దేవత లీతనిని సాయము గోరిరి. అతఁడు సమ్మతించి పోరి రాక్షసుల జయించినాఁడు. వారు వర మిత్తు మన్నారు. 'నా కాయు వెంతయో చెప్పుఁడని' రాజు వారిని వేఁడెను. వా రొక ముహూర్త మన్నారు. అతఁడు విమానమునెక్కి భూమికి వచ్చినాఁడు. స్వర్గము భోగభూమి. అందుచే నక్కడ మోక్షముసాధింప వీలుపడదు. కనుక నాతఁడు భూమికి దిగివచ్చెను.

గిరులం బోలెడి కరులను = పర్వతములతో సమానమైన యేనుఁగులను, హరులన్ = గుఱ్ఱములను, ప్రాణదయితల్ = ప్రాణమునకుఁ బ్రియురాండ్రై, మనియెడి సుందరులను = జీవించెడు సుందరులైన స్త్రీలను, హితకరులను = హితమును గల్గించువారిని, బుధవరులను = పండితులను, వర్జించి = వదలి, గాఢవైరాగ్యమునన్ = ప్రబలమైన వైరాగ్యముతో.

తాత్పర్యము: పర్వతములఁ బోలు కరులపై నాశ వదలెను.

సైన్యముల పైనను, వాని నాశ్రయించిన రాజవిభవముల పైనను, ధనాదులపైనను ఆశ వదలుకొన్నాఁడని యర్థము. ప్రాణమునకుఁ బ్రియులైన సుందరులపై నాశను గోసివేసినాఁడు. వీరినిఁ బ్రత్యేకముగాఁ జెప్పుట మానవులకు వీరిపొత్తు వదలుట దుష్కరమైన దాని వలన. హితకారులను బుధవరులను ఈ రెంటికిని దాత్పర్యము జితసంగుఁడై యనుటయే. హితాహితములతో సంబంధము లేకుండుటచే హితులైన మనుష్యులతోను సంబంధము నుండదు గదా! పండితులలో ననేక సంప్రదాయము లుండును. ఒక్కొక్క రది యదియే గొప్పదని వాదింతురు. ఇవియన్నియు నొకరీతిగాఁ జిత్తవిక్షేపమునకుఁ గారణము లగును. ఇంతకును నన్నిటికి నావశ్యకమైనది వైరాగ్యము. ఆ కీలెఱిఁగినవాఁడు గనుక ఋభ్వంగుఁడు గాఢవైరాగ్యమును వహించెనని భావము.

వైరాగ్య మనఁగా నేమి? దీనిని పతంజలియోగ సూత్రములలో వివరించుచున్నాఁడు.

దృష్టానుశ్రవిక విషయ వితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యం — దృష్టానుశ్రవిక విషయవితృష్ణస్య = చూడఁబడిన, వినఁబడిన సమస్త విషయములందును తృష్ణారహితమైన మనస్సుయొక్క, వశీకారసంజ్ఞా = వశీకార మనెడు నవస్థయేది గలదో, తత్ వైరాగ్యం = దానికే వైరాగ్య మని పేరు. అంతఃకరణము, ఇంద్రియములు - వీని మూలమునఁ బ్రత్యక్షముగా ననుభవమునకు వచ్చు నీ లోకమునకు సంబంధించిన సమస్త భోగముల సమాహార మిక్కడ 'దృష్ట' శబ్దముచేతఁ జేయఁబడినది. ఏ సుఖములకుఁ బ్రత్యక్షముగా నీ లోకమున ననుభూతి లేదో, వేదశాస్త్రములచేత నేవి పొగడఁబడినవో, అనుభవించువారి చేత కథలద్వారా నేవి వినఁబడినవో యవి యన్నియు నానుశ్రవికములు. అనఁగా స్వర్గాదిసుఖము లన్నమాట. ఈ రెండు విధములైన భోగ

సర్వదా నాశనమైనప్పుడు అట్టి కామనారహితమైన చిత్తముయొక్క వశీకార మనెడు నవస్థా విశేషమునకే వైరాగ్యమని పేరు. ఇది అపర వైరాగ్యము.

తత్పరం పురుషఖ్యాతేర్గుణవైతృష్ణ్యం- పురుషఖ్యాతేః=పురుషుని యొక్క జ్ఞానముచేత, గుణవైతృష్ణ్యం = ప్రకృతి గుణములందు, ఆశ సర్వథా నాశనమైనట్టి. తత్ = ఏ పరిస్థితి గలదో దానికి, పరం=పర వైరాగ్యమని పేరు. ముందు చెప్పిన చిత్తముయొక్క వశీకారమనెడు వైరాగ్యముతో సాధకుని మనస్సునందు విషయవాసనలు పూర్తిగా నశించిపోవును. అప్పుడు వాని చిత్తప్రవాహము సమానభావముతో తనకు ధ్యేయమైన యనుభవముతో నేకాగ్ర మగుచున్నది.

తతః పునః శాంతోదితౌ తుల్యప్రయత్నౌ చిత్తస్యైకాగ్రతా పరిణామః. తతః=అనంతరము, పునః=మరల, శాంతోదితౌ=శాంతములైనట్టి లేక ఉదయమగునట్టి, తుల్యప్రయత్నౌ=రెండు వృత్తులును నొకటియై పోవుచున్నవి అప్పుడు చిత్తస్య=మనస్సునకు, ఏకాగ్రతా పరిణామః=ఏకాగ్రతా పరిణామమని పేరు ఎప్పుడును మనస్సు విక్షిప్తావస్థనుండి ఏకాగ్రతా అవస్థకుఁ బ్రవేశించునో అట్టి సమయమునఁ జిత్తమునకే పరిణామ మేర్పడునో దానికే 'సమాధి పరిణామ' మని పేరు. ఎప్పుడు మనస్సు చక్కఁగా సమాహిత మగునో తర్వాతఁ జిత్తమం దేర్పడు పరిణామమునకు 'ఏకాగ్రతా పరిణామ' మని పేరు. దానిలో శాంతించెడు వృత్తియు, ఉదయమయ్యెడు వృత్తియు నొకటియై పోవును ఇట్లుగా సమాధి పరిపక్వమైన తర్వాత ప్రకృతిపురుష వివేకజ్ఞాన ముదయించును. అప్పుడు సాధకునకు త్రిగుణములు వాని కార్యములు-వీనియందు సంపూర్ణముగాఁ దృష్ణ నశించిపోవును. వాఁడాప్తకాముఁడు, వాఁడు నిష్కాముఁడు. ఈ యవస్థకే 'పరవైరాగ్య' మని పేరు.

సోము కర్తనని కోపించి=పరమాత్మను భజించి, రెండుగడియలలో నః
=రెండు గడియలలో, కైవల్యముః చూఱగొనియెః=భయరహిత
మైన శ్రీవిష్ణుస్థానమును బొందెను.

తాత్పర్యము: ఖట్వాంగ మహారాజు దేహము పోవునను భయము విడిచినాఁడు. ఆతఁడు గాఢవైరాగ్యమును ధరించి రెండు గడియలలో నిర్భయస్థానమైన శ్రీమహావిష్ణుస్థానమును చేరెను.

ఇక్కడ కైవల్య శబ్దమునకు ముక్తిని బొందెననియే భావము. 'గతవా నభయం హరిమ్' అని మూలము. కైవల్య శబ్దమునకు యోగులు విశేషార్థమును జెప్పినారు. 'తదభావా త్సంయోగాభావో హానం తద్దృశేః కైవల్యమ్'. తదభావాత్ = అవిద్యా భావమువలన (అవిద్య లేకపోవుటవలన), సంయోగాభావః=సంయోగముయొక్క అభావమేర్పడును, హానం=పునర్జన్మాది భావిదుఃఖముల యత్యంతా భావము గల్గును, తత్ = అదియే, దృశేః = చేతనాత్మకు, కైవల్యం= కైవల్య మని పిలువఁబడెడు స్థితి. ఆత్మదర్శన రూపమైన జ్ఞానముతో నవిద్య పూర్తిగా నశించినప్పుడు అజ్ఞానజనితమైన సంయోగమునకుఁ బూర్తిగా ననుభావ మేర్పడును. అప్పుడు పురుషునికి ప్రకృతితో నే సంబంధముగూడ నుండదు. వాని జన్మమరణాదులైన సంపూర్ణ దుఃఖములు సర్వథా సర్వదా నశించును. వాఁడు తన స్వస్వరూప స్థితుఁడై యుండును. దీనికే కైవల్యమని పేరు. ఈ యర్థమున నిచ్చట నీ శబ్దము వాడినట్లుఁ గన్పింపదు. కేవలము 'ముక్తి' యను నర్థ మందే వాడఁబడినది.

జీవితాంతము=బ్రదుకుయొక్క ముగింపు. తావత్కాలంబునకున్= అంతకాలములోపల, పారలౌకిక సాధనము=పరలోకమునకు సంబం

ధించిన, పరమకల్యాణంబున్=ఉత్తమమైన కల్యాణమును, సంపాదింప వచ్చున్=పొందవచ్చును, అంత్యకాలంబు డగ్గఱినన్=మరణము సమీపించినపుడు, బెగ్గడిలక=శరీరము నశించునను భయములేక, దేహి=జీవుఁడు, దేహ....సందోహంబు=దేహము పుత్త్రులు భార్య వారి ననుసరించినవారు, వీరిపై మోహసాలంబు=మోహ మనెడు వృక్షమును, నిష్కామకరవాలంబునన్=తృష్ణారాహిత్యమను ఖడ్గముచేత, నిర్మూలనంబుచేసి = ఖండించి, పుణ్యతీర్థ జలావగాహంబు = పుణ్యతీర్థముల జలమందు స్నానాదుల నొనర్చుటు, ఏకాంత శుచి ప్రదేశంబునన్=జనసంస్గరము లేని శుద్ధమైనచోటులందు, విధివత్ప్రకారంబునన్=శాస్త్రమందుఁ జెప్పఁబడినట్లుగా, కుశ అజినచేలంబులతోడన్=దర్భలు, జింకచర్మము, వస్త్రము మొదలైన వానిచేత, కల్పితాసనుండై=ఏర్పఱచికొనఁ బడిన యాసనము గలవాఁడై, నిఖిలజగత్పవిత్రీకరణ సమర్థము = సమస్త లోకములను బవిత్రములుగాఁ జేయ శక్తిగలది, అకారాది త్రివర్ణకలితంబు = 'అకార, ఉకార, మకారము' లనెడు మూఁడు వర్ణములచేతఁ గూడినది. బ్రహ్మబీజంబు=బ్రహ్మవాచకమైన బీజాక్షరము, ప్రణవంబున్ సంస్మరింపుచు = ప్రణవ జపముచేయుచు, వాయువుల జయించి=ప్రాణాయామముతో నుచ్ఛ్వాస నిశ్వాసముల నరికట్టి, విషయంబుల వెంటనంటి పాఱెడి నింద్రియంబులన్=విషయములచే నాకర్షింపఁబడి వాని వెంటఁ బరువెత్తెడు ఇంద్రియములను, బుద్ధిసారథియై = బుద్ధి నిశ్చయాత్మక మగుటచేత - దాని సహాయముతో, మనోనామకంబులైన పగ్గంబులన్ = మన స్సనెడు పగ్గములచేత, బిగ్గంబట్టి=బిగించి, మ్రొగ్గన్ తిగిచి=మరలించి, దట్టంబులైన కర్మఘట్టంబులన్=జన్మజన్మలనుండి సంక్రమించిన కర్మఫలముల చేత, ఇట్టట్టుమెట్టెడు మనంబును=విక్షిప్తమగు మనస్సును, శేముషీ బలంబునన్=బుద్ధిబలముచేత, నిరోధించి=అడగించి, భగవదాకారంబు

నిర్విషయంబైన మనంబునన్ = విషయవాసనలు లేశముగూడ లేని మనస్సుతో, భగవత్ + పాదాది + అవయవంబులన్ = భగవంతుని పాదములనుండి తలవఱకున్న యవయవములను, క్రమంబునన్ = వరుసగా, ధ్యానంబు సేయుచున్, రజస్తమో గుణములచేతన్ = రజస్సు తమస్సు ననెడు గుణద్వయముచేత, ఆక్షిప్తంబును విమూఢంబుననగు చిత్తంబు = రజోగుణముచేతఁ బలువెంతలఁ బాఱాడునదియు, తమో గుణముచేత విమోహితము నగు మనస్సును, ధారణావశంబునన్ = ధారణాసహాయముతో, తత్ + గుణంబులవలనన్ = రజస్తమోగుణ ముల వలన నేర్పడెడు, మలంబులన్ పోన్ అడఁచి = దోషములను దొలఁగించికొని, నిర్మల చిత్తంబునన్ = శుద్ధమైన మనస్సుతో, సుఖా త్మకంబగు విషయంబున్ = పరమ మంగళమైన భగవదాకారమును, అవలోకించు యోగికిన్ = ధ్యానపూర్వకముగా వీక్షించెడు యోగ యుక్తునకు, భక్తిలక్షణంబైన యోగంబునన్ = భక్తియోగముచేత, వేగంబ = శీఘ్రముగనే, మోక్షంబు సిద్ధించున్ = ముక్తి యేర్పడును.

తాత్పర్యము : ఓరాజా! నీకు సప్తాహమాయున్నది. ఏడు దినములకుఁ గాని మరణము నీ జీవితమునఁ దొంగిచూడదు. అంత లోపలఁ బారలౌకికమైన సాధనముతోఁ బరమమంగళకరమైన మోక్ష మును సంపాదింపవచ్చును. 'సాంపరాయికం పారలౌకిక సాధనమ్' అని శ్రీధరులు అనుసరింపవలసిన వైరాగ్యమునుఁ జెప్పుచున్నాఁడు- మరణకాలమందు మృత్యుభయ శూన్యుఁడై యుండవలెను. అనాసక్తి యను ఖడ్గముచేత దేహపుత్త్రాలందుఁగల మోహవృక్షమును ఖండింప వలెను. జీవునకు 'దేహి' యనిపేరు. అనఁగా దేహముగలవాఁడు, దేహము జీవున కొక్క తొడుగు; అది శాశ్వతమైనది గాదు. జీవుని స్వరూపము గాదు. దేహము ననుసరించియే పుత్త్రకళత్రాదులు. దేహ బుద్ధి పోయినప్పుడు దాని ననుసరించిన వారిపై యాసక్తి చెప్పకయే పోవును. అటి వా డిల్లువిడిచి పోవలెను. నిస్పృహుఁడైన వాఁడు

గృహ మెందుకు వదలవలెను? గృహమం దున్నచో దానియం దభిమాన మేర్పడుట కవకాశ మెప్పుడైన నేర్పడవచ్చును. అందుచే నాయవకాశము నుండి తప్పించికొన వలెనని భావము. ఏదైన పుణ్యతీర్థమునుజేరి స్నానాదుల నొనర్చుచు కాలము గడుపవలెను. శాస్త్రప్రకారము కుశాజిన చేలములతో నాసనము నేర్పఱచికొన వలెను. వాఁ డేర్పఱచికొను దేశము జనసంఘము లేనిదై యుండవలెను. జనుల రాకపోక లున్నచో నిష్ఠ నిలువదు. ఆ చోటు శుచియైయుండవలెను. లేకున్నచో సాధకునకు మనోవిక్షేప మేర్పడును. సుఖాసనమున నున్నవాఁడై మానసమందు 'అకార, ఉకార, మకారము లనెడు త్రివర్ణకలితమైన యోంకారమును స్మరింపవలెను. అదియే బ్రహ్మను దెలిపెడి బీజాక్షరము, 'తస్యవాచకః ప్రణవః'. ప్రాణాయామముచేత వాయువును నిర్జింపవలెను. ఆ ప్రాణాయామమును బ్రహ్మబీజమును జపించుచునే సేయవలెను. 'మనో యచ్ఛేజ్జితశ్వాసో బ్రహ్మబీజమనుస్మరన్' అని మూలము. అందుకే పోతన్న 'ప్రణవంబు స్మరింపుచున్' అన్నాఁడు. వాయువుల జయించుట ప్రాణాయామము చేతనే. సాధకున కింద్రియములు సంపూర్తిగా వశమై యుండవు. అందుచే వాఁడు విషయముల వెంటఁ బాఱెడు నింద్రియములను బుద్ధిసహాయముతో మరలించికొనవలెను. బుద్ధి నిశ్చయాత్మకమైనది. ఇంద్రియములు విషయముల వెంట గుఱ్ఱములవలె వేగముగాఁ బరువెత్తి పోవును. ఆ యింద్రియాశ్వ సంచారములే శబ్దాది విషయములు. దానినుండి బుద్ధిసారథి యింద్రియాశ్వములను మరలింపవలెను. సారథి యశ్వహృదయము నెఱిఁగినవాఁడు. హయసంచార భేదము లెఱిఁగినవాఁడు. ప్రదేశ నిమ్నోన్నతములకుఁ దగినట్లు గుఱ్ఱములను నడపుటఁ దెలిసినవాఁడు. గమ్యస్థానమునకు రథమును జేర్చునిశ్చయముతో సారథి బయలుదేఱును. నిశ్చయాత్మకమైన బుద్ధి గూడ నంతే. బుద్ధిని సారథికిఁ బోల్చుటలో గొప్పయౌచిత్యమున్నది.

పోయినట్లు నది పోవును. సారథి యాదేశములకైన లోఁబడును. మనస్సు గ్రుడ్డిది. బుద్ధిసారథి మనోనామకములైన పగ్గములను బిగ బట్టి గుఱ్ఱములను దనయిష్టము వచ్చినట్లు నడపును. జన్మజన్మార్జితము లైన ప్రారబ్ధములు మనస్సు ననేకమార్గములఁ ద్రిప్పును. బుద్ధిసారథి వీని నన్నిటి నడ్డగింపవలెను. మూలమందు 'మనస్సనెడు పగ్గములను' అనునర్థము వాచ్యముగా లేదు. 'మనసాబుద్ధి సారథిః' అని మాత్రమే గలదు. పోతన్న యీ యర్థమునే వాచ్యముగాఁ జెప్పినాఁడు. ఉప నిషత్తులలో నిట్లున్నది. 'ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ చ, బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ' ఇంద్రియాణి హయా నాహు ర్విషయాం స్తేషు గోచరాన్-కర్మఘట్టంబులన్ 'కర్మభిరాక్షిప్తం' అని మూలము. 'పుణ్యపాపరూప బహుజన్మానుష్ఠిత కర్మవాసనయా' అని విశిష్టాద్వైత వ్యాఖ్య. 'తద్వాసనాభి రాక్షిప్తం' అని శ్రీధరు లొనర్చిన సంక్షిప్త వ్యాఖ్యకు వివరణమే విశిష్టాద్వైత వ్యాఖ్య. భగ వంతుని యొక్క పాదాద్యవయవములను గ్రమముగా ధ్యానింప వలెను. ఈ ధ్యానమందు సమగ్రమైన రూపము మఱచి పోరాదు. 'అవ్యచ్ఛిన్నేన చేతసా' అని మూలము. ధారణావశంబునన్ 'ఆత్మ విశేషే సామాన్యతః చిత్తస్థిరీకరణంధారణా' అవయవ విభావనయా తద్దార్ఢ్యం ధ్యానమితి భేదః తత్ర చ మనోవృత్తేర్విలయ స్సమాధి రితి వివేకః అని శ్రీధరులు. రజస్తమోగుణములచే మనస్సు చెదరి పోవును. రజస్సు కర్మప్రధానమైనది. అందుచే మనస్సును బలువెంటలఁ ద్రిప్పును. తమోగుణముతో నది విమూఢ మగును. ఈ రెంటినుండి సాధకుఁడు దప్పించి కొనవలెను. సుఖాత్మకంబగు విషయంబున్= పరమసుఖాత్మకమైన భగవద్రూప మనెడు విషయమును, అవలోకించు యోగికిన్ = ధ్యానపూర్వకముగా వీక్షించెడు యోగము నభ్యసించు సాధకునకు, భక్తిలక్షణమైన యోగము సులభముగా సిద్ధించును. శుకబ్రహ్మ యన్న యీ మాటలను విని పరీక్షిత్తు మఱలఁ బ్రశ్నించి నాఁడు.

ధారణ యేక్రియ నిలుచును?—ధారణ ఏ పద్ధతితో సాఁగును? ధారణకున్ ఏ రూపము?—ధారణయొక్క స్వరూప మేది? 'యాదృశీ' అని మూలము. ధారణ అనఁగా నెద్ది?—దేనిని ధారణయని పిలుతురు? ధారణపురుషుని మనోమలము ఏ రీతిన్ హరించున్— ఈ ధారణ మనుష్యుని యొక్క మనోదోషముల నెట్లు పోఁగొట్టును? నాకున ఎఱిఁగింపఁగదే!—నాకుఁ దెలుపవలెను. దీనికి మూలశ్లోకము—

యథా సంధార్యతే బ్రహ్మన్! ధారణా యత్ర సమ్మతా,
యాదృశీవా హరే దాశుపురుషస్య మనోమలమ్.

ఓ మహర్షీ! ధారణ స్థిరముగాఁ గుదురుటెట్లు? దాని స్వరూప మేమి? మఱి విశేషము లేవి? అది పురుషునియొక్క మనోదోషముల నెట్లు పోఁగొట్టును? దయచేసి నా కెఱింగింపవలెను. శ్రీధరుఁడు 'చిత్తస్థిరీకరణం ధారణా' అని చెప్పినాఁడు. పతంజలి తన యోగ సూత్రములో ధారణాస్వరూప మిట్లు వివరించెను. 'దేశబంధ శ్చిత్తస్య ధారణా' 'చిత్తస్సదేశబంధః'- శరీరమునకు లోపలఁ గాని బయటఁ గాని యేదో యొకచోట లేక విషయమందు చిత్తము స్థిరముగా నిలుచుటకు ధారణ యని పేరు. నాభిచక్రము, హృదయకమలము మొదలైనవి శరీరములోపలి భాగములు. ఆకాశము, సూర్యచంద్రులు మొదలైన దేవతలు లేక యేదైన మూర్తివిశేషము మఱి యేదైన పదార్థము ఇవన్నియు బయట నుండునవి. వీనిలో నేదో యొక దానియందుఁ జిత్తమును స్థిరముగా నిలుపుటకు ధారణ యని పేరు.

అనిన విని రాజునకు అవధూతవల్లభుఁ డిట్లనియె-

అవధూతవల్లభుఁడు = అవధూతలలో శ్రేష్ఠుఁడు. అవధూత

పవనము నియమించి = ప్రాణాయామముతోఁ బ్రాణముల నరికట్టి, పరిహృతసంగుఁడై = జనులతోడి సంబంధమును బూర్తిగా వదలుకొన్నవాఁడై. జను లనఁగా దార పుత్త్రాదులు గూడ, ఇంద్రియ వర్గమున్ ఎల్లన్ ఆపి=అన్ని యింద్రియములను విషయముల వెంటఁ బోనీక యరికట్టినవాఁడై, హరి విశాలరూపమందున్=జగత్తునందున్న శ్రీమహావిష్ణువుయొక్క విశాలరూపమైన రూపమందు, చిత్తమున్‌చేర్చి = ధారణతో మనస్సును నిలిపి, బుద్ధి నెఱపి = బుద్ధిసహాయముతో, బుధుఁడు = బుద్ధి గలవాఁడు, నిలుపన్ వలయున్=స్థిరముగా నిలుప వలయును.

ఈ పద్యమునకు మూల మిట్లున్నది—

**జితాసనో జితశ్వాసో జితసంగో జితేంద్రియః,**
**స్థూలే భగవతో రూపే మనస్సంధారయే ద్ధియా.**

జితాసనః=చాలసేపు ఒకటే యాసనమునందుఁ గూర్చుండుట కలవాటు చేసికొని దానిని వశీకరించుకొన్నవాఁడై, 'స్థిర సుఖ మాసనం' అని పతంజలి సూత్రము. స్థిరసుఖం=నిశ్చలముగా సుఖ పూర్వకముగాఁ గూర్చుండుటకే యాసన మని పేరు. హఠయోగ ములో ననేకాసనములు చెప్పఁబడినవి. కాని పతంజలి సాధకున కిష్ట మైన యాసనముందుండ వచ్చునన్నాఁడు. సాధకుఁడు తనయోగ్యత ననుసరించి యెట్లు కూర్చున్నచో నటు నిటు మెదలుట, శారీరక బాధ మొదలైనవిలేక స్థిరముగాఁ గొంతకాలము కూర్చుండుటకు వీలగునో యట్లు కూర్చొనవచ్చును. ఇంతేకాదు ఏ యాసనమునందు కూర్చుండి సాధన మొనర్చునో దానికిని యాసన మని పేరు. ఈ విషయమందు గీత యిట్లు చెప్పుచున్నది—

**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః,**
**నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరమ్.**

తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మ విశుద్ధయే.

సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్.
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీతమత్పరః.

తాత్పర్యము: సాధకుఁడైనవాఁడు పరిశుద్ధమైన ప్రదేశమునఁ గూర్చుండవలెను. ఆసనము ఎక్కువ యెత్తుండరాదు. తగ్గులో నున్నదియుఁ గారాదు. చేలము, అజినము, దర్భలు, పైనఁ గప్పికొను వస్త్రము-వీనిలో దేనినైనను క్రిందఁ బఱచికొనవలెను. వాఁడు మనస్సును నిరోధింపవలెను. ఇంద్రియముల నిరోధింపవలెను. ఏకాగ్రమనస్కుఁడై చిత్తశుద్ధికొఱకు యోగము నభ్యసింపవలెను. మేరుదండము, కంఠము, శిరస్సు-వీనిని సమానముగ స్థిరముగ నిలిపినవాఁడైన న్నొక్కనినే భావించుచు బ్రహ్మచారియై మనస్సును నియమించి నాయందుఁ జిత్తమును జేర్చి సమాహితుఁడై యుండవలెను.

ఇక్కడ విధింపఁబడినది నాసికాగ్రదర్శనము గాదు. దృష్టిని నిరోధము చేయుటయే చెప్పఁబడినది. నాసికాగ్రమున మనస్సును స్థిర మొనర్చుట యుద్దేశ్యము గాదు. మనస్సును నిల్పవలసిన దాత్మయందే. నాసికాగ్రమునకు భ్రూమధ్యమని గూడ నర్థము చెప్పఁబడుచున్నది. గురుశుశ్రూష, భిక్షాన్నగ్రహణము, మైథునవర్జనము, శాస్త్రపఠనము అను నియమములతోఁ గూడినది బ్రహ్మచర్యవ్రతము. జితశ్వాసః = వాయువును నిరోధింపవలెను. ఎట్లు? ప్రాణాయామముతో నని యర్థము. ప్రాణాయామ మనఁగా నేమి? తస్మిన్ సతి శ్వాస ప్రశ్వాసయోర్గతి విచ్ఛేదః ప్రాణాయామః, తస్మిన్ సతి=ఆసన సిద్ధి యేర్పఁడగా, శ్వాసప్రశ్వాసయోః=శ్వాసప్రశ్వాసముల యొక్క, గతివిచ్ఛేదః=గతిని నిరోధించుట, ప్రాణాయామః=ప్రాణవాయువు, శరీరమందు ప్రవేశించుట శ్వాసము, బయటికి వచ్చుట ప్రశ్వాసము.

ఈ రెండు క్రియలు లేకపోవుట అనఁగా ప్రాణవాయువుయొక్క గమనాగమనములు లేకపోవుట. దీనికే ప్రాణాయామ మని పేరు. ఆసనసిద్ధి యేర్పడిన తర్వాతనే ప్రాణాయామము చేయవలెను. ఇది పరమావశ్యకము. ఈ ప్రాణాయామము మూఁడు రీతులు. 'బాహ్యాభ్యంతరస్తంభ వృత్తిర్దేశ కాలసంఖ్యాభిః పరిదృష్టో దీర్ఘసూక్ష్మః. బాహ్యాభ్యంతర స్తంభవృత్తిః = ఈ ప్రాణాయామము, బాహ్యావృత్తి, అభ్యంతరవృత్తి, స్తంభవృత్తి యని మూఁడురీతులు. ఇది దేశ కాల సంఖ్యాదిః=దేశము, కాలము, సంఖ్య అను వీనిమూలమున, పరిదృష్టః =చూడఁబడుచున్నది. దీర్ఘసూక్ష్మః = దీర్ఘము, సూక్ష్మమునై ప్రవర్తించుచున్నది, బాహ్యావృత్తిః = ప్రాణవాయువును బయటికి వదలి దానిని బయటనే నిలిపి సుఖపూర్వకముగా నుండుట, ఎంతకాలము బయటనుండునో పరీక్షించుట. బయటికి విడిచిన ప్రాణవాయు వెచట నున్నది? ఎంతసే పున్నది? ఆ యింతసేపటిలో స్వాభావికమైన ప్రాణముయొక్క గతి యెన్ని సంఖ్యలగునో దాని నూహింపవలెను. దీనికే బాహ్యావృత్తి ప్రాణాయామ మనిపేరు. రేచకవృత్తి యనియు నందురు. సాధన చేయఁగా చేయఁగా ప్రాణవాయువును బయటనే చాలసే పుంచఁ గలుగుచున్నాఁడు, ఆ స్థితి యనాయాసముగఁ గూడ నుండును. అభ్యంతరవృత్తి=వాయువును లోనికిఁ బంపి, యచటనే యెంతకాలము బిగఁబట్టుటకు సాధ్యమగునో యంతకాల ముండుట. ఈ వాయు వభ్యంతరదేశములో నే హద్దువఱకుఁ బ్రవేశించునో చూడవలెను. ఎంతవఱకు సుఖపూర్వకముగా నుండునో తెలియవలెను. ఆ కాలములో వాయువుయొక్క స్వాభావికగతి యెంత యుండఁ దగునో లెక్కింపవలెను. దీనికి పూరక మని పేరు. అభ్యాసముతో దీనిలో ననాయాసస్థితి సిద్ధించును. స్తంభవృత్తి=ఉచ్ఛ్వాస నిశ్వాసముల స్వాభావికమైన గతి యేది గలదో దాని నడ్డగించుట. దీనికే

నిలిచినదో గమనించుచుండవలెను. ఎంతప్రొద్దు సుఖపూర్వకముగా
నిలుచుచున్నదో గమనించుచుండవలెను. ఆ యింతలో సుఖపూర్వక
ములైన యుచ్ఛ్వాస నిశ్వాసములు ఎంత సంఖ్యగా నుండునో
యూహింపవలెను. దీనికే స్తంభవృత్తి యని పేరు. కుంభక మని
గూడ నందురు. అభ్యాసబలముతో నిదియు దీర్ఘమును అనాయాస
సాధ్యమును నగును 'బాహ్యాభ్యంతర విషయాక్షేపీ చతుర్థః'—
బాహ్యాభ్యంతర విషయాక్షేపీ = లోపలను బయటను నున్న విషయ
ములయొక్క త్యాగముచే తనకుఁదానై సిద్ధించునది. చతుర్థః=నాల్గవ
ప్రాణాయామము. లోపలను, బయటనున్న విషయములను బొత్తిగా
చింతింపక వదలివేసినప్పుడు బాహ్యస్మృతి యుండదు. ప్రాణ
వాయువు బయటికిఁ బోయినదా? లేక లోపలికి వచ్చుచున్నదా?
చలించుచున్నదా? నిలిచినదా?—వీని స్పృహయే యుండదు. మనస్సు
ధ్యేయమందే లగ్నమై యుండును. అప్పుడు దేశ కాల సంఖ్యా జ్ఞాన
ముండదు. ప్రాణము దనకుఁదానై యేదోయొకచోట నిలిచిపోవును.
ఇట్లు తనకుఁ దానై యేర్పడునది ప్రాణాయామము నాల్గవది. ఇది
పై మూఁడింటికంటె భిన్నమైనది. ఈ భిన్నతను దెలుపుటకే 'చతుర్థః'
అను పదము వాడఁబడినది. ఇట్లనాయాసముగా సిద్ధించు ప్రాణా
యామము రాజయోగమునకు సంబంధించినది. దీనితోఁ దనకుఁ
దానై మనశ్చాంచల్యము నిలిచిపోవును. ప్రాణగతియు నిలుచును.
పైఁ జెప్పిన ప్రాణాయామములు మూఁడును నభ్యాసముతో సిద్ధిం
చును. స్వాభావికముగా నేర్పడును 'తతః క్షీయతే ప్రకాశావరణం'
తతః=ఈ ప్రాణాయామముయొక్క అభ్యాసముచేత, ప్రకాశావరణం
=జ్ఞానమును గూర్చియున్న ఆవరణము, క్షీయతే=క్రమముగా నశిం

ప్రకాశింపనీయక దానిని( జుట్టి(యున్న యావరణము. వీనితోనే మానవు( డజ్ఞానియైనాఁడు. విమోహితు( డైనాఁడు. ఇవి నశించినప్పుడు వానికి జ్ఞానసూర్యోదయము. దీనినే గీత యిట్లనుచున్నది—

**జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః,**
**తేషా మాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్.**

ఆత్మజ్ఞానముచే నెవరి యజ్ఞానము వినష్టమైనదో వారి కాత్మజ్ఞానము సూర్యునివలె పరబ్రహ్మమును ప్రకాశింప( జేయుచున్నది.

ప్రాణాయామమునకు రెండవఫలమును జెప్పుచున్నాఁడు.

'ధారణాసు చ యోగ్యతా మనసః' 'చ' అట్లే ధారణాసు = ధారణాదులందు, మనసః = మనస్సుయొక్క యోగ్యతా యోగ్యతయును (ఏర్పడును) ప్రాణాయామముతో మనస్సునకు ధారణాయోగ్యత గల్గును. అనఁగా నే చోటునందైనను ననాయాసముగా మనస్సు స్థిరముగా నెలకొనును. పోతనామాత్యుఁడు తనపద్యములో జితసంగః, జితేంద్రియః—అను రెంటిని 'పవనము నియమించి' అను నొక్క మాటతోఁ జెప్పినాఁడు. బుద్ధినెఱపి, 'ధియా' యని మూలము. బుద్ధియొక్క సహాయముతో నన్నమాట.

భగవంతుఁడైన హరి విరా డ్విగ్రహంబునందున్ = సర్వశక్తి సంయుతుఁడైన భగవంతుని విరాడ్రూపమందు బ్రహ్మాండమందున్న పురుషునకు విరాట్పురుషుఁ డనిపేరు. భూత భవిష ద్వర్తమానంబైన విశ్వంబు = ఇంతకుముం దున్నట్టి, ఉండఁబోవునట్టి, ఉండుచున్నట్టి దియునైన సమస్తసృష్టి, విలోక్యమానంబగున్—కనపడుచున్నది. భూత భవిష్యద్వర్తమాన కల్పాదులం దున్నదని యర్థము. లేక ఈ కల్పమందే అతీతము, అనాగతము, వర్తమానమైన సమస్తసృష్టియు విరాడ్రూపునియొక్క స్థూలరూపమం దుండునని భావము. జీవుఁడు స్థూల

యింద్రియములను నియమించి భగవంతుని సూక్ష్మరూపమునందు మనస్సు నుంచుట వానికిఁ జాల కష్టమైన పని. కారణ మేమనఁగాఁ బూర్వవాసనలు వానిని నిర్బంధించుచుండును. అందుచే తదనురూపమైన స్థూలరూపమునే మొట్టమొదలా లంబనముగాఁ జేసికొనవలెనని చెప్పఁబోవుచున్నాఁడు. గొప్పదైన యండకోశమే భగవంతుని శరీరము. దానికి భూమి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తత్త్వము లని యేడావరణములు. ఈ యావరణములతో కూడిన మహాండకోశమందు వైరాజపురుషుఁ డుండును. వాఁ డుపాసింపఁ దగినవాఁడని చెప్పుచున్నాఁడు. అనఁగా విరాట్పురుషుఁడు, తదంతర్గతుఁడైన జీవుఁడు, వానిలోనున్న అంతర్యామి—ఈ ముువ్వురికి నభేదము నారోపించి యుపాసింప వలెనని భావము. అ మ్మహాత్ముని కిన్—ఆ విరాట్పురుషునికి, పాదమూలంబు—పాదముల క్రిందిభాగము, పార్ష్ణి = మడమభాగము, పాదాగ్రభాగంబులు = పాదముల ముందు భాగములు, గుల్ఫంబులు—పిక్కలు మహాతలంబు, జంఘలు—మోఁకాళ్లు తలాతలంబు, జానుద్వయంబు—రెండు మోఁకాళ్లును, జఘనములు—పిఱుదులు, నాభీవివరంబు—నాభీరంధ్రము, గ్రహతారకాముఖ—గ్రహములు, తారకలు మొదలైన, జ్యోతిస్సమూహ—కాంతి సమూహముల చేత, సమేతంబు—కూడినది, గ్రీవంబు—మెడ, లలాటము—నుదురు, శీర్షము—తల, బాహుదండంబులు = దండాకారములైన బాహువులు, ఇంద్రాదులు—ఇంద్రుఁడు మొదలైనవారు, కర్ణములు—చెవులు, నాసాపుటంబులు—నాసికాద్వారములు, ఘ్రాణేంద్రియము—ముక్కు, నేత్రంబులు—నేత్రగోళములు, భ్రూయుగ్మవిజృంభణంబు—కనుబొమల పెంపు, తాలువులు—దౌడలు, జిహ్వేంద్రియంబు—నాలుక, దంష్ట్రలు—కోఱలు, దండధరుండు—యముఁడు, జగన్మోదకరంబులు = జగత్తునకు సంతోషమును గల్గించునవి. 'జనోన్మాదకరీ మాయా' అని మూలము.

సృష్టులు 'దురంత సర్గః' అని మూలము. సర్గ మనఁగా స్థావరజంగ మాది సృష్టి. మేఢ్రంబు=పురుషాంగము, వృషణంబులు=బీజములు, జఠరంబు=కడుపు, శల్యసంఘంబులు=ఎముకల గుంపు, నాడీనివహంబులు=నాడీసమూహము, తనూరుహంబులు=రోమములు, నిరవధికము=అవధిలేనిది, నానావిధజంతు=అనేక విధములైన జంతువులయొక్క నివహ=గుంపుచేత, సంవృత=కూడుకొన్న, సంసరణములు=సంసారములు, శిరోజములు=వెండ్రుకలు, ప్రధానంబు=ప్రకృతి, అశ్వ, అశ్వతరి, ఉష్ట్ర, గజంబులు, అశ్వతరి=అఁడుకంచరగాడిద, షడ్జాదులైన స్వరవిశేషంబులు=షడ్జము మొదలైన స్వరములగుంపు, అప్సరస్+సమూహంబులు=అప్సరసల గుంపు, వీర్యంబు=బలము, దైత్యదానవానీకంబు=దైత్యులయొక్కయు, దానవులయొక్కయు గుంపు. ఈ రెండును రాక్షసులలో భేదములు. దితినుండి ప్రారంభమైన వంశము దైత్యులు. దనుఁడను వానినుండి యారంభమైన వంశము దానవులు. మూలములో- 'స్మృతిర్వాసురానీక వీర్యః' అని కలదు. స్మృతి-అసురానీకమే వీర్యముగాఁ గలిగిన అనఁగాఁ బరాక్రమమే స్థానముగా గలిగినవాఁడు. ప్రహ్లాదుఁడని యర్థము. భగవంతుని స్మృతి-రాక్షస సైన్యాధినేతయైన ప్రహ్లాదుఁడని భావము. పోతన్న 'అసురానీక వీర్యః' అనుదానిని భగవంతున కన్వయించెను. అసురానీకమే భగవంతుని వీర్య మని యాతని యన్వయము. అనుసంధానము=నిరంతరము మఱచిపోక ధ్యానములో నిలుపుకొనుట, వక్కాణించి=పలికి, వెండియున్=మఱల.

సమస్త ప్రపంచమందును వ్యాపించిన హరియొక్క విరాడ్విగ్రహములోఁ గలిగినవి, ఉండునది యుండెడు నదియునైన సమస్త సృష్టియుఁ జూపట్టుచుండును. అండకోశమునకు సప్తావరణములు భూమి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము, అహంకారము,

భగవంతునకు శరీరము. ఆ శరీరముతోనే వైరాజపురుషు డుండును. అతఁడే నిరంతర ధారణకాశ్రయుఁడు. అతని పాదమూలమే పాతాళము. మడమ పాదాగ్రభాగములు రసాతలము, చీలమండలు మహాతలము. పిక్కలు తలాతలము. మోఁకాళ్లు రెండును సుతలము. తొడలు వితలము. అతలము తొడలపైభాగములన్నమాట. పిఱుఁదులు మహీతలము. నాభిరంధ్రమే నభస్స్థలము, వక్షము నక్షత్రలోకము. మెడ మహర్లోకము. ముఖము జనలోకము. నుదుఁరు తపోలోకము. తల సత్యలోకము. ఇంద్రుఁడు మొదలైన వా రాతని బాహువులు. దిక్కులే చెవులు. శ్రవణేంద్రియమే శబ్దము. నాసత్యదస్రులు నాసాపుటములు. ముక్కు గంధము. ముఖము వహ్ని. నేత్రగోళము లంతరిక్షము. చక్షురింద్రియమే సూర్యుఁడు. వామనేత్రము చంద్రుఁడు. రేపవళ్లు అతని ఱెప్పలు. భ్రూవిజృంభణము బ్రహ్మస్థానము. 'పరమేష్ఠి ధిష్ణ్యం' అని మూలము. 'బ్రహ్మపదం' అని శ్రీధరులు. బ్రహ్మపదము పరమాత్మయొక్క భ్రూవిక్షేప సమకాలమని భావము. దౌడలు జలములు. రసములే నాలుక. వేదములు బ్రహ్మరంధ్రము. కోఱలు యముఁడు. పుత్త్రాది స్నేహకళలు=పుత్త్రులు మొదలైన వారియందున్న స్నేహముయొక్క అవాంతర భేదములు. మందహాసములు జగన్మోహకరములైన మాయా విశేషములు. కటాక్షము లనంతదృష్టులు. పై పెదవి వ్రీడ. క్రింది పెదవి లోభము. స్తనములు ధర్మమార్గము. వెన్ను అధర్మము. మేఢ్రము ప్రజాపతి. వృషణములు మిత్రావరుణులు. కడుపు సముద్రము. ఎముకలగుంపు పర్వతములు. నాడులు నదులు. రోమములు తరువులు. నిశ్వాసములు వాయువులు. అతనివయస్సు నిరవధికమైన కాలము. 'గతి ర్వయః' అని మూలము. చేష్టలు నానావిధములైన జంతువులసృష్టి - సంసారము. వెండ్రుకలు. మేఘములు. వస్త్రము ఉభయసంధ్యలు. హృదయమే ప్రకృతిఅవ్యక్త ప్రకృతియన్నమాట. సర్వవికారములకును జన్మస్థానమైన చంద్రుఁడు

మనస్సు. ధూమాది మార్గముగుటవలన నర్చిరాది మార్గమునఁ బయ నించు వారికి నే వికారములు నుండవు. చిత్తమే మహత్తత్త్వము. అహంకారము రుద్రుఁడు. అఁడు కంచరగాడిదలు, ఏన్గులు మొదలైనవి గోళ్లు. పశుమృగాదులు కటిప్రదేశము. పక్షులు విచిత్రములైన యాలాపనైపుణ్యము. 'నామరూపే వ్యాకరవాణి' అనెడు శ్రుత్యుక్తమైన శిల్పనైపుణి.

**ఏన శుక్లీకృతా హంసాః శుక్లాశ్చ హరితీకృతాః,**
**మయూరా శ్చిత్రితా యేన స నో వృత్తిం విధాస్యతి అని యభియుక్తోక్తి.**

స్వాయంభువమనువే యాతని బుద్ధి అనఁగా విచారశీలత. విజయధ్వజులు మను వనఁగా వాయు వని యర్థముఁ జెప్పెను. 'వాయవే మనవే అబాధితాయ' అని శ్రుతి. నివాసము పురుషుఁడు. షడ్జాదిస్వర విశేషములు గంధర్వులు విద్యాధరులు చారణులు మొదలైనవారు. స్మృతి ప్రహ్లాదుఁడు. వీర్యము దైత్యదానవుల గుంపు. ముఖము బ్రాహ్మణులు. బాహువులు క్షత్రియులు. ఊరువులు వైశ్యులు. చరణములు శూద్రులు. ఆతని పేరులు నానావిధములైన వసు రుద్రాది దేవతాభేదములు. ద్రవ్యములు హవిర్భాగములు. కర్మలు యజ్ఞప్రయోగములు. ముముక్షువైనవాఁడు ఈ స్థూలరూపమందు బుద్ధిసహాయముతో మనస్సు లగింపఁజేయవలెను అని మఱియు నిట్లున్నాఁడు.

విశ్వమంతయున్ హరిమయము—సమస్తప్రపంచమును వాసుదేవాత్మకము, విశ్వమయుండు—ప్రపంచములో నిండినవాఁడు. ప్రపంచమే యాతని స్వరూపమని భావము. హరిమయముగాని ద్రవ్యము—హరి స్వరూపముగాని వస్తువు, పరమాణువు లేదు—అల్పాల్పమును లేదు.

తాత్పర్యము: సమస్త సృష్టియు విష్ణుస్వరూపము. హరికిఁ బ్రపంచమే శరీరము, ఇందులో సంశయము లేదు. హరిమయము

బడినది. ఇప్పుడు దేవదేవుఁడు ఈశ్వరునియొక్క యంతర్యామిత్వములను చెప్పుచు నాతఁడే ధ్యానార్హుఁడని సదృష్టాంతముగా నిరూపించు చున్నాఁడు–

జీవుండు, కలలోనఁ = స్వప్నమందు, కౌతూహలంబునఁ = ఆసక్తితో, పెక్కుదేహంబులఁ పేరువడసి = అనేక శరీరములు ధరించి, ఇంద్రియంబుల వెంటఁ = వాని యింద్రియముల మూలమున, ఎల్ల వృత్తంబులన్ ఈక్షించి = సమస్త వ్యాపారములను గమనించి, మఱి = తర్వాత, తన్ను ఎఱుంగు కరణి = తన్ను మఱవక జ్ఞాపక ముంచు కొను విధముగా, అఖిలాంతరాత్మకుఁడగు పరమేశ్వరుఁడు = సర్వజీవుల యం దంతరాత్మగా నున్న భగవంతుఁడు, బుద్ధివృత్తులఁ ఎల్లఁ = బుద్ధియొక్క సమస్త వ్యాపారములను, బోధియై వీక్షించున్ = ద్రష్టయై చూచును, ప్రాభవమువలనఁ = విద్యాశక్తి చేత, బద్ధుండు గాఁడు = బంధితుఁడు గాఁడు, సత్యుఁడు = సత్యస్వరూపుఁడు, ఆనందబహుళ విజ్ఞానమూర్తి = ఆనందముచేఁ గూడుకొన్న విజ్ఞానస్వరూపుఁడు. 'ఆనందనిధిం' అని మూలము. అతనిఁ సేవింపఁ అగుఁ కాక !. అన్య సేవఁ = ఇతరసేవవలన, కైవల్య గౌరవములు = ముక్తి గౌరవములు, కలుగన్ నేరవు = ఎన్నఁడును సంసారబంధము పాయదు.

తాత్పర్యము: కలలో జీవుఁ డనేక జీవులను సృష్టించును. తన యింద్రియములతో వానిని వీక్షించును. వాని యింద్రియములతోఁ దన యిష్టము వచ్చినట్లు పనులు సేయించును. కాని తన్ను మఱచిపోవఁడు. అట్లే పరమాత్ముఁడు అఖిల జీవులం దంతర్యామిగా నుండును. వారి సమస్త బుద్ధివృత్తులను బోధియై వీక్షించును. తన కున్న విజ్ఞానశక్తి చేతఁ దన్ను మఱవఁడు. ఆతఁ డానందనిధి. సత్య స్వరూపుఁడైనవాఁడు. అతని సేవతో ముక్తిగౌరవ మేర్పడును. ఇత

రులను సేవించుటతో నేర్పడదు. సంసారబంధ మెన్నటికిని పాయదు. దీని మూలశ్లోక మీ క్రిందిది-

> స సర్వధీవృత్త్యనుభూతసర్వ ఆత్మా యథా స్వప్నజనేక్షితైకః,
> తం సత్యమానందనిధిం భజేత నాన్యత్ర సజ్జేద్యత ఆత్మపాతః.

దీనిని శ్రీధరుఁ డి ట్లన్వయించినాఁడు-

> సర్వేషాం బుద్ధివృత్తిభి రనుభూతం సర్వం యేన సః,
> సర్వధీవృత్త్యనుభూత సర్వః స ఏక ఏవ సర్వాంతర ఆత్మా.

వాఁ డొక్కఁడే అందఱియందున్న ఆత్మ. 'తమేవ సత్యం భజేత'- సత్యస్వరూపుఁడైన వానినే సేవింపవలెను. తక్కినవారియం దుపలక్షణము. న సజ్జేత్ - ఇతర దేవతలతో సంబంధ ముంచికొనరాదు. 'యతః సంగాత్ ఆత్మనః పాతః సంసారో భవతి'- ఆ సంసర్గముతో నాత్మపాతరూపమైన సంసార మేర్పడును. 'ఏకస్య తత్తదింద్రియైః సర్వానుభూతౌ దృష్టాంతః'- ఒక్కఁడేయైన యాత్మకు నా యా యింద్రియములతో సర్వానుభూతికి దృష్టాంత మిచ్చుచున్నాఁడు.

> స్వప్నే జనానాం ఈక్షితా యథా స్వప్నే హి కదాచిత్,
> బహూని జీవాన్ పరికల్ప్య జీవస్తదింద్రియైః సర్వం పశ్యతి తద్వత్.

స్వప్నమందు జీవుఁ డనేక జీవులను సృష్టించికొని వాని యింద్రియములతో సర్వమును జూచుచున్నాఁడు. అట్లే నవిభావము ఈశ్వరునకు సంబంధము లేదు; విద్యాశక్తి వలన.

పుట్టపర్తి నారాయణాచార్యదాసునిచే విరచింపఁబడిన
'భాగవత సుధాలహరి' యందు ద్వితీయ
స్కంధమున ప్రథమాధ్యాయము
వ్యాఖ్య ముగిసినది.

# భాగవత సుధాలహరి

## ద్వితీయ స్కంధము

## ద్వితీయాధ్యాయము

* * *

శ్రీ శుక ఉవాచ:

> ఏవం పురా ధారణయాఽఽత్మయోని
> ర్నష్టాం స్మృతిం ప్రత్యవరుధ్య తుష్టాత్,
> తథా ససర్జేద మమోఘదృష్టి
> ర్యథా ఽప్యయా త్ప్రాగ్వ్యవసాయబుద్ధిః. 1

ఆత్మయోనిః=బ్రహదేవుఁడు, పురా=ముందు, నష్టాం=నశించిపోయిన, స్మృతిం=జ్ఞాపకమును, ఏవంధారణయా=ఈ ప్రకారమైన ధారణచేత, తుష్టాత్=పరితుష్టుఁడైన శ్రీహరినుండి, ప్రత్యవరుధ్య=మఱల సంపాదించికొని, అమోఘదృష్టిః=వ్యర్థముకానట్టి దృష్టికలవాఁడై, వ్యవసాయబుద్ధిః=నిశ్చయాత్మకమైన బుద్ధియును గలవాఁడై, అప్యయాత్ ప్రాక్ యథా=ప్రళయకాలమునకు ముందటి వలెనే, ఇదం = ఈ లోకమును, తథా ససర్జ = ఇంతకు ముందున్న రీతిగనే సృష్టించెను,

అవ: స్థూలమైన భగవద్రూపమును ధ్యానించి దానియందు స్థిరమైన మనస్సుతో సర్వసాక్షియు సర్వేశ్వరుఁడును నైన శ్రీ మహా విష్ణువునందు మఱల మనస్సును స్థిరముగా నిలుపవలెనని చెప్పఁబోవు

దృశ్యాలంబనరూపమైన వైరాజపురుషునిపై ధారణను నిలిపిన తర్వాత సర్వాంతర్యామియు, సద్దృశ్యమానుఁడైన ఈశ్వరునందు మనస్సు తనకుఁదానే ప్రవేశించునని యీ రెండవ యధ్యాయమందు వివరించుచున్నాఁడు. మొదటి యధ్యాయమందు వివరించినట్లుగా భగవంతుని స్థూలమైనరూపమందు మనస్సు నిలుపుటతో సమస్తమును జలమయమైయుండిన సమయమందు విష్ణువుయొక్క నాభికమలమందు జన్మించిన బ్రహ్మ కల్పకాలముయొక్క దైర్ఘ్యము నిమిత్తముగా నశించిపోయిన స్మృతిని ధారణతో సంతుష్టుఁడైన శ్రీహరి ప్రసాదముతో మరలఁ బొందినవాఁడయ్యెను. పూర్వకల్పమందు రచింపఁబడిన సృష్టియొక్క స్వరూపజ్ఞాన మేర్పడినది. ఈ రీతిగా తనచే దీనిని సృష్టింపవలెనను నిశ్చయము గూడ బుద్ధి కేర్పడెను. ప్రళయమునకు ముందు సృష్టించినట్లే మరల నీ లోకమును నిర్మించుటయు జరిగినది. అందుచే పూర్వోక్త ధారణముతో విశ్వసృష్టి సామర్థ్యమేర్పడునని తెలియవలెను.

శాబ్దస్య హి బ్రహ్మణ ఏషపంథా
యన్నామభిర్ధ్యాయతి ధీరపార్థైః,
పరిభ్రమం స్తత్ర న విందతేఽర్థా
న్మాయామయే వాసనయా శయానః. ౨

**అపార్థైః=అర్థశూన్యములైన, నామభిః=పేరులచేత, ధీః=బుద్ధి, ధ్యాయతి యత్=ధ్యానించుటయనున దేదిగలదో, అది శాబ్దస్య=శబ్దమయమైన, బ్రహ్మణః బ్రహ్మయొక్క, పంథాః=మార్గము, ఏషః హి=ఇదియే, మాయామయే=మాయా**

క్తుఁడైన పురుషునకు శుద్ధమైన బ్రహ్మమందే మనస్సును లగింపఁ జేయుట యుక్తము. ఈ విషయము చెప్పఁ బూనుకొన్న మహర్షి ఫలాశలేక యుండవలెనని చెప్పఁబూనుచు వైరాగ్యమును గల్గింపఁ జేయుటకై కర్మఫల మనిత్య మగుటచే నిత్యానందము దానినుండి లభింప దనెడు వేదరహస్యమును జెప్పుచున్నాఁడు_

కర్మములకు ఫల మున్నదని యుపదేశించుట శబ్దబ్రహ్మమయమైన వేదముయొక్క సంప్రదాయము. 'స్వర్గకామో యజేత' స్వర్గమందు కోరిక గలవారు ఈశ్వరుని గుఱించి యాగ మొనర్చవలెను. ఈ రీతిగా ననేకములు చెప్పి పురుషుని బుద్ధియందు కర్మాశను రేకెత్తించుట వాని స్వభావము. స్వల్పకాలము మాత్రమే యుండెడు స్వర్గాది లోకములు వానియం దేర్పడెడు విషయ సుఖములు-ఇవి తుచ్ఛములైనవి; అర్థశూన్యములైన ఈ నామరూపములతో మోహితుఁడైన పురుషుఁడు వానియం దాసక్తిగలవాఁడై 'వీనిలోసుఖ మున్నది' అనెడు వాసనలతోఁ గూడినవాఁడై వానికై యత్నించి స్వర్గాది స్థానములను బొందును. అక్కడ వసించినను బుణ్యక్షయమందు మఱల నీ లోకమునకే వచ్చుట జరుగును. అట్టివాని కాత్యంతికమైన దుఃఖ నివృత్తియు శాశ్వతమైన యానందము నేర్పడవు. స్వాభావికములైన దుర్వాసనలను బోఁగొట్టి సద్వాసనలను బెంపొందించుటకు మాత్రమే పనికి వచ్చునవి వేదములు. వాని యర్థవాదము లన్నియు నిందుకే.

తతః కవి ర్నామసు యావదర్థః
స్యా దప్రమత్తో వ్యవసాయబుద్ధిః,
సిద్ధే ఽన్యథార్థే న యతేత తత్ర
పరిశ్రమం తత్ర సమీక్షమాణః. ౭

తతః=అందుచేత, కవిః=వివేకవంతుఁడైన వాఁడు, నామసు=పేరులందు, యావదర్థః=అర్థమును మాత్రమే గ్రహించినవాఁడై, అప్రమత్తః=ప్రమాదము

లేనివాఁడై, వ్యవసాయబుద్ధిః = వస్త్రప్రయత్న మొనర్చెడు బుద్ధిగలవాఁడుగా, స్యాత్ = కావలెను, అర్థే = ప్రయోజనము, అన్యథా = వేఱుమార్గముతో, సిద్ధేసతి = సిద్ధించిన దగుచుండఁగా, తత్ర = నామరూపాత్మకమైన వేదమందు, పరిశ్రమం = వ్యర్థప్రయత్నము, సమీక్షమాణః = భావించుచున్నవాఁడై, తత్ర = దానియందు, న యతేత = ప్రయత్నము చేయరాదు.

అవః కర్మఫలమును సంపూర్తిగా వదలినచో వెంటనే దేహము నశించుచున్నది గదా! ఈ యాక్షేపమునకు సమాధానము-

'దీనిని గ్రహింపవలెను' 'దీని నుపేక్షింప వలెను' అని వివేకించి కొనుటకు శక్తి యున్న విద్వాంసుఁడు అర్థశూన్యములై నామమాత్రములై యున్న భోగ్యవిషయములందు శరీరనిర్వహణమున కెంతమాత్ర మవసరమో అంతమాత్రమే ప్రవర్తించును. 'శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషం'- శరీరయాత్ర కావశ్యకమైన కర్మము బంధహేతువు గాదని గీతావాక్యము. కాని శరీరయాత్రకు పీఁ డొనర్చు కర్మములు సుఖేచ్ఛతోఁ గూడినవిగా నుండరాదు. వీనినుండి శాశ్వతసుఖ మేర్పడదను భావము సర్వదా యుండవలెను. శరీరనిర్వహణకు వలయు సాధనము వేఱువిధముగా లభించినచో దానికై యిఁక ప్రయత్నము పెట్టుకొనరాదు. పెట్టుకొనుట వ్యర్థప్రయత్న మని దానియం దుపేక్ష వహింపవలెను. ఇదియే వివేకి యగు పురుషుని లక్షణము.

సత్యాం క్షితౌ కిం కశిపోః ప్రయాసై
ర్బాహౌ స్వసిద్ధే హ్యుపబర్హణైః కిమ్,
సత్యంజలౌ కిం పురుధాన్నపాత్ర్యా
దిగ్వల్కలాదౌ సతి కిం దుకూలైః. 4

క్షితౌ = భూమి, సత్యాం = ఉండఁగా, కశిపోః = పడుకకొఱకై చేయు,

వ్యయముగా సిద్ధించినదై యుండఁగా, ఉపబర్హైః=దిండు మొదలగు వానిచేత, కిం=ఏమి ప్రయోజనము?, అంజలౌ సతి=అంజలిబంధ ముండఁగా, పురుధా=బహువిధమైన, అన్నపాత్ర్యా=అన్నపాత్రలచేత, కిం = ఏమి? దిక్=దిక్కులే, వల్కలాదౌ సతి=గుడ్డలుమొదలైన వగుచుండఁగా, దుకూలైః కిం?=వస్త్రాదులతో నేమి ప్రయోజనము?

అవ: 'శరీరనిర్వహణసాధనము వేఱురీతిగా సిద్ధించినదైనచో మఱి వానికై ప్రయత్నముతో నేమి పని?' అన్నాఁడు. ఆ సిద్ధించు విధమును రెండు శ్లోకములతోఁ దెల్పుచున్నాఁడు-

నిద్ర వచ్చినప్పుడు పండుకొనుటకు భూమి యుండఁగా పఱుపు మొదలైన వానిని సంపాదించికొనుట యెందులకు? తల దిండు మొదలైన వానికి శరీరముతో పుట్టిన బాహు వున్నది. అది చాలు గదా! ఇతరములకై ప్రయాస మనవసరము గదా! అన్నము దినుట కంజలిబంధముండఁగా ననేక విధములైన భోజనపాత్రము లెందుకు? దిక్కులే దుకూలము లైనప్పుడు మఱి వివిధములైన యంబరము లేల?

చీరాణి కిం పథి న సంతి దిశంతి భిక్షాం
నో వాంఘ్రిపాః పరభృత స్సరితో ప్యశుష్యన్,
రుద్ధా గుహాః కి మజితో ఽవతి నోపసన్నా
న్కస్మా ద్భజంతి కవయో ధనదుర్మదాంధాన్. ౫

పథి=మార్గమందు, చీరాణి = చినిఁగిపోయిన గుడ్డపేలికలు మొదలైనవి, న సంతి కిం?=ఉండవా యేమి? పరభృతః=ఇతరులను పోషించుచున్న, అంఘ్రిపాః=వృక్షములు, భిక్షాం=భిక్షను, న దిశంతి కిం=ఒసఁగవా యేమి?, సరితః=

లైనవారు, ధనదుర్మదాంధాన్ = ధనగర్వముతో గ్రుడ్డివారైన వారిని. కస్మాత్ భజంతి?=ఎందుకు సేవింతురు?

అవ: దిక్కులే యంగములను మూయుచున్న వన్నచో నగ్నుఁడుగా నుండవలె ననియే గదా యర్థము. ఆచ్ఛాదనమునకై కావలసిన వస్త్రాదులను అన్నపానాదులను ఇతరులను యాచించి తెచ్చికొనవలసినదే కదా! దానినుండి తప్పించికొనుటకు వీలులేదు కదా! యనుటకు సమాధానము—

ఎవరికి నవసరములేని గుడ్డపేలికలు మొదలైనవి వీథులయందు పడియుండును. వానితో శరీరము నాచ్ఛాదించికొనవచ్చును. వృక్షాదులున్నవి, అవి తమ యాహారము నెవ్వరి నడుగవు. భూమిలోని వస్తువులనే వేరులతో గ్రహించి బ్రదుకును. తమ పుష్పఫలాదుల నవి యనుభవింపవు. వాని యుత్పత్తియంతయుఁ బరప్రయోజనము కొఱకే. వాని నాహారముగా వాడికొనవచ్చును. నదులు మొదలైన ప్రవాహము లున్నవి. దప్పిగొన్నప్పుడు వాని నీరుఁ ద్రావవచ్చును. నిద్రించుటకు కొండగుహ లున్నవి. వాని నెవరును మూయలేరు. ఇన్నిటికిపైఁగా భగవంతుని యభయహస్త మున్నది. శరణుఁజొచ్చిన వారి నెన్నఁడు నుపేక్షింపఁడు. వానిరక్షణ కెదురే లేదు. వాస్తవ మిట్లుండఁగా వివేకవంతులు గూడ ధనదుర్మదాంధుల నెందు కాశ్రయింపవలెను?

> ఏవం స్వచిత్తే స్వత ఏవసిద్ధ
> ఆత్మా ప్రియోఽర్థో భగవాననంతః;
> తన్నిర్వృతో నియతస్తం భజేత
> సంసారహేతూపరమశ్చ యత్ర. 6

ఏవం=ఈ ప్రకారము యోచించి, స్వచిత్తే=తన మనస్సునందు, స్వతః ఏవ=తనకుఁదానై, స్వాభావికముగా, సిద్ధః=ఉన్నట్టి, ప్రియః=ప్రేమరూపుఁడు,

అర్థః = సత్యస్వరూపుఁడును, భగవాన్ = ఐశ్వర్యపూర్ణుఁడును, అనంతః = అవ
రిచ్ఛేద్యుఁడును నైన, ఆత్మా=ఆత్మయన్నది, నిర్వృతః=ఆనందముతోఁ గూడిన
వాఁడును, నియతార్థః = నిశ్చయించికొనఁబడిన స్వరూపముతోఁ గూడినవాఁడును
నైన మాధవుఁడు, తంహృదయాంతస్థితుఁడైన యాత్మను, భజేత=భజింప
వలెను, యత్ర=ఏ విధానమందు, సంసారహేతు ఉపరమః=సంసార వినాశ
కారణ మేర్పడునో.

అవ: పైఁ జెప్పినట్లుగా సర్వమునందును విరక్తుఁడైన పురు
షుఁడు తర్వాత నొనర్పవలసిన కార్యమేది? చెప్పుచున్నాఁడు_

తన హృదయమందు స్వయముగా నాత్మస్వరూప మున్నది.
వాఁడు ప్రేమరూపుఁడు. భజించుటకు యోగ్యమైన గుణములు గల
వాఁడు. ఎన్నఁడును వానికి వినాశము లేదు. సర్వమునం దొక రీతి
గనే వ్యాపించినవాఁడు. ఇట్టి యాత్మస్వరూపమును హృదయము
నందుఁ జక్కఁగాఁ బ్రతిష్ఠించికొన్నచో మహానందము సిద్ధించును.
అట్టి యానందమును బొందెడువాఁడై ఆ పరమాత్మను భజింపవలెను.
అట్లు భజించినచో సర్వ సంకటములకును నిలయమైన సంసారము
గలుగుటకు మూలకారణమైన 'యవిద్య' తనకుఁ దానై నశించును.

కస్తాం త్వనాదృత్య పరానుచింతా
మృతే పశూనసతీం నామయుంజ్యాత్,
పశ్యన్ జనం పతితం వైతరణ్యాం
స్వకర్మజాన్ పరితాపాన్ జుషాణమ్. 7

చింతనముతో నేర్పడెడు దుష్ఫలములను జెప్పుచున్నాఁడు-

అనుసరింపఁదగిన కర్మను దెలిసికొనెడు బుద్ధి శక్తి లేని జనుఁడు దప్ప తక్కినవాఁ డెవ్వఁడును పరమాత్మచింతను వదలి నశ్వరమైన విషయచింత నాదరింపఁడు. ఆ విధమైన చింతనతో నేర్పడు ఫలము ప్రత్యక్షముగనే కన్పించుచున్నది గదా! యముని రాజధానిముందు మహాఘోరమైన వైతరణి గలదు. దానితో సమానమైన సంసారమందు మునిఁగి స్వకర్మఫలములైన తాపత్రయాదు లనుభవించికొనుచు జనుఁడు సర్వదా పరితపించుచుండును. అట్టి వారిని జూచుచున్న వివేకియైన పురుషుఁ డదే నదియందుఁ బడుట కుపకరించెడు విషయ చింతన నంగీకరించునా? అ దెంత కష్టమైనది; దానినుండి రక్షించెడు పరమాత్మచింత చేయవలె ననియే భావము.

కేచి త్స్వదేహాంత ర్హృదయావకాశే
ప్రాదేశమాత్రం పురుషం వసంతమ్,
చతుర్భుజం కంజరథాంగశంఖ
గదాధరం ధారణయా స్మరంతి. 8

ప్రసన్నవక్త్రం నలినాయతేక్షణం
కదంబ కింజల్క పిశంగ వాససమ్,
లసన్మహారత్నహిరణ్మయాంగదం
స్ఫురన్మహారత్న కిరీటకుండలమ్. 9

ఉన్నిద్రహృత్పంకజ కర్ణికాలయే
యోగేశ్వరస్థాపిత పాదపల్లవమ్,
శ్రీలక్ష్మణం కౌస్తుభరత్నకంధరం
అమ్లానలక్ష్మ్యా వనమాలయాఽఽచితమ్. 10

విభూషితం మేఖలయాంగుళీయకై
ర్మహాధనై ర్నూపుర కంకణాదిభిః,
స్నిగ్ధామలై ః కుంచితనీలకుంతలై
ర్విరోచమానానన హాసపేశలమ్. 11

అదీనలీలాహసితేక్షణోల్లస
ద్భ్రూభంగసంసూచిత భూర్యనుగ్రహమ్,
ఈక్షేత చింతామయమేవ మీశ్వరం
యావన్మనోధారణ యాఽవతిష్ఠతే. 12

కేచిత్—కొందఱు, స్వ=తనయొక్క, దేహాంతర – దేహమందున్న, హృదయావకాశే—హృదయావకాశమందు, ప్రాదేశమాత్రం=అంగుష్ఠమాత్రమైన, పురుషం=పురుష రూపముతో, వసంతం=వసించుచున్న వాఁడును, చతుర్భుజం—నాల్గు చేతులు గలవాఁడును, కంజ రథాంగ శంఖ గదాధరం—పద్మము, చక్రము, శంఖము, గద వీనిని ధరించిన వాఁడును, ప్రసన్నవక్త్రం = ప్రసన్నమైన ముఖముగలవాఁడును, నలినాయతేక్షణం = పద్మమువలె మనోహరములును, విశాలములునైన కన్నులు గలవాఁడును, కదంబ కింజల్క–పిశంగ వాససం= కడిమిచెట్టు పువ్వులోని కేసరములవలె పచ్చనైన పీతాంబరమును ధరించిన వాఁడును, లస న్మహారత్న హిరణ్మయాంగదం = అనర్ఘములైన రత్నములు పొదుగఁబడిన బంగారుబాహుపురులు ధరించినవాఁడును, స్ఫురన్మహారత్న కిరీట

హస్తకంకణములు మొదలగువానిచేత, విభూషితం=అలంకరింపఁబడినవాఁడును, స్నిగ్ధామలకుంచిత నీలకుంతలైః = నునుపులై, పరిశుద్ధములై, ఉంగరములు చుట్టుకొన్న నల్లని కేశములచేత, విరోచమానాననహాసపేశలం=ప్రకాశించుచున్న ముఖమండలమందలి చిఱునవ్వుచే మనోహరుఁడును, అదీనలీలాహసితేక్షణోల్లసద్భ్రూభంగ సంసూచిత భూర్యనుగ్రహం = ఉదారమైన లీలామందహాసముచేత ప్రకాశించెడు భ్రూభంగముతో సూచింపఁబడిన భక్తులయందలి విశేషానుగ్రహము గలవాఁడును, చింతాశక్తిచేత రూపింపఁబడినవాఁడునునైన, ఈశ్వరం=ఈశ్వరుని, మనః=మనస్సు, ధారణయా యావత్ అవతిష్ఠతే = ఎంతవఱకు నిలుకడగా నుండునో అంతవఱకు, ఈక్షేత=దర్శింపవలెను.

కొందఱు హృదయావకాశమందు పరమపురుషుని నిలిపికొందురు. వాఁ డంగుష్ఠమాత్రుఁడైన శరీరుఁడు. నాల్గు భుజములు. పద్మము, శంఖము, చక్రము, గద వాని యాయుధములు. అట్టి వానిని మహాయోగులు తమహృదయములందుఁ బ్రతిష్ఠించికొందురు. అంతమాత్రమే కాదు. వానివక్త్రము పరమప్రసన్నమైనది. తామరల వలె మనోహరములై విస్తారములైన కన్నులు. కడిమిపూవు కేసరముల వంటి కట్టిన పచ్చనిపట్టుము. ఆతని బాహుపురులు కనకమయములు. వానిలోఁ జెక్కిన యనర్ఘ రత్నములు; రత్నకాంతులు దిక్కులకుఁ దన్నుచున్న కిరీటము. దిఙ్మండలములకుఁ గ్రొత్తరూ పొసఁగు కుండలములు. యోగశక్తితో హృదయపద్మమును జాగృతమొనర్చి మహాయోగులు దాని మధ్యమందు వాని పాదపల్లవములను నిలిపికొందురు. వానియెదపై శ్రీమహాలక్ష్మి. ఇది యనన్యమైన చిహ్నము. కౌస్తుభరత్న పరీవాహమైన కంధరము. ఆపాదచూడము వ్రేలాడుచున్నవనమాల. దాని శోభాతిశయ మెన్నఁడును దఱుఁగదు. అనర్ఘమైన మొలనూలు. ఉంగరములు, నూపురములు, కంకణములు. వాని కుంతలములు నునుపుదేఱి కాంతిమంతములై పరిశుద్ధములై యింద్రనీలమణిచ్ఛాయ గలవి; వక్రసుందరములు. వీనిచే నందగించిన ముఖము. దానియందలి మృదులమైన చిఱునవ్వు. ఆ నవ్వు భక్తా

న్యగ్రహ పిశునము. ఇట్టి స్వరూపమును యోగులు నిరంతరమును ధ్యానింతురు. ప్రతిసాధకుఁడు నిట్టి రూపము నేకాగ్రతతోఁ దన హృదయమందుఁ గల్పించికొనవలెను. కల్పించికొని ధారణమందు హృదయ మెంత స్థిరముగా నిల్చునో అంతవఱకును ధ్యానింపవలెను.

> ఏకైకశో௨ంగాని ధియా௨నుభావయే
> త్పాదాదియావ ద్ధసితం గదాభృతః,
> జితం జితం స్థానమపోహ్యధారయే
> త్పరం పరం శుద్ధ్యతి ధీ ర్యథా తథా. 13

గదాభృతః=గదాధరుఁడైన శ్రీమహావిష్ణువుయొక్క, పాదాది=పాదములు మొదలుకొని, యావత్ హసితం = నవ్వు వఱకును, అంగాని = అంగములను, ఏకైకశః=ఒక్కొక్క దానినిగా, ధియా=బుద్ధి సహాయముతో, అనుభావయేత్= విడువక క్రమముగా భావింపవలెను, ధీః=బుద్ధి, యథా యథా శుద్ధ్యతి=ఎట్లెట్లు శుద్ధమగుచుఁ బోవునో, (తథాతథా=అట్లట్లు) జితంజితంస్థానం=ధ్యానవశీకృత మైన స్థానమును, అపోహ్య=వదలిపెట్టి, పరంపరం=పైపైనున్న, (స్థానం= అంగమును) ధారయేత్=ధరింపవలెను.

అవ: సాధకుఁ డభ్యాస మొనర్పవలసిన పద్ధతిని వివరించు చున్నాఁడు—

గదాధరుఁడైన శ్రీమన్నారాయణమూర్తి యొక్క యొక్కొక్క యంగమునే ధ్యానింపవలెను. ఎంతవఱకు? పాదము మొదలుకొని చిఱునవ్వు వఱకు ఈ ధ్యానమును విడువక చేయవలెను. ఎందు కనఁగా బుద్ధి యా యంగధ్యానమందు పరిణతము గావలెను. ఇట్లు క్రమక్రమముగా నొక్కొక్క యంగమునే ధ్యానించుచుఁ బోయి నప్పుడు ధ్యానవశీకృతమైన యంగమును వదలి పైపై యంగమును పట్టుకొనిపోవలెను. ఒకయంగమును ధ్యానించునప్పుడు దానియందు బుద్ధి చక్కగా పరిపక్వమగు నంతవఱకు నా ధ్యానమును వదలరాదు.

ఒక్కొక్కయంగమును ధ్యానింపవలె నన్నప్పుడు జితమైన స్థానమును వదలవలెనని కాదు. ఉదాహరణకు-శ్రీమహావిష్ణువుతొడలను ధ్యానించుచున్నాఁ డనుకొందము. పాదమూలములను జానువులను వదలవలెనని కాదు. అవి ముందే ధ్యానవశీకృతము లైనవి గనుక అవి మఱచిపోకుండునట్లు వానితోఁ బాటు విష్ణుదేవుని యూరువులను ధ్యానింపవలెనని యభిప్రాయము.

యావన్న జాయేతపరావరేఽస్మి
న్విశ్వేశ్వరే ద్రష్టరి భక్తియోగః,
తావత్ స్థవీయః పురుషస్య రూపం
క్రియావసానే ప్రయతః స్మరేత. 14

విశ్వేశ్వరే = సర్వమును నియమించువాఁడును, పరావరే = కార్యకారణ రూపుఁడునై యున్న, అస్మిన్ద్రష్టరి = ఈ ద్రష్టయందు, భక్తియోగః = పరమ ప్రేమలక్షణమైన భక్తియోగము, యావత్ న జాయేత = ఎంతవఱకుఁ బరిపూర్ణముగా సిద్ధింపదో, తావత్ = అంతవఱకు, ప్రయతః = శాస్త్రనియమము ననుసరించుచున్నవాఁడై, క్రియావసానే = కర్మయొక్క అవసానమందు, పురుషస్య = సర్వేశ్వరునియొక్క, స్థవీయః = మిగులస్థూలమైన, (జగదాకారమైన) రూపం = రూపమును, స్మరేత = స్మరింపవలెను.

అవ : ఇప్పుడు చెప్పిన ధారణ పరినిష్ఠిత మగువఱకును ముందు చెప్పఁబడిన విరాడ్రూపధారణము, నిత్యకర్మల తర్వాత నియమపూర్వకముగా నభ్యసింపవలెనని చెప్పుచున్నాఁడు-

భగవంతుఁడు స్థూల సూక్ష్మరూపములతో నున్నవాఁడు. ఈ రెండు రూపములతో లోకముయొక్క అంతర్భాగ మందుండి సకలమును దాని దాని స్థానమందు నియమించుచున్నాఁడు. ప్రతివస్తువు నందును ద్రష్టయై యున్నాఁడు. ఇట్లు సకలద్రష్టయైన పరమేశ్వరుని యందు ప్రేమలక్షణమైన భక్తి యోగము సిద్ధించువఱకును శాస్త్రవిహి

స్మరింపవలెను. భక్తియోగము సిద్ధించుటకై నిత్యనైమిత్తిక కర్మలను విరాట్స్వరూపధారణయు విధింపఁబడినవని తెలియవలెను.

> స్థిరం సుఖం చాసనమాశ్రితో యతి
> ర్యదాజిహాసు రిమమంగలోకమ్,
> కాలే చ దేశే చ మనో న సజ్జే
> త్ప్రాణా న్నియచ్ఛేన్మనసా జితాసుః. 15

**అం॥—ఓ రాజా!, స్థిరం—స్థిరమైనదియు, సుఖం—సుఖకరమైనదియునైన ఆసనమును, ఆశ్రితః—ఆశ్రయించియున్న, యతిః—యోగి, ఇమంలోకం—ఈ శరీరమును, యదాజిహాసుః—విడిచిపెట్టు కోర్కెగలవాఁడెప్పు డగునో అప్పుడు, కాలే—కాలమందును, దేశ—దేశమందును, మనః—మనస్సును, న సజ్జేత్—లగింపఁ జేయరాదు, జితాసుః — ప్రాణములను జయించినవాఁడై, మనసా — మనస్సుతో, ప్రాణం—ప్రాణమును, నియచ్ఛేత్—నియమింపవలెను.**

అవ: మరణధర్మియైన పురుషుఁడు చేయవలసిన విషయ

మన స్స్వబుద్ధ్యా ఽమలయా నియమ్య
క్షేత్రజ్ఞ ఏతాం నినయేత్త మాత్మని,
ఆత్మానమాత్మన్యవరుధ్య ధీరో
లబ్ధోపశాంతి ర్విరమేత కృత్యాత్. 16

**అమలయా—చలనములేనట్టి, స్వబుద్ధ్యా—తనబుద్ధిచేత, మనః—మనస్సును, నియమ్య—నియమించి, ఏతాం—ఆ బుద్ధిని, క్షేత్రజ్ఞే—జీవాత్మయందున్న, తం—ఆ జీవాత్మను, ఆత్మని—పరమాత్మయందున్న, నినయేత్—నియమింపవలెను, ఆత్మానం—పరమాత్మను, ఆత్మని—తనయందును, అవరుధ్య—లయింపఁజేసి, లబ్ధోపశాంతిః—ఉపశాంతిని బొందినవాఁడై, ధీరః—ధీరుఁడై, కృత్యాత్—కార్యజాతమునుండి, ఉపరమేత—ఉపరమించికొనవలెను.**

విషయముల నుండి మనస్సును మరల్చినచో మనశ్చాంచల్యము నశించును. అప్పుడు మనస్సనెడుమహత్తత్త్వము నశించినట్లే నిశ్చలాత్మకమైన బుద్ధి యొకటే యుండును. దానిని ద్రష్టయైన జీవాత్మయందు లయింపఁ జేయవలెను. దృశ్యమైన బుద్ధిని విడచి ద్రష్టయైన జీవరూపుఁడై యుండవలెనని భావము. తరువాత క్షేత్రజ్ఞుని తదాత్మస్వరూపుఁడై యున్న పరమాత్మయందు లయింపఁ జేయవలెను. ఆ పరమాత్మయే నేనను భావమును వహింపవలెను. అప్పుడు ప్రపంచమందుఁ దానుఁ దప్ప మఱియే పదార్థము నుండదు. పరమశాంతి కదియే యేకైకమార్గము. దీనిపై వాఁడు పొందఁదగిన స్థానమేదియు నుండదు. అందుచే ధీరుఁడైన యోగికి దేనియందును బ్రవృత్తి యనవసరము. వాఁడు సమస్త కృత్యములనుండి విడివడి పరమాత్మస్వరూపుఁడై యుండును.

న యత్ర కాలోఽనిమిషాం పరః ప్రభుః
కుతో ను దేవా జగతాం య ఈశిరే,
న యత్ర సత్త్వం న రజస్తమశ్చ
న వై వికారో న మహాన్ ప్రధానమ్. 17

అనిమిషాన్=రెప్పపాటులేనట్టి, దేవతలకును, ప్రభుః=ప్రభువై యున్న, కాలః=కాలము, యత్ర=ఎక్కడ, న=లేదో, జగతాం=లోకములను, యే=ఏ దేవతలు, ఈశిరే=నియమింతురో, తే దేవాః=ఆ దేవతలు, కుతః=ఎందుకు, యత్ర=ఏ స్థితియందు, సత్త్వం=సత్త్వమును, రజః చ=రజోగుణమును, తమః చ=తమోగుణమును, వికారః=అహంకారమును, మహాన్=మహత్తత్త్వమును, ప్రధానం=అవ్యక్తప్రకృతియు, న=లేవు,

అవ: సమస్తజగత్తును దానే యైనవాఁడు సమస్త ప్రవృత్తుల నుండి విడివడినవాఁడని పూర్వశ్లోకమందుఁ జెప్పినాఁడు. అతఁ డట్లు డుగుటకుఁ గారణ మేమో యీ శ్లోకమందు వివరించుచున్నాఁడు.

ఇప్పు డట్టి యోగి సాధింపవలసిన దేదియు లేదు. ఎందు కనఁగాఁ బరమాత్మస్వరూపుఁడైన వానివిషయమందు దేవతలనుగూడ బాధించెడి కాలమునకును బ్రవర్తించుటకు శక్తిలేదు. ఆత్మస్వరూపుఁ డైనవాఁడు నాశము నతిక్రమించి యుండును. కాలమే వానిని బాధింపలే దన్నచోఁ గాలముచే బాధింపఁబడెడు దేవతల యధికార మేమి చెల్లును? అట్టి దేవతలచే నియమింపఁబడెడు లోకమందున్న సమస్త పదార్థములును వాని నేమి చేయఁజాలును? సత్త్వ రజ స్తమో గుణములును వానిచే నేర్పడెడు నహంకారము మహత్తత్త్వము అవ్యక్త మైన ప్రధానము ఇవి యేవియుఁగూడ వానిపైఁ బ్రవర్తింపనేరవు. వాఁడు స్వయముగా నిర్వికారానందస్వరూపుఁడై యుండును.

> పరం పదం వైష్ణవ మామనంతి
> తద్యన్నేతి నేతీత్యత దుత్సిసృక్షవః,
> విసృజ్య దౌరాత్మ్య మనన్యసౌహృదా
> హృదోపగుహ్యార్హ పదం పదే పదే. 18

యత్=ఏ కారణముచేత, అసత్=తద్భిన్నమైనదానిని, నేతినేతి=ఇదికా దిదికాదని తెలిసికొని, ఉత్సిసృక్షవః=వదలిపెట్ట కోరిక గలవారు, దౌరాత్మ్యం=

పదే పదే = ప్రతిక్షణమును, హృదా = మనస్సుచేత, ఉపగుహ్య=ఆలింగన మొనర్చికొన్న వారై, అనన్య సౌహృదాః = ఇతరులయందు స్నేహబంధము లేనివారై, వైష్ణవం పదం = విష్ణువునకు సంబంధించిన స్థానమును, పరం = శ్రేష్ఠమైన దని, అమనంతి=తెలిసికొందురు.

అవ: సత్త్వాదిగుణములు మహత్తత్త్వాదులును మాయయు నా స్థితినంటఁజాలవని పూర్వశ్లోకమునఁ జెప్పినాఁడు. దానికిఁ గారణమును వివరించుచున్నాఁడు-

ఆత్మానుభూతి నందఁగోరువారు దేహాదులను గూర్చి విత ర్కించికొని దేహము, ఇంద్రియములు మనస్సు బుద్ధి, చిత్తము, అహంకారము-ఇవేవియు నాత్మస్వరూపము గాదని తెలిసికొందురు ఇవన్నియు ననాత్మలు, అనఁగా జడప్రకృతులు. కనుక దేహాది భావములం దేర్పడిన యాత్మాభిమానమును ఇట్లుగాఁ దర్కించికొని విసర్జింతురు. ఆత్మభిన్నమైన దేనియందును వారి కభినివేశ ముండదు. పూజ్యుఁడైన శ్రీకృష్ణుని పాదమునే నిరంతరమును హృదయమందు ధరించియుందురు. 'అన్నిటికన్నను నుత్కృష్టమైనది వైష్ణవపదమే' యని వా రనుభవించి తెలిసికొందురు. మాయచే బాధింపఁబడని స్థాన మదియే యనెడు నిశ్చయజ్ఞానము వారి కుండును. నిరు పాధికమైన యానందము వైష్ణవపదమే యనుటలో స్వానుభవమే ప్రమాణము.

ఇత్థం మునిస్తూపరమేద్వ్యవస్థితో
విజ్ఞానదృగ్వీర్య సురంధితాశయః,
స్వపార్ష్ణినాఽఽపీడ్య గుదం తతోఽనిలం
స్థానేషు షట్సూన్నమయే జ్జితక్లమః. 19

మునిః తు = మౌనియైనవాఁడు, ఇత్థం = ఈ ప్రకారము, వ్యవస్థితః= నిశ్చయముతోఁ గూడినవాఁడై, విజ్ఞానదృగ్వీర్యసురంధితాశయః=విజ్ఞానముచేత,

హరింపఁబడిన విషయవాసనా ప్రభావముగలవాఁడై, **ఉపరమేత్** = సమస్త కృత్యములనుండి విరమించికొనవలెను, **స్వపార్ష్ణినా** = తన మడమచేత, **గుదం** = గుదస్థానమును, **అపీడ్య** = చక్కఁగా నిరోధించి, **తతః** = అక్కడనుండి, **అనిలం** = వాయువును, **షట్సుస్థానేషు** = ఆఱు స్థానములయందును, **జితక్లమః** = ప్రయాసము లేనివాఁడై, **ఉన్నయేత్** = పైకి లేపవలెను.

అవ: స్వర్గాదిలోకములకుఁ జెంది తత్సుఖముల ననుభవింపవలెనను నాసలేని మౌని ముఁదుచెప్పినట్లు దేహాదులయం దాత్మభావము సంపూర్తిగా విసర్జింపవలెను. బ్రహ్మభావమును బ్రాపింపవలెను. శాస్త్రాభ్యాసముచే సిద్ధించిన విచారబలముతో పునర్జన్మకారణములైన సమస్త వాసనలను సమూలముగ నశింపఁజేయవలెను. సంసారమందు పరమోప రతిని బ్రాపింపవలెను. స్థూలశరీరమును వదలి విదేహకైవల్యము నందవలెను. దేహమును విసర్జించు టెట్లు? తద్విధానమును జెప్పుచున్నాఁడు-

యోగాగ్ని యందు దేహమును భస్మమొనర్చి కొనవలెనని చెప్పుచున్నాఁడు. స్థిరాసనమున నున్నవాఁడై, మడమతో గుదస్థానమును బంధింపవలెను. అపానవాయువును క్రిందికి ప్రసరింపనీయరాదు. బలముగా దానిని నిరోధింపవలెను. తరువాత, దానిని మూలాధారమునుండి బలాత్కారముగా కాక మణిపూరము, అనాహతము, విశుద్ధి, ఆజ్ఞాచక్రము, బ్రహ్మరంధ్రము- ఈ యాఱు స్థానములందును ఒక్కొక్కదానియందును నిలిపి నిలిపి మెల్లమెల్లఁగాఁ బైకిఁ దీసికొనిపోవలెను.

**నాభ్యాం స్థితం హృద్యధిరోప్య తస్మా**
**దుదానగత్యోరసి తం నయేన్మునిః,**
**తతో ఽనుసంధాయ ధియా మనస్వీ**
**స్వతాలుమూలం శనకై ర్నయేత.** ౨౧

=ఉదానవాయు గమనముతో, ఉరసి=వక్షఃస్థలమందు, తం=దానిని, మునిః=మౌనియైనవాఁడు, నయేత్ = తీసికొనిపోవలెను, మనస్వీ = ధీరుఁడైనవాఁడు, తతః=అచ్చటినుండి, ధియా=బుద్ధిసహాయముతో, అనుసంధాయ=సంధానము చేసి (కూర్చి), శనైః=మెల్లమెల్లఁగా, సతాలుమూలం=తన దౌడలమూలమును, నయేత=తీసికొనపోవలెను.

అవ: మూలాధారమునుండి పైపైకి వాయువును దీసికొని పోవలసిన పద్ధతిని క్రమముగా వివరించుచున్నాఁడు. ఇది దివ్యమైన సిద్ధియగుటచే దీనియందు మనస్సును సంపూర్తిగా నుంచవలెను. బలాత్కారముగా నీ పద్ధతి నభ్యసించుట మంచిదిగాదు. ఈ విషయమును చెప్పఁబోవుచున్నాఁడు–

మూలాధారము నుండి నాభి క్రిందనున్న మణిపూర మనెడు చక్రస్థానమందున్న సమానమనెడు పేరుగల వాయువును హృదయ స్థానమందున్న అనాహతచక్రమందలి ప్రాణవాయువుతో యోజింపవలెను. అచ్చటి నుండి కంఠమునకు క్రిందనున్న విశుద్ధిచక్రమును జేర్చవలెను. అచటనున్న వాయువున కుదాన మని పేరు. ప్రాణవాయువు నుదానముతోఁ జేర్చవలెను. మనశ్చాంచల్యము వదలి ఆ వాయువును అనుసంధాన మొనర్చి ధీరుఁడైన ముని యా విశుద్ధి చక్రముయొక్క అగ్రభాగమందున్న తన తాలుమూలమునకు మెల్ల మెల్లఁగాఁ ద్రోయవలెను. ఇక్కడ వాయువు బయటికిఁ బోవుట కనేకద్వారము లున్నవి. రెండు చెవులు మొదలైనవి. ఈ యన్ని స్థానములు గూడ నిశ్చలములుగా నుండవలెను. అనఁగా నీ స్థితి యందు మనస్సు నింకను ప్రబలముగా నిరోధింపవలెను. అందుకే శనైః అన్నాఁడు.

తస్మా ద్భ్రువోరంతర మున్నయేత
నిరుద్ధసప్తాస్యయనో ఽనపేక్షః,
స్థిత్వా ముహూర్తార్ధ మకుంఠదృష్టి
ర్నిర్భిద్యమూర్ధన్విసృజేత్పరం గతః. 21

**తస్మాత్ = దానినుండి, భ్రువోః అంతరం = కనుబొమ్మల మధ్యమును, ఉన్నయేత్ = పొందింపవలెను, నిరుద్ధసప్తాస్యయనః = నిరోధింపఁబడిన, ఏడుప్రాణ మార్గములునుగలవాఁడును, అనపేక్షః = అపేక్షలేనివాఁడునునైన, ముహూర్తార్ధం = అర్ధముహూర్తసమయము, స్థిత్వా = అచ్చట వాయువును నిలిపిన వాఁడై, అకుంఠ దృష్టిః = కుంఠితము గాని దృష్టిగలవాఁడై, మూర్ధన్ = మూర్ధభాగమును, (శిరో భాగమును) నిర్భిద్య = భేదించికొని, పరం = పరబ్రహ్మను, గతః = పొందినవాఁడై, విసృజేత్ = దేహమును వదలవలెను.**

విశుద్ధిచక్రస్థానమైన తాలుమూలము నుండి ప్రాణమును భ్రూమధ్యప్రదేశమునకుఁ దీసికొనిపోవలెను. అదియే యాజ్ఞాచక్రము. తాలుమూలమునుండి ప్రాణగతికి మార్గము లే డున్నవి. శ్రోత్రములు రెండు, నేత్రద్వారములు రెండు, రెండు నాసికాద్వారములు, ముఖ మొక్కటి- ఈ యేడు ద్వారములనుండి వాయువు బయటికి పోనట్లు మన స్సహాయముతో నీ ద్వారములను బంధించవలెను. స్వర్గాదిలోక సుఖములందుఁ దాత్పర్యము లేనివాఁడైనచో పరబ్రహ్మమును లక్ష్య ముగా నొనర్చికొని వానియందే లగ్నమైనమనస్సుగలవాఁడై బ్రహ్మ రంధ్రమును భేదించికొని దేహమును ఇంద్రియములను వదలి పోవలెను.

యది ప్రయాస్యన్నృప పారమేష్ఠ్యం
వైహాయసానా ముత యద్విహారమ్,
అష్టాధిపత్యం గుణసన్నివాయే
సహైవ గచ్ఛే న్మనసేంద్రియైశ్చ. 22

**నృప**:=ఓ రాజా!, **పారమేష్ఠ్యం**=బ్రహ్మదేవుని స్థానమును, **ఉత**=లేక, **వైహాయసానాం**=ఆకాశమందు విహరించు సిద్ధులయొక్క, **యత్ విహారస్థానం**=ఏ క్రీడాస్థానముగలదో దానిని, **గుణసన్నివాయే** = గుణసముదాయ స్వరూపమగు బ్రహ్మాండమందు, **అష్టాధిపత్యం** = అణిమాదులను నేడైశ్వర్యములతోఁ గూడిన స్థానమును, **ప్రయాస్యన్ యది**=ప్రయాణము చేయఁగోరినవాఁడైనచో, **మనసా ఇంద్రియైశ్చ సహ**=మనస్సు, ఇంద్రియములు వీనితోఁబాటు, **గచ్ఛేత్**=పోవలెను.

అవ: ఇంతకు ముందు 'సద్యోముక్తి'ని వివరించినారు. ఇఁకమీఁద 'క్రమముక్తి' ప్రకారమును చెప్పఁబోవుచున్నారు:-

ఓ రాజా! దేహత్యాగము చేయఁగోరుచున్న యోగి బ్రహ్మలోకమునో సిద్ధులు క్రీడించెడు మనోహరమైన స్థానమునో అష్టైశ్వర్యములు మూర్తులను ధరించియున్న స్థానమునో, గుణముల సమ్మేళనముతో నేర్పడిన ఈ బ్రహ్మాండమందలి యేదైన నొక దివ్యలోకమునో పొందవలెనని యాశించెనేని దేహమును వదలుసమయమందు మనస్సును ఇంద్రియములను వదలరాదు. సూక్ష్మశరీరముతో నా యా లోకములకుఁ బోయి యచ్చటనున్న భోగముల ననుభవించుటకై మనస్సుతోను ఇంద్రియములతోను గూడఁ బయనింపవలెను.

**యోగేశ్వరాణాం గతి మాహురంత**
**ర్బహిస్త్రిలోక్యాః పవనాంతరాత్మనామ్,**
**న కర్మభిస్తాం గతిమాప్నువంతి**
**విద్యాతపోయోగ సమాధిభాజామ్.** 23

**విద్యాతపోయోగ సమాధిభాజాం** = విద్య, తపస్సు, యోగము, సమాధి వీని నాశ్రయించినవారు, **పవనాంతరాత్మనాం** = వాయ్వంతర్భాగమందు లింగ శరీరముతోఁ గూడినవారైన, **యోగేశ్వరాణాం**=యోగిపుంగవులయొక్క, **గతిం**= గమనమును, **త్రిలోక్యాః**=మూఁడులోకములయొక్క, **అంతః**=లోపలను, **బహిః** =బయటను, **ఆహుః**=చెప్పెదరు, **తాం గతిం**=ఆ గమనమును, **కర్మభిః**=కర్మల

బ్రహ్మాండమందే లోకమునఁ బ్రవేశింపఁగోరుదురో దాని లోనికిఁ బోవుసామర్థ్యము యోగులకు మాత్రమే యుండును. కర్మ లతో నట్టిస్థితిని బొందుటకు సాధ్యము గాదు. వారిగతి పరిచ్ఛిన్న మైనది. యోగులగమన మపరిచ్ఛిన్నము. ఎందుకనఁగా యోగులకు ప్రాణము స్వాధీనమై యుండును. అందుచే వారి యవసరమును బట్టి సూక్ష్మశరీరమును ప్రాణాంతర్భాగమందు వారు ధరింపఁగలరు. సంచరింపను గలరు. ఉపాసన, భగవద్ధర్మము అష్టాంగయోగము, జ్ఞానము వీని నాశ్రయించియే వారి శరీరధారణ ముండును. ఈ విధముగా నున్న యోగీశ్వరులు మూఁడు లోకముల యంతర్భాగ మున నున్న మహర్లోకాదులందును, బ్రహ్మాండమందును, దానికి వెలుపలను ఇష్టమువచ్చినట్లు ప్రవేశింపఁగలరు ఈ విధమైన గమ నము కర్మనిష్ఠులకు సాధ్యముగాదు. వారివారి కర్మల తారతమ్యము ననుసరించి వారి గతియుఁ బరిచ్ఛిన్నమై యుండును.

> వైశ్వానరం యాతి విహాయసాగత
> స్సుషుమ్నయా బ్రహ్మపథేన శోచిషా,
> విధూతకల్కో౽థ హరేరుదస్తా
> త్ప్రయాతిచక్రం నృప శైశుమారమ్. 24

**శోచిషా — శోభతోఁగూడినదైన, సుషుమ్నయా — సుషుమ్నతోఁబాటు, గతః—పయనించినవారు, విహాయసా—ఆకాశమార్గమున, బ్రహ్మపథేన—బ్రహ్మ లోకమార్గమందు, గతః — పోయినవాఁడై, వైశ్వానరం — అగ్నిని, యాతి — ప్రాపించును, విధూతకల్కః—మలములను సంపూర్తిగాఁ బోఁగొట్టుకొన్నవాఁడై, అథ—అనంతరము, నృప!—ఓ రాజా!, ఉదస్తాత్—పైనుండు పదియు, హరేః— హరికి సంబంధించినపదియునైన, శైశుమారంచక్రం—శింశుమారరూప జ్యోతిశ్చక్ర మును, ప్రయాతి—పొందును.**

జ్యోతిర్మయ మైనదియు, శరీరము లోపలను బయటను వ్యాపించి యున్నదైన సుషుమ్నా మార్గమునఁ బయనించువాఁడు

ఆకాశమందును, అచ్చటినుండి బ్రహ్మలోకమార్గమందును బోవుచున్న వాఁడై, అగ్ని అభిమానియైన దేవతను బ్రాపించును. పుణ్యపాప రూపములైన మలములు అప్పుడు వానిని బంధింపవు. వానిగతి కే విఘ్నముగూడ నుండదు. పై భాగమందున్న శ్రీనారాయణాధిష్ఠిత మైన శింశుమారాశ్రయమైన జ్యోతిశ్చక్రమును వాఁడు పొందును. ఆ స్థానమందున్న ఆదిత్యాది లోకములు మొదలుకొని ధ్రువాంతము లందున్న స్థానములను వాఁడు పొందును.

తద్విశ్వనాభిం త్వతివర్త్య విష్ణో
రణీయసా విరజే నాత్మనై కః,
నమస్కృతం బ్రహ్మవిదా ముపైతి
కల్పాయుషో యద్విబుధా రమంతే. 25

**విశ్వనాభిః** = లోకము నాభిస్థానభూతమైయున్న, **విష్ణోః** = విష్ణువుయొక్క, **తత్** = ఆ స్థానమును, **అతివర్త్య** = అతిక్రమించి, **అణీయసా** = చాలచిన్నదియు, **విరజేన** = నిర్మలమైనదియునైన, **ఆత్మనా** = లింగశరీరముతో, **ఏకః** = ఒక్కఁడే, **బ్రహ్మవిదాం** = బ్రహ్మవిదులైనవారికి స్థానమును, **నమస్కృతం** = సర్వులచేత నమస్కరింపఁబడునదియునైన లోకమును, **ఉపైతి** = పొందును, **యత్** = దేని యందు, **కల్పాయుషః** = కల్పాంతమాయుస్సు కల్గియున్న, **విబుధాః** = విద్వాంసులు, **రమంతే** = రమింతురో.

సూర్యాదిగోళముల కాశ్రయమైన యా శింశుమారచక్రమును దాఁటిన తర్వాత మఱియుఁ బైకి పోవును. అచ్చట దేవతలకుఁ బ్రవేశము లేదు. అందుకే 'ఏకః' అన్నది. అటునుండి పైకిఁ బయ నించిన యోగి పరమనిర్మలమైన లింగశరీరముతో బ్రహ్మవేత్తల స్థానమును బొందును. అచ్చట భృగ్వాదులైన మహర్షు లుందురు. వారు కల్పాంతాయుష్మ్కులు.

దందహ్యమానం స నిరీక్ష్యవిశ్వమ్,
నిర్యాతి సిద్ధేశ్వరజుష్టధిష్ణ్యం
యద్ద్వై పరార్ధం తదుపారమేష్ఠ్యమ్. 26

అథో: = అనంతరము, సః = వాఁడు, అనంతస్య = ఆదిశేషునియొక్క, ముఖానలేన = ముఖాగ్నిచేత, విశ్వం = లోకమును, దందహ్యమానం = దహింపఁబడుచున్న దానినిగా, నిరీక్ష్య = చూచి, యత్ = ఏది, పరార్ధం = పరార్ధకాలము వఱకుండునో, సిద్ధేశ్వరజుష్టధిష్ణ్యం = సిద్ధేశ్వరులచేత నాశ్రయింపఁబడిన వాసస్థానమైన, తత్ ఉ పారమేష్ఠ్యం = ఆ శ్రేష్ఠమైన పరమేష్ఠిస్థానమును, నిర్యాతి = ప్రాపించును.

పైనిఁ జెప్పినట్లు యోగి మహర్లోకమును బొంది యక్కడి యుష్ణమును జూచి పైకిఁ బోవును. ఆదిశేషుని ముఖాగ్నిచేత నది యెక్కువగా దహింపఁబడుచుండును. అచ్చటినుండి వాఁడు బ్రహ్మలోకమును బ్రాపించును. అచ్చటు సిద్ధేశ్వరుల స్థానముండును. ఆ లోకము ద్విపరార్ధకాలాయుష్కము. అది సర్వోత్కృష్టస్థానము.

న యత్ర శోకో న జరా న మృత్యు
ర్నార్తి ర్నచోద్వేగ ఋతే కుతశ్చిత్,
యచ్చిత్తతోఽదః కృపయాఽనిదం విదాం
దురంతదుఃఖ ప్రభవానుదర్శనాత్. 27

యత్ర = ఎచ్చట, శోకః = దుఃఖము, న = లేదో, జరా న = ముసలితనము లేదో, మృత్యుః న = మరణములేదో, ఆర్తిః న = పీడయునులేదో, అనిదం విదాం = దీనిని అనఁగా నాత్మను దెలియనివానియొక్క, దురంతదుఃఖ ప్రభవానుదర్శనాత్ = నిరంతరము దుఃఖముతోఁ గూడిన జన్మములను జూచుటతో నేర్పడెడు, కృపయా = దయతోఁ గలిగిన, యచ్చిత్తతోఽదః = ఏ మనఃక్లేశముగలదో, ఋతే = దానినివదలి, కుతశ్చిత్ = ఏవైపునుండిగాని, ఉద్వేగః చ న = భయముగూడనుండదు,

అవ: బ్రహ్మలోక మత్యుత్కృష్ట మనుటకుఁ గారణమును దెల్పుచున్నాఁడు—

అచ్చట దుఃఖ ముండదు. జర యుండదు మరణము గూడ లేదు. శారీరక పీడ, భయము మొదలైన వేవియు నందుఁ జొరఁ జాలవు. వారు ఆత్మానందమును నిరంతర మనుభవింపు చుందురు. వారికున్న దుఃఖమొక్కటే. ఆ దుఃఖము దయతో నేర్పడినది. నిరంతరమును ఆనందము ననుభవించు తమ స్థితిని దలఁచి ఆ స్థితి నంద లేక జన్మ జరా మృత్యు దుఃఖములతో బాధపడుచున్న వారిని గూర్చి యప్పుడప్పుడు వారికి మనఃక్లేశ మేర్పడుచుండును. ఇది దప్ప వారికితర మే దుఃఖము లేదు.

తతో విశేషం ప్రతిపద్యనిర్భయ
స్తేనాత్మనా ఽపోఽనలమూర్తిరత్వరన్,
జ్యోతిర్మయో వాయు ముపేత్య కాలే
వాయ్వాత్మనా ఖం బృహదాత్మలింగమ్. 28

**తతః=అచ్చటనుండి విశేషము పృథివీరూపమును, ప్రతిపద్య=పొందినవాఁడై, నిర్భయః=భయము లేనివాఁడై, తేన ఆత్మనా=ఆ రూపముతో, అపః ప్రతిపద్య=జలాత్మను బొంది, అత్వరన్=తొందరపాటు లేనివాఁడై, జ్యోతిర్మయః=జ్యోతిస్స్వరూపుఁడై, కాలే=కాలమందు, వాయ్వాత్మనా=వాయుస్వరూపముతో, బృహత్ = పెద్దదైన, ఆత్మలింగం = ఆత్మచిహ్నముతోఁ గూడినదైన, ఖం=ఆకాశాత్మను బొందును.**

అవ: ఇప్పుడు ఇచ్చటునుండి భగవద్భక్తుఁడైన యోగి బ్రహ్మాండము నధిగమించి భగవత్సాయుజ్యమును బొందెడు పద్ధతి వివరించుచున్నాఁడు. జగదుత్పత్తిని సరిగా క్రమముగా నర్థముఁ జేసికొన్ననే దప్ప ఈ విషయము స్పష్టపడదు. అందుచే జగత్తుయొక్క యుత్పత్తి

ఈశ్వరాధిష్ఠితమైన ప్రకృతినుండి మహతత్త్వ మేర్పడును. దానినుండి యహంకారతత్త్వము, దాని యంశముతో శబ్దతన్మాత్ర; దానితో నాకాశము; ఆకాశాంశముతో స్పర్శతన్మాత్ర యేర్పడును. దానితో వాయువు; వాని యంశముతో రూపతన్మాత్ర; తద్ద్వారా తేజస్సు; దాని యంశముతో రసతన్మాత్ర; తద్ద్వారా జల మగును; జలాంశతో గంధతన్మాత్ర; దానితో పృథివి యేర్పడును; ఒకదానితో నొకటి చేరిన ఈ పంచభూతములతో పదునాల్గు లోకములును, వాని సమష్టిరూపమైన విరాట్ఛరీరము గల్గినది. తొంబదికోట్ల యోజనముల విశాలమైన బ్రహ్మాండము యొక్క విశేషకటాహ రూపముగా నుండునదే పృథివి. అందుకే దానికి విశేష మని పేరు. బ్రహ్మాండము యొక్క మొదటి యావరణము కోటియోజనముల విశాలము. తరువాత జలాదులుగాఁ బరిణమించిన యంశములకు పదికోట్ల యోజనముల యాధిక్యము చేరుచుఁ బోవును. ఏడవ యావరణమైన ప్రకృతి వ్యాపకవస్తు వగుటచేత సర్వత్ర వ్యాపించి యుండును. ఈ రీతిగా నున్న బ్రహ్మాండమును భేదించికొనిపోయిన తర్వాతనే సాయుజ్య ప్రాప్తి. భగవద్భక్తుఁడైన యోగి పరమపదము నే రీతిఁ జెందునో యిప్పుడు వివరింతుము. బ్రహ్మలోకమందున్న యోగి లింగదేహముతో భూమ్యాత్మకత్వమును బొందును. ఏ రూపమును వాఁడు పొందినను సర్వత్ర గమనశక్తి వాని కుండును. కనుక ఇఁకపై నెట్లు పోవలెనను ప్రశ్న యే వాని కుండదు. వాఁడా భూమ్యాత్మకత్వముతో జలాత్మకత నందును. తర్వాత నగ్న్యాత్మకత. అటుపై వాయ్వాత్మకత. దాని పైన శబ్దలక్షణమైన యాకాశాత్మత్వమునుఁ గూడ పొందును. ఈ యొక్కొక్క యవస్థయందును ఖేదము, దాహము మొదలైన వేవియు వానిని బాధింపవు. అందుచేత నాయా యవస్థలయందున్న భోగము

ఘ్రాణేన గంధం రసనేన వై రసం
రూపంతు దృష్ట్యా శ్వసనం త్వచైవ,
శ్రోత్రేణ చోపేత్య నభోగుణత్వం
ప్రాణేన చాకూతి ముపైతి యోగీ 29

ఘ్రాణేన—నాసికతో, గంధం—గంధమును, రసనేవ—జిహ్వతో, రసం—రసమును, దృష్ట్యాతు—దృష్టితో, రూపం—రూపమును, త్వచా ఏవ—చర్మముతో, శ్వసనం—స్పర్శమును, శ్రోత్రేణ=చెవిచేత, నభోగుణత్వం—ఆకాశగుణమైన శబ్దాత్మకను, ఉపేత్య—పొంది, ప్రాణేన=ఇంద్రియముతో, ఆకూతిం—క్రియను, యోగీ—యోగియైన పురుషుఁడు, ఉపైతి—ప్రాపించును.

అవ: ఇంద్రియముల విషయములైన సూక్ష్మభూతములను యోగి యే రీతిగా నతిక్రమించునో దానినిఁ జెప్పుచున్నాఁడు—

ఘ్రాణేంద్రియముతో గంధమును, రసనతో రసమును, నేత్రముతో రూపమును, త్వగింద్రియముతో స్పర్శమును, శ్రోత్రముతో శబ్దమును అతిక్రమించి ఆ యా యింద్రియములతో నా యా ప్రవృత్తిని యావహించును.

స భూత సూక్ష్మేంద్రియ సన్నికర్షం
మనోమయం దేవమయం వికార్యమ్,
సంసాద్య గత్యా సహ తేన యాతి
విజ్ఞానతత్త్వం గుణసన్నిరోధమ్. 30

సః భూతసూక్ష్మేంద్రియ సన్నికర్షం — భూతసూక్ష్మముల యొక్కయు, ఇంద్రియములయొక్కయు లయస్థాన మయ్యును, మనోమయం — మనోమయమయ్యును, దేవమయం—దేవమయుఁడయ్యును ఉన్న, వికార్యం—అహంకారమును, సంసాద్య — పొంది, తేన సహ — దానితోఁగూడియున్న, గత్యా—గమనముతో, గుణసన్నిరోధం=గుణముల లయస్థానమైన, విజ్ఞానతత్త్వం — మహత్తత్త్వమును, యాతి—ప్రాపించును.

అవ: స్థూలభూతములు, సూక్ష్మభూతములు వీనిని దాఁటి పోయిన సంప్రదాయమును జెప్పిన తర్వాత అహంకారతత్త్వమును దానిద్వారా మహత్తత్త్వ ప్రాప్తియుఁ జెప్పుచున్నాఁడు—

ఆ యోగి సూక్ష్మభూతములను గడచి అహంకారతత్త్వమును బొందును. ఈ యహంకారము మూఁడు విధములు. తామసాహంకారమునుండి జడములైన భూతసూక్ష్మములు జనించును. రాజసాహంకారమునుండి బహిర్ముఖములైన పది యింద్రియములు పుట్టును. సాత్త్వికాహంకారము నుండి మనస్సు ఇంద్రియాధిష్ఠాన దేవతలును బుట్టుదురు. కనుక యోగి దాని దాని యుత్పత్తిస్థానమందు దాని దానిని లయింపఁజేయును—అని చెప్పుటయే దీనిలోని సారము. భూత సూక్ష్మములు, ఇంద్రియములు—వీని లయస్థానములు తామస రాజసాహంకారములు; మనస్సు, ఇంద్రియములు - వీని లయస్థానము సాత్త్వికాహంకారము. వీనినిఁ బొందినవాఁడై అహంకార తత్త్వము తోఁబాటు విజ్ఞానతత్త్వమైన మహత్తత్త్వమును బ్రాపించును. తర్వాత గుణముల లయస్థానమైన ప్రధానము నందును. దానికి ప్రకృతి యనియు, నవ్యక్త మనియు నెన్నియో పేరులు. ముందుఁ జెప్పిన ప్రతిదానిని దాని యుత్పత్తిస్థానములందు లయింపఁ జేసి ప్రకృతి స్వరూపుఁడుగా నగునని సారము.

తేనాఽఽత్మఽఽనాత్మాన ముపైతి శాంత
మానందమానంద మయోఽవసానే,
ఏతాం గతిం భాగవతీం గతో యః
స వై పునర్నేహ విషజ్జతేఽంగ. 31

**తేనాత్మనా—ఆ స్వరూపముతో, ఆనందః—ఆనందస్వరూపుఁడై, అవసానే—కడపట, ఆనందం—ఆనందమును, శాంతం—పరమశాంతితోఁ గూడినదియునై యున్న, ఆత్మానం—పరమాత్మను, ఉపైతి—పొందును, భాగవతీం—భగవత్స్వ**

ఎవఁడు పొందినాఁడో, సః—వాఁడు, అంగ—ఓ రాజా, పునః—మఱల, ఇహ—ఈ సంసారమందు, న విషజ్జతే—చేరఁడు.

ఓ రాజా! ప్రధాన మనెడు తత్త్వముగా నైన నా యోగి ఆ తత్త్వస్వరూపముతోఁ బాటు ఆనంద మందును. ఇట్లు సమస్తోపాధుల దాఁటి ఉపాధిరహితమై యానందఘనమైన పరమాత్ముఁడుగా వాఁడు మాఱును. ఇదే భగవత్ప్రాప్తి యను మోక్షము. ఈ స్థానమును బొందినవాఁడు మఱల జనన మరణములతోఁ గూడిన సంసారము నకురాఁడు. 'న స పునరావర్తతే' అనెడు శ్రుతివాక్యమున కిదే యర్థము.

ఏతే సృతీ నృప వేదగీతే
త్వయాఽభిపృష్టే చ సనాతనే చ,
యే వై పురా బ్రహ్మణ ఆహ పృష్ట
ఆరాధితో భగవా న్వాసుదేవః. ౩౭

నృప—రాజా!, వేదగీతే—వేదమందుఁ జెప్పఁబడినవియు, త్వయా—నీచేత, అభిపృష్టే—అడుగఁ బడినవియు, సనాతనే చ = ఎప్పుడు నుండునవియు నైన, ఏతే సృతీ—ఈ రెండుమార్గములును, ఇహ—ఇప్పుడు నాచేతఁ జెప్పఁబడినవి, యే వై—ఏ రెండు, పురా—ముందు, ఆరాధితః=పూజింపఁబడిన, భగవాన్ వాసుదేవః—భగవంతుఁడైన వాసుదేవుఁడు, పృష్టః—ప్రశ్నింపఁ బడినవాఁడై, బ్రహ్మణే—బ్రహ్మదేవుని గూర్చి, ఆహ—పలికెను.

ఓ రాజా! సద్యోముక్తి, క్రమముక్తి ఈ రెంటిని గూర్చి నీ వడిగితివి ఆ రెంటిని నీకు వివరించినాను. ఇఁక వేదమునందుఁ జెప్పఁబడిన రెండు మార్గములు; ఇవి సనాతనములు. బ్రహ్మచేఁ బ్రశ్నింపఁ బడినవాఁడై సమ్యగారాధితుఁడైన వాసుదేవుఁడు వివరించిన వీరెండు మార్గములే. ఇది నా యభిప్రాయము గాదు. భగవంతుఁడే యుపదేశించినవి.

న హ్యతోఽన్యశ్శివః పంథా విశతస్సంసృతావిహ,
వాసుదేవే భగవతి భక్తియోగో యతో భవేత్. 33

**యతః = దేనినుండి, భగవతి = భగవంతుఁడైన, వాసుదేవే = వాసుదేవుని యందు, భక్తియోగః=భక్తియోగము, భవేత్=ఏర్పడునో, అతః=దీనికంటెను, శివః=సుఖరూపమైన, పంథాః=మార్గము, ఇహ సంసృతౌ=ఈ సంసారమందు, విశతః=ప్రవేశించియున్నవానికి, నహి=లేదు.**

జననమరణముల కధీనుఁడైయున్న పురుషునకు తపస్సుమొదలైన మోక్షమార్గము లెన్నో యున్నవి. వానిలో శ్రేష్ఠమైన దిదియే. దీని ననుసరించిన జ్ఞానాద్యైశ్వర్యములు నిండియున్న వాసుదేవునందు పరమప్రేమ లక్షణమైన భక్తియోగము జనించును. సంసారగతుఁడైన మానవునికు నింతకన్న సరియైనమార్గము అనుష్ఠాన యోగ్యమైనది లేదు.

భగవాన్ బ్రహ్మకార్త్స్న్యేన త్రిరన్వీక్ష్యమనీషయా,
తదధ్యవస్యత్కూటస్థో రతి రాత్మన్యతో భవేత్. 34

**భగవాన్ = బ్రహ్మదేవుఁడు, కూటస్థః = నిర్వికారుఁడై, మనీషయా = బుద్ధితో, కార్త్స్న్యేన=పూర్తిగా, బ్రహ్మ=వేదమును, త్రి రన్వీక్ష్య=మూఁడు సార్లు పరిశోధించి, యతః=దేనినుండి, ఆత్మని=బ్రహ్మస్వరూపుఁడైన హరి యందు, రతిః=పరమప్రేమ, భవేత్=ఏర్పడునో, తత్=దానిని, అధ్యవస్యత్= నిశ్చయించెను.**

అవ: ఇంతకంటెను శ్రేష్ఠమైనమార్గము లేదను టెందులకు ? దానికి సమాధానము—

బ్రహ్మ ఏకాగ్రచిత్తుఁడై మూఁడుసార్లు వేదమునంతయుఁ బరిశీలించినాఁడు. పరిశోధించి సర్వాత్మస్వరూపుఁడైయున్న శ్రీహరి యందు పరమప్రేమ జనించుటకు మార్గమేది గలదో అదే యుత్కృ

భగవాన్ సర్వభూతేషు లక్షిత స్స్వాత్మనా హరిః,
దృశ్యై ర్బుద్ధ్యాదిభి ర్ద్రష్టా లక్షణై రనుమాపకైః. ౩౫

**భగవాన్ = జ్ఞానాది పరిపూర్ణుఁడైన, హరిః = హరి, సర్వభూతేషు = సమస్తభూతములయందును, దృశ్యైః = జడములైన, బుద్ధ్యాదిభిః = బుద్ధ్యాదులతో అనుమాపకైః = అనుమానించుట కుపకరించుచున్న, లక్షణైః = లక్షణములతో, స్వాత్మనా = అంతర్యామిరూపముగా, ద్రష్టా = ద్రష్టయై, లక్షితః = చూడఁబడు చున్నాఁడు.**

అవ: అనుభవించి తెలిసుకొన్ననే గదా రతి యేర్పడుట! అనుభవ విషయము గాని భగవంతునం దది యెట్లేర్పడును? ఈ ప్రశ్నకు భగవంతుఁడు తెలిసికొనుట కసాధ్యుఁడు గాఁడు. అందఱి చేతను దెలిసికొనఁ బడినవాఁడే. అందుచే నందఱకును భగవంతు నందు రతి యేర్పడుట కవకాశ మున్నదని చెప్పుచున్నాఁడు—

భగవంతుఁడైన శ్రీహరి సకలభూతములందును జీవరూపుఁడుగా వసించుచున్నాఁడు. ఇది యందఱకును దెలిసిన విషయమే. జీవుని ప్రేరణములేనిది బుద్ధ్యాదుల ప్రవృత్తి యేర్పడదు. అవి స్వరూపముగా జడములు. ఒకరిచేతిలో నున్న చాకు, కత్తి మొదలైనవి వానినిపట్టు కొన్న వాని ప్రేరణలేనిదే స్వయముగాఁ బ్రవర్తింపవు గదా! అట్లే బుద్ధ్యాదులు వానివాని విషయములందుఁ బ్రవర్తించుచున్నవన్నచో దానికి జీవుని ప్రేరణమే కారణము. ఈ సంగతినే రెండు రీతులుగా వివరించుచున్నాఁడు. జ్ఞానము, స్వాతంత్ర్యము గల ద్రష్టయే జడ ములు, నస్వతంత్రములు నైన ఘటాది పదార్థములను జూచుచు న్నాఁడు. అట్లే జడాదులైన నేత్రాదీంద్రియనులును బుద్ధ్యాదులును దర్శనాది వ్యాపారము లొనర్చుచున్నది జీవునియొక్క సంబంధము తోనే. అందుచేత ప్రతియొక్కరికిని జీవచైతన్య మనుభవసిద్ధమే. కర్త

స్వతంత్రుఁడైన ఈశ్వరుని సాన్నిధ్యము బుద్ధ్యాదుల కుండుటచేతనే అవి తమ వ్యాపారములను నిర్వహించుచున్నవి అని యనుమానిం చుట కుపకరించు లక్షణ ముండుటచేత శ్రీహరి సర్వులచేతను దెలిసి కొనఁబడినవాఁడే. వానియందు రతి యేర్పడుట కవకాశమున్నది.

తస్మా త్సర్వాత్మనా రాజన్! హరి స్సర్వత్ర సర్వదా,
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ స్మర్తవ్యో భగవాన్ నృణామ్. 36

తస్మాత్=అందుచేత, రాజన్=ఓ రాజా!, సర్వదా=ఎప్పుడునూ, సర్వత్ర =అన్ని కార్యములందును, నృణాం=మనుష్యులకు, శ్రోతవ్యః=వినఁదగినవాఁ డును, కీర్తితవ్యః=కీర్తింపఁదగినవాఁడును, స్మర్తవ్యః=స్మరింపఁదగినవాఁడును, సర్వాత్మనా=ఎటుచూచినను, భగవాన్ హరిః=భగవంతుఁడైన హరియొక్కఁడే.

కనుక రాజా! సర్వకాలములందును, సర్వదేశములందును, సర్వకర్మములందును కీర్తింపఁదగినవాఁడు హరి యొక్కఁడే. శ్రోత వ్యుఁడు వాఁడే స్మర్తవ్యుఁడు వాఁడే. వాఁడు దప్ప వేఱు లేఁడు.

పిబంతి యే భగవత ఆత్మన స్సతాం
కథామృతం శ్రవణపుటేషు సంభృతమ్,
పునంతి తే విషయవిదూషితాశయం
వ్రజంతి తచ్చరణ సరోరుహాంతికమ్. 37

యే=ఎవరు, సతాం=సత్పురుషులయొక్క, ఆత్మనః=ఆత్మస్వరూపుఁడై వెలుఁగుచున్న, భగవతః=భగవంతునియొక్క, కథామృతం=కథయను నమృత మును, శ్రవణపుటేషు=కర్ణపుటములందు, సంభృతం=నిండించికొని, పిబంతి= త్రావుదురో, తే=వారు, విషయవిదూషితాశయం = విషయములచేత నెక్కువగా కల్మషమైన యంతఃకరణమును, పునంతి=పవిత్ర మొనర్చికొందురు, తచ్చరణ సరోరుహాంతికం=ఆ భగవంతుని పాదపద్మ సమీపమును, వ్రజంతి=పొందుదురు.

అవ: శ్రీహరి కథాశ్రవణ ఫలమును వివరించుచున్నాఁడు—

సత్పురుషుల హృదయాంతర్భాగమందు ఆత్మస్వరూపుఁడుగాఁ బ్రకాశించుచున్న భగవంతునికథ యను సమృతమును శ్రవణపుటములందు నిండించి యెవరు పాన మొనర్తురో వారు విషయవాసనలతో దూషితమైన యంతఃకరణమును బవిత్ర మొనర్చుకొందురు. జన్మావసానమున శ్రీహరి పాదపద్మములను జేరుదురు.

ఈ శ్లోకమందు 'సతాం ఆత్మనః' - పరమాత్ముఁ డంతటి హృదయము లందునుఆత్మస్వరూపుఁడుగా వెలుఁగుచున్నాఁడు. అట్టి 'సతాం' అనుటెందులకు? తమ హృదయములందు శ్రీహరియున్నాఁ డని తెలిసికొని తదనుగుణముగాఁ బ్రవర్తించునది సత్పురుషులే. అందుచే విశేషముగాఁ జెప్పినాఁడు. దీనితో నితరుల హృదయముల యందాత్మలేదని యర్థము గాదు.

శ్రీధరీయము:

ద్వితీయే తు తతస్థూలధారణాతో జితం మనః,
సర్వసాక్షిణి సర్వేశే విష్ణౌ ధార్య మితీర్యతే.
దృశ్యాలంబనరూపైవ ముక్తా వై రాజధారణా,
ఇహోచ్యతే తు తద్భేద్యా సర్వాంతర్యామి ధారణా.

ద్వితీయాధ్యాయమందు స్థూలస్వరూపమందలి ధారణతో నంకెకు వచ్చిన మనస్సును సర్వసాక్షియు సర్వేశ్వరుఁడును నైన విష్ణువునందుంపవలెనని చెప్పఁబడుచున్నది. దృశ్యాలంబనరూపమైన వైరాజ పురుషునియొక్క ధారణ ముందు చెప్పఁబడినది. ఇప్పుడు సర్వాంతర్యామిధారణ వివరింపఁబడుచున్నది.

అవ: వైరాజపురుష ధారణచే నేర్పడిన యవాంతరఫలమైన విశ్వసృష్ట్యాదికమును వివరించుచున్నాఁడు-

ఏవం=ఈ విధమైన ధారణచేత, తుష్టాత్ హరేః పురా=ప్రళయ సమయమందు, నష్టాం స్మృతిం ప్రత్యవరుధ్య=అప్యయాత్ ప్రాక్,

సాయ బుద్ధిః _ వ్యవసాయాత్మికమైన బుద్ధిగలవాఁడు, అందుచేతనే అమోఘమైన దృష్టిగలవాఁడు, కనుక నిట్టి ధారణచేత విశ్వసృష్టి సామర్థ్య మేర్పడెనని చెప్పినట్లైనది. ।

అవ: ఉపాసనాఫలమునందు ఏ మాత్ర మిచ్ఛలేనివానికే శుద్ధాత్మధారణయం దధికారము. అందుచే వైరాగ్యార్థము సర్వకర్మ ఫలమును నిందించుచున్నాఁడు_

శాబ్దస్య హి బ్రహ్మణః _ శబ్దమయమైన వేదముయొక్క, ఏష

అవ: రెంటితో వాని యన్యథాసిద్ధిని చెప్పుచున్నాఁడు-

కశిపోః=శయ్యయొక్క, ప్రయాసైః కిం? బాహౌ స్వసిద్ధే సతి ఉపబర్హణైః కిం? పురుధా=బహుప్రకారమైన, అన్నపాత్ర్యా=భోజన పాత్రచేత, కిం? దిగ్వల్కలాదౌ సతి=దిక్కులనెడు గుడ్డ యుండఁగా అనఁగా నగ్నుఁడై యుండవచ్చునని యనుమతి. 4

అవ: వల్కలము, అన్నము, నీరు, గుడ్డ, వాసస్థానము ఇవి యాచించని డెట్లు సమకూడును? దాని కుత్తరము-

చీరాణి=వస్త్రఖండములు, పరభృతః - పరాన్ బిభ్రతి పుష్ణంతి ఫలాదిభి ర్యే. తమ ఫలాదులతో నితరులకుఁ దుష్టి నిచ్చునవి గుహాః =సుఖశయన ఉపవేశనా ద్యుపయుక్తములైన గిరిదరులు, రుద్ధాః కిం? =రాజులచే నడ్డగింపఁబడినవా? అవియు దొరకకున్నపు డేమి చేయ వలెనో చెప్పుచున్నాఁడు. అజితః ఉపపన్నాన్ న అవతి కిం?-భగవం తుఁడు శరణాగతులను రక్షింప డా? కిం శబ్దమునకు పూర్వవాక్యము లోనికిఁ గూడ నన్వయము. ధనముచేత నేర్పడెడు దుర్మదముతో నంధులు. 5

ఏవం=ఈ రీతిగా విరక్తుఁడై, తం భజేత=వానిని సేవింపవలెను భజనీయత్వములో హేతువులను జెప్పుచున్నాఁడు. స్వచిత్తే స్వత ఏవ సిద్ధః = తన మనస్సునందు స్వాభావికముగా నున్నవాఁడు. ఆత్మా=తానే యైనవాఁడు. అందుకే పరమప్రియుఁడు. ప్రియుఁడైన వానికిఁ జేయు సేవ సుఖముగనే యుండును. అర్థః=సత్యస్వరూపుఁడు, అనాత్మవలె మిథ్యారూపుఁడు గాఁడు. భగవాన్=భజింపఁదగిన గుణ ములు గలవాఁడు, అనంతః=నిత్యుఁడు. ఆత్మానందానుభవముచేత నిర్వృతిని బొందినవాఁడై దీనితో నేర్పడెడు స్వతస్సుఖము చెప్పఁబడిన

తాం_అట్టిదైన, పరానుచింతాం = సర్వోత్తముఁడైన శ్రీహరి యొక్క ధారణ నాదరించి, పశూన్ ఋతే=కర్మజడులైన వారుఁదప్ప 'యథా పశురేవ సర్వదేవానాం' అని శ్రుతి. అసతీం_విషయ చింతను, కో నామకుర్యాత్ ?_ ఎవఁడు చేయును? వానినిఁ జింతించుటచేత, వైతరణ్యాం, పతితం, స్వకర్మజాన్_తన కర్మతో నేర్పడిన, యాధ్యాత్మికాది క్లేశములను, జుషాణం పశ్యన్. వైతరణీ యనఁగా యమ ద్వారమున నున్న నది. దానితో సమానమగుటచే సంసారమునే వైతరణి యనుచున్నాఁడు. ఆ ధారణనే యాఱు శ్లోకములతో వివరించుచున్నాఁడు. స్వదేహాంతర్హృదయావకాశే=తన దేహమధ్యమందున్న హృదయముయొక్క యవకాశము. దానియందు వసంతం=ఉండుచున్నవాఁడు, ప్రాదేశ మనఁగా తర్జని, అంగుష్ఠము-వీని మధ్య ప్రదేశము_జేనెడు అని యర్థము. అదియే మాత్రా=ప్రమాణముగాఁ గలవాఁడు_ప్రాదేశమాత్రుఁడు. దీనితో హృదయపరిణామము గూడఁ దెలిపిన ట్లైనది. 7

నలినాయతేక్షణం_నళిన మనఁగా పద్మము. దానివలె ప్రసన్నములై, ఆయత=దీర్ఘములైన, ఈక్షణములు గలవాఁడు. కదంబకింజల్క పిశంగ వాససం=కదంబకుసుమము యొక్క, కింజల్కములు=కేసరములు, వానివలె పిశంగములు = పచ్చనివైన గుడ్డలు గలవాఁడు, లసంతి మహారత్నాని యేషు తాని సువర్ణమయా న్యంగదాని, యస్య =రత్నములు పొదుగఁబడిన బంగారు బాహుపురులు గలవాఁడు, 'స్ఫురంతి చ తాని మహారత్నాని తన్మయ కుండలాని యస్య'= ప్రకాశించెడు రత్నబహుళములైన కిరీటకుండలములు గలవాఁడు 8

ఉన్నిద్రం_వికసించినట్టి, యత్ హృత్పంకజం, తస్య కర్ణికా ఇవ. దిమ్మెయే, ఆలయం = స్థానము, యోగేశ్వరులచేత స్థాపించి కొనఁబడిన పాదపద్మములు గలవాఁడు. శ్రీలక్ష్మణం=శ్రీరేవ లక్ష్మ

యస్య సః - లక్ష్మీదేవియే యనన్యాదృశమైన చిహ్నముగాఁ గల వాఁడు. ఇక్కడ మత్వర్థీయమందు అచ్ ప్రత్యయము కౌస్తుభరత్న కంధర కౌస్తుభరత్నం కంధరాయాం యస్య సః-కంఠమందు కౌస్తుభ రత్నము గలవాఁడు. అమ్లానలక్ష్మ్యా-ఎప్పుడును తఱుఁగని శోభగలి గిన, వనమాలయా=వనమాలచేత, ఆచితం=వ్యాప్తమైనది.

స్నిగ్ధత్వాది విశిష్టములైన కుంతలములచేత, విరోచమాన= ప్రకాశించు హాసముచేత, పేశలం=సుందరమైనవాఁడు- 11

అదీన - ఉదారమైన, లీలాహసితము దానిచేఁ గూడికొన్న, ఈక్షణం-చూపు, దానియందు 'ఉల్లసంతో యే భ్రూభంగాః' అడు చున్న భ్రూవిక్షేపములు, 'తైః సంసూచితో భూర్యనుగ్రహోయేన' 'చింతామయం' ధారణచే నావిర్భవించువాఁడు. 12

ధ్యానప్రకారమును జెప్పుచున్నాఁడు పాదాదియావద్ధసితం- పాదములు మొదలుకొని నవ్వువఱకును, అనుభావయేత్=చింతింప వలెను, జితం-అయత్నముగా స్ఫురించునది. అట్టి పాదగుల్ఫాది స్థానములు, అపోహ్య=వదలి, పరం-జంఘజాన్వాదులను, ధార యేత్ =చింతింపవలెను, శుద్ధ్యతి=నిర్మలమగువఱకును. 13

పూర్వోక్తమైన వైరాజధారణము, దీనికే యంగమనుచున్నాఁడు. పరే=బ్రహ్మాదులు, విశ్వేశ్వరే = బ్రహ్మాదులను నియమించువాఁడు, ద్రష్టరి-దృశ్యమందుఁ గాదని యర్థము. ప్రేమరూపమైన భక్తి యోగము, క్రియావసానే-అవశ్య కర్మానుష్ఠానానంతరము; దీనిచేత, కర్మానుష్ఠానము పరమప్రేమలక్షణమైన భక్తియోగము సిద్ధించువఱకే యని చెప్పినట్లైనది. 14

అవ: ఇంతవఱకును అనన్యమృత్యుఁడైన పురుషుని కృత్యము చెప్పఁబడినది. ఇప్పుడు తనకుఁదానె దేహము వదలఁ దలఁచుకొన్న

యుత్వా యదా ఇమంలోకం=ఈ శరీరమును, జిహాసుః=వదలఁ దలఁచుకొన్నాఁడో అప్పుడు పుణ్యక్షేత్రమందుఁ గాని ఉత్తరాయణాది పుణ్యకాలమందుఁ గాని, మనః నస్సృజేత్=సంగము నుంచికొనరాదు. అనఁగా వానికొఱకై కాచికొనరాదని యర్థము యోగియైన వానికి దేశకాలములు సిద్ధిహేతువులు గావు, యోగమే సిద్ధిహేతువు. ఈ విధమైన దృఢనిశ్చయముగలవాఁడై స్థిరమై, సుఖకరమైన యాసనమును వహించి, ప్రాణాన్=ఇంద్రియములను, నియచ్ఛేత్=నియమింపవలెను. 15

మనః = విషయగృహీతమైన మనస్సును, బుద్ధ్యా = నిశ్చయాత్మకమైన బుద్ధిచేత, నియమ్య=నియమించి, మనోనిగ్రహసాధనీభూతమైన బుద్ధిని, క్షేత్రజ్ఞే = బుద్ధ్యాదుల ద్రష్టయైన జీవునందు, వినయేత్ =లయింపఁజేయవలెను, తం=ఆ క్షేత్రజ్ఞపురుషుని, ఆత్మని=శుద్ధతత్త్వమందును, తం చ=ఆ శుద్ధాత్మను, ఆత్మని=తనయందును, అవరుధ్య=ఏకీకృత మొనర్చి, లబ్ధోపశాంతిః = ఆత్మానందమునందినవాఁడై, కృత్యాత్ విరమేత్. 16

అవః అపై పొందఁదగినది లేనిదానివలన, ఆ స్థితినిగూర్చియే చెప్పుచున్నాఁడు-

యత్ర=ఆత్మస్వరూపుఁడైన యే యోగివిషయమందు, కాలో న ప్రభుః=కాలమేమిచేయుటకును సమర్థముగాదు. దేవతల నందఱిని నియమించుకాలమే సమర్థము గానప్పుడు దేవతల కెక్కడియధికారమని భావము. ఆ దేవతలచే నడుపఁబడెడు జగత్తునకును, వానియందధికారములేదు. ఎందువలన? నిరుపాధికుఁడైనందుచే, వికారః=అహంకారము. 17

నిరుపాధికత్వ మెట్లో చెప్పుచున్నాఁడు. యత్=ఏ కారణము వలన, అసత్ = ఆత్మవ్యతిరిక్తములేదని తెలియుచున్నదో అందువలన

దౌరాత్మ్యం=దేహాదుల యాత్మత్వమును, విసృజ్య=వదలి, అనన్య సౌహృదాః=అనాత్మపదార్థములందు సంగములేనివారై. 18

బ్రహ్మత్వమునుబొందియున్న ముని ఉపరమేత్=సర్వమునుండి యుపరమించును. ఇందలి 'తు' శబ్దముచేత పైని జెప్పఁబోవునట్టి 'యద్వ్రియాస్యన్నృప పారమేష్ఠ్యం' అనెడు ననుభవముకంటెను భిన్నత్వమును జెప్పుచున్నాఁడు. 'విజ్ఞాయతే అనేనేతి విజ్ఞానం శాస్త్రం' విజ్ఞాన మనఁగా శాస్త్రము. దానిచే సర్వమును దెలిసికొనఁ బడుచున్నది. సురంధితాః = నిగ్రహింపఁబడినవి, లేక హింసింపఁ బడినవి. ఆశయాః యస్య సః=పూర్తిగా నశింపఁజేయఁబడిన విషయ వాసనలుగలవాఁడు. వానిదేహవిసర్జన ప్రకారమును జెప్పుచున్నాఁడు. స్వపార్ష్ణినా గుదం = మూలాధారచక్రమును, ఆపీడ్య = అడ్డగించి, అనిలం=ప్రాణమును, ఉన్నమయేత్ = పైకిఁదీసికొని పోవలెను. 19

నాభ్యాం=మణిపూరకచక్రమందు, స్థితం=ఉన్నదానిని, హృది =అనాహతచక్రమునకు, అధిరోప్య = పైకెక్కించి, ఉరసి కంఠే=కంఠ మునకుఁ గ్రిందిభాగమున నున్న విశుద్ధిచక్రమునకు, మనస్వీ=యత చిత్తుఁడైన వాఁడు, స్వతాలుమూలం = ఆ చక్రముయొక్క అగ్రదేశ మును, శనకైః = మెల్లఁగా, అక్కడనుండి వాయు నిర్గమనమునకు అనేక మార్గము లుండుటచేత, 'శనకైః' అనుచున్నాఁడు. 20

భ్రువోరంతరం=ఆజ్ఞాచక్రమును, నిరుద్ధసప్తాస్యాయనః=శ్రోత్ర ములు, నేత్రములు, నాసికలు, ముఖము ననెడు 'అస్యాయనములు' అనఁగా వాయువు గడ్డకుఁబోవు మార్గములు, ముహూర్తార్ధంస్థిత్వా= కొంతసే పాఁగి, ఈ యాఁగుట తన్నుఁ దాను పరీక్షించుకొనుటకు. తనకుఁ గావలసినది యాత్మస్వరూపమేనా? మఱియొక్కటియా? యని నిర్ణయించి కొనుటకు. ఇతరములగు కోర్కు లున్నవారికి వేఱు మార్గములు చెప్పఁబడినవి. అనపేక్షుఁడైనచో, స్వమూర్ధన్=ఇక్కడ

సప్తమిలోప మార్గము; బ్రహ్మరంధ్రమును భేదించికొని దేహమును ఇంద్రియములను వదలవలెను. 21

పారమేష్ఠ్యంపదం=బ్రహ్మస్థానము, వైహాయసానాం=ఖేచరులు సిద్ధులు మొదలైనవారి క్రీడాస్థానమైన స్వర్గాదికము అష్టాధిపత్యం=అణిమాద్యైశ్వర్యములు గలిగినది. గుణసన్నిపాతే=గుణసముదాయమైన బ్రహ్మాండమందు, గుణసన్నిపాతే=సత్త్వరజస్తమోగుణమేళనమునందు నని యర్థము. దీనిని బొందఁ దలచినవాఁడు, మనసా=మనస్సు మొదలైన లింగదేహమును వెంటఁ దీసికొని పోవలెను. అనఁగా వారికి లింగదేహభంగము లేదని యర్థము. అప్పుడు దేహత్యాగమునందు మనస్సు ఇంద్రియములు వీనిని వదలవలసిన పని లేదనియు వీనితోఁ గూడ నాయా లోకభోగార్థముఁ బోవలె ననియు భావము. 22

అవ: కర్మగతివలె యోగగతియుఁ బరిచ్ఛిన్నము గాదను చున్నాఁడు-

యోగేశ్వరాణాం = యోగేశ్వరుల గతి బ్రహ్మాండము లోపలనున్న మహర్లోకాదులయందును బయటను గూడఁ జెల్లును. దానికి హేతు వేమనఁగా పవనస్య అంతః=వాయువు లోపల, ఆత్మా లింగశరీరం యేషాం-వాయువులోపల వారి లింగశరీరముండును, వాయువెచ్చటనైన సంచరించును గదా? విద్య=అనఁగా నుపాసన, తపః=భగవద్ధర్మము, యోగః=అష్టాంగయోగము సమాధిజ్ఞానము. వీరికున్న యపరిచ్ఛిన్నమైనగతి కర్మనిష్ఠులకు లేదని తాత్పర్యము. 23

విహాయసా = ఆకాశమందు, గతః = వెళ్లినవాఁడై, అనఁగా

బయటను వ్యాపించి యున్నదని తెలుపుచున్నాఁడు. శోచిషా=జ్యోతిర్మయమైన దానివలన, విధూతకల్కః, ఏనసః=దేనియందును సంగము లేనివాఁడై యని యర్థము. ఉదస్తాత్ = పైనున్నట్టి, హరికి సంబంధించిన తారారూపమై నారాయణాధిష్ఠితమైన శైంశుమారచక్రం=పంచమస్కంధమందు చెప్పఁబోవు శింశుమారాఖ్యమైన జ్యోతిశ్చక్రమును, ఆ చక్రస్థానములైన ఆదిత్యాది ధ్రువాంతప్రదేశములనుఁ బొందఁబోవుచున్నాఁడు. 24

విశ్వస్యనాభిం=విశ్వనాభిఁ, సూర్యాదుల కాశ్రయభూతమైన దానివలన విశ్వనాభిం అన్నాఁడు. అతివర్త్య = అధిగమించి, ఏకః= ఒంటివాఁడై, ఆ పైని స్వర్గవాసులకుఁ బ్రవేశము లేనందువలన 'ఒంటిగా' ననుట. నిర్మలమైన లింగశరీరముతో నితరులచే నమస్కరింపఁ బడినట్టి, బ్రహ్మవిదాం స్థానం = బ్రహ్మవేత్తలకు స్థానమైన మహర్లోకము నందుచున్నాఁడు. దానియందు కల్పాంతాయుష్కులు భృగ్వాదులు వసింతురు. 25

అథో=తర్వాత, విశ్వం=త్రైలోక్యము, దందహ్యమాన మగుటతో దాని వేడిమి మహర్లోకమునకును దాఁకును. దానికి తట్టుకొనలేక సిద్ధేశ్వరులచే జుష్టములైన విమానములుగల పరమేష్ఠిస్థానమును బొందును. 'ఉ' అని వాడుటచేత దాని శ్రేష్ఠత్వము సూచింపఁ బడినది. 26

ఆర్తిః = దుఃఖము, ఉద్వేగః = భయము, చిత్తతోదః=వారికి చిత్తమను పదార్థమున్నందువలన నేర్పడునది. బ్రహ్మలోకవాసుల కే దుఃఖమును లేదు. భగవంతుని ధ్యానమొనర్పక సంసారబంధమునఁ జిక్కి తల్లడిల్లుచున్న జీవులపై దయతో నేర్పడెడు దుఃఖము మాత్రమే యుండును. 27

బ్రహ్మలోకమును జేరిన వారికి మూఁడు విధములైన ప్రాప్తి స్థానము లున్నవి. పుణ్యోత్కరముచే బ్రహ్మలోకము నందినవారు

యాయుస్సుపర్యంత మచ్చట నుందురు. భగవదుపాసకులు స్వేచ్ఛగా బ్రహ్మాండమును భేదించికొని వైష్ణవమైనపదము నందెదరు. ఇప్పుడు భగవద్భక్తునియొక్క బ్రహ్మాండభేదనప్రకారమును జెప్పుచున్నాడు- ఇక్కడి ప్రక్రియ యిది. ఈశ్వరాధిష్ఠితమైన ప్రకృత్యంశముతో మహత్తత్త్వ మేర్పడుచున్నది. దాని యంశముతో నహంకారము, తదంశమునుండి శబ్దతన్మాత్రముద్వారా నభము, దానియంశముచేత =స్పర్శతన్మాత్రముద్వారా వాయువు, తదంశముతో రూపతన్మాత్ర మూలమున తేజస్సు, దానినుండి రసతన్మాత్రముతో నీరు, గంధ తన్మాత్రముతో పృథివి. ఇవి పరస్పరము చేరి చతుర్దశ భువనాత్మక మైన విరాట్ఛరీర మేర్పడును. పంచాశత్కోటియోజన విశాలమైన పృథివికే అండకటాహ మని పేరు. కోటియోజన విశాలము ప్రథ మావరణము. కొందఱు పంచాశత్కోటియోజన విశాల మందురు. తరువాతి యావరణములు పదింతలు పెద్దవి అష్టమమైన యావరణము సర్వవ్యాపకము. ఈ ప్రక్రియలో పృథివ్యాద్యావరణ భేదనప్రకార మును జెప్పుచున్నాడు. తతః - అటుతరువాత విశేషం ప్రతిపద్య= లింగదేహముతో పృథివ్యాత్మతను బొంది యిట్లే యోజించికొన వలెను. నిర్భయః-పైనపడుసంచుకెట్లు? అను శంకలేనివాడై, తేన ఆత్మనా = పృథివీరూపమైన లింగదేహముతో తరువాత నున్న, అపః ప్రతిపద్య=నీటిని పొంది, అత్వరన్=తొందఱపాటు లేనివాడై పృథి వ్యాదితత్త్వాత్మకత్వముతో క్లేదదాహాదిశంకలు లేనివాడై, యథేష్ట ముగా భోగములు భుజించుచు, కాలే-భోగావసానమందు, బృహతః =ఆత్మయొక్క, లింగం=స్వరూపమును-ఆత్మకులింగ స్వరూపత్వము ఉపాసనా ప్రకరణములోఁ జెప్పఁబడినది, లేక శబ్దాత్మక మగుటతో నాత్మరూపమునకు సంకేతమైనదని యర్థము.

అవ: ఇంద్రియార్థములైన భూతసూక్ష్మముల వ్యతిక్రమమును జెప్పుచున్నాఁడు-

ఘ్రాణముతో గంధమును బొంది శ్వసనం = స్పర్శమును, నభోగుణత్వం=శబ్దార్థత్వమును, అకూతిం=అ యాక్రియను 29

ఈ రీతిగా స్థూల సూక్ష్మ భూత అతిక్రమమును జెప్పి తదావరణభూతమైన యహంకారప్రాప్తితో మహాదాదిప్రాప్తిని వివరించుచున్నాఁడు. సః యోగి వికార్యం సంప్రాప్యవిజ్ఞానతత్త్వం యాతి= వికార్యమును బొంది ఆ పై విజ్ఞానతత్త్వము నందుచున్నాఁడు. వికార్య మనఁగా నహంకారము. 'వివిధం కార్యం యస్య సః' అని సమాసము. అది మూఁడు రీతులు, తామస, రాజస, సాత్త్వికములు. తామసాహంకారమునుండి భూతసూక్ష్మములు పుట్టును. రాజసాహంకారమునుండి బహిర్ముఖములైన దశేంద్రియములు, సాత్త్వికమునుండి మనస్సు దేవతలు. వాని లయము, తత్తదహంకారములనుండు భూతసూక్ష్మముల యొక్కయు ఇంద్రియముల యొక్కయు సన్నికర్షమే లయస్థానము. తామసము, రాజసము, మనోమయము, దేవమయమునైన సాత్త్వికాహంకారమును బొందును యోగి సాత్త్వికాహంకారముతోఁ గూడ విజ్ఞానతత్త్వము నందుచున్నాఁడు అచ్చటినుండి గుణముల సన్నిరోధము. అనఁగా లయము. అది యేర్పడునట్టి ప్రధానమును బొందుచున్నాఁడు. 30

ప్రధానరూపమైన యాత్మచేత నావందమయుఁడై యుపాధులంతరించిన తర్వాత శాంతమై యవిశ్వదానందమైన పరమాత్మను బొందుచున్నాఁడు. 'న విషజ్యతే' అచ్చటినుండి తిరిగిరాఁడు. 31

సృతీ = మార్గములు ప్రకారములని యర్థము. అనపేక్షుఁడైనవాఁడు మూర్ధమును భేదించికొని విష్ణుపదము నందును. ఇది సద్యోముక్తి, ఇది యొకమార్గము. 'యది ప్రయాస్యన్' అను శ్లోకము మొదలు

యదా సర్వే ప్రముచ్యంతే కామా యే ఒస్య హృదిస్థితాః,

అథ మర్త్యోమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే.

అని శ్రుతి. దీనిచేత సద్యోముక్తి చెప్పఁబడినది. 'తేర్చిష మభిసంభ వంతి' ఇత్యాదులతోఁ గ్రమముక్తియుఁ జెప్పఁబడినది. 'న కర్మభిస్తాం గతి మాప్నువంతి' అనుటచేత దక్షిణమార్గము గూడ సూచితమైనది. అది కాదని చెప్పుటకే 'సృతీ' అని ద్వివచనము. 'యచ్ఛ్రోతవ్యం' అని నీవేది యడిగితివో అవి ఈ రెండుమార్గములే యని యర్థము. 'బ్రూహి యద్వా విపర్యయం' అనుటచేత దక్షిణమార్గము గూడ నడుగఁబడినట్లే యైనది. దానినిఁ గూడఁ జెప్పినానని భావము. 32

సంసారమందున్న మానవునకు యోగాదులు మోక్షమార్గము లెన్నో యున్నవి. కాని వానిలో శ్రేష్ఠమైన దిదియే యని చెప్పుచు న్నాఁడు. దీనికన్నను సుఖమైనది లేదు భక్తియోగమే నిర్విఘ్న ముగ సాఁగును. ఎందుకు? భగవంతుఁడైన బ్రహ్మదేవుఁడు కూటస్థః =నిర్వికారుఁడై ఏకాగ్రమనస్సు గలవాఁడై యని తాత్పర్యము. త్రీన =మూఁడుసారులు, కార్త్స్న్యేన=పూర్తిగా, బ్రహ్మ అన్వీక్ష్య యతః= దేనినుండి, ఆత్మని=హరియందు, రతిర్భవేత్ తదేవ మనీషయా= బుద్ధిచేత, అధ్యవశ్యత్=సర్వోత్తమ మని నిశ్చయించెను. 33

అనుభూతార్థమందు రతి జనించును. అననుభూతమైన భగ వంతుని యందు రతి యేర్పడుట కవకాశ మే మున్నది? దానికి సమాధానము. భగవాన్ లక్షితః, దృష్టః=చూడఁబడినవాఁడు. ఎట్లు? స్వాత్మనా క్షేత్ర అంతర్యామి స్వరూపముగా, ఎవరిచేత? బుద్ధ్యాదుల చేత. దానినే రెండుగాఁ జూపించుచున్నాఁడు. దృశ్యములైన జడా దుల దర్శనము, స్వయంప్రకాశమైన ద్రష్టలేనిది ఘటింపదు అను

అనుపపత్తి ద్వారా, లక్షణై: - స్వప్రకాశ అంతర్యామి లక్షణములచేత అనఁగా 'బుద్ధ్యాదీని కర్తృప్రయోజ్యాని కరణత్వాత్ వాశ్యాదివత్' ఈ యనుమానము చేత, వ్యాప్తిముఖముగా ననుమాపకము లైన బుద్ధ్యాదులచేతఁ గర్త స్వతంత్రుఁడని ఈశ్వరుఁడు సిద్ధించుచున్నాఁడు. 35

యచ్చోచ్ఛితవ్యం అనెడు ప్రశ్నకు సమాధానము నుపసంహరించుచున్నాఁడు-

'తస్మాత్' అను శ్లోకముచేత, శ్రవణాది ఫలమును వివరించుచున్నాఁడు. 'పిబంతి అను శ్లోకముచేత-

### విశిష్టాద్వైత వ్యాఖ్య:

పురా=సర్గాది కాలమందు, ఏవం ధారణయా=ప్రపంచమే శరీరముగాఁ గలిగిన పరమాత్మవిషయక మనోధారణచేత, నష్టాం స్మృతిం ప్రత్యవరుధ్య=ప్రపంచసర్గ ప్రకారమైన స్మృతిని పొంది, అమోఘదృష్టిః - సఫలమైన బుద్ధివిషయక జ్ఞానము గలవాఁడై, వ్యవసాయబుద్ధి గలిగి, ఆత్మయోనిః-ఆత్మనః యోనిః యస్య = పరమాత్మయే జన్మస్థానమైనవాఁడు, అప్యయాత్ ప్రాక్ యథా - ప్రళయమునకు ముందు పూర్వసృష్టి యెట్లుండెనో అట్లు ఈ జగత్తును సృష్టించెను. 'ధాతా యథాపూర్వ మకల్పయత్' అని శ్రుతి. 1

అవ: ఇట్లు స్థూలప్రపంచ శరీరకుఁడైన నారాయణమూర్తి యొక్క ధారణతో చతుర్ముఖునకుఁ బ్రపంచసృష్టిసామర్థ్య మేర్పడినది. ఇది ధారణా సాఫల్యమే. అనంతరము వైరాగ్యము భక్తి కంగమగుట చేత దాని ప్రకారమును జెప్పుచున్నాఁడు-

దేహాయాసము నూహించుచున్నవాఁడై, న యతేత-దొడ్డపరిశ్రమకు పూనకొనరాదు. 3

స్థితౌసత్యాం - అచంచలమై, దృఢమై, విస్తీర్ణమునై క్ష్మా రూపముగా భూమి యేర్పడియుండఁగా, కశిపోః-స్వల్పమై కృత్రిమమై అదృఢమై, యస్థిరమై, యవిస్తృతమైయున్న శయ్యకొఱకు పరిశ్రమ మెందుకు? బాహౌ-శిరస్సుయొక్క ఉన్నతావస్థితి సంపాదకమైన బాహువు, స్వసిద్ధే-అప్రయత్నలభ్యమైయుండఁగా, మృదులమై యెత్తును తగ్గునుగా నుండునదై, నిరంతరము తనతోడనే యుండునట్టి తన వ్యాపారము లేకయే సిద్ధించునట్టి బాహు వుండఁగా తలదిండు కొఱకై ప్రయాస యెందుకని భావము. అట్లే బహువిధ ప్రయత్న సాధ్యమై అసన్నిహితమైయుండునట్టి భోజనపాత్ర కెందుకు యత్నింపవలెను? అట్లే మిక్కిలి యసాధ్యములైన దుకూలాదులకై ప్రాఁకులాడుటయు ప్రయోజనము లేదని భావము. 4

అవ: సర్పములు, వృశ్చికములు మొదలైన యుపద్రవములతోఁ గూడిన గుహాదులు శయ్య కెట్లు పనికివచ్చును? దానికి సమాధానము—

అజితః—పరమాత్ముఁడైన నారాయణుఁడు, ఉపపన్నాన్-శరణాగతులను, న అవతి కిం?-రక్షింపఁడా? అతఁడు శరణాగతరక్షకుఁడగుటచే సర్వభయములనుండి రక్షింపఁగలవాఁడు. కనుక దానికిని భయపడ నవసరము లేదని భావము. ధనదుర్మదాంధాన్-

**ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ,**
**ఆఢ్యో ఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా.**

ఇత్యాది ప్రలాపహేతువైన దుర్మదముచేఁ గూడినవారు. ఆ మదము మదిరా పానము వంటిది. అది ఉత్తమాధమ మధ్యమ తారతమ్యవివేకమును నశింపఁజేయును. 5

స్వచిత్తే స్వత ఏవ సిద్ధా - 'అతః ప్రవిష్టశ్శాస్తా జనానాగ్ం సర్వాత్మా' అని శ్రుతి. స్వత ఏవ = తన ప్రయత్నము లేకయే తన్ను నియమించుట కంతర్యామి స్వరూపముగా శ్రీమన్నారాయణమూర్తి యున్నాఁడు. 6

స్వకర్మజాన్ = స్వపాపకర్మముతో నేర్పడిన, పరితాపాన్ = నరకమునకు సంబంధించిన వేదనలను, జుషాణం = వైతరణి యనెడు నగ్నిమయమైన నదియందు పతితుఁడైన మానవునిఁ జూచి, పశూన్ ఋతే పరానుచింతాం = భగవచ్చింతనను వదలి, అసతీం = దుష్టమైన శబ్దాది విషయక చింతనను. 7

తన దేహముయొక్క అంతర్హృదయే = హృదయమం దేయవకాశము గలదో, దానియం దున్నవాఁడు, ప్రాదేశమాత్రం – ప్రాదేశ మనఁగా ఆకాశాది సర్వజగత్ప్రదేశము. ప్రజ్ఞాది గణములో చేరినందువలన స్వార్థమం దణ్ ప్రత్యయము. మాత్రం = నారాయణునకు సమస్త జగత్తును శరీరమైనందువలన జగద్రూపముగా జగత్పరిణామముగాఁ బ్రకాశించుచున్నవాఁడు. 'అయ మాకాశస్తావా నేషోఽంతర్హృదయ ఆకాశః' అనెడు శ్రుతి ననుసరించి 'ప్రాదేశమాత్ర మభివిమానం' ఇత్యాది శ్రుతులందున్న 'ప్రాదేశ' శబ్దమును శ్రీభాష్యకారులు పైనఁ జెప్పిన పద్ధతిలోనే వ్యాఖ్యానించిరి. 8

సమస్తసాంసారిక దుఃఖాస్పదమైన ఈ లోకమును వదలిపెట్టఁదలఁచిన ముముక్షువైనవాఁడు శుభ్రమైనచోటు స్థిర సుఖమైన యాసనమును గల్పించికొనవలెను. నిరంతర భగవద్భక్తి సిద్ధి కొఱకు మొదట మనస్సును నియమించికొనవలెను, తరువాత రేచక పూరక కుంభకములతో వాయువును నియమింపవలెను. ఆ పైని బాహ్యేంద్రియముల నియమించి మనస్సు మఱల విషయములపైనఁ బోకుండునట్లు సదసద్వివేక చతురమైన బుద్ధిచేత నదుపులోఁ బెట్టవలెను. ఆ బుద్ధిని గూడ క్షేత్రజ్ఞశరీరుఁడైన జీవునియందు నియమింపవలెను.

ఆతనిని పరమాత్మ సన్నిధికిఁ జేర్పవలెను. శరీరసంబంధము కర్మ ప్రయుక్తమైనది. క్షేత్రజ్ఞుని సత్యకామత్వ సత్యసంకల్పాది గుణవిశిష్టుఁ డైన నారాయణునియందుఁ జేర్చవలెను. చేర్చు టనఁగా నేమి? తాను క్షేత్రజ్ఞుఁడను నవస్థను బోఁద్రోసి శుద్ధసత్త్వరూప పరిజ్ఞానము నందుట. ఆ పరిజ్ఞాన మెట్టిది? తాను పరమాత్మున కధీనుఁడనని నిత్యుఁడనని తన కాధార మతఁడే యని తాను పరమాత్మకు నిత్యశేషుఁడని తెలియుట. స్వాయత్తకర్తృత్వాది త్యాగపూర్వకముగా పరమాత్మాయత్తకృత్యాది వైశిష్ట్యము ననుసంధానము చేయుట. ఈ రీతిగాఁ జేసిన తరువాత నా భావమునే నిరంతర ముండునట్లుగాఁ బదిలపఱచికొని ప్రపత్తి భావముతో దేనికొఱకును బ్రయత్నింప కుండుట. 15, 16

అవ: ఈ రీతిగా మనోనిగ్రహము మొదలుకొని భగవచ్ఛేషత్వ జ్ఞానము వఱకు సంపాదించికొన్న తర్వాత సంపాదితమైన భక్తి నిరంతరముండుటకు ఆలంబనముగా భగవత్స్వరూపమును వర్ణించుచున్నాఁడు

యత్ర = ఏ వైష్ణవ పదమునందు, పద్యత ఇతి పదం = పరమ ప్రాప్యమైనది భగవద్రూపము. అపావృతము = నిత్యము పరమమంగళాయతనము. ఆ రూపమందు, అనిమిషాం పరః = బ్రహ్మాది స్తంబ పర్యంతమున్న జీవులకు బహువిధములైన దేహ పరిణామములను సంపాదించుటచేత వారికంటెను శ్రేష్ఠమైన కాలము, న ప్రభుః = భగవద్రూపమునకే పరిణామమును గల్పింపలేదు. 'కాలో న పచతే తత్ర న కాలస్తత్ర వై ప్రభుః' అని ప్రమాణము. ఇట్లుగా కాలమునకును భగవంతుని రూపముపై ప్రభుత్వము లేదన్నప్పుడు అట్టి కాలముచేఁ బరిణామమును జెందు బ్రహ్మరుద్రాదుల కధికార మెక్కడనుండి వచ్చును? భగవద్రూపము పరిణామమును జెంద దనుటకు హేతువును జెప్పుచున్నాఁడు. యత్ర = ఏ భగవత్స్వరూపమందు సత్త్వగుణము లేదు. మిశ్ర సత్త్వగుణము లేదు రజ స్తమస్సులును లేవు. వికారః = దేవతిర్యగాది వికారములును లేవు. మహత్తత్త్వము లేదు. సమస్త ప్రపంచము

ద్రూప వ్యతిరిక్తమంతయుఁ బ్రాకృతము. త్రిగుణాశ్రయము-కాల కృతమైన వివిధ విచిత్ర పరిణామముల కాశ్రయమైనది. ఉత్సిస్సృక్షవః =హేయమైన శరీరమును వదలిపెట్ట దలఁచినవాఁడై యే వైష్ణవపద మును 'నేతి నేతి' యని చెప్పుచున్నారో! అనఁగా 'ఇట్టిదె కాదు, ఇట్టిదెకాదు' అని జగద్విలక్షణముగా వర్ణించుచున్నారో అట్టి, వైష్ణవం పదం=అర్చావతారాది రూపములతోఁ గూడిన భగవద్రూపమును, ఆ మనంతి- 'తత్తే పదం సంగ్రహేణ బ్రవీమి' 'ఓమిత్యేతత్' ఇత్యాది శ్రుతులచే వర్ణితము. అనన్యసౌహృదాం=భగవద్వ్యతిరిక్త విషయము లందు తగులము లేనివారు లేక అనన్యాః- 'అనన్యా శ్చింతయంతో మాం' ఇత్యాది గీతాశ్లోకమున కధికారులైన భక్తులు, అట్టి భాగవతు లందు సౌహృదము గలవారు. భగవంతునకును భాగవతులకును దగ్గఱివా రన్నమాట. దౌరాత్మ్యం = మనస్సుయొక్క దుష్టత్వము అనఁగా విషమప్రావణ్యము, దానిని త్యజించి- 18

వ్యవసితః=భగవత్పాదమునే నిరంతరమును ధ్యానించుచున్న వాఁడై, విజ్ఞానదృగ్వీర్య సురంధితాశయః=విశిష్ట భక్తిరూపజ్ఞానము. ఆ జ్ఞానముచే నేర్పడిన, దృక్=భగవత్సాక్షాత్కారమైన కన్ను. దాని సామర్థ్యముచే రంధితాశయః=పరిపక్వమైన చిత్తము గలవాఁడు.

భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే.

అనెడు శ్రుతి నిచ్చట ననుసంధించి కొనవలెను. ఈదృశభక్తి సిద్ధిం చిన తర్వాత, ఉపరమేత్ =ఏదియుఁ జేయరాదు. 19

తాలుమూలము నుండి భ్రూమధ్యమునకు వాయువును దీసి కొని పోవలెను. ఎట్లు? నిరుద్ధసప్తాస్యయనః=అడ్డగింపఁబడిన యేడు

శీర్షణ్య రంధ్రములు గలవాఁడై. 'సప్త వై శీర్షణ్యాః ప్రాణాః' అని శ్రుతి స్వయనః = అర్చిరాది మార్గములు. సు + అయనః = సుఖకరమైన యర్చిరాదిమార్గములు గలవాఁడై యని యర్థము. అనపేక్షః = దేహాత్మజాదులం దపేక్ష లేనివాఁడై, అకుంఠదృష్టిః = అప్రతిహతదృష్టియై, ఈ రీతిగా నుత్క్రమణక్రమముతో వాయువును నిరోధించి మూర్ధము భేదించి యర్చిరాది మార్గమును జేరవలెను. ఆ మార్గమును బొంది మూర్ధస్థానమును గూడ వదలవలెనని భావము. 20

పవనాంతరాత్మనాం = రేచక పూరకాది క్రమముచేత వాయువును శరీరాంతరాళమునందు ధరించినట్టి. యోగేశ్వరాణాం త్రిలోక్యాః భూర్భువ స్వర్' అనెడు లోకత్రయముయొక్క బయటను లోపలను గూడ గమనము గలుగును. విద్యా = వేదాంతవిద్య, తపోయోగః = శమదమాదులతోఁ గూడిన ధర్మానుష్ఠానము. సమాధి = అష్టాంగయోగము. వీరు అపునరావృత్తి రహితమైన యర్చిరాది మార్గములఁ బొందుచున్నారు. వారు తిరిగి రారు. యజ్ఞానుష్ఠానాదులతో నా మార్గము సిద్ధింపదు. 21, 22

బ్రహ్మపథేన = బ్రహ్మపథమును బొందించునట్టి, శోచిషాం = హృదయపూర్వకములైన పూజాదులతోఁ బ్రసన్నుఁడైన భగవంతుని దయచేఁ బ్రకాశించెడి, సుషుమ్నా = నాడిచేత, విహాయసాగతః పురుషః- 'పథఃపం వైశ్వానరం యాతి అగ్నిర్జ్యోతిరహః శ్శుక్లః' అని శ్రుతి. అనంతరము జ్యోతిఃప్రాప్తిని జెప్పుచున్నాఁడు. విధూతకల్కః = వదలిపెట్టఁబడిన పుణ్యపాపములుగలవాఁడై. 'అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం' అని శ్రుతిః. 'తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరం

సంకర్షణరూపుఁడైన శేషుని ముఖాగ్నిచేత అనఁగా పూత్కార
జనితమైన యగ్నిచేత దందహ్యమానం విశ్వం ప్రసమీక్ష్య-జగత్సం
హారకుఁడైన కాలాగ్నిరుద్రుఁడు అనంతవిషాగ్నిసంభూతుఁడే యని
పంచమస్కంధమందు చెప్పఁబోవుచున్నాఁడు. స్వర్గాదికము గూడ
ననంతవిషాగ్నిచేఁ గాల్పఁబడు నన్నమాట. **26**

మహాయోగులు పరమేష్ఠిధిష్ణ్యమును బొందుదురు. వారికిఁ
గూడ పునరావృత్తి లేదు. భక్తియోగమహిమచేత పరమభక్తులు
దానినిఁ గూడ వదలి పైకిఁ బోదురు. లింగదేహభంగమగును.
సాక్షాద్భగవంతుఁడైన వాసుదేవునియొక్క పరమపదము నందెదరు.
బ్రహ్మసదనప్రాప్త్యనంతరము నిరంతరభక్తియుక్తుఁడైన పురుషుఁడు
ఆకాశాది పంచభూతములలోఁ గడపటిదియు, గంధాది గుణపంచకము
లుండుటచేఁ దక్కిన వానికంటె గొప్పదియు, నందుచేతనే 'విశేష'
శబ్దవాచ్యమునైన పృథివీతత్త్వము నందును. అప్పుడు తత్కార్యభూత
మైన దేహాదికమును త్యజించును. తదుపాదానభూతమైన పృథివీ
తత్త్వమునందు వానికి దేవాది శరీర పరిణామప్రసంగము లేదు.
అందుచే నిర్భయుఁడు. పృథివీ రూపశరీరముచేత తత్కారణమైన
యుదకతత్త్వమును ప్రవేశించును. 'అద్భ్యః పృథివీ' అని శ్రుతి.
'పృథివ్యప్సు ప్రలీయతే' అని శ్రుతి. 'అగ్నేరాపః ఆప స్తేజసి లీయంతే'
అని వేదము. అటుతరువాత నగ్నిరూపమైనవాఁడు వాయువునందుఁ
బ్రవేశించును. 'వాయోరగ్నిః' 'తేజో వాయౌ లీయతే' అని
శ్రుతులు. దాని తరువాత వాయురూప శరీరముతో దానికిఁ గారణ
మైన యాత్మలింగము, ఆత్మజన్యమైనట్టిదియు, బృహత్-పూర్వోక్త
తత్త్వచతుష్టయమునకన్నను వ్యాపకమైనట్టి యాకాశమును జెందును.
'ఆకాశా ద్వాయుః' అని శ్రుతి. 'తస్మాద్వాయౌ తస్మా దాత్మన

కారణభూతమైన గంధతన్మాత్రము. రసనతో రసతన్మాత్రము. దృష్టితో
రూపతన్మాత్రము. చర్మముతో స్పర్శతన్మాత్రము. శ్రోత్రముతో నభో
గుణమైన శబ్దతన్మాత్రమును బొందును. తరువాత ప్రాణవాయువుతో
తత్కారణీభూతమైన యాకూతిని బొందును. ఆకూతి యన్నది
యొక గుణ విశేషము. 'చిత్తం చ చిత్తిశ్చాకూతిం చా కూతిశ్చ',
'ఆకూతి మగ్నిం ప్రయుజగ్ం స్వాహా' అని శ్రుతులు. మనస్సు
నకుఁ గారణభూతమైనదియు, వైకారిక శబ్దవాచ్యము నైన సాత్త్వికా
హంకారము, దేవమయం=దేవతలకును ఇంద్రియములకును నధి
ష్ఠాతయైనది, అందుకే 'దేవమయం' అన్నాఁడు. తైజస శబ్దవాచ్య
మైనది రాజసాహంకారము. వికార్యం=పంచభూతములుగాఁ బరిణ
మించు తామసాహంకారము అర్చిరాదిగతితో యోగి వీనినిఁ బ్రాపిం
చును. ఈ శరీరభూతమైన యహంకారముచేత విజ్ఞానతత్త్వము నందు
చున్నాఁడు. 'విజ్ఞానం యజ్ఞం తనుతే తస్మాద్వా ఏతస్మా ద్విజ్ఞాన
మయాత్' ఇత్యాది శ్రుతులయందు వలె నిక్కడ విజ్ఞానశబ్దము జీవ
వాచకము. జీవుఁ డనఁగా నిక్కడ జీవసమష్టిరూపుఁడైన చతుర్ము
ఖుఁడు. తత్త్వం=తదధిష్ఠితమైన మహత్తత్త్వము. ఇచ్చట విజ్ఞాన
తత్త్వశబ్దమున కిదే యర్థము. 'ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః' అను
శ్రుతివాక్యమునందు 'బుద్ధేరాత్మా మహాన్ పరః' అనుచోట మహ
చ్ఛబ్దమునకు ఆత్మపర సామానాధికరణ్యముతో సమస్తజీవవాచిత్వము
చెప్పఁబడినది. అట్లే యిక్కడను విజ్ఞానతత్త్వ శబ్దమునకుఁ గూడ
సమష్టిపురుషాధిష్ఠితమైన మహాతత్త్వవాచిత్వ ముపపన్నమే. 'బుద్ధే
రాత్మా మహాన్ పరః' అనుచోట నాత్మశబ్దమునకు సమష్టిపురుషవాచి
త్వము శ్రీభాష్యాదులందు సిద్ధాంతితమైనవి. సమష్టిపురుషునకు మహ
త్తత్త్వ అధిష్ఠాతృత్వము గూడ నీ శాస్త్రమందే పలుచోట్ల ప్రతిపాదిం

పఁబడఁ బోవుచున్నది. అందుచే నిచ్చట విజ్ఞానతత్త్వము మహత్త
త్త్వమే. ఈ ప్రకరణములోఁ గార్యములకుఁ గారణములందు లయ
మును జెప్పుచున్నాఁడు. అటు తరువాత గుణసన్నిరోధం = న్యూనా
ధిక భావములను బొందిన సత్త్వాదిగుణాశ్రయమైన మూలప్రకృతిని
బొందుచున్నాఁడు. దానితో నానందమయుఁడైన పరమాత్మను బొం
దును. 'ఏత మానందమయ మాత్మాన ముపసంక్రమ్య' అని శ్రుతి.
అప్పుడు వీఁడును నానందమయుఁడే యగును. అనఁగా బ్రహ్మానంద
తుల్య ఆనందవిశిష్టుఁడగును. 'ఎప్పుడు నేను భగవంతుని బొందుదు'
ననెడు జిజ్ఞాసకు ఫలమైన వాసుదేవునిఁ జేరును. అట్టిచో వాని కే
క్రియయు లేదు. 'సా కాష్ఠా సా పరాగతిః' అని శ్రుతి. 21

వేదగీతే 'అర్చిషోహ అహ్నః పూర్వమాణ పక్షం' ఇత్యాది
వేదగీతములు, 'ఏతే సృతీ ధూమమార్గగతి' అర్చిరాదిగతి యనెడు
నీ రెండును నీకు వర్ణించితిని. ఇవియే వాసుదేవుఁడు బ్రహ్మ కెఱిఁ
గించినవి. 32

'వాసుదేవే భగవతి యత స్సాధనాద్భక్తియోగో భవతి'
'పాతాళ మేతస్య చ పాదమూలం' అని యారంభించి 'యస్సన్ని
వేశః కథితో మయా తే' అనునంతవఱకును బ్రతిపాదితమైన స్థవిష్ఠ
రూపధ్యానమునకంటె స్థిరమైన మంగళకరమార్గము లేదని భావము.
బ్రహ్మదేవుఁడు మూఁడుసారులు వేదమును బరీక్షించి పూర్వోక్తస్థూల
ప్రపంచ శరీరక పరమాత్మానుసంధాన రూపమైన సాధనమే భక్తి
యోగమునకు మార్గమని నిశ్చయించికొన్నాఁడు. 33

దృశ్యైః = జ్ఞానవిషయము, అందుచేతనే అనుమాపకము.
అనఁగా అనుమతి నేర్పఱచునది. ఆ యనుమాన మీ క్రిందిది. 'అంకు
రాదికం సకర్తృకం కార్యత్వాత్ ఘటవత్'. ఇది వీనిని నిర్మించిన
వాని యొక్క జ్ఞాన శక్త్యాదికములను గూడఁ జెప్పుచున్నది. కర్తృ

సృష్ట్యుపయుక్తజ్ఞానశాలియైన భగవంతుఁడు, సర్వభూతాంతర్యామిగా నున్నాఁడు. వాఁడే శ్రోతవ్యాదుల కర్తృఁడని భావము. 35

**విజయధ్వజ వ్యాఖ్య :**

అవ: ఇట్లు వైరాజ మనెడు స్థూలరూపమందు మనస్సును ధారణ యొనర్పవలెనని చెప్పి యీ యధ్యాయమందు వారి వారి హృత్కమలకర్ణికా మధ్యమందున్న శ్రీహరి యాత్మ యనెడు రూపమును మనోధారణకు విషయముగాఁ జేసికొనవలెనని, యట్లుపాసించు వారికిఁ గలుగుఫలమును జెప్పుచున్నాఁడు. ఇను లా ధారణయందు జాగ్రత్తగాఁ బ్రవృత్తు లగునట్లు చేయుటకు నెక్కడ నెవ్వరికి దీనితో ఫల మేర్పడినది యనుశంకను బరిహరించుచు దీనికి విరుద్ధమైన దేదియైన నున్నచోఁ జెప్పవలసినదన్న పరీక్షిత్తుప్రశ్న కుత్తర మిచ్చుచున్నాఁడు-

ఆత్మయోనిః పురా = తన కల్పముయొక్క మొదటి సృష్టి యందు, నష్టాంస్మృతిం ఏవం ధారణయా ప్రత్యవరుధ్య తుష్యన్ వ్యవసాయబుద్ధిః సన్ = సృష్టి యొనర్పవలె ననెడు నుద్యోగమందు మనస్సుగలవాడై, అమోఘదృష్టిః = సఫలమైన జ్ఞానముగలవాఁడై, అప్యయాత్ ప్రాక్ యథా, తథా, ఇదం ససర్జ = బ్రహ్మకు ఫల మేర్పడినదానివలన ఈ ధారణ సార్థకమైనదని తెలియవలెను. 1

అవ: వాక్కునకును మనస్సునకును విషయముగాని వాఁడు, ధారణ కెట్లు విషయ మగును? దానికి సమాధానము-

పైనిఁ జెప్పినట్లు శ్రవణ మొనర్పఁ దగినవాఁడు శ్రీహరియే. అతఁడే జ్ఞానులకు సమ్మతుఁడు. స్వతంత్రుఁడు. బ్రహ్మ మొదలైన సమస్త జగత్తును సృష్టించినవాఁడు. సర్వలయం దున్నవాఁడు. సర్వ మాతని యధీనము. సమస్తగుణ పరిపూర్ణుఁడు. శబ్దస్యబ్రహ్మణః=

విషయమైనవాఁడు, ముఖ్యమైన యర్థమని తాత్పర్యము. ఇంద్రుఁడు మొదలైన శబ్దములు రూఢితో పురందరుఁడు మొదలైన యర్థములను దెల్పుచుండఁగా శ్రీహరియే సమస్త శబ్దములకును నర్థమని చెపి, నచో రూఢ్యర్థమునకు నెక్కడను ప్రయోజనము లేకపోవును గదా! అనుటకు సమాధాన మిచ్చుచున్నాఁడు. మాయామయే=భగవంతుని యిచ్ఛచే నిర్మిత మగుటచే తదధీనమైయున్న సంసారమందు, శయానః = ఏమియుఁ దెలియక నిద్రించు చున్నట్టియు, అది కారణము ... వాసనయా = నానాకర్మవాసనచేత, పరిభ్రమన్ = భిన్న భిన్న యోను లందు జన్మించుచు, ధీః = బుద్ధి కాశ్రయుఁడైన జీవుఁడు లేక జీవుని యొక్క, ధీః=బుద్ధి, యత్ =ఏ పురందరుఁడు మొదలైన యర్థములను అపార్థైః=నిరవధికమైన పరమైశ్వర్య మున్నవాఁడును ననెడు నర్థము నకుఁ బోనఁగనట్టి, నామభిః = ఇంద్రుఁడు మొదలైన శబ్దములచేత, ధ్యాయతి = ధ్యానించుచున్నాఁడో, తత్ర = అ దేవేంద్రుఁడు మొద లైన యర్థములందు, అర్థాన్=ఇంద్రుఁడు మొదలైన శబ్దములకున్న 'నిరవధిక పరమైశ్వర్యశాలి' ఇత్యాద్యర్థములను, న విందతే=తృప్తి కరముగా నందలేఁడు. వారి యుపాసనతోఁ బురుషార్థమును గూడఁ బొందలేఁడు. కనుక నిరవధిక పరమైశ్వర్యశాలియైన శ్రీహరియే యింద్రుఁడు మొదలైన శబ్దములకు వాచ్యార్థము. అందుచే వాఁడే శ్రోతవ్యుఁడు. వానిని వదలి యేదియును స్మరింపఁదగినదిగాదు. 'సర్వనామా యతో విష్ణుస్తదన్యార్థా న్నతుస్మరేత్' అని ప్రమాణము.

౨

తాత్పర్యము: శ్రీహరియే వేదములందలి సమస్తశబ్దములకును అర్థమైనవాఁడు, వాఁడే శ్రవణార్హుఁడు అని జ్ఞానులకు సమ్మతము. స్వతంత్రుఁడు. బ్రహ్మ మొదలుకొని సమస్తజగత్తును సృష్టించువాఁడు. సర్వహృదయాంతర్గతుఁడు. సర్వము తదధీనమే. సమస్త గుణపరి

పూర్ణుఁడు. అందుచే నన్నిశబ్దములకును ముఖ్యార్థము వాఁడే. జీవుఁడు నారాయణు నిచ్ఛతో నిర్మితమైన సంసారమున నిద్రించుచుండును. నానా కర్మలకు ఫలముగా నానా యోనులందును జన్మించును ఇట్టి వీని బుద్ధియే. ఇంద్రాదులకు పురందరాదు లర్థమని భావించును. ఇది సరియైన యర్థముగాదు. ఇంద్రశబ్దార్థమైన నిరవధికైశ్వర్యము పురందరునిలో నెక్కడిది? కనుక శబ్దముఖ్యార్థము సమన్వయించికొనుటకు క్లేశపడవలసి వచ్చును. నిరవధిక పరమైశ్వర్యశాలియైనవాఁడు శ్రీహరి యొక్కఁడే యగుటవలన నింద్రశబ్ద ముఖ్యార్థము వాఁడే, వాడే స్మర్తవ్యుఁడు. ఇతరులను వాని పరివారముగా స్మరింపవచ్చును. శబ్దార్థరహస్యవేదియైన జ్ఞాని శ్రీహరియే ముఖ్యార్థమని తెలిసి ఇతరుల నెవ్వరిని సేవింపక యుండును. 'హరిభిన్నమైన యర్థములను బోధించును' అనుట కవకాశమిచ్చు ఘటాది శబ్దములకు లోకవ్యవహారము నకై యా యర్థమును దెలియవలెను. అంతే. 'శాబ్దస్య హి బ్రహ్మణః' అని శ్రీధరుల పాఠము. 'శబ్దస్య హి బ్రహ్మణః' అని వీరు.

అవ: సమస్త శబ్దములకును విష్ణువే ముఖ్యార్థమని తెలిసినచో జ్ఞాను లే ప్రపంచవ్యవహారమును జేయుటకు వీలుండదుగదా! యనుట కు త్తరము—

అత్ర— సమస్త శబ్దములకును శ్రీహరియే యర్థము. ధ్యాన విషయము వాఁడే. వ్యవహారవిషయము వాఁడే. అందుచేత, కవిః= శబ్దార్థరహస్యములు దెలిసిన జ్ఞాని, అప్రమత్తః=సమస్త శబ్దములును శ్రీహరినే చెప్పును అను విషయమును మఱవక వ్యవసాయబుద్ధిః= నిశ్చయమైన జ్ఞానము గలవాఁడై, నామసు = భగవంతుని విడిచి వేఱ అర్థములను జెప్పుచున్నట్లుగా తోఁచెడి ఘటము మొదలైన శబ్దము లందు, యావదర్థః=ఎంతవఱకుఁ దన ప్రయోజన ముండునో అంత

తన ప్రయోజనము సిద్ధించుచుండఁగా, తత్తత్పరిక్లేశమం—ఆ యా పద ముల యర్థములందు పదముయొక్క సంపూర్ణార్థము లేకుండుటచేత, మనః క్లేశమునే సమీక్షమాణః = చూచుచున్నవాఁడై, తత్ర తు=ఆ లౌకి కార్థములందు, న యతేత=ప్రయత్నింపరాదు. 3

అవ: మీవంటి పక్వమైన యోగులు భూమి మొదలగువాని చేతనే శరీరయాత్ర నడపికొందురు. ఇంకను పరిపక్వస్థితి నందని లోకుల గతియేమి? దాని కుత్తరము చెప్పుచున్నాఁడు—

చీరాణి పథి న సంతి? పరభృతః అంఘ్రిపాః (నో దిశంతి వా? సరితః అపి అశుష్యన్? గుహాః రుద్ధాః కిం? కృష్ణః అవధూత సుహృత్ న కిం? లౌకికాభిమానమును వదలిన స్నేహితులకు కృష్ణుఁడు స్నేహి తుఁడు గాఁడా?, కవయః ధన దుర్మదాంధాన్ కస్మాద్భజంతి? కనుక ముముక్షువైనవాఁడు దేవేచ్ఛతో దొరకిన వస్తువులతోనే తృప్తి పడవలె నని భావము. 'కి మజితోవతి నోపపన్నాన్' శ్రీధరుల పాఠము, 'కి మవధూత సుహృన్నకృష్ణః' అని నీరి పాఠము. 5

అవ: ఇట్లు చెప్పిన అనుష్ఠానముయొక్క పశ్చాదవస్థారీతిని చెప్పుచున్నాఁడు—

ఏవం=ఈ రీతిగా హరి యిచ్చుచేతనే యొదిగిన యాహారాదు లతో జీవనము నడపుచుండుటను జూచి ప్రసన్నుఁడైన, స్వతః ఏవ =స్వతంత్రుఁడైన శ్రీహరి యనుగ్రహముచేత, స్వచిత్తే సిద్ధే సతి—తన మనస్సు తన యధీనమం దుండఁగా, భగవాన అనంతః ఆత్మప్రియః అర్థః—దేహాదులకంటెను ప్రియమైన వస్తువు, యత్ర—ఏ హరియందు మన స్సుంచినచో నిర్దుఃఖానందానుభవ రూపమైన మోక్షము గూడ దొరకునో అని, నిర్వృతః—రోమాంచములు గలిగినవాఁడై, నియతార్థ స్సన్—కడపటి దేహమును వదలి శ్రీహరి కభిముఖుఁడనై నా యోగ్య తకుఁ దగిన బ్రహ్మానందము ననుభవింతును అను నిశ్చయముగలవాఁడై,

పురుషః=మోక్షాధికారియైన చేతనుఁడు, తం=ఆ శ్రీహరిని, భజేత=సేవింపవలెను.

తాత్పర్యము: ఇట్లు శ్రీహరియిచ్ఛతో దొరకెడు ఫలముచేతనే తృప్తినందుచు జీవనయాత్ర నడపు యోగి యాతని దయకు పాత్రుఁడగును. దానితో మనస్సు తన కధీనమగును. అప్పుడు 'శ్రీహరియే యపరిచ్ఛిన్నుఁడు. దేహాదులకంటెను ప్రియుఁడు. అతనిని భజించినచో సంసారహేతువైన యవిద్యాదులు నశించును. దుఃఖము లేని సుఖానుభవరూపమైన మోక్షము లభించును' అని తెలిసి వాని ధ్యానముతో సుఖపడును. రోమాంచకంచుకితుఁడగును. తన చరమదేహము పోయినంతనే తన యోగ్యతానుసారముగా బింబరూపియైన హరిని వీక్షించును. ఇట్టి నిశ్చయజ్ఞానముతో హరిని సేవింపవలెను. ఇట్టి నిశ్చయజ్ఞానము లేనివాఁడు అనురికన్యభావుఁడు. 'నియతస్తంభజేత' అని శ్రీధరులు. 'నియతార్థో భజేత' అని వీరు. ఈ శ్లోకము తరువాత విజయధ్వజములో నీ క్రింది శ్లోక మున్నది—

స సర్వవిద్ధృ ద్యసుఖాశ్చసర్వ ఆత్మా యథా సుప్త జనేక్షితైకః,
తం సత్య మానందనిధిం భజేత సర్వాత్మనా ఒతోఽన్యత ఆత్మఘాతః.

అవ: భజన యనెడు నుపాసన గుణసంధానముతోనే యొనర్పవలెను. అందుచే నాతని గుణములను జెప్పుచు నా యుపాసనను స్పష్టపఱచువాఁడై అట్లు చేయకున్నచో జరగు దుష్టఫలమును గూడ చెప్పుచున్నాఁడు—

యథా ఏకః=ప్రాణాపానాదులైన యైదు రీతులుగా నున్న ముఖ్యప్రాణదేవుఁడు, సుప్తజనేక్షితా=నిద్రించుచున్న జనులను హెచ్చరికతోఁ జూచునో, తథా సః శ్రీహరిః, సర్వవిత్=సర్వజ్ఞుఁడు; హృద్యసుఖాః=1. అందఱి హృదయములందున్నవాఁడు, 2. యథేచ్ఛముగా నానందము ననుభవించువాఁడు, 3. తన యిచ్ఛతో ననుకూ

ములైన దేహములను బొందువాఁడు, సర్వః=అందుచేతనే సర్వగుణ పూర్ణుఁడు, ఆత్మా=స్వామియైనవాఁడు (ఇతి). ఇట్లు గుణసంధానము చేసి, సత్యం = అన్నిటియందును సారభూతుఁడైన, ఆనందనిధిం=, ఆనందమునకు ముఖ్యాశ్రయుఁడైన, 2. ముఖ్యప్రాణదేవునిచేత సమర్పింపఁబడుటచేత నానందమనిపించికొనెడు కర్మలను ఫలపర్యంతము రక్షకుఁడైన, తం=విష్ణువును, సర్వాత్మనా=మనోవ్యథ శరీరవ్యథ మొదలైన వెన్నియున్నను విడువక, భజేత=ఉపాసింపవలెను, అతః అన్యథా =అట్లు చేయకున్నచో, ఆత్మఘాతః = అహిత మొనర్చికొనుటచేత నాత్మహత్య యనెడు యనెడు దోషము సంక్రమించి తత్ఫలముగా నిత్యదుఃఖమైన తమస్సు ఏర్పడును, చ = ఉపాసన కూడ వారి వారి యోగ్యతకుఁ దగినంత, తమస్సుగూడ వారియోగ్యతకుఁ దగినంతే.

**యథైకస్తు బహూనసుప్తః పశ్యతి ప్రభుః,**
**యథేష్ట భవనాద్విష్ణు రనుభూః పరికీర్తితః.**

ఈ ప్రమాణములకుఁ దగినట్లుగా నీ శ్లోకము నిట్లే యన్వయించవలెను. ఇక్కడ మోక్షాధికారులందఱు యోగ్యతానుసారముగా నుపాసింపఁదగిన సత్, చిత్, ఆనంద, ఆత్మ యనెడు నాల్గు గుణములను నాల్గు విశేషణములతో సూచించియున్నారు. 7

అవ: భగవంతు నుపాసింపకయుండు వానికిని పశువునకును వ్యత్యాసము లే దనుచున్నాఁడు_

వైతరణ్యాం పతితం స్వకర్మజాన్ పరితాపాన్ జుషాణం జనం పశ్యన్=గురువు లొనర్చిన శాస్త్రోపదేశమును దృష్టితోఁ జూచుచున్నవాఁడై తు = అట్టి దుఃఖమును బరిహరించెడు తృప్తి జ్ఞానము వీనికి విషయమైన సుఖము నొసఁగెడు శ్రీహరిని దెలియువాఁడై, కః = ఏ

పరానుచింతాం నామ, యుంజ్యాత్ = ఇతరచింతన చేయువాఁడు పశువే యని యర్థము.

చతుర్వేదవిదపి యో విప్రో వాసుదేవం న విదంతి,
వేదభారభరాక్రాంతః స వై బ్రాహ్మణగర్దభః. 8

అవ: యోగ్యతా తారతమ్యముతో నధికారులైన చేతను లనేకులు. వారిలో స్థూలరూపము నుపాసించిన యోగ్యతగల వారి కొఱకు వారి యుపాసనాక్రమము తెలుపఁబడినది. ఇప్పుడు దమ హృదయకమల కర్ణికయందు నెలకొన్న పరమాత్మ నుపాసించెడి యోగ్యతగలవారి కొఱ కా యుపాసనను జెప్పుచున్నాఁడు-

కేచిత్ = పరమాత్మ నుపాసించెడి యోగ్యతగల కొందఱు-

స్వదేహాంతర్హృదయావకాశే వసంతం చతుర్భుజమ్,
కంజ రథాంగ శంఖ గదాధరం పురుషం ధారణయా స్మరంతి. 9

ఇప్పుడు నాల్గు శ్లోకములతో శ్రీహరినే వర్ణించుచున్నాఁడు. 10

అన్నియవయవములందును మనస్సును నిల్పుటకు నొక్కొక్క యంగమునే ధ్యానింపవలెనని భావము. 'యస్మాత్త్వంచింతితో విష్ణుః చింతితం ప్రదదా త్యజః' మొదలైన ప్రమాణములతో శ్రీహరి చింతా ప్రధానుఁడని తెలియవలెను. 13

అవ: సర్వాంగములను స్మరించుట కశక్తుఁడైనవాఁడు స్మరింపవలసిన ప్రకారమును జెప్పుచున్నాఁడు-

ధ్యానేన జితం జితం స్థానం అపోహ్య యథా యథా = ఎట్లెట్లు ధీః శుధ్యతే బుద్ధిః = సర్వాంగమునుస్మరించు సామర్థ్యమునుబొందునో, తథా తథా = అట్లట్లు, పరం పరం = అభ్యసింపని వేఱువేఱు అంగములను ధారయేత్ = ధ్యానవిషయముగా నొనర్పవలెను. ఇట్లు గదాభృతః పాదాది హసితం యావత్ అంగాని ఏకైకశః ధియా అనుభావయేత్

—అన్నియంగముల నొక్కటేసారి ధ్యాన మొనర్పలేనివాఁడు ఒక్కొక్క యంగమునే ధ్యానములో నభ్యసించి క్రమముగా సంధ్యారాగము నకు యోగ్యుఁడు గావలెనని చెప్పుచున్నాఁడు. 14

అవ: ఈ విషయమును ముగించుచున్నాఁడు-

పరావరే—ఉత్తములైన బ్రహ్మాదులను దనకంటెఁ దక్కువవారుగాఁ గలిగియున్న, ద్రష్టః—సర్వసాక్షియైన, అస్మిన విశ్వేశ్వరే—సర్వనియామకుఁడైన శ్రీమహావిష్ణువునందు, భక్తియోగః—శ్రీహరియే సర్వోత్తముఁడు. మహోపకారి. అందుచే సర్వమునకంటెను ప్రియతముఁడు. ఇట్టి జ్ఞానసహితమగు ప్రేమయే యఖండధ్యానమునకుఁ గారణమైనది. యావత్—ఎంతవఱకు, న జాయేత, తావత్ పురుషస్య స్థవీయఃరూపః —పాతాళము మొదలుకొని సర్వలోకములకు దేవతలకు నాధారమైన విరాడ్రూపమును, క్రియావసానే—వానియందును నిరంతరము ధ్యానాసక్తుఁడై నిత్యనైమిత్తిక కర్మల కొనయందు, ప్రయతః—ప్రయత్నశీలుఁడై, నమ్రుఁడై స్మరింపవలెను. 15

అవ: పైఁ జెప్పిన ట్లుపాసించి దానిచే లబ్ధమైన జ్ఞానముతో శ్రీహరి నపరోక్షించికొని యతని యనుగ్రహముచే బ్రహ్మ మొదలైన తత్త్వములను యథావత్తుగాఁ దెలిసిన జ్ఞాని తన దేహమును త్యాగ మొనర్పవలెనని తలఁచినప్పుడు తన దేహమందున్న ఇంద్రియాభిమాని దేవతల చింతనతో మోక్షమునందెడు రీతిని దెల్పుచున్నాఁడు-

యతిః — ఇంద్రియసమూహములను గెలిచిన యపరోక్షజ్ఞాని, ఇమం లోకం—తన భౌతికదేహమును, యదా జిహాసు ర్భవతి తదా సుఖం స్థిరం ఆసనం ఆస్థితః కాలే దేశే చ మనః న సజ్జేత్. మనసా —తన యధీనమందున్న మనస్సుతో, ప్రాణాన్—విషయములకై పరువెత్తు నింద్రియములను, నియచ్ఛేత్. ఇట్లు, జితాసుః—భక్తిమూలకముగా నేర్పడిన వాయుదేవుని యనుగ్రహముతో, ప్రాణాన్—ఇంద్రియ

ప్రేరకులైన ఉద్గేవతలు మొదలైన వారిని, మనసా = మనోభిమాని యైన ఇంద్రునకు, నియచ్ఛేత్ = అధీనులని తెలియవలెను,

తాత్పర్యము: ఇంద్రియముల నరికట్టి ప్రాణాయామమూలక ముగా ప్రాణదేవుని యనుగ్రహమును సంపాదించి ఇంద్రియాభిమాను లైన ఉద్గేవతలు మొదలైనవారిని 'మనోభిమానియైన యింద్రున కధీనులు' అని చింతింపవలెను. 18

మనశ్చ=మనోభిమానియైన యింద్రుని, అనుకూలతయా= శుద్ధమైన, బుద్ధ్యా=బుద్ధిదేవతయైన యుమాదేవికి, నియమ్య-నియా మ్యః=అధీనుడని తెలియవలెను. ఏతాం=ఆ ఉమాదేవిని, క్షేత్రజ్ఞే= జీవాంతర్యామియైన శ్రీహరికి, నినయేత్=నంపూర్ణముగా లోబడిన దని చింతింపవలెను, తం=ఆ క్షేత్రజ్ఞుని, ఆత్మని=దేహమధ్యమం దున్న శ్రీహరియందు, నినయేత్=ఐక్యచింతన మొనర్పవలెను, తం ఆత్మానం = దేహాగతుడైన శ్రీహరిని, ఆత్మని = సర్వవ్యాపకుడైన విష్ణువునందు, అవరుధ్య=ఏకీభావముతో నుపాసించి దేహమునువదలి, లబ్ధోపశాంతిః=అన్నిటికంటెను మంగళమైన రూపమునుజూచి, ధీరః =జ్ఞానియైనవాడు, కృత్యాత్ = విధి షేధరూపమైన కార్యమునుండి, విరమేత్ =దూరము గావలెను

విశేషములు: మనశ్చ అను శబ్దముతో మనశ్శబ్దవాచ్యుడైన రుద్రుని బుద్ధిశబ్దవాచ్యురాలైన వాణిని, బ్రహ్మ, లక్ష్మి వీరి మూలక ముగా క్షేత్రజ్ఞుడైన శ్రీహరియందు లయమగునట్లు దెలియవలెను. తత్త్వములకు దమతమ కారణములందు లయ మని భావింపవలెను, 'భక్త్యా ప్రాణం వశే నీత్వా జితప్రాణో భవత్యత', 'జీవస్థో భగవా న్విష్ణుః క్షేత్రజ్ఞ ఇతి గీయతే', 'హృద్గతస్తు స ఏవాత్మావ్యాప్తో ప్యాత్మేతి భణ్యతే', 'అన్యత్ర తన్నియమ్యాది చింతనం నీతి రుచ్యతే' అను ప్రమాణ ముండుటచేత పైనిం జెప్పినదే సరియైన యర్థము.

అద్వైతులు మనస్తత్త్వమును బుద్ధితత్త్వమందును, దానిని యధిష్ఠాన మనఁబడెడు క్షేత్రజ్ఞునందును, అతనిని శోధితతత్పదార్థ మను చిన్మాత్రమునందును, దానిని శోధితతత్పదార్థ మనిపించికొనెడు పరమాత్మ యందును నైక్యమును చింతించి భేదకారణమైన యవిద్యాధిష్ఠానమును యథార్థజ్ఞానముతోఁ బోఁగొట్టుకొని కర్మలనుండి దూరము గావలె నని వ్యాఖ్యానించుచున్నారు. కొందఱు పౌరాణికులు వ్యష్టిరూపమైన బుద్ధిని క్షేత్రజ్ఞుఁ డనెడు సమష్టిరూపుఁడైన హిరణ్యగర్భునందును, అతనిని కారణాత్మయందును, దానిని శుద్ధబ్రహ్మయందును చేరియున్నట్లు చింతించి కర్మలనుండి దూరము గావలెనందురు. ఈ రెండు ప్రమాణ విరుద్ధములైన యర్థములు.

తాత్పర్యము: మనోభిమానియైన యింద్రుని బుద్ధిదేవతయైన యుమాదేవి కధీనుఁడుగాఁ దెలియవలెను. ఆమెను రుద్రున కధీనురాలని, యతఁడు వాణి కధీనుఁడని, వాణి బ్రహ్మ కధీనురాలని తెలియవలెను. ఈ బ్రహ్మ లక్ష్మికధీనుఁడు లక్ష్మి జీవాంతర్యామియైన హరి కధీనురాలు. ఈ జీవాంతర్యామియైన హరికి దేహమధ్యగతుఁడైన హరితో నైక్యచింతన మొనర్పవలెను. అతనిని సర్వవ్యాపియైన శ్రీహరితో నైక్య మొనర్చి భావింపవలెను. ఇట్లు చింతించుచు దేహమును వదలి శ్రీమన్నారాయణునిఁ గనుఁగొన్న జ్ఞానియైనవాఁడు విధినిషేధ కర్మముల నుండి తప్పించికొన్నవాఁ డగును 17

అవ: ఇట్లు దేహమును వదలిన జ్ఞాని చెందెడు లోకమును ఇతరలోకముల నుండి వేర్పఱచి చెప్పుచున్నాఁడు–

యత్ర=ఏ లోకమందు, అనిమిషాం పరః=రుద్రాదులకుప్రభువైన, కాలః=వాయుదేవుఁడు, 'హరిశ్చ ప్రకృతిశ్చైవ బ్రహ్మావాయూ తథైవ చ' 'కాలశబ్దైరితాః క్రమాత్' అని ప్రమాణము న ప్రభుః= తన శక్తిని జూపలేఁడు. యే=ఏ రుద్రాది దేవతలు, జగతాం ఈశిరే తే దేవాః న ప్రభవంతి. కుతోను?=ఇతరుల కవకాశ మెక్కడిది?

యత్ర సత్త్వం న రజస్తమశ్చ న వికారో వై న=భూతము లింద్రియ ములుగా వికారమందిన యహంకారతత్త్వము తనశక్తిని జూపలేదు మహాన్ న ప్రధానం న- 18

అవ: కాలము మొదలైనవాని సంబంధము లేసిచో నది యత్యంతాభావమే గదా! దానికి సమాధానము-

తత్=దానిని, వైష్ణవం పరం పదం=పొందఁదగిన లోకము లలో నుత్తమమైన లోకమని, అమనంతి=వేదములు పల్కును. ఇట్లు చెప్పుటచేత కాలము మొదలైన వానిచే నేర్పడెడు దోషములు శ్రీహరి యందు లేనట్లే యాతని లోకమందును లేవని చెప్పినట్లైనది. ఎవని సంబంధముతో నా లోకమంత మహిమోపేతమైనదో అతఁ డెట్టివాఁడు? అసత్=పరమాత్మ భిన్నమైన సంసారరూప దుఃఖమును (వైష్ణవం అను శబ్దముచే సూచింపఁబడిన విష్ణువనే యిచటి తత్పదార్థముచేత గ్రహింప వలెను), ఉత్సిసృక్షవః=పోఁగొట్టుకొనవలెనని తలఁచు మోక్షాధికారి చేతనులు, యత్=ఏ శ్రీహరిని, నేతినేతి=పృథివి మొదలైన వానివంటి వాఁడు గాఁడు. ఆకాశమువంటి వాఁడు గాఁడు. తత్కారణములైన మహదాదులవలెను గాఁడు. తదభిమానులైన దేవతలవలెను గాఁడు. జగద్విలక్షణుఁ డని, ఉపాస్య=ఉపాసించి, తత్ దౌరాత్మ్యం=అసుర స్వభావులు పొందిన ఈ సంసారరూపమును, విసృజ్య అనన్యసౌహృదాః=నిరతిశయ స్నేహరూపమైన భక్తితో, ఉపగుహ్య=ధ్యానించి, పదే పదే=ప్రతిక్షణము, అమలం=శ్రీహరిని, అహుః=మనస్సుతోఁ బొందుదురో అట్టి శ్రీహరికి సంబంధించిన దీ లోకమని యన్వయము. లేక ఏ సర్వోత్తమము పరమమంగళమైన శ్రీహరిరూపమునుబొందునో ఆ రూప మితరవిలక్షణమని చెప్పుచున్నాఁడు. అసత్=బ్రహ్మాభిన్నమైన ప్రపంచమును, ఉత్సిసృక్షవః, యత్=ఏ రూపమును, 'నేతి నేతి'- 'సవా ఆత్మా నేతి నేతి' అను శ్రుతిచేత, అమనంతి=శ్రుతులు చెప్పు చున్నవో, అచేతనములైన వేదములు బుద్ధిపూర్వకముగాఁ బ్రవర్తింప

యైకోత్యాసనము. విసృజ్య పదే పదీ హృదా ఉపగుహ్య అనన్య సౌహృదాః = అనన్యభక్తిగల గడచిన, ఇప్పుడున్న, రాఁబోవునట్టి యధికారి చేతను లందఱును, అముం = ఈ మహావిష్ణువును, ఆపుః = పొందిరి, పొందుచున్నారు, పొందఁ బోవుదురు. 19

అవ : ఇప్పుడు జ్ఞానులు దేహమును వదలిపోవుపద్ధతినిఁ జెప్పుచున్నాఁడు-

'తు' అను పదము వేఱుప్రకరణమును సూచించుచున్నది. ఇత్థం వ్యవసితః = దేహమును వదలవలెనని నిశ్చయించికొన్నవాఁడై, విజ్ఞాన........ ఆశయః = 1. తనకు యోగ్యమై బింబరూపియై శ్రీహరి యొక్క యపరోక్షమనెడు జ్ఞానప్రభావముచేత సంపూర్ణముగా దగ్ధమైన బయటి యంతఃకరణము గలవాఁడై, 2. హరియొక్క ప్రభావముతో దగ్ధమైన మనోవాసనలు గలవాఁడై, మునిః = అపరోక్షజ్ఞాని, ఉపరమేత్ = దేహమునుండి బయటఁ బడవలెను. దీనికి జితక్లమః = స్వపార్ష్ణినా, గుదం, ఆపీడ్య, తతః = ఆ మూలాధారరూపమైన నాల్గు దళములుగల పద్మమునుండి, అనిలం = ఉదానవాయువును లేపి, షట్సు స్థానేషు = నాభి, హృదయము, వక్షఃస్థలము, తాలుమూల, భ్రూమధ్య శిరస్సు లనెడు నాఱుస్థానములకు ఉన్నయేత. 20

అవ : సంక్షేపముగాఁ జెప్పిన విషయమునే వివరించుచున్నాఁడు-

మునిః, నాభ్యాం స్థితం = నాభియందున్న యాఱు దళముల పద్మమునకు తేఁబడిన వాయువును, ఉదానగత్యా = బ్రహ్మనాడిచేత, హృది = హృదయమందున్న పదిదళముల పద్మమందు, అధిరోప్య, తస్మాత్ = అచ్చటినుండి ద్వాదశదళ పద్మమున్న, ఉరసి, న యేత్,

మనస్వీ, తతః, ధియా, అనుసంధాయ = వేఱునాడికిఁ బోవనట్లుగా ననుసంధాన మొనర్చి, శనకైః స్వతాలుమూలం-పదునాఱుదళములు గల తాలుమూలమును, స యేత. 21

తస్మాత్ - ఈ పదునాఱు దళములుగల కమలమునుండి, భ్రువోః అంతరం = భ్రూమధ్యమందున్న ద్విదళకమలమునకు, ఉన్నయేత నిరుద్ధసప్తాశ్వపథః = అడ్డగింపఁబడిన యేాఱు ద్వారములు గలవాఁడై, అనపేక్షః పరంగతః = మనస్సుతో శ్రీహరిని ధ్యానించుచు, ముహూర్తార్థం స్థిత్వా అకుంఠదృష్టిః మూర్ధన్ = శిరోమధ్యమందు, నిర్భిద్య = భేదించికొని, శరీరమును విసృజేత్ - దేహమునుండి వాయువును బయటికి పంపవలెను. గతః - అనుదానిచేత ధ్యానమును జెప్పుచున్నాఁడు.

విశేషార్థములు: అథైకయోర్ధ్వముదానః-

ప్రాణాపానా విడాయాం చ పింగళాయాం చ వర్తతః,
వ్యానస్పంధిషు సర్వత్ర ఉదానో బ్రహ్మనాడిగః.

అనెడు శ్రుతి స్మృతులచేత నుదానగతి యనఁగా బ్రహ్మనాడి యని యర్థము. కొందఱు 'ఇత్థం మునిః' మొదలైన వానిచేత, నిర్గుణ బ్రహ్మవిద్యాఫలమును జెప్పి 'స్వపార్ష్ణినా' మొదలైన వానిచేత సగుణ బ్రహ్మోపాసకులచేత దేహోత్క్రమణ ప్రకారమును జెప్పుచున్నాఁడని వ్యాఖ్యానింతురు. ఇది సరికాదు. ఒకటే వాక్యముగా నన్వయించి ముఖ్యార్థమునే చెప్పుట కుపక్రమించిన సందర్భమందు వేఱు వేఱు వాక్యములను వలె నన్వయించుట యుక్తము గాదు. 'నిరుద్ధసప్తాశ్వ పథః' విజయధ్వజుడు. 'నిరుద్ధసప్తాస్వాయనః' శ్రీధరులు. 22

అవ: పైని జెప్పినట్లు దేహోత్క్రమణ మొనర్చిన యోగులు పొందెడు స్థానమును వారిగతిని రెండుశ్లోకములతోఁ జెప్పుచున్నాఁడు. ఈ శ్లోకము లందలి 'యది' 'అథ' 'ఉత' అను శబ్దములను బునరా

చున్నాఁడు. అథ = ఆ లోకమును జేరిన తర్వాతఁ బునరావృత్తి లేని వాఁడై బ్రహ్మసాలోక్యమును మాత్రమే పొంది, అథ = భక్తి మొదలైన సాధనములయొక్క పరిపాకమునకై యచ్చటు వసించును. అనంత రము బ్రహ్మప్రళయమందు అతనితోఁ బాటు తనకు యోగ్యమైన మోక్షమును పొందును. ఉత = ఇంకను, యత్ = ఒకవేళ, ఉత = ముందు చెప్పిన యోగికంటెను అపరిపక్వమైన భక్తి మొదలగు సద్గుణములున్న వాఁడైనచో, వైహాయసానాం = వైమానికులైన సిద్ధుఁయొక్క, విహారం = క్రీడాస్థానమైన మహర్లోకము మొదలైన లోకములను, ప్రయాస్యతి అచ్చటు నితని యోగఫలమును జెప్పుచున్నాఁడు అథ = ఆ మహర్లో కము మొదలైన స్థలములందు, అష్టాధిపత్యం (ఏవ అష్ట వసతి) అణి మాది అష్టైశ్వర్యములను మాత్రమే పొంది వసించును. అథ యది = చక్కఁగా పక్వమైన భక్తి మొదలైనవిగల యప్రతీకాలంబనుఁ డైనచో యత్ర = ఎచ్చటు, పవనస్య అంతరాత్మా = వాయుదేవుని యంతర్యామి యైన వికుంఠనాథుఁ డుండునో ఆ వైకుంఠమందు అముక్తు లుండు స్థలమందు వారిచే నుపాస్యమానుఁడైన శ్రీహరిని బొందును, యది = ప్రతీకాలంబనుఁ డైనచో, యత్ర = ఎచ్చటు, మనశ్చ అంతరాత్మా చ = వాయు బ్రహ్మదేవులుందురో ఆ సత్యలోకమందు వాయుబ్రహ్మలను, ప్రయాస్యతి, త్రిలోక్యాం = భూమి అంతరిక్షము స్వర్గము లనెడు మూఁడు లోకములయొక్క, బహిః = బయటునున్న మహర్లోకము మొదలైన స్థలములందు, యోగేశ్వరాణాం = యోగసిద్ధులయొక్క, గతిం = స్థితిని, ఆమనంతి = పొందునని యందురు. దానికి పైనున్న స్థానముయొక్క ప్రాప్తిలేదు. ఈ లోకములను బొందఁ దలఁచినచోఁ గావలసిన సాధనములను జెప్పుచున్నాఁడు. విద్యాతపోయోగసమాధి

భాజాం = అపరోక్షజ్ఞానము మొదలైన పురుషార్థసాధన సామగ్రి గల జనులకుఁ జిక్కెడి, తాం గతిం=మహర్లోకము మొదలైన లోకముల గమనమును, కర్మభిః న ఆప్నువంతి=అపరోక్షజ్ఞానముచేతనే పొందుదు రని యర్థము. ఇచ్చట నొక విశేష మున్నది. గుణసన్నివాయే= ప్రాకృతములైన సత్త్వాది గుణములను బొందిన మహర్లోకములకుఁ బోఁ దగినవాఁడు, ఇంద్రియైః = బాహ్యేంద్రియములు, మనసా= బాహ్యమనస్సు వీనితో, సహైవ=కూడుకొనియే, గచ్ఛేత్ =పోవును. నిజస్వరూప మావిష్కృతమైనను అరబ్ధకర్మనాశ పర్యంతము బాహ్య మనస్సు మొదలైనవి దగ్ధపటమువలె నుండియేతీరునని చెప్పఁబడినది.

ఆ తరువాత గుణసన్నివాయే = జ్ఞానము మొదలైన వానితోఁ గూడిన ప్రాకృతము గాని ముక్తస్థానమందు చిన్మాత్రమైన మనస్సు ఇంద్రియములు-వీనితో వసతి.

> చిన్మాత్రాణీంద్రియాణ్యాహుః ముక్తానా మన్యదైవ తు,
> ఊయుస్త్రీన్ కర్మణాలోకాన్ జ్ఞానేనైవ తదుత్తరాన్.
>
> తత్రముఖ్యా హరిం యాంతి తదన్యే వాయు మేవ తు,
> అపక్వా యేన తే యాంతి వాయుం వా హరిమేవ వా.
>
> స్థానమాత్రాశ్రితాస్తేతు పునర్జని వివర్జితాః.

అనెడు ప్రమాణములకుఁ దగినట్లుగా ని ట్లన్వయించినాఁడు. పార మేష్ఠ్యాదిలోకములను బొందినచో మనస్సు ఇంద్రియములు వీనితోఁ జేరియే పోదురు. యోగేశ్వరుల గతి మూఁడు లోకములను దాఁటి పోవుట. అచ్చట వాయుదేవుని యంతర్యామియైన శ్రీహరి యుండును. ఆ స్థాన మపరోక్షజ్ఞానులకు మాత్రమే చిక్కును. కేవల కర్మలతో దొరకదు.

బ్రహ్మలోకమును జేరును. వానికి జన్మమరణము లుండవు. వాఁడు బ్రహ్మలోకమున నిలిచి జ్ఞానము భక్తి మొదలైన సాధనములు పక్వ మొనర్చికొని బ్రహ్మప్రళయకాలమం దతనితోఁ బాటు మోక్ష మందును. పరిపక్వము గాని సాధన మున్నవాఁడు సిద్ధపురుషుల విహారస్థానమైన మహర్లోకమును గాని జనోలోకమును గాని తపో లోకమునుగాని పొందును. అచ్చట నణిమాదిసిద్ధులనంది వసించును. పరిపక్వమైన సాధనములు గలిగి అప్రతీకాలంబనుఁడైన యోగి వైకుంఠమందలి యముక్తస్థలమును జేరి యచ్చట శ్రీహరి నుపా సించుచుండును. ప్రతీకాలంబనుఁ డైనచో సత్యలోకమునుఁ జేరి బ్రహ్మవాయువులను బొందును. ఈ యోగికి మహర్లోకాదులందుఁ గూడ విహరించుట కవకాశముండును. ఈ లోకములు అపరోక్షజ్ఞాను లకు దొరకునవి. కేవల జ్ఞానశూన్యులైన కర్మఠులకుఁ జిక్కవు. వీనియం దున్న యోగులకు బాహ్యములైన యింద్రియ మనస్సులు దగ్ధపటమువలె నుండనే యుండును. ముక్తస్థానమందు మాత్రమే ముక్తులైనవారికి స్వరూపభూతములైన చిదాత్మకములైన యింద్రి యము లుండును. అంతేకాని ప్రాకృతములైన యింద్రియము లుండవు. 'యది ప్రయాస్యన్ నృపః పారమేష్ఠ్యం' అని శ్రీధరుల పాఠము. 'యది ప్రయాస్యత్యథ పారమేష్ఠ్యం' అని వీరు. 'గుణ సన్నిపాతే' అని శ్రీధరులు, 'గుణసన్నివాయే' అని వీరు. 'యోగే శ్వరాణాం గతి మాహురంతి బహిస్త్రిలోక్యాః పవనాంతరాత్మా' అని విజయధ్వజులు. 'యోగేశ్వరాణాం గతి మాహురంతర్బహిస్త్రిలోక్యాః పవనాంతరాత్మనా' అని శ్రీధరులు. 23. 24

అవ: ఆ యోగిమార్గమును జెప్పుచున్నాఁడు-

సుషుమ్నయా=సుషుమ్నానాడిచే నుత్క్రమించి, విహాయసా =హృదయాకాశముతో, బ్రహ్మపథేన=సుషుమ్నయనెడు, శోచిషా= కాంతిచేత, గతః=పోయిన యోగి, వైశ్వానరం=అర్చిరాది దేవత

లను పొంది, తరువాత వైశ్వానర లోకమును, యాతి = చేరును, అథ=తర్వాత. 'విధూతకల్కః తతః ఉదస్తాత్ శైంశుమారం చక్రం ప్రయాతి', 'వైశ్వానరే ద్యునద్యాం వా సూర్యేవా దేహ ఏవవా' 'విధూయ సర్వపాపాని యాంతి కింస్తుఘ్న కేశవం' అని ప్రమాణము.

తాత్పర్యము: ఇట్టి యోగులు సుషుమ్నామూలమున నుత్క్రమించి హృదయాకాశము నుండి సుషుమ్న యనెడు కాంతితో నిష్క్రమించి అర్చిరాది దేవతలనుబొంది వైశ్వానరలోకమును జేరుదురు. అక్కడ తమ పాపములను బోఁగొట్టుకొని శ్రీహరి శింశుమార రూపముతోనుండు స్థలమును జేరెదరు. 25

ద్వైతసంప్రదాయములో మాత్రమే నున్న శ్లోకములు-

**యోంతః పచతి భూతానాం యస్తపత్యండ మధ్యగః,**
**సోఽగ్నిర్వైశ్వానరో మార్గో దేవానాం పితౄణాం మునేః.**

వైశ్వానరుఁ డెవ్వఁడు? వివరించుచున్నాఁడు- యః=ఎవఁడు, భూతానాం=ప్రాణులయొక్క, అంతః=జఠరాగ్నియందుండి, పచతి= వారు తినెడి నాల్గువిధములైన యాహారములను జీర్ణ మొనర్చునో, యశ్చ=ఎవఁడు, బ్రహ్మాండమధ్యగః=బ్రహ్మాండ మధ్యమందు అగ్నిలోకమునం దుండి, తపతి=ప్రకాశమానుఁడై యుండునో, సోఽగ్నిః =ఆ ప్రధానాగ్నియే, వైశ్వానరః=వైశ్వానరుఁడనెడువాఁడు, దేవానాం=దేవతలయొక్కయు, పితౄణాం=పితరులయొక్కయు లోకములను బొందఁగోరెడు, మునేః=అపరోక్షజ్ఞానికి, మార్గః = మార్గమైన వాఁడో, ప్రతియొక్కఁడును ఈ లోకమును జేరియే ముందు కేగవలెను. అందుకే మార్గమనుచున్నాఁడు-

**పితృయానం దేవయానం బ్రహ్మయానమితి త్రిధా,**

దేవయానమునఁ బ్రయాణించువారు వైశ్వానరలోకమునకుఁ బోవు
ు ముందే అర్చిరాదిలోకముల కేగెదరు. బ్రహ్మదేవ, పితృలోకము
ుఁబోయెడు ప్రతియొక్కరును వైశ్వానరునిబొందియే తీఅవలెను.
న్ని తెలుపుటకే 'వైశ్వానరం యాతి' అని భాగవతమనుచున్నది.

దేవయానం పింగలాభి రహోన్యేతి శతాయుషా,
రాత్రీరిడాభిః పితృణాం విషువత్త్యాం సుషుమ్నయా.

ఐనచో వా రెవ్వరు? దానికి సమాధానము. పింగలాభిః=
ీరము కుడివైపుననున్న యీ పేరుగల నాడులద్వారా, శతాయుషా
మరణ మనెడు నుత్క్రమణమును, అహోని=అహః స్సనెడు పేరుగల,
వయానం=దేవమార్గమును, ఏతి=పొందును, ఇడాభిః=దేహము
డమభాగమునందున్న యీ పేరుగల నాడుల ద్వారా, శతాయుషా
ాత్రీః=రాత్రి యను పేరుగల, పితృణాం యానం=పితరుల మార్గ
మును ఏతి, దేవయాన పితృయాన మార్గము లందున్న యహో
ాత్రములకు నభిమానులైన దేవతల ప్రాచుర్యముతో, 'అహాని=
ాత్రీః, అను బహువచన ప్రయోగము, సుషుమ్నయా=ఇడాపింగళ
ాడుల మధ్యనున్న సుషుమ్న నాడిద్వారా శతాయుషా=నిష్క్ర
మించినవారు, విషువత్త్యాం=విశిష్టమైన సుఖముగల బ్రహ్మయాన
మును ఏతి_

దక్షిణాః పింగళాః సర్వాః ఇడావామాః ప్రకీర్తితాః,
నాడ్యోథమధ్యమా ప్రోక్తా సుషుమ్నా వేదపారగైః.
దేవయానస్య మార్గస్థా అహ శ్శబ్దాభిసంజ్ఞితాః,
పితృయానస్య మార్గస్థా రాత్రిశబ్దాహ్వయా మతాః.
విషువత్త్యా బ్రహ్మయానం విశేషేణసుఖం యతః.

అని ప్రమాణము. పింగళ మొదలైన నాడులకు దేవయానము మొద
లైన పేరులు వచ్చుటకుఁ గారణము రాగముతోఁ గూడిన సుఖము
నిచ్చుటచేతనే_

పింగళా దేవయానం స్యా త్పింగాఖ్యనుఖదా యతః,

ఇడాన్నదానాత్పితౄణాం ఏవం మార్గాః ప్రకీర్తితాః.

దేవయాన బ్రహ్మయానములు ఒకే మార్గముయొక్క రెండు భేదము లని తెలియవలెను. 26, 27

అవ: ఇప్పుడు శింశుమారలోకమునుండి పైమార్గమును జెప్పు చున్నాఁడు_

తత్ = శింశుమారమనెడు విష్ణురూపమైన, విశ్వనాభిం = జగత్తున కాధారమైనదానిని, అభిపద్య = పొంది, తు_ అతనియనుజ్ఞతో, విరజేన = రాగాది దోషములు లేని, అణీయసా = అత్యంతసూక్ష్మమైన, ఆత్మనా = ఆత్మస్వరూపముచేత అందఱు బ్రహ్మజ్ఞానులును, కల్పాయుషః = కల్పకాల మాయుస్సున్న, విబుధాః = జ్ఞానులును, యత్ = ఎచ్చటు, రమంతే = విహరింతురో, తం = అట్టి, బ్రహ్మవిదాం = బ్రహ్మజ్ఞానుల సమూహముచేత, నమస్కృతం, ఏకం = 1. ముఖ్యమైన, 2. కేవల మైన, లోకం = వైకుంఠాది లోకమును, ఉపైతి = పొందెదరు. 'మన్వంత రాయుషస్స్వర్గ్యాః, మహర్లోకే తు కాల్పికాః' స్వర్గవాసుల కొక్క మన్వంతర మాయుస్సు; మహారాప లోకముల వారికి ఒక్కకల్ప మాయుస్సు; పింగళానాడి నుండి యుత్క్రమించి దేవయానమునఁ బ్రయాణించిన ముక్తియోగ్యుఁడైన జీవుఁడు బ్రహ్మకల్పముయొక్క కొనయందు శ్రీహరినిఁ జేరువాఁడై మహర్లోకము మొదలైన వాని యందు అణిమాద్యష్టసిద్ధులను బొంది వసించును, కొందఱు జనలోక మందు మఱి కొందఱు తపోలోకమందు తమ జ్ఞానము మొదలైన సాధనముల పరిపాకమునకై వసింతురు. కొందఱు శ్రీహరియాజ్ఞతో సత్యలోకమం దుందురు. బ్రహ్మయానముతోఁ బోయిన ప్రతీకాలం బనులు అప్రతీకాలంబనులు శింశుమారరూపుఁడైన శ్రీహరి యనుజ్ఞ వడసి అప్పుడే అనిరుద్ధ ప్రద్యుమ్న సంకర్షణులను వారిని బొంది దివస్పతి యనెడు వాయువును జేరి యచటినుండి చతుర్ముఖ బ్రహ్మను

జేరి అతనియుపదేశమునంది ప్రతీకోపాసకులు అచ్చటనే వసింతురు. అప్రతీకాలంబనులు వాయువుతో శ్రీహరిని జేరి వైకుంఠమందు అముక్తస్థానమం దుందురు. ఇన్ని విశేషములను 'తు' శబ్దము సూచించుచున్నది. 28

అవ. మహర్లోకాదులందు విహరించు వారు జ్ఞానము మొదలైన వాని పక్వతకై యచ్చట వసించుచున్నవారు చతుర్ముఖబ్రహ్మను బొందు రీతిని జెప్పుచున్నాఁడు-

స:-మహర్లోకాదులందు వసించు జ్ఞానుల సమూహము, అథో=ద్వితీయ పరార్థముయొక్క కొనయందు బ్రహ్మదేవునితోఁ బాటు మోక్షమును బొందువారై, అనంతస్య=శేషాంతర్యామియైన సంకర్షణ మూర్తియొక్క ముఖానలేన, విశ్వం=జగత్తును, దందహ్యమానం=మాటిమాటికి సంపూర్ణముగా కాలిపోవుచుండుటను, నిరీక్ష్య=చూచి, యత్=ఏ సత్యలోకము, సిద్ధేశ్వరజుష్టధిష్ణ్యం = సకాదులైన సిద్ధశ్రేష్ఠులతో సేవింపఁబడెడు, చతుర్ముఖబ్రహ్మయొక్క నివాసస్థలమో యింకను ద్వైపరార్థం=రెండు పరార్థముల కాలముండునదో బ్రహ్మదేవుని నూఱు వర్షముల యాయుస్సునకు 'పర' మని పేరు. అంతకాల మనుభవింపఁదగినది. తత్=అట్టి, పారమేష్ఠ్యం=బ్రహ్మదేవుని వాసస్థానమైన సత్యలోకమును, నిర్యాతి=మహర్లోకాదుల ద్వారా పోయి చేరెదరు. 'ఉ' బ్రహ్మలోకమును జేరి అతనితోఁబాటు ముక్తి నందెదరు. 29

అవ: ఇతరలోకములకంటెను సత్యలోక ముత్తమమని చెప్పుచున్నారు-

యత్ర = యే, ఋతే=సత్యలోకమందు, శోకః న, జరా న, మృత్యుః న, అధిః న, కుతశ్చిత్=ఏ కారణముచేతనైనను, ఉద్వేగః=మనోవ్యాకులత, న, అనిదం విదాం=బ్రహ్మజ్ఞానము లేనివారికి, క్రియయా=కర్మచేత, దురంతదుఃఖ ప్రభవాను దర్శనాత్=కొనలేని

దుఃఖము జన్మ మరణములు- వీనిని జూచుటచేత, యః = ఏ చిత్త క్షోభముగూడ, న=లేదో, అట్టి సత్యలోకమును జేరెదరు. సత్యలోకము జనోలోకాదులకంటె శ్రేష్ఠమే. కాని, ముక్తికంటె శ్రేష్ఠము గాదు.

**సర్వదుఃఖవిహీనా యే ముక్తాః ప్రాయస్తు తాదృశాః,**
**అముక్తాస్తు జనాద్యేషు విశేషేణ తు సత్యగాః.**

ముక్తులు సమస్తదుఃఖముల నుండి విముక్తులు. జనాదిలోకములందున అముక్తులు గూడ సాధారణముగా నిట్టే యుందురు. సత్యలోకముం దున్నవారు విశేషముగా దుఃఖరహితులు. బ్రహ్మదేవునితోఁ బాటు అందఱును మోక్షము నందువారైనచో దానికిఁ గావలసిన సాధన సంపత్తిని సమకూర్చుకొనుట వ్యర్థముగదా! కాని జీవుల యోగ్యతలు అనేకవిధములుగా నుండును. దానినిఁబట్టి వారి కేర్పడు ముక్తిగూడ ననేకమే.

**విష్ణోర్లోకం తద్వైవైకే యాంతి కాలాంతరే పరే,**
**విహృత్యైవా ఒన్యలోకేషు ముచ్యంతే బ్రహ్మణా సహ.**

కొందఱు సాధన ముగిసినవెంటనే ముక్తి నందెదరు. కొందఱు సాధన ముగియనందుచే శ్రీహరి యాజ్ఞతో జనాదిలోకములందుండి యది ముగిసిన తర్వాత ముక్తి నందెదరు. కొందఱు తక్కినలోకము లందు విహరించుచు బ్రహ్మదేవునితోఁ బాటు ముక్తి నందెదరు. 30

అవ: పైనిఁజెప్పిన పద్ధతిలో దేవమార్గమునఁ బ్రయాణించి సత్యలోకమును గాని వైకుంఠమును గాని బొందిన జ్ఞానులయొక్క మోక్షమును జెప్పుటకొఱకై దేవతల ముక్తిప్రకారమును వివరించు చున్నాడు-

ప్రతీకాలంబనులు అప్రతీకాలంబను లనెడు నపరోక్షులగు జ్ఞానుల సమూహము, తతః=బ్రహ్మదేవుని ప్రళయకాలమందు, తమ

ములద్వారా సరస్వతీదేవియందుఁ బ్రవేశించి తన్మూలకముగా భౌతిక శరీరముగల చతుర్ముఖబ్రహ్మనంది యతనితోఁబాటు, విశేషంప్రతిపద్య = పృథివిని బొంది, తేన ఆత్మనా=ఆ పృథివీ తత్త్వాంతర్యామియైన శ్రీహరితో, అపః ప్రతిపద్య=అప్తత్త్వమును బొంది, తే నాత్మనా=తదంతర్యామియైన హరితో, అనలమూర్ధ్నా = తేజస్తత్త్వమును, ప్రతిపద్య నిర్భయః=సంసారభయ విముక్తుఁడై, త్వరన్=త్వరపడుచు, జ్యోతిర్మయః భూత్వా=అగ్నినే ప్రధానముగాఁ బొంది, వాయుం=భూతవాయుతత్త్వమును, ఉపేత్యకాలే=ముక్తి కాలమందు, తేన వాయ్వాత్మనా=ఆ వాయ్వంతర్యామియైన హరితోఁబాటు, ఆత్మలింగం=శ్రీహరిచిహ్నమైన యాకాశమువలె వ్యాపకము నిత్యమునైన, బృహత్ =విశాలమైన, ఖం=భూతాకాశతత్త్వమును, ప్రవిశతి. 'చ' అని చెప్పుటచే పైని చెప్పఁబోవు తాత్పర్యమునుగూడ సూచించినట్లైనది. బ్రహ్మాండమునకు విశేషమని పేరు. దానియందుండు బ్రహ్మదేవునకును విశేషమనియే పేరు. తదంతర్గతుఁడైన శ్రీహరికి వైరాజుఁడని, అతనితోఁబాటు బ్రహ్మాండకటాహ మనెడు విశేషనామకమైన పృథివీతత్త్వమైన బ్రహ్మదేవుని యందున్న అన్నానామక శ్రీహరిని జేరెదరు. అతనితోఁబాటు అప్తత్త్వమందున్న బ్రహ్మయందున్న అన్ననామహరినిజేరుదురు అతనితో తేజస్తత్త్వగతుఁడైన బ్రహ్మయందుండు ప్రాణనామకుఁడైన హరిని బొందుదురు. అతనితోఁబాటు వాయుతత్త్వమందున్న బ్రహ్మదేవుని యంతర్యామియైన ప్రాణనామక హరి నందెదరు. తరువాత నాకాశమందున్న బ్రహ్మాంతర్యామియైన ప్రాణనామకహరి నందెదరు. పృథివీతత్త్వము మొదలైన జడములు తమ తమ కారణములైన జడతత్త్వములందు లయము నందుచుఁ బ్రకృతిలో లయించును. ఆ తత్త్వాభిమానుల శరీరములును నిట్లే లయించును. అక్కడక్కడ

కముగాఁ బై తత్త్వములయందుఁ బ్రవేశింతురని తెలియవలెను.

జ్ఞానినః ప్రళయే సర్వే బ్రహ్మణా సహ పార్థివమ్,
భూమ్యగ్నిమవ్ననామానం ప్రాణమగ్న్యాది సంస్థితమ్.

పై ప్రమాణమున కనుగుణముగా నర్థము సల్పుటచేత నిది నిష్ప్రమా ణము గాదు. 'తే నాత్మనాపోనల మూర్తిరత్వరన్' అని శ్రీధరులు, 'తేనాత్మనాపోనలమూర్ధ్ని చ త్వరన్' అని విజయధ్వజులు. 31

అవ: ఇప్పుడు పంచతన్మాత్రల లయరీతిని దెల్పుచున్నాఁడు-

ఘ్రాణేన=ఘ్రాణేంద్రియమందున్న బ్రహ్మ తదంతర్యామియైన శ్రీహరితో, గంధం = గంధతన్మాత్ర మందున్న బ్రహ్మదేవుని యంత ర్యామియైన శ్రీహరిని బొంది, రసనేన = నాల్కయందున్న బ్రహ్మ దేవుని యంతర్యామియైన శ్రీహరితో, రసం=రసతన్మాత్రయందున్న బ్రహ్మదేవుని యంతర్యామియైన శ్రీహరినిబొంది. ఇట్లే పైని ఊహించి కొనవలెను. యోగీ = అపరోక్షజ్ఞాని, ప్రాయేణ=సాధారణముగా, ఆవృత్తిం = మరల సంసారమునకు వచ్చుటను, న ఉపైతి=పొందుట లేదు. వాయువు మొదలైన పదవులయందున్నవారు మరల సృష్టికి వత్తురు. అందుకే 'ప్రాయేణ' అను శబ్దప్రయోగము. లేక ముందుఁ జెప్పిన పైనిఁజెప్పబోవు పద్ధతితో ముక్తులైన జ్ఞానులయొక్క భోగరీతిని దెల్పుచున్నాఁడు. యోగీ = ఇంతకుముందుఁ జెప్పినట్లు ముక్తులై చిదానందాత్మకమైన దేహమును మాత్రమే (స్వరూపదేహమును) పొందిన జ్ఞానుల సమూహము, ఘ్రాణేన = చిదానందాత్మకమైన ఘ్రాణేంద్రియముతో, గంధం = అత్యుత్తమమైన గంధమును, ఇట్లే నాల్కతో రసమును, కంటితో రూపమును, త్వగింద్రియముతో స్పర్శ మును, శ్రవణేంద్రియముతో శబ్దమును, ఉపేత్య=అనుభవించి, శ్వేత

ముక్తిని జెప్పవలెను గాని యద్వైతులవలె ముక్తిని వివరించుటకు వీలులేదని చెప్పఁబడినది. 'తు' అనుటతో 'మగ్నస్య హి పరేఽజ్ఞానే కిం న దుఃఖకరం భవేత్-అను ప్రమాణమును సూచించినాఁడు. 32

తాత్పర్యము: ఘ్రాణేంద్రియమందున్న హరితోఁబాటు గంధ తన్మాత్రయందున్న హరిని బొంది, రసనేంద్రియమందున్న హరితోఁ బాటు రసతన్మాత్రయందున్న హరినిబొంది, చక్షురింద్రియమందున్న హరితో రూపతన్మాత్రయందుఁ గల హరిని బొంది, త్వగింద్రియమం దున్న హరితో స్పర్శతన్మాత్రయందున్న హరినిబొంది, శ్రవణేంద్రియ మందున్న హరితో శబ్దమందున్న హరిని సేవించి, యపరోక్షజ్ఞాని తన సాధన ముగిసియున్నచో మఱల సృష్టికి వచ్చుటలేదు. సాధన ముగియనివారు సృష్టికి వత్తురు. ఇట్టి యపరోక్షజ్ఞానులు ముక్తులై చిదానందాత్మకమైన స్వరూప దేహమునందు తదింద్రియముల చేత నత్యుత్తమములైన విషయముల ననుభవించి శ్వేతద్వీపాదులందుండి ప్రళయమందుఁ గూడ క్రిందికి రారు. పంచభూతములు శబ్దాదులైన తన్మాత్రలు, జీవరాసులు, ఇంద్రియములు, ఇంద్రియాభిమాని దేవతలు -వీరితోఁ గూడిన సనాతనుఁడైన శ్రీహరి మనస్తత్త్వము నందుండు నింద్రాంతర్యామియైన బ్రహ్మదేవుని యంతర్యామియైన తన మానస మనెడు రూపమును జేరును. పిదప సుమాదేవియందున్న బ్రహ్మాంత ర్యామియైన తన రూపమును జేరి మఱియని పిలువఁబడెడు నహంకార తత్త్వమును, వాణ్యంతర్యామియైన బ్రహ్మాంతర్యామియైన తన రూప మును జేరును. పిదప విజ్ఞానతత్త్వమందున్న వాణ్యంతర్గత బ్రహ్మాం తర్గత విజ్ఞానమనెడు తనరూపమును జేరును. అవల మహత్తత్త్వవాచి బ్రహ్మాంతర్యామియైన తన రూపమును జేరును. ఆ బ్రహ్మతోఁ బాటు రమాదేవియందున్న ఆనందనామకమగు తన రూపమును జేరును. అనంతరము లయకాలమందు గుణపూర్ణమైన వాసుదేవుఁడను తన రూపమందుఁ గ్రిడించుచుండును. పాఠభేదము 'శ్రోత్రేణ చోపేత్య

అవ: చెప్పిన ముక్తియందు మిగిలినది చెప్పుచున్నాఁడు-

భూత సూక్ష్మేంద్రియ సన్నికర్షాత్ = పంచభూతములతోను, శబ్దాది తన్మాత్రలతోను సూక్ష్మభూతము లనిపించికొన్న జీవరాసుల తోను ఇంద్రియములు, ఇంద్రియాభిమాని దేవతలు వీరితోను గూడు కొన్న, అనాదిః=ఆది లేనట్టి, సనాతనః=నాద మనిపించికొన్న వేదా త్మక శబ్దముతోఁ గూడిన, సః అసౌ భగవాన్=సమస్తైశ్వర్యసంపన్నుఁ డైన శ్రీహరి, వికార్యం=వివిధ కార్యములుగల, దేవమయం=దేవ ప్రధానమైన, మనోమయం=మనస్తత్త్వమందున్న ఇంద్రాంతర్యామి యైన బ్రహ్మదేవుని యంతర్యామియైన తన మానస మనిపించికొనెడు రూపమును, యాతి=చేరును. ఎవ్వఁ డనాదియైన మనోమయుఁడైన విష్ణువో అతనినిఁ జేరునని భావము. ఇట్లు రెండురీతులతోను ప్రాప్య మైన వస్తువును, బొందఁబడెడు వస్తువును విష్ణువే యని తాత్పర్యము. సంప్రాప్య=మనస్సునందున్న తన రూపమును బొంది, సః=శ్రీహరి, మతిం = ఉమాంతర్గత, బ్రహ్మాంతర్గతమైన తన రూపముతో 'మతి' యని పిలువఁబడెడు నహంకార తత్త్వమందున్న, వాణియందున్న బ్రహ్మాంతర్యామియైన తనరూపమును, యాతి. మత్యాసహ=మనస్సు నందున్న మఱియు బుద్ధియందున్న తన రూపముతో (విజ్ఞానం) యాతి. విజ్ఞానతత్త్వ మనఁబడెడు, వాణ్యంతర్గత బ్రహ్మాంతర్యామి, విజ్ఞానమగు తన రూపమును బొందును. ఇచట శ్రీధర, విజయధ్వ జుల మూలశ్లోకములే వేఱుగా నున్నవి.

స భూత సూక్ష్మేంద్రియ సన్నికర్షం మనోమయం దేవమయం వికార్యమ్,
సంసాద్యగత్యా సహ తేన యాతి విజ్ఞానతత్త్వం గుణసన్నిరోధమ్.

— శ్రీధరులు

స భూత సూక్ష్మేంద్రియ సన్నికర్షాత్ సనాతనోఽసౌ భగవాననాదిః,
మనోమయం దేవమయం వికార్యం సంపాద్య మత్యాసహ తేన యాతి.

— విజయధ్వజాలు

33

తేన ఆత్మనా = విజ్ఞానతత్త్వమందున్న శ్రీహరితోఁ గూడి, గుణసన్నిరోధం = సత్త్వము మొదలైన ప్రాకృతగుణములు లేని, విజ్ఞానతత్త్వం=సర్వమునకును మూలకారణ మనిపించికొనెడు మహత్తత్త్వమని పిలువఁబడెడు, బ్రహ్మదేవుని యంతర్యామియైన విజ్ఞాన మనెడు తన రూపమును, యాతి. ఇట్లు, సర్వాంతర్యామి రూపములతోఁ బాటు నైక్యమును బొందిన మహత్తత్త్వాంతర్యామియైన విజ్ఞాననామక శ్రీహరి, తేన ఆత్మనా=ఆ బ్రహ్మదేవునితో, శాంతిం చిత్ప్రకృతి యనిపించికొన్న రమాదేవి యందున్న, ఆనందం = ఆనందనామకమగు తన రూపమును, యాతి. ఆనందమయః=పరిపూర్ణానంద రూపుఁడైన ఆనందనామకుఁడైన శ్రీహరి, అవసానే = లక్ష్మీదేవితో ననుజ్ఞ వడసిన బ్రహ్మదేవునితోఁ బాటు ప్రళయకాలమందు, సర్వాత్మకే = సర్వాంతర్యామియై, బ్రహ్మణి = గుణపూర్ణుఁ డనిపించికొన్న, వాసుదేవే=వాసుదేవుఁ డనెడు తన రూపమందు, విహరతి = క్రీడించును. జీవసమూహము తన యోగ్యతకుఁ దగినట్లు పూర్ణతను సంపాదించికొన్న బ్రహ్మ యని పిలువఁబడెడు, తమ మూలరూపములందు విహరించును. ఇదే దేవతల ముక్తి యని భావము. వాసుదేవే అని చెప్పుటతో నిట్లు తమ బింబముల ద్వారా శ్రీహరిని బ్రవేశించినవారు మఱల సృష్టికి రారని యర్థము.

తాత్పర్యము: జీవులు దమ తమ యోగ్యతకుఁ దగినట్లు పూర్ణతనంది స్వరూపానంద మనుభవింతురు. ఇట్లు దమ బింబముల ద్వారా హరిని ప్రవేశించినవారు మఱల సృష్టికి వచ్చుటలేదు. దీనికే

శించి తాను సముద్రముకన్న వేఱుగనే యుండి మఱల మేఘముల మూలమున భూమికి వచ్చును. అనఁగా సముద్రమందుఁ బ్రవేశమే గాని సముద్రమే యగుట లేదు. అట్లే సాయుజ్యమందు; దేవుని యందుఁ బ్రవేశమేగాని దేవుఁడే యగుటలేదు. ఈ శ్లోకము విజయ ధ్వజములో నిట్లున్నది-

విజ్ఞానతత్త్వం గుణవన్నిరోధం తేనాత్మనాత్మాన ముపైతి శాంతిమ్,
ఆనంద మానందమయోఽవసానే సర్వాత్మకే బ్రహ్మణి వాసుదేవే.

శ్రీధరుల పాఠ మీక్రిందిది-

తేనాత్మనాత్మాన ముపైతి శాంత మానంద మానందమయోఽవసానే,
ఏతాంగతిం భాగవతీం గతో యః స వై పునర్నేహ విషజ్జతేఽంగ.

౬4

యః - ఏ, భాగవతః - భగవద్భక్తుల సమూహము, దేవుని యందు, ఏతాంగతిం-సాయుజ్యమనెడు నీ ముక్తిని, గతః-పొంది నదో, సః-బ్రహ్మదేవుఁడు మొదలైన యా జీవసమూహము, పునః= మఱల, ఇహ=సంసారమందు, న విషజ్జతే-ఆసక్తమగుట లేదు, వై= ఆనందమనెడు పరబ్రహ్మమందలి యేకీభావము సముద్రమందుఁ బ్రవే శించిన నదుల యేకీభావము వలెనని తెలియవలెను. ఇక్కడికన్న నక్కడ నానందము హెచ్చుగా నున్నచో సంసారమునకు మరలిరా రనుట యుక్త మగును. అట్టిస్థితి లేనిచో సాయుజ్యముక్తి కేవల ప్రయాసయే గదా! అన్నచో 'వాసుదేవాశ్రితా దేవాః బ్రహ్మాద్యా యుక్త బంధనాః' అనెడు ప్రమాణము లా శంకను బరిహరించును. ఈ విషయము నుపసంహరించుచున్నాఁడు. పురా బ్రహ్మణా ఆరాధితః పృష్టః భగవాన్ వాసుదేవః - ఏ యే మార్గములను, గీతే-చెప్పెనో, నృప! యేతే-ఇవి, వేదగీతే-వేదప్రోక్తములైన, సనాతనే చ-నిత్య ములైనవి, త్వయా అభిపృష్టే న్మృతీతే (మయాకథితే) అథ-అనుటతో

'అథయేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే తేర్చిష మభి సంభవంతి' మొదలైన వేదములను సూచించియున్నారు. 35

అవ: అందుచే మోక్షమందుఁ గోరికగలవారు భాగవతమునే యభ్యసింపవలెనని చెప్పుచున్నాఁడు-

ఇహ సంసృతౌ అతః=ఈ భాగవతమున కంటెను, అన్యః= వేఱైన, విశ్రుతః-ప్రసిద్ధమైన, శివః-మంగళకరమైన, పంథాః- మార్గము, నాస్తి=లేదు, సజ్జనులపై నున్న యనుగ్రహముచేతనే భగ వంతుఁడు భాగవతము నుపదేశించెను. మఱి యొక్క కారణమును గూడఁ జెప్పుచున్నాఁడు యతః-ఏ యీ భాగవత గ్రంథాభ్యాస ముతో, భగవతి వాసుదేవే భక్తి యోగః భవేత్ 36

అవ: ఆప్త వాక్యము ప్రమాణము. అందువలన శ్రీహరి చెప్పి నది ప్రమాణ మనుచున్నాఁడు-

భగవాన్=వేదవ్యాసులు, బ్రహ్మ=వేదమును, కార్త్స్న్యేన త్రిః మనీషయా అన్వీక్ష్య యతః-ఏ గ్రంథము నభ్యసించుటతో, కూటస్థే= నిర్వికారుఁడైన, ఆత్మని=శ్రీహరియందు, రతిః భవేత్. తత్-అంతటి భాగవతపురాణము, అపశ్యత్-రచించిరి. 'హి' నిత్యజ్ఞానేన సిద్ధస్య పునః పునర వేక్షతే-ఎప్పుడును జ్ఞానముతో సిద్ధుఁడైనను మఱల మఱల నాలోచించును. 37

అవ: ఉత్తమాధికారులకు వేదము మొదలైనవానిచేత శ్రీహరి యస్తిత్వము దెలియవచ్చినను ఇతరుల కాతని యస్తిత్వము దెలియు టెట్లు? దానికిఁ జెప్పుచున్నాఁడు. లేక పైనిఁ జెప్పఁబోవు కారణము చేతఁ గూడ భాగవతమే మోక్షకారణ మగుటచేత దీనినే శ్రవణాదులతో నభ్యసింపవలెనని చెప్పుచున్నాఁడు-

ద్రష్టా-సాక్షియైన, భగవాన్-శ్రీహరి, అనుమాపకైః-నిశ్చయ జ్ఞానమును గల్గఁ జేసెడు, దృశ్యైః-శ్రీహరియే స్వతంత్రుఁడు, బ్రహ్మాది

జీవరాసులు అస్వతంత్రులు అనెడు ప్రమాణములచేత వ్యాప్తిజ్ఞానమును బొందిన, బుద్ధ్యాదిభిః=బుద్ధి మొదలైన, లక్షణైః=చిహ్నములచేత, సర్వభూతేషు= సమస్తభూతములందును, నియామకుఁడై (స్థితః=ఉండును) అని, ఆత్మనా=జీవునిచేత, నీ పురాణమందు, లక్షితః=తెలియఁ జేయఁబడును. ఇట్లు శ్రీహరి గలఁడని స్థిరమైన తర్వాత అతఁడు చెప్పుటచే వేదమూలకముగా నాప్తిమూలకముగా సిద్ధించుటచేత నీ భాగవతము అవశ్య మభ్యసనీయమని సిద్ధమైనది. 'చ' అనునది అవధారణార్థకమం దున్నది. 'దీనినిఁ దెలియుదును' 'దీనినిఁ దెలియలేను' అనుటలో బుద్ధి మొదలైనవి పరాధీనములుగా దృశ్యములగుచున్నవి. కనుక నియామకుఁడు మఱియొకఁడు గలఁడను టందఱికి ననుభవసిద్ధము. ఆ నియామకుఁడు శ్రీహరియే దప్ప వే ఱొక్కఁడు లేఁడు. 'సమాధా వసమాధౌ చ నిస్స్వాతన్త్ర్యం దేహినః' చిత్తైకాగ్రత యందును, చిత్తవిక్షేపమందును దేహి యస్వతంత్రుఁడు అనెడు ప్రమాణము లున్నవి. 38

శ్రీ పోతన్న గారు :

బహువర్షంబులు బ్రహ్మతొల్లి జగముత్పాదింప విన్నాణిగా
క హరిప్రార్థనధారణా వశమునంగాదేః యమోఘోల్లస
న్మహనీయోజ్జ్వలబుద్ధియై భువననిర్మాణప్రభావంబుతో
విహరించెన్ నరనాథః జంతునివహావిర్భావనిర్ణేతయై.

వచ: విను. మూఢుండు శబ్దమయ వేదమార్గంబైన కర్మఫలబోధన ప్రకారంబున వ్యర్థంబులైన స్వర్గాది నానాలోకసుఖముల నిచ్ఛగించుచు మాయామయమార్గ వాసనామూలంబు సుఖంబని తలంచి నిద్రించువాఁడు గలలు గను తెఱంగునం బరిభ్రమించుచు, నిరవద్యసుఖలాభంబుఁ జెందఁడు. తన్నిమిత్తంబున విద్వాంసుఁడు నామమాత్రసారంబులగు భోగ్యంబులలోన నెంతట దేహనిర్వాహణంబు సిద్ధించు నంతియ గైకొనుచు నప్రమత్తుండై సంసారంబు

సుఖంబని నిశ్చయింపక యొండుమార్గంబున సిద్ధిగలదని చూచి పరిశ్రమంబు నొందకుండు.

కమనీయ భూమిభాగములు లేకున్నవే?
పడియుండుటకు దూదిపఱుపు లేల?
సహజంబులగు కరాంజలులు లేకున్నవే
భోజనభాజనపుంజ మేల?
వల్కలాజిన కుశావళులు లేకున్నవే?
కట్టదుకూలసంఘంబు లేల?
కొనకొని వసియింప గుహలు లేకున్నవే?
ప్రాసాదసౌధాదిపటల మేల?

ఫలరసాదులు గురియవే? పాదపములు
స్వాదుజలముల నుండవే? సకలనదులు
పొసఁగ భిక్షము పెట్టరే పుణ్యసతులు
ధనమదాంధుల కొలువేల? తాపసులకు.

రక్షకులు లేనివారల
రక్షించెద ననుచుఁ జక్రి రాజై యుండన్
రక్షింపు మనుచు నొక నరు
నక్షముఁ బ్రార్థింపనేల? యాత్మజ్ఞులకున్.

వచ: అని యిట్లు స్వతస్సిద్ధుండును నాత్మయుఁ బ్రియుండును నిత్యుండును సత్యుండును భగవంతుండును నైన వాసుదేవుని భజియించి తదీయ సేవానందానుభవంబున సంసారహేతువగు నవిద్యవలన బుద్ధిమంతుండు విడువంబడుం గావున-

హరిఁ జింతింపక మత్తుఁడై విషయచింతాయత్తుఁడై చిక్క, వా
సరముల్ ద్రోసెడువాఁడు కింకరగదాసంతాడితోరస్కుఁడై
ధరణీశోత్తమ! దండభృన్నివసనద్వారోపకంఠోగ్ర వై
తరణీవహ్నిశిఖాపరంపరలనే దగ్ధుండు గాకుండునే?

మొత్తుదురు గదల; మంటల
కెత్తుదు; రద్దంబు దేహ మింతంతలుగా
నొత్తుదు రసిపత్త్రకలను;
హత్తుదురు కృతాంతభటులు హరివిరహితులన్.

వచ: మఱియు హరి చరణకమలగంధ రసాస్వాదనం బెఱుంగనివారలు నిజకర్మబంధంబుల దండధరమందిరద్వారదేహళీ సమీప జాజ్వల్యమాన వైతరణీతరంగిణీ దహనదారుణజ్వాలాజాల దందహ్యమాన దేహులం గూడి శిఖిశిఖావగాహంబుల నొందుచుందురు. మఱియు విజ్ఞానసంపన్నులై మను ప్రపన్ను లెంతేని మాయాపన్నులుగాక విన్నాణంబునం దమ తమ హృదయాంతరాళంబులం బ్రాదేశమాత్ర దివ్యదేహుండును, దిగిభరాజ శుండాదండ సంకాశ దీర్ఘ చతుర్బాహుండును, భోగైశ్వర్యప్రదుండును, కంజాత శంఖచక్ర గదాధరుండును, గంధర్వకోటిసమాన సుందరుండును, ధృతమందరుండును, రాకావిరాజమాన రాజమండల సన్నిభ వదనుండును, సౌభాగ్యసదనుండును, ప్రభాతకాల భాసమాన భాస్కరబింబ ప్రతిమాన విరాజిత పద్మరాగరత్నరాజీ విరాజమాన కిరీటకుండలుండును, శ్రీవత్సలక్షణలక్షిత వక్షోమండలుండును, రమణీయకౌస్తుభరత్నఖచిత కంఠికాలంకృత కంధరుండును, నిరంతర పరిమళమిళిత వనమాలికా బంధురుండును, నానావిధ గంభీర హార కేయూర కటక కంకణ మేఖలాంగుళీయక విభూషణ వ్రాత సముజ్జ్వలుండును, నిటలతట విలంబమాన విమలస్నిగ్ధనీలకుంచిత కుండలుండును, దరుణచంద్ర చంద్రికా ధవళమందహాసుండును, బరిపూర్ణకరుణావలోకన భ్రూభంగ సంసూచిత సుభగ సంతతానుగ్రహ లీలావిలాసుండును, మహాయోగి రాజవిలసిత హృదయకమలకర్ణికామధ్య సంస్థాపితవిలసిత చరణకిసలయుండును, సంతతానందమయుండును, సహస్రకోటిసూర్యసంఘాత సన్నిభుండును, విభుండునునైన పరమేశ్వరుని మనోధారణావశంబున నిలిపికొని తదీయ గుల్ఫచరణజాను జంఘూద్వయవంబులం గ్రమం

బున నొక్కొక్కటిని బ్రతిక్షణంబును ధ్యానంబు సేయుచు నంతకాలం
బునకుఁ బరిపూర్ణ నిశ్చల భక్తియోగంబు సిద్ధించు నంతకాలంబునుం
దదీయ చింతాతత్పరులై యుండుదురని మఱియు నిట్లనియె-

అసన్నమరణార్థియైన యతికుండు
గాలదేశములను గాచికొనఁడు
తనువు విసర్జించు తలఁపు జనించిన
భద్రాసనస్థుఁడై ప్రాణపవను
మనసుచేత జయించి మానసవేగంబు
బుద్ధిచే భంగించి బుద్ధిఁదెచ్చి
క్షేత్రజ్ఞుతోఁ గూర్చి క్షేత్రజ్ఞు నాత్మలో
పలఁ జేర్చి యాత్మను బ్రహ్మమందు

గలిపి యొక్కటిఁ గావించి గారవమున
శాంతితోడ నిరూఢుఁడై సకలకార్య
నివహ మెల్లను దిగనాడి నిత్యసుఖము
వలయునని చూచు నటమీఁద వసుమతీశ!

వచ: వినుము పరమాత్మయైన బ్రహ్మమునకుఁదక్క కాల
దేవ సత్త్వ రజ స్తమోగుణా హంకార మహత్తత్త్వ ప్రధానంబులకు
సామర్థ్యంబు లేదు. కావునఁ బరమాత్మవ్యతిరిక్తంబు లేదు. దేహా
దులం దాత్మత్వంబు విసర్జించి యన్యసౌహార్దంబుమాని పూజ్యంబైన
హరి పదంబును(బ్రతిక్షణంబును) హృదయంబున నాలింగనంబుసేసి
వైష్ణవంబయిన పరమపదంబు (సర్వోత్తమంబని) సత్పురుషులు దెలి
యుదురు. ఇవ్విధంబున విజ్ఞానదృగ్వీర్యజ్వలనంబున నిర్దగ్ధవిషయ
వాసనుండై క్రమంబున నిరపేక్షత్వంబున-

అంఘ్రిమూలమున మూలాధారచక్రంబుఁ
బీడించి ప్రాణంబు బిగియఁబట్టి
నాభితలముఁ జేర్చి నయముతో మెల్లన
హృత్సరోజముమీఁది కెగయఁబట్టి

యటమీఁద మరమందు హత్తించి క్రమ్మఱఁ
దాలుమూలమునకుఁ దఱిమి ఏలిపి
మమతతో భ్రూయుగ మధ్యంబుఁ జేర్చి దృ
క్కర్ణనాసాస్యమార్గములు మూసి

యిచ్చలేని యోగి యెలమి ముహూర్తార్ధ
మింద్రియానుషంగ మింత లేక
ప్రాణములను వంచి బ్రహ్మరంధ్రము చించి
బ్రహ్మమందుఁ గలయుఁ బౌరవేంద్ర!

వచ: మఱియు దేహత్యాగకాలంబున నింద్రియంబులతోడి సంగంబులు విడువనివాఁడు వానితోడన (గుణసముదాయ రూపం బగు) బ్రహ్మాండంబునందు ఖేచరసిద్ధవిహారయోగ్యంబు నణిమాది సకలైశ్వర్యసమేతంబునైన పరమేష్ఠిపదంబుఁజేరు. విద్యాతపోయోగసమాధి భజనంబుసేయుచుఁ బవనాంతర్గత లింగశరీరులైన యోగీశ్వరులకు బ్రహ్మాండబహిరంతరాళంబులు గతియని చెప్పుదురు. ఏరికిని గర్మంబుల నట్టిగతిఁ బొందఁ శక్యంబు గాదు. యోగియగు వాఁడు బ్రహ్మలోకంబునకు నాకాశపథంబునంబోవుచు సుషుమ్నానాడి వెంట నగ్నియను దేవతఁజేరి జ్యోతిర్మయంబైన తేజంబున నిర్మలుండై యెందునుం దగులుపడక తారామండలంబు మీఁద సూర్యాదిధ్రువాంత పదంబులఁ గ్రమక్రమంబున నతిక్రమించి హరిసంబంధంబైన శింశుమారచక్రంబుఁజేరి (యొంటరి యగుచు) పరమాణుభూతంబైన లింగశరీరంబుతోడ బ్రహ్మవిదులకు నెలవైన మహర్లోకంబుఁ జొచ్చి మహాకల్పకాలంబు క్రీడించుచుఁ గల్పాంతంబున ననంతముఖానల జ్వాలాజాల దందహ్యమానం బగు లోకత్రయంబు నీక్షించుచుఁ దన్నిమిత్త సంజాతదాహతాపంబు నసహింపం జాలక-

ఇలమీఁద మనువు లిరేడ్వురుఁ జనువేళ
దివసమై యెచ్చోటఁ దిరుగుచుండు
మహనీయసిద్ధవిమానసంఘము లెందు
దినకరప్రభములై తేజరిల్లు

శోక జరామృత్యుశోషణ భయదుఃఖ
నివహంబు లెందు జనింపకుండు
విష్ణుపదధ్యాన విజ్ఞానరహితుల
శోకంబు లెందుండి చూడవచ్చు
పరమసిద్ధయోగి భాషణామృత మెందు
శ్రవణపర్వ మగుచు జరుగుచుండు
నట్టి బ్రహ్మలోకమందు వసించును
రాజవర్య! మఱల రాఁడు వాఁడు.

వచ: మఱియు నొక్క విశేషంబు గలదు. పుణ్యాతిరేకంబున బ్రహ్మలోక గతులైనవారు కల్పాంతరంబునం బుణ్యతారతమ్యంబుల నధికారవిశేషంబు నొందువార లగుదురు. బ్రహ్మాదిదేవతాభజనంబునం జనువారు (బ్రహ్మజీవితకాలంబుదనుక) బ్రహ్మలోకంబున వసియించి (ముక్తు లగుదురు) నారాయణ చరణ కమల భక్తిపరాయణత్వంబునఁ జనినవారు నిజేచ్ఛావశంబున నిరర్గళగమనులై బ్రహ్మాండంబు భేదించి మహోన్నతవైష్ణవపదారూఢులై తేజరిల్లుదురు. ఈశ్వరాధిష్ఠితంబైన ప్రకృతియంశంబున మహత్తత్త్వ మగు. మహత్తత్త్వాంశంబున నహంకారం బగు. అహంకారాంశంబున శబ్దతన్మాత్రం బగు. శబ్ద తన్మాత్రాంశంబున గగన మగు. గగనాంశంబున స్పర్శతన్మాత్రం బగు. స్పర్శతన్మాత్రంబున సమీరణం బగు. సమీరణాంశంబున రూపతన్మాత్రం బగు. రూపతన్మాత్రాంశంబు వలనఁ దేజం బగు. తేజోంశంబున రసతన్మాత్రం బగు. రసతన్మాత్రాంశంబువలన జలం బగు. జలాంశంబున గంధతన్మాత్రం బగు. గంధతన్మాత్రాంశంబునఁ బృథివి యగు. వాని మేళనమునం జతుర్దశభువనాత్మకంబైన విరా ద్రూపం బగు. ఆ రూపమునకుఁ గోటియోజన విశాలంబైన యండ కటాహంబు ప్రథమావరణంబైన పృథ్వి యగు. దీనిఁ బంచాశత్కోటి విశాలంబని కొందఱు పలుకుదురు. అయ్యావరణంబుమీఁద సలిల

తేజ స్సమీర గగనాహంకార మహత్తత్త్వంబు లనియెడి యావరణం
బులు క్రమంబున నొండొంటికి దశగుణోత్తరాధికంబులై యుండు.
అట్టి యేడింటిమీఁద బ్రకృత్యావరణంబు మహావ్యాపకంబగు బ్రహ్మాం
డంబు భేదించి వైష్ణవపదారోహణంబు సేయువాఁడు నిర్భయుండై
మెల్లనఁ(లింగదేహంబున) బృథివ్యాత్మకత్వంబు నొంది యట్టి పృథి
వ్యాప్తకత్వంబున ఘ్రాణంబునం గంధంబును, జలాత్మకత్వంబున రస
నేంద్రియంబున రసంబును, తేజోరూపకత్వంబున దర్శనంబున రూపం
బును, సమీరణాత్మకత్వంబున దేహంబున స్పర్శనంబును, గగనాత్మ
కత్వంబున శ్రవణంబున శబ్దంబును నతిక్రమించి,భూతసూక్ష్మేంద్రియ
లయస్థానంబైన యహంకారావరణ సంప్రాప్తుండై యందు మనో
మయంబును దేవమయంబును నైన సాత్త్వికాహంకార గమనంబున
మహత్తత్త్వంబు సొచ్చి గుణత్రయంబును లయించిన ప్రధానంబును
నొంది ప్రధానాత్మకత్వంబున దేహంబు నుపాధిపరంపరావసానంబు
నం బ్రకృతింబాసి యానందమయుండై యానందంబునం బరమాత్మ
రూపంబైన వాసుదేవబ్రహ్మమందుఁ గలియునని చెప్పి వెండియు నిట్ల
నియె-

పరమభాగవతులు పాటించు పథమిది
యా పథమున యోగి యరిగెనేని,
మగుడి రాఁడు వాఁడు మఱి సంశయము లేదు
కల్పశతములైన కౌరవేంద్ర!

వచ: వినుము. నీ వడిగిన సద్యోముక్తియుఁ గ్రమముక్తియు
ననియెడు నీ రెండుమార్గంబులు వేదగీతంబులందు వివరింపంబడియె.
పినిం దొల్లి భగవంతుండైన వాసుదేవుండు బ్రహ్మచేత నారాధితుండై
చెప్పె సంసారప్రవిష్టుండైన వానికిఁ దపో యోగాదులైన మోక్ష
మార్గంబులు పెక్కు గలవు. అందు భక్తిమార్గంబుకంటె సులభంబు
లేదు-

విను మంభోజభవుండు మున్ను మదిలో వేదంబు మున్నాఱు మ
ర్మనయజ్ఞత్వము దోఁప నంతయుఁ బరామర్శించి మోక్షంబు ద
క్కిన మార్గంబులవెంట లేదమచు భక్తిం జింత జేసెన్ జనా
ర్దను నాత్మాకృతి నిర్వికారుఁ డగుచున్ దన్మార్గనిర్దేశమై.

అఖిలభూతములందు నాత్మరూపంబున
 వీఁకుండు హరియుండు నెల్లప్రొద్దు
బుద్ధ్యాది లక్షణంబులఁ గానఁబడును మ
 హా సేవనీయుఁ డహర్నిశంబు
వందనీయుఁడు భక్తవాత్సల్యసంతత
 నియతుఁడై సతతంబు నియతబుద్ధి
నాత్మరూపకుఁడగు హరికథామృతములు
 గర్ణపుటంబులఁ గొంకుదీరఁ

గ్రోలుచుండెడి ధన్యులు గుటిల బహుళ
విషయ మలినీకృతాంగముల్ వేగ విడిచి
విష్ణుదేవుని చరణారవిందయుగము
కడకుఁ జనుదురు సిద్ధంబు కౌరవేంద్ర!

అర్థములు: తొల్లి=ప్రళయమునకుఁ దర్వాత, బ్రహ్మ, బహు వర్షంబులు=అనేక సంవత్సరములు, యత్నించి, జగముత్పాదింపఁ= ప్రపంచమును సృష్టించుటకు, విన్నాణిగాక=నేర్పరిగాక, హరిప్రార్థన ధారణా వశమునఁ=శ్రీహరి ధ్యాన ధారణములచేత, అమోఘ= వ్యర్థముగాక, ఉల్లసత్=ప్రకాశించుచున్న, మహనీయ=గొప్పదైన, ఉజ్జ్వలబుద్ధియై=ప్రకాశించుచున్న బుద్ధిగలవాఁడై, భువననిర్మాణ ప్రభావంబుతోన్=ప్రపంచమును నిర్మించెడు శక్తిచేత, జంతునివహ= జంతుసమూహముల యొక్క, నిర్ణేతయై=నిర్ణాయకుఁడై, విహరించెన =సృష్టికార్యము నొనర్చెను.

తాత్పర్యము: ప్రళయము తర్వాత బ్రహ్మదేవుఁడు సృష్టి కుపక్రమించినాఁడు. కాని ప్రళయమునందుఁ దా నింతకుముందు సృష్టించిన ప్రపంచవిధానస్మృతి మఱచిపోయినాఁడు. అప్పుడు తీవ్రమైన ధారణతో భగవంతు నాతఁడు ప్రార్థించెను. శ్రీమన్నారాయణుని యనుగ్రహముతో నష్టమైపోయిన స్మృతి మఱల ప్రతిభాసించినది. నానాజంతునివహ మేది యెట్లుండవలెనో మనస్సున భాసించినది. అతని కమోఘదృష్టి సిద్ధించెను. నిశ్చయాత్మకదృష్టి యేర్పడినది. పూర్వసర్గ మెట్లుండెనో తద్విధముగనే సృష్టి యొనర్చినాఁడు. 'ధాతా యథాపూర్వ మకల్పయత్' అని శ్రుతి.

మూఢుండు_సరియైన జ్ఞానము లేనివాఁడు, శబ్దమయ_శబ్దస్వరూపమైన, వేదమార్గ_వేదముయొక్క పద్ధతియైన, కర్మఫలబోధన ప్రకారమునన్ = కర్మములకు ఫలములను బోధించెడు పద్ధతిచేత, వ్యర్థంబులైన_అర్థశూన్యములైనట్టి, స్వర్గాదినానాలోక సుఖంబులన్ = స్వర్గము మొదలైన నానాలోకములం దేర్పడెడు సుఖములను, ఇచ్ఛగించుచున్_కోరుచు, మాయామయ మార్గవాసనామూలంబు = మాయాస్వరూపమైన మాయాసుఖముల ననుభవింపవలె ననెడు దుష్టవాసనలే సుఖ మని తలఁచినవాఁడై, తెఱంగునన్ _ పద్ధతితో పరిభ్రమించుచున్ = పైకిని క్రిందికిని దిరుగుచుండును. నిరవద్యసుఖలాభంబునన్_అత్యంతికమైన ముక్తిని, చెందఁడు. తత్ + నిమిత్తంబునన్ _ ఆ కారణముచేత, విద్వాంసుండు _ యథార్థజ్ఞానము గలిగినవాఁడు, నామమాత్రసారంబులగు భోగ్యంబుల లోనన్ _ కేవలము పేరుతో మాత్రమే భోగ్యములైన పదార్థములయందు, ఎంతటున్ = ఎంతమాత్రముతో, దేహనిర్వాహణంబు=దేహ ధారణము, సిద్ధించున్=

పోతన్న శ్రీధరుని వ్యాఖ్యానము నెంతగా ననుసరించునో తెలుపుట కీ క్రింది దృష్టాంతములను జూపుచున్నాను. 'పంథాః'- 'కర్మఫలబోధన ప్రకారః', 'సర్గాది నామభిర్ధ్యాయతి తత్త దిచ్ఛాం కరోతి', 'మాయా మయే పథి సుఖమితి మన్యమానః', 'స్వప్నాన్ పశ్యన్నివ పరిభ్రమన్ అర్థాన్నవిందతి', 'తత్త ల్లోకం ప్రాప్తోపి నిరవద్యం నలభత ఇత్యర్థః', 'నామమాత్రేషు-నామమాత్ర సారేషు భోగ్యేషు', 'అప్రమత్తః-తావన్మాత్రే ప్యసక్తః', 'వ్యవసాయబుద్ధిః' ='నేదం సుఖమితి నిశ్చయవాన్'-

తాత్పర్యము: వేదములు కర్మఫలములను బోధించును. 'ఈ పని చేసిన నీ ఫల మేర్పడును' అని కర్మలయం దాశను బ్రేరేఁచి, పుష్పితములైన వాక్యములతోఁ గర్మములను వర్ణించును. అందుకే గీతలో-

**యామిమాం పుష్పితాం వాచం ప్రవదం త్యవిపశ్చితః,**
**వేదవాదరతాః పార్థః నాన్యద స్తీతి వాదినః.**

అని భగవానుఁ డన్నాఁడు. ఆ వర్ణనములచేత నాకర్షింపఁబడిన మనుష్యుఁడు గర్మములయందుఁ బ్రవేశించును. వానితోసిద్ధించు స్వర్గాదులు కాని యవి సిద్ధమైనవిగావు. 'క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి' అనెడు గీతావచనప్రకారము మఱల మర్త్యలోకమునకు వచ్చి సంసారములో మునుఁగును. సమస్తదేవతలకును మన్వంతరకాల మాయుస్సు. అటు పైని వారు గ్రిందికి రావలసినదే. మాయచే నాకర్షింపఁబడిన మనుష్యుఁడు స్వర్గాది లోకసుఖములు గొప్పవని తలఁచి వానికై యజ్ఞాడుచుఁ బరిభ్రమించుచుండును. వాసనలచేఁ బ్రేరేపింపఁబడిన మానవుని ప్రవర్తన నిద్రించువారు గలుగన్నట్లే యుండును. క్రిందను

స్వర్గాదులందును వాఁడనుభవించు సుఖములు నామమాత్రసారములు. అందుచే వాఁడు వానిచే నాకర్షింపఁబడరాదు, ఈ లోకమందు జీవించునప్పుడు లౌకికములైన సుఖములు శాశ్వతములు గావనియు నిరవద్యములు గావనియుఁ వాఁ డెప్పుడును దలఁచుచుండవలెను. తన దేహపోషణమున కెంతమాత్రము అవసరమో యంతమాత్రమే గ్రహించుచుండవలెను. తన ప్రయత్నములేకయే యవి సిద్ధించినపుడు ఇఁక వానికై ప్రయత్నము వ్యర్థపరిశ్రమమని తెలియవలెను. సుఖసిద్ధి ఈ మార్గమునఁ గాదు. ఇందుకు భిన్నమైన మార్గమున నను విషయము వాఁ డెప్పుడును మఱచిపోరాదు.

కమనీయ=అందమైన, భూమిభాగములు = భూప్రదేశములు, పడియుండుటకున్=నిద్రించుటకు, దూదిపఱుపులు ఏల?, సహజంబులగు కరాంజలులు=శరీరముతోఁ బుట్టిన యంజలిబంధము, భోజన భాజన పుంజము = భోజనపాత్రలసమూహము, వల్కల=నారవస్త్రములు, ఆశా=దిక్కులు, కుశావళులు=దర్భలుమొదలైనవి, కట్టన్=ధరించుటకు, దుకూలసంఘాతము = వస్త్రముల గుంపు, కొనకొని వసియింపన్- కొనకొని=ప్రయత్నించి, ప్రాసాదసౌధాదిపటలము=ప్రాసాదములు, సౌధములు వానిగుంపు, ఏల ? పాదపములు, ఫలరసాదులు కురియవే = ఫలములు వానికి సంబంధించిన రసములును ఈయవా? స్వాదుజలములన్=రుచికరమైన నీటిచేత, పుణ్యసతులు=పుణ్యాంగనలు భిక్షంబు వెట్టరే?, తాపసులకున్=తప స్సొనర్చికొనెడి వారికి, ధనమదాంధులకొలువు = ధనముచే నేర్పడిన మదముతోఁ గ్రుడ్డివారైన జనులసేవ, ఏల ? మూలములోని రెండు శ్లోకములకుఁ గలిపి యొకే సీసమును వ్రాయుచున్నాఁ డమాత్యుఁడు-

తాత్పర్యము: సుందరములైన భూభాగము లున్నవి కదా! మఱిపండుకొనుటకు దూదిపఱుపులేల? దేహముతోఁబాటు జన్మించిన చేతులు వానితోఁ దయారగు దోసిళ్ళు గలవు గదా! మఱి భుజించుటకు వివిధములైన పాత్ర లెందుకు? వల్కలములు దిక్కులు దర్భలు

ఉన్నవి గదా! కట్టుకొనుటకు వెలగల వస్త్రము లేల? నిద్రించుటకు గుహ లున్నవి. ప్రాసాదములు, సౌధములు ఎందుకు? ఇతరులను బోషింపఁ గంకణముగట్టికొన్న తరువులు తమఫలములను వానిరసము నిచ్చుచున్నవిగదా! ఏ ప్రవాహములో, జూచినను రుచికరములైన జలములు సిద్ధముగనే యుండును. పుణ్యసతులు భిక్షము పెట్టెదరు. ధనముతో మదించిన వారి కొలువేల?

ఇచ్చట 'నిద్రించుటకు' అనుటకు బదులు 'పడియుండుటకు' అన్నాఁడు. అనఁగా భోగ్యములందాతని కెంత యసహ్యమో దీనితో వ్యక్తమగుచున్నది. 'సహజము' సందర్భశుద్ధిగల పదము. తనతోడఁ బుట్టునే పుట్టినది యని యర్థము. బాహౌ స్వసిద్ధేహ్యుపబర్హణైః కిం? అని మూలము. బాహువు స్వతస్సిద్ధముగానుండఁగా దిండులతో నేమి పని యని యర్థము. పోతన్నదీనిని తడవనే లేదు. వల్కలాజిన కుశావళులు 'చీరాణి కిం పథి నసంతి' అని మూలము. కనుక సంద ర్భమును బట్టి యిక్కడ వల్కలములకు గుడ్డపేలిక లని యర్థముఁ జెప్పికొనుటయే బాగు. 'ఆశా' అనఁగా దిక్కు. 'దిగ్వల్కలాదౌ' అని మూలము. 'దిశంతి భిక్షాం నోవాంఘ్రిపాః' అని మూలము. 'అంఘ్రిపాః' అనుటకు పాదపశబ్దము సరియైనది. ఇక్కడ మూల ములో నొకచాతుర్య మున్నది. 'పరభృతః' అను శబ్దము మధ్యమణి న్యాయముగా నున్నది.

**చీరాణి కిం పథి న సంతి దిశంతి భిక్షామ్,**
**నోవాంఘ్రిపాః పరభృతః సరితో వ్యశుష్యన్.**

ఈ పరభృతశబ్దమును లింగభేదముతో నదులకుఁ గూడ నన్వయింప వచ్చును. ప్రవాహములు తమ నీటిని దాము త్రాగుట లేదు గదా! అట్లే, చెట్లెప్పుడును పరభృతములే. 'పొసఁగ భిక్షముఁ బెట్టరే పుణ్య సతులు'. ఇది పోతన్నగారు క్రొత్తగాఁ దెచ్చినది. మూలమున లేనిది.

చక్రి=చక్రమును ధరించిన శ్రీమహావిష్ణువు, రాజై యుండిన = సర్వ సమర్థుఁడై యుండఁగా, ఆత్మజ్ఞునకున్=ఆత్మావబోధముగలిగిన జ్ఞానికి, రక్షింపు మనుచున్=నన్ను రక్షింపుమని, ఒక నరున్=ఒకానొక మానవుని, అక్షమున్=తన్నుఁ దానే పూర్తిగా సంరక్షించికొనలేని వానిని, ప్రార్థింపన్ ఏల=ప్రాథేయపడు టెందుకు?

తాత్పర్యము : 'కి మజితోఽవతి నోపపన్నాన్' అని మూలము. ఉపపన్నాన్=శరణాగతులను, అజితః=ఎవ్వరిచేతను జయింపఁబడని పరాక్రమముగల విష్ణువు, 'న అవతి కిం?' రక్షింపఁడా యేమి? అని భావము. ఈ భావమును పోతన్న విస్తృతీకరించుచున్నాఁడు-రక్షణ లేనివారిని దాను రక్షింతునని యభయమిచ్చి శ్రీమన్నారాయణుఁడు సర్వసమర్థుఁడై నిలిచియుండఁగాఁ దన్ను రక్షింపుమని యొకానొక మానవుని నాత్మజ్ఞుఁ డెందుకుఁ గోరవలెను? అజితః-అను శబ్దమును మనసులో నుంచికొని 'చక్రి' యను పదము వాడినాఁ డనుకొందును. మానవుఁడు తన్ను దానుఁ రక్షించికొనుటకే యశక్తుఁడు. వాఁ డితరుల నేమిరక్షించును?

స్వతస్సిద్ధుండు=ఏ ప్రయత్నము లేకయే యెప్పటినుండియో యున్నవాఁడు. ఎందువలన? ఆత్మయున్=ఆత్మస్వరూపుఁడు గనుక. సత్యః=ఉన్నవాఁ డొక్కఁడే. తక్కినవన్నియునుఁ బోవునవే. నిత్యః=త్రికాలాబాధితుఁడు నైన వాసుదేవుని, భజియించి=సేవించి, తదీయ సేవానందానుభవంబునన = అతనికి సంబంధించిన సేవచే నేర్పడెడు వానందానుభూతిచే, సంసారహేతువగు నవిద్యచేన్=సంసారమునకు హేతువైన యవిద్యచేత, మూలాజ్ఞానముచేత, బుద్ధిమంతుండు=తెలివి గలవాఁడు, విడివడుం గావున = కబళింపఁబడినవాఁడు గాకుండును. భగవంతుఁడు స్వతస్సిద్ధుఁడు. తానే రూపముతో నున్నను దనయందే

వసించువాఁడు. ఎప్పుడు? అనాదిగా. ఎందువలన? ఆత్మస్వరూపుఁడగుటచేత. వాఁడొక్కఁడే త్రికాలాబాధితుఁడు. తక్కిన వస్తువయు నశించునవే. అట్టి వాసుదేవుని భజించుచు జ్ఞానియైనవాఁడు, అతని సేవచే నేర్పడిన యానందముతో సంసారకారణమైన యవిద్యనుండి విడివడును. మూలములో 'ప్రియః' అను నొకశబ్ద మున్నది. భగవంతుఁడు సర్వప్రియుఁడు. కనుక నతనిసేవ సర్వదా సుఖస్వరూపమైనది. శ్రీధరుని ఈ వ్యాఖ్యానము మనసులో నుంచికొని 'తదియ సేవానందంబునన్' అన్నాఁడు.

మత్తుఁడై=పరలోకచింత లేనివాఁడై, విషయచింతాయత్తుఁడై= విషయచింతలకు లోఁబడినవాఁడై, చిక్కి=జ్ఞానమును బోఁగొట్టుకొని, వాసరముల్ త్రోసెడువాఁడు = దినములు గడపెడు వాఁడు, కింకర గదా=యమకింకరుల గదలచేత, సంతాడిత=ఎక్కువఁగాఁ గొట్టఁబడిన ఉరస్కుఁడై=ఎదగలవాఁడై, దండభృత్ = యమధర్మరాజుయొక్క, నివసన=నివాసస్థానమగు లోకముయొక్క,ద్వార=ద్వారముయొక్క, ఉపకంఠ=సమీపమందలి, ఉగ్రవైతరణీ=భయంకరమైన వైతరణీ నదియొక్క, వహ్నిశిఖాపరంపరలచేన్=అగ్నిజ్వాలలచేత, దగ్ధుండు కాక ఉండునే=కాల్పఁబడినవాఁడు గాకుండునా?

తాత్పర్యము : హరిధ్యానము సేయక, పరలోకచింతయే లేక, విషయచింతలకు లోఁబడి కాలము గడపెడు మూర్ఖుఁడు మరణానంతరము నరకమునకుఁ బోవును. అక్కడ యమభటులచే మిక్కుటముగా బాధింపఁబడిన యెదగలవాఁడై యమధర్మరాజు ద్వారసమీపమందలి వైతరణిలో మునిఁగి దానిలోని యగ్నిపరంపరలచే దహింపఁబడిన శరీరముగలవాఁ డగును.

దీనికి మూలశ్లోకము-

**కస్తాంత్వనాదృత్యపరానుచింతాం ఋతే పశూనసతీం నామ యుంజ్యాత్,**

ముతో ధ్వనింపఁ జేయుచున్నాఁడు. ఆనాటి సామాజికస్థితి పోతన్న నిట్లు మార్చియుండు ననుకొందును. దీనికి పైనఁ జెప్పఁబోవు కంద పద్య మాతని సొంతము. ఈ రెంటితోఁ బోతన్నకుఁ బాపభీతి యెంత యుండెనో యా భీతిలేని సమకాలికుల మనస్తత్త్వములపై నెంతటి యసహ్య ముండెనో మనకుఁ దెలియుచున్నది.

గదలన్ మొత్తుదురు. మంటలకున్ ఎత్తుదురు దేహము ఇంతింతలు గాన్=కొద్దికొద్దిగా, అసిపత్త్రికలను=అంపములచేత, ఒత్తుదురు =ఖండింతురు, హరి విరహితులన్=హరిధ్యానము సేయని వారిని, కృతాంతభటులు=యమభటులు, హత్తుదురు=గట్టిగా తాడింతురు.

తాత్పర్యము: హరి ధ్యానము సేయనివారిని యమభటులు గదలచేఁ గొట్టుదురు. మంటలఁ ద్రోయుదురు. దేహమును అంపములతోఁ గోయుదురు బిట్టు తాడింతురు. హరిభజన మొనర్పక ఎన్ని వేదములు చదివినను నింతే సమస్త వేదములకును ముఖ్యార్థము శ్రీహరియే యని తెలియనివాఁడు వేదభారమును మోసెడి గర్దభము వంటివాఁడు.

చతుర్వేదోఽపి యో విప్రో వాసుదేవం న విందతి,
వేదభారభరాక్రాంతః స వై బ్రాహ్మణగర్దభః.

హరి చరణ కమల గంధ = శ్రీమన్నారాయణమూర్తి పాద పద్మములయందలి సుగంధముయొక్క, రసాస్వాదనము=రసమును గ్రహించుట, ఎఱుఁగని = తెలియని, నిజకర్మబంధమునన్ = తానొనర్చికొన్న దుష్టకర్మముయొక్క ఫలసంసర్గముచేత, దండధర మందిర ద్వారదేహళీ సమీప = యమధర్మరాజు నింటి కడపమాను ముందట, జాజ్వల్యమాన = ఎక్కువఁగా మండుచున్న, వైతరణీ

తరంగిణీ = వైతరణీ నదియొక్క, దహన = అగ్నికి సంబంధించిన, దారుణ=భయంకరమైన, జ్వాలాజాల-శిఖలగుంపులచేత, దందహ్యా మాన - ఎక్కువఁగా దహింపఁబడుచున్న, దేహులం గూడి - దేహ ములు గలవారితోఁ బాటు, శిఖిశిఖావగాహంబులన్-అగ్నిజ్వాలలలో, మునుఁగుటలను పొందుచుందురు.

తాత్పర్యము: శ్రీమహావిష్ణువు చరణకమల సుగంధముల ననుభవింపలేనివారు తమ దుష్కర్మములచేత నరకమునఁ బ్రవేశించి వైతరణీ నదిలోఁ గూలుదురు. దాని జ్వాలలచేత నిరంతరమును దహింపఁబడుచుందురు. అది యగ్నిమయమైనది. 'జాజ్వల్యమాన' 'దందహ్యమాన' ఈ రెండు శబ్దములును యఙ్లుగంతములు. వానిపై 'శానచ్' ప్రత్యయము. దహనములోని జ్వలనములోని మహాతీవ్రత నా రెండుపదములును దెలుపుచున్నవి.

సంతాడితోరస్కులై - అనుచోట-తాడింపఁబడిన ఉరస్సుగల వాఁడై యని బహువ్రీహిసమాసము. 'ఉరః ప్రభృతిభ్యః కప్' అను సూత్రముచే నిచట క ప్రత్యయము వచ్చినది.

మఱియున్=విజ్ఞానసంపన్నులై, మను-జీవించెడి, విజ్ఞానముచేఁ గూడుకొన్న భగవంతుని శరణాగతి నందినవారు, మాయాపన్నులు గాక = మాయ యను ఆపదచేత బాధింపఁబడినవారు గాక, విన్నా ణంబునన్ = నేర్పరులై, తమతమ హృదయాంతరాళంబులన్ - తమ తమ హృదయములందు, ప్రాదేశమాత్ర దివ్యదేహుఁడు = జేనెఁడు మాత్రమేయైన దివ్యదేహముగలవాఁడు. 'ప్రాదేశః తర్జన్యంగుష్ఠయో ర్విస్తారః' అని శ్రీధరులు. ప్రాదేశ మనఁగా నాకాశాది సర్వజగత్ప్ర దేశమని విశిష్టాద్వైతవ్యాఖ్య. ఈ విచారము సంస్కృతవ్యాఖ్యలోఁ జేయుట యైనది. దిగిభరాజ = దిక్కుల కొనలయందున్న అష్టదిగ్గజ ములయొక్క, శుండాదండ-దండాకారమైన తొండములతో, సంకాశ - సమానమై, దీర్ఘ చతుర్బాహుఁడు = పొడవైన నాల్గుభుజములు గల

వాఁడు- అష్టదిగ్గజముల తొండముల వలె పొడవై లావైన నాల్గు భుజములు గలవాఁడు. 'చతుర్భుజం' అని మాత్రమే మూలము. భోగైశ్వర్యప్రదుండును = అనేకములైన భోగములను, అధికారముల నిచ్చువాఁడు. ఈ సమాన మెట్లు చోటుచేసికొన్నదో తెలియదు. దీనికి మూలములేదు. కంజాత=పద్మము, శంఖచక్రగదాధరుండు= శంఖము చక్రము గదలను ధరించినవాఁడు. కందర్పకోటి సమాన సుందరుండును = కోటి మన్మథులతో సమానమైన యందగాఁడు, రాకావిరాజమాన=పున్నమనాఁడు ప్రకాశించు, రాజమండల=చంద్ర మండలముతో, సన్నిభవదనుఁడు = సమానమైన ముఖముగలవాఁడు, 'ప్రసన్నవక్త్రః' అని మూలము. సౌభాగ్యసదనుండును = సమస్త శుభములకును నివాసస్థానమువంటివాఁడు, ప్రభాతకాలభాసమాన= ప్రాతఃకాలమునఁ బ్రకాశించుచుండెడు, భాస్కరబింబ ప్రతివిరాజిత =సూర్యమండలమునకుఁ బ్రతిగాఁ బ్రకాశించుచున్న, పద్మరాగరత్న రాజి=పద్మరాగము మొదలైన రత్నసమూహముచేత, విరాజమాన= ప్రకాశించుచున్న, కిరీటకుండలుండు = కిరీటమును, కుండలములును గలవాఁడు. 'స్ఫురన్మహారత్న కిరీటకుండలం' అని మూలము. శ్రీవత్సలక్షణ లక్షిత వక్షోమండలుండు = శ్రీవత్స మనెడు మచ్చచేఁ బ్రకాశించుచున్న వక్షఃస్థలము గలవాఁడు. దీనికి 'శ్రీలక్ష్మణం' అని మూలము. 'శ్రీః లక్ష్మీరేవ లక్ష్మ చిహ్నం' అని శ్రీధరుఁడు ఇతఁడు శ్రీవత్సమును దెచ్చికొన్నాఁడు. రమణీయ=మనోహరమైన, కౌస్తుభ రత్న=కౌస్తుభ మనెడు రత్నముచేత, ఘటిత=చెక్కఁబడిన, కంఠికా= కంఠభూషాలంకారములు గల, కంధరుఁడు = కంఠము గలవాఁడు. కంఠికయందు కౌస్తుభరత్నమును బొదిగినట్లు పోతన్న భావించి నాఁడు. మూలమున 'కౌస్తుభరత్నకంధరం' అని యున్నది. కౌస్తుభ రత్నం కంధరాయాం యస్య సః అని శ్రీధరుఁడు. నిరంతర పరిమళ మిళిత = ఎప్పుడును పరిమళముతోఁ గూడుకొను, నవమాలికాలం

పూమాలలకు వనమాల యని పేరు. 'అమ్లానలక్ష్మ్య వనమాలయా చితం' అని మూలము. నానావిధ = అనేకవిధములై గంభీరములైన హారములు, భుజకీర్తులు, పాదవలయములు, కంకణములు, మొల త్రాడులు, ఉంగరములు—వీనితోఁ గూడినవాఁడు. ఇచ్చట 'గంభీర' శబ్దము 'మహాధనైః' అనుటకు బదులుగా వాడినాఁడేమో! నిటల తటవిలంబమాన=నుదుటియందు వ్రేలాడుచున్న, విమల=నిర్మలమైన, స్నిగ్ధ=నునుపైన, నీల=నీలవర్ణముగల, కుంచిత=ఉంగరములు చుట్టు కొన్న, కుంతలుఁడు=వెండ్రుకలు గలవాఁడు. 'స్నిగ్ధామలైః కుంచిత నీలకుంతలైః' అని మూలము. తరుణచంద్ర చంద్రికా=వయస్సులో నున్న చంద్రునివెన్నెలవలె, ధవళ=తెల్లనైన, మందహాసుఁడు=నవ్వు గలవాఁడు, పరిపూర్ణకరుణావలోకన=సంపూర్ణమైన కరుణతోఁ గూడిన చూపులుగల, భ్రూభంగ=బొమముడిచేత, సూచిత=సూచింపఁబడిన, సంతత=నిరంతరమైన, అనుగ్రహలీలావిలాసుఁడు=అనుగ్రహమనెడు లీలావిలాసము గలవాఁడు, 'భ్రూభంగసంసూచితభూర్యనుగ్రహం' అని మూలము. మహాయోగిరాజ=గొప్పయోగులయొక్క, విలసిత=ప్రకాశించుచున్న, హృదయకమల=మనః కమలముయొక్క, కర్ణికా మధ్య=దిమ్మెనడుమ, సంస్థాపిత=నిల్పికొనఁబడిన, చరణకిసలయుఁడు =చిగురుటాకులవంటి పాదములు గలవాఁడు. అనఁగా మహాయోగు లెప్పుడును దమ హృదయకమల కర్ణికామధ్యమం దితనిపాదములు నిల్పికొని ధ్యానింతురని భావము. 'ఉన్నిద్ర హృత్పంకజ కర్ణికాలయే యోగేశ్వరస్థాపిత పాద' అని మూలము. ఇచ్చటి 'ఉన్నిద్ర' శబ్దమునకు బదులుగాఁ బోతన్న 'విలసిత' అను పదమును వాడె నేమో యనిపించును. సంతతానందమయుండును = నిరంతరము ఆనందముచేఁ గూడికొన్నవాఁడు, సహస్రకోటిసూర్యసంఘాత సన్నిభుఁడు = వేయిసూర్యులతో సమానమైన తేజస్సు గలవాఁడు, మహావిభుండు = సకలమును నియమించువాఁడు, మనోధారణా

మోఁకాళ్లు, జంఘాద్యవయవంబులన = పిక్కలు మొదలైన వానిని, ప్రతిక్షణంబును = నిరంతరము, పరిపూర్ణ నిశ్చల భక్తియోగంబు = సంపూర్ణమై చలింపని భక్తియోగము సిద్ధించువఱకును, తదీయచింతా తత్పరులై = వానిచింతయందే యాసక్తిగలవారై 'యస్మాత్సంచింతితో విష్ణుః చింతితం ప్రదదాత్యజః' ఇత్యాది ప్రమాణములచేత శ్రీమహా విష్ణువు చింతాప్రధానుఁడని తెలియవలెను.

ఆసన్నమరణార్థియైన యతీశుఁడు = మరణమును దన యిచ్ఛకుఁ దగినట్లుగాఁ దెప్పించికొనెడు, యతీశుఁడు = ఇంద్రియసమూహమును గెలిచిన యతి, కాలదేశమును = ఉత్తరాయణాది కాలములను గూర్చి గాని, గంగాది పుణ్యతీర్థములను గూర్చి గాని కాఁచికొనఁడు. తనువు విసర్జించు తలఁపు జనించినన్ = శరీరమును వదలెడి భావము పుట్టినంతనే, భద్రాసనస్థుఁడై = స్థిరము సుఖమునునైన యాసనమును గల్పించికొన్నవాఁడై, ప్రాణపవనున్ = ప్రాణవాయువును, మనసు చేతన జయించి, మానసవేగంబున్ = ఆయా విషయములచే గ్రహింపఁబడిన మనస్సును, బుద్ధిచేతన్ జయించి = నిశ్చయరూపమైన బుద్ధితో నియమించి, బుద్ధిన్ తెచ్చి క్షేత్రజ్ఞుతోన్ గూర్చి = మనోనిగ్రహసాధనీభూత శుద్ధిని బుద్ధ్యాదులకు ద్రష్టయైన క్షేత్రజ్ఞునందు లయింపఁజేసి, క్షేత్రజ్ఞున్ = ఆ జీవుని, ఆత్మలోపలన చేర్చి = శుద్ధతత్త్వమైన యాత్మయందుఁ గలిపి, ఆత్మను బ్రహ్మమందుఁ గలిపి ఒక్కటి గావించి = ఆ యాత్మను బ్రహ్మమం దొకటిగాఁజేసి, శాంతితోడ నిరూఢుఁడై = పొందఁబడిన శాంతిగలవాఁడై, సకల కార్యనివహామున్ ఎల్లనున దిగనాడి = సమస్తకర్మముల నుండియుఁ దప్పించికొన్నవాఁడై, అటమీఁదన్ = అపైన, వసుమతీశ! = రాజా!, నిత్యసుఖమువలయున్ అని = శాశ్వతమైన సుఖము గావలె నని, చూచున = ఎదురుచూచును.

తాత్పర్యము : మరణకాలము సమీపించిన యోగి ఉత్తరాయణాది పుణ్యకాలము కొఱకై గాని, గంగాది పుణ్యదేశములకై గాని గాచికొనఁడు. దేశ కాలములు యోగికి సిద్ధహేతువులు గావు. యోగమే సిద్ధహేతువు. కనుక శరీరమును వర్జించు తలఁ పేర్పడినపుడు 'యదాజిహాసుః' అని మూలము. యోగి స్థిరమైన సుఖమైన యాసనమును నేర్పఱచికొనవలెను. ప్రాణపవనున్ = ప్రాణవాయువును మనస్సుతో నియమింపవలెను. 'ప్రాణాన్నియచ్ఛేన్మనసా జితాసుః' అని మూలము. ప్రాణాన్ = ఇంద్రియములను అని శ్రీధరులు. జితాసుః అను మాటునే యిక్కడ పోతన్న ప్రధానముగాఁ గైకొన్నాఁడు. మానస వేగంబునన్ = తత్తద్విషయాకృష్టమైన మనస్సును నిశ్చయరూపమగు బుద్ధిచేత నియమింపవలెను. మనోనిగ్రహసాధనీభూతమైన బుద్ధిని క్షేత్రజ్ఞునియందు లయింపఁజేయవలెను. దానిని శుద్ధసత్త్వమైన యాత్మలోఁ జేర్చును. ఆత్మను బ్రహ్మమందుఁ గలిపి యొక్కటి చేయవలెను. అప్పుడు వాఁడు లబ్ధోపశాంతి యగును. కార్యవర్గములనెల్ల విడిచి పరమసుఖము కొఱకెదురుచూచు చుండును.

కాలదేవ సత్త్వ .... ప్రధానంబులకున్ = కాలము, దేవతలు, సత్త్వరజస్తమోగుణములు, మహత్తత్త్వము, ప్రధానమనఁబడెడు ప్రకృతి - వీనిలో దేనికిని బరమాత్మపై నధికారము లేదు. వ్యతిరిక్తంబు = భిన్నమైనది, ఆత్మత్వము = నేనే దేహ మనెడు బుద్ధి, విసర్జించి = వదలుకొని, అన్యసౌహృదంబుఁ మాని = దేహమునకు సంబంధించిన విషయములు - బంధుపుత్త్రాదులు వీరియందు, సౌహృదంబుఁ = స్నేహమును, విసర్జించి = వదలి, హరి పదంబుఁ = హరి పాదమును, వైష్ణవంబైన పరమపదంబున = విష్ణువునకు సంబంధించిన వైకుంఠమనఁ బడెడు సర్వోత్తమమైన స్థానము, విజ్ఞానదృగ్వీర్యజ్వలనంబునన్ = విజ్ఞానదృష్టియొక్క బల మనెడు నగ్నిచేత, నిర్దగ్ధవిషయవాసనుండై = సమూలముగా నాశనము చేయఁబడిన విషయవాసనలు గలవాఁడై

నిరపేక్షత్వంబునన్=పరమాత్మనియందుఁ దప్ప దనియందును
లేని మనస్సుతో.

తాత్పర్యము: పరమాత్మ విషయమందుఁ గాలాదులకు
కిని సామర్థ్యము లేదు. కాలము దేవతలకును గూడ నియమిం
దేవతలు ప్రపంచమును నియమింతురు. దేవతా నియంతయైన
మునకే యధికారము లేదప్పుడు దానిచే నియంత్రితులైన దే
కధికార మెట్లేర్పడును? అట్లే త్రిగుణములకుఁ గూడ ప్రభుత
లేదు. అనేక విధములుగా మార్పులు చెందుచు వికార మని
కొనెడు నహంకారమున కిచ్చటఁ జోటు లేదు. మహత్తత్త్వము
పెత్తనము సాఁగింపలేదు. ప్రధాన మనఁబడెడు ప్రకృతికిఁ
సామర్థ్యము లేదు. ప్రపంచములో నెచ్చటఁ జూచినను బరమా
భిన్నమైన వస్తువే లేదు. ఈ విషయ మెఱిఁగిన యోగి దేహా
దును దానికి సంబంధించిన బంధుమిత్రాదులందును సౌహృద
వర్జించి హరి భిన్నమైన సమస్తమునందును సౌహృదమును
నిరంతరమును సర్వవినుతమైన హరిచరణమునే యాలింగనము
కొనుచుండును. వైకుంఠ మనెడు విష్ణుపదము సర్వోత్తమ మై
సత్పురుషు లందురు. ఈ రీతిగా విజ్ఞానదృష్టిబలముచేత సమస్త వి
వాసనలను సమూలముగ దహించి క్రమముగా నిరపేక్షుఁడైనయో

అంఘ్రిమూలమునన్=కాలిమడమచేత, మూలాధారచక్ర
=మూలాధార మనెడు గుదస్థానమందున్న చక్రమును, పీడించి
పట్టి, ప్రాణంబున బిగియన్ పట్టి=వాయువు క్రిందికిఁ బ్రసరింప
నట్లు నియమించి, నాభీతలమున చేర్చి=నాభిచక్రమును బొంద
వాఁడై, నయముతోన్ మెల్లనన్=తొందఱలేనివాఁడై, హృత్సరో
మీఁదికిన్=హృదయపద్మము పైకి, ఎగయన్ పట్టి=పైకి లేప
అటుమీఁదన్=ఆ పైని, ఉరమందున హత్తించి=వక్షస్స్థలంబునఁ
క్రమ్మఱన్=మఱల, తాలుమూలమునకున్=దౌడలయొక్క స్థా

భ్రూయుగమధ్యంబున్ చేర్చి = కనుబొమల మధ్యభాగమును జేర్చి, దృక్కర్ణనాసాస్యమార్గములు మూసి = కన్నులు, కర్ణములు, నాసికలు, ముఖము ననెడు నేడు మార్గములు మూసి, ఇచ్ఛలేని యోగి = ఇతర విషయముల చింతలేనట్టి యోగీశ్వరుఁడు, ముహూర్తార్ధము = ఒక్క అరక్షణ కాలము, ఇంద్రియ + అనుషంగము = ఇంద్రియముల తోడి సంబంధము, ఇంతన్ లేక = కొంచెము గూడ లేకుండ, ప్రాణములను వంచి = ప్రాణములను నియమించినవాఁడై, బ్రహ్మరంధ్రము చించి = బ్రహ్మరంధ్రమును భేదించికొన్నవాఁడై, బ్రహ్మమందున కలియున్ = బ్రహ్మతో నైక్యమై పోవును.

తాత్పర్యము: యోగియైనవాఁడు దేహమును వదలు పద్ధతిని జెప్పుచున్నాఁడు - కాలిమడమతో నాయోగి గుదస్థానమును బీడించును. అనఁగా వాయువుయొక్క యధోగమనమును బూర్తిగా నిరోధించును. గుదస్థానమందే మూలాధారచక్ర మున్నది. ఆ చక్రమునకు నాల్గు దళములు. ఆ చక్రమునుండి ఉదానవాయువును యోగి పైకి లేపును. అచ్చటినుండి యాఱుచక్రముల కా వాయువును నడిపించును. నాభి, హృదయ, వక్షస్థల, తాలుమూల, భ్రూమధ్య, శిరస్సులనెడు స్థానము లాఱు. ఈ యాఱుస్థానములందు నాఱు చక్రములుండును. మూలాధారము నుండి కదలించిన వాయువును యోగి నాభియందున్న యాఱుదళములు గల పద్మమునకుఁ జేర్చును. అచ్చటినుండి హృదయమును బొందించును. ఇచ్చటనున్న చక్రమునకుఁ బది రేకులు. తర్వాత ఉరస్సును చేర్చును. అచ్చటనున్న పద్మమునకుఁ బన్రెండు దళములు. అచ్చట భిన్నమార్గమునఁ బడకుండ యోగి జాగ్రత్తగా వాయువు ననుసంధించికొనును. దానినుండి తాలుమూలమునకు లేపును. ఇచ్చటనున్న చక్రమునకుఁ బదునాఱు దళములు. తర్వాత భ్రూమధ్యప్రదేశము. దీని కాజ్ఞాచక్ర మని పేరు. ఇచ్చట

నున్న చక్రమునకు రెండు దళములు. ఇచ్చట సాధకుఁడైన యోగి చాల జాగ్రత్తగా నుండవలెను. వాయువుయొక్క బహిర్నిర్గమనమున కిచ్చట నేడు మార్గము లున్నవి. కనులు రెండు. కర్ణములు రెండు. రెండు నాసాద్వారములు. ముఖ మొక్కటి. ఇచ్చట యోగి క్షణ కాలము నిలుచును. తన లక్ష్యమేమి యని యాలోచించుకొనుటకు సర్వనిరపేక్షుఁ డైనచో బ్రహ్మైక్యము. కానిచో నితర లోకములకుఁ బ్రయాణము. కేవల నిరపేక్షుఁడైనచో వాఁడిచ్చటనుండి ప్రాణము లను బైకిఁ దన్నును. వాఁడు బ్రహ్మరంధ్రమును భేదించికొని బ్రహ్మ మందుఁ గలియును.

దేహత్యాగకాలంబునన్=దేహమును విసర్జించు సమయమందు, సంగంబులు=సంబంధములు, వానితోడన్=ఇంద్రియములతోనే, ఖేచర సిద్ధ విహారయోగ్యంబు = ఖేచరులైన సిద్ధులు విహరించుట కర్హమైన ట్టియు, అణిమాది సకలైశ్వర్యసమేతంబు=అణిమ మహిమ మొదలైన సిద్ధశక్తులతోఁ గూడికొన్నది, పరమేష్ఠి పదంబున్=పరమేష్ఠియొక్క స్థానమును, చేరున్=పొందును.

తాత్పర్యము: పరమేష్ఠి పదమును గాని లేక యాకాశమందు సంచరించుచు, ఖేచర సిద్ధ క్రీడాస్థానమైన స్వర్గాదికమును బొందఁ దలఁచినవాఁడు మనస్సు మొదలైనవానితోఁ గూడికొన్న లింగదేహ ముతోఁ బాటు ప్రయాణించును. వానికి లింగదేహభంగము లేదని తాత్పర్యము. మనస్సును, ఇంద్రియములను వాఁడు త్యజింపఁడు. వానితోఁ బాటు తత్తల్లోకభోగార్థము వాఁడు పయనించును. వానికి బ్రహ్మాండమందు సర్వత్ర సంచార ముండును. అష్టైశ్వర్యాధిపత్య ముండును.

గాడు.

తాత్పర్యము: విద్య యనఁగా నుపాసన. తప స్సనఁగా భగవద్ధర్మము. యోగ మష్టాంగయోగము, సమాధి జ్ఞానము. ఇట్టి వారికి బ్రహ్మాండముయొక్క లోపలను బయటను సంచార ముండును. కేవల కర్మముతో నీ స్థితి నెవ్వరును బొందలేరు. నిరపేక్షుఁడైన యోగి లింగశరీరము పవనాంతర్గతమై యుండును. అందుచే వాని గతి వాయువువలె నిర్నిరోధము.

ఆకాశపథంబునన్ = ఆకాశమార్గంబునందు, సుషుమ్నా నాడి వెంటన్=సుషుమ్న యనెడు నాడిద్వారా, అగ్ని యను దేవతన్ చేరి =అగ్ని యభిమానినియైన దేవతను జేరినవాఁడై, జ్యోతిర్మయంబైన తేజంబునన్ = జ్యోతిస్స్వరూపమైన తేజస్సుతో, నిర్మలుండై=పోఁగొట్టఁ బడిన సమస్తపాపములు గలవాఁడై, ఎందునున్ తగులుపడక= ఏ చాంచల్యమునకును లోఁబడక, తారామండలంబుమీఁదన్=నక్షత్ర లోకమునకు పైనున్న, సూర్యాది ధ్రువాంత పదంబులన్=సూర్యుఁడు మొదలుకొని ధ్రువనక్షత్ర పర్యంతమున్న స్థానముల నతిక్రమించి, శింశుమార చక్రంబున చేరి=నారాయణాధిష్ఠితమైన శింశుమార చక్రమును బొందును. శింశుమారాఖ్యజ్యోతిశ్చక్ర వృత్తాంతము పంచమ స్కంధమందు వివరింపఁబడినది. చక్రస్థానము ... ఆదిత్యాది ధ్రువాంతములు.

తాత్పర్యము: ఆకాశపథము వెంటఁ బోవుచు యోగియైనవాఁడు సుషుమ్నా నాడిద్వారా అగ్ని యభిమానినియైన దేవతను బొందును. ఈ సుషుమ్న దేహమునకు లోపలను బయటనువ్యాపించి

యుండును. ఆ యోగి యింకను పైకిఁబోయి నారాయణాధిష్ఠితమై శింశుమారాఖ్య జ్యోతిశ్చక్రమును బొందును. ఈ చక్రస్థానములు సూర్యాది ధ్రువాంతములు.

పరమాణుభూతంబైన లింగశరీరంబు తోడన్ — పరమాణువంత ప్రమాణము గలిగిన లింగశరీరముతో, బ్రహ్మవిదులు—జ్ఞానులు, మహాకల్పకాలంబు—కల్పాంతము వఱకును, అనంతముఖానల—ఆదిశేషుని ముఖమునుండి వెలువడెడు అగ్నియొక్క, జ్వాలాజాలదందహ్యమానంబు—జ్వాలలచేఁ గాల్చఁబడుచున్నది, లోకత్రయంబున్—మూఁడు లోకములను, ఈక్షించుచున్—చూచుచు, తన్నిమిత్త సంజాతదాహతాపంబున్—ఆ కారణముచేత నేర్పడిన యుష్ణోగ్రతను, సమీపింపన్ చాలక—తట్టుకొనలేక.

తాత్పర్యము: అట్టి శింశుమారచక్రమును వాఁడతిక్రమించును. ఆ ప్రదేశమున నా యోగికిఁ దోడెవ్వరు నుండరు. ఎందుకనఁగా స్వర్గవాసుల కచట సంచారము సున్న. ఆ యోగి నిర్మలమైన లింగశరీరముతో సర్వనమస్కృతమైన మహర్లోకమును జేరును. అచ్చటఁ గల్పాయుష్మలైన భృగ్వాదులు వసించుచుందురు. వారితోఁ బాటు నీ యోగియు నచ్చటఁ గ్రీడించును. కల్పాంతమందు సమస్త విశ్వమును ననంతుని ముఖానలముతో దహింపఁబడుచుండును ఆ వేఁడి మహర్లోకమునకుఁ దన్నును అప్పుడు దానికిఁ దట్టుకొనలేక—

ఇలమీఁదన్—ప్రపంచమందు, ఈడిర్వురు—పదునాల్గుమంది, మనువులు చనువేళ—మనువుల యాయుస్సు. ఎచ్చోటన్ దివసమై తిరుగుచుండున్—ఏ బ్రహ్మలోకమం దొక దిన మగునో, ఎందున్ దినకరప్రభములై—సూర్యునితో సమానకాంతి గలిగినవై, మహనీయ సిద్ధ విమానసంఘములు—గొప్పవైన సిద్ధుల విమానములు, తేజరిల్లున—ప్రకాశించునో, శోక—శోకము, జరా—ముసలితనము, మృత్యు—చావు,

శోషణ=కృశించుట, భయ=భయము, దుఃఖనివహంబులు=మొదలైన దుఃఖముల గుంపు, ఎందున్=ఎచ్చట, జనింపకుండున=పుట్టుటలేదో, విష్ణుపదధ్యాన=శ్రీమహావిష్ణువు పాదచింతన మనెడు, విజ్ఞాన రహితుల శోకంబులు=జ్ఞానహీనులైన మానవుల దుఃఖములను, ఎందుండి=ఏ సత్యలోకమునుండి, చూడవచ్చున్=చూచుటకు సాధ్యమగునో, పరమసిద్ధ=ఉత్తములైన, యోగిభాషణామృతము=యోగుల సంభాషణ మను నమృతము, శ్రవణపర్వ మగుచున్=కర్ణోత్సవమై, ఎందున=ఏ తావున, జరుగుచుండున్=ప్రవర్తించుచుండునో, అట్టి బ్రహ్మలోకమందున వసించును. రాజవర్య!=ఓ పరీక్షిన్మహారాజా!, వాఁడు=ఆ లోకమును బొందినవాఁడు, మరలిరాఁడు=క్రిందిలోకములకు రాఁడు.

తాత్పర్యము: ఓ పరీక్షిన్మహారాజా! ఉత్తమోత్తములైన యోగి మహర్లోకము నుండి బ్రహ్మలోకమున కేగును. భూమిపైఁ బదునల్గురు మనువుల యాయుస్సు గతించిపోవును. సూర్యకాంతులతో నెప్పుడును బరమసిద్ధుల విమానము లచటఁ జరించుచుండును. అచ్చట శోక జరా మృత్యు శోషణాది దుఃఖములు లేవు. భగవంతుని ధ్యానింపక సంసారమందు వ్యాసక్తులైన మానవులు పొందెడు నరకాదియాతనలను సత్యలోకవాసులు స్పష్టముగాఁ జూడఁగల్గుచున్నారు. సిద్ధులైన మహాయోగులయొక్క సంభాషణములు కర్ణపేయములై జరుగుచుండును. ఆ బ్రహ్మలోకమును జేరిన వారికి మఱల నధోగతి లేదు.

పుణ్య+అతిరేకంబునన్=పుణ్యముయొక్క అతిశయముచేత, బ్రహ్మలోకగతులు=బ్రహ్మలోకమును బొందినవారు, కల్పాంతంబునన్=వేఱుకల్పమందు, పుణ్యతారతమ్యంబులన్=పుణ్యపు హెచ్చుతగ్గులచేత, అధికారవిశేషంబులన్=భిన్నభిన్నములైన యధికారములను, బ్రహ్మాది దేవతాభజనంబునన్=హిరణ్యగర్భాది ఉపాసనాబలముచేత, బ్రహ్మలోకంబునన్ వసియించి=సత్యలోకమందుండి, నారాయణచరణకమల

భక్తిపరాయణత్వంబునన్=శ్రీమన్నారాయణుని పాదపద్మములందలి భక్తినే యాశ్రయించినవారై, నిజ+ఇచ్ఛావశంబునన్=తమకోర్కి ననుసరించి, నిరర్గళగమనులై=అడ్డులేని సంచారముగలవారై, బ్రహ్మాం డంబు భేదించి, మహా+ఉన్నతవైష్ణవపదారూఢులై=సర్వోన్నతమైన వైష్ణవపదమును బొందినవారై, తేజరిల్లుదురు=ప్రకాశింతురు.

తాత్పర్యము: బ్రహ్మలోకగతులైన వారికి ముక్తి అఱుగులైన గతి యేర్పడును. పుణ్యోత్కర్షముతో బ్రహ్మలోకము నందినవారు పుణ్య తారతమ్యముతోఁ గల్పాంతమందు భిన్నభిన్నములైన యధికా రము అందుదురు. హిరణ్యగర్భాద్యుపాసనా బలముతో బ్రహ్మలోక మును బొందినవారు బ్రహ్మదేవునితోఁ బాటు మోక్షము నందుదురు. శ్రీమన్నారాయణుని చరణకమలములనే యాశ్రయించినవారు తమ యిష్టము వచ్చినట్లు సంచరింప శక్తిగలవారై బ్రహ్మాండమును భేదిం చికొని పరమోన్నతవైష్ణవపదము నందుదురు. ఇప్పుడు భగవద్భక్తుని బ్రహ్మాండభేదన ప్రకారమును జెప్పుచున్నాఁడు. (1వ భాగము)

ఈశ్వరాధిష్ఠితము=ఈశ్వరునికి లోఁబడినది, ప్రకృతియంశంబు నన్=ప్రకృతియొక్క చిన్న భాగముచేత, మహత్తత్త్వంబగు=మహత్తత్త్వ మేర్పడును. మహత్తత్త్వము నంశముచేత నహంకార మేర్పడును. దాని యంశముతో శబ్దతన్మాత్రము గల్గును. శబ్దతన్మాత్ర అంశముతో నాకాశ మేర్పడును. గగనాంశముతోఁ గల్గునది స్పర్శతన్మాత్ర. తన్మాత్రాంశముతో, సమీరణంబగు=గాలియేర్పడును, తదంశముతో రూపతన్మాత్ర, రూపతన్మాత్రాంశముతోఁ దేజ మేర్పడును. తేజో౽ంశ ముతో రసతన్మాత్ర. తదంశముతో జలము. జలాంశముతో గంధ తన్మాత్రము. తన్మాత్రాంశముతో పృథివి. మేళనంబునన్ = వాని పరస్పర సంబంధము వలన, చతుర్దశ భువనాత్మకము=పదునాల్గు భువనములే స్వరూపముగాఁ గలది, అండకటాహము=అండమనెడు బాణలి, ప్రథమావరణము=మొదటియావరణము, సలిలతేజస్సమీర

గగనాహంకార మహత్తత్త్వంబు లని యెడి యావరణంబులు = నీరు తేజస్సు, గాలి, ఆకాశము, అహంకారము, మహత్తత్త్వము. దశగుణ + ఉత్తర + అధికంబులై = పదింతలు పెద్దవై, ప్రకృతి + ఆవరణంబు = ప్రకృతియనెడు నావరణము, వైష్ణవపద ఆరోహణంబు = విష్ణుపదమును జేరుట, నిర్భయుండై = భయములేనివాఁడై, పృథివ్యాత్మకత్వంబు నొంది = పృథివీతత్త్వస్వరూపమును లింగదేహముతోఁ బొందినవాఁడై, ఘ్రాణంబునన్ = నాసికచేత, జలాత్మకత్వంబునన్ = జలస్వరూపముగా మాఱుటచేత, రసన + ఇంద్రియంబునన్ = జిహ్వచేత, సమీరణ + ఆత్మకత్వంబునన్ = గాలిరూపముచేత, అతిక్రమించి = దాఁటి, లయ స్థానము = లయమునందునది, మనోమయము = మనస్సు స్వరూప మైనది, ఉపాధిపరంపరా + అవసానంబునన్ = ఉపాధులవినాశమందు.

తాత్పర్యము: శ్రీధరునివ్యాఖ్య ననుసరించి విషయమును జెప్పుచున్నాఁడు-

ఈశ్వరాధిష్ఠితమైన ప్రకృతియొక్క యొకానొక చిన్నయంశముచేత మహత్తత్త్వ మేర్పడును. దానియంశముతో నహంకారము, తదంశముతో శబ్దతన్మాత్రద్వారా నభము, దానియంశముతో స్పర్శ తన్మాత్రద్వారా వాయువు, తదంశముతో తేజము. రసతన్మాత్రద్వారా తేజ మేర్పడును. దానియంశముతో రసతన్మాత్రద్వారా నీరు. వాని యంశముతో గంధతన్మాత్రద్వారా పృథివి యేర్పడును. ఇవి పరస్పర మిళితములై చతుర్దశభువనము లగును. ఇవియే భగవంతుని విరాట్స్వరూపము. ఈ రూపమునకుఁ గోటియోజనముల విశాలమైన యండ కటాహమే ప్రథ మావరణము. ఇది పృథివ్యాత్మకము. దీనిని పంచాశత్కోటియోజనవిశాల మని కొందఱందురు. ఈ యావరణముపై క్రమముగా నీరు మొదలైన యావరణము లుండును. ఇవి యొకదాని కంటె నొకటి పదింతలు పెద్దవి. ఇవి యేడావరణములు. ప్రకృత్యా

వరణ మెనిమిదవది, ఇది మహావ్యాపకము. యోగియైనవాఁడు ఈ బ్రహ్మాండమును భేదించి వైష్ణవపదము నందుచున్నాఁడు. వాఁడు బ్రహ్మాండమును భేదించెడు ప్రకారమును జెప్పుచున్నాఁడు. లింగ దేహముతో వాఁడు పృథివ్యాత్మత్వము నందును. దానితో ఘ్రాణమున గంధము నందును. జలాత్మకత్వముతో రసనేంద్రియము ద్వారా రసమును బొందును. తేజోరూపముతో దర్శనముతో రూపమును, సమీరణాత్మకత్వముతో దేహమున స్పర్శమును, గగనాత్మకత్వముతో శ్రవణముద్వారా శబ్దమును బొందును. పొందుట యనఁగా నతిక్రమించుటయే. ఈ రీతిగా స్థూలసూక్ష్మభూతముల యతిక్రమమును వివరించి వాని యావరణభూతమైన యహంకారమునుబొంది మహదాదులను బొందు వివరమును జెప్పుచున్నాఁడు. మనోమయము దేవమయమునైన సాత్త్వికాహంకార గమనముతో మహత్తత్త్వము నందును. అహంకారము మూఁడురీతులు. తామసాహంకారముతో భూతసూక్ష్మము లేర్పడును. రాజసముతో బహిర్ముఖములైన దశేంద్రియములు, సాత్త్వికాహంకారముతో మనస్సును దేవతలును నేర్పడుదురు. భూత సూక్ష్మములును ఇంద్రియములును లయించెడు ప్రధానమును వాఁ డందును. ప్రధానతత్త్వముతోఁ గ్రమముగా నుపాధులను బోఁగొట్టుకొని యానందమయుఁ డగును. ఆనందమయుఁడై పరమాత్మరూపమైన వాసుదేవపరబ్రహ్మము నందును.

(2వ భాగము).

శ్రీధరుఁడు 'ఆనందం పరమాత్మన ముపైతి' అని మాత్రమే వ్యాఖ్యానించినాఁడు. ఇక్కడ పోతన్న 'వాసుదేవ బ్రహ్మమందున్' అనుచున్నాఁడు. వైష్ణవవ్యాఖ్యలో 'సర్వాత్మక బ్రహ్మణి వాసుదేవే' 'శాంతిం యాతి' అని కలదు. ఈ విశిష్టాద్వైత సంప్రదాయము

కౌరవేంద్ర! ఇది పరమభాగవతులు పాటించు పథము= సర్వశ్రేష్ఠులైన నారాయణ పదభక్తు లనుసరించు మార్గము. యోగి ఈ పథమునన్ అరిగె నేని=ఈ మార్గమున యోగి ప్రయాణించినచో, వాఁడు కల్పశతములైనన్ మగుడిరాఁడు, మఱి సంశయము లేదు.

తాత్పర్యము: ఓ రాజా! శ్రీమన్నారాయణ పదభక్తు లాశ్రయించు మార్గ మిది. ఈ మార్గమున యోగి పోయినచో వాఁడు కల్పశతము లైనను మన ప్రపంచమునకు రాఁడు.

సద్యోముక్తియున్=అప్పుడే మోక్షము నందుట, క్రమముక్తియున్=క్రమక్రమముగా ముక్తినందుట, వేదగీతంబులందున్ = వేద ఋక్కులందు, సంసారప్రవిష్టులు = సంసారమందుఁ బ్రవేశించిన వారు, తపస్ + యోగాదులు=తపము, యోగము మొదలైనవి.

తాత్పర్యము: ఓ రాజా! సర్వానపేక్షుఁడై బ్రహ్మరంధ్రమును జించికొని యొక్కఁడు పోవును. ఇది సద్యోముక్తి. బ్రహ్మలోకము నందుట మొదలైన పద్ధతులతో నొక్కఁడు పోవును. ఇది క్రమముక్తి. ఈ రెండే వేదమందుఁ జెప్పఁబడిన మార్గములు.

**యదా సర్వే ప్రముచ్యంతే కామాయే చ హృదిస్థితాః,**

**అథ మర్త్యో మృతోభవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే.**

ఇత్యాదులతో వేదమందు సద్యోముక్తి చెప్పఁబడినది. 'తేఽర్చిషమభి సంభవంతి' ఇత్యాదులతోఁ గ్రమముక్తి వివరింపఁబడినది. 'నకర్మభి స్తాంగతి మాప్నువంతి' అనుటచేత దక్షిణమార్గము గూడ సూచింపఁ బడెను. అందుకే మార్గములు ముక్తికి రెండే యనుచున్నాఁడు. నీవు ముక్తిని గోరుచున్నవాని మార్గము లెన్ని యని యడిగితివి. రాజా! అందుచేత రెండే యని చెప్పుచున్నాను. 'బ్రూహి యద్వా విపర్య

మార్గము లెన్నో గలవు. కాని యీ రెండే ప్రశస్తము లైనవి. భక్తి మార్గము నిర్విఘ్నమై సుఖరూపమైనది. దీనికన్నను వేఱుమార్గ మిటు వంటిది లేదు.

అంభోజభవుండు = బ్రహ్మ, ముమ్మాఱు = మూఁడుసారులు, సర్వనయజ్ఞత్వము = సమస్త మర్మములను గ్రహించుబుద్ధి, పరామర్శించి = వివరించి, తక్కినమార్గంబుల వెంటన్ = దీనికి భిన్నమైన మార్గములతో మోక్షంబు లేదనుచున్, నిర్వికారుఁ డగుచున్ = మనోవికారము లేనివాఁడై, జనార్దనున్ ఆత్మాకృతిన్ చింతచేసెన్ = శ్రీమహావిష్ణువును ఆత్మస్వరూపముగా భావించెను, తత్ + మార్గనిర్ణేతయై = ఆ మార్గమును నిర్ణయించుచున్నవాఁడై.

తాత్పర్యము: రాజా! ముందు బ్రహ్మ మోక్షమార్గమును నిష్కర్షగాఁ దెలిసికొను నూహతో వేదములను ముమ్మాఱు శోధించెను. మోక్షము తక్కిన మార్గములతో సంభవింపదని నిర్ణయించికొన్నాఁడు. భక్తియే సర్వోత్కృష్ట మను నిర్ణయమునకు వచ్చెను. జనార్దనుఁడే యాశ్రయణీయుఁ డని తెలిసికొన్నాఁడు.

అఖిలభూతములందున్ = సమస్తప్రాణులందును, ఎల్లప్రొద్దున్ = ఎప్పుడును, ఆత్మరూపంబునన్ = ఆత్మస్వరూపముగా, ఈశుండు = సర్వనియామకుఁడైన హరి యుండున, బుద్ధ్యాది లక్షణంబులన్ = బుద్ధి మొదలైన లక్షణములచేత, కానన్ పడును = అర్థమగుచుండును, మహాసేవనీయుఁడు = గొప్పగా సేవింపఁ దగినవాఁడు, అహర్నిశంబున్ = సర్వకాలము, వందనీయుఁడు = నమస్కరింపఁ దగినవాఁడు, భక్త

చేత, మలినీకృతాంగముల్ - మలినము చేయఁబడిన యంగములను, వేగన్, విడిచి.

తాత్పర్యము: అనుభూతమైన యర్థమందు రతి యేర్పడుట కవకాశ మున్నది. అననుభూతార్థమందుఁ బ్రేమ యెట్లేర్పడును? దానికి సమాధాన మిచ్చుచున్నాఁడు-

భగవంతుఁడు సర్వులకును బ్రత్యక్షముగా నున్నవాఁడే. ఈ యనుభవమునకు బుద్ధ్యాదులే కారణము. ఎట్లనఁగా నవి స్వయముగా జడములు. జడములకుఁ బ్రవృత్తి నివృత్తిధర్మము లెట్లేర్పడును? ఎవ్వఁడో యొకఁడు నడపించువాఁ డుండవలెను. వాఁడే యాత్మ. అతఁడే యీశుఁడు. శ్రీమన్నారాయణుఁడు వాఁడే. సేవల కర్హుఁడు. ఆ భగవంతుని నియమించునదిగూడ మఱియొక్కటి గలదు. అదే భక్తవాత్సల్యము. దానికి లోఁబడి యాతఁడు సర్వజీవులందు నాత్మస్వరూపముగా వెలుఁగువాఁడై యా ప్రాణులను స్వస్వకార్యములందు నియమించుచుండును. కనుక నాత్మస్వరూపుఁడైన హరికథామృతములను నిరంతరము గ్రోలుచుండవలెను. అట్లు గ్రోలెడివారు వివిధ వాసనామలినీకృతములైన శరీరములను వదలి శ్రీ మన్నారాయణమూర్తి సన్నిధిఁ జేరెదరు.

ఇక్కడ 'మహాసేవనీయుఁ'డని యొక శబ్దమున్నది. మహద్భావనీయుఁడని దీనికిఁ బాఠాంతరము ఈ రెంటిలో నేదియున్నను బాధలేదు. కాని మూలములో 'భాగవత ఆత్మసతాం' అని కలదు. సత్పురుషుల హృదయములం దాత్మస్వరూపుఁడై యుండునని దానికిఁ దాత్పర్యము. సత్పురుషుల హృదయములందే పరమాత్మయుండునా? యని ప్రశ్నించికొని, సంస్కృతవ్యాఖ్యాతలు అందఱియందును శ్రీహరి యుండును కాని, మాయందు హరి యాత్మస్వరూపుఁడై

విశేషించి వారినిఁ జెప్పినాఁడని సమర్థించిరి. ఈ సమర్థన పోతన్న
కంత యిష్ట మున్నట్లు లేదు. అందుకే 'అఖిలభూతములందున
అన్నాఁడు.

పుట్టపర్తి నారాయణాచార్యదాసునిచే విరచింపఁబడిన
'భాగవత సుధాలహరి' యందు ద్వితీయ
స్కంధమున రెండవయధ్యాయము
వ్యాఖ్య ముగిసినది

---

# భాగవత సుధాలహరి

## ద్వితీయస్కంధము

## తృతీయాధ్యాయము

* * *

శ్రీ శుక ఉవాచః

ఏవమేత న్నిగదితం పృష్టవాన్ యద్భవాన్ మమ,
నృణాం చ మ్రియమాణానాం మనుష్యేషు మనీషిణామ్.1

మనుష్యేషు=మనుష్యులందు, మనీషిణాం = విద్వాంసులును, మ్రియమాణానాం = మరణశీలురునైన, నృణాం = నరులకుఁ గర్తవ్యముగా నున్నది, యత్ = ఏదియో, భవాన్ = నీవు, మమ = నన్ను, యత్=దేనిని, పృష్టవాన్ = అడిగితివో, ఏతత్=అది, ఏవం=ఇట్లు, నిగదితం=చెప్పఁబడినది.

అవ: మూఁడవయధ్యాయమందు విష్ణుభక్తిమాహాత్మ్యమును విన్పించి, పరీక్షిన్మహారాజునకున్న భక్త్యతిశయమును కథాశ్రవణమందుఁ బ్రదర్శించిన యాదర్శమును వర్ణింపఁబోవుచున్నాఁడు-

ఓ రాజా! పుణ్యయోగముతో నెప్పుడైనను మనుష్యజన్మ మేర్పడెడు భాగ్యము సిద్ధించిన మానవులలో విద్వాంసులైనవారు మరణశీలురునైన మానవు లనుష్ఠింపవలసిన హరికథా శ్రవణాదులను గూర్చి నీవడిగిన ప్రశ్నకు ఉత్తర మొసఁగియున్నాను.

**బ్రహ్మవర్చసకామస్తు యజేత బ్రహ్మణస్పతిమ్,**
**ఇంద్ర మింద్రియకామస్తు ప్రజాకామః ప్రజాపతీన్.**

**బ్రహ్మవర్చసకామః=బ్రహ్మతేజస్సును గాంక్షించుచున్నవాఁడు, బ్రహ్మణస్పతిం=వేదప్రవర్తకుఁడైన చతుర్ముఖబ్రహ్మనుగూర్చియు, ఇంద్రియకామః=ఇంద్రియసుఖములను గాంక్షించువాఁడు, ఇంద్రం=ఇంద్రుని గూర్చియు, ప్రజాకామః=సంతానము గోరుచున్నవాఁడు, ప్రజాపతీన్=ప్రజాపతులను గూర్చియు, యజేత=పూజింపవలెను.**

విష్ణువును వదలి తక్కిన దేవతలను భజించుట యల్పములైన ఫలముల కొఱకే. ఆ యల్పఫలములు పుత్త్రాదులందు స్నేహముగల వారి దృష్టిలో గొప్పవిగాఁ గన్పింపవచ్చును. కాని పరమపురుషార్థపరుల కవి తుచ్ఛములే. నాశరహితమైన పరమఫలమున కవి యుపకరింపఁ జాలవు. ఈ విషయమును దెల్పుటకు సంకల్పించిన శుకబ్రహ్మ మందమతులు ఆశించెడు ఫలములను గల్పించెడు అన్యదేవతా భజనములను వివరించుచున్నాఁడు.

బ్రహ్మతేజస్సు గావలె ననుకొనువారు వేదప్రవర్తకుఁడైన చతుర్ముఖబ్రహ్మ నుపాసింపవలెను. ఇంద్రియసుఖము ఇంద్రియపాటవము గోరెడివారి కింద్రుఁడు సేవ్యుఁడు. సంతానోత్పత్తి గోరెడివారు దక్షుఁడు మొదలైన ప్రజాపతుల నుపాసింపవలెను.

**అన్నాద్యకామస్త్వదితిం స్వర్గకామోఽదితే స్సుతాన్,**
**విశ్వాన్ దేవాన్ రాజకామ స్సాధ్యాన్ సంసాధకో విశామ్ 3**

**అన్నాద్యకామః తు=భోజ్యము భక్ష్యము మొదలగువానిని గామించువాఁడు,**

దేశమందుఁగల వారియొక్క, సంసాధకః=స్వాధీనతను గోరెడువాఁడు, సాధ్యాన్ =సాధ్యుల నుపాసింపవలెను.

భోజ్యభక్ష్యాదులను గోరెడివానికి అదితి యుపాసింపఁదగినది. స్వర్గమును గోరువాఁడు అదితిపుత్త్రులైన పండ్రెండుమంది యాదిత్యుల నుపాసింపవలెను. రాజ్యకాంక్షికి విశ్వేదేవత లుపాస్యులు. దేశ ప్రజలను దన స్వాధీనమం దుంచుకొను కోర్కిగలవాఁడు సాధ్యులు మొదలైన దేవతల నుపాసింపవలెను.

దేవీం తు మాయాం శ్రీకామ స్తేజస్కామో విభావసుమ్,
వసుకామో వసూన్ రుద్రాన్ వీర్యకామస్తు వీర్యదాన్. 4

శ్రీకామః = ఐశ్వర్యమును గోరెడివారు, దేవీంమాయాం = దుర్గాదేవిని, తేజస్కామః=ప్రభావాకాంక్షియైనవాఁడు, విభావసుం=అగ్నిదేవుని, వసుకామః=ధనాపేక్షియైనవాఁడు, వసూన్=వసువులను, వీర్యకామః=వీర్యమునుగోరెడివాఁడు వీర్యదాన్=వీర్యప్రదులైన, రుద్రాన్=రుద్రులను (యజేత).

ఐశ్వర్యకాముఁడు దుర్గాదేవి నుపాసింపవలెను. ప్రభావాకాంక్షియైనవాఁడు అగ్నిదేవోపాసకుఁడు గావలెను. ధనాకాంక్షియైన వానికి అష్టవసువు లుపాస్యులు. వీర్యోత్కర్షము నాశించుచున్నవారు శిరచ్ఛేదము మొదలైన ఘోరకర్మములతో రుద్రుల నుపాసింతురు.

ఆయుష్కామోఽశ్వినౌ దేవౌ పుష్టికామ ఇలాం యజేత్,
ప్రతిష్ఠాకామ పురుషో రోదసీ లోకమాతరౌ. 5

ఆయుష్కామః = ఆయుర్వృద్ధి గోరువాఁడు, అశ్వినౌ దేవౌ = అశ్వినీ దేవతలను, పుష్టికామః=శరీరాదిపుష్టిని గోరువాఁడు, ఇలాం=భూమిని, ప్రతిష్ఠాకామః=స్థానస్థిరత్వమునుగోరునట్టి, పురుషః=పురుషుఁడు, లోకమాతరౌ=లోకమునకు తలిదండ్రులైన, రోదసీ=ద్యావాభూములను, యజేత్=యజింపవలెను.

దీర్ఘాయుస్సును గోరువాఁడు అశ్వినీ దేవతలను బూజింపవలెను ... భూమిని నుపాసింపవలెను. తా నున్న

స్థానమునుండి చలనము లేక స్థిరప్రతిష్ఠ నాకాంక్షించు వాఁడు లోకమునకు తలిదండ్రులైన ద్యావాభూముల నుపాసింపవలెను.

రూపాభికామో గంధర్వాం స్త్రీకామోఽప్సర ఊర్వశీమ్,
ఆధిపత్యకామ స్సర్వేషాం యజేత పరమేష్ఠినమ్. 6

**రూపాభికామః=సౌందర్యమునుగోరువాఁడు, గంధర్వాన్=గంధర్వులను, స్త్రీకామః=స్త్రీలనుగోరువాఁడు, అప్సర ఊర్వశీం=అప్సర స్సతియగు నూర్వశిని, సర్వేషాం=సర్వులపై, ఆధిపత్యకామః=ఆధిపత్యమునుగోరువాఁడు, పరమేష్ఠినం=బ్రహ్మదేవుని-యజేత.**

రూపమును గోరెడివాఁడు గంధర్వులను, స్త్రీలను గోరువాఁడు అప్సరస్సతియైన యూర్వశిని నుపాసింపవలెను. సర్వుల పైనను అధికారముగోరువాఁడు చతుర్ముఖబ్రహ్మ నుపాసింపవలెను.

యజ్ఞం యజే ద్యశస్కామః కోశకామః ప్రచేతసమ్,
విద్యాకామస్తు గిరిశం దాంపత్యార్థ ఉమాం సతీమ్. 7

**యశస్కామః = గొప్పకీర్తి గావలె ననుకొనువాఁడు, యజ్ఞః = యజ్ఞమూర్తిని, యజేత్=యజింపవలెను, కోశకామః=పెద్దభండారమును గోరువాఁడు, ప్రచేతసం = వరుణుని గూర్చి (యజేత్), విద్యాకామః=విద్యను గోరెడివాఁడు, గిరిశం=పరమశివుని, యజేత్. దాంపత్యార్థః = దాంపత్యమును గోరెడువాఁడు, సతీం=పతివ్రతయైన, ఉమాం=పార్వతీదేవిని, యజేత్.**

సత్కీర్తిని గోరెడువాఁడు యజ్ఞస్వరూపుఁడైన శ్రీహరి నుపాసింపవలెను. తనవద్ద నున్న భండారము దినదినాభివృద్ధి నొందవలెననుకొన్నవాఁడు వరుణునిఁ బూజింపవలెను. విద్యాభివృద్ధి నాకాంక్షించెడువాఁడు పరమశివు నుపాసింపవలెను. భార్యాభర్తలు అన్యోన్యముగ నుండవలెనని కోరెడివాఁడు పతివ్రతయగు నుమాదేవి నుపాసింపవలెను.

ధర్మార్థ ఉత్తమశ్లోకం తంతుం తన్వన్పితౄన్ యజేత్,
రక్షాకామః పుణ్యజనాన్ ఓజస్కామో మరుద్గణాన్. ౪

ధర్మార్థే=ధర్మాభివృద్ధియం దాకాంక్ష గలవాఁడు, ఉత్తమశ్లోకం=ధర్మానుగుణమై యుత్తమమైన కీర్తి గలిగిన శ్రీహరిని బూజింపవలెను, తంతుం=వంశాభివృద్ధిని, తన్వన్=కోరెడివాఁడు, పితౄన్=పితృదేవతలను, యజేత్. రక్షాకామః=ఆత్మరక్షను గోరినవాఁడు, పుణ్యజనాన్=పవిత్రులైన మనుష్యులను, లేక నిర్ఋతి మొదలైన రాక్షసులను, యజేత్, ఓజస్కామః=తేజస్సు నాకాంక్షించువాఁడు, మరుద్గణాన్=మరుత్తులను, యజేత్.

ధర్మాభివృద్ధి నాకాంక్షించెడువాఁడు ధర్మానుగుణమైన సత్కీర్తి గల శ్రీహరి నుపాసింపవలెను. వంశవిచ్ఛిత్తిలేక సాఁగవలెనను కోర్కి గలవాఁడు పితృదేవతలను బూజింపవలెను. రక్షాకాముఁడు నిర్ఋతి మొదలైన వారి శరణుఁ జొరవలెను ఓజస్సును గోరువాఁడు మరుద్గణము నుపాసింప వలెను.

రాజ్యకామో మనూన్ దేవా న్నిర్ఋతిం త్వభిచరన్ యజేత్,
కామకామో యజే త్సోమ మకామః పురుషం పరమ్. ౬

రాజ్యకామః=రాజ్యమం దిచ్ఛగలవాఁడు, మనూన్ దేవాన్=మన్వంతరాధిపతులైన మనువుల నుపాసింపవలెను, అభిచరన్=శత్రువులమరణము నిచ్ఛించువాఁడు, నిర్ఋతిం=నిర్ఋతిని, కామకామః=భోగములను గోరుచున్నవాఁడు, సోమం=చంద్రుని, అకామః=ఏ కోర్కియును లేనివాఁడు, పరం=సర్వోత్తముఁడైన, పురుషం=పురుషుని, యజేత్=యజింపవలెను.

రాజ్యమును గోరెడువాఁడు మన్వంతరాధిపతులైన దేవతలను బూజింపవలెను. శత్రువినాశమును గోరువాఁడు వరుణుని, సమస్త భోగములను గోరువాఁడు చంద్రు నుపాసింపవలెను. అకామః=ఏ కోర్కియును లేనివాఁడు పరమపురుషుఁడైన మహావిష్ణువు నుపాసింపవలెను.

అకామ స్సర్వకామో వా మోక్షకామ ఉదారధీః,
తీవ్రేణ భక్తియోగేన యజేత పురుషం పరమ్ 10

అకామః = ఏ కోర్కెయును లేనివాఁడైనను, సర్వకామః = సమస్తమైన కోర్కులుగలవాఁడైనను, ఉదారధీః=ఉదారమైన బుద్ధిగల, మోక్షకామః వా= మోక్షమునం దాశగలవాఁడును, తీవ్రేణ=తీవ్రమైన, భక్తియోగేన=భక్తియోగముతో, పరమపురుషం=పరమపురుషుని గుఱించి, యజేత.

దేనియందును గోర్కెలేనివాఁడైనను సర్వాభిలాషియైనను లేక ఉదారబుద్ధిగల మోక్షకామియైనను తీవ్రమైన భక్తియోగముతో పరమపురుషుఁడైన శ్రీమహావిష్ణువునే యుపాసింపవలెను. అతఁడు సర్వశక్తుఁడు; సర్వదాత, పైనిఁజెప్పిన దేవతలలో నొక్కొక్క రొక్కొక్క ఫలమును మాత్రమే యొసఁగఁగలరు. పరమపురుషుఁడైన శ్రీమహావిష్ణువు ఐహికములైన సమస్తసుఖముల నొసఁగఁ జాలును. కడపటమోక్షప్రదానము గూడఁ జేయును. కనుక శ్రీమహావిష్ణు భజనమే సర్వోత్కృష్టము.

ఏతావానేవ యజతా మిహ నిశ్శ్రేయసోదయః,
భగవ త్యచలో భావో యద్భాగవత సంగతః. 11

భాగవతసంగతః = భగవద్భక్తులైన వారి సావాసముతో, భగవతి=భగవంతునియందు, అచలః=చలనము లేనట్టి, భావః=విచారము అనునది, యత్= ఏది గలదో, ఇహ=ఇక్కడ, యజతాం=యజించు వారియొక్క, నిశ్శ్రేయసోదయః=శ్రేయఃప్రాప్తి, ఏతావాన్ ఏవ=ఇదియే.

అవ: ముందు చెప్పిన నానాదేవతలయొక్క పూజాదికముల పరమఫలము భక్తియోగ ప్రాప్తియే యనుటను సిద్ధాంతీకరించుచున్నాఁడు.

ఈ లోకమం దే దేవతను ఏ కోర్కెతోఁ బూజించిన నా దేవతా ప్రసాదముతో నా ఫలము మాత్రమే సిద్ధించును. ఇట్టి ప్రయత్నముతో

మగుటయు సంభవించును. దానితో భగవద్భక్తులతో సంబంధ మేర్ప డును. ఆ సంబంధముతో భగవంతునియందు భక్తిభావ మేర్పడును. ఇదియే యితర దేవతోపాసనలతో నేర్పడెడు రెండవదైన ఫలము. తనకోర్కి సిద్ధించుట మొదటిఫలము. చిత్తశుద్ధిద్వారా భగవద్భక్తి యేర్పడుట రెండవఫలము.

జ్ఞానం యతః ప్రతినివృత్తగుణోర్మిచక్ర
మాత్మప్రసాద ఉతయత్ర గుణేష్వసంగః,
కైవల్య సమ్మతపథస్త్వథ భక్తియోగః
కో నిర్వృతో హరికథాసు రతిం న కుర్యాత్. 12

ప్రతినివృత్త గుణోర్మిచక్రం = సకలము నుండియు నివృత్తములైన గుణము లనెడు నూర్ములయొక్క సమూహముతోఁ గూడిన, యత్ = దేనియందు, జ్ఞానం = జ్ఞానమును, ఉత = తరువాత, ఆత్మప్రసాదః = అంతఃకరణనైర్మల్యమును, యత్ర = దేనియందు, గుణేషు = గుణములయందలి, అసంగః = సంగరాహిత్యమును, అథ = పిదప, కైవల్యసమ్మతపథః = కైవల్య మనెడు సమ్మతమైన మార్గముతోఁ గూడిన, భక్తియోగః = భక్తియోగము, భవతి = ఏర్పడునో, హరికథాసు = హరికథల యందు, నిర్వృతః = సుఖించియున్న, కః = ఎవఁడు, రతిం = ప్రీతిని, న కుర్యాత్ = చేయక యుండును?

అవ: భగవద్భక్తుల సంగతితో సిద్ధించెడు హరికథామాహాత్మ్య మును సూచించుచున్నాఁడు-

రాగము, ద్వేషము, జనన మరణములు, శోకములు, మోహ ములు, ఆఁకలి దప్పులు-ఈ మొదలైనవి గుణములయొక్క అన్యోన్య సమ్మేళనముతో నేర్పడెడు వికారములు. భక్తియందలి జ్ఞానము సిద్ధించు నపుడు గుణచలనములైన రాగాదివృత్తుల నుండి యుపశమ మేర్పడు చుండును. ఆ కారణముగా మనఃప్రసాదము అనుభవము లోనికి వచ్చును. దానితో గుణకార్యములైన దేహేంద్రియాదులందును వాని

మని పేరు. దీనితో మోక్షమునకు సదృశమైన యాచారము అనఁగా శ్రవణకీర్తనములు వీనితోఁగూడుకొన్న భక్తియోగ మావిర్భవించును. అది క్రమముగా నభివృద్ధిఁ జెందును. ఆ యభివృద్ధి ప్రయాసను లేకుండఁగనే మోక్షముఁ బొందుట కుపకరించును. ఈ విధములైన హరికథలయందు ఎవ్వరు ప్రేమను జెంచికొనరు? పురుషార్థప్రాప్తికి సులభమార్గమైన భక్తియోగముయొక్క యుత్పత్తికిఁ గారణమైన హరి కథలయందలి రతిని సంపాదించి కొనవలెను. ఇది యావశ్యకము.

**శ్రీ శౌనకః ఉవాచ :**

**ఇత్యభివ్యాహృతం రాజా నిశమ్య భరతర్షభః,**
**కిమన్యత్పృష్టవాన్ భూయో వైయాసకి మృషిం కవిమ్. 13**

**భరతర్షభః=భరతశ్రేష్ఠుఁడైన, రాజా=పరీక్షిత్తు, ఇతి=ఈ ప్రకారముగా, అభివ్యాహృతం=చెప్పఁబడిన దానిని, నిశమ్య=విని, భూయః=మఱల, ఋషిం= ఋషియు, కవిం=కవియునైన, వైయాసకిం=వ్యాసపుత్త్రునిఁ గూర్చి, అన్యత్= తర్వాతి విషయము, కిం పృష్టవాన్=ఏమని యడిగెను.**

శౌనకుఁ డన్నాఁడు- భరతకులమందు జన్మించిన మహాభాగ్య వంతుఁడగు పరీక్షిత్తు బ్రహ్మవేత్తయు, శబ్దబ్రహ్మరహస్యము దెలిసిన వాఁడునునై, వ్యాసపుత్త్రుఁడైన శుకుఁడు ముందుఁ జెప్పిన ప్రకార మును విన్నవాఁడై యా పిదప నేమని యడిగెను.

**ఏతచ్ఛుశ్రూషతాం విద్వన్! సూత నోఽర్హసి భాషితుమ్,**
**కథాహరికథోదర్కాః సతాం స్యుస్సదసి ధ్రువమ్. 14**

**విద్వన్ సూత!=విద్వాంసుఁడవైన యో సూతా!, శుశ్రూషతాం=వినుట యం దాశగలిగినట్టి, నః=మాకు, ఏతత్=ఈ విషయమును, భాషితుం=చెప్పు**

అవ: వినవలెనని కోరుచున్న దానికిఁ గారణమును జెప్పు చున్నాఁడు-

జ్ఞానవంతుఁడవైన యో సూతా! పరిక్షిత్తునకును శుకమహర్షి కిని జరిగిన సంభాషణములో హరికథలే ముఖ్యముగా వచ్చును. సజ్జనులకు సభలలో జరగు సంభాషణములలో తుచ్ఛములైన వృత్తాంతము లుండవుగదా? అందుచేతనే వీరిరువుర సంభాషణమును వినవలెనని కోరుచున్నమాకు దానిని వివరించుటకు నీ వర్హుఁడవు.

స వై భాగవతో రాజా పాండవేయో మహారథః,
బాలక్రీడనకైః క్రీడన్ కృష్ణక్రీడాం య ఆదదే. 15

మహారథః=వీరులలో శ్రేష్ఠుఁడును, మహారథుఁ డనిపించికొన్నవాఁడును, పాండవేయః = పాండవులవంశమందు జన్మించినవాఁడును నగు, సః రాజా= ఆ పరీక్షిత్తు, భాగవతః వై=పరమభాగవతుఁడనుట ప్రసిద్ధము, బాలక్రీడనకైః= బాల్యమందు ఆడుట కుంచికొనెడు పదార్థములచేత, కృష్ణక్రీడాం=కృష్ణునికి సంబంధించిన క్రీడను, యః ఆదదే=ఎవఁడు స్వీకరించెనో.

పాండవుల వంశమందు జన్మించిన పరీక్షిత్తు వీరవర్యులలో శ్రేష్ఠుఁడైన మహారథుఁడు. అంతమాత్రమే గాదు. అతఁడు పరమ భాగవతుఁడు. ఈ విషయము సుప్రసిద్ధమే. ఆ మహారాజు బాల్యమందుఁ దా నాడుకొను బొమ్మలతో కృష్ణచరిత్రకు సంబంధించిన క్రీడలనే యాడికొనెడివాఁడు.

వైయాసకిశ్చ భగవాన్ వాసుదేవపరాయణః,
ఉరుగాయగుణోదారాః కథాస్సన్తి స్మ సత్సమాగమే. 16

భగవాన్ వైయాసకిశ్చ = సిద్ధైశ్వర్యములు గలిగిన వ్యాస కుమారుఁడు శుకుఁడుగూడ, వాసుదేవపరాయణః = వాసుదేవునియందు గొప్పతాత్పర్యముగల వాఁడు, సతాం=సత్పురుషులయొక్క, సమాగమే=చేరికయందు, ఉరుగాయగుణో

కథాః స్యుర్హి=కథలేయుండును గదా।

జ్ఞానాదులైన సమస్త సద్గుణములకును నిలయమైనవాఁడు శుకబ్రహ్మ. అంతేగాఁదు. అతఁడు వాసుదేవుని యందుఁ బరిపూర్ణమైన భక్తిగలవాఁడు. ఇట్టి సత్పురుషుల సమాగమమందుఁ బుణ్యశ్లోకుఁడైన శ్రీమహావిష్ణువునకు సంబంధించిన కథలే యుండును. అతని భక్తవాత్సల్యము మొదలైన గుణములను ప్రకాశింపఁజేయు మహితములైన వృత్తాంతములనే పరస్పరము చర్చించికొందుము.

ఆయుర్హరతి వై పుంసా ముద్యన్నస్తమయన్నసౌ,
తస్యర్తే యత్ క్షణోనీత ఉత్తమశ్లోకవార్తయా 17

ఉత్తమశ్లోక వార్తయా = పవిత్రమైన కీర్తిగల శ్రీమహావిష్ణువు యొక్క వృత్తాంతముతో, యత్ క్షణః=ఏ క్షణము, నీతః=గడుపఁబడినదో, తస్య= ఆ మానవునియొక్క, అయుః ఋతే=ఆయుస్సు వినా, పుంసాం=తక్కిన వారి యొక్క, ఆయుః=ఆయుస్సు, ఉద్యన్=ఉదయించుచున్నవాఁడును, అస్తమయన్= అస్తమయమును బొందువాఁడు నైన, అసౌ=ఈ సూర్యుఁడు, హరతి=హరించు చున్నాఁడు.

అవ: వ్యర్థముగా క్షయించిపోవుచున్న యాయుస్సును సత్కథలతో సఫల మొనర్పఁ జూచుచున్నామని ప్రార్థించుచున్నాఁడు.

ఉదయాస్తమయములనుఁ బొందుచున్న యీ సూర్యుఁడు ఉత్తమశ్లోకుఁడైన శ్రీహరియొక్క కీర్తినిగూర్చి పాడుచున్న వారి యాయుస్సును మాత్రమే హరించుట లేదు. తక్కినవారి యాయుస్సనంతయు హరించుచున్నాఁడు. సూర్యుఁడందఱి యాయుస్సులను హరించునే కదా! నిజమే. కాని శ్రీహరి కీర్తన గావించు వారి యాయుస్సు నాశరహితమైన ఫలము నొసఁగున దగుటచే సఫలమగు చున్నది. తక్కినవారి జీవితము వృథాగాఁ గడచిపోవుచున్నదని పిండితార్థము.

తరవః కిం న జీవంతి భస్త్రాః కిం నశ్వసంత్యుత,
న ఖాదంతి న మేహంతి కిం గ్రామ్యాః పశవో పరే. 18

తరవః=వృక్షములు, న జీవంతి కిం?=జీవించుచుండుట లేదా, భస్త్రాః ఉత=కొలిమి తిత్తులును, న కింశ్వసంతి?=గాలిని లోపలికిఁ దీసికొనుట వదలుట యనుక్రియలను సేయుటలేదా, అపరే=తక్కిన, గ్రామ్యాః పశవః=గ్రామము లందున్న పశువులు, న ఖాదంతి కిం?=తినుటలేదా న మేహంతి కిం=విషయ సుఖముల ననుభవింపవా?

అవ: జీవించుట మాత్రమే బ్రదుకునకుఁ బ్రధానఫలము కాదనుచున్నాఁడు-

హరి భజన మొనర్పక గడపుకాలము వ్యర్థమే. చెట్లు గూడ జీవించుచున్నవి. కొలిమితిత్తు లుచ్ఛ్వాసనిశ్వాసము లొనర్చుచున్నవి. గ్రామముల యందలి పందులు మొదలైనవి యాహారమును స్వీకరించుచున్నవి. విషయసుఖము లనుభవింపుచున్నవి.

శ్వ విడ్వరాహోష్ట్రఖరైః స్సంస్తుతః పురుషః పశుః,
న యత్కర్ణపథోపేతం జాతు నామగదాభృతః. 19

గదాభృతః నామ=కృష్ణపరమాత్ముఁడనెడు పేరును, జాతు=ఒకసారి యైనను, యత్కర్ణపథోపేతం న=ఎవని కర్ణమార్గమునఁ బ్రవేశింపలేదో, సః పురుషః=అట్టి పురుషుఁడు, శ్వవిడ్వరాహోష్ట్రఖరైః=కుక్కలు, పందులు, ఉష్ట్రములు, గాడిదలు వీనితోఁబాటు, సంస్తుతః=పేర్కొనఁదగినట్టి, పశుః=మృగము.

ఎవ్వని కర్ణపథమందు కృష్ణనామ మొక్కసారియైనను బ్రవేశించి యెఱుఁగదో అట్టి వానికిని, కుక్క, పంది, ఉష్ట్రము, గాడిద మొదలైన జంతువులకును భేదమేమి? అట్టి మనుష్యు నెవ్వ రాదరింపరు.

వాఁడు సుఖదుఃఖములు, పాపపుణ్యము లనెడు బరువులు మోయుటచే గార్దభమువంటి వాఁడు.'

> బిలే బతోరుక్రమ విక్రమాన్ యే
> న శృణ్వతః కర్ణపుటే నరస్య,
> జిహ్వాఽసతీ దార్దురి కేవ సూత
> న చోపగాయ త్యురుగాయగాథాః. 20

నరస్య=మానవునియొక్క, యే కర్ణపుటే=ఏ శ్రవణపుటములు, ఉరుక్రమవిక్రమాన్ = వికంకట పరాక్రమముగలిగిన శ్రీమహావిష్ణువుయొక్క వీర్యాతిశయములను, న శ్రుణ్వతః=విననేరవో, తౌ=అవి, బిలే=గుహలవంటివి, బత=అయ్యో!, ఉరుగాయగాథాః=పవిత్రములైన కృష్ణుని గాథలను, న చ ఉపగాయతి=గానముసేయనట్టి జిహ్వా=నాల్క, దార్దురికేవ=కప్పకు సంబంధించిన నాల్కవలె, అసతీ=పనికిరానిది.

అవ: హరిభజనము సేయుని వాని యవయవములు గూడ నిష్ఫలము లనుచున్నాఁడు-

మహాపరాక్రమములను లోకమందుఁ బ్రకాశింపఁజేసిన భగవంతుని పలువిధములైన యుదారచేష్టితములు విననట్టి వాని కర్ణపుటములు పాములు వసించుటకు కర్హములైన పుట్టలోని రెండుద్వారములవంటివి. భగవత్కీర్తనమును గానము సేయుని వాని నాల్క కప్పనాల్కవలె నిష్ఫలములైన శబ్దముల నుచ్చరించుచు నమంగళకరమైనది. ఒక యింటిముందున్న పుట్టలో వసించు పాము ఆ గృహయజమానునే గఱచును. అట్లే యసత్కథాలాపములు వినెడి మానవుని కర్ణములు ఆ శరీరమందున్న జీవాత్మను నరకములోఁ ద్రోయును.

భారః పరం పట్టకిరీటజుష్ట
మప్యుత్తమాంగం న నమేన్ముకుందమ్,
శావౌకరౌ నో కురుతస్సపర్యాం
హరే ర్లసత్కాంచన కంకణౌ వా. 21

పట్టకిరీటజుష్టం అపి=పట్టకిరీటమును ధరించినదైనను, యదుత్తమాంగం= ఏ శిరస్సు, ముకుందం=ముక్తిదాతయైన శ్రీమహావిష్ణువునుగూర్చి, న నమేత్= నమస్కరింపదో అట్టి శిరస్సు, పరం భారః = కేవలము బరువే, లసత్కాంచన కంకణౌ=బంగారుమురుగులచేఁ గూడికొన్నవైనను, యౌ కరౌ=ఏ రెండుచేతులు, హరేః సపర్యాం న కురుతః=హరికి సపర్యలుసేయవో, అవి శావౌ=శవము నకు సంబంధించినవే.

పట్టుకిరీటముతోఁ గూడికొన్నను ఏ శిరస్సు ముక్తిదాతయైన పరమాత్మునికి నమస్కరింపదో అది మనుష్యునకుఁ గేవల భారమే. అట్లే స్వర్ణకటకా ద్యలంకృతములైనను ఏ కరములు శ్రీమహావిష్ణువును పూజింపవో అట్టి చేతులు శవమునకున్న చేతులే. ఆ చేతులతోఁ బితరులు పిండోదకములు గ్రహింపరు. దేవత లర్ఘ్యాదికములు స్వీకరింపరు.

బర్హాయితే తే నయనే నరాణాం
లింగాని విష్ణోర్న నిరీక్షతో యే,
పాదౌ నృణాం తౌ ద్రుమజన్మభాజౌ.
క్షేత్రాణి నానువ్రజతో హరేర్యౌ. 22

యే=ఏవి, విష్ణోః = శ్రీమహావిష్ణువుయొక్క, లింగాని = మూర్తులైన యర్చావతారములను, న నిరీక్షతః=చూచుటలేదో, నరాణాం=మనుష్యులయొక్క, తే నయనే = ఆ కన్నులు, బర్హాయితే = నెమలికన్నులవంటివి, యౌ = ఏవి, హరేః క్షేత్రాణి=హరి వసించు పుణ్యక్షేత్రములను, న అనువ్రజతః=పోవుటలేదో నృణాం=మనుష్యులయొక్క, తౌ పాదౌ=ఆ పాదములు, ద్రుమజన్మభాజౌ= చెట్టు జన్మలను బొందినట్టివే.

సర్వవ్యాపియైన భగవంతుని మూర్తులైన రామకృష్ణాద్యర్చావ తారముల నెవ్వఁడు సేవింపఁడో వానికన్నులు నెమలియీకల కన్నులే. పరమేశ్వరుఁడు వసించు పుణ్యక్షేత్రములకుఁ బయనింపని పాదములు వృక్షముల వంటివే.

జీవన్ శవో భాగవతాంఘ్రిరేణుం
న జాతు మర్త్యోఽభిలభేత యస్తు,
శ్రీవిష్ణుపద్యా మనుజ స్తులస్యాః
శ్వసన్ శవో యస్తు న వేదగంధమ్. ౨౩

యః తు=ఎవ్వఁడు, భాగవతాంఘ్రిరేణుం=భగవద్భక్తుల పాదధూళిని, జాతు=ఒకసారియైనను, న అభిలభేత=ప్రాపింపక యుండునో, సః మర్త్యః=ఆ మనుష్యుఁడు, జీవచ్ఛవః = జీవించియును శవమువంటివాఁడు, యః తు= ఎవఁడు, శ్రీవిష్ణుపద్యాః=శ్రీవిష్ణుపాదలగ్నమైయున్న, తులస్యాః=తులసియొక్క గంధం=గంధమును, న వేద = తెలియఁడో, సః మనుజః=ఆ మనుష్యుఁడు, శ్వసచ్ఛవః=ఉచ్ఛ్వాసనిశ్వాసములు గలిగిన శవము.

భగవద్భక్తుల పాదధూళి నొక్కసారియైనను తలపై ధరింపని వాఁడు ప్రాణమున్న శవమువంటివాఁడు. శ్రీమహావిష్ణువు పాదములను బూజించిన తులసి నాఘ్రాణింపని మానవుఁడు ఉచ్ఛ్వాసనిశ్వాసము లొనర్చెడి శవము.

తదశ్మసారం హృదయం బతేదం
యద్గృహ్యమాణై ర్హరినామధేయైః,
న విక్రియేతాథ ముఖే వికారో
నేత్రే జలం గాత్రరుహేషు హర్షః. 24

గృహ్యమాణైః=గ్రహింపఁబడుచున్న, హరినామధేయైః=హరినామముల చేత, యత్ = ఎందుచేత, గాత్రరుహేషు = రోమములయందు, హర్షః=సంతోష
ముము, నేత్రే = కంటియందు, జలం = జలము ...

హరి నామధేయముల నుచ్ఛరించునపుడు రోమాంచము, ఆనందబాష్పములు మొదలైన వికారములచేత నే హృదయము ఆర్ద్రమై ద్రవింపదో ఆ హృదయము రాతివలె మహాకఠిన మైనది. మనుష్య హృదయ మని తలంపఁ దగినది కాదు.

అథాభిధేహ్యంగ! మనోనుకూలం
ప్రభాషసే భాగవతప్రధానః,
యదాహ వైయాసకి రాత్మవిద్యా
విశారదో నృపతిం సాధు పృష్టః. 25

ఆత్మవిద్యావిశారదః = ఆత్మవిద్యయందు సమర్థుఁడును, సాధుపృష్టః = భక్తిపూర్వకముగా నడుగఁబడినవాఁడును నైన, వైయాసకిః = వ్యాసపుత్త్రుఁడైన శుకబ్రహ్మ, యత్ = దేనిని, ఆహ = చెప్పెనో, అంగ = పూజ్యుఁడవైన సూతా! తత్ = దానిని, అభిధేహి = చెప్పుము, భాగవతప్రధానః = భగవద్భక్తులలో శ్రేష్ఠుఁడ వైన నీవు, మనోనుకూలం = మనస్సున కనుకూలముగా, ప్రభాషసే = పల్కెదవు.

భక్తిహీనుఁడైనవాని శరీరావయవములు గూడ నిష్ఫలములై నశించిపోవును. అందుచేతఁ బూజ్యుఁడవైన ఓ సూతా! ఆత్మజ్ఞాని యైన శుకబ్రహ్మ పరీక్షిత్తు భక్తిపూర్వకముగా నడిగిన విషయము లే వేవో వానిని సమగ్రముగా మా కెఱిఁగింపుము. నీ సంభాషణములు మా మనస్సుల కెంతయో యానంద మొనఁగుచున్నవి.

మత్త్రయ వ్యాఖ్యాన విశేష మేమియు లేదు.

శ్రీపోతన్నగారు:

మానుషజన్మము నొందిన
మానవులకు లక్ష్యమావమరణులకు మహా
జ్ఞానులకుఁ జేయవలయు వి
ధానము విగదింపఁ బడియె ధరణీనాథా!

వ: వినుము. బ్రహ్మవర్చసకాముఁడైనవానికి వేదవిభుండగు చతుర్ముఖుండును, నింద్రియ పాటవకామునికి నింద్రుండును, బ్రజా కామునకు దక్షాది ప్రజాపతులును, భోజనకామునకు నదితియు, స్వర్గకామునికి నాదిత్యులును, రాజ్యకామునికి విశ్వదేవతలును, దేశ ప్రజాసాధనకామునికి సాధ్యులును, శ్రీకామునికి దుర్గయు, తేజ స్కామునకు నగ్నియు, ధనకామునకు వసువులును, వీర్యకామునకు వీర్యప్రదులగు రుద్రులును, నాయుష్కామునకు నశ్వినీ దేవతలును పుష్టికామునకు భూమియు, ప్రతిష్ఠాకామునికి లోకమాతలైన గగన భూదేవతలును, సౌందర్యకామునకు గంధర్వులును, కామినీకామున కప్సరసయగు నూర్వశియు, సర్వాధిపత్యకామునకు బ్రహ్మయు, కీర్తి కామునకు యజ్ఞోపాధికుండగు విష్ణువును, విత్తసంచయకామునకుం బ్రచేతసుండును, విద్యాకామునకు నుమావల్లభుండును, దాంపత్య ప్రీతికామునకు నుమాదేవియు, ధర్మార్థకామునకు నుత్తమశ్లోకుండగు విష్ణువును, సంతానకామునకుఁ బితృదేవతలును, రక్షాకామునకు యక్షులును, బలకామునకు మరుద్గణంబులును, రాజత్వకామునకు మనురూప దేవతలును, శత్రుమరణకామునకుఁ గోణపాలకుండైన రాక్షసుండును, భోగకామునకుఁ జంద్రుండును భజనీయు లగుదురు. మఱియు-

కామింపకయును సర్వము
గామించియునైన ముక్తిఁ గామించి తగన్,
లోమించి పరమపురుషుని
నేమించి భజించుఁ దత్త్వనిపుణుం డధిపా!.

అమరేంద్రాదులఁ గొల్చుభంగి జనుఁ డా యబ్జాక్షు సేవింపఁగా
విమలజ్ఞాన విరక్తిముక్తు లొదవున్, వేయేల భూనాథ! త
త్కమలాధీశ కథాసుధారస నదీకల్లోలమాలా పరి
భ్రమ మెవ్వారికినైన ఁగర్ణయుగళీపర్వంబు గాకుండునే?

వ: అని రాజునకు శుకుండు సెప్పె ననిన విని శౌనకుం
సూతున కిట్లనియె-

వర తాత్పర్యముతో నిటు
భరతాన్వయవిభుఁడు శుకునిపలుకులు విని స
త్వరతాయుతుఁడై శ్రేయ
స్కరతామతి నేమి యడిగె గణుతింపఁగదే.

ఒప్పెడి హరికథ లెయ్యవి
చెప్పెడి వోయనుచు మాకుఁ జిత్తోత్కంఠల్
గుప్పలు గొనుచున్నవి రుచు
లుప్పతిల స్నిగ్ధ మనోహరోక్తులు వినఁగన్.

వ: అనిన విని సూతుం డిట్లనియె-

తూలెడి కూఁకటితోడను
బాలురతో నాడుచుండి బాల్యమున మహీ
పాలుఁడు హరిచరణార్చన
హేలలతోడుతను నుండె నెంతయు నియతిన్.

వ: అట్టి పరమభాగవతుండైన పాండవేయునకు వాసు
పరాయణుండైన శుకుం డిట్లనియె.

వాసుదేవశ్లోకవార్త లాలింపుచుఁ
గాల మే పుణ్యుండు గడపుచుండు
నతని యాయువు దక్క నన్యుల యాయువు
నుదయాస్తమయముల నుగ్రకరుఁడు
వంచించి కొనిపోవు వాఁడది యెఱుఁగక
జీవింతుఁ బెక్కేండ్లు సిద్ధ మనుచు
వంగనా గేహవిత్తారామపుత్త్రాది

దగిలి వర్తింపఁ గాలము తటి యెఱింగి
దండధరకింకరులు వచ్చి తాడనములు
సేసి కొనిపోవఁ బుణ్యంబు సేయనైతిఁ
బాపరతి నైతి నని బిట్టుఁ బలవరించు.

వ: అది గావున-

అలరు జొంపములతో నత్యంతకషంబులై
బ్రతుకవే? వనములఁ బాదపములు
భాదవ మేఘనాదాంతులఁ బశువులు
జీవింపవే గ్రామ సీమలందు
వియతిపై నుచ్ఛ్వాస విశ్వాసపవనముల్
బ్రాపింపవే? చర్మభస్త్రికలును
గ్రామసూకర శునకశ్రేణి లింటింటఁ
దిరుగవే దుర్భోగ దీనవృత్తి

మస్తభారములు మోయవే యురుఖర్దములు
పుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువు
లడవులందు నివాసములందుఁ బ్రాణ
విషయభరవృత్తితో నుంట విఫల మధిప!

విష్ణుకీర్తనముల వినని కర్ణంబులు
కొండల బిలములు కువలయేశ!
చక్రివద్యంబులు చదువని జిహ్వలు
కప్పజిలహ్వలు కౌరవేంద్ర!
శ్రీమనోనాథు వీక్షింపని కన్నులు
కేకి పింఛాక్షులు కీర్తిదయిత!
కమలాక్షుపూజకుఁ గాని హస్తంబులు

హరిపద తులసీదళామోద రతిలేని
ముక్కు పందిముక్కు మునిచరిత్ర ।
గరుడగమను భజనగతిలేని పదములు
పాదపముల పాదపటల మవఘ ।

నారాయణుని దివ్య నామాక్షరములపై
గరఁగని మవములు గతిన శిలలు
మురవైరి కథలకు ముదితాశ్రురోమాంచ
మిళితమైయుండని మేను మొద్దు
చక్రికి మ్రొక్కని జడుని యాదలనున్న
కనక కిరీటంబు గట్టెమోపు
మాధవార్పితముగా మవని మానవుసిరి
వనదుర్గచంద్రికా వైభవంబు

కైటభారిభజన గలిగియుండనివాఁడు
గాలిలోననుండి కదలు శవము
కమలనాభుపదము గననివాని బ్రదుకు
పసిఁడికాయలోని ప్రాణిబ్రదుకు ।

అర్థములు: ధరణీనాథా! = పరీక్షి న్మహారాజా!, మానుష జన్మము నొందిన మానవులకున్ = ఏదో దైవయోగముచేత మనుష్య జన్మముఁ బొందిన జీవులకు, లభ్యమాన మరణులకున్ = పొందఁబోవు మరణము గలవారికి, మహాజ్ఞానులకున = గొప్ప జ్ఞానులకు, చేయ వలయు విధానము = అనుసరింపవలసిన పద్ధతి, నిగదింపఁబడియెన్ = నాచేఁ జెప్పఁబడినది.

తాత్పర్యము: ఏదో దైవయోగముచే మానుషజన్మమేర్పడును. ఆ జన్మ యేర్పడినను మరణము దప్పదు. కనుక మనుష్యజన్మము నందిన మనిషి యనుసరింపఁ దగిన పద్ధతి యేదో యింతకు ముందే చెప్పఁబడినది.

బ్రహ్మవర్చసకాముఁడు=బ్రహ్మతేజస్సును గోరుచున్నవాఁడు, వేదవిభుండు=వేదములను బ్రచారమునకుఁ దెచ్చినట్టి, చతుర్ముఖుండు =బ్రహ్మదేవుఁడును, ఇంద్రియపాటవకామునకున్ = ఇంద్రియముల యొక్క శక్తిని గోరువానికి ఇంద్రుఁడును, ప్రజాకామునకున్=సంతతిని గోరుచున్నవానికి, ప్రజాపతులగు దక్షాదులును, భోజనకామునకున్ = భోజ్యము భక్ష్యము మొదలైనవాని నిచ్ఛించువానికి, అదితియున్, స్వర్గకామునకున్=స్వర్గమునుగోరువానికి, ఆదిత్యులును=అదితి కుమారులైన ద్వాదశాదిత్యులును, రాజ్యకామునికిన్=రాజ్యమునుగోరువానికి, విశ్వదేవతలునున్, దేశ, ప్రజా, సాధనకామునికిన్=దేశమందలి ప్రజలు స్వాధీనము గావలెనని కోరువానికి సాధ్యులునున్, శ్రీకామునికిన్=ఐశ్వర్యమును గోరువానికి దుర్గయును, తేజస్+కామునకున్ = తేజస్సును గోరువానికి అగ్నియును, ధనకామునకున్ = ధనార్థియైనవానికి వసువులును, వీర్యకామునకున్ = వీర్యమును గోరుచున్నవానికి, వీర్యప్రదులు = వీర్యమునుగలిగించువారు- రుద్రులును, ఆయుస్+కాములు, ఆయుస్సును గోరువారు, అశ్వినీదేవతలును, పుష్టికామునకున్=శరీరపుష్టి గోరువానికి, భూమియున్, ప్రతిష్ఠాకామునకున్ = ప్రతిష్ఠ యనఁగా నున్నస్థానము నుండి జాఱిపోక నిలుకడగానుండుట, అట్టివానికి, లోకమాతలు = లోకమునకు పితృస్వరూపులైన గగన భూదేవతలును 'రోదసి' అనుట కిది తెనుఁగు. సౌందర్యకామునకున్ = గంధర్వులును, కామినీకామునకున=స్త్రీలను గోరువానికి, అప్సరసయగు నూర్వశియును, సర్వాధిపత్యకామునకున్ =సమస్తముపై నధికారము గావలెనని కోరువానికి, బ్రహ్మయును, కీర్తికామునకున్=సత్కీర్తిగావలె ననుకొనువానికి, యజ్ఞోపాధికుఁడు =యజ్ఞస్వరూపుఁడైన వాఁడు, విష్ణువును, విత్తసంచయకామునకున్=

డును = పరమేశ్వరుండును, దాంపత్య ప్రీతికామునకున్ = ఆలుమగల యన్యోన్యప్రీతిని గోరెడి వానికి, ఉమాదేవియును = పతివ్రతయైన పార్వతియును, ధర్మార్థకామునకున్ = ధర్మముచే నేర్పడెడు నర్థము గోరెడువానికి, ఉత్తమశ్లోకుండు = పవిత్రమైన కీర్తిగల విష్ణువును, సంతానకామునకున పితృదేవతలును, రక్షాకామునకున్ యక్షులు, బలకామునకున్=బలముగావలె ననుకొనువానికి, మరుత్ + గణంబు లును = మరుత్తులసమూహమును, రాజత్వకామునకున్ = రాజుగావలె ననుకొనువానికి, మనురూపదేవతలును, శత్రుమరణకామునకు, కోణ పాలకుండు=రాక్షసుల కధికారియైన నిర్ఋతి యను రాక్షసుండును, భోగకామునకున్=సౌఖ్యములను గోరువానికి, చంద్రుండును, భజ నీయులు=సేవింపఁ దగినవారు.

తాత్పర్యము: బ్రహ్మతేజస్సు కావలె ననుకొనువాఁడు వేద ప్రచారకుఁడైన బ్రహ్మనుసేవింపవలెను. బృహస్పతినని వైష్ణవవ్యాఖ్య. 'బార్హస్పత్యముక్ష వశమాలభేత' 'బ్రహ్మవర్చసకామో బృహస్పతి మేవ స్వేనభాగధేయే నోపధావతి, స ఏవాఽస్మిన్ బ్రహ్మవర్చసం దధాతి బ్రహ్మవర్చస్వ్యేవ భవతి' అని శ్రుతి. ఇంద్రియ పాటవ మును గోరువాఁడు ఇంద్రు నుపాసింపవలెను. 'ఇంద్ర మింద్రియ కామస్తు' అని మూలము, 'ఇంద్రియ పాటవకామః' అని శ్రీధరుల పాఠము. దానినే పోతన్న యనుసరించెను. వైష్ణవ వ్యాఖ్యలో 'ఇంద్రియకామః' అను దానికి 'ఇంద్రియజేతా' అని కలదు. 'ఇంద్రియకామ ఇంద్రియ మేవ స్వేనభాగధేయే నోపధావతి' అని శ్రుతి. ప్రజలను గోరువాఁడు, ప్రజాపతులనుగూర్చి యజింపవలెను. 'యః ప్రజాకామస్స్యాత్ తస్మా ఏవం ప్రాజాపత్యం గారుత్మతం చరుం నిర్వపేత్ ప్రజాపతిం' అని శ్రుతి. భోజనమును గోరువాఁడు అదితి నుపాసింపవలెను. స్వర్గకాముని కాదిత్యు లుపాస్యులు. రాజ్య కాముఁడు విశ్వదేవతలను గొలువవలెను. దేశమందలి ప్రజలు దనకు

నకు దుర్గ, తేజస్కామున కగ్ని, ధనకాముసకు వసువులు, వీర్య కామునకు వీర్యప్రదులగు రుద్రులు సేవింపఁదగినవారు. ఆయుష్కాముని కశ్వినీదేవతలు, పుష్టికామునకు భూమి, ప్రతిష్ఠాకామునకు లోకపితరులైన గగనభూదేవతలు భజనీయులు. సౌందర్యమును గోరువాఁడు, గంధర్వుల నుపాసింపవలెను. కామినీకాముఁ డూర్వశి నుపాసింపవలెను. సర్వాధిపత్యదాత బ్రహ్మ. యజ్ఞస్వరూపుఁడగు శ్రీమహావిష్ణువు సత్కీర్తి నొసఁగువాఁడు. ధనకాముఁడు వరుణుని గొల్వవలెను. పరమశివుఁడు విద్యాదాత. పతివ్రతయైన యుమాదేవి దాంపత్యఫలదాయిని. ధర్మమార్గముతో నర్థము గావలె ననుకొనువాఁడు పవిత్రమైన కీర్తిగల విష్ణువు నుపాసింపవలెను. సంతానకామునకుఁ బితరు లుపాస్యులు. రక్షాకాముఁడు యక్షులఁ గొల్వవలెను. బలమును గోరువానికి మరుద్గణము లాశ్రయణీయులు. రాజత్వకామునకు మన్వంతరాధిపతులైన మనువులు సేవ్యులు. శత్రుమరణము గావలె ననుకొనువాఁడు నిరృతి నర్చింపవలెను. యోగకామునకుఁ జంద్రుఁ డుపాస్యుఁడు.

అధిపా!=రాజా!, కామింపకయునుఁ=ఏమియుఁ గోరకయును సర్వముఁ గామించియుఁ బనఁ=సమస్తములైన కోర్కెలను గోరియైనను, ముక్తిఁ గామించి=మోక్షమును గోరి, తగఁ=తీవ్రమైన పట్టుదలతో, లోఁ గుంచి=మనస్సు గట్టిగా నిల్పుకొని, పరమపురుషునిఁ = శ్రీమహావిష్ణువును, నేమించి = తన భక్తితోవశము గావించికొన్నవాఁడై, తత్త్వనిపుణుఁడు=తత్త్వమును దెలిసికొన్న గొప్పవాఁడు, భజించుఁ=సేవించును.

తాత్పర్యము: ఏ కోర్కెయు లేకయైనను సమస్తమును గోరియైనను బరమార్థమును దెలిసికొన్నవాఁడు శ్రీమహావిష్ణువునే భజింపవలెను. మనస్సు నరికట్టి తీవ్రమైన భక్తియోగమును సాధింపవలెను.

అట్టి వానికిఁ బరమపురుషుఁడు వాఁడు కోరిన వన్నియు నొసఁగును. కడపట మోక్షమును గూడ నిచ్చితీరును.

భూనాథ!_ఓ రాజా, అమరేంద్రాదులఁ గొల్చు భంగిన్_దేవేంద్రాదులను సేవించినట్లుగా, జనులు=మానవులు, ఆ అబ్జాక్షున్_ఆ మహావిష్ణువును, సేవింపఁగాన్_కొలువఁగా, విమల=పవిత్రమైన, జ్ఞాన=జ్ఞానమును, విరక్తి=దానిచె సమస్తమునందును వైరాగ్యమును, ముక్తులు ఒదవున్=తత్ఫలముగా మోక్షము సిద్ధించును, వే యేల_అనే కములైన మాట లెందుకు? తత్=అట్టివాఁడైన, కమలాధీశ=కమలా నిలయుఁడైన శ్రీమహావిష్ణువుయొక్క, కథా=కథ లనెడు, సుధారస నదీ=అమృతమైన జలముగల నదియొక్క, కల్లోలమాలాపరిభ్రమము=అలల సమూహమునందుఁ దిరుగుట, ఎవ్వరికైనన్=ఎట్టివారికైనను కర్ణయుగళీపర్వంబు=శ్రవణద్వంద్వమున కుత్సవము, కాకుండునే?

తాత్పర్యము: ఓ రాజా! ఇంద్రుఁడు మొదలైన దేవతలఁ గొల్చుట వ్యర్థము. ఎందుకనఁగా నా కోర్కులన్నియు సర్వేశ్వరుఁడైన శ్రీమహావిష్ణువే దీర్చును. అంతమాత్రమే గాదు. అతని సేవతో స్వచ్ఛమైన జ్ఞాన మేర్పడును. ఆ జ్ఞానమునకు ఫలముగా వైరాగ్యము గల్గును. వైరాగ్యముతో సర్వ నిస్సంగత్వము తానై కల్గును. అప్పుడు ముక్తి తప్పక సిద్ధించును. అన్నిటికినిఁ గారణము తీవ్రమైన భక్తి యోగము, ఆ భక్తియోగమునకుఁ గీలకము హరికథాశ్రవణము. శ్రీమహావిష్ణువునకు సంబంధించిన కథలు అమృత మను జలముతోఁ గూడిన మహానదులు. దాని యలలలో మునిఁగితేలుట కెవ్వఁ డిచ్ఛింపఁడు? శ్రీమహావిష్ణువు పవిత్ర కథ లె మానవునకు శ్రవణోత్సవములు గావు? భక్తిప్రసంగము వచ్చినదే తడవు పోతనామాత్యుఁడు సుధా రసముతో సమానమైన సమాసములు వాఁడినాఁడు. భక్తిప్రసక్తి వచ్చి నపు డంతయుఁ బోతన్నయిట్లే విజృంభించును. అతని సమాసములు

ద్రాక్షాఫలములవలె మధురములై రసముల నీనుచుండును. ఈ సమాన కల్పనములను బెద్దనాదు లనుసరించుట కెంతయో ప్రయత్నించిరి.

ఈ రీతిగా శుకబ్రహ్మ రాజునకుఁ జెప్పిన విని శౌనకుఁడు సూతునితో నన్నాఁడు.

భరతాన్వయవిభుఁడు=భరతాన్వయమందుఁ బుట్టిన పరీక్షిత్తు, వరతాత్పర్యముతోఁ = శ్రేష్ఠమైన తత్పరత్వముతో, ఇట్లు=ఈ రీతిగాఁ బల్కిన, శుకుని పలుకులు విని=శుకబ్రహ్మ మాట లాలించి, సత్వరతాయుతుఁడై=చక్కఁగా నవలంబింపఁ దగిన త్వరతోఁ గూడినవాఁడై, శ్రేయస్కరతామతిన్=శ్రేయస్సును గల్గించెడు బుద్ధిచేత, ఏమి యడిగెన్=పై నేమని ప్రశ్నించెను, గణుతింపన్ కదే!=లెక్కించి చెప్పుము.

తాత్పర్యము: ఓయి సూతా! శుకబ్రహ్మ పల్కిన మాటలను బరీక్షిత్తు శ్రద్ధగా విన్నాఁడు. విన్నతర్వాత శుభమును గలిగించు త్వరతోఁ గూడినవాఁడై తనకును లోకమునకు శ్రేయస్సును గల్గించెడు బుద్ధితో మఱల నేమని ప్రశ్నించెను? దయచేసి మాకుఁ దెల్పుము.

ఈ కందపద్యము 'వరతా' యని యారంభింపఁబడినది. ప్రతి పాదము గూడ నిట్లే 'భరతా' 'త్వరతా' 'శ్రేయస్కరతా' యని యారంభింపఁ బడినది. ఇదియొక శబ్దాలంకారభేదము. ఛేకము.

ఒప్పెడు హరికథలు=యోగ్యములై హరికి సంబంధించినకథలు, ఎయ్యవి చెప్పెడినో యనుచున్=ఎట్టికథలు చెప్పునో యని, మాకున్ రుచు లుప్పతిలన్ = మాధుర్యము జనించునట్లుగా, నీ మనోహర+ఉక్తులు వినఁగన్=నీ మనోహరములైన మాటలు వినుటకు, చిత్తోత్కంఠల్ = మనస్సునందలి కౌతూహలములు, కుప్పలు గొనుచున్నవి = కుప్పలై యున్నవి.

తాత్పర్యము: సూతా! వినుట కర్హములైన విష్ణుకథ లేమేమి చెప్పునో యని మా మనస్సులఁ గౌతూహలములు గుప్పలుగా

న్నవి. మాధుర్యములు తెట్టువగట్టు నీమనోహరోక్తులను వినుటకుఁ జాల నాసక్తితో నున్నాము. దయచేసి విన్పింపుము.

అనిన విని సూతుండిట్లనియె_అప్పుడు సూతుఁ డిట్లని చెప్పెను.

తూలెడి కూఁకటితోడనుఁ = అటు నిటు చలించు అలకలతోఁ బాటు, బాల్యమునఁ=పసితనమందు, బాలురతోఁ ఆడుచుండి=చిఱుత వయస్సుగల బాలురతోఁ గ్రీడించుచున్నవాఁడై, ఎంతయుఁ నియుతిఁ _గొప్పపట్టుదలతో, హరిచరణార్చన హేలలతోడుతఁ=శ్రీమహావిష్ణువు పూజలకు సంబంధించిన మాటలతోనే, ఉండెఁ-

తాత్పర్యము: 'బాలక్రీడనకైః క్రీడన్ కృష్ణక్రీడాం య ఆదదే' అని మూలము. 'తూలెడి కూఁకటితోడను' మొదలగునవి పోతన్న కల్పనలు. మూలమునందలి భావముల కిది చక్కని పెంపు.

మొగముపైఁదూలెడు కూఁకటులుగల చిన్నవయస్సులోనే పరీక్షిత్తు భగవంతునందు గొప్పభక్తిని బ్రదర్శించెను. అతఁ డాటలలో శ్రీమహావిష్ణువు చరణసేవకు సంబంధించిన క్రీడలనే యాడుచుండెను.

పాండవేయుఁడు = పాండవ వంశమందు జన్మించినవాఁడు, వాసుదేవపరాయణుండు=వాసుదేవునియందే సర్వోత్కృష్టమైన భక్తి గలవాఁడు.

తాత్పర్యము: ఇట్టి భక్తుఁడైన పరీక్షిత్తును జూచి వాసుదేవుని యందే తీవ్రమైన భక్తిగల శుకబ్రహ్మ యి ట్లన్నాఁడు.

వాసుదేవ శ్లోకవార్తలు = కృష్ణపరమాత్మ కీర్తికి సంబంధించిన కథలు, ఆలింపుచున్=వినుచు, ఏ పుణ్యుండు = ఏ పుణ్య మొనర్చు కొన్న జీవి, కాలంబు గడపుచుండున్ = కాలమును వెళ్ళఁ బుచ్చు

మయములన్ = తన ఉదయాస్తమయములచేత, వంచించి కొనిపోవు
వాఁడు = మోసముచేసి హరించికొనిపోవును, అది యెఱుఁగక = ఆ
విషయమును దెలియక, పెక్కేండ్లు జీవింతున్=చాలసంవత్సరములు
బ్రదికెదను, సిద్ధము + అనుచున్=ఇది నిశ్చయమని, అంగనా=స్త్రీలు,
పుత్త్ర=పుత్త్రులు, గేహ=ఇండ్లు, ఆరామ=తోఁటలు, విత్తాది=ధనములు
మొదలైన, సంసారహేతుక = నిత్యసంసారమునకుఁ గారణములైన
వానియొక్క, సంగసుఖమున్=సంబంధముతోడి సుఖమును, తగిలి
వర్తింపన్=అంటిపెట్టుకొని బ్రదుకఁగా, కాలముతఱియెఱింగి=సమయ
మాసన్న మగుటను గమనించి, దండధరకింకరులు=యమభటులు,
వచ్చి=సమీపించి, తాడనములుసేసి కొనిపోవన్=తన్నుఁ దీసికొని
పోఁగా, పుణ్యంబుసేయనైతిన్=పుణ్యము నార్జింపనైతిని, పాపరతిన +
అయితిని=పాపమునం దాసక్తిగలవాఁడనుగా నైతిని, అని=ఈ విధ
ముగాఁ దలపోయుచు, బిట్టు = ఎక్కువగా, పలవరించుఁ=రోదన
మొనర్చును.

తాత్పర్యము: కృష్ణపరమాత్మకీర్తికి సంబంధించిన కథలను
వినుచు నే పుణ్యాత్ముఁడు కాలముగడపుచుండునో వానియాయువే
సార్థకమైనది. తక్కినవారి యాయుస్సును సూర్యుఁడు తనయుద
యాస్తమయములచేత వంచించి తీసికొనిపోవును. జీవుఁ డిది
యెఱుఁగఁడు. నే నింకను జాలసంవత్సరములు బ్రదికెదను. 'ఇది
నిజము' అనినమ్మి కూర్చుండును. దారలు, పుత్త్రులు, ఇండ్లు, తోఁటలు,
ధనములు మొదలైనవానిపై మమతలు పెంచికొనును. ఇవి శాశ్వ
తములని నమ్మి వానియం దాసక్తమైన మనస్సుతో కాలము గడపును.
వానికిఁ దెలియకయే మరణకాలము ప్రాప్తించును. వీఁ డొనర్చిన
పాపఫలముగా యమభటులు సమీపించి తిట్టుచుఁ దన్నుచుఁ దీసి
కొనిపోదురు. అప్పుడు అయ్యో! జీవిత మంతయుఁ బాపములతోనే
గడపితిని. పుణ్యము లొనర్పనైతిని అని బిట్టు పలవరించును.

ఈ సీసపద్యమునకు మూలము-

**ఆయుర్హరతి వై పుంసా ముద్యన్న స్తమ యన్నసౌ,**
**తస్యర్తే యత్ క్షణోనీతః ఉత్తమశ్లోక వార్తయా.**

అనునది. వీనిని బెంచి పోతన్న పెద్దసీసపద్యముగా వ్రాసెను. ఈ గ్రథనము మూలమునకు వ్యాఖ్యానప్రాయమై యున్నది.

అది గావునన్=అందువలన.

**వనములన్ పాదపములు** = అరణ్యములందు చెట్లు, అలరు జొంపములతోన్=పుష్పముల తఱచుదనములతో, అభ్రంకషంబులై= ఆకాశము నొఱయుచున్నవై, బ్రదుక వే-జీవించుట లేదా! గ్రామసీమ లందున్=గ్రామములయందు, ఖాదనమేహనాకాంక్షలన్=ఆహారమును దీసికొనుట విషయసుఖము లనుభవించుట మొదలగు కోర్కులతో, పశువులు, జీవింపవే=బ్రదుకుటలెదా?, నియతిమైన్=క్రమముగా, ఉచ్ఛ్వాసనిశ్వాసపవనముల్=బయటికి వదలుట లోనికిఁ దీసికొనుట మొదలగు గాలియొక్క సంచారములను, చర్మభస్త్రికలును=తోలు తిత్తులును, ప్రాపింపవే=పొందుటలేదా?, గ్రామసూకర=పల్లెలలోని పందులు, శునక=కుక్కలు వీనియొక్క, శ్రేణుల=గుంపులు, దుర్యోగ దీనవృత్తిన్ = దుష్టములైన చేష్టలతో నేర్పడెడు దీనమైన పద్ధతులతో, తిరుగవే = సంచరించుటలేదా?, ఉష్ట్రఖరములు = ఒంటెలు గాడిదలు మొదలైనవి, ఉరుభరములు మోయవా-గొప్ప బరువులు మోయుట లేదా?, పుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువులు = శ్రీమహావిష్ణువును దెలియలేని పురుషు లనెడు పశువులు, అడవులందు నెట్లో అట్లే నివా

తాత్పర్యము: పువ్వుల గుంపులతో నాకాశము నంటుచుం జెట్లడవులలోఁ బెరుఁగుచున్నవి. కొంతకాలము జీవించి నశించు చున్నవి. అట్లే యూళ్లయందును గొన్ని పశువులు జీవించుచున్నవి. వానిపనులు రెండే గ్రాసమును భుజించుట, సుఖము నందుట. తోలుతిత్తు లున్నవి. అవి క్రమముదప్పక గాలిని లోనికిఁ దీసికొని బయటికి వదలుచున్నవి. గ్రామములో పందులు, కుక్కలు మొదలైనవి దమ యాహారము కొఱకు నానాకష్టములఁ బడుచు జీవించును. ఒంటెలు, గాడిదలు బరువులు మోయుచు బ్రదుకును. ఇవేమి సాధించుచున్నవి? కేవలము జీవించుట మాత్రమే. వాసుదేవునిఁ గొలువనేరని పురుషపశువుగూడ నింతే ప్రాణధారణమునకు మాత్రమే జీవించుచున్నాఁడు. మృగము లడవులలో జీవించినట్లు వీఁడొకయిల్లు గట్టుకొని బ్రదుకుచున్నాఁడు. వాని బ్రదుకు లెట్లు నిష్ఫలములో వీని బ్రదుకుఁగూడ నింతే. అందుచేతనే వీఁడు పురుషపశువు.

కువలయేశ = భూమండలమునకు రాజైనవాఁడా!, విష్ణుకీర్తనములు వినని కర్ణంబులు=శ్రీమహావిష్ణుకథలను విననట్టి చెవులు, కొండలబిలములు = కొండలలోనిగుహలు, కౌరవేంద్ర!, చక్రిపద్యంబులఁ జదువనిజిహ్వలు=కృష్ణపరమాత్మకు సంబంధించిన పద్యములు చదువని నాల్కలు, కప్పలజిహ్వలు=కప్పల నాల్కలు, కీర్తిదయిత = కీర్తియే భార్యగాఁ గలిగినవాఁడా!, శ్రీమనోనాథుని=విష్ణువుయొక్క మూర్తిని, వీక్షింపని కన్నులు = చూడని నేత్రములు, కేకిపింఛ + అక్షులు=నెమలిపురులందున్న కన్నులవంటివి, సత్యవచన=సత్యమునే భాషించువాఁడా!, కమలాక్షు పూజకుఁ గాని హస్తంబులు = పుండరీకాక్షుని పూజకై వినియోగింపని చేతులు, శవముహస్తంబులు = పీనుఁగకున్న చేతులు, హరిపద = కృష్ణుని పాదములందు సమర్పింపఁబడిన తులసీదళ = తులసిదళములయొక్క, ఆమోదరతి = వాసన చూచుటయందలి ప్రేమలేని ముక్కు పందిముక్కు, మునిచరిత్ర! =

భజనగతిలేని పదముల్ = గరుడగమనుని భజనయం దుపయోగపడని కాళ్లు, పాదపముల పాదంబులను = వృక్షముల వ్రేళ్లవంటివి.

తాత్పర్యము: పరీక్షిద్రాజా! విష్ణుకీర్తనములు వినని చెవులు కొండగుహల వంటివి. కృష్ణపరమాత్మను గీర్తించెడి పద్యములు చదువని నాల్కలు కప్పలనాల్కలు. పరమపురుషుని యద్భావతారమును దర్శింపని కన్నులు నెమలిపురుల కన్నులు. శ్రీమహావిష్ణు పూజల కనుపడని చేతులు శవహస్తముల వంటివి. హరి పాదములందు సమర్పించు తులసీదళమును వాసనఁ జూచుట కిచ్ఛింపని ముక్కు పందిముక్కు. శ్రీమహావిష్ణు భజనగతిలో వినియోగపడని పాదములు వృక్షముల వేరులవంటివి.

నారాయణుని దివ్యనామాక్షరముల పైన్ = నారాయణుని దివ్య నామములందలియక్షరముల శ్రవణోచ్చారణములందు, కరఁగని మనములు = ద్రవింపని హృదయములు కఠినములైనరాళ్లు, మురవైరికథలకున్ = శ్రీమహావిష్ణు కథలు విన్నపుడు, ముదితాశ్రు = హర్ష బాష్పములు, రోమాంచ = గగుర్పాటు = వీనితో, మిళితమై యుండని మేను = కూడియుండని శరీరము, మొద్దు = శుష్కకాష్ఠము, చక్రికిన్ = విష్ణువునకు, మ్రొక్కని జడుని ఔదలఁ = నమస్కరింపని మూర్ఖుని శిరస్సుపైని ఉన్న, కనకకిరీటంబు = ప్రకాశించెడు బంగారుకిరీటము కట్టెమోపు, మాధవార్పితముగాన్ = విష్ణుసమర్పణముగా, మనని మానవుసిరి = జీవింపని నరుని సంపద, వనదుర్గచంద్రికావైభవంబు = అడవులలోని పాడువడిన కోటలలో ప్రకాశించు వెన్నెల. కైటభారి భజన గలిగియుండనివాఁడు = విష్ణుభజన సేయనివాఁడు, గాలిలోనఁ ఉండి కదలు శవము = గాలిలోపలనుండి కదలాడెడు శవమువంటివాఁడు, కమలనాభు పదముల్ = శ్రీమహావిష్ణువు పాదమును, కనని వాని బ్రదుకు వీక్షింపని వాని

తాత్పర్యము: నారాయణుని దివ్య నామాక్షరముల యొక్క శ్రవణకీర్తనములతో ద్రవింపని మనస్సులు కఠినశిలల వంటివి. శ్రీ మహావిష్ణువు కథలు విన్నప్పుడు హర్ష బాష్పములు పూని రోమాంచము ను ధరింపని శరీరము కఠినకాష్ఠము. కృష్ణునకు నమస్కరింపని వాని కిరీటము కట్టెమోపు. తన సంపద కృష్ణార్పితముగా నొనర్పని వానిధనము అడవులఁ గాచిన వెన్నెలవంటిది. భగవంతుని భజింపని వాఁడు లోపల గాలిని బెట్టుకొని తిరిగెడు శవము. శ్రీమహావిష్ణువు పాదములను దర్శింపని వాని బ్రదుకు పసిఁడికాయలో జీవించెడి ప్రాణిబ్రదుకు వంటిది.

పసిఁడికాయకు శబ్దరత్నాకరములో 'పొత్తినూలికాయ' యని యర్థమున్నది. ప్రయోగ మిదియే యిచ్చినాఁడు. పసిఁడిపురుగు అనుటకు పొత్తినూలికాయలో నున్న పురు గన్నాఁడు. పొత్తినూలి కాయ యనఁగా పట్టుపురుగు. తయారుచేసికొన్న కాయప్రయోగ మీ క్రిందిది.

తనకుఁ దాన బంధ మొనరించికొనియెడి
పొత్తి నూలికాయ పురుగు భంగి,
అగుణ మయ్యు సగుణతావ్యాప్తిఁ బొందు ప
రము ప్రకృతిగుణము సంక్రమించి.

కనుక, పసిఁడికాయ=పట్టుకాయ.

పుట్టపర్తి నారాయణాచార్యదాసునిచే విరచింపఁబడిన
'శ్రీ భాగవత సుధాలహరి' యందు ద్వితీయ
స్కంధమున మూఁడవ యధ్యాయము
వ్యాఖ్య ముగిసినది.

# భాగవత సుధాలహరి

## ద్వితీయ స్కంధము

## చతుర్థాధ్యాయము

* * *

శ్రీ సూత ఉవాచ :

> వైయాసకేరితి వచస్తత్త్వ నిశ్చయమాత్మనః,
> ఉపధార్య మతిం కృష్ణే ఔత్తరేయస్సతీం వ్యధాత్. 1

ఔత్తరేయః=ఉత్తరాదేవికొడుకైన పరీక్షిత్తు, ఆత్మనః=పరమాత్మయొక్క, తత్త్వనిశ్చయం=తత్త్వమును నిశ్చయించెడు వట్టి, వైయాసకేః = వ్యాసపుత్రుఁడైన శుకబ్రహ్మయొక్క, ఇతి వచః=ఈ ప్రకారమైన వాక్కును, ఉపధార్య= చక్కఁగా ఆకళించుకొన్నవాఁడై, సతీం=శోభనమైన, మతిం=బుద్ధిని కృష్ణుని యందు, వ్యధాత్=ఎక్కువగా నుంచెను.

అవ: పరీక్షిన్మహారాజు ప్రశ్నించిన సృష్ట్యాదులైన యీశ్వర లీలలను శుకుఁడు బ్రహ్మయు నారదుఁడును జేసికొన్న సంవాద ముఖముగా బోధింపఁబడిన దానిని సూతుఁడు శౌనకాదిమునులకుఁ జెప్పుచున్నాఁడు. పరీక్షిత్తు చేసిన ప్రశ్నకు నారంభప్రాయముగా రాజుయొక్క అప్పటి మనస్థితిని వర్ణించుచున్నాడు-

పరమాత్ముని స్వరూపమును జక్కఁగా బోధించుటకుఁ దగిన విధముతో వైయాసకియైన శుకబ్రహ్మ చెప్పిన విషయమును బరీక్షిత్తు

స్థైర్యమునకు వచ్చి, బుద్ధిని నిర్విషయముగనుంచి నిలిపి
కొన్నాఁడు. పరమానందప్రదుఁడును శుద్ధసత్త్వస్వరూపుఁడైన కృష్ణు
నందే మనస్సును లగింపఁజేసినాఁడు.

ఆత్మజాయా సుతాగార పశుద్రవిణ బంధుషు,
రాజ్యే చావికలే నిత్యం నిరూఢాం మమతాం జహౌ. ౭

ఆత్మా=దేహము, జాయా=భార్య, సుత=పుత్రులు, అగార=గృహములు, పశు=తురగ వృషభాది పశువులు, ద్రవిణ=ధనము, బంధుషు=బంధువులు-వీని యందును, అవికలే=పూర్ణమైన, రాజ్యే=రాజ్యమందును, నిరూఢాం=పూర్తిగాఁ బాదుకొన్నట్టి, మమతాం=మమతను, జహౌ=విడిచెను.

శరీరము, భార్యా పుత్త్రాదులు, రాజ్యము, గజాదులైన మృగ ములు, భండారము, బంధువులు పరిపూర్ణమైన రాజ్యము-వీనిపై చాల కాలమునుండి గాఢముగా పాదుకొన్న మమతను, ఇవన్నియు నావి యను బుద్ధిని వదలుకొన్నాఁడు. ఇవేవియు నావి గావని నిశ్చయించి కొన్నాఁడు. తనకు వీనితోడి సంబంధము, వీనికిఁ దనతోడి సంబం ధము తాత్కాలికమైనది. అవాస్తవము. ఈ నిశ్చయముతో నాతఁడు వీనినుండి పూర్తిగా మనస్సును మరలించికొనెనని తాత్పర్యము.

పప్రచ్ఛ చేమమేవార్థం యన్మాం పృచ్ఛత సత్తమాః,
కృష్ణానుభావ శ్రవణే శ్రద్దధానో మహామనాః. ౮

సత్తమాః=సత్పురుషులలో సర్వోత్తములారా, యూయం=మీరు, యత్ దేనిని, మాం=నన్నుద్దేశించి, పృచ్ఛత=అడిగితిరో, ఇమం అర్థం ఏవ=ఈ యర్థ మునే, కృష్ణానుభావ శ్రవణే=కృష్ణమాహాత్మ్యమును వినుటయందు, శ్రద్దధానః =శ్రద్ధగల వాఁడును, మహామనాః=ఉదారమైన మనస్సుగల పరీక్షిత్తు, పప్రచ్ఛ= అడిగెను.

ఓ సత్పురుషులారా! మీ రడుగుచున్న శ్రీహరి లీలాస్వరూప మైన యీ ప్రశ్ననే శ్రీకృష్ణప్రభావము వినుటయందు పరమాసక్తుఁ

విషయమును దెల్పుటకే 'మహామనాః' అనుశబ్దము వాడఁబడినది.

> సంస్థాం విజ్ఞాయ సన్న్యస్య కర్మ త్రైవర్గికం చ యత్,
> వాసుదేవే భగవతి హ్యాత్మభావం పరం గతః, 4

సంస్థాం_మరణమును, విజ్ఞాయ_తెలిసికొని, త్రైవర్గికం_మూఁడు పురుషార్థములకు సంబంధించిన, యత్కర్మ_ఏ కర్మగలదో, తత్_దానిని, సన్న్యస్య_ఉపేక్షించి, భగవతి_భగవంతుఁడైన, వాసుదేవే_వాసుదేవునియందు, ఆత్మభావం_ఆత్మభావమును, దృఢం_దృఢముగా, గతః_ప్రాప్తించినవాఁడయ్యెను.

తన శరీరావసానము ఇట్టిదని తెలిసికొన్నాఁడు పరీక్షిత్తు.

యథేదం సృజతే విశ్వం దుర్విభావ్య మధీశ్వరః. 6

అధీశ్వరః=సర్వేశ్వరుఁడు, దుర్విభావ్యం=ఊహించుట శక్యముకానట్టి, ఇదంవిశ్వం=ఈ సమస్తవిశ్వమును, భగవాన్=షడ్గుణైశ్వర్యశాలియైన యాతఁడు, ఆత్మమాయయా=తన శక్తిని స్వీకరించి, యథా సృజతే=ఎట్లు సృష్టించునని, భూయ ఏవ=మఱల, వివిత్సామి=వినఁ గోరుచున్నాను.

ఓ భగవంతుఁడైన శుకమునీ! బ్రహ్మాదులైన యీశ్వరులును ఈ విశ్వస్థితిని గుఱించి యూహింపలేరు. శ్రీహరి తనశక్తిని గొని యీ విశ్వమును సృష్టించుపద్ధతి యేది? ఈ విషయమును మఱలఁ జక్కఁగా నెఱుఁగుట కిచ్ఛించుచున్నాను.

యథా గోపాయతి విభుః యథా సంయచ్ఛతే పునః,
యాం యాం శక్తి ముపాశ్రిత్య పురుశక్తిః పరః పుమాన్. 7

విభుః=సర్వత్ర వ్యాపించినవాఁడును, పురుశక్తిః=గొప్పశక్తిగలవాఁడునైన, పరం పుమాన్=పరమపురుషుఁడు, యాం యాం శక్తిం=ఏ యే శక్తిని, ఉపాశ్రిత్య=స్వీకరించి, యథా గోపాయతి=ఎట్లీ విశ్వమును రక్షించునో, యథా సంయచ్ఛతే=ఎట్లు సంహరించునో, క్రీడన్=క్రీడించుచున్నవాఁడై, యథాకరోతి=ఎట్లు నిర్మించునో, ఆత్మానం=తన్ను, క్రీడయన్=ఆటలాడించికొనుచున్నవాఁడై యథా వికరోతి=ఎట్లు వైవిధ్యమును బొందుచున్నాఁడో.

పరమాత్ముఁడు సర్వనియామకుఁడు. ఆ పరమపురుషుఁడు సర్వశక్తుఁడు. ఏ యే శక్తి నాశ్రయించి యాతఁ డీ లోకమును రక్షించును? సంహరించును? ఎట్లు బ్రహ్మాదిస్వరూపుఁడై తన్ననేకరీతులుగాఁ బ్రదర్శించికొనును? ఆ రూపములతో ననేక లీలల నొనర్చు ప్రకారమెట్లు?

ఆత్మానం క్రీడయన్ క్రీడ న్కరోతి వికరోతి చ,
నూనం భగవతో బ్రహ్మన్ హరే రద్భుతకర్మణః.

దుర్విభావ్య మివాభాతి కవిభిశ్చాపి చేష్టితమ్. 8

బ్రహ్మన్ = బ్రహ్మజ్ఞానియైన శుకమహర్షీ, అద్భుత కర్మణః = పరమాద్భుతములైన కర్మల నొనర్చుచున్న, హరేః = హరియొక్క, చేష్టితం = వ్యాపారమును, కవిభిః అపి చ = పరమజ్ఞానుల చేతనైనను, దుర్విభావ్యం ఇవ = ఊహించుట కశక్యమైనదైనట్లుగా, ఆభాతి = కన్పించుచున్నది.

బ్రహ్మస్వరూపమును దెలిసినవాఁడవైన యోగీ! భగవంతుని చెయిదము లత్యాశ్చర్యకరములైనవి. ఆతనివ్యాపారములు బ్రహ్మాదులకును నాలోచించిన తెలియ నశక్యములైనవిగాఁ దోఁచుచున్నవి.

యథా గుణాంస్తు ప్రకృతే ర్యుగపత్క్రమశోపి వా,
బిభర్తి భూరిశస్త్వేకః కుర్వన్కర్మాణి జన్మభిః. 9

ఏకః = ఒకఁడైన పరమపురుషుఁడు, జన్మభిః = జన్మములను స్వీకరించి, భూరిశః = అనేకములుగా, కర్మాణి = కార్యములను, యుగపత్ = ఒకసారిగనే, కుర్వన్ = చేయుచున్నవాఁ డగునో, క్రమశః = క్రమముగాఁ జేయుచున్నవాఁ డగునో, ప్రకృతేః = ప్రకృతియొక్క, గుణాన్ = గుణములను, యథా బిభర్తి = ఎట్లు ధరించుచున్నాఁడో (వివరింపుము).

పురుషరూపుఁడై యొంటిగాఁ బ్రకాశించుచున్న భగవంతుఁడు బ్రహ్మాది బహుజన్మముల నొకే సమయమందు స్వీకరించునో, క్రమముగా స్వీకరించునో, ప్రకృతిగుణముల నెట్లు ధరించునో తెల్పవలెను.

విచికిత్సిత మేతన్మే బ్రవీతు భగవాన్ యథా,
శాబ్దే బ్రహ్మణి నిష్ణాతః పరస్మింశ్చ భవాన్ ఖలు. 10

మే = నా యొక్క, ఏతత్ = ఈ, విచికిత్సితం = సంశయమును, బ్రవీతు = నీవు చెప్పెదవు గాక, శాబ్దే బ్రహ్మణి = శబ్దబ్రహ్మమును, పరస్మిన్ బ్రహ్మణిచ = పరబ్రహ్మవిషయమందును, నిష్ణాతః = పరిపూర్ణుఁడవు (నీవు).

ఓ భగవంతుఁడా! నీవు నా సందేహములకు సమాధానమొసఁగవలెను. నివు శబ్దబ్రహ్మమందుఁ బరిపూర్ణుఁడవు. ఆత్మజ్ఞానమందు నిష్ణాతుఁడవు.

శ్రీ సూత ఉవాచ:

ఇత్యుపామన్త్రితో రాజ్ఞా గుణానుకథనే హరేః,
హృషీకేశ మనుస్మృత్య ప్రతివక్తుం ప్రచక్రమే. 11

రాజ్ఞా=రాజుచేత, హరియొక్క, గుణానుకథనే=గుణములను వివరించుట యందు, ఇతి=ఈ రీతిగా, ఉపామన్త్రితః=ప్రార్థింపఁబడినవాఁడై, హృషీకేశం =సమస్తేంద్రియములను నడపించు భగవంతు నుద్దేశించి, అనుస్మృత్య=ధ్యానిం చినవాఁడై, ప్రతివక్తుం=బదు లొసఁగుటకు, ప్రచక్రమే=ఆరంభించెను.

సూతుఁ డన్నాఁడు: శ్రీహరి గుణగణములను వర్ణింపవలెనని పరీక్షిత్తుచే నీ ప్రకారము ప్రార్థింపఁబడిన శుకబ్రహ్మ సమస్తేంద్రియ ములను నా యా వ్యాపారములయందుఁ బ్రేరేపించెడు శ్రీహరిని స్మరించి బదు లొసఁగుట కుద్యుక్తుఁ డైనాఁడు.

శ్రీ శుక ఉవాచ:

నమః పరస్మై పురుషాయ భూయసే,
సదుద్భవస్థాన నిరోధలీలయా,
గృహీతశక్తి త్రితయాయ దేహినా
మన్తర్భవాయానుపలక్ష్య వర్త్మనే. 12

సదుద్భవస్థాన నిరోధలీలయా=సత్తైన ప్రపంచముయొక్క ఉత్పత్తి పరి పాలనము, సంహారము ననెడులీలచేత, గృహీతశక్తిత్రితయాయ=గ్రహింపఁబడిన మూఁడుశక్తులు గలవాఁడును, దేహినాం=దేహులయొక్క, అంతర్భవాయ=లోపల నున్నవాఁడును, అనుపలక్ష్యవర్త్మనే=చూచుటకును ఊహించుటకును నసాధ్యము లైన మార్గములతోఁ గూడినవాఁడును, భూయసే=అపరిచ్ఛిన్నుఁడునునైన, పరస్మై పురుషాయ=పరమపురుషుని కొఱకు, నమః=నమస్కారము.

శుకుఁడు ఇష్టదేవతా గురునమస్కారాదిరూపమైన మంగళము నాచరించుచున్నాఁడు-

లోకముయొక్క సృష్టి స్థితి సంహారములకై ప్రకృతియొక్క రజస్సు, సత్త్వము, తమస్సు ననెడు మూఁడు గుణముల నంగీకరించి బ్రహ్మ విష్ణు మహేశ్వరులను మూఁడు మూర్తులను గ్రహించి సర్వ ప్రాణుల యంతర్భాగములం దంతర్యామియై వసించువాఁడును, అపరిచ్ఛిన్నుఁడును నైన పరమపురుషునకు నమస్కారము.

> భూయో నమస్సద్వృజినచ్ఛిదే౽సతా
> మసంభవాయాఖిలసత్త్వమూర్తయే,
> పుంసాం పునః పారమహంస్య ఆశ్రమే
> వ్యవస్థితానా మనుమృగ్యదాశుషే. 13

సద్వృజినచ్ఛిదే=సత్పురుషుల పాపములను హరించువాఁడును, అసతాం =అసత్పురుషులయొక్క, అసంభవాయ=నాశముకొఱకై, అఖిలసత్త్వమూర్తయే =సమస్త దేవతామూర్తులను స్వీకరించినవాఁడును, పారమహంస్యే = పరమహంసలకు సంబంధించినది యైన, ఆశ్రమే = ఆశ్రమమందు, వ్యవస్థితానాం = ఉన్నట్టి, పుంసాం=పురుషులకు, అనుమృగ్యదాశుషే=అన్వేషణ ఫలమును నిచ్చుచున్నవాఁడును నైన పరమపురుషునకు, భూయో నమః=మఱల నమస్కారము.

అవ. విచిత్రఫలదాతయైన భగవంతుని మహిమను స్మరించికొని మఱల నమస్కరించుచున్నాఁడు-

వేదోక్తములైన ధర్మముల ననుష్ఠించు వారియొక్క సమస్త పాపములను నశింపఁజేయువాఁడు వాఁడే. అధర్మిష్ఠుల వినాశమునకై యా యా కర్మల నిచ్చెడి సకల దేవతాస్వరూపములను స్వీకరించినదియును వాఁడే. పరమహంసాశ్రమమందుండి పరమాత్మ స్వరూపమును నన్వేషించువారికిఁ దన యా స్వరూపమును జూపించువాఁడును వాఁడే. పరమగురువైన యట్టి భగవంతునకు నమస్కారము.

నమో నమస్తే స్త్వృషభాయ సాత్వతాం
విదూరకాష్ఠాయ ముహుః కుయోగినామ్,
నిరస్త సామ్యాతిశయేన రాధసా
స్వధామని బ్రహ్మణి రంస్యతే నమః. 14

సాత్వతాం=భక్తులకు, ఋషభాయ=జ్ఞానప్రకాశకుఁడును, కుయోగినాం=కుత్సితయోగులకు, ముహుః=మఱల మఱల, విదూరకాష్ఠాయ=చాల దూరమం దున్న స్థితిగలవాఁడును, నిరస్తసామ్యాతిశయేన=సమముగాని యతిశయముగాని లేనట్టి, రాధసా=ఐశ్వర్యముతో, స్వధామని=తన స్వరూపమైన, బ్రహ్మణి=బ్రహ్మస్థితియందు, రంస్యతే=రమించుచున్న వాఁడును నైన, పరమపురుషుని కొఱకు, నమో నమః= మఱల మఱల నమస్కారము.

భక్తుల హృదయములం దాత్మజ్ఞానమును బ్రకాశింపఁజేయు వాఁడు వాఁడే. కుయోగు లెంత ప్రయత్నించినను దెలియఁబడరాని దూరమందున్న వాఁడు వాఁడే. తనకు సమమో అతిశయమో లేనట్టి యైశ్వర్యముతోఁ గూడినవాఁడును, స్వస్వరూపమైన బ్రహ్మస్థితియందు నిరంతరము నానందించుచుండెడి భగవంతుఁడైన పరమపురుషునకు నమస్కారము.

యత్కీర్తనం యత్స్మరణం యదీక్షణం
యద్వందనం యచ్ఛ్రవణం యదర్హణమ్,
లోకస్య సద్యో విధునోతి కల్మషం
తస్మై సుభద్రశ్రవసే నమో నమః. 15

యత్కీర్తనం=ఎవని కీర్తనమును, యత్స్మరణం = ఎవని స్మరణమును, యదీక్షణం=ఎవని యీక్షణమును, యద్వందనం=ఎవని వందనమును, యచ్ఛ్రవణం=ఎవనికి సంబంధించిన శ్రవణమును, యదర్హణం = ఎవని పూజనమును, లోకస్య=ప్రపంచముయొక్క, కల్మషం=పాపమును, సద్యః=అప్పుడే, విధునోతి=నశింపఁజేయునో, సుభద్రశ్రవసే=మంగళకరమైన కీర్తిగల, తస్మై=అట్టి పర మాత్మకొఱకు, నమః=నమస్కారము.

విషయమును స్మరించికొని నమస్కరించుచున్నాఁడు-

ఎవని కథాకీర్తనమును, రూపస్మరణమును, మూర్తి దర్శనమును, వందనమును, కథాశ్రవణమును, పూజనమును సమస్త ప్రపంచ కిల్బిషములను ఆ క్షణమందే హరించునో సర్వమంగళకరమైన కీర్తితోఁ గూడిన యా పరమాత్మకు నమస్కారము.

విచక్షణా యచ్చరణోపసాదనా
త్సంగం వ్యుదస్యోభయతోంతరాత్మనః.
విందంతి హి బ్రహ్మగతిం గతక్లమా
స్తస్మై సుభద్రశ్రవసే నమో నమః. 16

విచక్షణాః=వివేకము గలవారు, యచ్చరణోపసాదనాత్=ఎవని పాదపద్మములను శరణుఁ జొచ్చుటచేత, అంతరాత్మనః=మనస్సుయొక్క, ఉభయతస్సంగం=ఉభయలోకములకు సంబంధించియున్న సంగమును, వ్యుదస్య=పోఁగొట్టుకొన్నవారై, గతక్లమాః=శ్రమరహితులై, బ్రహ్మగతిం=బ్రహ్మగతిని, విందంతి=పొందుచున్నారో.

ఆత్మానాత్మవివేకము గలవారు విచక్షణు లనిపించికొందురు. వారు ఆత్మస్వరూపుఁడైన శ్రీమహావిష్ణువు పాదములనే సర్వభావముతో శరణుఁ జొత్తురు. ఉభయ లోకములందున్న భోగకాంక్షలను మనస్సున నిరాకరింతురు. అట్టివారు కష్టలేశమును లేక బ్రహ్మైక్యభావము నందెదరు. అట్టి లోకమంగళకరమైన కీర్తిగల భగవంతు నుద్దేశించి నమస్కారము.

తపస్వినో దానపరా యశస్వినో
మనస్వినో మంత్రవిద స్సుమంగళాః,
క్షేమం న విందంతి వినా యదర్పణం
తస్మై సుభద్రశ్రవసే నమో నమః. 1

తపస్వినః = తపస్సునందు శ్రద్ధగలవారు, దానపరాః = దాన మొసఁగుట యందుఁ దాత్పర్యము గలవారు, యశస్వినః = కీర్తిని సంపాదించి కొనుటయే పరమధ్యేయమైనవారు, మనస్వినః = పరమయోగులు, మంత్రవిదః = మంత్రానుష్ఠాన ముతో బ్రహ్మతత్త్వమును దెలిసికొనవలె ననువారును, సుమంగలాః = సదాచారము ననుష్ఠించువారు, యదర్పణం వినా = ఆ ఫలమును భగవంతున కర్పించుట యను కార్యము లేనిది, క్షేమం న విందంతి = క్షేమమును బొందలేరో!, సుభద్రశ్రవసే తస్మై నమో నమః.

అవ: భక్తి లేనివారు ఏది సాధించినను ఫలము లేదు. ఈ విషయమును బ్రకాశింపఁ జేయుచు భగవంతునకు నమస్కరించు చున్నాఁడు-

తపస్సు, దానము, యశస్సు-వీనికిఁ గారణమైన వీర్య, శౌర్య, పాండిత్యాదులును, అష్టాంగయోగము, మంత్రము, సదాచారము-వీని నన్నిటిని సర్వేశ్వరునకు సమర్పించిననే తత్పరమ ఫలభూతమైన సుఖ మేర్పడును. అట్లర్పింపనిచో నివన్నియు వ్యర్థములే. ఇట్టి సర్వోన్నతమైన కీర్తిగల భగవంతునకు నమస్కారము.

కిరాత హూణాంధ్ర పుళిందపుల్కసా
ఆభీర కంకా యవనాః కషాదయః,
యేఽన్యే చ పాపా యదుపాశ్రయాశ్రయా
శ్శుధ్యంతి తస్మై ప్రభవిష్ణవే నమః. 18

కిరాత = మృగములను వేఁటాడి బ్రతుకు వననివాసులు, హూణ = ద్వీపాంతరములందు వసించుచు యోగ్యాయోగ్యతా విచక్షణలేక సర్వమును భక్షించుచు బ్రదుకువారు, ఆంధ్ర = నీచజాతులకుఁ జెందిన యాంధ్రులనువారు, పుళింద = కిరాతులలో నొకజాతి, పుల్కసాః = పశుహింస నొనర్చెడి నీచులు, ఆభీర = పశువులపై నాధారపడి జీవించెడి జాతి, కంకాః = కాకులు గాడిదలు మొదలైనవాని మాంసము దినెడు జాతి, యవనాః = యవనదేశములకుఁ జెందినవారు, కషాదయః = కషాదినీచ

...జాతు లున్నవో అవి, యదపాశ్రయాశ్రయాః=భగవంతు నాశ్రయించియున్న భక్తులయొక్క యాశ్రయమును సంపాదించికొన్నవారై, శుధ్యంతి=పాప విముక్తులై పవిత్రతను బొందుదురో, ప్రభవిష్ణవే=అట్టి సర్వమువకును ప్రభువైన, తస్మై=అ వాసుదేవ పరబ్రహ్మము కొఱకు, నమః=నమస్కారము.

క్రూరములును, సాత్త్వికములును నైన మృగములను వధించి వాని మాంసముతో జీవించు కిరాతులు, సదాచారరహితులై ద్వీపాంతరములలో నివసించు విచక్షణలేని జీవితమును గడపు హూణులు, వంశశుద్ధిలేక యనేక నీచజాతుల కలయికతో నేర్పడిన యాంధ్రులు, అడవులలో వసించు పుళిందులు, పశ్వాదులను వధించి జీవించు పుల్కసులు, కాకులు, గాడిదలు మొదలైనవానిని దిని జీవించు కంకులు, యవనదేశస్థులు, ఆయుధములే ప్రధానముగా జీవించు కషాదులు, ఆభీరులు_ఇట్టి యనేకులైన పాప వృత్తులతో జీవించువారును, భగవద్భక్తుల యాశ్రయముతో సమస్తపాపములను బోఁగొట్టుకొని పరమపదము నందుచున్నారు. సర్వ మొనర్చుటకు శక్తుఁడైన యా పరమేశ్వరునకు నమస్కారము.

స ఏష ఆత్మాత్మవతామధీశ్వర
స్త్రయీమయో ధర్మమయ స్తపోమయః,
గతవ్యళీకై రజశంకరాదిభి
ర్వితర్క్యలింగో భగవాన్ ప్రసీద తు. 19

ఆత్మవతాం=ధీరులైన వారికి, ఆత్మా=ఆత్మస్వరూపుఁడై నిరంతరమును బ్రకాశించుచుండువాఁడును, అధీశ్వరః=కర్మఫల ప్రదాతయు, త్రయీమయః=వేద స్వరూపుఁడైనవాఁడును, ధర్మమయః=ధర్మమూర్తియు, తపోమయః=తపస్స్వరూపుఁడును, గతవ్యళీకైః=నిష్కపటమైన భావముగల, అజశంకరాదిభిః=బ్రహ్మదేవుఁడు శంకరుఁడు మొదలైన వారిచేత, వితర్క్యలింగః=విమర్శించి కొలుచుటకు యోగ్యమైన స్వరూపముగల, సః భగవాన్=అ భగవంతుఁడు, ప్రసీదతాం=మా యందుఁ గరుణగల వాఁ డగుఁగాక.

బుద్ధిచాంచల్యములేక సర్వదా తనయందే రమించుచున్న మహాయోగుల కాత్మస్వరూపుఁడై నిరంతరమును ప్రకాశించుచున్నవాఁడు, కర్మకాండయం దాసక్తి గలిగి కర్మానుష్ఠానపరులైన వారికి తత్తత్కార్యములకు సంబంధించిన ఫలము నిచ్చువాఁడు, ధర్మశాస్త్రములందుఁ దాత్పర్యముగలవారికి ధర్మస్వరూపుఁడై భాసించువాఁడు, ఉపాసకులకు వారివారి తపఃఫలము ననుగ్రహించువాఁడు, వేదస్వరూపుఁడై భాసించువాఁడు, నిష్కపటు భక్తులైన బ్రహ్మ పరమేశ్వరుఁడు మొదలైన వారిచే నాశ్చర్యముచేఁ గనుఁగొనఁదగిన రూపముచేఁ గూడినవాఁడు – అట్టి యా భగవంతుఁడు మాయందుఁ గరుణాపరుఁడగుఁ గాక!

> శ్రియః పతిర్యజ్ఞపతిః ప్రజాపతి
> ర్ధియాంపతి ర్లోకపతి ర్ధరాపతిః,
> పతి ర్గతిశ్చాంధకవృష్ణిసాత్వతాం
> ప్రసీదతాం మే భగవాన్ సతాంగతిః. ౭౦

శ్రియఃపతిః=లక్ష్మీదేవినిఁ బరిపాలించెడు ప్రాణవిభుఁడును, యజ్ఞపతిః=యజ్ఞస్వరూపుఁడుగా ననుష్ఠింపఁబడి దానిని నిర్విఘ్నముగా నెరవేర్చి తత్ఫలమొసఁగువాఁడును, ప్రజాపతిః=సమస్తప్రాణులను వాని వాని స్థానములందు నియమించి పరిపాలించువాఁడును, ధియాం పతిః=బుద్ధి మొదలైన సమస్తేంద్రియములను వాని వాని వ్యాపారములందుఁ బ్రేరేపించువాఁడును, లోకపతిః=సమస్త లోకములను తత్తదుచితస్థానముల నియమించి పాలించువాఁడును, ధరాపతిః=భూమిని రక్షించువాఁడును, అంధక వృష్ణిసాత్వతాం = అంధకులు, వృష్ణులు మొదలైన యాదవకుల భక్తులకు, పతిః=పతియైనవాఁడును, గతిః=సర్వావస్థలయందును ఆశ్రయణీయుఁడును, సతాం గతిః=సత్పురుషులకుఁ బరమప్రాప్యుఁడై పాలించువాఁడును నైన, సః భగవాన్=ఆ భగవంతుఁడు, మే ప్రసీదతాం=నాకుఁ బ్రసన్నుఁడగుఁ గాక!

సర్వజగత్తుల కధికారిణి లక్ష్మీదేవి. ఆమెను సర్వరీతులఁ బరిపాలించెడు పతియైనవాఁడు, యజ్ఞస్వరూపుఁడు, విష్ణువు. తద్రూపముగా యజ్ఞము లనుష్ఠించువారి కార్యములను నిర్విఘ్నముగా నెరవేర్చి వారికి సత్ఫలముల నొసఁగువాఁడు శ్రీమన్నారాయణుఁడే. సమస్త ప్రాణులను వాని వాని స్థానమందు నియమించి పాలించెడివాఁడు వాఁడే. ఇంద్రియములను దత్తత్ప్రవృత్తులకై ప్రేరేచి కర్మఫలముల నొసఁగువాఁడు వాసుదేవుఁడే. సమస్త లోకములను తత్తదుచితస్థానముల నిల్పి పాలించువాఁడు వీఁడే. భూమిని దుర్మార్గుల నుండి రక్షించి యామె యోగక్షేమము లరయువాఁ డా భగవానుఁడే. అంధకులు, వృష్ణులు మొదలైన భక్తులకు పతి వాఁడే. గతియును వాఁడే. సత్పురుషులకు రక్షకుఁడైనవాఁ డా మధుసూదనుఁడే. ఆ కృష్ణపరమాత్మ నాయెడఁ బ్రసన్నుఁ డగుఁగాక!

> యదంఘ్ర్యభిధ్యానసమాధి ధౌతయా
> ధియా నుపశ్యంతి హి తత్త్వమాత్మనః,
> వదంతి చైతత్కవయో యథారుచం
> స మే ముకుందో భగవాన్ ప్రసీదతామ్. 21

యదంఘ్రి-ఎవని పాదపద్మములయొక్క, అనుధ్యాన-ఎడతెగని ధ్యానముచే నేర్పడిన, సమాధి-సమాధిస్థితితో, ధౌతయా-శుద్ధ మొనర్పఁబడిన, ధియా-బుద్ధిచేత, ఆత్మనః-ఆత్మయొక్క, తత్త్వం-తత్త్వమును, పశ్యంతి-చూతురు, కవయః-జ్ఞానులైనవారు, ఏతత్-దీనిని, యథారుచం-వారి వారి యభిరుచుల ననుసరించి, వదంతి చ-వచింతురు, భగవాన్-జ్ఞానపరిపూర్ణుఁడైన, సః ముకుందః-ముక్తిదాతయైన యా పరమాత్ముఁడు, మే-నాకు, ప్రసీదతాం-ప్రసాదయుక్తుఁడగుఁ గాక।

మహాయోగులు నిరంతర మాతని పాదపద్మములను ధ్యానింతురు. ఆ ధ్యానముచే వారికి సమాధిస్థితి యేర్పడును. దానితో

వారి బుద్ధి సర్వాత్మనా పరిశుద్ధ మగును. అప్పుడు వారికి ఆత్మ యొక్క సహజస్థితి స్పష్టముగాఁ గన్పించును. ఆ యాత్మను వార దమ తమ యభిరుచులకుఁ దగినట్లు వర్ణించికొందురు. అట్టి యె ముక్తిదాతయగు పరమాత్ముఁడు న న్ననుగ్రహించుఁ గాక!

> ప్రచోదితా యేన పురా సరస్వతీ
> వితన్వతాఽజస్య సతీం స్మృతిం హృది,
> స్వలక్షణా ప్రాదురభూత్కిలాస్యత
> స్స మే ఋషీణామృషభః ప్రసీదతామ్. 22

పురా=ఆదికాలమందు, అజస్య=బ్రహ్మయొక్క, హృది=హృదయమందు, సతీ=సృష్టివిషయికమైన, స్మృతిం=జ్ఞానమును, వితన్వతా=ప్రకాశింపఁజేయు చున్న, యేన=ఎవ్వనిచేత, ప్రచోదితా=ప్రేరేపింపఁబడిన, స్వలక్షణా=అసాధా రణ లక్షణములతోఁ గూడిన, సరస్వతీ=వేదవాక్కు, అస్యతః=ముఖమునుండి, ప్రాదురభూత్=ప్రాదుర్భవించెనో, ఋషీణాం=ఋషులకు, ఋషభః=శ్రేష్ఠుఁడైన, సః=ఆ భగవంతుఁడు, మే ప్రసీదతాం=నాకుఁ బ్రసన్నుఁ డగుఁగాక.

కల్పాదియందు బ్రహ్మదేవుని మనస్సులో లోకసృష్టిని గూర్చిన యాలోచన యేర్పడెను. దానిని జనింపఁజేసినవాఁడు వాసుదేవుఁడే. అతని ప్రేరణచేతనే శిక్షాకల్పాది శాస్త్రములతోఁ గూడినది, అసాధా రణ మాహాత్మ్యము గలదియు నైన వేదవాణి బ్రహ్మదేవుని ముఖము నుండి యావిర్భవించినది. దాని సాయముతో నాతఁడు సృష్టికార్య మును నెరవేర్చినాఁడు. సర్వులకును జ్ఞానప్రదాన మొనర్చెడివారిలో పరమశ్రేష్ఠుఁడైన యా భగవంతుఁడు నాకుఁ బ్రసన్నుఁ డగుఁగాక!

ప్రభుః యః—సర్వవ్యాపకుఁడైన యే భగవంతుఁడు, మహద్భిః—గొప్పవైనట్టి, భూతైః—పంచభూతములచేత, ఇమాః పురః—ఈ శరీరములను, విర్మాయ—సృష్టించి, పురుషః—పురుషస్వరూపుఁడై, అమూషు—ఈ శరీరములందు, శేతే—శయించునో, షోడశాత్మకః—పదునాఱు తత్త్వములయొక్క యాత్మస్వరూపుఁడై, షోడశగుణాన్—పదునాఱు గుణములను, భుంక్తే—అనుభవించునో, సః భగవాన్—ఆ భగవంతుఁడు, మే వచాంసి—నా వాక్కులను, అలంకృషీష్ట—అలంకరింపవలెను.

అవ: తన వాక్కులను వినువారికి పరమానంద మేర్పడవలెననియు, శృంగార కరుణాది రసపుష్టి దన వాక్కుల కుండవలెననియు భావించి సర్వులయందును అంతర్యామియై వసించెడు భగవంతునిఁ బ్రార్థించుచున్నాఁడు-

సర్వవ్యాపియైన భగవంతుఁడు మహాభూతములతో సర్వశరీరములను సృష్టించును. పదునొకం డింద్రియములు, పంచభూతములు—వీనితోఁ గూడిన శరీరములందు వాని వానిని తత్తద్వ్యాపారములందు లగింపఁజేయుచు పురుషస్వరూపుఁడై అంతర్యామియై యా శరీరములం దుండును. అట్టి యా భగవంతుఁడు నా వాక్కులందు నిలిచి పలికించుఁ గాక!

నమస్తస్మై భగవతే వేదవ్యాసాయ వేధసే,
పపుర్జ్ఞానమయం సౌమ్యా యన్ముఖాంబురుహాసవమ్. 24

జ్ఞానమయం—జ్ఞానాత్మకమైన, యన్ముఖాంబురుహాసవం—ఎవని ముఖమునుండి విస్సృతములైన వాక్కు లనెడు మకరందమును, సౌమ్యాః—శాంతస్వరూపులైన సజ్జనులు, పపుః—పానము సేసిరో, అమితతేజసే—అపరిచ్ఛిన్నమైన తేజస్సు గలిగిన, భగవతే—భగవత్స్వరూపుఁడైన, తస్మై వేదవ్యాసాయ—ఆ వేదవ్యాస మహాముని కొఱకు, నమః—నమస్కారము.

అవ: జ్ఞానప్రదుఁడును తండ్రియు నైన వ్యాసభగవానునకు నమస్కరించుచున్నాఁడు-

ఎవని ముఖాబ్జమునుండి జారిన జ్ఞానమయమైన వాక్కనెడు మకరందము పరమశాంతులైన జ్ఞానులు తృప్తిదీఱ గ్రోలుదురో అట్టి యపరిచ్ఛిన్న తేజస్కుఁడైన వ్యాసభగవానునకు నమస్కారము.

ఏతదేవాత్మభూ రాజన్! నారదాయ విపృచ్ఛతే,
వేదగర్భోఽభ్యధా త్సాక్షాత్ యదాహ హరిరాత్మనః. ౨౫

రాజన్ = ఓ రాజా!, హరిః = వాసుదేవుఁడు, ఆత్మనః = తనకు, యత్ = దేనిని, ఆహ = ఉపదేశించెనో, వేదగర్భః = వేదములను గర్భమందు ధరించిన, ఆత్మభూః = బ్రహ్మదేవుఁడు, విపృచ్ఛతే = తన్నుఁ బ్రశ్నించిన, నారదాయ = నారదుని కొఱకు, ఏత దేవ = దీనినే, అభ్యధాత్ = వచించెను.

అవ: పరీక్షి త్తడిగినదాని కుత్తరమైన సంగతిని బ్రహ్మనారద సంవాదముగా సంప్రదాయవిదులు వాకొందురని తెల్పుచున్నాఁడు-

ఓ రాజా! నీవు నన్నడిగినట్లే పూర్వమందు నారదమహర్షి బ్రహ్మ నడిగెను. సమస్త వేదముల కుత్పత్తిస్థానమైన యా బ్రహ్మ కల్పాదియందు వాసుదేవుఁడు తన కుపదేశించిన విధమునే పుత్త్రుఁడైన నారదున కుపదేశించినాఁడు.

## విజయధ్వజ వ్యాఖ్యానము:

అవ: సంక్షేపముగా శ్రీహరి చరిత్రను వినుటచేత నతని యందే యవహితమైనది పరీక్షిత్తు మనస్సు. అతిశయమైన భక్తితో నింకను విశేషముగా వినవలెనను నిచ్ఛగలవాఁడై శ్రీహరి యాతని భక్తులు-వీరి లీలలనుగూర్చి ప్రశ్నించుట, శుకబ్రహ్మ గురుదేవతలకు నమస్కరించి యా రాజు ప్రశ్నలకు సమాధాన మొసఁగ నారంభించుట మొదలైనవిషయము లీ యధ్యాయమందు వచ్చును. మొదలు శుకబ్రహ్మ యుపదేశముతో రాజున కేర్పడిన విజ్ఞాన వైరాగ్యముల ననువాద మొనర్చుచున్నాఁడు.

ఆత్మనః = సర్వగుణ పరిపూర్ణుఁడైన శ్రీహరి యొక్క, తత్త్వ నిశ్చయం = యథావత్తైన జ్ఞానమును గల్పించెడి, పైనిఁ జెప్పిన ప్రకారము, వైయాసకేః వచః, ఉపధార్య, ఔత్తరేయః, కృష్ణే సతీం = భక్తితోఁ గూడిన, మతిం = మనస్సును, వ్యధాత్ = కల్పించికొనెను కృష్ణుఁడు సేవ్యుఁడు. తసేతరము గాదను నిర్ణయమునకు వచ్చెనని సారము. 1

ఆత్మజాయా....బంధుషు, నిత్యం = ఎప్పుడును, వ్యూఢాం = హరిభక్తి లేనివారికి దృఢముగా నుండునట్టి, మమతాం = అహంకార మమకారములను, అవికలే = స్వామి, అమాత్యుఁడు, పురము, రాష్ట్రము, కోశము, దండము, మిత్రు లనెడు సప్తాంగములతోఁ బూర్ణమైన, రాజ్యే = రాజ్యమందలి, మమతాం చ = అభిమానమును, జహౌ = వదలెను.

శ్రీహరియే సర్వస్వతంత్రుఁడను జ్ఞానము లేనివారికి 'నేను నాది' యను దృఢమైన యభిమాన ముండును. శ్రీహరి విషయము నెఱిఁగిన పరిక్షిన్మహారాజు ఆ యహంకార మమకారముల నింతకు ముందే వదలినాఁడు. శుకాచార్యుల యుపదేశమైన తర్వాత నింక మహావైరాగ్యశాలి యయ్యె నని 'చ' శబ్దము సూచించుచున్నది 2

అవ: తర్వాత నేమి యడిగె నను ప్రశ్నకు జవాబు చెప్పుచున్నాఁడు.

సత్తమాః మహాయశాః సంస్థాం విజ్ఞాయ యత్ త్రైవర్గికం = కర్మ ధర్మార్థకామములకు సాధనమైన ప్రవృత్తికర్మ మేదిగలదో (తత్ కర్మచ) ఆ కర్మమును, సన్న్యస్య = శ్రీహరియందే సమర్పించి, దృఢం = స్థిరమైన, స్వాత్మభావం = శ్రీహరియే తనస్వామి యనెడు దృఢమైన భక్తిని, గతః = పొందినవాఁడై- దీనితో రాజున కధికారసంపద యున్న దని తెలిపిన ట్లైనది. కృష్ణానుభావశ్రవణే = కృష్ణపరమాత్మ సామర్థ్య

మీరు), యత్ పృచ్ఛథ = ఏ విషయము నడిగితిరో, ఇమం అర్థమేవ =ఈ యర్థమునే, పప్రచ్ఛ=అడిగెను. శ్రద్దధానో మహామనాః అని శ్రీధరుఁడు. 'మహాయశాః' అని విజయధ్వజులు. 'ఆత్మభావం పరంగతః' శ్రీధరులు. 'స్వాత్మభావం దృఢంగతః' విజయధ్వజులు.
3, 4

అవ: తనకిష్టమైన విషయమును ప్రశ్నింపఁబోవుచున్నవాఁడై శుకాచార్యులమాటను బొగడుచున్నాఁడు-

బ్రహ్మన్ = అనఘ!, హరేః కథాః కథయతః సర్వజ్ఞస్య = యోగ్యతానుగుణముగా సర్వశాస్త్రార్థములను దెలిసిన, తవ వచః, సమీచీనం=ఇష్టసాధనమును దెలుపునది. అంతే గాదు. దానికున్న ప్రతిబంధకమును గూడఁ దొలఁగించునది. దీనిచేత, మహ్యాం=నా యొక్క, తమః=లోపలియజ్ఞానము, విశీర్యతే=సమూలముగా నాశమగుచున్నది. దీనివలన ప్రతిబంధకనివృత్తిని దెలిపిన ట్లైనది. 'నా యొక్క' అనుటచేత, నిష్టసాధనజ్ఞానము గల్గించుచున్నదని గూడఁ దెలిపిన ట్లైనది. లేక, యతః=ఏ కారణముతో నా యజ్ఞానమును బోఁగొట్టుచున్నదో అందుచే నీవాక్యము సమీచీనము' అనియైనను అర్థ మొనర్ప వచ్చును. 5

ఏడవ శ్లోకమునకు మూఁడు పాదములు. భగవాన్=సమగ్రైశ్వర్యవంతుఁడైన శ్రీహరి, ఆత్మమాయయా = 1. తనయిచ్ఛచేత, 2. తన కధీనమైన ప్రకృతిచేత, అధీశ్వరైః=జగన్నియామకులని పేరు గొన్న యితరదేవతలచేత, దుర్విభావ్యం = ఒనర్చుట కశక్యమైన, ఇదం=చరాచరాత్మకమైన యీ జగత్తును, యథా=ఏ ప్రకారముగా, సృజతే = సృష్టించునో, విభుః యథా గోపాయతి పునః, యథా సంయచ్ఛతే, పురుశక్తిః=అనంతమైన శక్తిగల, పరః పుమాన్=సర్వోత్తమ పురుషుఁడైన శ్రీహరి, ఆత్మానం=తన్ను, క్రీడన్=అవతారముల మూలకముగాఁ గ్రీడింపఁ జేయుచున్నవాఁడై, యాం యాం వృత్తిం ఉపా

క్రీత్య కరోతి=ఈ జగత్తున కపేక్షితమైన సర్వమును సామాన్యముగా నొనర్చునో లేక, వికరోతి=విశేషముగా నొనర్చునో దానిని, భూయ ఏవ=మాటిమాటికిని, వివిత్సామి=తెలిసికొనుటకుఁ గోరుచున్నాను. 'చ'-పరమాత్ముఁడు, నిర్వికారస్సదా శుద్ధః' అనెడు ప్రమాణముతో వికారశూన్యుఁడు గదా! 6, 7

తాత్పర్యము : ఈజగత్తును శ్రీహరి దనయిచ్ఛతోఁ దన కధీనమైన ప్రకృతి నుపయోగించికొని సృష్టించును. జగన్నియామకులని ప్రసిద్ధులైన యితర దేవతల కిది సాధ్యము గాదు. కనుక శ్రీహరి సృష్ట్యాదుల నెట్లొనర్చును? జీవుని సంసారబద్ధునిగా నెట్లొనర్చును? అవతారరూపములుగాఁ దా నెట్లు క్రీడించును? సామాన్యము విశేషము అని రెండు రీతులుగా నీ జగత్తునం దపేక్షితమైన సర్వమును ఎట్లు గల్పించును? ఈ విషయములను మాటిమాటికిని దెలియఁగోరుచున్నాను.

అవ : భగవంతుని చేష్టావిషయకమైన జ్ఞానము నెఱిఁగించువాఁడు జ్ఞానులయందును దొరకుట కష్టమని చెప్పుచున్నాఁడు-

బ్రహ్మన్ అద్భుతకర్మణః=అద్భుతకర్మల నొనర్చునట్టి, భగవతః=సర్వసమర్థుఁడైన, హరేః=శ్రీహరియొక్క, చేష్టితం=కార్యములోని రహస్యము, కవిభిశ్చాపి=అపరోక్షజ్ఞానులచేతను, దుర్విభావ్యం ఇవ=సంపూర్ణముగాఁ దెలియరానిదని, ఆభాతి=తోఁచుచున్నది, నూనం=నిశ్చయము. 'చ' కారముతో నజ్ఞానుల కెట్లును దెలియదు; జ్ఞానులకుఁ దెలియుటగూడఁ గష్టమని సూచింపఁబడినది. 8

అవ : ఐనను ఒకప్రశ్న యున్నదని యడుగుచున్నాఁడు-

ఏకః=అద్వితీయుఁడును, ముఖ్యుఁడును నైన పరమాత్మ, జన్మభిః=వాసుదేవుఁడు మొదలైన యవతారములచేత, భూరిశః=ఎక్కువగా, కర్మాణి=సృష్టిమొదలైనకార్యములను, కుర్వన్=చేయుచున్నవాఁడై, ప్రకృతేః=ప్రకృతియొక్క, గుణాన్=సత్త్వాది గుణములను, యథా=

ఎట్లు, యుగపత్ - అథవా, క్రమశః, బిభర్తి-ధరించును, 'తు' అనుటచేత, గుణములు పరస్పర విరుద్ధస్వభావము గలవగుటచేత, వాని నొక్కతేసారిగా గ్రహించుటలో ననుపపత్తిని సూచించు చున్నాఁడు. 'అపి' అనుటతో నా గుణముల గ్రహణము క్రమముగా నుండునని సూచితమైనది. 9

అవ: ఈ విషయము దెలియవలెనను కోర్కిమాత్రమే గాదు. తాము సమాధానము చెప్పవలెనని కూడ ప్రార్థించుచున్నాను అను చున్నాఁడు. భగవాన్ విచికిత్సితం ఏతత్ యథా-శాస్త్రానుగుణముగా, మే బ్రవీతు. దీనిని వివరించుటకుఁ దమకు పాండిత్య మున్నదని యెఱిఁగించుచున్నాఁడు-

భవాఁ-తమతో, శబ్దబ్రహ్మణి-శబ్దాత్మకములైన సకలశాస్త్రము లందును, పరస్మిన్ చ-తత్ప్రతిపాద్యుఁడై సర్వోత్తముఁడైన శ్రీహరికి సంబంధించిన జ్ఞానమందును, నిష్ణాతః ఖలు-పండితులు గదా!. దీని చేత నలౌకికమైన విషయమును తెలియఁజెప్పుటకు మీరే సమర్థులని పలికినట్లైనది. 10

అవ: పరీక్షిత్తు ఇట్లు ప్రశ్నింపఁగా, తర్వాత శుకబ్రహ్మ యేమి చేసె నను శౌనకాదుల మనస్సులలోని శంకను సూతుఁడు పరి హరించుచున్నాఁడు-

రాజ్ఞా ఇతి విభోః గుణానుకథనే ఉపామంత్రితః హృషీకేశం అనుస్మృత్య ప్రతివక్తుం- ఉత్తరముగా భాగవతమును జెప్పుటకు ప్రచ క్రమే. 'హృషీకేశం' అనుటచేత ముఖ్యముగా వాక్కు మొదలైన యింద్రియశక్తుల నుద్బోధించువాఁడు శ్రీహరియే యని చెప్పినట్లైనది. పరీక్షిత్తు ప్రశ్న కుత్తరముగా భాగవతపురాణముఁ జెప్ప నిచ్ఛగల వాఁడై శుకబ్రహ్మ శిష్టాచారము ననుసరించి తన యిష్టదేవతను ఈ శ్లోకము మొదలుకొని యిరువదినాల్గవ శ్లోకమువఱకును స్మరించు చున్నాఁడు. 11

భూయసే = పరిపూర్ణుఁడును సుఖస్వరూపుఁడును నైనవాఁడు, సదుద్భవస్థాన నిరోధలీలయా = సత్యమైన ప్రకృతియొక్క ఉత్పత్తి, పాలన, లయము మొదలైన లీలలచేత(నిత్యం), గృహీతశక్తిత్రయా య = ఇచ్ఛా జ్ఞాన క్రియాత్మకములైన మూఁడు శక్తులను బొందియు న్నట్టియు, దేహినాం = జీవులయొక్క కన్ను మొదలైన యింద్రియ ములకు, అనుపలభ్యవర్త్మనే = అజ్ఞేయమైన మార్గము గలిగిన, అంత ర్ధ్రువాయ = అంతర్యామి స్వరూపముతో సర్వకాలములందును, జీవాం తస్థుఁడై యున్న, పరస్మై పురుషాయ = సర్వోత్తముఁడైన శ్రీహరికి, నమః. 'ఇచ్ఛాజ్ఞానం క్రియాచేతి నిత్యా శ్శక్తయ ఈశితుః' అనెడు ప్రమాణముతో నిత్యమైన శక్తులను బొందినవాఁడని యర్థము. ఈ విషయమందు వేదము మొదలైన సచ్ఛాస్త్రములే ప్రమాణము. అంతే గాని ప్రత్యక్షప్రమాణముగాదను విషయము కన్ను మొదలైనయింద్రి యముల కగోచరుఁడను దానిచేఁ జెప్పినట్లైనది. బహుదూరమం దుం డుటచేఁ గన్నుల కగపడక పోవచ్చును గదా! అను దానిని బూర్వ పక్షీకరించుటకై 'అంతర్ధ్రువాయ' అన్నాఁడు. 'యో వై భూమాత త్సుఖం' అనుశ్రుతి 'భూయసే' అనుటకుఁ బ్రమాణము. 'ద్వావిమౌ పురుషౌలోకే' మొదలైన గీతావాక్యములు పురుషోత్తముఁ డనుటకుఁ బ్రమాణములు. 'అసదుద్భవస్థాన నిరోధలీలయా' అని శ్రీధరుల పాఠము. 'సదుద్భవస్థాన నిరోధలీలయా' అని విజయధ్వజుల పాఠము. 'అంతర్ధ్రువాయ' అని విజయధ్వజులు. 'అంతర్భవాయ' అని శ్రీధరులు. 12

అవ: శ్రీహరి యనుగ్రహమునకుఁ దక్కిన సాధనములకం టెను భక్తితో మరల మరల నొనర్చెడి నమస్కారమే సర్వోత్తమము. నారాయణుని ప్రీతి కదే ముఖ్యకారణమని వివరించుచున్నాఁడు–

సద్వృజినచ్ఛిదే = శ్రీహరికి ప్రీతికరములైన ప్రశస్తకర్మల నొన ర్చెడు జనులయొక్క దుఃఖకరమైన పాపమును నాశ మొనర్చునట్టియు

గుణములతోఁ గూడిన స్వరూపము గలట్టియు, పారమహంస్య ఆశ్రమే =పరమహంసలకు సంబంధించిన సన్న్యాసాశ్రమమందున్న, పుంసాం పునః=సత్పురుషులకు మాత్రమే, అనుమృగ్యదాశుషే=వేడిన దాని నిచ్చెడు, పరస్మై=పురుషోత్తమునకు, భూయః=మఱల, నమః.

ఎవ్వనితో నిష్టప్రాప్తియుఁ దత్ప్రతిబంధక నివృత్తియు నగునో వాఁడే సేవ్యుఁడు. ఈ గుణములు శ్రీహరియం దున్నవని 'సద్వృజి నచ్ఛిదే' 'అసతాం అసంభవాయ' అనువానితోఁ జెప్పినట్లైనది. 'అఖిలసత్త్వమూర్తయే' అనుటచేత దీని నొనర్చెడు సర్వసామర్థ్యము గలవాఁడని వివరించినట్లైనది. 'నిశ్శేషగుణపూర్ణత్వాత్సత్త్వ ఇత్యేవ తం విదుః' అను ప్రమాణముతో చరాచరాత్మకమైన ప్రాణులే మూర్తిగా గలవాఁడు అను నర్థకల్పనము దోషమని చెప్పినట్లైనది. 'అనుమృగ్య దాశుషే' అనుటతో వీనిచేతనే నిష్టప్రాప్తి యగునని ఉక్తము. పునః శబ్దమునకు అవధారణార్థ మొనర్చుటచే యోగ్యుల కిష్టప్రదుఁడని అయోగ్యులకు కాఁడు అని వివరించి నట్లైనది. 13

అవ: అయోగ్యు లనఁగా నెవరు? సన్న్యాసులుగాని జ్ఞానులని చెప్పినచో 'తమేవం విద్వా నమృత ఇహ భవతి' అనెడు వాక్య మప్రమాణ మగును. 'అజ్ఞులైన జనులు' అని చేసినచో 'అజ్ఞానాం జ్ఞానదో విష్ణుః' అనునది ప్రమాణ మగును. కనుక నిచ్చట నయోగ్యు లనఁగా నెవరు? ఈ యాశంకను బరిహరించుటకై భాగవతశాస్త్ర మందుఁ జెప్పినదానికంటె విరుద్ధమైన యాచారముగలవా రయోగ్యు లని వివరించుచున్నాఁడు.

సాత్వతాం = సాత్వతసంహితయందుఁ జెప్పినట్లుగా శ్రీహరి నర్చించెడు జనులకు, ఋషభాయ=1. జ్ఞానమును హెచ్చించి ముక్తి నిచ్చెడువాఁడును, 2. శోభనమైన ముక్తియోగ్యతను బడసియున్నను

నింకను జ్ఞానపరిపూర్తిగాని పుణ్యులకు జ్ఞానప్రదుఁడైన వాఁడును. దీనితోఁ బైనిఁజెప్పిన రెండు వాక్యములును బ్రమాణములే యని తెలిపినట్లైనది. కుయోగినాం=కుత్సితులైన యోగులకు, విదూరకాష్ఠాయ=1. బహుదూరమందున్న పరిపూర్ణత గలిగినట్టియు, తా నున్న దిక్కుఁ గూడఁ దెలియఁ జేయనట్టియు, నిరస్తసామ్యాతిశయేన= సామ్యము, అతిశయము లేనట్టి, రాధసా=స్థితితో, స్వధామని=స్వప్రకాశమైన, బ్రహ్మణి=అవిచ్ఛిన్న చిదానందరసాత్మకమైన తనయందు రంస్యతే=క్రీడించుచున్నట్టి, తే = సర్వోత్తముఁడైన పురుషుఁ డనిపించి కొన్న నీకు, నమోనమః=పలుమాఱు నమస్కారము, అస్తు. రంస్యతే అని చెప్పుటచే నీ రసానుభవము హరికి సర్వకాలములందును దప్పక యుండునని చెప్పినట్లైనది. ఈ పరమాత్ముని రీతి లోకవిలక్షణమైనదని తెలుపుటకే పరస్మై పదప్రయోగము. అడుగడుగునను ననుసంధాన మొనర్పవలెనని వచించుటకే బహునమస్కారములు. 14

కీర్తనమొదలైన వానిచేత మనః కల్మషమును బోఁగొట్టుకొన్న వానికిఁ బరమేశ్వరునిఁ గూర్చిన నమస్కారమే సరిపోవు నను నభిప్రాయముతోఁ జెప్పుచున్నాఁడు-

యత్కీర్తనం, యచ్ఛ్రవణం, యదీక్షణం, యద్వందనం, యత్స్మరణం, యదర్హణం, లోకస్య=జనులయొక్క, కల్మషం= పాపమును, సద్యః=భక్తిపూర్వకముగా నొనర్చినంతనే, విధునోతి= పోఁగొట్టునో, సుభద్రశ్రవసే నమోనమః. 15

వైరాగ్యముతో దృఢమైన భక్తిచేత నొనర్చెడు శ్రీహరిపాద సేవయే అపరోక్షజ్ఞానమునకు సాధన మగునని చెప్పుచున్నాఁడు-

యచ్చరణోపసాదనాత్ = ఏ శ్రీహరి పాదములే శరణనెడు రీతితో నున్న సేవచేత, అంతరాత్మనః = అంతఃకరణముయొక్క, ఉభయతః = ఉభయలోకము లందలి, సంగం, వ్యుదస్య, విచక్షణాః, గతక్లమాః=ఆయాసము లేనివారై, బ్రహ్మగతిం=పరిపూర్ణుఁడైన శ్రీహరి

యపరోక్షమును-దానిచే మోక్షమును, విందంతిహి-పొందుదురో, అట్టి సుమంగళమైన కీర్తిగల శ్రీహరికి మాటిమాటికి నమస్కారము. 16

'ప్రత్యక్షము' మొదలైన ప్రమాణములచే నైక్యవాద మిష్టము గాదు. అందుచే వారు చెప్పెడు 'గురు వనెడు హరిచరణ సేవతో క్షేత్రజ్ఞునకు స్థూల సూక్ష్మశరీరము పోయి బ్రహ్మశరీర మందుదురు' అనెడు నర్థముగూడ సమీచీనము గాదు. 16

సుమంగళాః-ముముక్షువులైన జీవులు, తపస్వులు, దానపరాయణులు, కీర్తిమంతులు, మనస్సును వశమం దుంచికొన్నవారు, మంత్రరహస్య మెఱింగినవారు-ఎవరైనను సరే, యదర్పణం వినా-తమ తమ కార్యములను శ్రీహరికి సమర్పింపనిచో, క్షేమం-అపరోక్ష జ్ఞానమును, మోక్షమును, న విందంతి-పొందరో-అట్టి కీర్తిగల పరమాత్మకు నమస్కారము. 17

శ్రీహరికి సంబంధించిన భక్తుల సేవచేతనే, యంతఃకరణము శుద్ధియగుచున్నది. అట్టిచో భగవత్సేవతో నంతఃకరణశుద్ధియగుటలో నాశ్చర్య మేమని తెలుపుచున్నాఁడు. అట్టి మాహాత్మ్యమున్న శ్రీహరికి నమస్కార మనుచున్నాఁడు-

యే పాపాః-కిరాత, హూణాంధ్ర, పుళింద, పుల్కసాః, అభిర కంకాః, యవనాః శకాదయః. 'కషాదయః' అని శ్రీధరులపాఠము. అన్యే చ-బ్రహ్మహత్యాది పాపముల నొనర్చిన యితరులును, యద పాశ్రయాశ్రయాత్-ఏ శ్రీహరినే యాశ్రయించిన బ్రహ్మజ్ఞానుల సేవతో, శుధ్యంతి-పాపశుద్ధినందెదరో అట్టి, ప్రభవిష్ణవే-సమర్థుఁడైన హరికి నమః. శబరునిచే 'పర్ణశబరి' స్త్రీయందు జన్మించిన వనచరులు కిరాతులు. వైశ్యునకు బ్రాహ్మణస్త్రీయందుఁ బుట్టినవాఁడు వైదేహికుఁడు. వానితో పుల్కసజాతి స్త్రీయం దుద్భవించినవారు హూణులు. వైదేహికుల సంతాన మాంధ్రులు. బ్రాహ్మణాదిభాషను

అర్థ మొనర్చికొనెడి యోగ్యతలేక మద్యమును త్రాగువారు పుళిం దులు. లేక వ్యభిచారులనుండి చోరులనుండి పుట్టినవారు. శూద్రు నితో బ్రాహ్మణస్త్రీయందు జన్మించినవా రంబష్ఠులు. బ్రాహ్మణునితో అంబష్ఠకన్యయందు జన్మించినవా రాభీరులు. శకు లనఁగా కర్పరులు. క్షత్రియునితో వైశ్యస్త్రీయందుఁ బుట్టినవారు యవనులు. ఆది శబ్దముతో నితర సంకరజాతులు గ్రాహ్యులు. 18

ఆత్మవతాం=భక్తితో శ్రీహరిని యపరోక్షీకరించికొన్న ముక్తు లకు, 2. ప్రశస్తమైన మనస్సున్న జ్ఞానులకు, అధీశ్వరః=శ్రేష్ఠనియా మకుఁడైన, త్రయీమయః, ధర్మమయః, తపోమయః = వేదము, ధర్మము, తపస్సు మొదలైనవాని ననుసరించు జీవులకు వశుఁడైన (దీనితో భక్తవాత్సల్యము సూచితమైనది), గతవ్యళీకైః=అప్రియము లేని, అజశంకరాదిభిః=బ్రహ్మ రుద్రుఁడు మొదలైనవారిచేత, వితర్క్య లింగః = విశేషముగా నూహింపఁబడెడు జగత్సృష్టి మొదలైన లక్షణ ములుగల, ఏషః=పైఁ జెప్పిన మహిమలతోఁ బ్రసిద్ధుఁడైన, సః=ఆత్మా భగవాన్= ఆ పరమాత్ముఁడైన శ్రీహరి, ప్రసీదతాం = వేదమయుఁడు మొదలైన శబ్దములకుఁ బైనఁజెప్పిన యర్థము సరియనుటకు 'వేదాను సారి వశగః స్వేచ్ఛయా' అనుట ప్రమాణము. 19

అవః మనస్సునందున్న యీ యభీష్టసిద్ధికై యీ గుణవిశిష్టుఁ డైన శ్రీహరి యనుగ్రహమును బ్రార్థించుచున్నాఁడు—

శ్రీపతియు, యజ్ఞపతియుఁ, బ్రజాపతియు, ధీపతియు, లోక పతియు, ధరాపతియు, నంధక వృష్ణి సాత్వతు లనెడు యాదవుల యొక్క పతియు, గతియునైన సతాంపతిః భగవాన్ మే ప్రసీదతాం.

శ్రియఃపతిః ధరాపతిః అనుటచేత సర్వాధిపత్యము సిద్ధించినను ఇతర అవాంతర దేవతల యాధిపత్యమును నివారించుచున్నాఁడు. వేదము మొదలైన వాక్కుల కభిమానిని యగుటచే శ్రీదేవి ప్రసాద

వేఱు దేహములం దనుభవింపఁదగిన ఫలములుగల యజ్ఞకర్మములకు ఫల మొసఁగువాఁ డగుటచే యజ్ఞఫలరక్షకుఁడు. కర్మాధికారముగల జనుల జీవనములకుఁ గారణ మగుటచే జనపాలకుఁడు. ప్రజాపతి శబ్దముతో నితఁడే వాచ్యుఁడు, ప్రవృత్తి యుండవలె ననుటతో జ్ఞానపూర్వకముగనే యుండుటచేత బుద్ధిపాలకుఁడు. లోకపతిః అనుటచే నింద్రాదులు ముఖ్యలోకపాలకులు గారని తెలిపిన ట్లైనది. 'పతిః', 'గతిః' అనుటతో శ్రీహరికున్న భక్తవాత్సల్యము సూచింపఁబడినది. సత్పురుషు లే యపేక్షయునులేనివా రగుటచే వారికి స్వామియపేక్ష లేదని శంకింపరాదు. వారికిఁగూడ నీతని యపేక్షగలదని సూచించుటకే 'సతాంపతిః' అను శబ్దము. 20

అవ : ఈ చెప్పిన విషయములకుఁ బ్రమాణ మేమి? దానినిఁ దెలిసికొనుటయైన నెట్లు? వీనికి సమాధాన మిచ్చుచున్నాఁడు-

కవయః, యదంఘ్ర్యభిధ్యాన సమాధిధౌతయా-శ్రీహరిపాద ధ్యానము, సమాధి-వీనిచేత (విషయసంస్కారము పూర్ణము గానట్టి స్మరణకు అభిధ్యాన మనిపేరు. విషయసంస్కారము నిశ్శేషముగా నివృత్తమై యున్న స్మరణయే సమాధి) మనస్సుయొక్క అజ్ఞానము మొదలైన దోషములను బోఁగొట్టుకొనుటచేత శుద్ధమైన, ధియా, ఆత్మనః = శ్రీహరియొక్క, తత్త్వం = యథార్థరీతిని, అనుపశ్యంతి = చూతురో, 'హి' అనుటచేత, నిది ప్రమాణమని తెలిపిన ట్లైనది. చ-ఇంకను, యథారుచం-తమకుఁ దృప్తియగునట్లుగా, ఏతద్వదంతి = పరమాత్మను గూడ జ్ఞాను లుపదేశింతురో-దీనివలన జ్ఞానుల యుపదేశరూపమైన శాస్త్రమునుండి తెలియుటకు సాధ్యమైనవారని చెప్పిన ట్లైనది. సః ముకుందః మే ప్రసీదతాం. 21

అవ : గ్రంథప్రారంభమందు సరస్వతి, బ్రహ్మదేవుఁడు వారి యనుగ్రహము గూడ అభీష్టసాధన మగునను నభిప్రాయముతోఁ దెల్పుచున్నాఁడు-

పురా అజస్య హృది సతీ_సమస్త చేతనులకంటెను ఉత్తమమైన స్థితిం _ నియమపూర్వకమైన యవస్థితిని, వితన్వతా = సంస్కారము గడ్డకు వచ్చునట్లు చేసిన, యేన_శ్రీహరిచేత, ప్రచోదితా స్వలక్షణా =1. స్వరూపభూతమైన నిత్యత్వ మనెడు లక్షణముగల, 1. స్వరూప నిర్ణయమును గల్గించెడు షడంగములను లక్షణములుగల, సరస్వతీ= ఋగ్వేదము మొదలైన వేదరూపమైన వాక్కు, అస్యతః_బ్రహ్మ నాల్గు ముఖముల నుండి, ప్రాదురభూత్ _అభివ్యక్త మయ్యెనో_ 'చత్వారో నిర్గతా వేదాః తవ వక్త్ర చతుష్టయాత్' అని ప్రమాణము. అట్టి, ఋషీణాం_బ్రహ్మజ్ఞానులకు, ఋషభః_జ్ఞానప్రదుఁడైన, ఉత్తమవాగీశ్వరియైన, లక్ష్మీదేవికి భర్తయైన నారాయణుఁడు, మే ప్రసీదతాం.

తాత్పర్యము: సృష్టిప్రారంభమందు శ్రీహరి చతుర్ముఖబ్రహ్మ మనస్సునందు సమస్త చేతనులకంటె నుత్తమమైన సంస్కారము వెలికి వచ్చునట్లొనర్చుటచేత నతని నాల్గుముఖములనుండి ఋగ్వేదాదులు బయటఁబడినవి. షడంగయుక్తము లవి. ఇట్లు జ్ఞానులకును జ్ఞాన ప్రదుఁడైన ఉత్తమవాగీశ్వరియైన లక్ష్మికిపతియైన శ్రీహరి ప్రసన్నుఁ డగుఁ గాక! 22

అవ: ఇప్పుడు దేహము, ఇంద్రియములు మొదలైన వానిని ప్రేరించు శ్రీహరిని ప్రసన్నుఁడుగా నొనర్చుచున్నాఁడు_

విభుః_సర్వసమర్థుఁడైన, యః మహద్భిః_అన్నిటియందును వ్యాపించిన, భూతైః _ పంచభూతములతో, ఇమాః _ జీవులయొక్క, పురః_శరీరములను, నిర్మాయ అమూషు_ఆ దేహములందు, శేతే= ఆత్మ మొదలైన రూపములతో వసించునో, యత్ _దానిచేతనే, పురుషః_దేహములందు వసించువాఁడని యనిపించికొనునో, షోడశాత్మకః=పదునొకం డింద్రియములు, ఐదుభూతములు ఇట్లు పదునాఱు తత్త్వములయందు వ్యాప్తుఁడై, షోడశగుణాన్_శబ్దము మొదలైన పదు

లను స్వీకరించుటలేదో), సః భగవాన్ మే=వాని విషయకమైన భాగవతమును వ్యాఖ్యానింపవలెననుకొన్న, మే వచాంసి అలంకృషీష్ట-23

అవ: ఇప్పుడు భక్త్యతిశయముతో దేవకీనందను నుద్దేశించి నమస్కరించుచున్నాఁడు-

సౌమ్యాః=జ్ఞానమను సోమరసపానమున కర్హులైన బ్రహ్మాది దేవతలు, జ్ఞానమయం=జ్ఞానాత్మకమైన, యన్ముఖాంబురుహాసవం=ఏ హరి ముఖకమలమందుత్పన్నమైన మధువును, పపుః, తస్మై వేధసే=జగత్కర్తయైన, వాసుదేవాయ=1. భగవతేనమః, 2. సౌమ్యులైన యుద్ధవాదులు యన్ముఖాంబురుహాసవమును గ్రోలిరో, అట్టి, వేధసే = కంసాది నిహంతయైన, భగవతే వాసుదేవాయ నమః, 3. సౌమ్యాః=నారదాదులు, జ్ఞానమయం యన్ముఖాంబురుహాసవం పపుః, తస్మై వాసుదేవాయ = వసుదేవుని కుమారుఁడైన, వేధసే= బ్రహ్మకు నమః, 4. సౌమ్యాః యన్ముఖాంబురుహాసవం పపుః, వేధసే=బ్రహ్మకొడుకైన నారదునకు, వాసుదేవాయ= శ్రీహరి భక్తుఁడైనవానికి నమః, 5. సౌమ్యాః=వైశంపాయనాదులు, వాసుదేవాయ= నారాయణుని యవతారమైన, వేధసే=భారతాది శాస్త్రగ్రంథములను రచించిన వేదవ్యాసునకు నమః. 'వేదవ్యాసాయ వేధసే' అని శ్రీధరులు. 'వాసుదేవాయ వేధసే' అని విజయధ్వజులు. 24

అవ: తన యిష్టదేవతాప్రసాదమును బ్రార్థించి పరీక్షిత్తుప్రశ్నకుత్తర మిచ్చుచున్నాఁడు-

రాజన్!, హరిః ఆత్మనః=బ్రహ్మదేవుఁడైన తనకు, సాక్షాత్ = స్వయముగా, యత్ =ఏ భాగవతమును, ఆహ=చెప్పెనో, ఆత్మభూః =పరమాత్ముని కుమారుఁడైన, వేదగర్భః=బ్రహ్మ, ఏతదేవ=దానినంతయును, ఇతి=సి వడిగినట్లే, పృచ్ఛతే=అడిగినట్టి, నారదాయ=నారదుని కొఱకు, అభ్యధాత్ =పలికెను. 'ఏవ' అనుటతో సర్వమం దే

వ్యత్యాసమును లేనట్లుగా నని తెలియవలెను. మొదలు నారాయణ మూర్తి బ్రహ్మ కుపదేశించెను. బ్రహ్మ నారదునకుఁ జెప్పెను. నారదుఁడు వ్యాసునకుఁ దెల్పెను. వ్యాసుఁడు నా కుపదేశించెను. నేను నీ ప్రశ్న కుత్తరముగా దానినే చెప్పఁబోయెద నని తాత్పర్యము. 25

శ్రీ పోతన్న గారు:

వచ: అని యిట్లు పలికిన వైయాసి వచనంబుల నౌత్తరేయుండు గందళితహృదయుండై నిర్మలమతి విశేషంబున—

సుతుల హితుల విడిచి చుట్టాల విడిచి యి
ల్లాలి విడిచి పశుగృహాళి విడిచి
రాజు హృదయ మిడియె రాజీవనయనుపై
ధనము విడిచి బిడ్డఁదనము విడిచి.

వచ: ఇట్లు మృత్యుభయము నిరసించి ధర్మార్థకామంబులు సన్న్యసించి పురుషోత్తమునందుఁ జిత్తంబు విన్యసించి హరిలీలాలక్షణంబు లుపన్యసింపు మను తలంపున నరేంద్రుఁ డిట్లనియె—

సర్వాత్ము వాసుదేవుని
సర్వజ్ఞుఁడవైన నీవు సంస్తుతిసేయన్
సర్వభ్రాంతులు వదలె మ
హోర్వీసురవర్య! మానసోత్సవ మగుచున్.

ఈశుండు హరి విష్ణుఁ డీ విశ్వమంతయుఁ
బుట్టించు రక్షించుఁ బొలియఁజూచు
బహుశక్తియుతుఁ డగు భగవంతుఁ డవ్యయుఁ
డాది నే శక్తుల నాశ్రయించి
బ్రహ్మశక్రాది రూపముల వినోదించెఁ
గ్రమముననో యేకకాలముననో
ప్రకృతిగుణంబులఁ బట్టి గ్రహించుట
నేకత్వముననుండు నీశ్వరుండు

భిన్నమూర్తి యగుచుఁ బెక్కువిధంబుల
నేల యుండు నితని కేమివచ్చె
మందకున్నఁ దాపసోత్తమ! తెలుపవే!
వేడ్కతోడ నాకు వేదవేద్య!

వచ: అనిన నుత్తరానందను వచనంబులకు నిరుత్తరుండుగాక సదుత్తరప్రదానకుతూహలుండై లోకోత్తరగుణోత్తరుండైన తాపసోత్తముండు దన మనంబున—

పరుఁడై యీశ్వరుఁడై మహామహిముఁడై ప్రాదుర్భవస్థాన సం
హరణక్రీడనుఁడై త్రిశక్తియుతుఁడై యంతర్గతజ్యోతియై
పరమేష్ఠిప్రముఖామరాధిపులకున్ బ్రాపింప రాకుండు దు
స్తరమార్గంబునఁ దేజరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్.

వ: మఱియు సజ్జనదురితసంహరణుండును, దుర్జననివారకుండును, నఖిలసత్త్వరూపకుండును, పరమహంసాశ్రమప్రవర్తమానమునిజన హృదయకమల కర్ణికామధ్యదీపకుండును, సాత్వతశ్రేష్ఠుండును, పరమభక్తియుక్త సులభుండును, భక్తిహీనజనదుర్లభుండును, నిరతిశయనిరుపమ నిరవధిక ప్రకారుండును, నిజస్వరూపబ్రహ్మ విహారుండును నైన యప్పరమేశ్వరునకు నమస్కరించెద.

ఏ విభు వందనార్చనము లే విభు చింతయు నామకీర్తనం
బే విభులీల లద్భుతము లెవ్వని సంశ్రవణంబుసేయ దో
షావలిఁబాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగునంట్టి నే
నా విభు నాశ్రయించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్.
ఏ పరమేశుపాదయుగ మెప్పుడుఁగోరి భజించి నేర్పరుల్
లోపలిబుద్ధితో నుభయలోకములందుల సక్తిఁబాసి యే
తాపములేక బ్రహ్మగతిఁ దారు గతశ్రములై చరింతు రే
నా పరమేశు మ్రొక్కెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్.

తపములు సేసియైన మఱిదానము లెన్నియుఁ జేసియైన నే
జపములు సేసియైన ఫలసంచయ మెవ్వనిఁ జేర్పకున్న హే
యపదములై దురంతవిపదంచితరీతిగ నొప్పుచుండు న
య్యపరిమితున్ భజించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్.

యవన వ్యాధ పుళింద హూణ శక కంకాభీర చండాల సం
భవులుం దక్కిన పాపవర్తనులు నే భద్రాత్ము సేవించి భా
గవతశ్రేష్ఠుల డాసి శుద్ధతనులన్ గల్యాణులై యుందు రా
యవికారుం బ్రభవిష్ణు నామదిలో నశ్రాంతమున్ మ్రొక్కెదన్.

తపముల్ చేసిననో మనోవిరతినో దానవ్రతప్రీతినో
జపమంత్రంబులనో శ్రుతిస్మృతులనో సద్భక్తినో యెట్లు ల
బ్ధపదుం డౌనని బ్రహ్మరుద్రముఖరుల్ భావింతు రెవ్వాని న
య్యపవర్గాధిపుఁ డాత్మమూర్తి సులభుం డౌఁగాక నా కెప్పుడున్.

శ్రీపతియు యజ్ఞపతియుఁ బ్ర
జాపతియున్ బుద్ధిపతియు జగదధిపతియుఁ
భూపతియు యాదవశ్రే
ణీపతియుఁ గతియునైన నిపుణు భజింతున్.

అణువో కాక కడున్మహావిభవుఁడో యచ్ఛిన్నుఁడో ఛిన్నుఁడో
గుణియో నిర్గుణియో యటంచు విబుధుల్ గుంఠీభవత్తత్త్వ మా
ర్గణులై యే విభు పాదపద్మభజనోత్కర్షంబులఁ దత్త్వవీ
క్షణముం జేసెద రట్టి విష్ణుఁ బరముఁ సర్వాత్ము సేవించెదఁ.

జగదుత్పాదనబుద్ధి బ్రహ్మకు మదిఁ సంధింప నూహించి యే
భగవంతుండు సరస్వతిం బనుప నా పద్మాస్య దా వ్విభుఁ
మగనింగా వరియించి తద్భువనసామ్రాజ్యస్థితిన్ సృష్టిపా
ర్గుఁ జేసెన్ మును బ్రహ్మ నటి మము నారంభింతు సేవింపఁగన్.

పూర్ణుఁ డయ్యును మహాభూతపంచకయోగ
మున మేనులను బురములు సృజించి

పురములలోనుండి పురుషభావంబున
దీపించు నెవ్వఁడు దీరవృత్తిఁ

బంచభూతములను బదునొకం డింద్రియ
ములఁ బ్రకాశింపించి భూరిమహిమ

షోడశాత్మకుఁ డన శోభిల్లి జీవత్వ
నృత్యవినోదంబు నెఱపుచుండు

నట్టి భగవంతుఁ డవ్యయుఁ డచ్యుతుండు
మానసోదితవాక్పుష్పమాలికలను
మంజు నవరస మకరంద మహిమ లుట్ట
శిష్టహృద్భావలీలలఁ జేయుఁగాక।

మానధనుల్ మహాత్ములు సమాధినిరూఢులు యన్ముఖాంబుజ
ధ్యానమరందపానమున నాత్మభయంబులఁ బాసి ముక్తులై
లూనతనొంద రట్టి మునిలోక శిఖామణికిన్ విశంకటా
జ్ఞాన నభో తమోమణికి సాధుజనాగ్రణి కేను మ్రొక్కెదన్.

వ: అనియిట్లు హరి గురు వందనంబుసేసి శుకయోగీంద్రుం డిట్లనియె-

అవిరోధంబున నీవు నన్నడుగు నీ యర్థంబు మున్ బ్రహ్మ మా
ధవుచేతన్ విని నారదుం డడిగినన్ దథ్యంబుగాఁ జెప్పె మా
నవలోకేశ్వర। నారదుండు వెనుకన్ నాకుం బ్రసాదించె సం
శ్రవణీయంబు మహాద్భుతంబు వినుమా సందేహవిచ్ఛేదమున్.

అర్థములు: వైయాసి వచనంబులు=వ్యాసుని కుమారుఁడైన శుకబ్రహ్మ మాటలు, ఔత్తరేయుండు = ఉత్తర కొడుకైన పరీక్షిత్తు, కందళితహృదయుండై=ఎక్కువగా సంతోషపడిన మనస్సుగలవాఁడై, నిర్మలమతి విశేషంబునన్=శుద్ధమైన బుద్ధితో.

వదలి, ఆడ్డుఁదనము వదలి=సోమరితనమును వదలి, రాజు=పరీక్షిత్తు, రాజీవనయనుపైన్=శ్రీమన్నారాయణమూర్తిపైన, హృదయమున్, ఇడియెన్=నిలిపికొనెను.

తాత్పర్యము: రాజు సుతులపైనను, చుట్టములపైనను, ధనము పైనను, పశుగృహాళిపైనను సంగమును వదలుకొని కమలలోచనుపై మనసు పెట్టుకొన్నాఁడు.

మృత్యుభయమున్=చావుయొక్క భయమును, నిరసించి=తొలఁగఁద్రోసి, ధర్మార్థకామంబులు=త్రిపురుషార్థములు, సన్న్యసించి=వదలి, విన్యసించి=ఉంచి, ఉపన్యసింపుము=బోధింపుము.

తాత్పర్యము: రాజీ రీతిగా మృత్యుభయమును దృణీకరించి నాఁడు. త్రిపురుషార్థములను వదలుకొన్నాఁడు. భగవంతునిపైననే మనస్సు నిల్పుకొన్నాఁడు. హరిలీలాలక్షణములు చెప్పుమను బుద్ధితో శుకబ్రహ్మనుగూర్చి ఇట్లు ప్రశ్నించెను.

మహోర్వీసురవర్య=ఉత్తమబ్రాహ్మణులకంటె నుత్తముఁడైన వాఁడా!, సర్వజ్ఞుఁడవైన నీవు=సమస్తము నెఱిఁగిన నీవు, సర్వాత్ము వాసుదేవునిన్=సర్వులయం దాత్మస్వరూపుఁడుగానున్న వాసుదేవ పరబ్రహ్మనుగూర్చి, సంస్తుతిసేయన్=వినుతింపఁగా, మానస+ఉత్సవ మగుచున్=మనస్సున కత్యంతము సంతోషముగలుగుచు, సర్వభ్రాంతులున్ వదలెన్=అజ్ఞానమూలకములైన సమస్త భ్రాంతులును వదలి పోయినవి.

తాత్పర్యము: బ్రాహ్మణోత్తములలో శ్రేష్ఠుఁడవైన శుకముని! సర్వజ్ఞుఁడవైన నీవు, సర్వులయం దాత్మభావనతో నున్న వాసుదేవ

పరబ్రహ్మను గూర్చి సంస్తుతింపఁగా, నా సమస్త భ్రాంతులును వదలి పోయినవి. మానసోల్లాసము హెచ్చినది. అజ్ఞానులు భగవంతుని లీలావిలాసములను దెలిసి సంస్తుతింప లేరు. నీవు సర్వజ్ఞుఁడవు. అందుచే నీ కథనము సత్యమై మధురమై యుండునని భావము. 'సర్వజ్ఞస్య తవాఽనఘ!' అనిమూలము. 'సర్వభ్రాంతులున వదలెన్' 'తమో విశీర్యతే మహ్యం' అని మూలము. సమస్తభ్రాంతులు నజ్ఞానము నాశ్రయించి ప్రవర్తించునవే. అందుచేత తమ శ్శబ్దమునకుఁ జక్కని తెలిగింపే యైనది.

ఈశుండు = సర్వనియామకుఁడు, హరి = సర్వపాపములను హరించువాఁడు, విష్ణుఁడు = సర్వవ్యాపియైన పరమాత్ముఁడు, ఈ విశ్వమంతయున్ = ఈ సమస్త ప్రపంచమును, పొలియన చూచున్ = నాశమొనరించును. బహుశక్తియుతుఁడగు భగవంతుఁడు = అనేక శక్తులుగల పరమాత్మ. 'పురుశక్తిః' అని మూలము. ఆదిన్ = సృష్ట్యాదియందు, ఏ శక్తులన్ ఆశ్రయించి = ఏ ప్రకృతిశక్తుల నాశ్రయించి, బ్రహ్మశక్రాది రూపములన్ = బ్రహ్మ దేవేంద్రుఁడు మొదలైన రూపములచేత, వినోదించెన్ = క్రీడించెనో, ప్రకృతిగుణంబులన్ పట్టి గ్రహించుట = ప్రకృతి యొక్క గుణములను స్వీకరించుట, క్రమముననో = ఒకదాని వెనుక నొకటిగానో, ఏకకాలముననో = ఒకేయైన కాలమునందో, ఏకత్వమునన్ ఉండు ఈశ్వరుండు = ఒంటిగా నున్న పరమాత్మ, భిన్నమూర్తి యగుచున్ = వేఱువేఱైన బ్రహ్మశక్రాది రూపములతో, పెక్కు విధంబులన్, ఏల ఉండున్, ఉండకున్నన్, అతనికిన్ ఏమి వచ్చెన్ = అట్లుండకున్నచో నతనికి వచ్చిన నష్టమేమి?, వేదవేద్య! = వేదములచేఁ దెలిసికొనఁ దగినవాఁడా!, తాపస + ఉత్తమ! = ఋషిశ్రేష్ఠా!

యీ పరమాత్ముఁడు ఏ యే శక్తుల నాశ్రయించి బ్రహ్మ శక్రాది రూప ముల నాడించుచుఁ దాను గ్రీడించును! పరస్పర విరుద్ధస్వభావము గల ప్రకృతిశక్తుల నన్నిటి నేకకాలముననే గ్రహించునా? లేక భిన్న కాలములందు గ్రహించునా? ఒంటరిగా నున్న పరమేశ్వరుఁడు బహు వేషములతో బహువిధములఁ గ్రీడింపవలసిన యవసర మేమి వచ్చి నది? అట్లొనర్చుకున్నచో నాతనికిఁ గల్గు నష్ట మే మున్నది? ఈ విషయము లన్నియు నాకు స్పష్టముగా వివరించి చెప్పుము.

విశేషార్థములు: శుకబ్రహ్మను గూర్చి 'వేదవేద్య' 'తాపసో త్తమః' అనుచున్నాఁడు. ఆత్మజ్ఞానియైన శుకుఁడు బ్రహ్మస్వరూపుఁడే యైనదానివలన బ్రహ్మవలెనే దానును వేదవేద్యుఁడే యని చెప్ప వచ్చును. లేక సత్పురుషుల కొనర్చవలసిన యుపచారములు వేదా నుకూలములై వేదవేద్యము లగుటచే నా మూలముగ విశేషణమును సమర్థించికొనవచ్చును.

అనినన్ = ఇట్లు పలుకఁగా, ఉత్తరానందను వచనంబులకున్ = పరిక్షిత్తు మాటలకు, నిరుత్తరుండుగాక = ఉత్తర మీయని వాఁడుగాక, సదుత్తరప్రదాన కుతూహలుండై = చక్కని యుత్తర మిచ్చుటయం దాశ గలవాఁడై, లోక = లోకమందు, ఉత్తర = శ్రేష్ఠములైన, గుణ = సద్గు ణములచేత, ఉత్తరుండు = గొప్పవాఁడైన, తాపసోత్తముండు = తపస్వు లలో శ్రేష్ఠుఁడైన శుకబ్రహ్మ, తన మనంబునన్ -

తాత్పర్యము: ఉత్తరానందనుఁ డీ రీతిగా నడిగిన ప్రశ్నకుఁ జక్కని యుత్తర మొసఁగవలెనని శుకబ్రహ్మ కుతూహలము. అతఁడు మనస్సులో భగవంతు నిట్లు ధ్యానించికొన్నాఁడు.

పరుఁడై = సర్వోత్తముఁడై, ఈశ్వరుఁడై = సమస్త లోకములను

ప్రాదుర్భవస్థాన సంహరణ క్రీడనుఁడై = సృష్టి రక్షణము సంహార మనెడు క్రీడలు గలవాఁడై, త్రిశక్తియుతుఁడై = సత్త్వ రజ స్తమము లను మూఁడు శక్తులతోఁ గూడినవాఁడై, అంతర్గతజ్యోతియై = సర్వ ప్రాణుల హృదయము లందును నంతర్యామిగా వెలుఁగుచున్న జ్యోతియై, పరమేష్ఠిప్రముఖ = బ్రహ్మ మొదలైన, అమర + అధిపుల కున్ = దేవశ్రేష్ఠులకును, ప్రాపింపన్ రాకుండు = పొందుట కశక్యమైన, దుస్తరమార్గంబునన్ = అనుపలభ్యమైన మార్గమందు, తేజరిల్లు హరికిన్ = ప్రకాశించు పరమాత్మునకు, తత్త్వార్థినై = అతని స్వరూపమును దెలియఁగోరుచున్నవాఁడనై, మ్రొక్కెదన్ = నమస్కరింతును.

తాత్పర్యము: అతఁడు పరమపురుషుఁడు. అపరిమిత మహిమ గలవాఁడు. సృష్టి, స్థితి, సంహారరూపమైన క్రీడలు గలవాఁడు. త్రి గుణములతో నిత్యయుతుఁడు. సర్వప్రాణులయందును నంతరాత్మగా నొప్పుచున్నవాఁడు. బ్రహ్మాదులకును దెలియనివాఁడు. అతనిమార్గ మెవ్వరికిని దెలియదు అట్టి యా పరమాత్మునికి నమస్కారము.

విశేషణములు: ఇక్కడ మూల మీ క్రిందిది-

**నమః పరస్మై పురుషాయ భూయసే సదుద్భవస్థాన నిరోధలీలయా.**

ఇచ్చట 'అసదుద్భవ స్థాననిరోధలీలయా' అనఁగా లేనిప్రపంచము యొక్క సృష్టి స్థితి సంహారములు. 'అసతః ప్రపంచస్య' అని శ్రీధరుల వ్యాఖ్య. ద్వైత విశిష్టాద్వైతులు 'సతః ప్రపంచస్య' అని వ్యాఖ్యానించిరి. పోతనామాత్యుఁడు చాల సమర్థముగా సదసత్తులను వదలి ప్రాదుర్భవస్థాన సంహరణక్రీడనుఁడై అనియే యన్నాఁడు. చాల సమర్థముగాఁ జేసిన తెనిఁగింపు.

మూలము. అఖిలసత్త్వరూపకుండును = సమస్త ప్రాణులును దానై యున్నవాఁడు లేక నా యా దేవతల స్వరూపముతో నానా ఫలముల నొసఁగు వాఁడు. పరమహంసాశ్రమ = పరమహంసాశ్రమమందు, ప్రవర్తమాన=నెలకొన్న, మునిజనహృదయకమల = మునుల మనః కమలముల యందలి, కర్ణికామధ్య=దిమ్మెనడుమ, దీపకుండు=ప్రకాశించువాఁడు. దీనికి మూలము- 'పారమహంస్య ఆశ్రమే వ్యవస్థితానా మనుమృగ్యదాశుషే' అని. 'పారమహంస్యే=ప్రత్యఙ్నిష్ఠారూపే ఆశ్రమే వ్యవస్థితానాం పుంసాం అనుమృగ్యం అసన్నిరసనేన పునః పునర్మృగ్యం యదాత్మతత్త్వం తస్యదాశుషే దాత్రే' అని వ్యాఖ్య. అనఁగా పరమహంసలకు ఆత్మతత్త్వమును దయసేయు వాఁడని భావము. అత్యంతవిరక్తులైన పరమహంసాద్యాశ్రమము లందున్న మహాత్ములకు ప్రార్థించినవాని నిచ్చువాఁడని విశిష్టాద్వైతవ్యాఖ్య. పోతన్నగారి తెలుఁగు ఈ రెంటికిని భిన్నముగా నున్నది సాత్వత శ్రేష్ఠుఁడు. 'ఋషభాయ సాత్వతాం' అని మూలము. సాత్వతాం= భక్తానాం, ఋషభాయ=పాలకాయ' అని శ్రీధరుఁడు. 'సాత్వతాం ఋషభాయ = యాదవాగ్రగణ్యాయ' అని విశిష్టాద్వైత వ్యాఖ్య. పోతన్న ఈ భావమునే యనుసరించిన ట్లున్నది పరమభక్తియుక్త సులభుండు=గొప్పభక్తితోఁ గూడిన వారికిఁ బొందుటకు సులభమైన వాఁడు. 'విదూరకాష్ఠాయ ముహుః కుయోగినాం'అని మూలము. పోతన్న విధివాక్యముగా మార్చినాఁడు. భక్తిహీనజనదుర్లభుఁడు= భక్తిహీనులకు దుర్లభుఁడు. మూలము నిషేధవాక్యమును మాత్రమే దెల్పఁగా పోతన్న రెంటిని జెప్పినాఁడని సమర్థనము. నిరతిశయ= అతిశయమైనది లేని, నిరుపమ=సాటియైనది లేని, నిరవధిక=అనంతమైన(అవధులులేని), ప్రకారుఁడు=పద్ధతిగలవాఁడు, నిజస్వరూపబ్రహ్మవిహారుఁడు = తన స్వరూపమైన బ్రహ్మత్వమందు నిరంతరము విహరించువాఁడు. 'స్వధామని బ్రహ్మణి రంస్యతే నమః' అని మూలము.

తాత్పర్యము: కృష్ణపరమాత్ముఁడు సత్పురుషుల పాపములను నశింపఁజేయును. దుర్జనులను సంహరించును. వివిధదేవతారూపములు ధరించి యా యా కార్యఫలముల నొసఁగును. లేక అంతర్యామిగా సర్వప్రాణులం దుండును. పరమ హంసాశ్రమస్థులైన మహాయోగుల హృత్కమలములయందుఁ బ్రకాశించుచుండును. యాదవశ్రేష్ఠుఁ డాతఁడు. పరమభక్తులకుసులభుఁడు. భక్తిహీనులకు దుర్లభుఁడు. ఆతని శక్తి నిరవధికము. దానితో సమానమైనది లేదు. ఇఁక నతిశయ మెక్కడనుండి వచ్చును? నిరంతరమును స్వస్వరూపమైన బ్రహ్మత్వమున విహరించుచుండెడు వాఁ డాతఁడు. అట్టి యా పరమేశ్వరునకు నమస్కారము.

ఏ విభు వందనార్చనములు=ఏ పరమాత్ముని వందనమును, అర్చనమును, ఏ విభు చింతయున్=ఎవనిఁ గూర్చిన స్మరణమును, నామకీర్తనంబున్ = నామకీర్తనమును (మంగళకరములో), ఎవ్వని సంశ్రవణంబు చేయన్=ఎవ్వని కథలను వినఁగా, దోషావలిన్ పాసి =పాపములను బోఁగొట్టుకొని, లోకము=ప్రపంచము, శుభ+ఆయత వృత్తిన్=శుభములచే నెక్కువగాఁ గూడికొని, చెలంగున్=సంతోషించును, అంద్రు=అందురో, ఏ విభులీలలు అద్భుతములు=ఎవ్వని లీల లాశ్చర్యమును గల్గించునట్టివో, అఘౌఘ నివర్తనున్=పాపసమూహములను మరలించునట్టి, భద్రకీర్తనున్=మంగళమును గలిగించు కీర్తనము గలిగిన, ఆ విభున్=అట్టి మహావిష్ణువును, ఆశ్రయించెదన్=శరణుఁ జొచ్చెదను.

భావ: సర్వసాధనముల కంటెను భక్తియే శ్రేష్ఠమని భావించి నమస్కరించుచున్నాఁడు-

తాత్పర్యము: ఏ పరమాత్ముని వందనము, అర్చనము, స్మరణము, నామకీర్తనము మొదలగునవి సమస్తలోకముల పాపములను నశింపఁజేసి శుభము లొడఁగూర్చునో అట్టి సర్వేశ్వరు నాశ్రయింతును.

సమస్త పాపనాశకుఁడు వాఁడు. వాని కీర్తన సమస్త మంగళకరము. వానిలీలలు మహాద్భుతములు.

ఏ పరమేశు పాదయుగమున్ = ఏ పరమాత్ముని పాదద్వంద్వమును, ఎప్పుడున్ కోరి=నిరంతరమును నాసక్తితో, భజించు నేర్పరుల్ =కీర్తించెడు విచక్షణులు, లోపలిబుద్ధిలోన్=అంతరాత్మలో, ఉభయలోకములందుల = ఈ లోకమందును పరలోకమందును గలిగెడు సుఖము లందు, సక్తిన్ పాసి = సంగమును వదలినవారై, ఏ తాపమున్ లేక =శ్రమరహితులై. 'గతక్లమాః' అని మూలము. బ్రహ్మగతిన్=భగవద్గతిని. 'బ్రహ్మగతిం' మూలము. 'భగవద్గతిం' వైష్ణవవ్యాఖ్య. తారు=తాము, గతశ్రములై=ఏమియును గష్టపడక, చరింతురు=వర్తింతురు, ఏను=నేను, అఘౌఘనివర్తను భద్రకీర్తనున్, ఆ పరమేశ్వరుని బ్రొక్కెదన్-

ఇందులో 'నే తాపము లేక' 'గతశ్రములై' అని రెండు పదము లున్నవి. మూలములో 'గతక్లమాః' అని యొక్కటే పదము. ప్రయాసరహితాః అని శ్రీధరులవ్యాఖ్య కనుక పోతన్న రెండుపదములకును 'అధివ్యాధులు లేనివారై' యని యన్వయించికొన్నాఁడు

తపములు సేసియైనన్ = తపము లొనర్చియైనను, మఱిన్ = ఇంకను, దానములెన్నియున్ చేసియైనన్=పరమదానపరులై యున్నను ఏ జపములు చేసియైనన్=ఏ జపానుష్ఠాన మొనర్చియైనను. ఫలసంచయము = వానినుండి యేర్పడెడు ఫలము, ఎవ్వనిన్ చేర్పకున్నన్=ఏ భగవంతున కర్పింప కున్నచో, హేయపదములై=అవి యన్నియు సజ్జనుల కాదరింపరానివై, దురంత=అంతములేని, విపత్ + అంచిత రీతిగన్=ఆపత్తులతోఁగూడికొన్నవిగా, ఒప్పుచుండున్, అయ్యపరిమితున్=అట్టి యపరిమితములైన శక్తులుగల, అఘౌఘనివర్తనున్, భద్రకీర్తనున భజించెదను.

తాత్పర్యము: ఎన్ని తపములు చేసినను, దానము లొనర్చినను, జపములు నిర్వహించినను - ఆ ఫలము లన్నియు భగవంతున

కర్పించినప్పుడే మానవునకు క్షేమము గల్గును. అట్లు గానట్టి యా ప్రయానమును సజ్జను లాదరింపరు. పైగా నవియంతయు లేని యాపదలనే గల్గించును. అట్టి యపరిమిత శక్తిగల సర్వేశ్వరునకు నమస్కారము. 'తపస్వినో దానపరా యశస్వినో మనస్వినో మంత్రవిద స్సుమంగళాః' అని మూలము. ఇవన్నియు వేఱువేఱు సాధనములు. ఒక్కసాధనమునకే యంగములు గావు.

యవన=యవనులు, వ్యాధ = సతుహింసన వృత్తితో జీవించువారు, పుళింద=పుళిందులు, తమ స్పర్శచేతఁ బెద్దలను జెఱచువారు, పుళిందులు, హూణులు, శకులు, కంకులు, అభీరులు, చండాలురు-ఈ మొదలైన వారికిఁ బుట్టినవారు. వీరి భేదములు సంస్కృతవ్యాఖ్యలో వ్రాసినాను. వివరములకై చూచికొనవచ్చును. తక్కినపాపవర్తనులు =మఱివేఱైన బ్రహ్మహత్యాది దోషము లొనర్చినవారు. ఏ భద్రాత్మున్ సేవించి=ఏ భగవంతుని భజించి, శుద్ధతనులన్=శుద్ధమైన శరీరములు గల, భాగవతశ్రేష్ఠులన్ డాసి=భగవద్భక్తులను సమీపించి, కల్యాణులై యుందురు=మంగళములు గల్గినవారై యుందురు. ఆ + అవికారున్ =అట్టివికారరహితుఁడైన వానిని, ప్రభవిష్ణున్=సర్వేశ్వరుఁడైన వానిని, నాదు మదిలోన్=నా మనస్సునందు, అశ్రాంతమున్=నిరంతరమును, మ్రొక్కెదన్=సేవించెదను.

దీనికి మూల మీ క్రింది శ్లోకము-

కిరాత హూణాంధ్ర పుళింద పుల్కసా
అభీర కంకా యవనాః కషాదయః,
యేఽన్యేచ పాపాః యదుపాశ్రయాశ్రయా
శ్శుద్ధ్యంతి తస్మై ప్రభవిష్ణవే నమః.

పైనిఁ జెప్పిన సమస్త నీచజాతులును, దక్కిన బ్రహ్మహత్యాది దోషము లొనర్చినవారును ఏ భగవద్భక్తుల నాశ్రయించి పవిత్రులగుదురో అట్టి పరమాత్మునకు నమస్కారము అని యర్థము.

శ్రీధరుఁ డీ శ్లోకమునకు

యదుపాశ్రయాః భాగవతాః
తదాశ్రయా శ్శుధ్యంతి,
అసంభావనాశంకాం పరిహరతి
ప్రభవిష్ణవే ప్రభవితుం శీలం యస్యేతి.

అని వ్యాఖ్యానించినాఁడు. భగవంత ముపాశ్రితాః భాగవతాః. తేషా మాశ్రితాః తేఽపి శుద్ధ్యంతి సాక్షాద్భగవత్సం శ్రయణా భావేపి భాగవతసంశ్రయం కుర్వంత స్సంతశ్శుద్ధ్యంతి. 'ప్రభవిష్ణవే—నిఖిల జగత్కారణీభూతాయ తన్నియమన సమర్థాయ' అని యున్నది. పోతన్న భగవంతుని సేవించుచు భాగవతశ్రేష్ఠులను సమీపింపవలెనని చెప్పినాఁడు. ఈ రచన కొంత ద్వైతసిద్ధాంతమునకు దగ్గఱగానున్న ట్లున్నది. విజయధ్వజులు భగవద్భక్తుల సమాశ్రయణమే పాపనివర్తక మని వేఱుగాఁ జెప్పవలెనా? అను పీఠికతో నీ శ్లోకము నారంభించి నాఁడు. అకాడమీ ప్రతిలో 'శుద్ధతనులగు' అని కలదు. భాగవత శ్రేష్ఠులగు అనుటకు విశేషణము; కాని మూలమున 'శుద్ధ్యంతి' అని యున్నది. అందుచే శుద్ధతనులై అనెడు పాఠము సమీచీనమని తోఁచు చున్నది. ఇక్కడ 'ఆంధ్ర పుళింద పుల్కసాః' అని మూలము. పోతన్న తెనుఁగులో నాంధ్రశబ్దమును దొలఁగించినాఁడు. అతఁ డాంధ్రుఁ డగుటచే జాతీయమైన యభిమానముతో దొలఁగించినాఁడని యనుకొనవచ్చును. కాని యాతఁ డాత్మవిదుఁడు, అందుచే నే యభిమానముగూడ నుండదని నాతలఁపు. కాని మన మట్లనుకొని సంతోష పడుటలో నసంగతి లేదు.

తపము చేసిననో—తపశ్చర్యతోనో, మనోనియతినో—మనస్సు నిలుకడతోనో, దానవ్రత ప్రీతినో — దానము నందలి ప్రీతి చేతనో,

తులనో = శ్రుతులు స్మృతుల వలననో, సద్భక్తినో = గొప్పభక్తి వల ననో, ఎట్లు లబ్ధపడుండౌనని =ఏ రీతిగా నాతని స్థానమును బొంద వచ్చునని, ఎవ్వానిన్, బ్రహ్మ రుద్రముఖరుల్ = బ్రహ్మ రుద్రుఁడు మొదలైనవారు, భావింతురు = చింతింతురో, అయ్యపవర్గాధిపుఁడు = ఆ మోక్ష మొసఁగుట కధికారియైనవాఁడు, ఆత్మమూర్తి = ఆత్మస్వరూపుఁ డైనవాఁడు, నాకున ఎప్పుడుఁ, సులభుండు, ఔఁ కాక = నా కెప్పు డును బ్రసన్నుఁడగుఁ గాక !

తాత్పర్యము : తపశ్చరణతోనో, మనోనిగ్రహముతోనో, దాన ములతోనో, జప మంత్రాదులతోనో, శ్రుతి స్మృతుల ననువర్తించుట తోనో, సద్భక్తినో భగవంతుఁ డెట్లు చిక్కునని బ్రహ్మ రుద్రాదులు నిరంతరమును దలపోయుచుందురు. అట్టి ముక్తిప్రదుఁడైన సర్వేశ్వ రుఁడు నా కెప్పుడును బ్రసన్నుఁడుగా నుండుఁగాక !.

దీనికి మూలశ్లోక మిట్లున్నది.

**స ఏష ఆత్మాత్మవతా మధీశ్వరః**
**త్రయీమయో ధర్మమయ స్తపోమయః,**
**గతవ్యళీకై రజశంకరాదిభి**
**ర్వితర్క్యలింగో భగవాన్ ప్రసీదతు.**

మూలములో 'త్రయీమయః' ఇత్యాదులు భగవద్విశేషణ ములు. ఆత్మవతామధీశ్వరః అనుదానికి ఆత్మవతాం ధీరాణాం ఆత్మ త్వేన ఉపాస్య ఇత్యర్థః' అని శ్రీధరవ్యాఖ్య. గతవ్యళీకైః = నిష్కపటైః భక్తైః వితర్క్యం అత్యాశ్చర్యేణ వివక్షణీయం లింగం మూర్తిర్యస్యసః, అని వేఱుగా నన్వయించినాఁడు. కాని, త్రయీమయత్వాది విశేషణైః తత్తన్మార్గేణ ఉపాస్యత్వం వివక్షితం' అని యొకమా టన్నాఁడు. దాని నాధారముగాఁ దీసికొని పోతన్న బ్రహ్మరుద్రాదులు వికల్పించి

ఈ యధ్యాయ మంతయు నన్నిటికంటెను భక్తి సర్వోత్కృష్ట మని చెప్పుటకే ప్రవృత్తమైనది. అమాత్యు లా విషయమును జ్ఞాపకముంచి కొనియున్నచో బాగుండెడిది.

శ్రీపతియున–జగదీశ్వరియైన లక్ష్మీదేవికి భర్తయును, యజ్ఞపతియున్ 'యజ్ఞో వై విష్ణుః' ఇత్యాదులచేఁ దానే యజ్ఞస్వరూపుఁడై దానిని నిర్విఘ్నముగ నెఱవేర్చి తత్ఫలము నందించువాఁడు. ప్రజాపతియున్ – నిఖిలప్రజలను సృష్టించువాఁడు లేక తత్పరిపాలకుఁడు. బుద్ధిపతియున్–శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్య స్సాక్షాత్కర్తవ్యః' ఇతి శ్రుత్యుక్త శ్రవణ మనన నిదిధ్యాసన సాక్షాత్కారాది ఫలప్రదుఁడు. జగ దధిపతియున్–సమస్త లోకప్రభువు. భూపతియున–ధరాపతి, యాదవ శ్రేణీపతియున్ – అంధక వృష్ణి సాత్వతాదులైన యాదవులకు పతియైనవాఁడు. లోకమందు సర్వవిధములైన యుపకారముల నొనర్చుటచేత పతియైనవాఁడు, గతి–పరమప్రాప్యుఁడు.

తాత్పర్యము : లక్ష్మీపతియైనవాఁడు, యజ్ఞస్వరూపుఁడై యజ్ఞమును రక్షించి తత్ఫలప్రదుఁ డైనవాఁడు, సమస్త లోకకర్త, మనన ధారణాదుల కాశ్రయుఁడు, లోకాధిపతియైనవాఁడు, ధరాపతి, యాదవులకు పతి, గతి. అట్టి నిపుణునకు నమస్కారము.

అణువో – చాల సూక్ష్మమైనవాఁడో, కాక కడున మహావిభవుఁడో, ఛిన్నుఁడో లేక అచ్ఛిన్నుఁడో, గుణియో – సమస్త కల్యాణ గుణములు గలవాఁడో, నిర్గుణియో, అటుంచున్, విబుధుల్–మహాజ్ఞానులు, కుంఠీభవత్–మొక్కవోయినట్టి, తత్త్వమార్గణులై–భగవంతుని స్వరూపస్వభావ అన్వేషణము గలవారై, ఏ విభుపాదపద్మభజనోత్కర్షంబులన–ఏ స్వామి పాదపద్మములను భజించుటచేత, తత్త్వవీక్షమున్ చేసెదరు–వాని యథార్థస్థితిని గ్రహింతురు, అట్టి విష్ణున్, పరమున్, సర్వాత్మున్, సేవించెదన్.

తాత్పర్యము: పరమాత్మ స్వరూప మెట్టిది? అణువా? లేక పరమస్థూలుఁడా? యని జ్ఞానులు బుద్ధితో వితర్కించికొందురు. విమర్శించికొని యేదియు నిర్ధరింపనేరక కడకు భగవంతుని పాదపద్మములు నిష్కల్మషమగు భక్తితో భజించి యాతని స్వరూప మవగత మొనర్చికొందురు. అట్టి సర్వేశ్వరునకు నమస్కారము.

మూలములోని 'యదంఘ్ర్యభిధ్యాన సమాధిధౌతయా' అనునదియు, 'వదంతి చైత త్కవయో యథారుచం' అనునదియు నీ పెంపునకు మూలము.

ఏ భగవంతుఁడు, జగదుత్పాదనబుద్ధిన్=జగత్తును సృష్టించెడు మనస్సుచే, బ్రహ్మకున్, మదిన్, సంధింపన్=కల్గించుటకు, ఊహించి =తలపోసి, సరస్వతిన్, పనుపన్, ఆ పద్మాస్య=ఆ సరస్వతి, తాన్ అవ్విభున్ మగనిన్ కాన్ వరియించి=బ్రహ్మను భర్తగాఁ జేసికొన్నదై, తద్భువన సామ్రాజ్యస్థితిన్=సమస్త ప్రపంచములకును నేలికగానుండున ట్లేర్పఱచి, మును=తొల్లి, బ్రహ్మన్ సృష్టిపారగున్ చేసెన్=సృష్టిక్రియయందు నిపుణునిగా నొనర్చెనో, అట్టి ఘనున్ సేవింపఁగన్ ఆరంభింతున్,

తాత్పర్యము: కల్పాదియందు బ్రహ్మదేవుఁడు సృష్టిప్రకారమును మఱచిపోయెను. అప్పుడు భగవంతుఁడు సరస్వతి నంపినాఁడు. ఆమె బ్రహ్మను పతిగా వరించి యతనిని సృష్టిపారగునిగాఁ జేసినది. అట్టి సర్వేశ్వరునకు నమస్కారము. దీనికి మూలశ్లోకము-

**ప్రచోదితా యేన పురా సరస్వతీ**
**వితన్వతా ఽజస్య సతీం స్మృతిం హృది,**
**స్వలక్షణా ప్రాదురభూత్కిలాస్యత**
**స్సమే ఋషీణాం ఋషభః ప్రసీదతామ్.**

కల్పాదియందు సృష్టిస్మృతిని జతుర్ముఖుండు విస్మరించెను. అప్పుడు భగవంతుఁడు వేదములను బ్రేరేచినాఁడు. వేదమాత శిక్షాది సర్వ

లక్షణపరిష్కృతయై బ్రహ్మదేవుని ముఖమునుండి యావిర్భవించినది. ఆ శ్రుతుల సాహాయ్యముతోఁ జతుర్ముఖుండు యథాపూర్వముగా సృష్టి నొనర్చినాఁడు. పోతన్న యీ క్రింది శ్లోకమునుండి సర్వాత్మనా భేదించెను. 'సరస్వతి' అని వాడిన పదమును గ్రహించి యర్థాంతరమునే సృష్టించికొన్నాఁడు. కాని యిచ్చట సరస్వతి యను శబ్దమునకు వేద మాతయనియె సమీచీనమైన యర్థముగాఁ దోఁచుచున్నది.

పూర్ణుఁడయ్యును = నిత్యపరిపూర్ణుఁ డయ్యును, మహాభూత పంచకయోగంబునన్ = పంచభూతముల సంబంధముతో, మేనులను పురములు సృజించి = శరీరము లనెడు పట్టణములు నిర్మించి, ఎవ్వఁడు = ఏ పురుషుఁడు, ధీరవృత్తిన్ = గంభీరమై ప్రవృత్తితో, పురములలో ఉండిన్ = శరీరము లనెడు పురములలో వసించి, పురుషభావంబునన్ = పురుషుఁ డనెడు పేరుతో, దీపించున్ = ప్రకాశించునో, 'పురి శేతే ఇతి పురుషః' అని వ్యుత్పత్తి. పంచభూతములను, పదునొకం డింద్రియముల = పదునాఱు స్వరూపములు గలవాఁ డనఁగా శోభిల్లి, జీవత్వవృత్త్య వినోదంబున = జీవభావముతో నటించుటను, నెఱపుచుండున్; అట్టి భగవంతుఁడు అవ్యయుఁడు అచ్యుతుండు, మానస + ఉదిత = మనస్సునుండి యేర్పడిన, వాక్ + పుష్పమాలికలను = వాక్కు లనెడు పుష్పమాలికల యందు, మంజు = సుందరములైన, నవరస = తొమ్మిది రసము లనెడు, మకరంద మహిమలు = తేనెల యతిశయములు, ఉట్టన్ = నెట్టుకొని ప్రవహింపఁగా, శిష్టహృద్భావలీలలన్ = సత్పురుషులయొక్క మనస్సు లందలి భావలీలలను, చేయుఁ గాతన్ = కల్పించును గాక.

తాత్పర్యము: భగవంతుఁడు సర్వదా పరిపూర్ణుఁడు. ఐనను నాతఁడు పంచభూతములతో శరీరము లను పురములను సృష్టించి వానియం దంతర్యామిగా శయించును. అందుకే యాతనికిఁ బురుషుఁడని పేరు. పురుషుఁడను దానినే క్రిందివర్ణనముతో సమర్థించుచున్నాఁడు. ఏకాదశేంద్రియములు, శబ్దస్పర్శాదులైన పంచతన్మా

త్రలు వీని నన్నిటిని దానే షోడశాత్మకుఁడై యనుభవించుచున్నాఁడు. జీవభావముతో నటించుచున్నాఁడు. అట్టివాఁడు నా మానసమునుండి బయలుదేఱు వాక్కు లనెడు పుష్పమాలికలయందు నవరసములనెడు మకరందములు స్రవింపఁజేసి శిష్టజనుల హృదయములందు నిలిచి యనేక భావలీలలనుఁ బ్రకటించుఁ గాక! 'సోఽలంకృషీష్ట భగవాన్ వచాంసి మే' అను పద్యభాగమునకు గీతపద్యము పెంపు.

మానధనుల్, మహాత్ములు — అభిమానమే ధనముగాఁ గల గొప్పవారు, యత్ + ముఖాంబుజధ్యాన మరందపానమునన్ — ఎవని ముఖాంబుజ ధ్యాన మనెడు తేనెలు త్రావుటతో, ఆత్మభయంబులఁ బాసి — జననమరణరూప భయములనుండి విముక్తి నొందినవారై, ముక్తులై — ముక్తి నంది, లూనతఁ బొందరు — నాశము నెఱుఁగరో, అట్టి మునిలోక శిఖామణికిన్ — మునిశ్రేష్ఠునకు, విశంకటాజ్ఞాన తమోనభో మణికిన్ — అడ్డులేని యజ్ఞాన మనెడు చీఁకటికి సూర్యుఁడైనట్టి, సాధు జనాగ్రణికిన్ — భక్తులలో నుత్తముఁడైన వేదవ్యాసునకు, ఏను మ్రొక్కెదన్ — నేను నమస్కరింతును.

తాత్పర్యము: సమాధిని సాధించిన మహానుభావులు ఎవని ముఖాంబుజధ్యాన మనెడు మరందపానముచే జన్మమరణభయములు దొలఁగి ముక్తి నందెదరో అట్టి వేదవ్యాసునకు నమస్కారము.

'సౌమ్యాః' అని మూలము. దాని పెంపు 'మానధనుల్ మహాత్ములు సమాధి నిరూఢులు' అనునది. యన్ముఖాంబుజ ధ్యాన మరందపాన మనుటకంటె 'జ్ఞానమరంద పానమునన్' అనుట యుక్తము. 'పపుర్జ్ఞానమయం సౌమ్యాః' అని మూలము.

అని యిట్లు హరి గురు వందనంబు సేసి — హరియొక్కయు

అవిరోధంబునన్ = నిష్కపటమైన భావముతో, ఈ యర్థంబు = ఈ విషయమునే, మాధవుచేతన్ = విష్ణువునుండి, తథ్యంబుగాఁ చెప్పెన్ = సత్యముగా వివరించెను, వెనుకన్ = అటు తరువాత, నారదుండు, నాకున్ ప్రసాదించెన్ = నాకు విన్పించెను, సంశ్రవణీయంబు = వినఁదగినది, సందేహవిచ్ఛేదమున్ = సందేహమును తొలఁగించునది.

తాత్పర్యము: రాజా! నీవు నన్నడిగిన విషయమే తొట్టతొలుత శ్రీమన్నారాయణుఁడు బ్రహ్మ కుపదేశించినాఁడు. అతఁడు నారదునకుఁ జెప్పెను. నారదుఁడు వ్యాసున కుపదేశించినాఁడు. ఓ మానవలోకేశ్వరా! నా తండ్రియైన వేదవ్యాసుఁడు నా కుపదేశించెను. వినఁదగిన వానిలో నుత్తమమైన దది. సర్వసంశయములను విచ్ఛేదించును. దానిని నీకుఁ జెప్పుచున్నాను.

పుట్టపర్తి నారాయణాచార్యదాసునిచే విరచింపఁబడిన
'భాగవత సుధాలహరి' యందు ద్వితీయ
స్కంధమున నాలుగవ యధ్యాయము
వ్యాఖ్య ముగిసినది.

# భాగవతసుధాలహరి

## ద్వితీయస్కంధము

## పంచమాధ్యాయము

* * *

నారద ఉవాచ:

దేవదేవ! నమస్తేఽస్తు భూతభావన! పూర్వజ!,
తద్విజానీహి యజ్జ్ఞాన మాత్మతత్త్వ నిదర్శనమ్. 1

**భూతభావన!**=ప్రాణులను వర్ధింపఁజేయువాఁడా!, **పూర్వజ**=ఆదియందు జన్మించినవాఁడా!, **ఆత్మతత్త్వనిదర్శనం**=ఆత్మతత్త్వమును దర్శింపఁజేయునట్టి, **యద్ జ్ఞానం**=ఏ జ్ఞానము గలదో, **తత్**=దానిని, **విజానీహి**=విస్పష్టముగాఁ దెలియఁజేయుము.

అవ: నారదుఁడు ప్రశ్నించుచున్నాఁడు:– 'వేదగర్భుఁడైన చతుర్ముఖబ్రహ్మ నారదున కుపదేశించెనని పూర్వాధ్యాయమందు సూచింపఁబడినది. ఆ విషయమునే నీ యధ్యాయమున వివరించుచున్నాఁడు.

ప్రాణివర్గమును సృష్టించిన వాఁడును, ఎప్పుడు జన్మించెనని చెప్పుటకు సాధ్యముగాని యనాదియైనవాఁడును, దేవతలకును దేవతవై నిలిచిన బ్రహ్మదేవా! నీ పాదపద్మములకు నమస్కారము, ఆత్మ

తత్త్వమును స్పష్టముగాఁ దెలిసికొనుటకు సాధనమైయున్న జ్ఞాన మేది గలదో దానిని నా కుపదేశింపుము.

యద్రూపం యదధిష్ఠానం యతస్సృష్ట మిదం ప్రభో॥,
యత్సంస్థం యత్పరం యచ్చ తత్తత్త్వం వద తత్త్వతః. 2

ప్రభో!=సర్వులకును ప్రభువైనవాఁడా!, ఇదం=ఈ సమస్తప్రపంచము, యద్రూపం=ఏ రూపముతోఁ గూడికొన్నదిః, యదధిష్ఠానం=ఏ యధిష్ఠానముపై నాధారపడి యున్నదిః, యతః=ఎవనినుండి, సృష్టం=సృష్టింపఁబడినదిః యత్ సంస్థం = దేనియందు లయించుస్వభావము గలదిః, యత్పరం =దేని కధీనమై యున్నదిః, యత్ చ=ఏ విధమైన యాత్మతోఁగూడియున్నదిః, తత్తత్త్వం=దాని తత్త్వమును, తత్త్వతః=నిశ్చయముగా, వద=చెప్పుము.

అవ: ఆత్మజ్ఞానమునకుఁ గారణమైనదీ లోకమేగదా! యనెడు నభిప్రాయముతో మొదలు లోకతత్త్వము నెఱుఁగవలెనని కోరిన నారదుఁడు మఱలఁ బ్రశ్నించుచున్నాఁడు-

ఓ ప్రభూ! బ్రహ్మదేవా! ఈ ప్రపంచము నీ విధముగాఁ బ్రకాశింపఁ జేయువా రెవరు? ఇది యెవ్వరి నాశ్రయించియున్నది? ఎవ్వరిచే సృష్టింపఁబడినది? ఎవ్వరియందు లయించును? ఎవ్వరికి స్వాధీనమై యున్నది? దీని స్వరూప మెట్టిది? ఈ పరమార్థమును నిశ్చయముగా నెఱిఁగింపుము.

సర్వం హ్యేతద్భవాన్ వేద భూతభవ్యభవత్ప్రభుః,
కరామలకవద్విశ్వం విజ్ఞానావసితం తవ. 3

భూతం=ఏర్పడినది, భవ్యం=ఏర్పడఁబోవునది, భవత్=జన్మించుచున్నది, ఏతత్సర్వం=ఈ సమస్తమును, భవాన్ వేద ః = నీ వెఱుఁగుదువు, తవ=నీకు,

విశ్వము నీ విశేషజ్ఞానముచే నిర్మింపఁబడిన దగుటచే నీ యఱచేతిలో నున్న యుసిరికకాయవలె సమస్తమును నీ కవగతమై యుండును.

యద్విజ్ఞానో యదాధారో యత్పరస్త్వం యదాత్మకః,
ఏకస్సృజసి భూతాని భూతై రేవాత్మమాయయా. 4

**త్వం=నీవు, యద్విజ్ఞానః=ఏ విశేషజ్ఞానముతోఁ గూడినవాఁడవై, యదాధారః=దేని నాధారముగాఁ గల్గినవాఁడవై, యత్పరః=ఎవరికి లోఁబడినవాఁడవై, యదాత్మకః=ఏ స్వరూపముతోఁ గూడినవాఁడవై, ఏకః=ఒంటిగా నున్నవాఁడవై, ఆత్మమాయయా=ఆత్మశక్తిచేత, భూతైః ఏవ=ప్రాణులనే యుపకరణములుగాఁ గైకొని, భూతాని=భూతములను, సృజసి=సృజించుచున్నావు.**

అవ: ప్రపంచవిషయ మట్లుండనీ. ముందు నీ యథార్థతత్త్వమును దయచేసి నాకుఁ దెల్పుమని ప్రార్థించుచున్నాఁడు-

ఈ లోకసృష్టికై కావలసిన విశేషజ్ఞానము నీ వెవ్వరినుండి సంపాదించితివి? నీ కాధార మెవ్వరు? నీ వెవ్వరికి లోఁబడియుందువు? నీ పరమార్థమైన స్వరూప మేమి? ఈ ప్రశ్నకుఁ గారణ మేమనఁగా నేను నిన్నే స్వతంత్రుఁడ వని భావించుచున్నాను. ఒంటివాఁడవై యున్న నీవే నీ యాత్మశక్తితో జనింపఁజేసిన భూమ్యాదిభూతములతో సమస్త ప్రాణులను సృష్టింతువని నా యూహ. ఇట్లుండఁగా నీవే యెవ్వరిని గూర్చియో తప స్సానరించుచున్నట్లు గన్పించుచున్నది. కనుక నీకును భజనీయుఁడైన యాద్యదేవత యెవరో యుండియుండవలెనను సంశయము నన్నుఁ బీడించుచున్నది. అందుకే యీ ప్రశ్న వేయుచున్నానని భావము.

ఆత్మన్ భావయసే తాని న పరా భావయన్ స్వయమ్,
ఆత్మశక్తి మవష్టభ్య ఊర్ణనాభిరివాక్లమః. 5

ఊర్ణనాభిః ఇవ=సాలెపురుగువలె, అక్లమః=క్లేశరహితుఁడవై, ఆత్మ శక్తిం=నీ యాత్మశక్తిని, అవష్టభ్య=ఆశ్రయించి, స్వయం=నీవుగా, నవరా భావయన్=పరాభవమును బొందనివాఁడవై, తాని=వానిని, ఆత్మని=ఆత్మయందే, భావయసే.

సాలెపురుగు తననుండియే కలిగిన యొక ద్రవపదార్థముతోఁ దనచుట్టును వలనిర్మించికొనునట్లు నీవుగూడ నే మాత్రమును గష్టము లేనివాఁడవై స్వశక్తితో నిర్మింపఁబడిన భూతములతో లోకములను జన్మింపఁజేసి వానికి నీకంటె భిన్నుఁడైన వాని నాశ్రయించుట అను నవమానమును దప్పించి నీయందే నిల్పికొని పరిపాలించుచుందువు.

నాహం వేద పరం త్వస్మిన్నాపరం న సమం విభో,
నామరూపగుణై ర్భావ్యం సదసత్కించి దన్యతః 6

విభో!=ఓ సర్వజ్ఞా!, అస్మిన్=దీనియందు, అహం=నేను, పరం=శ్రేష్ఠ మును, అపరం=నికృష్టమును, సమం=సమమైనదానిని, నామరూపగుణైః= నామరూప గుణములతో, భావ్యం=సాధింపఁ దగినదియు, సత్=సత్పదార్థమును, అసత్=అసత్పదార్థమును, కించిత్=దేనిని గాని, అన్యతః=ఇతరమునుండి యేర్పడినదని, అహం=నేను, న వేద=తెలియను.

అందుచే నో స్వామీ! ఈ జగత్తునందు ఉత్తమము, మధ్య మము, అధమము నను వ్యవహారమునకు విషయమైనదియు, అందు నను మనుష్యులు, దేవతలు, పక్షులు, మృగములు ఇత్యాది నామ ములు, రెండుకాళ్లు, నాలుగుకాళ్లు ననెడు రూపభేదములను, తెలుపు నలుపు నను గుణభేదములను, వీనిచే సాధింపఁదగిన స్థూలసూక్ష్మము లుగాఁ గనఁబడుచున్నదియు, నీ సమస్తమును నీనుండి యుద్భవించు చున్నదనియే నేను దెలిసికొన్నది.

స భవా నాచరద్ఘోరం యత్తపస్సు సమాహితః,
తేన ఖేదయసే నస్త్వం పరాం శంకాం ప్రయచ్ఛసి. 7

గూడినవాఁడవై, ఘోరం=కఠినమైన, తపః=తపస్సు, అచరత్ యత్=నిర్వ హించెనను దేదిగలదో, తేన=దానిచేత, నః=మమ్ము, ఖేదయసే=క్లేశపఱచు చున్నావు, త్వం=నీవు, పరాం శంకాం=గొప్ప సందేహమును, ప్రయచ్ఛసి= కల్గించుచున్నావు.

సర్వప్రపంచ స్వరూపుఁడవు నీవే యని మేము నిశ్చయించి కొన్నాము. కాని నీ వేకాగ్రమైన చిత్తముతో మఱెవ్వరినో ధ్యానిం చుచు తపస్సు పట్టియున్నావు. నీ యీ స్థితి మమ్మెక్కువ క్లేశపఱచు చున్నది. గొప్ప సందేహమును సృష్టించుచున్నది.

ఏతన్మే పృచ్ఛతస్సర్వం సర్వజ్ఞ సకలేశ్వర!,
విజానీహి తథైవాహం త్వయా బుద్ధ్యేఽనుశాసితః. 8

సర్వజ్ఞ!=సమస్తము నెఱిఁగినవాఁడా!, సకలేశ్వర!=సర్వేశ్వరుఁడవైన వాఁడా!, ఏతత్=దీనిని, పృచ్ఛతః=ప్రశ్నించుచున్న, మే=నాకు, తథా ఏవ= ఆ ప్రకారముగనే, విజానీహి=వివరించి తెలుపుము, అనుశాసితః=ఆజ్ఞాపింపఁ బడిన, అహం=నేను, యథాబుధ్యే=బుద్ధిపూర్వకముగా (ఎట్లు తెలియుదునో)

సమస్తము నెఱిఁగియు, సర్వమునకును నాథుఁడవై యున్న యో దేవా! నాచేఁ బ్రశ్నింపఁబడిన యీ సంగతిని స్పష్టముగా నాకుఁ దెల్పుము. నా బుద్ధి కెట్లు విశదముగా నర్థమగునో అట్లు వివ రించి చెప్పుము.

బ్రహ్మోవాచ:

సమ్యక్కారుణికస్యేదం వత్స తే విచికిత్సితమ్,
యదహం చోదితో ధర్మే భగవద్వీర్యదర్శనే. 9

వత్స!=పుత్త్రుఁడవైన యో నారదా!, కారుణికస్య=కరుణతోఁగూడికొన్న, తే=నీయొక్క, విచికిత్సితం=సందేహము, సమ్యక్=చక్కనిది, యత్=ఎందు కనఁగా, సౌమ్య = సాధుశీలుఁడవైన యోయీ!, అహం = నేను, పరధర్మ

వర్ణనే = పరమపురుషునకు సంబంధించిన ధర్మమును ప్రదర్శించుటకు, చితః = ప్రేరేపింపఁబడినవాఁడ నైతిని,

బ్రహ్మదేవుఁ డన్నాఁడు: 'ఓ పుత్త్రా! కరుణతోఁ గూడిన నీ సందేహపూర్వకమైన ప్రశ్న గొప్పగా నాదరింపఁ దగినది. ఎందు వఁగా పరమపురుషుని శక్తివిశేషమును ప్రదర్శించుటకై నీవు నన్ను ప్రోత్సహించితివి. నా కా పరమపురుషుని శక్తినిగూర్చి వర్ణించుట వకాశమిచ్చిన నీ ప్రశ్నతో నాయందు నీకుఁ గల కరుణావిశేషము కటిత మగుచున్నది. చాల సంతోషము.

> నాత్యంతమనృతం తచ్చ యథా మాం ప్రబ్రవీషి భోః,
> అవిజ్ఞాయ పరం మత్త ఏతావత్త్వం యతోఽస్తి మే. 10

భోః = ఓయీ నారదా!, మాం = నన్ను గూర్చి, యథా = ఏ రీతిగా, ప్రబ్రవీషి = ప్రకర్షముగాఁ బలుకుచున్నావో, తవ = నీయొక్క, తచ్చ అపి = ఆ విషయము కూడ, న అనృతం = అసత్యముగాదు, మే = నాకు, ఏతావత్త్వం = అంతమాత్రము, ప్రభావము, అస్తి = కలదు, యతః = ఎందువలననఁగా, మత్తః = నాకంటె, పరం = ఉత్కృష్టమైనవాని విషయమును, అవిజ్ఞాయ = తెలియక, బ్రవీషి = పలుకు చున్నావు.

ఓ నారదా! నీవు నన్నే సర్వేశ్వరుఁ డంటివి. ఆ భావముగూడ నత్యంతము సత్యము గాదు. ఎందుకనఁగా ఏ పరమపురుషుని కారణముగా నాకిట్టి ప్రాభవ మేర్పడినదో వానినిఁగూర్చి నీ వెఱుఁగవు. అందుచే నీ ప్రశ్న తెలిసి చేసినది కాదు. నేనే సర్వేశ్వరుఁడ నను భ్రాంతిచే నేర్పడినది. అది అపమార్గము.

> యేన స్వరోచిషా విశ్వం రోచితం రోచయామ్యహమ్,
> యథార్కోఽగ్నిర్యథాసోమో యథర్క్షగ్రహతారకాః. 11

యేన = ఎవనిచేత, స్వరోచిషా = తనకాంతిచేత, రోచితం = ప్రకాశింపఁ జేయఁబడిన, విశ్వం = ఈ సమస్తవిశ్వమును, అర్కః యథా = సూర్యునివలెను, సోమః యథా = చంద్రునివలెను, ఋక్షగ్రహతారకాః = ఋక్షములు, గ్రహములు, నక్షత్రములు వీనివలెను, అహం = నేను, రోచయామి = ప్రకాశింపఁ జేయుదును,

అవ: నారదుఁడు వేసిన ప్రశ్నకు నుత్తరము చెప్పఁబోవు చున్నవాఁడై మనస్సులో నా సర్వేశ్వరునకు నమస్కరించుచు వచించు చున్నాఁడు-

ఏ దేవుని స్వప్రకాశముతోఁ దొలుతఁ బ్రకాశింపఁ జేయఁబడిన నీ సమస్తప్రపంచమును అశ్వని మొదలైన నక్షత్రములును, సూర్యాది గ్రహములును, ఇతరనక్షత్రములు మొదలైనవి చైతన్యప్రకాశితములై ప్రకాశింపఁ జేయుచున్నట్లు కనుపించుచున్నవో నేను గూడ నంతే. స్వప్రకాశముతో ననితరాపేక్షముగాఁ బ్రకాశించుచున్న నా పరమపురుషుని సూర్యాదిగ్రహము లేవియుఁ బ్రకాశింపఁ జేయుట లేదు.

**న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం**
**నేమావిద్యుతో భాంతి కుతో ఽయమగ్నిః**
**తమేవం భాంత మనుభాతి సర్వం**
**తస్యభాసా సర్వమిదం విభాతి.**

అని శ్రుతి. అక్కడ సూర్యుఁడు ప్రకాశించుట లేదు. చంద్రతారకలు ప్రకాశింపవు. విద్యుత్తులకుఁ బ్రకాశము లేదు. అగ్నియుఁ బ్రకాశింపదు. ఇవి యన్నియు స్వప్రకాశస్వరూపుఁడైన వానికాంతి ననుసరించియే వెల్గుచున్నవి. ఆ పరమపురుషుని ప్రకాశముతోనే సమస్త విశ్వమును వెల్గుచున్నది.

**తస్మై నమో భగవతే వాసుదేవాయ ధీమహి,**
**యన్మాయయా దుర్జయయా మాం వదంతి జగద్గురుమ్.**
12

**దుర్జయయా**—జయించుటకు సాధ్యముకాని, **యన్మాయయా**—ఎవని మాయా ప్రభావముచేత, **మాం**—నన్ను, **జగద్గురుం**—లోకగురువని, **బ్రువంతి**—పలుకుచున్నారో, **భగవతే**—భగవంతుఁడును, **వాసుదేవాయ**—వాసుదేవ స్వరూపుఁడును నైన, **తస్మై**—ఆ పరబ్రహ్మకొఱకు, **నమః**—నమస్కారమును, **ధీమహి**—మనసా చేయుదును.

నీవును నీవంటివారును జయించుటకు సాధ్యముగాని యెవని మాయాప్రభావముచేత నన్ను జగద్గురువని భావించుచున్నారో అట్టి భగవంతుఁడైన వాసుదేవస్వరూపునకు నమస్కరించుచున్నాను.

**విలజ్జమానయా యస్య స్థాతు మీక్షాపథేఽముయా,**
**విమోహితా వికత్థంతే మమాహమితి దుర్ధియః 13**

**యస్య=ఎవనియొక్క, ఈక్షాపథే=కనులయెదుట, స్థాతుం=నిలుచుటకు, విలజ్జమానయా=లజ్జించుచున్నట్టి, అముయా=ఈ మాయచేత, విమోహితాః=మోహింపఁ జేయఁబడినవారై, దుర్ధియః=వక్రబుద్ధి గలవారు, అహం=నేను, మమ=నాది, ఇతి=అని, వికత్థంతే=సత్యమును దాచి నటించుచున్నారు.**

ఆ భగవంతుని కన్నులముందు నిలుచుటకు లజ్జించుచున్నది. కాని ఇతరుల నందరినీ మోహింపఁ జేయుచున్నది. అట్టి మాయచే విమోహితులైనవారు 'నేను, నాది' యను దుర్బుద్ధితో సత్యమును దాచి నటించుచున్నారు. ఆ మాయయొక్క కాపట్యము భగవంతుఁ డెఱుఁగును. అందుచే యామె యాతనియెదుట నిలుచుటకు సిగ్గు పడుచున్నది. 'ఈశ్వర మాత్మజ్ఞానినం చ ముక్త్వా సర్వానపి మోహయ త్యేషా మాయా' ఈశ్వరుని తత్స్వరూపమైన యాత్మను దెలిసికొన్న వారిని మాత్రమే మాయ వదలును. తక్కినవారి నందఱిని మోహింపఁ జేయు ననెడు వేదాంతసారము నీ శ్లోకము చెప్పుచున్నది. దీనితో నీశ్వరుఁ డెట్టి స్వరూపము గలవాఁడు? అనెడు ప్రశ్న కుత్తరము చెప్పఁబడినది.

**ద్రవ్యం కర్మ చ కాలశ్చ స్వభావో జీవ ఏవ చ,**
**వాసుదేవాత్పరో బ్రహ్మ న్నచాన్యోఽర్థోఽస్తి తత్త్వతః.14**

**ద్రవ్యం=పదార్థము, కర్మ చ=ప్రవృత్తి, కాలశ్చ=కాలము, స్వభావః=ప్రకృతి, జీవః ఏవ చ=జీవుఁడును, అన్యః అర్థః=అన్యమైన యే వస్తువుగూడ, బ్రహ్మన్=నారదుఁడా, తత్త్వతః వాసుదేవాత్=సత్యవస్తువైన వాసుదేవుని నుండి పరుఁడై వేఱై వేఱదిగా లేదు.**

అవ: తనకంటెను మేలైన యొక పరమేశ్వరుఁ డున్నాఁడని చెప్పిన తర్వాత నీ లోకమున కధిష్ఠాన మేది? యను తొమ్మిదవ ప్రశ్నకు వాఁడే దీని కధిష్ఠానమని సమాధానమును జెప్పఁబోవుచున్న వాఁడై వానికంటెను భిన్నమైన దేదియు లేదని వచించుచున్నాఁడు—

ఓయీ! నారదా! లోకసృష్టి కుపాదాన కారణములు మహాభూతములు; జన్మాదులకుఁ గారణము కర్మ. కర్మములకు ఫలముల నొసఁగుశక్తిగల పరిపక్వావస్థారూపమే కాలము. ఆ కర్మయొక్క పరిణామమునకు హేతువు స్వభావము. దానినుండి సుఖదుఃఖాదుల ననుభవించుచున్నవాఁడు జీవుఁడు. ఇవి యన్నియు వాసుదేవ స్వరూపమే. పరమార్థముగాఁ జూచినచో వాసుదేవునకన్నను భిన్నమైన పదార్థ మేదియును లేదు. సత్యస్వరూపుఁడైన వాసుదేవు నవలంబించియే మహాభూతాదులు సత్యమువలె ప్రకాశించుచున్నవి.

నారాయణపరా వేదా దేవా నారాయణాంగజాః,
నారాయణపరా లోకా నారాయణపరా మఖాః. 15

నారాయణపరో యోగో నారాయణపరం తపః,
నారాయణపరం జ్ఞానం నారాయణపరా గతిః. 16

వేదాః = వేదములు, నారాయణపరాః = నారాయణు నాశ్రయించియున్నవే, **దేవాః = దేవతలు, నారాయణాంగజాః = శ్రీమన్నారాయణుని యంశనుండి జన్మించిన వారే, లోకాః = లోకములు, నారాయణపరాః = నారాయణు నాశ్రయించియున్నవి, మఖాః = యాగములు, నారాయణపరాః = నారాయణు నారాధించుట కేర్పడినవి, యోగః = యోగము, నారాయణపరః = నారాయణుని దెలియుటకున్న త్రోవ, తపః = తపస్సు, నారాయణపరం = నారాయణు నాశ్రయించియున్నది, గతిః = ప్రాప్య స్థానము, నారాయణపరా = నారాయణాశ్రయము.**

వేదములు నారాయణుని తత్త్వమును బ్రకాశింపఁజేయుచున్న

లతని యారాధన కేర్పడినవి. యోగ మాతనిఁ దెలియుట కొఱకు మార్గము. యోగసాధ్యమై చిత్తముయొక్క యేకాగ్రరూపమైన తపస్సు వానికే సంబంధించినది. దీనిచే సాధింపఁబడినట్టి జ్ఞానము గూడ నారాయణపరమే. జ్ఞానమునకు ఫలమైన గతియు వానికి సంబంధించినదే. అందుచే సర్వమును నారాయణుని కధీనమైనది.

తస్యాపి ద్రష్టురీశస్య కూటస్థస్యాఖిలాత్మనః,
సృజ్యం సృజామి సృష్టోఽహ మీక్షయైవాభిచోదితః. 17

సృష్టః=సృజింపఁబడిన, అహం=నేను, ద్రష్టుః=ద్రష్టయైనవాఁడును, కూటస్థస్య=కూటస్థుఁడును నైన, అఖిలాత్మనః=సర్వాత్మయైన, తస్య ఈశస్య=సర్వనియంతయైన యాతనియొక్క, ఈక్షయా=కటాక్షముచేత, అభిచోదితః=ప్రేరేపింపఁబడినవాఁడనై. సృజ్యం=సృష్టించుట కర్హమైనదానిని సృష్టింతును.

నన్ను సృష్టించినవాఁ డా భగవంతుఁడే, అతఁడే సర్వస్వరూపుఁడు. సర్వమును ద్రష్టయై వీక్షించుచున్న నిర్వికారస్వరూపుఁడు, సర్వనియంత. వానికటాక్షముచేఁ బ్రేరేపింపఁబడినవాఁడనై యతనిచే సృష్టింపఁ బడవలసిన నీ సమస్తప్రపంచమును త దాజ్ఞానుసారముగ నేను సృజింతును.

సత్త్వం రజ స్తమ ఇతి నిర్గుణస్య గుణా స్త్రయః,
స్థితిసర్గనిరోధేషు గృహీతా మాయయా విభోః. 18

విభోః=సర్వాధికారియైయున్న యతనియొక్క, మాయయా=మాయచేత, నిర్గుణస్య=గుణరహితుఁడైనను, స్థితిసర్గనిరోధేషు=రక్షణము, స్థితి, సంహారము వీనియందు; సత్త్వం రజః తమః ఇతి = సత్త్వ రజ స్తమస్సులను, త్రయః గుణాః=మూఁడుగుణములు, గృహీతాః=గ్రహింపఁబడినవి.

అవ: ప్రేరకుఁడైనవాఁ డీశ్వరుఁ డని, ప్రేరేపింపఁబడుటకు యోగ్యుఁ డైనవాఁడు జీవుఁడని యీ భేద మె ట్లేర్పడినది? దీనిని మూఁడుశ్లోకములతో వివరించుచున్నాఁడు—

సర్వసమర్థుఁడైన యీశ్వరుఁడు స్వయముగా గుణసంబంధము లేనివాఁడు. కాని, సృష్టి, స్థితి, సంహారరూపకార్యము లాచరించుటకు, సత్త్వ రజస్తమస్సులను, మూఁడు గుణములను మాయనుండి స్వీకరించును.

> కార్యకారణకర్తృత్వే ద్రవ్యజ్ఞాన క్రియాశ్రయాః,
> బధ్నంతి నిత్యదా ముక్తం మాయినం పురుషం గుణాః. 19

ద్రవ్యజ్ఞానక్రియాశ్రయాః=ద్రవ్యములైన మహాభూతములు జ్ఞానస్వరూపులైన దేవతలు, క్రియాః=క్రియారూపములైన యింద్రియములు, ఆశ్రయాః= వీనికాశ్రయములైన, గుణాః=గుణములు, నిత్యదా=సర్వకాలమును, ముక్తం= నిత్యముక్తుఁడై యున్నను, మాయినం=మాయాసంబంధముతోఁ గూడిన, పురుషం =పురుషుఁడైన జీవుని, బధ్నంతి=బంధించుచున్నవి.

మహాభూతములు, దేవతలు, ఇంద్రియములు వీనికిఁ గారణములైన త్రిగుణములు, జీవుని నాధ్యాత్మిక అధిభౌతిక అధిదైవికములను మూఁడుతాపములకు వశీకృతునిఁ జేసి బంధించును. మాయాతీతుఁడైన పరమేశ్వరుఁ డెప్పుడును నిత్యముక్తుఁడే వాఁడే మాయకు వశుఁడై జీవుఁ డగును.

> స ఏష భగవాన్ లింగై స్త్రిభిరేభి రధోక్షజః,
> స్వలక్షితగతి ర్బ్రహ్మన్ సర్వేషాం మమ చేశ్వరః. 20

**అధోక్షజః = ఇంద్రియములకు విషయము గానట్టి, సః ఏష భగవాన్= ఆ భగవంతుఁడే, త్రిభిః ఏభిః లింగైః=ఈ త్రిగుణము లనెడు చిహ్నములతో, స్వలక్షితగతిః = స్వకీయులైన వారిచేతఁ దెలియఁదగిన తత్త్వముతోఁ గూడియుండును, బ్రహ్మన్=ఓ నారదా!, సః=వాఁడు, సర్వేషాం=అందఱికిని, మమ చ=నాకును, ఈశ్వరః=అధికారియైనవాఁడు.**

ఓ నారదా! సర్వేశ్వరుని మహిమ యెట్టిది? వాఁ డింద్రియముల కెప్పటికిని విషయముగాఁడు. అట్టి యా భగవంతుఁడు మూఁడు

గుణములను నుపాధులతోఁ గూడినవాఁడై భక్తులకు మాత్రమే తెలియఁదగిన తత్త్వముతోఁ గూడినవాఁడు. అట్టి యా యీశ్వరుఁడే నాకును అందఱికిని నియంత.

కాలం కర్మస్వభావం చ మాయేశో మాయయా స్వయా,
యదృచ్ఛయాత్మని ప్రాప్తం విబుభూషు రుపాదదే. 21

**మాయేశః—మాయాధిపతియైనవాఁడు, స్వయామాయయా—తనమాయచేత, విబుభూషుః=వివిధ రూపములతో నేర్పడుట కిచ్ఛించినవాఁడై, ఆత్మని—తన యందు, యదృచ్ఛయా—ప్రయత్నములేకయే వచ్చిచేరినదైన, కాలం—కాలమును, కర్మ—కర్మమును, స్వభావం చ—స్వభావమును, ఉపాదదే—స్వీకరించెను.**

అవ: ఈశ్వరుఁ డెట్లు లోకమును సృష్టించెనని వచించుచున్నాఁడు-

మాయాధిపతియైన భగవంతుఁడు తన ప్రయత్నము లేశమునులేక తనలో వచ్చిచేరిన కాలకర్మస్వభావములను దనయందే యడఁగియున్న మాయతోఁ దాను పలువిధములుగా భాసింపవలెనను కోర్కిగలవాఁడై స్వీకరించెను. మాయయం దడఁగియున్న త్రిగుణములు సమతను వర్జించి క్షోభించుటకుఁగల కారణము కాలతత్త్వము. ఆ మాయలో లీనమైయున్న జీవాదృష్టమునకే కర్మమని పేరు. మాయ, మహత్తత్త్వము, అహంకారము వీని పరిణామమునకు హేతువైన దానినే స్వభావ మందురు. ఈశ్వరసృష్టికి మూలకారణము లీ కాలకర్మస్వభావములే.

కాలాద్గుణవ్యతికరః పరిణామస్స్వభావతః,
కర్మణో జన్మ మహతః పురుషాధిష్ఠితాదభూత్. 22

**పురుషాత్, అధిశాష్ఠితాత్—ఈశ్వరునిచే నధివసింపఁబడిన, కాలాత్—కాలమునుండి, గుణవ్యతికరః—గుణములయొక్క క్షోభమును, స్వభావతః—స్వభావము కారణముగా, పరిణామః—ఒకరూపమును విడిచి అన్యరూపమును స్వీకరించుట యనెడు**

స్థితియు, కర్మణః=కర్మనుండి, మహతః=మహత్తత్త్వముయొక్క, జన్మ=జన్మము, అభూత్=ఏర్పడినది.

ఈశ్వరునిచే పరిగృహీతమైన కాలమునుండి సత్త్వాదిగుణముల సమత్వమును జెఱచునట్టి క్షోభ మేర్పడినది. స్వభావముగా నేకమై యున్న తనరూపమును భిన్నభిన్నములుగా స్వీకరించెడు పరిణామము గల్గినది. కర్మనుండి మహత్తత్త్వ ముత్పన్నమైనది.

మహతస్తు వికుర్వాణా ద్రజస్సత్త్వోపబృంహితాత్,
తమఃప్రధానస్త్వభవ ద్ద్రవ్యజ్ఞాన క్రియాత్మకః. 23

రజస్సత్త్వోపబృంహితాత్=రజస్సత్త్వగుణములవలన వృద్ధిఁ బొందింపఁబడినట్టియు, వికుర్వాణాత్=వికారము బొందినదియు నైన, మహతస్తు=మహత్తత్త్వమునుండి, ద్రవ్యజ్ఞానక్రియాత్మకః=ద్రవ్యము, జ్ఞానము, క్రియయనెడు స్వరూపముతోఁగూడిన, తమఃప్రధానః=తమోగుణముప్రధానముగాఁగల, అహంకారతత్త్వము, అభవత్=ఏర్పడినది.

రజస్సత్త్వగుణముల నధికరించినదియు అందుచేతనే వికారము ప్రాపించునదియునైన మహత్తత్త్వమునుండి ద్రవ్యము లని పిలువఁబడెడు నింద్రియములును వీని స్వరూపమైనదియు, తమోగుణప్రధానమైనదియునైన యహంకారతత్త్వ మేర్పడినది.

సోఽహంకార ఇతి ప్రోక్తో వికుర్వన్ సమభూత్త్రిధా,
వైకారిక స్తైజసశ్చ తామసశ్చేతి యద్భిదా.
ద్రవ్యశక్తిః క్రియాశక్తి ర్జ్ఞానశక్తి రితి ప్రభో. 24

వికుర్వన్=వికారమును బొందిన, సః అహంకారః=ఆ యహంకారము, వైకారికః=సాత్త్వికము, తైజసశ్చ=రాజసము, తామసశ్చ=తామసమని, త్రిధా=మూఁడురీతులుగా, సమభూత్=ఐనది, యద్భిదా=దేనిభేదము, ఇతిప్రోక్తః=ఈః

మూఁడురీతులుగా నగును. ఓ నారదా! అదెట్లో చెప్పెదను వినుము. వైకారికము, తైజసము, తామస మనియు మూఁడు రీతులు. 'ద్రవ్య శక్తిః క్రియాశక్తిః జ్ఞానశక్తి రితిప్రభో! - ద్రవ్యశక్తిః=పదార్థముల యందలి శక్తితోఁగూడినది, క్రియాశక్తిః=ప్రవృత్తులయందలి శక్తితో గూడినది, జ్ఞానశక్తిః = జ్ఞానమందలి శక్తితోఁ గూడినది, ఇతి=ఈ రీతిగా ఓ నారదా! తామ సాహంకారమును ద్రవ్యశక్తి యందురు, తైజసము లేక రాజసాహంకార మను దానిని క్రియాశక్తి యని పిలు తురు. వైకారికము లేక సాత్త్వికాహంకార మను దానిని జ్ఞానశక్తి యందురు.

తామసా దపి భూతాదే ర్వికుర్వాణా దభూన్నభః,
తస్య మాత్రాగుణశ్శబ్దో లింగం యద్ద్రష్టృదృశ్యయోః. 25

భూతాదేః = భూతములకు మొదటిదియు, వికుర్వాణాత్ = వికారమును బొందనిదియునైన, తామసాత్ + అపి=తామసాహంకారమునుండి, నభః=ఆకాశ మైనది, తస్య=దానియొక్క, మాత్రాగుణః=అసాధారణగుణము, ద్రష్టృ దృశ్య యోః=ద్రష్టయొక్కయు, దృశ్యముయొక్కయు, లింగం=జ్ఞాపక మగును.

భూతముల ఆదియు, వికారమును బొందినదియు నైన తామ సాహంకారమునుండి యాకాశమును దాని యసాధారణగుణమైన శబ్దమును గల్గినవి. ఈ శబ్దము చూచెడివాఁడని చూడఁబడునది యని యీ రెండు తెఱఁగుల భేదమును దెలుపును.

నభసోఽథ వికుర్వాణా దభూత్స్పర్శ గుణోఽనిలః,
పరాన్వయాచ్ఛబ్దవాంశ్చ ప్రాణ ఓజస్సహో బలమ్. 26

వికుర్వాణాత్=వికారమును జెందినట్టి, నభసః=ఆకాశమునుండి, అథ= తర్వాత, స్పర్శగుణః = స్పర్శమనుగుణముతోఁగూడిన, అనిలః = వాయువు, అభూత్=ఏర్పడెను, పరాన్వయాత్ = ఇతరముతో సంబంధమేర్పడినందువలన,

**శ్రద్ధవాంశ్చ=శ్రద్ధను గలిగినదైనది, ప్రాణః = ఇంద్రియబలము, ఓజః = మనోబలము, సహః=ధారణాబలము, బలం=శరీరబలము.**

తరువాత నాకాశమునకు వికార మేర్పడినది. దానినుండి స్పర్శ గుణ మసాధారణముగాఁ గలిగిన వాయు వేర్పడెను. ఆకాశము వాయువునకుఁ గారణమగుటచే దానిగుణమైన శబ్దముగూడ దీనికి సంక్రమించినది. ఇట్లు శబ్దస్పర్శలను రెండుగుణములుగల వాయువు ప్రాణధారణము ఇంద్రియముల ప్రవృత్తిసామర్థ్యము మనస్సునకు సంబంధించిన ధైర్యాది గుణములు శరీరముయొక్క బలము వీనికి గారణమై యుండును.

**వాయోరపి వికుర్వాణాత్ కాలకర్మస్వభావతః,**
**ఉపపద్యత తేజో వై రూపవత్స్పర్శ శబ్దవత్. 27**

**కాలకర్మస్వభావతః = కాలము, కర్మము, స్వభావము వీనిచేత, వికుర్వాణాత్=వికారమునుబొందిన, వాయోః అపి=వాయువునుండి, రూపవత్=రూపము గలిగినదియు, స్పర్శశబ్దవత్ = స్పర్శశబ్దములుగలిగినదియునైన తేజః = తేజస్సు, ఉపపద్యత=ఉద్భవించెను.**

కాలకర్మ స్వభావములతో వికృతిని బొందిన వాయువునుండి తేజ స్సుద్భవించెను. దీని నగ్నియు నందురు. దీని యసాధారణ గుణము రూపము. వాయుసంబంధముతో స్పర్శమును, ఆకాశసంబంధముతో శబ్దమునుగూడ దీనికిఁ గలవు.

ఈ సందర్భములో 'వికృతిని బొందినది' యని చెప్పెడు ప్రతిస్థలమందును కాలకర్మస్వభావకారణముగా అని చేర్చుకొనవలెను.

**తేజసస్తు వికుర్వాణా దాసీ దంభో రసాత్మకమ్,**
**రూపవత్స్పర్శవచ్చాంభో ఘోషవచ్చపరాన్వయాత్. 28**

వికృతిని బ్రాపించిన తేజస్సునుండి రస మనెడు అసాధారణ గుణములు గలిగినట్టియు, ఆకాశ వాయ్వగ్ని సంబంధముతో వాని గుణములైన శబ్దస్పర్శరూపములుగలిగిన జల మేర్పడినది.

విశేషస్తు వికుర్వాణా దంభసో గంధవానభూత్,
పరాన్వయాద్రసస్పర్శ శబ్దరూపగుణాన్వితః. 29

**వికుర్వాణాత్ = వికారము నందిన, అంభసః = జలమునుండి, గంధవాన్ = గంధముతోఁగూడిన, విశేషః = ప్రత్యేకద్రవ్యము (పృథివి), అభూత్ = ఏర్పడెను, పరాన్వయాత్ = ఇతర పదార్థసంబంధముతో, రస స్పర్శ శబ్ద రూపగుణాన్వితః = రసము, స్పర్శము, శబ్దము, రూపము ననెడు గుణములతోఁ జేరినది.**

వికార మందిన జలమునుండి గంధరూప గుణముగల భూమి యేర్పడినది. ఇతరభూతముల సంబంధముతో రసస్పర్శశబ్దరూపములు దీని కేర్పడినవి.

వైకారికాన్మనో జజ్ఞే దేవా వైకారికా దశ,
దిగ్వాతార్కప్రచేతోశ్వి వహ్నీంద్రోపేంద్రమిత్రకాః. 30

**వైకారికాత్ = సాత్త్వికాహంకారమునుండి, మనః = మనస్సు, జజ్ఞే = ఏర్పడి నది, వైకారికాః = సాత్త్వికాహంకారమునుండి జనించిన, దిగ్వాతార్కప్రచేతోశ్వి వహ్నీంద్రోపేంద్రమిత్రకాః = దిక్కు, వాయువు, అర్కుడు, ప్రచేతస్సు, అశ్వినులు, అగ్ని, ఇంద్రుఁడు, ఉపేంద్రుఁడు, మిత్రుఁడు, బ్రహ్మ యనెడు, దేవాః = దేవతలు, దశ = పదిమంది, (జజ్ఞిరే = జన్మించిరి).**

సాత్త్వికాహంకారము నుండి మనస్సును, దాని యధిష్ఠాన దేవతయైన చంద్రుఁడును జన్మించిరి. దిక్కు, వాయువు, సూర్యుఁడు ప్రచేతస్సు, అశ్వినులు, వహ్ని, ఇంద్రుఁడు, ఉపేంద్రుఁడు, మిత్రుఁడు బ్రహ్మ యనెడు నీ పదిమందిదేవతలును సాత్త్వికాహంకారమునుండి

జన్మించినవారు. వీరు దశేంద్రియముల యందు వసించువారు. అందుచే వీరికి ఇంద్రియాధిష్ఠానదేవత లని పేరు. దిగ్దేవత, శ్రోత్రాధి దేవత. వాతము త్వక్కున కధికారి. సూర్యుఁడు కన్నులకు. ప్రచేతసుఁడు నాల్క కధికారి. అశ్వినులు నాసికలకు అధిష్ఠానదేవతలు. వహ్ని వాక్కునకు, ఇంద్రుఁడు చేతులకు. ఉపేంద్రుడు పాదములకు. మిత్రుఁడు పాయువున కధికారి, పాయు వనఁగా విసర్జనద్వారము. బ్రహ్మ ఉపస్థ కధిష్ఠానదేవత.

> తైజసాత్తు వికుర్వాణా దింద్రియాణి దశాఽభవన్,
> జ్ఞానశక్తిః క్రియాశక్తి ర్బుద్ధిః ప్రాణశ్చ తైజసౌ. 31

వికుర్వాణాత్ = వికారమును బొందిన, తైజసాత్ = రాజసాహంకారము నుండి, దశ ఇంద్రియాణి=పది ఇంద్రియములు, అభవన్=ఏర్పడినవి, జ్ఞానశక్తిః =జ్ఞానశక్తియు, క్రియాశక్తిః=క్రియాశక్తియును, బుద్ధిః=బుద్ధియును, ప్రాణః చ=ప్రాణమును, తైజసౌ = రాజసాహంకారమునుండి జనించినవి, శ్రోత్ర= చెవియు, త్వక్=చర్మమును, ఘ్రాణ=నాసిక, దృక్=దృష్టి, జిహ్వా=నాలుక, ఈ యైదును జ్ఞానేంద్రియములు, వాక్=వాక్కును, దోః=చేతులును, మేఢ్ర= మేఢ్రము, అంఘ్రి=పాదములు, పాయవః=పాయువు అను నీ యైదును కర్మేంద్రియములు.

రాజసాహంకారమునుండి పది యింద్రియములు జనించినవి. అందులో జ్ఞానేంద్రియము లైదు. కర్మేంద్రియము లైదు. బుద్ధి, ప్రాణములు రాజసాహంకారమునుండి జన్మించినవే. జ్ఞానకర్మేంద్రియములు రాజసాహంకారమునుండి యేర్పడినవి. శ్రోత్ర, త్వక్, ఘ్రాణ, దృక్, జిహ్వాలు, జ్ఞానేంద్రియములు. వాక్కు, చేతులు, మేఢ్రము, కాళ్లు, పాయువు ఇవి కర్మేంద్రియములు.

> శ్రోత్రత్వగ్ఘ్రాణదృగ్జిహ్వా వాగ్దోర్మేఢ్రాంఘ్రిపాయవః,
> యదైతే సంగతా భావా భూతేంద్రియ మనోగుణాః. 32

భూతేంద్రియమనోగుణాః = భూతములు, ఇంద్రియములు, మనస్సు, గుణము లనెడు, ఏతే భావాః = ఈ భావములు, యదా=ఎప్పుడు, అసంగతాః =

పరస్పరముచేరక యుండినవో, బ్రహ్మజ్ఞ!, తదా=అప్పుడు, యదాయతననిర్మాణే =దేనియొక్క వాసస్థానమును నిర్మించుటయందు, నశేకుః=శక్తములు గాలేదు.

గంధము మొదలైన భూతగుణములు, ఇంద్రియ గుణములు, మనస్సుయొక్క గుణము లనెడు నీ భావపదార్థములు ఒకటిలో నొకటి చేరక యెప్పుడు విభిన్నములుగా నుండెనో అప్పుడు బ్రహ్మాండ రూపమైన శరీరమును సృష్టించుటకు వానికి శక్తి యెప్పుడు లేక పోయినదో.

యదాయతననిర్మాణే న శేకుర్బ్రహ్మసత్తమ,
తదా సంహత్య చాన్యోన్యం భగవచ్ఛక్తిచోదితాః. 33

తదా=అప్పుడు, భగవచ్ఛక్తిచోదితాః=భగవంతునిచే ప్రేరేపింపబడినవై, అన్యోన్యం=పరస్పరము, సంహత్య=చేరికొని, సదసత్త్వం=సత్తు అసత్తునెడు భావమును, ఉపాదాయ = స్వీకరించికొని, ఉభయం=రెండు విధములుగా నున్న, అదః=దీనిని, ససృజుః=సృష్టించినవి.

నారదా! అప్పుడు వీనిని భగవంతునిశక్తి ప్రేరేపించినది. అవి పరస్పరము గలిసికొన్నవి. కలసికొని స్థూల సూక్ష్మ భావమును గ్రహించి సమష్టి వ్యష్టిశరీరములను నిర్మించినవి.

సదసత్త్వముపాదాయ చోభయం ససృజుర్హ్యదః,
వర్షాపూగసహస్రాంతే తదండ ముదకేశయమ్. 34

వర్షపూగ సహస్రాంతే = అనేక వర్షసహస్రములు గతించిన తర్వాత, ఉదకేశయం=నీటియందు శయించినట్టి, తత్ అండం=ఆ యండమును, కాలకర్మ స్వభావస్థః=కాలకర్మస్వభావస్థితుఁడైన, జీవః=జీవుఁడు, అజీవం=అచేతనమును, అజీవయత్=జీవమున్న దానినిగాఁ జేసెను.

పరస్పరముచేరికొన్న యా పదార్థము అనేకవర్ష సహస్రములు గడచిన తర్వాత జలముపైఁ దేలాఁడుచున్న యొక యండముగా నైనది. కాలకర్మ స్వభావములను అధిష్ఠానముగా స్వీకరించిన

పరమాత్మ అచేతనమైన యీ పదార్థమును సచేతనముగా నొనర్చెను. పరమాత్మ దానియందు వ్యాపించుటచే నాయండము చైతన్యయుక్తముగా నయ్యెనని సారము.

> కాలకర్మస్వభావస్థో జీవోఽజీవమజీవయత్,
> స ఏవ పురుషస్తస్మా దండం నిర్భిద్య నిర్గతః
> సహస్రోర్వంఘ్రిబాహ్వక్ష సహస్రాననశీర్షవాన్. 35

**స ఏవ పురుషః=ఆ పురుషుఁడే, అండం=అండమును, నిర్భిద్య=భేదించుకొని, తస్మాత్=దానినుండి, నిర్గతః=బయటికి వచ్చెను, వాఁడు, సహస్రోర్వంఘ్రిబాహ్వక్షః = వేయితొడలు, అంఘ్రులు, బాహువులు, కన్నులు గలవాఁడు. సహస్రాననశీర్షవాన్=వేయిముఖములు, తలలును గలవాఁడు,**

ఆ పరమాత్మ అండమును భేదించికొని గడ్డకు వచ్చెను. వానికి వేయితొడలు, సహస్రాంఘ్రులు, సహస్రబాహువులు, సహస్రనేత్రములు. సహస్రాననుఁడు వాఁడు. సహస్రశీర్షుఁడు. ఈ యవయవములతో వాఁడు గడ్డకు వచ్చి యండమున కన్నను వేఱైనిలిచినాఁడు.

> యస్యేహావయవై ర్లోకా న్కల్పయంతి మనీషిణః,
> కట్యాదిభి రధస్సప్త సప్తోర్ధ్వం జఘనాదిభిః 36

**మనీషిణః=విద్వాంసులు, ఇహ = వానియందు, యస్య = ఎవనియొక్క, కట్యాదిభిః=నడుముమొదలైన; అవయవైః=అవయవములచేత, అధః=క్రింద, సప్తలోకాన్=ఏడులోకములను, జఘనాదిభిః=జఘనము నుండి, ఊర్ధ్వం=పైన, సప్తలోకాన్=ఏడులోకములను, కల్పయంతి=కల్పింతురు.**

బ్రహ్మస్వరూపము నెఱిఁగిన విద్వాంసు లీ కల్పించుచున్న

లె కములుగాఁ జెప్పఁబడె.

పురుషస్య ముఖం బ్రహ్మ క్షత్రమేతస్య బాహవః,
ఊర్వోర్వైశ్యో భగవతః పద్భ్యాం శూద్రోవ్యజాయత. 37

ఏతస్య పురుషస్య=ఈ పురుషునియొక్క, ముఖం=ముఖము, బ్రహ్మ=బ్రాహ్మణుఁడు, బాహవః=బాహువులు, క్షత్రం=క్షత్రియుఁడు, భగవతః ఊర్వోః=భగవంతుని తొడలనుండి, వైశ్యః=వైశ్యుఁడును, పద్భ్యాం=పాదములనుండి, శూద్రః=శూద్రుఁడును, వ్యజాయత=పుట్టెను.

ఈ సమష్టిపురుషుని ముఖమే బ్రాహ్మణుఁడు. బాహువులు క్షత్రియులు. అతనియూరువులనుండి వైశ్యుఁడు జనించెను. పాదముల వలన శూద్రుఁ డుత్పన్నుఁ డైనాఁడు.

భూర్లోకః కల్పితః పద్భ్యాం భువర్లోకశ్చ నాభితః,
హృదా స్వర్లోక ఉరసో మహర్లోకో మహాత్మనః. 38

పద్భ్యాం=పాదముల నుండి, భూర్లోకః=భూలోకము, మహాత్మనః, అస్య నాభితః=మహాత్ముఁడైన యతని నాభినుండి, భువర్లోకః=భువర్లోకమును, హృదా=హృదయముచేత, స్వర్లోకః=స్వర్గలోకమును, ఉరసా=ఎదచేత, మహర్లోకః=మహర్లోకమును (ఏర్పడినవి).

మహాత్ముఁడైన యీ పురుషుని పాదములనుండి భూలోక మేర్పడినది. నాభినుండి భువర్లోకము, హృదయముచేత స్వర్లోకము, వక్షమునుండి మహర్లోకమును గల్పింపఁబడినవి.

గ్రీవాయాం జనలోకస్తు తపోలోక స్స్తన ద్వయాత్,
మూర్ధత స్సత్యలోకస్తు బ్రహ్మలోక స్సనాతనః. 39

గ్రీవాయాం=కంఠమందు, జనలోకస్తు=జనోలోకమును, స్తనద్వయాత్=రెండువక్షోజముల నుండి, తపోలోకః=తపోలోకమును, మూర్ధతః=శిరస్సువల

నుండి, సనాతనః=సనాతనమైన, బ్రహ్మలోకః=బ్రహ్మలోకము, సత్యలోకస్తు=సత్యలోకము, కల్పితః=కల్పింపఁబడినది.

గ్రీవయందు జనర్లోకము, రెండు స్తనములనుండి తపోలోకమైనది. శిరస్సులనుండి వైకుంఠ మను పేరు గలిగిన సనాతనమైన సత్యలోక మేర్పడినది.

> తత్కట్యా మతలం క్లృప్త మూరుభ్యాం వితలం విభోః,
> జానుభ్యాం సుతలం శుద్ధం జంఘాభ్యాం తు తలాతలమ్. 40

తత్కట్యాం=వాని నడుమునందు, అతలం క్లృప్తం=అతలలోకము నిశ్చయింపఁబడినది. విభోః=విభుఁడైన యీ పురుషునియొక్క, ఊరుభ్యాం=రెండు తొడలనుండి, వితలం=వితలమును, జానుభ్యాం=మోఁకాళ్ళనుండి, సుతలం=సుతలమును, జంఘాభ్యాం=రెండు పిక్కలనుండి, తలాతలం=తలాతలమును ఏర్పడినవి.

సర్వత్ర వ్యాపించియున్న భగవంతుని నడుమునుండి యతలము, తొడలనుండి వితలము, జానువులనుండి సుతల మేర్పడినది. ఈ సుతలమందే బలిమొదలైన మహాభక్తు లుండునది. జంఘలనుండి తలాతల మేర్పడినది.

> మహాతలం తు గుల్ఫాభ్యాం ప్రపదాభ్యాం రసాతలమ్,
> పాతాళం పాదతలత ఇతి లోకమయః పుమాన్. 41

గుల్ఫాభ్యాం=చీలమండలనుండి, మహాతలం తు=మహాతలమును, ప్రపదాభ్యాం=మీఁగాళ్ళనుండి, రసాతలం=రసాతలమును, పాదతలతః=అఱకాలు నుండి, పాతాళం=పాతాళమును (ఏర్పడినవి), ఇతి=ఈ ప్రకారము, పుమాన్=ఈశ్వరుఁడు, లోకమయః=లోకస్వరూపుఁడు.

గాఁజాలదు. అందుచే స్థూలమైన ఈ ప్రపంచమునే ఈశ్వరస్వరూప ముగా భావింపవలెనని పిండితార్థము.

భూర్లోకః కల్పితః పద్భ్యాం భువర్లోకస్తు నాభితః,
స్వర్లోకం కల్పితో మూర్ధ్నా ఇతి వా లోకకల్పనా. 42

పద్భ్యాం=పాదములనుండి, భూర్లోకః=భూలోకము, కల్పితః=కల్పింపఁబడినది, నాభితః=నాభినుండి, భువర్లోకః=భువర్లోకము, మూర్ధ్ని=శిరస్సునందు, స్వర్లోకః కల్పితః=స్వర్గలోకము కల్పింపఁబడినది, లోకకల్పనా=లోకముల కల్పనము, ఇతి వా=ఈ విధముగానైనఁ గావచ్చును.

లోకములు పదునాల్గనెడు వ్యవహారమును ముందు వివరించి నాఁడు. లోకములు మూఁడను వ్యవహారమునందు భగవంతుని యవయవముల నే స్వరూపముగా ధ్యానింపవలెనో యీ శ్లోకమందు వివరింపఁబడినది. ఈ మహాపురుషుని పాదములనుండి అటుకాలు మొదలు కటివఱకునుగల విభాగములు పాతాళము మొదలు భూలోకమువఱకున్న లోకములుగా వివరింపఁబడినది. పాదము మొదలు కటివఱకు వర్ణింపఁ బడిన భూలోకమందే పాతాళము మొదలైన యేడులోకములును బర్యాప్తము లైనవి. నాభినుండి భువర్లోకము శిరస్సునందు స్వర్గముమొదలుకొని బ్రహ్మలోకము వఱకున్న లోకములు గల్పింపఁబడినవి. ఈ విధమైన కల్పనలతోనే లోకత్రయమను వ్యవహార మేర్పడినది. పురుషావయవములను లోకములుగాఁ గల్పించినది స్థూలబుద్ధులకొఱకు; నిర్గుణస్వరూపమును వా రనుభవింపలేరుగదా! అందుచే వారు స్థూలరూపమునే ధ్యానింతురు. స్థూలసూక్ష్మములుగాఁ గన్పించుచున్న సర్వమును భగవంతుఁడే. ఈశ్వరుఁడు బుద్ధిగోచరునిగా ధ్యానించువారు వానినొక మహాపురుషునిగా భావించి పాదములు మొదలు కటివఱకున్న

లోకములను పాతాళాదిలోకములుగా భావింపవలెను. భువర్లోకమును నాభిగా నేర్పఱచికొని స్వర్గము మొదలు బ్రహ్మలోకమువఱకున్న వానిని నాభ్యాది మూర్ధపర్యంతముగా ధ్యానింపవలెను.

శ్రీధరీయము:

వంచమేనారదేనాऽథ వృష్ట స్సృష్ట్యాదివ_ర్ణనః,
హరే ర్లీలాం విరాట్సృష్టిం కాలకర్మాది శ_క్తిభిః,

అవ: పంచమాధ్యాయమందు నారదునిచేఁ బ్రశ్నింపఁబడిన బ్రహ్మదేవుఁడు సృష్ట్యాదులైన హరిలీలలను వర్ణించుచున్నాఁడు. కాలకర్మాదిశక్తులతో నా లీల లెట్లు సాఁగునో వివరించుచున్నాఁడు— పూర్వాధ్యాయపుఁ గడపటి శ్లోకములందు 'నారదాయాను పృచ్ఛతే' 'వేదగర్భోఽభ్యధాత్' అని చెప్పఁబడినది. ఈ యధ్యాయమును నారద ప్రశ్నముతో నారంభించుచున్నాఁడు—

భూతభావన! = భూతముల నభివృద్ధిఁ బొందించువాఁడా!, అందుచేతనే అందఱికన్నను పూర్వమందు జన్మించినవాఁడా! అనాదియైనవాఁడా యని యర్థము. 'జ్ఞాయతే అనేనేతి జ్ఞానం' దీనిచేతఁ బరమాత్మతత్త్వము దెలిసికొనఁబడుచున్నది గనుక జ్ఞానము. దానిని విజానీహి=విశేషముగా వివరింపుము. ఆ జ్ఞాన మెట్టిది?. ఆత్మతత్త్వనిదర్శనం=ఆత్మతత్త్వము, నితరాం=ఎక్కువగా, దృశ్యతే యేనతత్' దేనిచేత స్పష్టముగాఁ దెలియఁబడుచున్నదో అది. 1

అవ: ఉపలక్షణభూతమైన ప్రపంచజ్ఞానమే యాత్మజ్ఞానసాధనము, అందుచేత ప్రపంచవిశేషణమునుగూర్చి ప్రశ్నించుచున్నాఁడు—

యద్రూపం=' యేనరూప్యతే ప్రకాశ్యతే' ఎవనిచేతఁ బ్రకాశితమగుచున్నది? యదధిష్ఠానం = దేని నాశ్రయముగాఁ గలిగినది!? యతః సృష్టం = దేనిచేత నిర్మింపఁబడినది?, యత్ సంస్థం = దేనియందు లీన మగుచున్నది?, యత్పరం = దేని కధీనమైయున్నది?,

లేక యేదైన వేఱుకారణముచే నేర్పడుచున్నదా? యని యర్థము. తత్తత్త్వం=దానియొక్క తత్త్వమును, తత్త్వతః వద=యథార్థముగాఁ దెలుపుము. 2

అవ: నీకంటెను పరమైనదానిని నే నెఱుఁగనని వేఱుగఁ జెప్ప వలెనా యనెడు నభిప్రాయముతోఁ బలుకుచున్నాఁడు-

భూతం=ఇంతకుముందు జనించినది, భవ్యం=జనిష్యమాణము భవత్=జాయమాన మైనది? ఇది యంతయు నీవు సకలమునకును ప్రభువైన దానివలన నీకుఁ దెలియునని తాత్పర్యము. ఈ విషయ మంతయు విశిష్టమైన నీ జ్ఞానముచే నిష్ఠితమైనది. 3

అవ: ఈ విషయ మట్లుండనీ-మొదలు నీకు సంబంధించిన విషయమునే చెప్పమనుచున్నాఁడు-

యద్విజ్ఞానః=ఎవరినుండి నీవు విజ్ఞానమును బొందితివి?, యదాధారః=నీ కాశ్రయుఁ డెవ్వఁడు?, యత్పరః=నీ వెవ్వరి కధీనుఁ డవు?, యదాత్మకః=ఏ స్వరూపముగలవాఁడవు? నాకు నీవే స్వతంత్రుఁడ వను బుద్ధి గలదు. నీ వే తప స్సొనర్చుచున్నావు? అందుచే నాకు సందేహ మేర్పడుచున్నది. కనుక నడుగుచున్నాను అని నాలు గున్నర శ్లోకములతోఁ బ్రశ్నించుచున్నాఁడు. ఏకః=అసహాయుఁడవై అని యభిప్రాయము. 4

ఆత్మన్=ఆత్మయందు, భావయసే=పాలించుచున్నావు, స్వయమేవ=నీవే, పరాభావయన్=నిరుపద్రవముగా, భావయసే= పాలించుచున్నావు, సమస్తప్రపంచమును నీనుండియే సృష్టించు చున్నావు. అక్లమః=శ్రమరహితుఁడవై సృష్టించుచున్నావని యర్థము. దానిలో దృష్టాంతమును జెప్పుచున్నాఁడు. ఊర్ణనాభిరివ=సాలీనివలె ఆత్మన ఏవ శక్తిం=తనశక్తినే; అవష్టభ్య=ఆశ్రయించి, సృజతి=సృష్టిం

తార్థము. 5

అందుచేతనే నే నీప్రపంచమందు, పరం=ఉత్తమమును, అపరం = అధమమును, సమం = మధ్యమమును, న వేద = తెలియను, దానిలోఁగూడ నామ=మనుష్యత్వాదినామములు, రూప=ద్విపదత్వాది రూపము, గుణ=శుక్లాదిగుణము వీనిచే, భావ్యం=సాధ్యమైనదానిని (న వేద అని అన్వయము) దానియందును, సదసత్=స్థూలమును, సూక్ష్మమును, నీకంటెభిన్నమైనదాని నెఱుఁగను, సమస్తమును నీనుండియే జనించుచున్నదని భావము. 6

నీవే తపస్సాచరించుచున్నావు. ఇదినాకు గొప్పసందేహాకరము. అందుచేత యథైవ=ఎట్లు, అహం = నేను, అనుశాసితః = నీచే నను శాసింపఁబడినవాఁడనై, బుధ్యే=విషయమును బక్కగాఁ దెలియుదునో తథా=అట్లు, విజానీహి=నాకు విశేషముగా జ్ఞాపింపఁజేయుము. 7

నారదుని ప్రశ్నను మూఁడు శ్లోకములతో నభినందించు చున్నాఁడు. హే వత్స! తవ ఇదం విచికిత్సితం=ఈ నీసందేహము, నాచేఁ బేరేపింపఁబడినప్రశ్న, సమ్యక్=చక్కనిదై యున్నది, ఎందుచేత ననఁగా, నీవు నాయందు దయగలవాఁడ వగుటచేతనే యిట్లు ప్రశ్నించితివి.దానికి హేతువును జెప్పుచున్నాఁడు. భగవద్వీర్యము యొక్క ప్రకాశమునకు నా కవకాశ మిచ్చితివి. అందువలననే నీవు జిజ్ఞాసువైనను నాయందు కృపనే ప్రదర్శించినావని తాత్పర్యము. 9

నీవు నన్నే యీశ్వరుఁ డనుకొని ప్రశ్నించితివి. నీ యభి ప్రాయముగూడఁ గేవల మనృతముగాదు. నీ వనుకొన్న ప్రభావము నాకుఁ గూడ నున్నది. కాని నాకంటె నీశ్వరుఁ డొకఁ డున్నాఁడు. ఆ విషయము నీకుఁ దెలియకయే యిట్లడిగినావు. అతనికిని నాకును గల సాదృశ్యముతో నీ కీ భ్రాంతి యేర్పడినది. ఈ నీ ప్రశ్న భ్రాంతి పూర్వక మైనది. 10

యేన - ఏ యీశ్వరునిచేత, స్వరోచిషా - స్వప్రకాశముతో, సంచితం-ప్రకాశింపఁజేయఁబడిన దానినే, ప్రకాశయామి-సృష్టితో నభి వ్యక్త మొనర్చుచున్నాను, యథా-ఎట్లు, అర్కాదయః-సూర్యుఁడు మొదలైనవారు, చైతన్యప్రకాశ మేవ ప్రకాశయంతి-చైతన్యముచేతఁ బ్రకాశింపఁజేయఁ బడిన దానినే ప్రకాశింపఁ జేయుచున్నారు. 11

తస్మై నమః ధీమహి-ఆ వాసుదేవునకు నమస్కారము. ఎవని మాయచే మోహితులై యుష్మదాదులు నన్ను జగత్కారణముగా భావించుచున్నారో అట్టి వానికి నమస్కారమని యన్వయము. ఆ మాయ దుర్జయమైనది. 12

ఆ యీశ్వరునకుఁ గూడ సంసార మున్నదా? లే దనుచున్నాఁడు. నా కపటు మీఁతఁ దెఱుఁగునని తెలిసి యాతని దృష్టిపథమందు నిలుచుటకు భయపడును. అందుచే నాతని విషయమందు స్వకార్యమును బ్రదర్శింపదు. అతని మాయచే మోహితులై యస్మదాదులైన దుర్ధియులు అవిద్యావృతజ్ఞానులై, వికత్థం తే-శ్లాఘించికొనుచున్నారు. దీనితో యద్రూపం అనుదాని కుత్తరముఁ జెప్పినట్లైనది. 13

అవ: తనకంటెను ఈశ్వరుఁడు వేఱుగా నున్నాఁడని నిరూపించి ఇప్పుడు 'యదధిష్ఠానం' అనుదాని కుత్తరము చెప్పఁబోవుచున్నవాఁడై యాతనికంటెను భిన్నమైనది లేదని నిరూపించుచున్నాఁడు-

ద్రవ్యం-ఉపాదానరూపములైన మహాభూతములు, కర్మ-జన్మనిమిత్తమైనది, కాలః-త్రిగుణముల క్షోభకమైనది, స్వభావః-తత్పరిణామహేతువు, జీవః-భోక్తయైనవాఁడు, అన్యో అర్థోనాస్తి-భిన్నమైన పదార్థ మేదియును లేదు. కార్యము కారణముకంటెను వ్యతిరేకము కాదు గనుక సర్వము వాసుదేవుఁడే యని యర్థము. 14

వేదాః నారాయణపరాః—నారాయణుఁడే కారణముగాఁ గలిగి నవి వేదములు. ఈ శాస్త్రయోనిత్వ ప్రతిపాదనముతో నీశ్వరాస్తి త్వమును సర్వజ్ఞత్వాదికమును నిరూపింపఁబడినది. దేవతలు నారా యణుని యంగమునుండి పుట్టినవారు. కనుక తద్వ్యతిరిక్తులు గారు. స్వర్గాదిలోకములు వాని యానందాంశములు. యజ్ఞాదులు తత్సాధన భూతములు. 15

యోగః—పరిణామాది యోగము, తపః—దానిచే సాధింపఁ దగినది, గతిః—దానికి ఫలము - సర్వము నారాయణుని కధీనమని యర్థము. 16

అట్టిచో నీ వేమి చేయుచుందువు? ఈ ప్రశ్నరాఁగా దాని కుత్తరము-

తస్య సృజ్యమపి—వానిచే సృజింపఁ దగినదైనను, తేన సృష్టో అహం సృజామి—వానిచే సృజింపఁబడిన నేను ప్రపంచమును గల్పించు చున్నాను. ఎట్లు? ఈక్షయా—వాని కటాక్షముతో నని యర్థము. 17

అవః ఈ జీవేశ్వర విభాగ మెందుకు? ఈ విభాగముచేతనే యతఁడు ప్రేరకుఁడై నీవు ప్రేరేపింపఁ దగినవాఁడ వైనావు. దీనికి సమాధానముగా జీవేశ్వర విభాగహేతువును మూఁడు శ్లోకములతోఁ జెప్పుచున్నాఁడు-

ఈశ్వరుఁడు నిర్గుణుఁడైనను వానిని మూఁడు గుణములు బాధిం చుచున్నవి. ఎట్లు? అవి యెట్టివి? పరమేశ్వరునిచేతనే స్వతంత్రముగ స్థిత్యాద్యర్థమై మాయచేత గ్రహింపఁబడినది. 18

వాఁడు స్వయముగా నిత్యముక్తుఁడు. ఐనను మాయినం= మాయావిషయ మగుచున్నాఁడు. అట్టి పురుషుఁడైన జీవుని, బధ్నంతి

=త్రిగుణములు బాధించుచున్నవి. స్వకార్యము అధిభూతము, కారణము అధ్యాత్మము, కర్త అధిదైవము. వీనిభావము తత్త్వము. దానియందు ద్రవ్యములు మహాభూతములు; జ్ఞానశబ్దముచేత దేవతలు గృహీతులు. క్రియ లనఁగా నింద్రియములు. తదాశ్రయాః=వీనికిఁ గారణభూతములై తత్తదభిమానముచే జీవుని బంధించుచున్నవని భావము. సః ఏషః=తనకు లోఁబడిన మాయగల యా యీశ్వరుఁడు జీవున కావారకములైన యుపాధిభూతములైన యీ గుణములచేత, అలక్షితగతిః='అలక్షితా గతిః యస్య సః'-ఎవ్వరును దెలియని ప్రవర్తనము గలవాఁడై, స్వలక్షితగతిః=తన భక్తులచేత మాత్రమే తెలిసికొనఁదగిన ప్రవర్తనము గలవాఁడై సృష్టికార్యము నొనర్చునని భావము. అతని సృష్టిప్రకారమును జెప్పుచున్నాఁడు. కర్మ=జీవాదృష్టము, విబుభూషుః=వివిధములుగాఁ గావలెనని కోరినవాఁడై. 19

గుణవ్యతికరః=గుణముల క్షోభము అనఁగా సామ్యత్యాగము. పరిణామః=రూపాంతరావృత్తి, పురుషః=ఈశ్వరుఁడు. పురుషాధిష్ఠితత్వము మూఁటికి గూడ నన్వయించును. మహతః=మహత్తత్త్వము యొక్క. 22

వికుర్వాణాత్ మహతస్తు=వికారమును జెందుచున్నట్టి మహత్తత్వమునుండి, అ మహత్తత్త్వము క్రియా, జ్ఞాన, శక్తి రూపము. అందుచేత త్రిగుణములచేఁ గూడినదైనను రజస్సత్త్వములే యెక్కువ ప్రాధాన్యమును వహించుచున్నవి. అహంకార మావారక మగుటచే నది తమఃప్రధాన మైనది. కనుక నహంకార కార్యములందు తామసము, కామరాగాదులందు రాజసము, అల్పమైన సత్త్వగుణము భాసించును. అట్లే తదుపాధికములైన జీవులందును తామసాధిక్యమే యుండునని భావము. 23

వికుర్వన్=రూపాంతరమును బొంది. దాని త్రైవిధ్యమునే 'వైకారికః' అని చెప్పుచున్నాఁడు. వైకారికః=సాత్త్వికము, తైజసః

రాజసము, తామసము మూఁడవది. ద్రవ్యశక్తిః ఇత్యాదిలో ప్రాతి లోమ్యముగా మూఁడింటి లక్షణము. అనఁగా జ్ఞానశక్తి సాత్త్వికము, క్రియాశక్తి రాజసికము, ద్రవ్యశక్తి తామసికము. ద్రవ్యే=మహాభూత ద్రవ్యమందున్న శక్తి. క్రియాశక్తి యనఁగా నింద్రియశక్తి. జ్ఞాన శక్తి దేవతలది. 24

భూతాదేః అనునది తామసస్య అనుదానికి విశేషణము. తామ సము నుండి శబ్ద మేర్పడుచున్న దనుట ప్రసిద్ధమైన సత్యము. ఈ శబ్దమే నభస్సుయొక్క మాత్ర అనఁగా సూక్ష్మత. గుణ మనఁగా వ్యావర్తకమైన ధర్మము. శబ్దము ద్వారా నభ మేర్పడుచున్నదని యర్థము. శబ్దాదులు ఆకాశాదుల సూక్ష్మరూపములు. అందుచేఁ గారణము. ఈ కారణత్వ ముండఁగనే యాకాశమందు శబ్దానుభవ ముండుటచేత కార్యత్వము గూడ నుండునని భావము. ఇది వంశీ ధరుని వివరణ. అతని వాక్యమిది_' శబ్దాదీనా మాకాశాది సూక్ష్మరూ పేణ కారణత్వం సత్యేవాకాశే శబ్దానుభవాత్కార్యత్వ మితిభావః'. ఇట్లే స్పర్శాదులకును జూచికొనవలెను. లింగం=తద్వ్యాద్వ్యంతరితుఁ డైన యొకానొకనిచేత గజ మని చెప్పఁబడుచున్నది. ఆ శబ్దముచేత గజద్రష్టయు, దృశ్యమైన గజమును బోధింపఁబడుచున్నారు. కనుక ఇక్కడ లింగ మనఁగా బోధకమని యర్థము. 25

పరాన్వయాత్=పరమైన నభస్సు కారణముగా నన్వయించుట చేత వాయువు శబ్దముగూడ నగుచున్నది. వాయువునకు లక్షణము గూడఁ జెప్పుచున్నాఁడు. ప్రాణః=దేహధారణములు, ఓజ స్సహో బలములు, ఇంద్రియ మన శ్శరీరముల పాటవములు. వీని కన్నిటికిని వాయువు హేతువని యర్థము. 26

దయ్యెను. ఇట్లే నీటికిని పృథివిని పరాన్వయముతో గుణాధిక్యము. 'ఘోష' మనఁగా శబ్దము. విశేష మనఁగా భూమి. 27

ఇప్పుడు మన శ్శబ్దముచేతఁ జంద్రుఁడు గూడ గ్రాహ్యుఁడు. తక్కిన పదిమంది దేవతలును సాత్త్వికాహంకార కార్యములు. దిగ్వా తార్కప్రచేతోశ్వినులు శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణముల కధి ష్ఠాతలు. వాక్పాణి పాద పాయూపస్థలకు వహ్ని, ఇంద్ర, ఉపేంద్ర మిత్ర, ప్రజాపతు లధిష్ఠాతలు. కః అనఁగా ప్రజాపతి. 30

విజ్ఞానశక్తి బుద్ధి, క్రియాశక్తి ప్రాణము. ఇవి రెండును తైజ సాహంకారకార్యములు. అందుచేత జ్ఞానశక్తి క్రియావిశేషస్వరూపము లైన ఇంద్రియములు గూడ తైజసము నుండియే యేర్పడిన వని భావము. 31

దోః అనఁగా చేతులు. మేఢ్రము, ఉపస్థ. ఈ శ్లోకములో క్రమము వివక్షితము గాదు. ఈ రీతిగా కారణసృష్టిని జెప్పి, కార్య సృష్టిని వివరించు చున్నాఁడు. ఎప్పు డివి యసంగతములుగా నున్నవో! 32

అందుచేత, యదాయతనస్య = ఈ బ్రహ్మాండాఖ్య శరిరము యొక్క, నిర్మాణే=నిర్మితియందు, న శేకుః, తదా=అప్పుడు. 33

సదసత్త్వం=చైతన్యమును అచైతన్యమును, స్వీకృత్య = స్వీక రించి, ఉభయం = సమష్టి వ్యష్ట్యాత్మకమైన శరీరమును, ససృజుః= సృష్టించినవి. 34

కాలకర్మస్వభావముల నధిష్ఠించియున్నట్టి, జీవయతీతి జీవః= జీవింపఁ జేసెడునట్టి పరమాత్మ, అజీవం=అచేతనమును, అజీవయత్ =చేతనము గలదిగాఁ జేసెను, నిర్భిద్య=వేఱుచేసి నిర్చినవాఁడై. 35

కటిః=ఊరుమూలముల పశ్చాద్భాగము, జఘనం=పిఱ్ఱ పురో భాగము. వీనితోఁ గ్రిందనున్న యతలాది సప్తలోకములను, ఊర్ధ్వ

భూతములైన సమస్త లోకములను మనీషులు గల్పింతురని భావము.
36

వర్ణముల యుత్పత్తిని జూపించుచున్నాఁడు. బ్రహ్మ=బ్రాహ్మణుఁడు-ముఖ మని భావము. కార్యకారణముల కభేదవివక్షతో నిట్లు చెప్పఁబడినది. బాహువులు, క్షత్రం=క్షత్రియుఁడు. 37

ఇప్పుడు ఉపాసనార్థము లోకకల్పనాభేదములను జూపించుచు సప్తలోక పక్షములను వివరించుచున్నాఁడు. ఈ వివరణము రెండు శ్లోకములు. భూర్లోకః = పాతాళము మొదలుకొని, పద్భ్యాం = కటి పర్యంతము. 38

స్తనద్వయాత్ అనుట ఉపాసనార్థము చెప్పఁబడుటచే ఊర్ధ్వ అధోభాగ వైపరీత్యము దోషాకరము గాదు. లేక స్తనత్ శబ్దంకుర్వత్ యధోష్ఠద్వయం తస్మాత్. శబ్ద మొనర్చునది. రెండోష్ఠములు. అవియైనను అని యర్థముఁ జెప్పికొనవచ్చును. బ్రహ్మలోకః-వైకుంఠము, సనాతనః-నిత్యమైనది. సృజ్యమైన ప్రపంచాంతర్వర్తి కాదని భావము.
39

ఇప్పుడు చతుర్దశలోక పక్షమును జెప్పుచున్నాఁడు. జఘనాదులచేత పూర్వోక్తములైన భూరాది సప్తలోకములు. కట్యాదులతో క్రిందనున్న సప్తలోకములు. జానుభ్యాం సుతలం శుద్ధం=శుద్ధమైనదైనది-హరిభక్తుఁడైన బలి యుండుటచేత. 40

త్రిలోకపక్షమును జెప్పుచున్నాఁడు. ఇచ్చట భూర్లోకమనఁగా పాతాళాది సహితమైనదిగా నర్థ మొనర్చికొనవలెను. 42

## విజయధ్వజ వ్యాఖ్య :

అవః ఈ యధ్యాయమందు బ్రహ్మ - నారద సంవాదవ్యాజముతో గ్రంథప్రారంభమందు ప్రతిజ్ఞ చేసి జగజ్జన్మాది కారణలక్షణము

రముగాఁ బ్రతిపాదించుచున్నాఁడు. మొదలు నారదుని ప్రశ్న ప్రకారమును జెప్పుచున్నాఁడు-

భూతభావన!=భూతములను సృష్టించెడు, పూర్వజ!=సమస్త దేవతలకంటెను మొదలు జన్మించిన, దేవదేవ!=రుద్రాదులకును దేవతయైన చతుర్ముఖుఁడా!, తే నమః అస్తు. యద్జ్ఞానం=ఏ జ్ఞానము, ఆత్మతత్త్వనిదర్శనం=శ్రీహరి యథార్థతను దెలుపునో, తత్=ఆ జ్ఞానము, విజానీహి=విశేషముగా నాకుఁ దెలుపుము.

ఇక్కడ 'విజ్ఞాపయ' అని చెప్పక విజానీహి యనుటకు మహావ్యాకరణసూత్రానుసారముగా మూఁడు ప్రయోజనము లున్నవి.

1. ఆత్మ, బ్రహ్మ=వీనికి సంబంధించిన జ్ఞానమందు మహావిశేషమున్నది అనెడు భేదప్రతిపత్తి.

2. శ్రీహరి యనుగ్రహము లేకపోయినచో వాగాదులప్రవృత్తి గూడ విపరీత మగుచున్నది. అందుచే శ్రీహరియే స్వతంత్రుఁడు.

3. బ్రహ్మదేవుఁడు కర్త. నారదాదులు కరణములు. దీనితో జీవబ్రహ్మభేదము, హరియొక్క స్వాతంత్ర్యము, నారదుని కరణత్వము సిద్ధించుచున్నవి. 'వ్యత్యయో భేద స్వాతంత్ర్యకరణేషు' అని సూత్రము. 1

విభో!, ఇదం=మన కన్నుల కగుపడుచుండుటచేత సత్యమైన జగత్తు, యద్రూపం=ఏ పరమాత్ముని రూపమువలెనున్న రూపముగలదియో (అనఁగా ప్రతిమవంటిది. సాక్షాత్తుగా స్వరూపము గాదని యర్థము). యదధిష్ఠానం=ఎవనిని మూలాధారముగాఁ బొందినదో, యత్ సృష్టం=ఎవనిచేఁ గల్పింపఁబడినదో, యత్ సంస్థం=ఎవనిని పీఠమువలె అవాంతరాధారముగాఁ బొందియున్నదో (మొదలు భూమివలె మూలాధారమును, ఇచట పీఠమువలె నవాంతరాధారమును

[illegible] సర్వోత్తముఁడుగాఁ [illegible]
నిచే రక్షింపఁబడుచున్నదో, యచ్చ=ఎవని కధీనమై యున్నదో, తత్త్వం=ఆ శ్రీహరి సరియైన స్వరూపమును, తత్త్వతః=యథావత్తుగా, వద.

తాత్పర్యము : ఈ జగత్తు మన కన్నులకు గోచరించుచుండుట చేత సత్యమైనది. ఇది శ్రీహరిరూప సరూపమైన ప్రతిబింబము. శ్రీహరియే దీనికి మూలాధారము. సృష్టించిన వాఁడును శ్రీహరియే. పీఠమువలె దీని కవాంతరాధారమైన వాఁడును వాఁడే. అతఁడే సర్వోత్తముఁడు, జగద్రక్షకుఁడు. ఇదంతయు నాతని యధీనమైనది. అట్టి శ్రీహరితత్త్వమును యథావత్తుగాఁ దెలుపుము.

ఇక్కడ 'తద్వశత్వాదిదం రూపం హరేరేవ స్వరూపతః' అనెడు ప్రమాణముతో జీవాత్మకమైన జగత్తు చిత్తై (జ్ఞానస్వరూపమై) సత్తై జడాత్మకజగత్తు సత్తై సదృశ మగుటచేత ప్రతిమారూపమైనదని భావము 'అధిష్ఠాన మితిప్రోక్తం మూలాధారం విచక్షణైః' అనెడు ప్రమాణముతో నధిష్ఠాన మనఁగా ముఖ్యాధార మని యర్థము. అసత్యమైన జగత్తుయొక్క ఆరోపమునకు అధిష్ఠానమని యర్థము గాదు. 'యతో వా ఇమాని భూతాని జాయంతే' అనెడు శ్రుతితో శ్రీహరియే సృష్టించువాఁడు. 'యత్ స్థితం దృశ్యతేవస్తు సంస్థానం తదుదీరితం' అనెడు ప్రమాణముతో పీఠమువలెనున్న యవాంతరాధారమునకు సంస్థ యని పేరు. 'హరిః పరో ఽన్యజగతో హ్యావ్యక్తాదేశ్చ కృత్స్నశః' అను ప్రమాణముతో సమస్త జగత్తునకంటె భిన్నుఁడు. ఉత్తముఁ డనుట సిద్ధించుచున్నది. 'యదధీనా యస్య సత్తా తత్తదిత్యేవ భణ్యతే' 'విభేదే విద్యమానేపి మిథో నిత్యస్య రూపవతః' అనెడు ప్రమాణములవలె అధీనార్థమందు 'యచ్చ' అని చెప్పఁబడినది; 'యేన జాతాని జీవంతి యత్ప్రయం త్యభిసంవిశంతి'

అనెడు శ్రుతితో పరశబ్దమునకు పాలకుఁ డనియు, సంహార మనియు రెండర్థములు. 2

నాకుఁ జెప్పవలసిన విషయమందు నీకు సమగ్రమైన జ్ఞాన సామగ్రి యున్నదని నారదుఁ డనుచున్నాఁడు. 'భూత భవ్య భవత్ప్రభుః' 'భవాన్ సర్వం వేద హి' ప్రసిద్ధము. 'ప్రజాపతేనత్వ దేతాన్యన్యో విశ్వాజాతాని పరితాబభూవ' మొదలైన శ్రుతులలో నీ విషయము ప్రసిద్ధము. విశ్వం కరామలకవత్ తవ విజ్ఞానావసితం'- ఇక్కడ నారదుఁ డిట్లనుమానమును సృష్టించుచున్నాఁడు. ఈ సమస్త మును నీ వెఱుఁగుదువు అని ప్రశ్న. భూత భవిష్య ద్వర్తమానములకు నియామకుఁ డగుటచేత అని హేతువు. హి అనుటతో దేని కెవరు ప్రభువో దానిని వారు దెలియుదురని వ్యాప్తిని జూపించినాఁడు. చేతియం దుసిరికకాయను బట్టుకొన్నవానివలె అనుట కుదాహర ణము కనుక సమస్తమును నీ విజ్ఞానమునకు విషయము. అనఁగా సర్వము యొక్క విజ్ఞానమును నీ కున్నదని నిగమనము. 3

అవ: నీ జ్ఞానము సామాన్యము గాదు. శ్రీహరి యనుగ్రహా ధీన మగుటచేత విశేషజ్ఞానమే యని చెప్పుచున్నాఁడు-

యద్విజ్ఞానః = ఎవనియనుగ్రహముతో నీవు విశిష్టజ్ఞానము గలవాఁడవో, యదాధారః = ఎవని నాధారముగాఁ గల్గియున్నావో, యత్పరః = ఎవనిని నీకంటె నుత్తముఁడుగాఁ గల్గియున్నావో, యదాత్మకః = ఎవనిని స్వామిగాఁ గల్గియున్నావో, అట్టి, త్వం = నీవు (తం వేద) చెప్పినదానికంటె నెక్కువ విషయమును దెలిసికొనుటకై పూర్వపక్షమును జేయుచున్నాఁడు. ఏకః త్వం ఏవ = నీ వొక్కఁడవే, ఆత్మమాయయా = నీయిచ్ఛతో, భూతాని = చరాచరవస్తువులను, భూతైః = భూమి మొదలైన పంచభూతములతో, సృజసి = సృష్టింతువు. 4

ఈ బ్రహ్మ కాధారమైన దేది? ఆ విషయమును జెప్పుచున్నాఁడు.

అక్లమః త్వం ఆత్మశక్తిం అవష్టభ్య, సూత్రనాభి రివ = దారమును బయటువేయు సాలీనివలె, తాని = వస్తువులను, ఆత్మన్ = నీయందే, భావయసే = సృష్టించి కాపాడెదవు, స్వయం = నీవు, పరాన్ = బయటు, న భావయేః = సృష్టించుట లేదు, 'ఊర్ణనాభిరివ' అని శ్రీధరుల పాఠము. 'సూత్రనాభిరివ' అని విజయధ్వజులు. 'న పరాభావయన్' అని శ్రీధరులు, 'న పరాభావయేః' అని విజయధ్వజులు. 5

భావయసే చ = వృద్ధి నొందించుచున్నావు. ఆ కారణముతో, అస్మాత్ = నీకంటె, పరం = భిన్నమైన, జగత్కారణమును, అహం న వేద. అపరం = హీనమైన కారణమును దెలియను, విభో!, సమం = సమానమైన కారణమును, న వేదతు. ఇది నిశ్చయము, 'నాఽపరం' శ్రీధరులు, 'నాఽవరం' విజయధ్వజులు. పూర్వపక్షమును ముగించుచున్నాడు. నామరూపగుణైః = వాచకశబ్దముచేతను, బలుపు మొదలైన రూపములచేతను, సత్త్వము మొదలైన గుణములచేతను గూడియున్న, సత్ = స్థూలముగాని, అసత్ = సూక్ష్మముగాని, కించిత్ = ఏ వస్తువైనను భావ్యం = సృష్టి గావలసినది. తత్ = అది, అన్యతః = నీనుండి వేఱైనవానిచేత, సృష్టింపఁ బడినదనుట నింద్యమైన యర్థము. అందుచే నీవే సర్వమునకును గారణభూతుఁడవు. 6

తత్త్వమును దెలిసిన నీవు ప్రశ్నించు టెందులకు? దానికి సమాధానము. సః భవాన్, సుసమాహితః ఘోరం తపః, అచరత్, ఇతి యత్ తేన = అనుటచేత, నః = మమ్ములను, త్వం ఖేదయసే = నీవు మాత్రమే సృష్టికి సమర్థుఁడవు గాదను భావమును గల్గించుచున్నావు, చ = ఇంకను, పరాం శంకాం = నీకంటె వేఱొక్క కారణ మున్నదను (వేఱైన కర్త యున్నాఁడను బలమైన సందేహమును) ప్రయచ్ఛసి. 7

ఏతత్ పృచ్ఛతః మే, విజానీహి, సర్వజ్ఞ!, సకలేశ్వర! అను రెండు విశేషణములచేతఁ దా నొనర్చిన పూర్వపక్షమును స్థిరపఱచికొను చున్నాఁడు-

'త్వదధీనా యతస్సత్తా హ్యవరస్యాఽపి కేశవ!' ఈ ప్రమాణముతో నారదుఁ డింతవఱకు నడిగిన దంతయుఁ బూర్వపక్షమని తెలియవలెను. 8

అవ: నారదుని ప్రశ్నకు సమాధానముఁ జెప్పబోవుచున్న వాఁడై యాతఁ డడిగన ప్రశ్నను ప్రశంసించుచున్నాఁడు-

సౌమ్య! వత్స! అహం భగవద్వీర్య దర్శనేన=శ్రీహరి వీర్యమనిపించికొన్న సృష్టి మొదలైన కార్యములను ప్రకాశపఱచుటందు, చోదితః ఇతి యత్, కారుణికస్య తే విచికిత్సితం, ఇదం సమ్యక్. 9

అవ: పదవశ్లోకము మొదలు పూర్వపక్షభాగము నాక్షేపించు చున్నాఁడు-

భో! నారదా! మాం = నన్ను గూర్చి, యథా = నీ వొక్కఁడే సృష్టింతువని యేది, బ్రవీషి=పలికితివో, తథా=అది, న అనృతం= అసత్యము గాదా? అసత్యమే యని యర్థము, బత!=ఈ మాటను విని నేను చాలఖిన్నుఁడనై యున్నాను, చ = ఇంకను, మత్తః = నా కంటెను, పరం=ఉత్తముఁడైన యీశ్వరుని, అవిజ్ఞాయ=తెలియకయే, నా కంటె నుత్తమకారణము లేదని పలికితివో, తస్య = అదియును, నాఽనృతం=అసత్యము గాదా!, అపి=ఈ భావనయే నిందితమైనది. ఆక్షేపించుటకుఁ గల కారణమును జెప్పుచున్నాఁడు. మే = నాకు, యతః=ఏ కారణముతో, ఏతావత్త్వం, హి=ముందుఁ జెప్పఁబోవునట్లు వానిసామర్థ్యముతో, కార్యము నొనర్చెడి యోగ్యతయే తప్ప దాని కంటె హెచ్చైన స్వతంత్ర సామర్థ్యము లేదో, నీవు వచించినమాట సరియైనది గాదని యర్థము. 10

అవ: దానినే స్పష్టపఱచు చున్నాఁడు. యేన స్వరోచిషా, రోచితం విశ్వం, అహం రోచయామి. ఈ విషయమందుఁ బ్రమాణ మును జూపుచున్నాఁడు-

యథా అర్కః, యథా అగ్నిః, యథర్క్షగ్రహతారకాః 'తమేవ భాంత మనుభాతి సర్వం' 'యదాదిత్య గతం తేజో జగద్భాసయ తేఽఖిలం' మొదలైన ప్రమాణములతో సూర్యుఁడు మొదలైన సమస్త ప్రకాశవస్తువులును శ్రీహరిచేతఁ బ్రకాశితము లగుటచేతనే విశ్వమును బ్రకాశింపఁజేయుచున్నవని తాత్పర్యము. 11

అవ: మోక్షమును బొందవలెనను నధికారి నేనే స్వతంత్రుఁడ నైన కర్తను అనెడు దుర్మతశ్రవణముతో నేర్పడిన యపరాధమును శ్రీహరి నమస్కారముతోఁ బోఁగొట్టుకొన వలెనను నభిప్రాయముతో వాసుదేవునకు నమస్కరించుచున్నాఁడు-

తస్మై-స్వతంత్రుఁడైన, వాసుదేవాయ-వాసుదేవరూపుఁడైన, భగవతే-శ్రీహరికి, నమః. వయం తం ధీమహి. ఇట్లనుటచేత, 'ఓం నమో భగవతే వాసుదేవాయ నారాయణాయ విద్మహే, వాసు దేవాయ ధీమహి, తన్నో విష్ణుః ప్రచోదయాత్' అనెడు ద్వాదశాక్ష రము, ఇరువది నాల్గక్షరములు గల మంత్రము - ఈ రెండు విద్యలను దాను నిరంతరమును అనుసంధాన మొనర్చుకొనుచుండునని తెలిపిన ట్లైనది. అట్లైనచో బ్రహ్మదేవుఁడే సృష్టికర్త యను ప్రసిద్ధి యెట్లు వచ్చినది? దీనికి సమాధానము: దుర్జయయా=శ్రీహరిని సేవింపని వారిచే జయించుటకు సాధ్యముగాని, యన్మాయయా = ఏ శ్రీహరి యిచ్ఛ యనెడు మాయచేత, మాం-నన్ను, జగద్గురుం, విదంతి= తెలియుదురో-అట్టి వాసుదేవునకు నమస్కారము. పైనిఁ జెప్పిన మూఁడు శ్లోకములకును ఇట్లు గూడ నర్థ మొనర్పవచ్చును. నాకంటె ను తమ్ముఁడైన వానినిఁ దెలియక 'నీ వొక్కఁడవే సృషించుచున్నావు'

అనెడు నీమాట సరికాదు. అదితప్ప తక్కినది సరియే. ఒకటిమాత్రము సత్యము. ఎందుకనఁగా, న=ప్రమాణవిరుద్ధ మగుటచేత, అపి = ఈ పక్షము సంభావితము. బత=సంతోషమునకుఁ గారణము, యతః= ఏ విష్ణువునుండి, మే=నాకు, ఏతావత్త్వం = ఇంతయే సామర్థ్యమని, హి=ప్రసిద్ధము. పదునొకండవ శ్లోకముచేత, నీ ప్రసిద్ధిని జూపించి యున్నాఁడు. ఈ పద్యముతో శ్రీహరి కారణమనియు బ్రహ్మదేవుఁడు గర్త యనియుఁ దెలిపిన ట్లైనది. కాని శ్రీహరియే ముఖ్యకర్త యని తెల్పినట్లుగా లేదుగదా!. దానికి సమాధానముగాఁ దాను శ్రీహరికి దాసుఁడనని తెల్పి అతఁడే ముఖ్యకర్త యని పండ్రెండవ శ్లోకముతోఁ దెల్పినాఁడు. 'రాముఁడు వదలిన బాణము రావణుని చంపెను. ఇందులో ముఖ్యకర్త రాముఁడే యని తెలియుచున్నది గదా! అట్లే, ఇచ్చటఁ గూడ శ్రీహరియే ముఖ్యకర్త. అతని యిచ్ఛయే ముఖ్య మాయ. ప్రకృతి అముఖ్యమాయ, జీవులను బంధించు శక్తి అముఖ్య తమమైన మాయ. 12

యస్య ఈక్షాపథే స్థాతుం, విలజ్జమానయా = సిగ్గుపడెడు, 'శైవలి' అను పేరుగల జీవస్వరూపాచ్ఛాదికయైన, అముయా=ఈ మాయచేత, విమోహితాః=పూర్తిగా అన్యథాజ్ఞానమునందిన దుర్ధియః జనాః. అందుచేతనే దుష్టబుద్ధిగల జనులు, మమ = సమస్తమును నా వశమందే యున్నది. అహం = అన్నిటికి నేనే కర్తను, ఇతి=అని, వికత్థంతే=పొగడికొందురో, అట్టి శ్రీహరిని ధ్యానింతు మని యన్వ యము. 'ముఖ్యామాయా హరేః శక్తిః అముఖ్యా ప్రకృతిర్మతా' ఇత్యాది వాక్యముతో నిక్కడ చెప్పిన మాయ ఇంద్రజాల స్వరూపము గాదు. 13

అవ: విష్ణువున కంటెను వేఱుకారణము లేదని యెట్లు

కర్మ = 1. పుణ్య పాపరూపమైనది, 2. భూమి మొదలైన భూతముల పరిణామ విశేషము, 3. ఋత్విక్కు మొదలైన వారియొక్క వ్యాపారము, చ=ఇంకను, కాలః=1. పరిణామ కారణమైన త్రుటి, లవము మొదలైన కాలము, 2. వసంతము మొదలైన ఋతువులు, స్వభావః =1. సాత్త్వికము మొదలైన స్వభావము, 2. బ్రాహ్మణత్వము మొదలైనది. జీవః=1. సుఖదుఃఖముల కాశ్రయుఁడు, 2. యజమానుఁడనుకొనెడు జీవుఁడు. అన్యః అర్థః=పరమాత్మకంటె భిన్నమైన యే వస్తువును, వాసుదేవాత్=శ్రీహరికంటె, పరః=అధికమైనది. నైవ అస్తి=లేదు, బ్రహ్మన్=బ్రహ్మజ్ఞానియైన నారదుఁడా!, అట్లైనచో సమానమైన దుండవచ్చును గదా?, అదియును లే దనుచున్నాఁడు. తత్త్వతః=వానివలెనే ఉండునట్టిది, అనఁగా సమానమైన పదార్థము, న=లేదు. 'తద్వదేవ స్థితం యత్తు తాత్త్వతం త్వత్ప్రచక్షతే' అను ప్రమాణముతో సదృశమైనదని యర్థము. ద్రవ్యము మొదలైన ప్రతియొకటియుఁ గారణముగా నుండుట గూడ శ్రీహరి నియమనము చేతనే. కనుక, శ్రీహరియే సకలకర్త. 14

తాత్పర్యము: భూమి మొదలైన ద్రవ్యములు, పరిణామకారణమైన కాలము, సాత్త్వికము మొదలైన స్వభావము, సుఖదుఃఖముల కాశ్రయుఁడైన జీవుఁడు–వీనిలో నేదిగాని శ్రీహరికంటె నధికమైనది లేదు. ఇవన్నియు నాతనికంటె భిన్నమైనవే. వీనిలో నాతనికి సదృశమైన దేదియు లేదు. శ్రీహరియొకఁడే సకలజగజ్జన్మాది కర్త. తత్త్వతః అని శ్రీధరులు. తాత్త్వతః అని విజయధ్వజులు. 14

హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్–'బ్రహ్మాదేవానాం ప్రథమస్సంబభూవ. విశ్వస్యగోప్తా భువనస్య కర్తా' మొదలైన శ్రుతులలో బ్రహ్మదేవుని గుణగణములను గీర్తించుచున్నారు. అట్టిచో తద్భిన్నుని శ్రుతులు పొగడుచున్నవని చెప్ప

యెట్లు? అని యాశంకించికొని ఇట్టి శ్రుతు లన్నియు బ్రహ్మదేవున
కంతర్యామియైన బ్రహ్మనామకుఁడైన శ్రీహరి గుణములనే ప్రతిపా
దించుచున్నవని చెప్పుచున్నాఁడు. వేదాః నారాయణపరాః = తాను
ప్రతిపాదించెడు విషయములలో నారాయణుఁడే సర్వోత్తముఁడని
చెప్పుచున్నవి. అందఱికంటెను నారాయణుఁడే సర్వోత్కృష్టుఁ డని
యేల చెప్పుచున్నవి? దానికి సమాధానము: దేవాః నారాయణాం
గజాః=శ్రీహరియొక్క కన్ను మొదలైన యవయవములనుండి పుట్టిన
వారు దేవతలు. దీనినుండి దేవతలు నారాయణునికంటె తక్కువని
యతఁడే సర్వోత్కృష్టుఁడని చెప్పినట్లైనది. లోకాః నారాయణ పరాః
= పాలకుఁ డగుటచే నారాయణునే యధిపునిగాఁ జేసికొన్నవి.
**మఖాః** నారాయణపరాః = యజ్ఞములందుఁ బూజ్యులైన యింద్రాది
దేవతలయందును 'అహం హి సర్వయజ్ఞానాం' అను వాక్యములతో
శ్రీహరియే సర్వోత్కృష్టుఁడు. 15

యోగః నారాయణ పరం, తపః నారాయణ పరం, జ్ఞానం
నారాయణ పరం, గతిః నారాయణ పరా. దీనికిఁ బ్రమాణము:
'గమ్యేజ్యజ్ఞేయ వాక్యేషు యోజ్యేషు పరో హరిః'. దీనిచే శ్రుతుల
యందు వచ్చెడు 'హిరణ్యగర్భ' మొదలైన శ్రుతులకును నారా
యణుఁడే ముఖ్యార్థము. ఇతరదేవతలు గారు. 'సర్వే వేదా యత్పద
మామనంతి' ఇత్యాదులు ప్రమాణము.

తాత్పర్యము: బ్రహ్మ యొక్కఁడే యున్నాఁడని చెప్పెడు
వేదవాక్యములకును శ్రీహరియే యర్థము. అతఁడే సర్వోత్తముఁ డని
వేదములు ప్రతిపాదించును. దేవతలు వాని యవయవములనుండి
పుట్టినవారు. అందుచే నతనికంటెఁ దక్కువవారు; జనులను రక్షించు
వాఁడు శ్రీహరియే. యజ్ఞయాగాదులందు నింద్రాదిదేవతలకంటెను
శ్రీహరియే పూజ్యుఁడు. యోగాభ్యాసముతోఁ బొందఁదగిన వారిలో
వాఁడే యుత్తముఁడు. తపస్సుతో నారాధింపఁ దగినవారిలో శ్రేష్ఠుఁ

అవి : నీవే ముఖ్యమైన సృష్టికర్తవు గాకున్నచో లోకమందు నీవే సృష్టింతువని ప్రసిద్ధివచ్చుటకుఁ గారణమేమి? ఆ ప్రకారమును జూపించుచున్నాఁడు-

ద్రష్టుః = ఈశస్య, కూటస్థస్య, నిర్వికారమైన, అఖిలాత్మనః తస్య = ఆ హరియొక్కయు, అపి = లక్ష్మియొక్కయు, ఈక్షయైవ, అభిచోదితః, సృష్టః, అహం, సృజ్యం సృజామి. 17

తాత్పర్యము: ఈశ్వరుఁడే సర్వమునకును ద్రష్ట, సమస్తమును నియమించువాఁడు, నిర్వికారుఁడు, అందఱికిని స్వామి. వానియొక్కయు, తదధీనురాలైన లక్ష్మియొక్కయుఁ గటాక్షప్రేరణముచేత నతనిచే సృష్టింపఁబడిన నే నీ జగత్తును సృష్టించుచున్నాను. సర్వేశ్వరునిసృష్టి నడ్డగించుటకు నెవ్వరికిని సామర్థ్యము లేదని 'ఈశ' పదముతోఁ దెల్పుచున్నాఁడు. అతని నియామకత్వము తదన్యుల వరప్రసాదముచే నేర్పడినది గాదని 'కూటస్థ' విశేషణము దెలుపుచున్నది. ప్రబలమైన ప్రతిబంధకముచేత నైనను దీనిని మార్చుటకు సాధ్యము గాదని 'అఖిలాత్మనః' అను విశేషణముచేతను 'ఏవ' కారముతో నన్నుఁ బ్రేరేచువాఁ డతఁడు దప్ప మఱి యొక్కఁడు లేడనియుఁ దెలిపిన ట్లైనది.

పైనిఁ జెప్పినట్లు శ్రీహరియే ముఖ్యకర్త యని తెలిపి ఇప్పుడు 'యుగపత్క్రమశోపి వా' అనెడు నారదుని ప్రశ్నకు సమాధాన మిచ్చుచున్నాఁడు-

త్రిగుణములు శ్రీహరిచేత సర్వదా గృహీతము లైనను నిర్గుణస్య = సత్త్వాది గుణరహితుఁడైన, విభోః, మాయయా = ఇచ్ఛచేత, స్థితిసర్గనిరోధేషు = స్థితి, సృష్టి లయములందు, గృహీతాః = నిమిత్త

'మాయయా' అనుటచేత, మూలసృష్టియందు క్రమముగను దైనం దినసృష్టియం దేకకాలమునను గృహీతము లగునని తెలిపిన ట్లైనది. 'నిత్యం గృహీతా స్సత్త్వాద్యాః స్థిత్యాదిషు విశేషతః' 'యుగ పత్క్రమశశ్చైవ' అని ప్రమాణము.

తాత్పర్యము: శ్రీహరి ప్రకృతిగుణములనుండి దూరగుఁడు. ఐనను నవియెప్పు డాతని కధీనములే. మూలసృష్టికాలమందు వానిని క్రమముగాఁ గారణములు చేసికొని సృష్టి పాలన సంహారము వీని నొనర్చును. దైనందినసృష్టిలో నేకకాలమందే సమస్తమును గారణ ముగాఁ జేసికొని మూఁడుకార్యముల నేకకాలమందే తీర్చును. బ్రహ్మ కల్పము మొదటిసృష్టికి మూలసృష్టి యని పేరు. బ్రహ్మదేవుని దినకల్పసృష్టికి దైనందినసృష్టి యని నామధేయము. 18

అవ: రజోగుణము నుపాదానముగాఁ గైకొని శ్రీహరి సృష్టి కార్యమొనర్చునని చెప్పఁబోవువాఁడై సత్త్వాదిగుణములచేత జీవులను సంసారబద్ధులుగా నొనర్చు వాసుదేవునిమహిమను జెప్పుచున్నాఁడు.

ద్రవ్యజ్ఞాన క్రియాశ్రయాః = తామసాహంకార కార్యమైన శరీర (ద్రవ్య) మును, వైకారికాహంకార కార్యమైన మనస్సును, (జ్ఞానము), చెవిమొదలైన యింద్రియములను, తైజసాహంకారకార్య మైన వాగింద్రియాదులను ఆశ్రయించియున్న, గుణాః = ప్రకృతి యొక్క త్రిగుణములు, ముక్తం = అభిమానము లేకయున్నచో నెప్పు డును ప్రకృతిసంబంధములేని, మాయినం = స్వతఃజ్ఞానియైన, పురుషం = జీవసముదాయమును, కార్యకారణకర్తృత్వే = కార్యము, కారణము, కర్త అనెడు నభిమానముచేత, బధ్నంతి = బంధించుచున్నవి. అనఁగా శ్రీహరి తన యిచ్ఛతో వీనిని నిమిత్తములుగాఁ జేసికొని జీవులను బంధించుచున్నాఁడని యర్థము. తమోగుణకార్యమైన శరీరమును

తద్గతమైన దుఃఖము మొదలైన యనుభవములచే బంధించును. రజోగుణము కర్మకుఁ గారణమైన యింద్రియములతోఁ గర్మముల యందభిమానమును బుట్టించి బంధించును. సత్త్వగుణము మనస్సుతో జ్ఞానేంద్రియములతో నేను సుఖము లనుభవించుచున్నాను అను నే జ్ఞానముగలదో వానికిఁ గర్త ననెడు నభిమానముతో బంధించును. శరీరగత దుఃఖాద్యనుభవములందు తమస్సును గర్మములందు రజో గుణమును 'నేను సుఖిని' అనెడు సుఖానుభవమునందు సత్త్వమును గారణములగు నని తెలిపినట్లైనది. గుణము లచేతనములు. అందుచేఁ దమంతఁదాముగా నవి ప్రవర్తింపనేరవు. శ్రీహరియిచ్ఛతోనే ప్రవర్తిం చును కనుక హరి యిచ్ఛయే ముఖ్యకారణము. 19

> జ్ఞానేంద్రియైశ్చ మనసా సత్త్వం బధ్నాతి పూరుషమ్,
> రజః కర్మేంద్రియై ర్నిత్యం శరీరేణ తమ స్తథా.

ఇత్యాదులు ప్రమాణము.

దేహేంద్రియ మనస్సులు కేవల బంధకములే గాదు. హరి యనుగ్రహసామగ్రి యోగ్యులయొక్క మోక్షమునకును నివియే సాధనములని చెప్పుచున్నాఁడు-

స ఏషః 'యేన స్వరోచిషా విశ్వం' అనున దారంభించికొని 'కార్యకారణకర్తృత్వే' అనెడు శ్లోకమువఱకుఁ బ్రతిపాదితుఁడైన, అధోక్షజః=ఇంద్రియజ్ఞానమునకు విషయముగాని, భగవాన్, ఏతైః= ఈ, త్రిభిః - దేహము, ఇంద్రియములు మనస్సుననెడు, లింగైః= జ్ఞానోపాయలక్షణములతో యమనియమాదిసాధనలతోఁ బ్రయత్నించెడి, ఏతైః=ఈ జీవులచేత, స్వలక్షితగతిః=చక్కఁగాఁ జూడఁబడిన స్వరూపముగలవాఁడై (భవతి). బ్రహ్మన్=ఓ నారదుఁడా! ఈ హరి, సర్వేషాం=సమస్తముక్తులకును, మమ చ=నాకును, ఈశ్వరః=నియా మకుఁడు. దేహేంద్రియ మనస్సులను గెల్చినవారు, భగవద్విషయ

ప్రమాణములు. ముక్తులును నింద్రియజన్యమైన జ్ఞానము నతిక్ర మించుటచే వారుగూడ నధోక్షజులే. కాని ఇక్కడి యధోక్షజశబ్దము నకు వా రర్థముగాదు. ఈ విషయమును జెప్పుటకే 'సర్వేషాం' అని వాడఁబడినది. సర్వులలో బ్రహ్మదేవుఁడును జేరినాఁడు. నారదుని యొక్క విశేషశంకాపరిహారమునకై 'మమ చ' అని వేఱుగాఁ జెప్పు చున్నాఁడు. **20**

అవ: 'సృజ్యం సృజామి సృష్టోఽహం' అని చెప్పిన దానిని స్పష్టపఱచుటకై సృష్టిప్రకారమును జెప్పుచున్నాఁడు. లేక బ్రహ్మ జ్ఞానమందు ముఖ్యలక్షణము శ్రీహరియే. అతఁడే జగజ్జన్మాది కారణము. ఈ విషయమును తెల్పుటకే సృష్టిప్రకారమును దెల్పు చున్నాఁడు_

మాయేశః_లక్ష్మీపతి, విబుభూషుః = పరమని చెప్పఁబడెడు తన నిమేషముయొక్క కొనయందు_సృష్టికాలము ప్రాప్తము కాఁగా ననేక రూపములను బొందెడు నిచ్ఛతో, ఆత్మన్ = అనాదికాలముగాఁ దనయందు, యదృచ్ఛయా=తన యిచ్ఛచేతనే, ప్రాప్తం (ఏవ)= వచ్చియేయున్న, కాలం=కాలమును, కర్మ = జీవుల నానావిధమైన యదృష్టమును,స్వభావం=సాత్త్విక రాజస తామసమనెడు స్వభావ మును, త్రిగుణములతోఁ గూడిన ప్రకృతిని, స్వయామాయయా=తన శక్తిచేతనే, ఉపాదదే_విశేషముగా మఱల గ్రహించెను. ప్రకృతిని ప్రవేశించి తన శక్తితో దానిని క్షోభ మొందించెనని తెలిపిన ట్లైనది.

యత్రాఽన్యహేత్వభావస్స్యాత్ ఈశ్వరేచ్ఛాదినా వినా,
తదిచ్ఛాహి తదృచ్ఛాస్యా దత స్తత్ర యదృచ్ఛయా.

ఎచ్చట శ్రీహరి యిచ్ఛతప్ప భిన్నమైన యిచ్ఛ మొదలైన కారణ

ములు లేవో అట్టి చోట యదృచ్ఛ యనఁగా ఈశ్వరేచ్ఛ యనియే యర్థము-

కాలకర్మస్వభావాది నిత్యయేశేచ్ఛయా సదా,
ప్రాప్తమేవ విశేషేణ సృష్ట్యాదౌ పున్నయత్యజః.
ఈశో బహ్వీః పురః సృష్ట్వా తత్రైవ బహురూపతామ్.
తత్తన్నియామకతయా ప్రాప్తుం కాలాద్యుపాదదే.

అనెడు ప్రమాణములతో సృష్టి మాయామయము గాదని సిద్ధమైనది.

తాత్పర్యము: బ్రహ్మదేవుని యాయుస్సనెడుకాలము వాసుదేవుని ఒక్క నిమేషము. ఈ కాలాంతమందు లక్ష్మీపతి తన యిచ్ఛచేతనే కాలమును జీవాదృష్టమును త్రిగుణస్వభావములను ప్రకృతిని గ్రహించును. విశేషముగా గ్రహించును. అనఁగా వీనియందు విశేష రూపముతోఁ బ్రవేశించి వాని శక్తిని వ్యక్తముగు నట్లొనర్చును. ఇవన్నియు ననాదికాలము నుండియు తదధీనమైనవే. ఐనను ననేక రూపములతో విహరించు నిచ్ఛతో శ్రీహరి వీని నుపయోగించికొని సృష్టికిఁ దొడఁగును. 21

అవ: గుణసమూహ మనిపించికొన్న మూలప్రకృతినుండి మహత్తత్త్వము సృష్టియైన ప్రకారమును జెప్పుచున్నాఁడు-

గుణవ్యతిరేకాత్ =పరమాత్మసృష్టించవలెనని యిచ్ఛగొన్నప్పుడు కాల,కర్మ, స్వభావ, రజోగుణములను బ్రవేశించి సృష్టికై ప్రేరేచును. అప్పుడు తమోగుణము రజోగుణముతోఁ జేరును. ఈ విధమైన గుణ వైషమ్యమునకు 'గుణవ్యతికర' మని పేరు. దీనినిఁ బొందిన సృష్టి కారణమైన కాలమునుండి లేక గుణవైషమ్యమున్న అవ్యక్తమునుండి, కర్మణః = బ్రహ్మదేవుని యదృష్టముచేత, (ఉపకారము నందిన) పరిణామ స్వభావతః=వికారమును బొందెడు స్వభావముగల మూల

క్షోభింపఁబడినట్టి (ప్రకృతిచేత). ఈ శ్లోకమందున్న పంచమీ విభక్తు లన్నియు తృతీయా విభక్త్యర్థమందే వాడఁబడినవి. మహాతః=చతు ర్ముఖబ్రహ్మ యొక్క దేహ మనిపించికొన్న మహత్తత్త్వముయొక్క, జన్మ=పుట్టుక, అభూత్ =ఆయెను.

**గుణకాలస్వభావేభ్యః ఈశేనాధిష్ఠిత త్త్వతః,**
**జగదాదిర్మహత్తత్త్వ మభూత్తస్యేచ్ఛయా హరేః.**

అను ప్రమాణముగూడ నీ విషయమునే చెప్పినది.

తాత్పర్యము : తమోగుణము రజోగుణముతోఁ జేరును. దీనికి గుణవ్యతికరమని పేరు. ఇట్టి గుణవైషమ్యముగల కాలము ప్రకృతి. బ్రహ్మనిపించికొన్న ఆ యదృష్టము వికార మందెడు స్వభావము గల మూలప్రకృతి. శ్రీహరియొక్క విశేషాధిష్ఠానముగల వీనిచేత మహత్తత్త్వ ముత్పన్నమైనది. దీనికే బ్రహ్మదేవుని శరీరమని పేరు.22

తు=కాలకర్మస్వభావములచేత, వికుర్వాణాత్ =వికారమందిన రజ స్సత్త్వోపబృంహితాత్ =సత్త్వగుణముచేఁ గూడిన రజస్సుచేత, నభివృద్ధమైన, మహతః=మహత్తత్త్వమునుండి, తమఃప్రధానః=తమో గుణమే ప్రధానముగాఁగల, ద్రవ్యజ్ఞానక్రియాత్మకః=పంచభూతములు జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు - వీని స్వరూపమైన తత్త్వ విశేషము, అభవత్ =ఏర్పడినది, తు=మహత్తత్త్వమున కంటెను దీని యందు తమోగుణము హెచ్చు. కాని దానినుండి పుట్టిన యితర తత్త్వముల కంటెను హెచ్చు గాదు. ఆ తత్త్వముల కంటెను దీని యందు సత్త్వగుణమే హెచ్చై యుండును. సః = అది, అహంకార ఇతిప్రోక్తః=అహంకారతత్త్వ మని పిలువఁబడును, వికుర్వన్=వికార మును బొందునదై, త్రిధా=మూఁడు రీతులుగా, సమభూత్ =ఐనది. యద్భిదా =అహంకార తత్త్వభేదము వైకారిక, తైజస, తామసాహం కారములని మూఁడురీతులు

ముతోఁగూడి రజోగుణముతో నభివృద్ధమైనట్టిదియు మహత్తత్త్వమున కంటెను హెచ్చుపాలు తమోగుణము గలిగిన అహంకారతత్త్వము మహత్తునుండి పుట్టెను. ఇవే పంచభూతములు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు వీనికిఁగారణము. ఈ తత్త్వము వికృతమై వైకారిక తైజస తామసాహంకారము లని మూఁడురీతు లయ్యెను. 23, 24

అవ: వేఱు విధముగా నీ యహంకారతత్త్వ విభాగమును జెప్పుచున్నాఁడు.

ప్రభోః = అహంకారతత్త్వమే శరీరముగాఁ గల రుద్రునకు, ద్రవ్యశక్తిః = పంచభూతములను సృష్టించుశక్తి యుండుటచేత ద్రవ్యశక్తియు, క్రియాశక్తిః = కర్మేంద్రియములను సృష్టించు శక్తియుండుటతోఁ గ్రియాశక్తియు, జ్ఞానశక్తిః = జ్ఞానేంద్రియములను బుట్టించుశక్తి యుండుటతో జ్ఞానశక్తియు నను మూఁడు విధములైన శక్తి గలదు. మనస్సు, దిక్కులు మొదలైన వాని యభిమానిదేవతలను సృష్టించు సామర్థ్యముండుటతో రుద్రునకు 'ప్రభోః' అని వాఁడఁబడినది. ద్రవ్యశక్తియొక్క ప్రకారమును జెప్పుచున్నాఁడు. భూతాదేః = పంచభూతములకు మూలకారణమైన, వికుర్వాణాత్ = వికారమందిన, తామసాత్ = తామసాహంకారమునుండి, అపి = కాలకర్మస్వభావముల చేతను, నభః = ఆకాశము, అభూత్ = అయ్యెను, 'భూతాని ద్రవ్యనామాని జ్ఞానం జ్ఞానేంద్రియాణి చ' అనెడు ప్రమాణములతో నిట్లర్థముఁ జెప్పవలెను. 25

తస్య = ఆ యాకాశమునకు, మాత్రాగుణః = పంచేంద్రియములచేఁ దెలియఁబడెడు గుణ మనిపించికొన్న (శబ్దము స్పర్శము మొదలైన గుణములందు మూలకారణముగా నుండనే యుండుటచే పంచేంద్రియములని చెప్పఁబడినది), శబ్దః = శబ్దము, అభూత్ = అయ్యెను. (దానినుండి యాకాశ ముత్పత్తి యయ్యెనను విశేషము నిచ్చుటఁ

దెలియవలెను. పైన నట్లే చెప్పెదరు). యత్ = ఆ శబ్దము, ద్రష్టృ దృశ్యయోః = సమస్తమునుజూచెడు శ్రీహరిని, వానిచేఁ జూడఁబడెడు జగత్తును, లింగం = తెలిపెడు ప్రమాణముగా నుండును. అథ = కాల కర్మ స్వభావములచేత, వికుర్వాణాత్ = వికార మందిన, నభసః = ఆకాశమునుండి, స్పర్శగుణః = త్వగింద్రియముచేత మాత్రమే తెలియఁ దగిన గుణ మనిపించికొన్న స్పర్శగుణమున్న, అనిలః అభూత్ ('పంచేంద్రియాభిమేయత్వాత్ మాత్రాగుణ ఇతీరితాః') 'శబ్దే నైవ పరోద్రష్టా జ్ఞాయతే జగదేవ చ' అనెడు ప్రమాణములతో పైయర్థము చెప్పఁబడినది. 'శబ్దః క్వచిదాశ్రితః గుణత్వాత్' గుణమగుటతో శబ్ద మొకదాని నాశ్రయించియే తీరవలెను. ఈ యాశ్రయమే యాకాశ మని అనుమానమును గూడఁ జెప్పుచున్నాఁడు. ౨౭౬

ఈ వాయువు, పరాన్వయాత్ = ఆకాశసంబంధముతో శబ్ద వాంశ్చ = శబ్దమునుగూడఁ బొందియున్నది, ప్రాణః = సర్వులను చేష్టింపఁజేయుటచే ప్రాణ మనియుఁ బిలువఁ బడినది. ఓజః = ఒకరిని దిరస్కరించు శక్తి యుండుటచే ఓజ స్సనిపించుకొనును. సహః = ఇతరులచేతఁ దిరస్కరింపఁబడుటకు సాధ్యముగాని శక్తియుండుటచే సహ మనిపించుకొనును. బలం = ఇష్టము వచ్చిన దానినిఁ జేయఁ గల్గుటచే బల మని పేరు. కాలకర్మస్వభావములతో వికార మందిన వాయోరపి = వాయువునుండి, రూపవత్ = తనదేయైన రూపగుణమును, స్పర్శశబ్దవత్ = తనకుఁ గారణము లనిపించికొన్న వాయ్వాకాశము లతో స్పర్శశబ్దములను బొందిన, తేజః = తేజస్సును, ఉదపద్యత వై = జనించినవి. వై అనుటతో వైశేషికులు చెప్పెడి - 'అగ్ని ఉపాధులతో స్పర్శ శబ్ద గుణములను బొందినది. స్వభావముతోఁ గాదు అనెడు వాదము కల్పితమని తేలుచున్నది. వాయువునకు ప్రాణాదినామము లుండుటయందు ఈ క్రింది వచనము ప్రమాణము. 'సర్వచేష్ట

తు=కాలకర్మస్వభావముతో వికారమును బొందిన, తేజసః= రసాత్మకం, అంభః, ఉదపద్యత, అంభః=ఆ నీరు, పరాన్వయాత్= తనకుఁ గారణములైన అగ్ని, గాలి, ఆకాశము - వీని సంబంధముచేత, రూపవత్, స్పర్శవత్, ఘోషవత్, చ, అభూత్. 28

కాలకర్మస్వభావములతో వికారమునందిన నీటినుండి, గంధ వాన్=గంధగుణముగల, విశేషః=ఐదుగుణములుగలిగియుండుటవలన విశేష మను పేరుగల భూమి, అభూత్; ఇది, పరాన్వయాత్=ఆకా శాదికారణపరంపరలతోఁ గూడి యుండుటచేత రస స్పర్శ రూపశబ్దము లనెడు గుణములతోఁ గూడియున్న దయ్యెను. ఇక్కడ ప్రతిచోటను నా యా తన్మాత్రలు, వానినుండి భూతములు పుట్టిన వని తెలియ వలెను. 29

వైకారికాత్=వైకారికాహంకారముయొక్క, సాత్త్విక భాగము నుండి, మనః=అంతఃకరణము, జజ్ఞే=ఉత్పన్నమయ్యెను, వైకారికాః= శబ్దము, జ్ఞానము మొదలైన విశిష్టకార్యశక్తు లుండుటతో, వైకారికు లని పిలువఁబడెడు దిగ్దేవతలును, వాయువు, సూర్యుఁడు, వరుణుఁడు అశ్వినీదేవతలు, అగ్ని, ఇంద్రుఁడు, 'ఉపేంద్రుఁడు' అనిపించికొన్న విష్ణువు, మిత్రుఁడు, దక్షప్రజాపతి ఇట్లు దశదేవాః (జజ్ఞిరే).

విష్ణువు పాదాభిమాని గాదు. కాని తదభిమానియైన యజ్ఞుఁ డనెడు (జయంతుఁడు) దేవతయం దంతర్యామియైయుండి పాదాం గుష్ఠమందు నిలిచి శరీరమును ధరించును. దీనికిఁ బ్రమాణము-

**అనాద్యనంతోఽపి హరిర్వైకారిక గుణేష్వజః,**
**అవతీర్ణః పదాంగుష్ఠ మధ్యాస్తే విశ్వభు గ్విభుః.**
**విశిష్టకార్యశక్తిత్వా ద్దేవా వైకారికా స్స్మృతాః-దశ,**

అని చెప్పుటతో దానికన్న నెక్కువగాని తక్కువగాని లేదని యర్థము.

తాత్పర్యము: వైకారికాహంకారముయొక్క సాత్త్వికభాగము నుండి శ్రీహరియంతఃకరణమను మనస్సును సృష్టించెను. విశిష్టకార్య

శక్తియుండుటచే వైకారికు లనిపించికొన్న దిగ్దేవతలు పదిమంది. వీరు వాయుసూర్యవరుణులు, అశ్విని, అగ్ని, ఇంద్ర, విష్ణు, మిత్ర, దక్ష ప్రజేశ్వరులు. వీరు క్రమముగా శ్రోత్ర స్పర్శ చక్షు ర్జిహ్వా ఘ్రాణ వాక్పాణిపాదపాయూపస్థ లనెడు జ్ఞానకర్మేంద్రియాధి దేవతలు. 30

కాలకర్మస్వభావముతో వికారమునందిన, తైజసా=తైజసాహంకారమునుండి, దశేంద్రియాణి అభవన్=ఒకొక్క ఇంద్రియశక్తియు వేఱు వేఱగుటచే నన్నిటిని జేర్చి విభాగించుచున్నాఁడు. జ్ఞానశక్తిః= జ్ఞానమును గల్గించు శక్తిగల జ్ఞానేంద్రియములు, క్రియాశక్తిః = క్రియను గల్గించుశక్తిగల కర్మేంద్రియము, మఱియు జానశక్తిః బుద్ధిః =అచేతనములైన యింద్రియములకు జ్ఞానమును గల్గించు శక్తి నొసఁగెడు బుద్ధి, (తదభిమానినియైన యుమాదేవి). క్రియాశక్తిః ప్రాణః= కర్మేంద్రియములకుఁ గర్మను గలిగించు సామర్థ్యము నొసఁగెడు నహంకారిక ప్రాణస్వరూపుఁడు. ఈ యిరువురును, తైజసః=తైజసాహంకారము నుండి పుట్టిరి - 'జ్ఞానేంద్రియాణాం దేవానాం జ్ఞానశక్తిరుదాహృతా' ఇత్యాది స్థలములందుఁ జెప్పెడి జ్ఞానాదిశక్తి బుద్ధికభిమానినియైన ఉమాదేవి, ప్రాణాభిమానియైన ప్రాణదేవుఁడు- వీరిద్దరి యనుగ్రహముచేతనే యేర్పడునని తెలియవలెను. అత్యంత ప్రకాశమానము లగుటచే భూతములు తామసములని తెలియవలెను. ద్రవ్య మనఁగా ద్రవించి (వేగముతోఁ బరుగిడి) చేరునది. భూమి, నీరు, గాలి, అగ్ని ఇవి 'నేను ముందు-నేను ముంద' ని పందెము వేసికొన్నట్లు, వేగముగాఁ బరువెత్తుటచేఁ బరస్పరము ద్రవించునని చెప్పఁబడును. ఆకాశము సర్వవ్యాపక మగుటచేఁ బరువెత్తుకున్నను ప్రదేశమైయుండుటచే ద్రవ్యమనిపించు కొనుచున్నది.

**ద్రవ్యంతు ద్రవణప్రాప్యం ద్వయో ర్వివదమానయోః,**
**పూర్వవేగాభిసంబంధా దాకాశశ్చప్రదేశతః.**

అని ప్రమాణము. 31

అవ: ఇంద్రియముల విశేషనామములు చెప్పుచున్నాడు-

శ్రోత్రం, త్వక్, ఘ్రాణ, దృక్, జిహ్వా, వాక్ (మాట), (మాటవెల్వడు నింద్రియము.) దోః, మేఢ్ర, అంఘ్రి, పాయు=మల విసర్జనేంద్రియము. ఈ సృష్టిని జెప్పి యా తత్త్వములతో బ్రహ్మాండ సృష్టిప్రకారమును జెప్పుచున్నాడు. బ్రహ్మవిత్తమ!, ఏతే=ఈ, భూతేంద్రియమనోగుణాః=ఈ పంచభూతములు పది ఇంద్రియములు తైజసములైన బుద్ధిప్రాణములు మనస్సు మొదలైన గుణములు శబ్దము మొదలైనవి, మహత్తత్త్వము అహంకారతత్త్వము లనెడు, భావాః= పదార్థములు, అసంగతాః=ఒకదానితో నొకటి చేరక, యదాయతన నిర్మాణే=ఎప్పు డీ బ్రహ్మాండ నిర్మాణమందు, న శేకుః=సమర్థములు గాలేదో. 32

తదా = అప్పుడు, భగవంతుని స్తుతించి శరణుఁ జొచ్చి యా స్తోత్రముచేఁ బ్రసన్నుఁడై తనశక్తిప్రదమైన రూపముతో నా తత్త్వములను బ్రవేశించినట్టి, భగవచ్ఛక్తిచోదితాః=శ్రీహరి శక్తిచేఁ బ్రేరితులై, అన్యోన్యం చ=సంహత్య = పరస్పరము చేరి, సదసత్త్వం=వ్యక్తములైన పృథివి, నీరు, అగ్ని యనెడు భూతములను అవ్యక్తములైన వాయ్వాకాశములను, ఉపాదాయ=ఉపాదాన కారణములుగాఁ గైకొని, నః= మనకు, భయం=సంసారభయమును గల్గించునట్టి, అదః=ఈ బ్రహ్మాండమును, ససృజుః=సృష్టించినవి, హి=ఇది యుక్తమే. నో భయం అనుటకు సదసద్విలక్షణ మని యర్థముఁ జెప్పుట యుక్తము గాదు. బ్రహ్మాండముయొక్క సత్యత్వము ప్రత్యక్షముగనే సిద్ధమైనది, హి అనుపదము ఈ కారణమును దెలుపును లేక సంసారమందు భయ మెట్టిది? అనుటయైనను దెలియఁజేయును.

'ఆకాశవాయూ త్వవ్యక్తౌ ఇతరేండే ప్రకాశితాః' అన్ప్రమాణముతో భూతములందుఁ గొన్నిసత్తులు, మఱికొన్ని యుపపత్తులనియుఁ జెప్పఁబడుట యుక్తము. 33

అవ: బ్రహ్మాండ మందలి సృష్టిని జెప్పుటకై దాని యందలి శ్రీహరి వ్యక్తిప్రకారమును జెప్పుచున్నాఁడు-

కాలకర్మస్వభావస్థః = ఉద్బోధకములైన కాలకర్మస్వభావములందు శక్తిప్రదుఁడై యున్న, అజీవః = సంసారికంటె భిన్నుఁడైన పరమేశ్వరుఁడు, ఉదకేశయం = వేయివర్షములు ఆవరణమైయున్న నీటిమధ్య మందున్న, తదండం = ఆ బ్రహ్మాండమును, వర్షపూగసహస్రాంతే = వేయివర్షముల కడపట నా తత్త్వములలోఁ బ్రవేశించి తన్ను వ్యక్తమొనర్చి కొనవలెనని కోరెనో అప్పుడు, అజీవం = జీవభిన్నుఁడైన తన్ను, తత్ర = అచ్చట అజిజనత్ = వ్యక్తమొనర్చికొనెను. 'కాలకర్మ స్వభావస్థో జీవోఽజీవ మజీజనత్' అని మూలము. ఇక్కడ రెండు చోటులయందును 'అజీవః' 'అజీవం' అని పరిచ్ఛేద మొనర్చి పైనిఁ జెప్పిన అర్థకల్పన ఇప్పుడు రెండు చోటులను 'జీవః' 'జీవం' అని పరిచ్ఛేద మొనర్చి యర్థమును జెప్పుచున్నాఁడు జీవః = ప్రాణధారకుఁడైన పరమాత్మ, జీవం = ప్రాణధారకుఁడైన తన్ను వ్యక్త మొనర్చికొన్నాఁడు. మొదటిది 'అజీవ' రెండవది 'జీవ' అని పదచ్ఛేద మొనర్చినప్పుడు అర్థకల్పన మీా రీతిగా నగును. అజీవః = జీవభిన్నుడైన పరమేశ్వరుఁడు, జీవం = సర్వజీవులయందును ప్రధానుఁడైన చతుర్ముఖబ్రహ్మను, అజీజనత్ = సృష్టించెను. సృష్టించి అతని యందు ప్రాణధారకుఁడై తదంతర్యామియైన తన రూపమును వ్యక్త మొనర్చెను.

**యః ప్రాణధారణాం ప్రాణః ప్రసాదా త్కురుతే ఽనిశం**

అనుటచే జీవశబ్దము గూడఁ బరమాత్మను దెలుపుచున్నది. జీవున కంటెను నతిశయమైన తేజము గలవాఁ డగుటచే అజీవుఁ డనియు, జగత్తుయొక్క జీవనమునకుఁ గారణ మగుటచేఁ జీవుఁ డనియు శ్రీహరికే పేరు. 'అజీవో౽పి మహాతేజాస్త్వథవా జీవయన్ జగత్' అని ప్రమాణము. 'అండేజాతే పుమాంసౌద్వౌ హర్ర్బహ్మ తథైవచ' అను ప్రమాణముచేత విరాజ మనెడు పురుషసృష్టిని గూడఁ జెప్పవలసి యున్నది. అందుచే మూఁడవ యర్థము గూడ సరియైనదే. 34

స ఏషః—ఎవఁడు మహదాది భూతములను సృష్టించి వానిలోఁ బ్రవేశించి వానినిఁ గారణములుగాఁ దీసికొని బ్రహ్మాండ సృష్టి నొనర్చి దానియందుఁ బ్రవేశించెనో అట్టి, పురుషః — కాళ్లు, చేతులు మొదలైన యవయవము లుండుటచేత పురుషనామకుఁడైన శ్రీహరి, అండం నిర్భిద్య—అండమును పెద్దదిగా నొనర్చి, తస్మాత్ —దానినుండి నిర్గతః—ప్రకాశించెను, పురుషుఁడైనను, ఇతఁడు లోకవిలక్షణుఁ డని తెలియుటకు సహస్రోర్వంఘ్రి ఇత్యాది విశేషణములు ఇక్కడి సహస్ర శబ్దమునకు నౌచిత్య మెఱిఁగి యర్థ మొనర్చికొనవలెను. 35

పురుషనామకుఁడైన శ్రీహరి యవయవములనుండియే సృష్టి యైనది. ఇది ముఖ్యసృష్టి. తక్కిన వారితో నయ్యె ననుట అముఖ్య మను నభిప్రాయముతోఁ జెప్పుచున్నాఁడు.

ఇహ—ఏఁబదికోట్లు విస్తారముగల బ్రహ్మాండమందు, యస్య— వాడవు వెడల్పులలో సర్వము నాక్రమించియున్న వాని పూర్ణానంద దేహమునుండి యవతరించిన పదునాల్గు లోకములనుండియు బ్రహ్మాం డమునుండియు వేఱైన పురుషనామక వాసుదేవుని యొక్క, అవ యవైః—అవయవము లనెడు, నిమిత్తకారణములచేత, ఊర్ధ్వాదిభిః—

తొడ మొదలైన వానిచేత, అధః=క్రింది, సప్తలోకాన, జఘనాదిభిః= జఘనాదుల పైభాగములచేత, ఊర్ధ్వం సప్తలోకాన్, మనీషిణః కల్ప యంతి. ఈ సృష్టి జ్ఞానులకు ప్రత్యక్షసిద్ధ మగుటచే ముఖ్యసృష్టి. ఇతరులతోనైన దముఖ్యమని యభిప్రాయము. 'హరే రనయవై స్సృష్టా లోకా ఇతి వికల్పనం' ఇత్యాదులు ప్రమాణములు. 36

అవ: ఇప్పుడు పురుషనామకుఁడైన హరి ముఖాదులనుండి బ్రాహ్మణాదుల సృష్టిని చెప్పుచున్నాఁడు-

పురుషస్య, ముఖం = ముఖము నుండి, బ్రహ్మ = బ్రాహ్మణ వర్ణము, ఏతస్య బాహవః క్షత్రం, భగవతః ఊర్వోః వైశ్యః, పద్భ్యాం శూద్రః వ్యజాయత. 'బ్రాహ్మణో ముఖ మిత్యేష ముఖాజ్జాతత్వ హేతుతః' అనెడు ప్రమాణముతో ముఖ మనెడు ప్రథమావిభక్తి పంచమీవిభక్త్యర్థముననే చెప్పఁబడినది. ఈ శ్లోక మందే 'ఊర్వోః' 'పద్భ్యాం' అనుచున్నాఁడు గదా! ఈ యంగములతో బ్రాహ్మణాది జాతులు ఉత్పన్నము లైనట్లే అంగములనుండి లోకసృష్టి యయ్యె నని తెలియవలెను. 37

భూ ర్లోకః పద్భ్యాం కల్పితః, భువర్లోకః అస్య నాభితః, హృదా స్వర్గలోకః మహాత్మనః ఉరసా మహర్లోకః, గ్రీవాయాం చ జనలోకః, నేత్రయోః చ తపోలోకః. సత్యలోక మనెడు సనాతనమైన బ్రహ్మలోకము శిరస్సునుండి పుట్టినదని తాత్పర్యము. 38, 39

కటి, ఊరువులు వీని సామీప్యముతో 'ఊర్వోః' అని చెప్పు టతో నింతకుముందు చెప్పిన దానికి దీనికి విరోధము లేదని తెలియ వలెను. ఇతి=లోకసృష్టి యొనర్చుట, దాని కాధారముగా నుండుట లోకములందు వ్యాపకుఁడై యుండుట, ఆ లోకములకంటె నుత్త ముఁడై యుండుట యివన్నియు శ్రీహరి మహిమయే. అందుకే, పుమాన్=విరాట్పురుషుఁడైన శ్రీహరి, లోకమయః = లోకప్రధానుఁ డనియే యున్నాఁడు. 40, 41

పాదములనుండి భూమి మొదలున్న లోకములు, నాభినుండి యంతరిక్ష లోకములు, శిరస్సునుండి స్వర్గము మొదలైన లోకములు, ఇతి వా = పుట్టిన వనియైనను, లోక కల్పనా - లోక కల్పనము, అతలాదిలోకములు భూమియందును, మహోరాజులు స్వర్గమునందును జేరుటచే త్రిలోకములందు సని తెలియవలెను. పదునాల్గు లోకము లనునది మఱియొక యుపాసన. మూఁడు లోకములనునది యింకొక రకమైన యుపాసన. ఇట్లు అధికారిభేదముతో ఉపాసనాభేదము లుండుటచేఁ బైఁజెప్పినవన్నియు సరియైనవేయని తెలియవలెను.42

**శ్రీపోతన్నగారు:**

వచ: నారదుండు బ్రహ్మ కిట్లనియె-

చతురాస్యుండవు వేల్పుపెద్దవు జగ త్సర్గానుసంధాయి వీ
శ్రుతిసంఘాతము నీ ముఖాంబుజములన్ శోభిల్లు శబ్దార్థ సం
యుతమై సర్వము నీ కరామలకమై యుండుం గదా। భారతీ
సతి యి ల్లాలఁట నీకు; వో జనక। నా సందేహముం బాపవే।

ప్రాతంభాది వివేక మెవ్వఁడొసఁగున్? ప్రారంభసంపత్తి కా
ధారం బెయ్యది? యేమి హేతువు? యదర్థం? బేస్వరూపంబు? సం
సారానుక్రమ మూర్ణనాభివగిదిన్ సాఁగింతు వెల్లప్పుడున్;
బారం బెన్నఁడు లేదు నీ మనువు దుష్ప్రాపంబు వాణీశ్వరా।

నాకుం జూడఁగ నీవు రాజ వనుచున్నాఁడన్ యథార్థస్థితిన్
నీకంటెన్ ఘనుఁ డొక్క రాజు గలఁడో? నీ వింతకున్ రాజవో?
నీ కేలాభము రాఁదలంచి జగముల్ నిర్మించె? దీ చేతనా
నీకం బెందు జనించు, నుండు, నణఁగున్? నిక్కంబు భాషింపుమా।

సదసత్సంగతి నామ రూప గుణ దృశ్యంబైన విశ్వంబు నీ
వ్వాదధీనంబు గదా। ఘనుల్ సములు నీ కెవ్వారునున్ లేరు; నీ
పద మత్యున్నత; మిట్టి నీవు తపముల్ ప్రావీణ్యయుక్తుండవై
మది నే యీశ్వరుఁ గోరి చేసితివి; తన్మార్గంబు సూచింపవే.

అంభోజాసన! నీకు నీశుఁడు గలం డంచెవ్విఁ దత్పక్ష మం
దంభోజాత భవాండ మే విభుని లీలాపాంగసంభ్రాంతిచే
సంభూతంబగు? వర్తమానమగు? సంపన్నంబగున్ దద్విభున్
సంభావింపఁగ వచ్చునే తలఁప? నే చందంబు వాఁ డాకృతిన్?

తోయజసంభవ! నాకీ
తోయము వివరింపు చాలఁ దోఁచిన నే నా
తోయమువారికి నన్యుల
తోయములం జెందకుండ బ్రువ మెఱిఁగింతున్.

వచ: దేవా! భూత భవిష్య ద్వర్తమానంబులగు వ్యవహారంబులకు నీవ విభుండవు నీ వెఱుంగని యర్థం బించుకయు లేదు. విశ్వప్రకారంబు వినిపింపు మనిన విని వికసితముఖుండై విరించి యిట్లనియె–

రారా? బుధులు విరక్తులు
గారా? యీరీతి నడుగఁగా నేరరు; వి
స్తారావహము భవత్కృత
మౌరా! నాపైఁడి మర్మ మడిగితి వత్సా!

నానాస్థావర జంగమ ప్రకరముల్ నాయంత నిర్మింప వి
న్నాణం బేమియు లేక తొట్రుపడఁగా నాకున్ సమస్తాను సం
ధానారంభ విచక్షణత్వము మహోదారంబుగా నిచ్చె ము
న్నే నా యీశ్వరు నాజ్ఞఁగాక జగముల్ నిర్మింప శక్తుండనే?

అనఘా! విశ్వము నెల్ల దీప్తముగఁ జేయన్ నే సమర్థుండనే?
యిన చంద్రానల తారకా గ్రహ గణం బే రీతి నా రీతి నె
వ్వని దీప్తిం బ్రతిదీప్తమయ్యె భువనవ్రాతంబు దద్దీప్తిచే
నను దీపంబగునట్టి యీశ్వరునకే నమ్రాంతమున్ మ్రొక్కెదన్.

విను మే నీశ్వరుదృష్టిమార్గమున నావేశింప శంకించి పి
గ్గున సంకోచమునొందు మాయవలనం గుంఠీభవత్ప్రజ్ఞచే
నను లోకేశ్వరుఁ డంచు మ్రొక్కు మతిహీనవ్రాతమున్ జూచి నే
ననిశంబున్ నగి ధిక్కరింతు హరిమాయాకృత్య మంచున్ సుతా!

వచ: మఱియు దేహంబునకు ద్రవ్యంబులైన మహాభూతంబులును, జన్మనిమిత్తంబులైన కర్మంబులును, కర్మక్షోభకంబైన కాలంబును, కాలపరిణామహేతువైన స్వభావంబును, భోక్తయైన జీవుండును, వాసుదేవుండుగా నెఱుంగుము. వాసుదేవ వ్యతిరిక్తంబు లేదు. సిద్ధంబు (నారాయణ నియమ్యంబులు లోకంబులు). దేవతలు నారాయణ శరీరసంభూతులు. వేద యాగ తపో యోగ గతి విజ్ఞానంబులు నారాయణ పరంబులు (జ్ఞానసాధ్యంబగు ఫలంబు నారాయణాధీనంబు). కూటస్థుండు సర్వాత్మకుండు సర్వద్రష్టయు నైన యీశ్వరుని కటాక్షవిశేషంబున సృజియింపఁబడి ప్రేరితుండనై సృజ్యంబైన ప్రపంచంబు సృజింపుచుండుదు. నిర్గుణుండైన యీశ్వరునివలన రజస్సత్త్వ తమోగుణంబులు ప్రభూతంబులై యుత్పత్తి స్థితి లయంబులకుఁ బాలుపడి కార్య కారణ కర్తృత్వ భావంబులందు ద్రవ్యంబులైన మహాభూతంబులు, జ్ఞానమూర్తులైన దేవతలు, క్రియారూపంబులైన యింద్రియంబులు నాశ్రయంబుగా నిత్యముక్తుండయ్యును మాయాసమన్వితుండైన జీవుని బంధించు. జీవునకు నావరణంబులై యుపాధిభూతంబులైన మూఁడు లింగంబులంజేసి పరులకు లక్షితంబు గాక తనకు లక్షితంబైన తత్త్వంబుగల ఈశ్వరుం డివ్విధంబునం గ్రీడించుచుండు-

ఆ యీశుఁ డనంతుఁడు హరి
నాయకుఁ డీ భువనములకు నాకున్ నీకున్
మాయకుఁ బ్రాణివ్రాతము
కే యెడలన్ లేద యీశ్వరేతరము సుతా!

వచ: వినుము. మాయావిభుండైన యీశ్వరుండు దన మాయఁజేసి దైవయోగంబునం బ్రాప్తంబులైన కాలజీవాదృష్ట స్వభా

వంబులు వివిధంబులు సేయ నిశ్చయించి గైకొనియె. ఈశ్వరాధిష్ఠి తంబైన మహత్తత్త్వంబువలన (నగు కాలంబున గుణవ్యతికరంబును, స్వభావంబునం బరిణామంబును, జీవాదృష్ట భూతంబైన కర్మంబున జన్మంబును నయ్యె. రజస్సత్త్వంబులచే నుపబృంహితమై వికారంబు నొందిన మహత్తత్త్వంబు వలనం) దమఃప్రధానంబై ద్రవ్యజ్ఞానక్రియా త్మకంబగు నహంకారంబు గలిగె. అదియు రూపాంతరంబునొందుచు ద్రవ్యశక్తియైన రాజసంబును, క్రియాశక్తియైన తామసంబును, జ్ఞాన శక్తియైన సాత్త్వికంబును నన మూఁడు విధంబు లయ్యె. అందు భూతాదియైన తామసాహంకారంబువలన నభంబు గలిగె. నభంబు నకు సూక్ష్మరూపంబు, ద్రష్టృ దృశ్యంబులకు బోధకంబైన శబ్దంబు గుణంబగు. నభంబువలన వాయువు గలిగె. వాయువునకుం బరా న్వయంబున శబ్దంబు స్పర్శంబు నను రెండు గుణంబులు గలిగియుం డును. అది దేహంబునం దుండుటం జేసి ప్రాణరూపంబై యింద్రియ మనశ్శరీరపాటవంబైన యోజస్సహోబలంబులకు హేతువై వర్తించు. వాయువువలన రూపస్పర్శశబ్దంబు లనియెడు గుణంబులు మూఁటితోడ తేజంబు గలిగె. తేజంబువలన రస రూప స్పర్శ శబ్దంబు లనియెడు నాలుగు గుణంబులతోడ జలంబుగలిగె. జలంబువలన గంధ రస రూప స్పర్శ శబ్దంబు లనియెడి గుణంబు లయిదింటితోడం బృథివిగలిగె వైకా రికంబైన సాత్త్వికాహంకారంబు వలనఁ జంద్రదైవతంబైన మనంబు గలిగె. మఱియు దిక్కులు, వాయువు, అర్కుండు, ప్రచేతస్సు, అశ్వి నులు, వహ్ని, ఇంద్రుండు, ఉపేంద్రుండు, మిత్రుండు, ప్రజాపతియు ననియెడి దశదేవతలు గలిగిరి. తైజసంబైన రాజసాహంకారమువలన దిగ్దైవతంబైన శ్రవణేంద్రియంబు, వాయుదైవతంబైన త్వగింద్రియంబు, సూర్యదైవతంబైన నయనేంద్రియంబు, ప్రచేతోదైవతంబైన రసనేంద్రి యంబు, అశ్వినీదైవతంబైన ఘ్రాణేంద్రియంబు, వహ్నిదైవతంబైన వాగింద్రియంబు, ఇంద్రదైవతంబైన హస్తేంద్రియంబు, ఉపేంద్ర

దైవతంబైన పాదేంద్రియంబు, మిత్రదైవతంబైన గుదేంద్రియంబు, ప్రజాపతిదైవతంబైన గుహ్యేంద్రియంబు ననియెడి దశేంద్రియంబులును, బోధజనకాంతఃకరణైక భాగంబైన బుద్ధియుఁ, గ్రియాజనకాంతఃకరణంబైన ప్రాణంబును గలిగె. ఇట్టి శ్రోత్రాదులగు దశేంద్రియములతోఁ గూడిన భూతేంద్రియ మనోగుణంబులు వేర్వేఱుగ బ్రహ్మాండశరీర నిర్మాణంబునం దసమర్థంబు లగునపుడు భగవచ్ఛక్తి ప్రేరితంబు లగుచు నేకీభవించి సమష్టివ్యష్ట్యాత్మకత్వంబు నంగీకరించి చేతనాచేతనంబులం గల్పించె. అట్టి యండంబు వర్షాయుత సహస్రాంతంబు దనుక (జలంబునం దుండి కాల కర్మస్వభావంబులం దగులు వడక సమస్తమును జీవయుక్తముగఁ జేయు నీశ్వరుం డచేతనంబును సచేతనంబుగ నొనర్చె). అంతఁ గాలకర్మ స్వభావ ప్రేరకుండైన పరమేశ్వరుండు జీవరూపంబున మహావరణబలమధ్యస్థితంబైన బ్రహ్మాండంబులోను చొచ్చి నవిస్తరంబు గావించి (అట్టి యండంబు భేదించి నిర్గమించె) ఎట్లంటేని-

**భువనాత్మకుఁ డా యీశుఁడు**
**భవనాకృతిఁబోఁద నందు బ్రహ్మాండంబున్**
**వివరముతోఁ బదునాలుగు**
**వివరంబులుగా నొనర్చె విశదంబులుగన్.**

**బహుపాదోరు భుజాననేక్షణ శిరఃఫాలశ్రవో యుక్తుఁడై**
**విహరించున్ బహుదేహిదేహగతుఁడై; విద్వాంసు లూహించి త**
**ద్బహురూపావయవంబులన్ భువనసంపత్తిన్ విచారింతు; రా**
**మహనీయాద్భుతమూర్తి యోగిజనహృన్మాన్యుండు మేధానిధీ!**

వచ: వినుము. చతుర్దశలోకంబులందు మీఁది యేడు లోకంబులు శ్రీ మహావిష్ణువునకుం గటిప్రదేశంబున నుండి యూర్ధ్వదేహ మనియును, గ్రింది యేడులోకంబులు జఘనంబుననుండి యధోదేహ మనియుఁ బలుకుదురు. ప్రపంచశరీరకుండగు భగవంతుని ముఖంబు

వలన బ్రహ్మకులంబు, బాహువుల వలన క్షత్త్రియకులంబు, ఊరువుల వలన వైశ్యకులంబు, పాదంబులవలన శూద్రకులంబు జనియించెనని చెప్పుదురు. భూలోకంబు గటిపర్యంతప్రదేశంబు, భువర్లోకంబు నాభి, సువర్లోకంబు హృదయంబు, మహర్లోకంబు వక్షంబు, జనలోకంబు గ్రీవంబు, తపోలోకంబు స్తనద్వయంబు, సనాతనంబును బ్రహ్మనివాసంబును నైన సత్యలోకంబు శిరంబు, కటిప్రదేశం బతలంబు, తొడలు వితలంబు, జానువులు సుతలంబు, జంఘలు దలాతలంబు, గుల్ఫంబులు మహాతలంబు, పాదాగ్రంబులు రసాతలంబు, పాదతలంబు పాతాళంబు నని (లోకమయుుంగా) భావింతురు. కొందఱు మఱియుం బాదతలంబువలన భూలోకంబును, నాభివలన భువర్లోకంబును, శిరంబువలన స్వర్లోకంబును గలిగెనని లోకకల్పనంబు నెన్నుదురు.

అర్థములు: నారదుండు బ్రహ్మ కిట్లనియె-నారదుఁడు బ్రహ్మతో నన్నాఁడు.

చతురాస్యుండవు-నాల్గుముఖములు గలవాఁడవు, వేల్పుపెద్దవు - దేవతలలోఁ బెద్దవాఁడవు, జగత్సర్గ+అనుసంధాయివి - జగత్తు యొక్క సృష్టి నెప్పుడును జేయువాఁడవు, శబ్ద+అర్థసంయుతమై-శబ్దము అర్థములతోఁ గూడికొన్నదై, ఈ శ్రుతి సంఘాతము-ఈ వేదముల గుంపు, నీ ముఖాంబుజములఁ-నీ ముఖము లనెడు పద్మములలో, శోభిల్లుఁ-ప్రకాశించుచుండును, సర్వముఁ-సమస్త విషయములును, నీ కర+అమలకమై-నీ యరచేతియందున్న యుసిరికకాయ వంటిదై, ఉండుంగదా-స్పష్టముగఁ గన్పడుచుండును గదా!, భారతీసతి-సరస్వతీదేవి, నీకుఁ ఇల్లాలట!-నీ భార్యయఁట, ఓ జనక!-ఓ తండ్రీ!, నా సందేహముఁ పాపవే-నా సంశయమును బోఁగొట్టుము.

తాత్పర్యము: ఓ తండ్రీ! నీవు సమస్త దేవతలకంటెఁ బెద్దవాఁడవు. ఎప్పుడును ధారావాహికముగా సృష్టి నొనర్చెడివాఁడవు. శబ్దార్థసహితమై నాల్గు వేదములును సర్వకాలములందును నీ ముఖ

కమలమందు శోభిల్లుచుండును. సమస్త విషయములును అరచేతిలో నున్న యుసిరిక కాయవలె నీకు స్పష్టముగాఁ గన్పించును. సరస్వతీ దేవియే నీ యిల్లాలు. దయచేసి నా సంశయములు దొలఁగించుము.

'భూతభావన!' అని మూలము. భూతభావన అనఁగా ప్రాణులను వృద్ధిఁ బొందించువాఁడని యభిప్రాయము. దానినే 'జగత్సర్గానుసంధాయి' అనుచోటఁ దెల్పినాఁడు. 'పూర్వజ!' అను శబ్దమునకు 'వేల్పుపెద్దవు' అని తెలుఁగు. మూఁడవశ్లోకమందు కరామలకవత్ అను శబ్దము మూలములో నున్నది. 'కరామలకమై' యని దాని నిచ్చటనే చేర్చికొన్నాఁడు.

ప్రారంభాది వివేక మెవ్వఁ డొసఁగుఁ—జగత్సృష్టి గావించుటకర్హమైన వివేకమును నీ కిచ్చినవాఁ డెవ్వఁడు?, ప్రారంభసంపత్తికిఁ—జగత్సృష్టి వ్యాపారమునకు, ఆధారం బెయ్యది — అనఁగా సమస్త లోకములును దేని నాధారముగా నొనర్చికొని నిలుచునని యర్థము. ఏమి హేతువు!—ఏమి కారణము, యదర్థంబు—ఎందువలన నైనది, ఏ స్వరూపంబు—ఎట్లు భాసించునది, ఊర్ణనాభి పగిదిఁ — సాలీని వలె, సంసారానుక్రమముఁ—సృష్టియొక్క విడువక సాఁగుటను, ఎల్లప్పుడుఁ సాగింతువు—నిరంతరము నొనర్చుచుందువు, పారంబు ఎన్నఁడున లేదు—నీ కార్యక్రమ మెప్పుడును నిలుచుటలేదు, వాణీశ్వరా!, నీ మనువు దుష్ప్రాపంబు—దాని నర్థముఁ జేసికొను టసాధ్యము.

తాత్పర్యము: స్వామీ! యీసృష్టికిఁ గావలసిన వివేకమును నీ కెవ్వఁ డిచ్చును? దేని నాధారముగాఁ గొని యీ సృష్టి యొప్పుచున్నది? దీనికి హేతువేమి? ఫల మేమి? స్వరూప మేమి? తనలో నుండియే దారములను సృష్టించికొని తనచుట్టును వల నల్లుకొను సాలెపురుగువలె నీ శక్తితోనే యీ సర్వమును సృష్టించిన ట్లగపడుచున్నది. ఈ సృష్టికి అంత మేది? నిన్నుఁ దెలిసికొనుట కష్టముగా నున్నది. 'ఊర్ణనాభిరివా ఽక్షమః' అని మూలము.

చూడఁగా, నీ సమస్తమునకును సర్వేశ్వరుఁడవు నీ వనియే తోఁచు చున్నది, యథార్థస్థితిః = సత్యముగా నాలోచించినచో, నీకంటెఁ ఘనుఁ డొక్కరాజు గలఁడో - నీ కంటెను గొప్ప యధికారి యొకఁ డున్నాఁడా?, నీవు + అంతకున రాజవో - నీవే సమస్తమున కధికారివా? నీకుః ఏ లాభము రాః తలంచి - జగములు నిర్మాణముచేయు నీ వే లాభము పొందుటకై యీ సమస్త ప్రపంచమును నిర్మించుచున్నావు, ఈ చేతనానీకంబు - ఈ సమస్త ప్రాణి సముదయమును, ఎందుః జనించుః - ఎవనినుండి యేర్పడుచున్నది, ఉండున్ = అవస్థితి నందుచున్నది. అణఁగుః = లయించుచున్నది, నిక్కంబు భాషింపుమా = సత్యముగాఁ జెప్పుము.

తాత్పర్యము: నీవే యీ సమస్తమునకును ఈశ్వరుఁడ వని నాకుఁ దోఁచుచున్నది. నీవే యీ సమస్త సృష్టికిని నధికారివా? లేక నీకన్నను పై నొక్క సర్వేశ్వరుఁ డున్నాఁడా? నీ వే లాభమును గోరి యీ జగత్తులను సృష్టించుచున్నావు? ఈ ప్రాణులసమూహము ఎచ్చటనుండి యేర్పడుచున్నది? దేని నాధారముగాఁ గొని వర్తించు చున్నది? దేనియందు లయించుచున్నది? ఈ విషయము లన్నియు నాకు స్పష్టముగా వివరించి చెప్పుము.

మూలమందు ఆఱు ప్రశ్న లున్నవి. మూలశ్లోక మిది-

యద్రూపం యదధిష్ఠానం యతస్సృష్ట మిదం ప్రభో!,
యత్సంస్థం యత్పరం యచ్చ తత్తత్త్వం వద తత్త్వతః.

యద్రూపం - యేన రూప్యతే ప్రకాశ్యతే. ఎవనిచేత లేక దేనిచేత ప్రకాశము గలదిగాఁ జేయఁబడుచున్నది. అనఁగా నిరూపింపఁబడుచున్నదని తాత్పర్యము. యదధిష్ఠానం = దేని నాశ్రయముగాఁ గలిగినది? ఎవనినుండి సృష్టింపఁబడినది? దేనియందు లయించు చున్నది? ఎవని కధీనమైనది? యదాత్మకము అనఁగా స్వయముగా

తాత్పర్యము. దాని తత్త్వమును వివరింపుము. పోతనామాత్యుఁ డీ యాఱు ప్రశ్నలను రెండు పద్యములలోఁ జెప్పినాఁడని గ్రహింపవలెను.

సదసత్సంగతిన్ = స్థూల సూక్ష్మములుగా, నామ రూప గుణ దృశ్యంబు=విభిన్నములైన మనుష్యత్వాది నామములచేతను, ద్విపద త్వాది రూపములచేతను, శుక్లాది గుణములచేతను గన్పించుచున్న ఈ సమస్తప్రపంచమును, నీహృతి + అధీనంబుగదా! = నీ మనోమార్గమును బట్టియే సృష్టింపఁబడినది గదా!, నీకున్ ఘనుల్ = నీకంటె గొప్పవా రును-నీకు సమానులైన వారును, ఎవ్వారలున్ లేరు=ఎవ్వరునుగన్పిం పరు. నీ పదము + అత్యున్నతము=నీ స్థానము సర్వోన్నతమైనది. ఇట్టి నీవు, సమస్త ప్రపంచములకును సర్వేశ్వరుఁడవైన నీవు, మదిన్ ఏ యీశ్వరున్ కోరి=మనస్సులో నే యధికతము నుద్దేశించి, ప్రావీణ్య యుక్తుండవై=వివేకముతోఁ గూడినవాఁడవై, తపముల్ చేసెదవు= తపము లాచరింతువు, తన్మార్గంబున్ = అట్టి సర్వాధికారి పద్ధతిని, సూచింపవే=నాకుఁ దెలుపుము.

తాత్పర్యము: ఓ తండ్రీ! స్థూలసూక్ష్మమై నామ రూప గుణ ములతో భిన్నభిన్నముగాఁ గన్పించు నీ సమస్త విశ్వమును నీ కధీన మైనది. నీ మనస్సున కెట్లు దోఁచునో అట్లట్లు సృష్టింతువు. నీకు సముఁడు గాని యధికుఁడు గాని నా దృష్టిలో మఱెవ్వఁడును లేఁడు. నీ స్థానము సర్వోత్తమమైనది. అట్టి నీవే వివేకయుక్తుఁడవై తపమొన ర్చుచున్నట్లున్నది. నీ వెవ్వరిఁ గోరి ధ్యానించుచున్నావు. అతని మార్గ మెట్టిది? ఆ విషయమును నాకు వివరింపుము.

అంభోజాసన=పద్మముపైనుండి సమస్త సృష్టికార్యము నొనర్చు వాఁడా!, నీకున్ ఈశుండు కలండు అంటేనిన్=నీకుఁ బై యధికారి కలఁడందువేని, తత్పక్షమందున్=ఆ పక్షమున, అంభోజాతభవాండము =అంతనునందుఁ బుట్టినది కమలము. దానియందు భవుఁడు=పుట్టిన

వాఁడు బ్రహ్మ. అతనికి సంబంధించిన అండము. అనఁగా నతనిపేరు గలిగిన బ్రహ్మాండ మని యర్థము. ఏ విభుని లీలా + అపాంగ సం భ్రాంతిచేన్ = ఏ యధికారి లీలాకటాక్షముతో నేర్పడిన మాయచేత, సంభూతంబగున్ = జన్మించుచున్నది, వర్తమానమగున్ = నెలకొని యున్నది, సంఛన్నంబగున్ = లయించుచున్నది, తద్విభున్ సంభావిం పఁగన్ వచ్చునే = అతని నూహించుటకు సాధ్య మగునా?, తలఁపన్ = ధ్యానించుటకును, ఆకృతిన్ = ఆకారముతో, ఏ చందంబువాఁడు = ఏ విధమైన పద్ధతి గలవాఁడు,

తాత్పర్యము : పద్మమునందు జన్మించి సమస్తసృష్టిని గావించు నో తండ్రీ! నీకంటె నీశ్వరుఁడు గలఁడన్నపక్షములో వాఁ డెవ్వఁడు? ఎవని కటాక్షపాత్రమాత్రముచే నేర్పడెడు మాయనుండి యీ సమస్త మును జనించుచున్నది? వర్తించుచున్నది? లయించుచున్నది? అత నినిగూర్చి తెలిసికొనుటకు సాధ్యమగునా? వాఁ డాకారమున నెట్టి వాఁడు?

తోయజసంభవ! = పద్మమునుండి పుట్టినవాఁడా!, నాకుఁ, ఈ తోయము చాలన్ వివరింపు = నా కీ విధము స్పష్టముగా వివరింపుము, తోఁచినఁ = నీవు వివరించిన పద్ధతి, నా మనస్సునందు సరిగా హత్తు కొనఁగా, నేను, ఆ తోయము వారికిఁ = ఆ విధమైన వారికి, అన్యుల తోయములఁ = ఇతరుల పరివారములో, చేరకుండన్ = అనర్హులు గాకుం డునట్లు, ధ్రువమున్ ఎఱిఁగింతున్ = సత్యమును జెప్పెదను.

'వివరింపు చాల' 'విజానీ హి' అని మూలము.

తాత్పర్యము: కమలోద్భవుఁడవైన యో బ్రహ్మదేవా! ఈ విస్తారమంతయు నాకు స్పష్టముగా వివరించి చెప్పుము. నా బుద్ధికిఁ జక్కఁగా వివరించి చెప్పుము. నా మనస్సునకుఁ జక్కఁగా హత్తుకొన వలెను. నేను మత్సమానులైనవారి కా విషయమును వివరించి చెప్పి

డవు=నీవే యధికారివి, నీ యెఱుంగని=నీకుఁ దెలియనట్టి, అర్థము= విషయము, ఇంచుకయున్ లేదు=లేశమును లేదు, విశ్వప్రకారంబున్ =ఈ సృష్టియొక్క జన్మ స్థితి లయములను, వివరింపుము, అనినన్, విని, వికసితముఖుండై = సంతోషముతో వికసించిన ముఖము గల, విరించి=బ్రహ్మదేవుఁడు, ఇట్లనియెన్=ఇట్లుగాఁ బలికెను.

తాత్పర్యము: భూతభవిష్యద్వర్తమానములైన సమస్త వ్యవహారములకు నధికారివి నీవే. నీకుఁ దెలియని యర్థము లేశమును లేదు. విశ్వప్రకార మెట్టిది? వివరింపుము. బ్రహ్మదేవుని ముఖము సంతోషముతో వికసించెను. అతఁ డన్నాఁడు.

బుధులురారా?=జ్ఞానులైనవారు నావద్ద కెవ్వరునురారా?, విరక్తులు గారా?=వారందఱును వైరాగ్యశీలురే గదా!, ఈ రీతిన్ అడుగఁగాన్ నేరరు=ఇట్లు నన్నుఁ బ్రశ్నింపరు, భవన్మతము = నీ యభిప్రాయము, విస్మర+ఆవహము=ఆశ్చర్యమును గలిగించునది, వత్సా!, నాదైన మర్మము అడిగితివి=నా రహస్యము నడిగినావు.

తాత్పర్యము: ఎందఱు మహాజ్ఞానులు నావద్దకు రారు? వారు వైరాగ్యభావము లేనివారా? కాని నీ వడిగిన ప్రశ్న మఱెవ్వరును నన్నడుగ నేరరు. నీ ప్రశ్న యత్యాశ్చర్యము గల్గించినది. నా మర్మము నడిగితివి.

నానాస్థావరజంగమ ప్రకరముల్ = అనేక విధములైన స్థావరములు, జంగమములు వీనిసమూహములను, నాయంతన వినిర్మింపన్ విన్నాణంబు ఏమియున్ లేక=నాయంతను నేను నిర్మించు విజ్ఞానము లేక, తొట్రుపడఁగాన్=సదమదమగుచుండఁగా, సమస్త=అన్నిటియొక్క, అనుసంధాన=నిలువరక పోఁగునట్టి, ఆరంభ విచక్షణత్వమున్=ప్రారంభించుటయందలి శక్తిని, మహా+ఉదారంబుగాన్=గొప్ప మనస్సుతో,

=నే నా జగదీశ్వరు నాజ్ఞ గాక, జగముల్ నిర్మింపన్= ప్రపంచములను నిర్మించుటకు, శక్తుండనే=శక్తి గల వాఁడనా?

తాత్పర్యము: స్థావరజంగమములను మఱియు ననేక ప్రకార ములతోఁ గూడిన యీ సృష్టి నాకు నేనుగా నొనర్చు విజ్ఞానము నా కెక్కడిది? నే నేమియుఁ దోఁపక సదమద మగుచుంటిని. అప్పుడు ఆ సర్వేశ్వరుఁడు సృష్టి నిలువక సాఁగించెడు విచక్షణత్వమును నాకుఁ గల్గించెను. ఇది మహోదారమైన గుణము. ఆ యీశ్వరు నాజ్ఞతోనే యీ సమస్తమును సృష్టింతును.

అనఘా! విశ్వమునెల్లన దీప్తముగన్ చేయన్=ఈ సమస్త ప్రపం చమును ప్రకాశవంతముగాఁ జేయుటకు, నే సమర్థుండనే?=నేనుశక్తి గలవాఁడనా?, ఇన=సూర్యుఁడు, చంద్ర, అనల=అగ్ని, తారకాగ్రహ గణంబు=తారలు, గ్రహములు-వీని సమూహము, ఏ రీతిన్=ఏ ప్రకా రము, చైతన్యశక్తి చేత, ప్రకాశితము లగుచున్నవో, ఆ రీతిన్=అట్లు, ఎవ్వని దీప్తిన్=ఎవ్వని కాంతిచేత, భువనవ్రాతంబు=సమస్త ప్రపంచ మును, ప్రతిదీప్తమయ్యెన్=ప్రకాశింపఁజేయఁ బడుచున్నదో, తద్దీప్తి చేన్=ఆ చైతన్యశక్తి చేత, అనుదీప్తంబగున్= నిత్యమును ప్రకాశింపఁ జేయఁబడుచుండును, అట్టి యీశ్వరునకు, ఏను, అశ్రాంతమున్= నిరంతరమును, మ్రొక్కెదన్.

ఈ పద్యమునకు మూలశ్లోక మిది-

**యేన స్వరోచిషా విశ్వం రోచితం రోచయామ్యహమ్,**
**యథార్కోఽగ్ని ర్యథాసోమో యథర్క్షగ్రహతారకాః.**

తాత్పర్యము: భగవంతుఁడు స్వయంప్రకాశుఁడు. అతని చేతనే అర్కాదులందఱును ప్రకాశమును గాంచుచున్నారు. సమస్త విశ్వమునకును ప్రకాశమిచ్చువాఁడు నాతఁడే. అతని చైతన్యశక్తియే

సమస్తమునకును గాంతివిశేషము నొసఁగునది. ఐనచో సూర్యచంద్రాదు లేమగుచున్నారు? చైతన్యశక్తిచేఁ బ్రకాశితులైన వారును ఆ శక్తిచేతనే ప్రకాశ్యమానమైన ప్రపంచమును దమప్రకాశముచేఁ బ్రకాశింపఁ జేయువారివలె నగుపించుచున్నారు, నేను గూడ నంతే. నమస్తమును సృష్టించునది స్వయంప్రకాశమైన యా వెలుఁగే. తత్ప్రకాశితమైన సృష్టినే యభివ్యక్త మొనర్చుచున్నాను. 'న తత్ర సూర్యో భాతి న చంద్రగ్రహతారకం, నేమావిద్యుతోభాంతి కుతోఽయమగ్నిః, తమేవ భాంత మనుభాతి సర్వం, తస్య భాసా సర్వమిదం విభాతి.

సుతా!—ఓ నారదా!, వినుము. ఆ యీశ్వరు దృష్టిమార్గమునన్—ఆ పరమేశ్వరుని దృష్టిమార్గమందు, ఆవేశింపన్—నిలిచికొనుటకు, శంకించి—సందేహించి, సిగ్గునన్—లజ్జతో, సంకోచమున్ ఒందు మాయ వలనన్—తనచేష్టలను, శరీరమును సంకోచింపఁజేసికొను మాయచేత, కుంఠీభవత్ప్రజ్ఞులై—మొక్కవోయిన ప్రజ్ఞగలవారై, ననున్, లోకేశ్వరుఁడు అంచున్—నమస్త లోకముల కధికారినని, మ్రొక్కు మతిహీన వ్రాతమున్ చూచి—నమస్కరించెడు బుద్ధిలేని జనులయొక్క నమూహమును జూచి, హరి మాయాకృత్యమంచున్—శ్రీమహావిష్ణువుయొక్క మాయావిలాస మని, ఏన్—నేను, అనిశంబున్—నిరంతరమును, నగి ధిక్కరింతున్—నవ్వుకొని ధిక్కరింతును.

తాత్పర్యము: మాయ శ్రీమహావిష్ణువుయొక్క వీక్షాపథము నందు నిల్వనేరదు. ఆమె చేష్ట లన్నియు నాతఁ డెఱుఁగును. అందుచే నామె యాతని యెదుట నిలుచుటకు లజ్జించి చేష్టలను శరీరమును సంకోచింపఁ జేసికొన్నది. తక్కినహరిపైనంతయు నామె ప్రభావము ప్రసరించును. అట్టి యీశ్వరునిమాయచే మోహితులై జనులు నన్ను సర్వలోకాధిపతిగా నెంతురు. వారు వివేకహీనులు. అట్టి వారి యభి

ద్రవ్యంబులైన మహాభూతంబులు = ఉపాదాన కారణములైన యాకాశాది భూతపంచకము, జన్మనిమిత్తంబులైన కర్మంబులును= జన్మహేతువులైన కర్మములును, కర్మములను క్షోభింపఁజేసెడి కాలమును, కాలముయొక్క పరిణామమునకు హేతువైన స్వభావమును, భోక్త అనఁగా ననుభవించువాఁడైన జీవుఁడు, సర్వమును వాసుదేవుని స్వరూపముగాఁ దెలియును.

తాత్పర్యము: తనకన్నను నీశ్వరుఁడు వేఱుగా నున్నాఁడని తెలిసి 'యదధిష్ఠానం' అనెడుప్రశ్నకు సమాధానమిచ్చుచున్నాఁడు. అతఁడే సర్వమున కధిష్ఠానమని చెప్పుటకై వ్యతిరేక రూపముతో వాసుదేవునకంటె భిన్నమైన పదార్థము లేదని నిరూపించుచున్నాఁడు. దేహనిర్మాణమునకుఁ బనికివచ్చు ఉపాదానకారణములు మహాభూతములు. పుణ్యపాపరూపమైన జన్మనిమిత్తము కర్మ. ఆ కర్మమునకు క్షోభము గలిగించునది కాలము. అనఁగా సమస్తమైన కార్యవర్గమునకుఁ బరిణామము నేర్పఱచునది. ఆ పరిణామమునకు హేతువైన స్వభావము, సుఖదుఃఖములను అనుభవించు జీవుఁడు, ఈ సర్వమును వాసుదేవ మయమే.

వాసుదేవవ్యతిరిక్తంబు లేదు = వాసుదేవునకన్నను భిన్నమైనది లేదని యర్థము. లోకంబులు నారాయణ నియమ్యంబులు = స్వర్గాది సమస్త లోకములును ఆ భగవంతునియొక్క యానందాంశములై యాతనిచే నియమింపఁబడునవి, శరీరసంభూతులు=శరీరము నుండి పుట్టినవారు, వేద=వేదములు, యాగ=యాగములు, తపః= తపములు, యోగ=అష్టాంగాదులు ఇవి యన్నియును, నారాయణ పరంబులు=నారాయణు నుద్దేశించినవే, జ్ఞానసాధ్యంబగు ఫలంబు= జ్ఞానముచే సాధింపఁదగిన యాత్మబోధమనెడు ఫలము, నారాయణాధీనంబు=నారాయణునకు లోఁబడినది.

తాత్పర్యము: స్వర్గాదిలోకములు శ్రీమన్నారాయణునియానం దాంశములు. ఆనందాంశములై యాతనిచేత నియమింపఁబడుచున్నవి. దేవతలందఱును ఆతని యంగములనుండి జనించినవారు. అందుచేత నాతనికంటె భిన్నులుగారు. వేదములు నారాయణునిమూర్తినే ప్రతి పాదించునవి. ఈ మాట చెప్పుటచేత, 'శాస్త్ర యోనిత్వము' ప్రతి పాదిత మైనది. ఈశ్వరుని నిరూపించుటలో వేదములే ప్రమాణ మనియు, అవి సర్వజ్ఞములనియుఁ జెప్పఁబడినటులైనది. యాగములు తత్సాధనభూతములు, యోగములు=ప్రాణాయామాదులు, దానిచేత సాధింపఁదగినది తపస్సు, తత్ఫలము మనస్సుయొక్క యేకాగ్రత. దానిచే సాధింపఁదగినఫలము జ్ఞానము, జ్ఞానఫల మాత్మావబోధము. ఇవి యన్నియు శ్రీమన్నారాయణున కధీనములని చెప్పినాఁడు.

కూటస్థుండు=నిర్వికారుఁడు, సర్వాత్మకుండు=సర్వులయందు నంతర్యామిగా నున్నవాఁడు, సర్వద్రష్ట=సర్వమును వీక్షించువాఁడు, ఐన, ఈశ్వరుని కటాక్షవిశేషంబునన్=వాసుదేవుని కడగంటిచూపుచేత, సృజియింపన్ పడి=సృష్టింపఁబడినవాఁడనై, ప్రేరితుండనై=అతనిచేఁ బ్రేరేపింపఁ బడినవాఁడనై, సృజ్యంబైన ప్రపంచంబున్ = అతనిచే సృష్టింపఁదగిన ప్రపంచమును, సృజింపుచుండుదున్ = సృష్టింతును, నిర్గుణుండైన యీశ్వరుని వలనన్ = గుణముల తోడి సంబంధము లేని యీశ్వరునినుండి, రజస్సత్త్వతమోగుణంబులు=త్రిగుణములు, ప్రభూ తంబులై=జన్మించినవై, పాలుపడి=నిర్వహించుచున్నవై, కార్యకారణ కర్తృత్వంబులందున్=స్వకార్యమైన అధిభూతమందును, కారణమైన యాధ్యాత్మికమందును, కర్తయైన యధిదైవత మందును- ఈ మూఁటి యందు ద్రవ్యములైన మహాభూతములు, జ్ఞానులైన దేవతలు, క్రియా రూపములైన యింద్రియములు, వీనికి కారణభూతములై ...

మూఁడులింగంబులు=గుణత్రయము లనెడు చిహ్నములు, పరులకున్ =ఇతరులకు, లక్షితంబు గాక=కంటి కగుపడక, తనకు లక్షితంబైన తత్త్వంబు = తనకు మాత్రమే యర్థమయ్యెడు స్వభావముగలిగిన ఈశ్వరుఁడు. ఈ + విధంబునన్=ఈ రీతిగా క్రీడించుచుండున్.

తాత్పర్యము: వాసుదేవుఁడు నిర్వికారుఁడు, సర్వాత్మకుఁడు, సర్వద్రష్ట. అట్టి వాసుదేవుని కటాక్షవిక్షేపముచేతనే నేను సృజింపఁ బడినాను. ఆ కటాక్షముచేతనే ప్రేరేపింపఁబడి యాతనిచే సృష్టింపఁ బడ యోగ్యమగు సమస్తప్రపంచమును అభివ్యక్త మొనర్చుచుందును. స్వయముగా నీశ్వరుఁడు నిర్గుణుఁడు. అట్టి యీశ్వరునివలన త్రిగుణ ములు గ్రహింపఁబడును. అకాడమీ వారి ప్రతిలో 'ప్రభూతంబులై' అని యున్నది. అప్పు డర్థమే మాఱిపోవును. 'గృహీతా మాయయా విభోః' అని మూలము. ఈశ్వరుఁడు స్వయముగా నిర్గుణుఁడైనను సృష్టిస్థితిలయములకుఁ గాను దన యిచ్ఛచేతనే మాయను గ్రహించి త్రిగుణములకు లోఁబడుచున్నాఁడు. ఆ త్రిగుణములు మాయ. నిత్య ముక్తుఁడైన వానిని బంధించుచున్నవి. కార్యములు ఉత్పత్తి స్థితి సంహారములు. వాని కారణములు సత్త్వాది త్రిగుణములు. అవి యచేతనములు. అందుచేత గర్త లేనిది యవి కార్యము నుత్పాదింప లేవు. అందుచేఁ గర్తృత్వముతో నీశ్వరుని బంధించుచున్నవని యర్థము. సత్త్వాది ప్రకృతిగుణ రహితుఁడైన పరమాత్మునకు సాక్షా త్కర్తృత్వములేదు. సత్త్వాదిగుణము లచేతనము లంటిమి. కర్త లేనిది కార్యోత్పత్తి గానేరదు. అందుచేతఁ గార్యసిద్ధికై బ్రహ్మ రుద్రాది శరీరపరిగ్రహమునకై యాతనిని బంధించుచున్న వని భావము. మహాభూతములు, దేవతలు, ఇంద్రియములు ఇవన్నియుఁ దత్త దభిమానముతో నిత్యముక్తుఁడైన వాసుదేవుని బంధించుచున్నవి. జీవుఁడు స్వభావముగా నిత్యముక్తుఁడు. అతఁడు వాసుఁదేవుఁడేగదా!

మే యీ రహస్యము దెలియునని భావము.

ఇరువదియవ శ్లోకములో 'స్వలక్షిత గతిః' అనునొక పద
ది. దానికి శ్రీధరుఁడు 'స్వైః భక్తైరేవ లక్షితా గతిః యస్య'
్యాఖ్యానించెను. భక్తులకు మాత్రమే తెలియు లక్షణముగల
యని సారము. పోతన్న 'తనకు లక్షితంబైన తత్త్వంబు'
్యాఖ్యానించుచు శ్రీధరులనుండి భేదించినాఁడు.

నుతా!, ఆ ఈశుఁ డనఘతుఁడు = అద్యంతములు లేని యీ
తుఁడు, ఈ భువనములకున్=ఈ సమస్త ప్రపంచములకు,
నీకున్, మాయకున్, ప్రాణివ్రాతమునన్=ప్రాణిసమూహము
ప్రాణివ్రాతమునకున్ అని చెప్పవలసినది. ప్రాణివ్రాతము
న్నాఁడు పోతన్న. ఈశ్వతేతరము = ఈశ్వర + ఇతరము =
రునికన్న భిన్నమైనది, ఏ ఎడలన్ లేదు=ఎట్లాలోచించినను

తాత్పర్యము: నారదా! ఆ సర్వేశ్వరుఁడు నీకును, నాకును,
కును, సమస్త ప్రాణిసంఘమునకును అధికారి. ఎట్లాలోచించి
తనికన్నను భిన్నమైనది లేదు.

మాయావిభుండైన యీశ్వరుండు = మాయ కధికారియైన
వుఁడు, తనమాయంజేసి-తనమాయవలన, దైవయోగంబునన్
ృచ్ఛచేత, ప్రాప్తంబులైన=సంక్రమించిన, కాల జీవాదృష్ట
ంబులన్=కాలము కర్మ యనెడు జీవాదృష్టము స్వభావము.
పకరణములుగాఁ గైకొని, వివిధంబులు సేయన్ - తా ననేక
గా మాఱఁదలఁచినవాఁడై, కైకొనియెన్.

యొచేతను ఈలకర్మస్వభావములు తనయందుద్భవించిన ప్రపంచములు
:గా తాను వివిధరూపములుగా భాసింపఁ గోరినవాఁడై వానిని
కరించినాఁడు. 'సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి' అని
ుతి.

ఈశ్వరాధిష్ఠితంబైన మహత్తత్త్వంబు వలనన్ = ఈశ్వరునికి
ఁబడిన మహత్తత్త్వంబునుండి, కాలంబునన్=కాలవశమున, గుణ
్యతికరంబును = గుణములయొక్క సామ్యత్యాగమును, స్వభావము
త, పరిణామంబును=పరిణామమును, రూపాంతరావృత్తియు, జీవ
దృష్టభూతంబైనకర్మంబునన్=జీవునియదృష్ట ఆకారమైనకర్మముచేత
న్మంబును అయ్యెన్.

తాత్పర్యము: ఈశ్వరునియధికారమునకు లోఁబడి యేర్పడిన
ుహత్తత్త్వమునుండి కాలవశమై గుణములయొక్క క్షోభరూపమైన
ామ్యత్యాగ మేర్పడినది. స్వభావముతో రూపాంతరావృత్తి గల్గెను.

రజస్సత్త్వంబులచేన్ ఉపబృంహితమై=రజ స్సత్త్వ గుణములచే
ంవర్ధితమై వికారంబు నొందిన, మహత్తత్త్వంబువలనన్ = వికృతి
ొందిన మహత్తత్త్వము నుండి, తమఃప్రధానంబై = తమోగుణము
ప్రధానముగాఁ గలిగినదై, ద్రవ్యజ్ఞాన క్రియాత్మకంబగు నహం
కారంబు=పృథివ్యాదిద్రవ్యాత్మకము, చక్షురాది జ్ఞానేంద్రియాత్మకము
వాగాదికర్మేంద్రియాత్మకమైన యహంకార మేర్పడినది, అహంకార
మావారక మగుటచేత తమఃప్రధానము. కనుకనే యహంకార
కార్యములందు తమోగుణము, కామరాగాదికములందు రాజసము,
అల్పసాత్త్వికము భాసించుచుండును. అట్లే, తదుపాధికములైన
జీవు లందును తామసాధిక్యము గన్పడును.

అదియున రూపాంతరంబున్ పొందుచున = అదియు వివిధ రూపములను మాఱుచు మూఁడురీతు లైనది. సాత్త్విక, రాజస, తామసములు. ద్రవ్యశక్తి తామసము, ఇంద్రియశక్తి రాజసము, జ్ఞానశక్తి సాత్త్వికము. భూతాదియైన తామసాహంకారంబు వలనన్ = పంచభూతములలో నాదియైన యాకాశమునకుఁ గారణమైన తామసాహంకారమునుండి, నభంబుగలిగెన్=ఆకాశ మేర్పడెను, దాని మాత్రాగుణము అనఁగా సూక్ష్మరూపము, ద్రష్టృ దృశ్యంబులకు బోధకంబైన అనఁగా కద్యాంతరితుఁడైన మానవుఁడు 'గజమని' గట్టిగా నఱచును. గజమును జూచుచున్న మనుష్యుఁడును, దృశ్యమైన మనుష్యుఁడును రెండును శబ్దముచే బోధింపఁబడుచున్నవి. అందుచే శబ్దము ద్రష్టృదృశ్యబోధక మైనది. ఆకాశమునుండి వాయు వేర్పడెను. పరాన్వయంబునన్ = కారణముగా సంబంధము గలదగుటచే అనఁగా కారణమై యాకాశముండుటచేత వాయువునకు రెండు గుణములైనవి. అవి శబ్దము, స్పర్శ. అది దేహమం దుండుటచేత ప్రాణమనిపించికొనును. అనఁగా దేహధారణమునకుఁ గారణమైనది. అది యింద్రియ మన శ్శరీర పాటవములు=ఇంద్రియములయు, మనస్సుయొక్కయు, శరీరముయొక్కయు సామర్థ్యము. ఇంద్రియబలము ఓజస్సు, మనోబలము సహము, శరీరబలమునకు బలమని పేరు. ఈ మూటికి నది కారణమైయుండును. వాయువు నుండి తేజ మేర్పడినది. దానికి శబ్దస్పర్శరూపములు మూఁడుగుణములు. తేజమునుండి జలము గల్గెను. దానికి నాల్గుగుణములు. జలమునుండి పృథివి యేర్పడెను. దానికి గంధ, రస, రూప, స్పర్శము లని యైదుగుణములు. సాత్త్వికాహంకారము నుండి మన స్సేర్పడినది. దానికిఁ జంద్రుఁ డధిదేవత, అర్కుండు=సూర్యుఁడు, ప్రచేతస్సు=వరుణుఁడు, పైనిఁ జెప్పిన దశదేవతలు సాత్త్వికాహంకార జనితు లని భావము. తైజస మనిపించికొన్న రాజసాహంకారము నుండి యింద్రియము లేర్పడినవి. అవి పది. జ్ఞానకర్మేంద్రియములు. శ్రవణేంద్రియాభిమాని

దైవతము. నాల్కకు వరుణుఁ డధిపతి. ఘ్రాణేంద్రియాభిమాను లశ్వినీదేవతలు. వాగింద్రియము వహ్ని దైవతము. ఇట్లే పైనిఁ జూచి కొనవలెను. బోధజనక=విజ్ఞానమునకుఁ గారణమైన, అంతఃకరణ+ ఏకభావము_మనస్సుయొక్క ఏకభాగమైన బుద్ధియు, క్రియాజనక+ అంతఃకరణంబైన ప్రాణంబును_క్రియాశక్తియైన ప్రాణమును, కలిగెన్ =ఏర్పడినవి. ఇట్లు భూతగుణములైన గంధాదులును, ఇంద్రియ గుణ ములైన ద్రష్టృత్వాదులును ఇవన్నియుఁ జేరి బ్రహ్మాండశరీరనిర్మాణ మొనర్చుటకసమర్థములైనవి అవి భగవచ్ఛక్తిచేఁ బ్రేరేపింపఁబడినవై యేకీభవించినవి. ఏకీభవించి సమష్టిశరీరమైన బ్రహ్మాండశరీరమును వ్యష్టిశరీరమైన మానవశరీర నిర్మాణమును అంగీకరించినవి. చేతనా చేతనములను గల్పించినవి. ఇట్లు గల్పింపఁబడిన యీ యండము అనేక వర్షములు జలములం దుండినది. అప్పుడు కాలకర్మ స్వభావ ములందుఁ దగుల్కొనక సమస్తమును జీవయుక్తముగ నొనర్చు పర మాత్మ అచేతనమైన బ్రహ్మాండమును సచేతనముగఁ జేసినాఁడు. అటు తర్వాత కాలకర్మస్వభావములను బ్రేరేపణసేయు నీశ్వరుఁడు జీవరూప ముతో జలమధ్యమందున్న బ్రహ్మాండమందుఁ బ్రవేశించినాఁడు. దానిని భేదించికొని గడ్డకు వచ్చినాఁడు.

భువనాత్మకుఁడీతుఁడు_బ్రహ్మాండస్వరూపుఁడైన యీ భగ వంతుఁడు, భవనాకృతితోడన్ ఉండు బ్రహ్మాండంబున్_తనకు నివాస స్థానముగా నున్న బ్రహ్మాండమును. వివరముతోన్ _ వేఱువేఱుగా, విశదంబులుగన్=పదునాలుగురంధ్రములుగా, ఒనర్చెఁ_చేసెను.

తాత్పర్యము: ఈశ్వరుఁడు ప్రపంచాత్మకుఁడు. తనకు నివాస ముగనున్న బ్రహ్మాండము నాతఁడు పదునాల్గుభాగములుగా నొనర్చి నాఁడు.

మేధానిధీ=బుద్ధిమంతుఁడా!, బహుపాదోరు .... .... శ్రవ
యుక్తుఁడై = అనేకములైన పాదములు, తొడలు, భుజములు, ముఖ
ములు, కన్నులు, తలలు, లలాటములు, చెవులుఁ గలవాఁడై, బహు
దేహదేహగతుఁడై = అనేకజీవుల శరీరములం దంతర్యామిగా నున్న
వాఁడై, విహరించున్ = క్రీడించును, విద్వాంసులు, ఊహించి =
ధ్యానించి, తద్బహురూప అవయవంబులన్=అనేకములైన యంగము
లందు, భువనసంపత్తిన్ = ప్రపంచవిస్తారమును విచారింతురు, ఆ
మహనీయాద్భుతమూర్తి=అట్టి గొప్పయాశ్చర్యకరమైన విగ్రహముగల
నారాయణుఁడు, యోగిజనహృత్ + మాన్యుండు=యోగులహృదయ
ములతో ధ్యానింపఁ దగినవాఁడు.

తాత్పర్యము: నారదా! అతని కనేకపాదాద్యంగములు. అట్టి
యీశ్వరుఁడు, సమస్తజీవుల దేహములందును, హృదయములందును
వర్తించును. బ్రహ్మాండస్వరూపుఁడైన యా నారాయణమూర్తి యంగ
ములందు విద్వాంసులు పదునాల్గులోకముల యునికి నూహింతురు.
వాఁడు, యోగిజనధ్యేయుఁడు.

వ: ఊర్ధ్వదేహము=పైనున్న దేహము, అథోదేహము=క్రింది
దేహము, సనాతనము=అనేక కాలమునుండి యున్నది.

తాత్పర్యము: శ్రీమహావిష్ణువుయొక్క కటిప్రదేశము నుండి
పైనున్నదాని కూర్ధ్వదేహ మనిపేరు. జఘనమునుండి క్రింది దాని
కథోదేహమని పేరు. పై నేడులోకములు. క్రిందివి యేడులోకములు.
ప్రపంచ శరీరకుఁడైన భగవంతుని ముఖమునుండి బ్రాహ్మణులు,
భుజముల నుండి క్షత్రియులు, తొడలనుండి వైశ్యులు, పాదముల
నుండిశూద్రులు జన్మించిరని చెప్పుదురు. భూలోకము కటిప్రదేశము.
భువర్లోకము బొడ్డు, హృదయము సువర్లోకము, వక్షస్సు మహర్లో
కము, జనలోకము కంఠము, తపోలోకము స్తనద్వయము, బ్రహ్మకు

నివాసమైన సత్యలోకము శిరస్సు, కటిప్రదేశ మతలము, తొడలు వితలము, పిక్కలు సుతలము, మీఁగాళ్లు తలాతలము, మడమలు మహాతలము, పాదముల ముందుభాగము రసాతలము, అరకాలు పాతాళము. మఱికొందఱు పాదతలమువలన భూలోకము,నాభివలన భువర్లోకము, శిరమువలన స్వర్లోకమును గలిగెనని చెప్పుదురు. పదు నాల్గు లోకము లనునది యొక విధమైన యుపాసన, ఏడులోకము లనునది యింకొక్కతెఱఁగైన యుపాసన, మూఁడులోకము లనునది మఱియొక పద్ధతి, ఈ మూఁడు భేదములును నధికారి భేదములతో నుపాసింపఁదగినవి. అందుచే మూఁడును సమాదరణీయములే.

పుట్టపర్తి నారాయణాచార్యదాసునిచే విరచింపఁబడిన
'శ్రీ భాగవత సుధాలహరి' యందు ద్వితీయ
స్కంధమున పంచమాధ్యాయము
వ్యాఖ్య ముగిసినది.

# భాగవత సుధాలహరి

## ద్వితీయ సంపుటము

వ్యాఖ్యాత:
సరస్వతీపుత్ర
డా. పుట్టపర్తి నారాయణాచార్యులు




ప్రచురణ:
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
1989

# ముందుమాట

వేదములు, పురాణములు, ఇతిహాసములు భారతీయసంస్కృతికి మూలాధారములు. లోకహితకాంక్షతో వేదరాశిని విభజించియు, వేదార్థములను భారతమునందు ప్రపంచించియు తృప్తిలేక సరస్వతీ నదీతటమున దుఃఖితుడై ఉన్న శ్రీవేదవ్యాసమహర్షి నారదప్రేరితుడై భగవద్గుణకర్మ నామములను కీర్తించు శ్రీమద్భాగవతపురాణమును రచించి సంతుష్టుడై తన కుమారుడగు శుకయోగిచే చదివించెను.

అష్టాదశపురాణములలో శ్రీమద్భాగవతమున కున్న వ్యాప్తి మరే పురాణమునకు లేదు. ఇందు శాస్త్ర వేదాంతాది విషయములు, మోక్షమున కనువైన భక్త్యాదియోగములు, భాగవతుల కథలు, భగవల్లీలలు, భగవానుని భక్తరక్షణ పరాయణత్వము ఇట్టివెన్నో వర్ణితములైనవి.

శృంగి శాపముచే మృత్యుముఖమున పడనున్న పరీక్షిన్మహారాజు దగ్గరకు శుకయోగీంద్రుడు వచ్చి భాగవతపురాణమును వినిపించెను. పరీక్షిత్తు భాగవత కథాసుధను ఆస్వాదించి అమృతత్త్వ మందెను. ఒక్క పరీక్షిత్తునకే కాక జనన మరణరూప సంసారసాగరమున కూలి దరిగానక పరితపించు మానవులకెల్ల శ్రీమద్భాగవత పురాణము సంతరణనౌక అయినది.

భాగవతము మోక్షశాస్త్రము. కర్మ భక్తి జ్ఞానమార్గములు మోక్షప్రాప్తికి హేతువులు. ఈ మూడింటిలో భక్తిమార్గము అంతక్లేశావహము కాదు. అట్టి భక్తితత్త్వమును భాగవతము చక్కగా ప్రబోధించుచున్నది. ప్రహ్లాదాంబరీషాదుల చరిత్రలు భక్తిప్రాశస్త్యమునకు దృష్టాంతములు. భాగవతము విన్నను, చదివినను ముక్తి సమకూడును.

క్రీ. శ. పదునైదవ శతాబ్దిలో పరమభక్తుడు, సహజపాండిత్యుడు, కారణజన్ముడైన బమ్మెర పోతనామాత్యులు శ్రీమద్భాగవత పురాణమును తెనిగించిరి.

లలితసంస్కృత సమాసములతో, తేటతెనుగు నుడికారముతో, శబ్దార్థాలం
శోభితమైన పోతనగారి భాగవతము ఆంధ్రపాఠక లోకమున బహుళ వ్యాప్తి
నున్నది.

మహాభాగవత పురాణములోని శ్లోకములకు ప్రతిపదార్థ తాత్పర్య వి
వివరణములతో పోతనగారి పద్యగద్యములను కూడ జతపరచి డా॥ పుట్ట
నారాయణాచార్యులవారు 'సుధాలహరి' అను పేరుతో సురుచిర వ్యాఖ్యాన స
టములను సిద్ధపఱచియున్నారు. ఇది 'సుధాలహరి' లోని రెండవ తరంగ
ఈ ద్వితీయ సంపుటములో భాగవత ప్రథమస్కంధములోని ప్రథమ ద్వితీ
ధ్యాయములకు విపులమగు వ్యాఖ్యాన మున్నది,

డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులవారు పండితప్రకాండులు. మహాకవ
వారు శ్రీధరీయాదులైన శ్రీమద్భాగవత వ్యాఖ్యానముల నెన్నింటినో పరిశీ
భాషాంతరములలోని భాగవతవిషయములను గూడ ఇందు క్రోడీకరించియున్నా
వారికి మా కృతజ్ఞతలు.

తిరుమల తిరుపతి దేవస్థానమువారు ధర్మప్రచార సాధనముగా ధా
గ్రంథప్రకటనము సముత్సాహముతో చేపట్టి ఇప్పటి కెన్నో ఉత్తమ గ్రంథప
వెలువరించి యున్నారు. ఈ గ్రంథము రసజ్ఞులైన ఆంధ్రపాఠకులకు ఆమోద
గూర్పగలదని మా విశ్వాసము.

తిరుపతి

18—5—89

సి.హెచ్. వేంకటపతిరాజు

కార్యనిర్వహణాధికారి,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుప

హరిః ఓమ్

ఓం నమో భగవతే వాసుదేవాయ

# భాగవతసుధాలహరి

## శ్రీమద్భాగవత పాఠవిధిః

* * *

స్నానముచేసి శుచియై, ప్రాణాయామము చేసి, ముమ్మారు ఆచమించి మంగళాచరణ పూర్వకముగా భగవంతుని నమస్కరించవలెను. సంచితసామగ్రిచేత షోడశోపచారములతోను మానసికముగను వ్యాసుని శుకుని వాసుదేవుని శ్రీమద్భాగవతమును శ్రద్ధగా సవినయముగను భక్తిపూర్వకముగ పూజింపవలెను. పాఠారంభమునకు ముందుగా "ఓం నమో భగవతే వాసుదేవాయ" యను ద్వాదశాక్షరమంత్రమును "ఓం క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజనవల్లభాయ స్వాహా" యను గోపాలమంత్రమును అష్టోత్తరశతము జప మొనర్పవలెను. తర్వాత-

**వినియోగము :** ఓం అస్య శ్రీ శ్రీమద్భాగవతాఖ్యస్తోత్రమంత్రస్య నారదఋషిః, బృహతీఛందః, శ్రీకృష్ణః పరమాత్మా దేవతా, బ్రహ్మబీజం, భక్తిః శక్తిః, జ్ఞానవైరాగ్యేకీలకం, మమ శ్రీమద్భగవత్ప్రసాద సిద్ధ్యర్థే పాఠే వినియోగః.

**ఋష్యాదిన్యాసః :** నారదర్షయే నమః శిరసి, బృహతీఛందసే నమః ముఖే, శ్రీకృష్ణపరమాత్మదేవతాయైనమః హృది, బ్రహ్మబీజాయ

అంగన్యాసః ఓం క్లీం శిరసే స్వాహా, ఓం క్లూం శిఖాయై వషట్, ఓం క్లైం కవచాయ హుం, ఓం క్లౌం నేత్రత్రయాయ వౌషట్ ఓం క్లః అస్త్రాయ ఫట్.

కరన్యాసః ఓం క్లాం అంగుష్ఠాభ్యాం నమః, ఓం క్లీం తర్జనీభ్యాం నమః, ఓం క్లూం మధ్యమాభ్యాం నమః, ఓం క్లైం అనామికాభ్యాం నమః, ఓం క్లౌం కనిష్ఠికాభ్యాం నమః, ఓం క్లః కరతల కరపృష్ఠాభ్యాం నమః.

ధ్యానమ్ :

కస్తూరీతిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్,
సర్వాంగే హరిచందనం చ కలయన కంఠే చ ముక్తావళీ
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః.
అస్తి స్వస్తరుణీ కరాగ్రవిగల త్కల్ప ప్రసూనాప్లుతం
వస్తు ప్రస్తుత వేణునాదలహరీ నిర్వాణ నిర్వ్యాకులమ్,
స్రస్తస్రస్త నిబద్ధ నీవి విలస ద్గోపీసహస్రావృతం
హస్తన్యస్త నతాపవర్గ మఖిలోదారం కిశోరాకృతిమ్.

అని ధ్యానించి పార మారంభింప వలెను.

# భాగవతసుధాలహరి

## ప్రథమ స్కంధము

శ్లో. జన్మాద్యస్య యతోఽన్వయా దితరత
శ్చార్థేష్వభిజ్ఞ స్స్వరాట్
తేనే బ్రహ్మహృదా య ఆదికవయే
ముహ్యంతి య త్సూరయః,
తేజోవారిమృదాం యథా వినిమయో
యత్ర త్రిసర్గోమృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం
సత్యం పరం ధీమహి.

అర్థము : అస్య = ఈ ప్రపంచముయొక్క, జన్మాది = ఉత్పత్తి ప్రళయము మొదలైనవి, అన్వయాత్ = అన్వయము హేతువుగను, ఇతరతః = వ్యతిరేకము హేతువుగను, యతః = ఎవనినుండి (భవంతి = అగుచున్నవో). యః = ఎవఁడు, అర్థేషు = కార్యములందు, అభిజ్ఞః = సర్వదా సర్వత్ర సర్వవేత్తయైనవాఁడో యః = ఎవఁడు, స్వరాట్ = ఇతరాపేక్షలేక స్వయముగనే ప్రకాశించువాఁడో, యత్ = ఏ శబ్దబ్రహ్మయందు, సూరయః = విద్వాంసులును, ముహ్యంతి = భ్రమచెందెదరో, బ్రహ్మ = అట్టి వేదమును, హృదా = స్వసంకల్పశక్తిచేతనే, ఆదికవయే = బ్రహ్మకొఱకు, తేనే = విస్తరించెనో, తేజోవారిమృదాం = అగ్ని, జలము, మన్ను వీనికి, వినిమయః యథా = పరస్పర భ్రాంతి యేర్పడినట్లుగా, యత్ర = ఎవనియందు, త్రిసర్గః = త్రిగుణాత్మకమైన సృష్టి, మృషా = అసత్యమో, స్వేన ధామ్నా = తన మాహాత్మ్యముచేతనే, సదా = ఎప్పుడును, నిరస్తకుహకం = పోగొట్టఁబడిన అజ్ఞానముగల, సత్యం = నాశములేనివాఁడైన, పరం = పరమేశ్వరుని గూర్చి, ధీమహి = ధ్యానింతుము.

తాత్పర్యము: ఈ లోకముయొక్క ఉత్పత్తి, స్థితి, లయము అను నీ మూఁడును అన్వయవ్యతిరేక హేతువులచే ఎవనినుండి యేర్పడు చున్నవో, ఎవఁడు కటాక్షమాత్రము చేతనే సకలమును సృష్టించి రక్షించి ప్రళయకాలమునందు తనయందే లీన మొనర్చు కొనునో, సకల భూతములందును ఎవఁడు సత్తారూపుఁడై యుండునో, అన్యాపేక్షలేక స్వయముగా ప్రకాశించు వాఁడెవఁడో, జాగ్రత్స్వప్నసుషుప్తు లను మూఁడవస్థలను గడచి సదా జ్ఞానస్వరూపుఁడై యెవఁడు ప్రకాశించునో, పరుఁడైన అట్టివానిని ధ్యానింతుము. బ్రహ్మకు స్వశక్తిచేత వేదములను బ్రసాదించినవాఁడు వాఁడే. వానినిఁ దెలిసికొనలేక విద్వాంసులు గూడ భ్రమింతురు. తేజస్సునందు నీరను భ్రమ, కాచాదులం దగ్ని యనెడు భ్రమ, భూ వికారమం దొకొక్కసారి జల మనెడు భ్రమ - ఈ భ్రమ లున్నట్లు సత్యమైన యెవని స్వరూపము నాశ్రయించి యీ త్రిగుణసృష్టి సత్యము వలెనే గన్పించునో వానికి నమస్కారము. స్వప్రకాశమహిమచేత చిజ్జడరూపమైన సర్వము నతిక్రమించి కాలత్రయమునందును నాశము లేక ప్రకాశించుచుండువాఁడు వాఁడే. సర్వకారణస్వరూపము వాఁడే. వానికి నమస్కారము.

వ్యాఖ్య: భాగవత వ్యాఖ్యాత లనేకులు. వంశీధరుఁడు కొందరు వ్యాఖ్యాతల నిట్లు పేర్కొన్నాఁడు. "వాసనాభాష్యసంబంధోక్తి, విద్వత్కామధేను, హనుమద్భాష్య, తత్త్వభావార్థదీపికా, పరమహంసప్రియా, శుకహార్దమనోహరా, తోషిణీ, సందర్భిణ్యాదయః టీకాగ్రంథాః". వీరే కాక చిత్సుఖాచార్యుఁడు గౌడాచార్యుఁడు వల్లభుఁడు శంకరాచార్య విజయధ్వజాదు లున్నారు. విశిష్టాద్వైతవ్యాఖ్య వీరరాఘవీయము ప్రసిద్ధము. జీవగోస్వామి మఱియొక వ్యాఖ్యాకారుఁడు. మధుసూదన సరస్వతి మహోపండితుడు, మనస్వి విశ్వనాథ చక్రవర్తి, తర్కవాచస్పతి గోస్వామి, పురుషోత్తమచరణ గిరిధరాదులు ప్రసిద్ధులే. పండితప్రచారములో నీ శ్లోకమున్నది—

ధనంజయే హాటక సంపరీక్షా
మహాహవే యోధ సుసంపరీక్షా,
విపత్తికాలే గృహిణీపరీక్షా
విద్యావతాం భాగవతే పరీక్షా.

అద్వైతవ్యాఖ్యాత శ్రీధరుఁడు వాఖ్యాతృచక్రవర్తి. అతఁడు పండితులలో నిట్లు ప్రసిద్ధుఁడు.

వ్యాసోవేత్తి శుకోవేత్తి శేషమైత్రేయ నారదాః,
పరాశరోద్భవో వాయుపుత్రశ్చైవ బృహస్పతిః.
ఏతేషాం నిఖిలా శ్శిష్యాః శ్రీమద్భాగవతం విదుః,
శ్రీధర స్సర్వధా వేత్తి శ్రీనృసింహప్రసాదతః.

శ్రీధరుఁడు గొప్ప నృసింహోపాసకుఁడు. భాగవతశ్లోకమునకు శ్రీధరుఁడు పీఠికాభాగము నిట్లారంభించినాఁడు—

"తత్రభవాన్ వేదవ్యాసః నానాపురాణ శాస్త్రప్రబంధైః చిత్తప్రశమమలభమానః తత్ర తత్ర అపరితుష్యన్ నారదోపదేశతః శ్రీభగవద్గుణానువర్ణన ప్రధానం భాగవతశాస్త్రం ప్రారిప్సుః తత్ప్రత్యూహనివృత్యాది సిద్ధయే తత్ప్రతిపాద్య పరదేవతా అనుస్మరణరూప మంగళ మాచరతి."

పై యవతారికలో "శాస్త్రప్రబంధైః" అనుచోటనున్న ప్రబంధ శబ్దమునకు 'రచనలచేత' అని యర్థము. నారదోపదేశతః=నారద మహర్షి యుపదేశమువలన; భగవంతునియొక్క గుణము లనఁగా లీలలు; వానిని ప్రధానముగా వర్ణించు భాగవతశాస్త్రమును, ప్రారిప్సుః=ప్రారంభింప నిచ్ఛించినవాఁడై ఆ శాస్త్రవర్ణనమందు ఏ ప్రత్యూహములు అనఁగా విఘ్నము లున్నవో వానిని నివర్తించికొనుటకొఱకు భాగవతశాస్త్ర ప్రతిపాద్యుఁడైన భగవంతుని యనుస్మరణ మనఁగా మాటిమాటికి స్మరించుట; అదే లక్షణముగా స్వరూపముగాఁ గలిగిన మంగళమును చేయుచున్నాఁడు.

ఇక్కడ పూర్వపక్షము; భాగవతము శాస్త్ర మెట్లైనది? ఉన్న వాఱుశాస్త్రములు.

కపిలస్య కణాదస్య గౌతమస్య పతంజలేః,
వ్యాసస్య జైమినేశ్చాపి శాస్త్రాణి షడ్విదు ర్బుధాః.

సర్వధర్మములకంటెను పరమపురుషార్థమైన మోక్షమునిది ప్రతిపాదించుటఁ జేసియు వ్యాసప్రణీత మగుటచేతను ఆ యాఱు శాస్త్రములలో నిదియు నంతర్భూత మనియును భావించుకొనవలెను.

"జన్మాద్యస్య యతః" ఇది వేదాంతసూత్రము. దాని నట్లట్లే వ్యాసభగవానుఁడు వాడినాఁడు. జన్మాది= జన్మ ఆదిః యేషాం తే జన్మాదయః అని విగ్రహము. స్థితిలయములు అన్యపదార్థములు. జన్మ గూడ దీనితోఁ జేరినది కనుక ఉత్పత్తి స్థితి లయములని పిండితార్థము. సాధారణముగా బహువ్రీహిలో అన్యపదార్థమే ప్రధానము. విగ్రహవాక్యములోనున్న పదములకు ప్రాధాన్యము లేదు. కాని యిక్కడ స్థితిలయములతో జన్మను గూడఁ జేర్చి లెక్కించుచున్నాఁడు. దీనికే తద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి యని పేరు. 'లంబకర్ణమానయ' – వ్రేలాడుచున్న చెవులు గలవాఁడు–రాముఁడను కొందము. రాముఁడన్యపదార్థము. లంబకర్ణుఁడైన రామునిఁ బిలిచికొనిరమ్ము అన్నప్పుడు వాని చెవులు ప్రక్కకునెట్టి రాముని మాత్రము పిలిచికొని పోలేము గదా! లంబకర్ణములతోపాటు పిలిచికొని పోదుము. అటులే ఇక్కడ విగ్రహములో నున్న జన్మను గూడఁ జేర్చికొన్నాము. జన్మస్థితిలయము లనుట పిండితార్థము. "ధీమహి"–ఇది ఛాందసప్రయోగము. భాగవతము వేదముతో సమాన మైనదని తోపింపఁజేయుటకై యీ ప్రయోగ మొనర్చుచున్నాఁడు. పరం=పరమేశ్వరుని పరమేశ్వరుఁ డెట్టివాఁడు? నిర్గుణుఁడా? సగుణుఁడా? ఇక్కడ పరమేశ్వరుఁ డనఁగా బింబభూతుఁ డగు నీశ్వరుఁడని యర్థము; ఇట్లు చెప్పుటతో మాయా

ప్రతిబింబితేశ్వరుఁడు గాఁడని చెప్పినట్లగును, ఇక్కడ రెండురీతులుగా ప్రక్రియ యున్నది. మొదటిప్రక్రియ అవిద్యాప్రతిబింబము జీవుఁడు. మాయాప్రతిబింబ మీశ్వరుఁడు, వాని యుపాధిభూతమైన మాయ త్రిగుణాత్మకము. అందుచే నా యా గుణములచేతఁ గూడికొన్న మాయాప్రతిబింబభేదములతో బ్రహ్మ విష్ణు శివస్వరూపములుగాఁ గనుపించుచున్నాఁడు. బింబభూతుఁడైన పరమేశ్వరుఁడు నిరుపాధికమైన బ్రహ్మయే. వాఁడు నారాయణుఁడు, కృష్ణుఁడు-ఇత్యాది పదములచే వ్యవహరింపఁబడును. శైవపురాణములందు శివాది పదములచేతను; వాఁడు తన యంశమైన మాయయందు ప్రతిబింబితుఁడైన యీశ్వరుని ధర్మములైన సృష్ట్యాది కర్తృత్వములతో నభిలిప్తుఁడుగాఁడు, ఇక రెండవ ప్రక్రియ: అవిద్య మాయ-యీరెండును నొక్కటే. అవిద్యావిష్టుఁడు లేక మాయా విష్టుడైనవాఁడు జీవుఁడే. బింబభూతచైతన్యమైన ఈశ్వరుఁడు నిరుపాధికుఁడు. బింబత్వ ప్రతిబింబములచేత నాక్రమింపఁబడని శుద్ధచైతన్యమే పరబ్రహ్మ. ఈ శాస్త్రమునకు పరమతాత్పర్యమైన బింబభూత పరమేశ్వరుఁడు నిర్గుణబ్రహ్మయే. వాని యందు దోఁచు గుణములు చిన్మయములు. ప్రకృతి పరిణామభూతములు గావు. అతఁడే యనుచున్నాఁడు-

> మాం భజంతి గుణా స్సర్వే నిర్గుణం నిరపేక్షకమ్,
> సుహృదం ప్రియ మాత్మానం సామ్యా సంగాదయోగుణాః.

"జన్మాద్యస్యయతః" అనుదానితో పరమేశ్వరుని తటస్థలక్షణము చెప్పుచున్నాఁడు. అప్రత్యక్షమైన పదార్థమును బోధపఱచుటకు ఒక లక్షణము చెప్పవలెను. అది రెండు రీతులు. స్వరూపలక్షణము, తటస్థ లక్షణము. తటస్థ లక్షణ మనఁగా నేమి? అది స్వరూపాంతర్గతమై యుండదు. ఒకప్పుడుండి మఱియొకప్పుడు లేకుండును. దీనికి తార్కికు లిట్లు పరిష్కారము చెప్పిరి-

> స్వప్రతియోగికప్రతియోగి వైయధికరణ్యా వచ్ఛిన్న అభావా భావవత్వమ్

ఇది తర్కశాస్త్రపరిజ్ఞానము లేనిదే యర్థము గాదు. సామాన్య ముగా తటస్థలక్షణమనఁగా నొకప్పుడుండి మఱియొకప్పుడు లేకుం డుట. "కాకవ ద్దేవదత్త గృహమ్"_ఒకఁడు మరియొకనిని దేవదత్తుని యిల్లేది? అని యడిగెను. "అదిగో! ఆ కాకి కూర్చున్నద"ని వాఁడు బదులు చెప్పినాఁడు. వాఁడు చెప్పు నిముసమం దా కాకి కూర్చొని యుండి మరు నిముసమున లేచిపోవచ్చును అట్లే సృష్టిస్థితిలయములు పరమేశ్వరుఁ డెప్పుడును చేయుచునే యుండఁడు. ప్రళయకాలమం దీ గొడవ లుండవు గదా! 'సత్యం పరం ధీమహి' అనుచో నున్న సత్యం అను మాట స్వరూపలక్షణమునకు సంబంధించినది. స్వరూపలక్షణ మనఁగా సర్వావస్థలయం దుండుట బ్రహ్మ సత్యస్వరూపుఁ డన్నమాట. సత్యస్వరూపుఁ డెట్టివాఁడు? అనుదానిని "యత్ర త్రిసర్గో మృషా" అను దానితో సమర్థించుచున్నాఁడు. వాని మాయాగుణములు త్రిగుణములు. తమోగుణముతో నాకాశాది భూతపంచకసృష్టి. రజోగుణముతో కర్మేం ద్రియ పంచకము ప్రాణపంచకము వీనిసృష్టి జ్ఞానేంద్రియపంచకము, సత్యసృష్టి, జ్ఞానేంద్రియపంచకము, అంతఃకరణచతుష్టయము ఆ యా యింద్రియాధిష్ఠాతృ దేవతలని విభాగము. త్రిగుణాత్మకమైన యీ సృష్టి యెవని సత్యముచే సత్యమువలె భాసించుచున్నదో అని యర్థము నిజమునకు సమస్తసృష్టియు మిథ్య కాని అధిష్ఠానసత్తయైన బ్రహ్మము చేత మిథ్యాభూతమైన సమస్త సృష్టియు సత్యమువలెనే భాసించుచు న్నది. ఇక్కడ శంకరుల వేదాంతప్రక్రియను కొంత మన మర్థము చేసికొనవలెను. శంకరాచార్యుల కారిక యిట్లున్నది.

> స్వచ్ఛేంతః కరణేఽశని ప్రసృమరే నేత్రాది మార్గోద్గతే
> తత్తద్బాహ్యచయాత్మనా పరిణతే బింబీభవంతీ చితిః,
> ఏకాప్యర్థమహో విశేషక వశా ద్ద్వైతం ప్రపన్నాహర
> త్యజ్ఞానం ప్రకటీకరోతి విషయాన్ జ్ఞాతం మయేదం త్వితి.

ఘటప్రత్యక్షము మనకు గలుగుచున్నది. ఎట్లు గలుగుచున్నది? దానిని శంకరులు వివరించు చున్నారు. మెఱపుయొక్క ప్రకాశము నిమిషములో సర్వత్ర వ్యాపించునట్లు స్వచ్ఛమైన యంతఃకరణము నేత్రాదుల ద్వారా బయటపడి ఘటాత్మనా పరిణమించుచున్నది. ఎట్లు పరిణమించుచున్నది? జ్ఞాతృచైతన్యము దానియందు ప్రతిబింబించుచున్నది. జ్ఞాతృచైతన్య మనఁగానేమి? తెలిసికొనువాని చైతన్య మన్నమాట. అధిష్ఠానచైతన్యము అనఁగా బ్రహ్మచైతన్యము. దీని ప్రభావము వలన జ్ఞాతృచైతన్యము ఘటజ్ఞానమును పొందుచున్నది. వాస్తవమునకు రెండు చైతన్యములున్నవా! లేవు. "అర్థమనోవిశేషక వశాత్" అర్థమనఁగా ఘటము, మనస్సు ఈ రెంటికిని వశమై యధిష్ఠాన చైతన్యమే రెండు తెఱఁగులుగా గనుపించుచున్నది. వాస్తవమున కధిష్ఠాన చైతన్య మొక్కటే యున్నది. జ్ఞాతృ అధిష్ఠాన చైతన్యము లొక్కటై బ్రహ్మచైతన్యమే మిగిలినప్పుడు నా కిది తెలిసినది అను జ్ఞానము మన కేర్పడును. కనుక ప్రకృతమందు అధిష్ఠానచైతన్య ప్రభావమువలన మిథ్యాభూతమైనసర్గము సత్యమువలె భాసించుచున్న దని తాత్పర్యము.

'తం పరం సత్యం ధీమహి' అని యన్వయము. మిథ్యాభూతమైన ప్రపంచము సత్యమువలెఁ గన్పించునని ముందు చెప్పినాఁడు గదా! దానిని సాధించికొనుటకై యొకదృష్టాంతము నిచ్చుచున్నాఁడు. దానికి ముందు మన మొక యద్వైత పరిభాషను దెలిసికొనవలెను. ద్వైతవిశిష్టాద్వైతములలో సత్యములు రెండే. సత్తు, అసత్తు. అద్వైతములో నాల్గు సత్యము లంగీకరించినారు. ఒకటి పారమార్థికసత్యము. అనఁగా సర్వసిద్ధాంతమైన సత్యము. రెండవది వ్యావహారిక సత్యము. పరమార్థముగా నసత్య మయ్యు సత్యమువలె నగుపించునది. మూఁడవది ప్రాతిభాసికసత్యము. అనఁగా రజ్జువునందు సర్ప మనెడు భ్రాంతి జ్ఞానము. నిజముగా నది సర్పము గాదు. రజ్జువే యనెడు నిశ్చయ

జ్ఞానముకలిగినవెంటనే సర్పభ్రాంతి తొలఁగిపోవును. 'బ్రహ్మజ్ఞానేతర జ్ఞానబాధ్యత్వం' బ్రహ్మజ్ఞానభిన్నమైనదియు వ్యావహారిక సత్యము నైన రజ్జువనెడు నిశ్చయజ్ఞానము. అదిగల్గిన వెంటనే భ్రాంతిజ్ఞానము నశించును. వ్యావహారిక సత్యస్వరూపము బ్రహ్మజ్ఞాన బాధ్యత్వము 'తేజోవారిమృదాం' అనునదే ఆ దృష్టాంతము. వినిమయ మనఁగా వ్యత్యయము. వ్యత్యయ మనుటకు 'అన్యస్మిన్ అన్యావభాసః' ఒక వస్తువునందు వేఱొక వస్తువు భాసించుట. రజ్జువునందు సర్పము భాసించుటవలె. అట్లే యెండమావులందు నీటిబుద్ధి. నీరు దూరమున గన్పడునపుడు స్థలబుద్ధి, కాచు మొదలగు వానియందు తేజోబుద్ధి యథాతథముగ నూహించికొనవలెను. పరమాత్మునియం దీ త్రిసర్గము మృషాభూతమే. ఐనను అధిష్ఠానసత్తచేత 'ఘటుస్సన్ పటుస్సన' అను వ్యవహార మేర్పడుచున్నది. 'ఎవనియం దేర్పడుచున్నదో' అనివాడుట వలన ఆధారాధేయభావము ప్రతీయమాన మగుచున్నదేమో! దానితో నుపాధిసంబంధభ్రాంతి కలుగవచ్చును గదాయని. 'స్వేనైవధామ్నా' స్వప్రకాశముచేత 'నిరస్తకుహకం' పోఁగొట్టఁబడిన యజ్ఞానము గల వాఁడని యారంభించుచున్నాఁడు. అనావృతసంప్రదూపుఁడైన బింబ భూతుఁడగు నీశ్వరునియందు అజ్ఞానముండదనిభావము. 'అన్వయాత్ యితరతశ్చ' 'యత్సత్వే యత్సత్వం' అనునదే అన్వయసంబంధము. అనఁగా నీశ్వరుఁ డున్ననే ప్రపంచముండును. బ్రహ్మసత్తయున్నది గనుకనే ప్రపంచము భాసించుచున్నది. 'యదభావే యదభావః' అనునది వ్యతిరేకము. గగన పుష్పాదులందు బ్రహ్మసత్తలేదు. అందుచే గగనపుష్పములేదు. లేక అన్వయశబ్దమునకు అనువృత్తియర్థము. ఇతరశబమునకు వ్యావృత్తి అర్థము. బ్రహ్మసత్త అనువృత్త మగుట చేతనే ప్రపంచము భాసించును. మట్టియే కుండగా మారినట్లు, సువర్ణమే కటకాదులుగా నైనట్లు దీనితో బ్రహ్మప్రపంచమున కుపాదానకారణ మని చెప్పుచున్నాఁడు. వ్యావృత్త మనఁగా భేదము.

కార్యములందు కారణ మనువర్తించుచుండును. సువర్ణకుండలాదు లందు సువర్ణముండును గదా! కాని కారణమందు కార్యమను వర్తింపదు. కారణావస్థలో సువర్ణమందు కుండలాదు లుండవు గదా! నిమిత్తకారణ మనుట 'జన్మాద్యస్య యతః' అను సూత్రముచేతనే యేర్పడుచున్నది. ఈ ప్రపంచము జన్మగలది. ఎట్లు? అవయవములచే గూడియుండుట వలన. కనుక 'యత్ర సావయవత్వం ఘటాదౌ తత్ర జన్మాదిమత్త్వం, యత్ర జన్మాద్యభావః ఆత్మని తత్ర సావయ వత్వాభావః' అనుట పరిష్కారము. పరమేశ్వరుఁడు సావయవుఁడు గానందువల్లనే జన్మాద్యభావరహితుఁడు. దీని కుపపదముగా శ్రుతి నుదాహరించుచున్నాఁడు-

**యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ప్రయం త్యభిసంవిశంతి**

ఎవనినుండి యీ సమస్తభూతములు పుట్టుచున్నవో, పుట్టినవి జీవించుచున్నవో, యెవనియందు లయము నందుచున్నవో, యెవని యందు సర్వతః ప్రవేశించుచున్నవో వాఁడే బ్రహ్మ యని శ్రుతి కర్థము.

స్మృతివాక్యమును గూడ నుదాహరించుచున్నాఁడు-

**యత స్సర్వాణి భూతాని భవంత్యాది యుగాగమే,**
**యస్మింశ్చ ప్రళయం యాంతి పునరేవ యుగక్షయే.**

ఆది యుగాగమమందు సమస్త భూతములు వానినుండియే గర్భకు వచ్చును. యుగక్షయమందు వానియందే లయ మగును. పరమేశ్వరుఁడే జగత్కారణ మెందుకుఁగావలెను? జడప్రకృతి యేల కారాదు? అని యాశంకించికొని 'అభిజ్ఞః' అనుటతో దానికి సమా ధాన మిచ్చుచున్నాఁడు. ప్రధానమే జగత్కారణ మనుట సాంఖ్య వాదము. శ్రుతివాక్యముతో దానిని ఖండించుచున్నాఁడు.

**స ఈక్షతే ఇమాన్ లోకాన్ లోకపాలా న్నుసృజా ఇతి స ఇమాన్ లోకా నసృజత,**

పరమేశ్వరుఁడు లోకములను లోకపాలురను సృష్టింతునని చింతించెను. అతఁడే లోకములను సృష్టించెను. 'ఈక్షతే ర్నా శబ్దం' ఇది వేదాంతసూత్రము, ఈక్షతేః న అశబ్దం అని పదవిభాగము. ఈక్షతేః = ఈక్షిచ్ఛబ్ద ప్రయోగమువలన అశబ్దం వేదముచే ప్రతిపా దింపఁబడని ప్రధానము, న = జగత్కారణము కాదని భావము. పైఁ జెప్పిన శ్రుతివాక్యములో 'స ఐక్షత' అని వాడియున్నారు. ఈక్షణ మనఁగాఁ జింతించుట. జ్ఞానకర్తృత్వము అది చేతనములకే లభిం చును. ప్రధానము జడము. చేతనధర్మమైన జ్ఞానకర్తృత్వము దానికి సిద్ధింపదు. మఱి జీవుఁడే యెందుకు గాఁడు? దానికి సమాధానము 'స్వరాట్' 'స్వే నైవ రాజతే ఇతి స్వరాట్' స్వతస్సిద్ధమైన జ్ఞానము గలవాఁడని యర్థము. జీవునకు స్వతస్సిద్ధమైన జ్ఞానములేదు. చతు ర్ముఖబ్రహ్మ కావచ్చునుగదా! అతఁడే హిరణ్యగర్భుఁడు. ఈ వాద మున కాధారముగా నీ శ్రుతివాక్య మున్నది-

**హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్, స దధార పృథివీం ద్యామ్.**

హిరణ్యగర్భుఁడే ముందుండెను. అతఁడే భూతములకు పతి. పృథివ్యాకాశముల కాధారము. ఈ పూర్వపక్షమును ఖండించుటకే 'తేనే బ్రహ్మహృదా' యని చెప్పుట. ఆదికవియైన చతుర్ముఖబ్రహ్మ కును వేదము నెవ్వఁడు ప్రకాశింపఁజేసెనో. ఇచట 'బ్రహ్మ'యనఁగా వేద మని యర్థము.

**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై తగ్ం దేవ మాత్మబుద్ధి ప్రకాశం ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే.**

పరమేశ్వరుఁడు చతుర్ముఖబ్రహ్మను సృష్టించి వేదము లుపదే శించినాఁడు. అతఁ డాత్మబుద్ధి ప్రకాశకుఁడు. ముముక్షువైన నే

నాతని శరణుఁ జొచ్చుచున్నాను. చతుర్ముఖబ్రహ్మ వేదాధ్యయన మెవ్వరివద్దనైనను జేసినట్లు ప్రసిద్ధిలేదే! దానికి సమాధానమే 'హృదా' యన్నది. అనఁగా మనస్సుచేతనే స్వసంకల్పశక్తిచేతనే యని తాత్పర్యము. ఈ వాక్యముతో బుద్ధివృత్తిప్రవర్తకుఁడని చెప్పుటతో గాయత్ర్యర్థము సూచిత మగుచున్నది. బ్రహ్మదేవుఁడే స్వయముగా సుప్త ప్రతిబుద్ధ న్యాయముతో వేదములు పొందినాఁడని చెప్పరాదా!

సుప్తప్రతిబుద్ధన్యాయ మనఁగా నిద్రపోయినవాఁడు మేల్కొన్నట్లని తాత్పర్యము. దానికి సమాధానము 'ముహ్యంతి య త్సూరయః' అని. యత్ = వేదమునకు సంబంధించిన యే శబ్దబ్రహ్మ మందు, సూరయః = మహావిద్వాంసులును, ముహ్యంతి = భ్రమించుచున్నారో. వేదములు యథాతథముగా నర్థమైన వనఁగా నది పరమేశ్వరుని సంకల్పశక్తిచేతనే నని తాత్పర్యము. కనుక బ్రహ్మకుఁ గూడ పరాధీనమైన జ్ఞానమేయని భావము. అందుచే స్వతస్సిద్ధజ్ఞానము గల పరమేశ్వరుఁడే జగత్కారణము. సత్యస్వరూపుఁడు 'మృత్తికేత్యేవ సత్యం' అనుచోటను సత్యశబ్ద మున్నది గదా! అట్లు గాదు, అది పరమార్థసత్యము కాదు గదా! అతఁడు సర్వజ్ఞుఁడు అగుటచే నజ్ఞానమును బోఁగొట్టువాఁడు. అట్టి వానిని నమస్కరింతు మని తాత్పర్యము. గాయత్రితో నారంభించుటచేత నీ భాగవతము గాయత్ర్యాఖ్య పరబ్రహ్మవిద్యారూపమని చెప్పిన ట్లైనది. మత్స్యపురాణమందు పురాణదాన ప్రస్తావములో నిట్లున్నది—

యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మవిస్తరః,
వృత్రాసురవధోపేతం తద్భాగవత మిష్యతే.
లిఖిత్వా తచ్చ యో దద్యాత్ హేమసింహ సమన్వితమ్,
ప్రౌష్ఠపద్యాం పౌర్ణమాస్యాం స యాతి పరమం పదమ్.
అష్టాదశ సహస్రం తత్ పురాణం పరికీర్తితమ్.

గాయత్రీమంత్రముతో నారంభించి భాగవతధర్మములు భాగవతమందు ప్రతిబింబింపఁ బడుచున్నవి. వృత్రాసురునికథ యిందు వచ్చును. వృత్రాసురుఁ డనెడు రాక్షసుని వృత్తాంతము చాల చిత్రమైనది. వృత్రాసురుఁడు శ్రీమన్నారాయణునకు పరమభక్తుఁడు. పార్వతీదేవి శాపముతో రాక్షసుఁ డైనాఁడు. కాని వానికిఁ బూర్వజన్మజ్ఞాన మున్నది. మఱియొక పురాణమం దిట్లున్నది–

> గ్రంథోఽష్టాదశ సాహస్రో ద్వాదశస్కంధ సంయుతః,
> హయగ్రీవ బ్రహ్మవిద్యా యత్ర వృత్రవధస్తథా
> గాయత్ర్యా చ సమారంభః తద్వై భాగవతం విదుః.

శ్రీమద్భాగవతము పదునెనిమిదివేల శ్లోకములు, పండ్రెండు స్కంధములు. హయగ్రీవబ్రహ్మవిద్య (6–9) దీనియందే వచ్చును. పద్మపురాణములో నంబరీషునితో గౌతముఁ డనుచున్నాఁడు–

> అంబరీష! శుకప్రోక్తం నిత్యం భాగవతం శృణు,
> పఠస్వ స్వముఖేనాఽపి యదీచ్ఛసి భవక్షయమ్.

ఓయీ! యంబరీషా! మోక్షము గావలెనను కోరిక నీకున్నచో శుకుఁడు చెప్పిన భాగవతమును నిత్యమును వినుము. లేక నీవే చదువుము. కనుక వృత్రాసురవధ, హయగ్రీవ బ్రహ్మవిద్య యే గ్రంథములోఁ జెప్పఁబడునో అదియే భాగవతము. గాయత్రితో నది యారంభమగును. ఇక్కడ 'జన్మాద్యస్య యతః' అనుదాని వలన గాయత్రియందలి 'సవితుర్దేవస్య' యను పదద్వయార్థము చెప్పఁబడినది. 'వరేణ్య' మ్మను మాటకు వివరణమే 'పరం' అనుట; 'భర్గః' అనుటకు వ్యాఖ్య 'స్వరాట్ ధామ్నా స్వేన నిరస్తకుహకం' అనుటయును; తృతీయపాదవ్యాఖ్యానమే 'తేనే బ్రహ్మహృదాయ ఆదికవయే' అనునది. ఇట్లు గాయత్రీమంత్ర మీ ప్రథమశ్లోకములోఁ బూర్తిగాఁ జెప్పఁబడినట్లైనది.

భాగవత మనేక వ్యాఖ్యానముల కాకర మైనది. ద్వైతవ్యాఖ్యాత లెందఱో గొప్పవా రున్నారు. మధ్వాచార్యులే 'భాగవత తాత్పర్యనిర్ణయ' మను మహాగ్రంథమును వ్రాసిరి. వీరేగాక, సత్యధర్మతీర్థులు ఆదినుండి పండ్రెండు స్కంధములకు టీక రచించిరి. వీరు ఉత్తరాదిమఠస్వాములు. శ్రీయాదవార్యులు భాగవతమునందు 1, 5, 7 స్కంధములకు టిప్పణీకారులు. వీరిని గూర్చి కొన్నికథలు ప్రచారమం దున్నవి. యాదవార్యులు వడ్డీవ్యాపారముతో జీవించెడివారఁట! వారు డబ్బుసంచులను దీసికొని బయటికిఁ బోవునపు డంతయు నీ క్రింది శ్లోకమును రెండు మూఁడుసారు లనుకొని పోవుట వాడుక.

> అగ్రతో నారసింహశ్చ పృష్ఠతో గోపనందనః,
> ఉభయోః పార్శ్వయో రాస్తాం సశరౌ రామలక్ష్మణౌ.

ఒకసారి వీరిని దొంగ లడ్డిరి. వీరి గుఱ్ఱమునకు ముందుఁబోవుచున్న యొక సింహము దొంగల కగుపించినది. వారు భయభ్రాంతులై స్వామికి నమస్కరించి "మీ గుఱ్ఱము ముందొక సింహము పోవుచున్న"దని విన్నవించినారు. "ఆ దొంగ లెంత ధన్యులు? ఆ నృసింహమూర్తి తనకు దర్శన మీయలేదే" యను నీ చింతయే వారిని గ్రుంగఁదీసినది. ఇంటికి వచ్చి యేదో సాకుఁ జెప్పి సంసారభారమంతయు భార్య కప్ప జెప్పినారు. వా రిల్లువిడిచి వెళ్ళిరి. ఆ నాటి నుండియు వారు సన్న్యాసి.

శ్రీనివాసతీర్థు లను మతియొకరు ఏకాదశస్కంధ వ్యాఖ్యాత. భాగవతమున కామూలాగ్రముగ వ్యాఖ్యానమును రచించినవారు.

విజయధ్వజతీర్థులు: వీరు ఉడిపిలోని యష్ట మఠములకుఁ జెందిన పెజావరు మఠస్వామి. విజయధ్వజులు భాగవత వ్యాఖ్యానమును రచించుట కొక కారణ మేర్పడెను. వీరిని ప్రబలదారిద్ర్యము వరించినది. దానినిఁ బాపికొనుటకై సముద్రయానముఁ జేయవలసిన

దుఃస్థితియు నేర్పడెను. శిష్యు లొక్కొక్కరే వీరినుండి సెలవుదీసి కొన్నారు. మూఁడు నాల్గుదినము లుపవాసములు, క్షుద్బాధ యని వార్య మయ్యెను. ఇంకేమి సేతురు? వారే యన్నమును వండుకొనఁ బూనిరి. ఈ విషయము వ్యాసతీర్థులకు శ్రీపాదరాయలకు రఘు నాథతీర్థులకుఁ దెలిసినది. సన్న్యాసి యగ్నిస్పర్శ సేయరాదు. వారు ముగ్గురును విజయధ్వజుల కృత్యమును గర్హించిరి. ఈ పాపమునకు ప్రాయశ్చిత్తముగా భాగవతటీక వ్రాయవలసిన దని చెప్పినారు. వారి యాజ్ఞను మన్నించి విజయధ్వజులు వ్రతస్థులై యొక గుహాయం దేకాంతవాసమును బూనిరి. రెండుసారులు వ్యాఖ్యను బూర్తిచేసి నారు. ఆ రెండుమారులు నది సముద్రము పాలయ్యెను. మూఁడవ సారి వ్యాఖ్యానము పూర్తియైనది. ఇది భాగవతమునకు మహాగంభీర మైన వ్యాఖ్య.

సత్యాభినవతీర్థులు 'నిరోధోద్ధార' మను గ్రంథమును వ్రాసిరి. అది భాగవతమునందలి 367 శ్లోకములకు టీక. వా రా శ్లోకములకుఁ బరస్పర సంగతిని గల్గించుకొని వ్యాఖ్యానించుచుఁ బోయినారు. భాగ వతమునకుఁ బ్రాచీనులు శాస్త్రగౌరవము నిచ్చిరని ముందుఁ జెప్పి కొన్నాము. దాని శైలి, విషయవివరణ పద్ధతి యనేక శంకాసమాధా నములకుఁ జోటిచ్చినది. మొదటి శ్లోకమును వ్యాఖ్యానించుటలో వ్యాఖ్యాతల పాండిత్యము వికంకటమై పోయినది. వంశీధరుఁ డీ మొదటి శ్లోకమునకు నూఱర్థములు చెప్పినాఁడు. వాని వివరణ మిది-

గణేశో భారతీ భానుః శంకరస్తత్ప్రియా తథా,
తపస్సజ్జనసంగశ్చ గురు రోంకార ఏవ చ.

కర్మ మత్స్యశ్చ కమఠో నారద శ్రీనృసింహకౌ,
ధన్వంతరీ రామకృష్ణౌ శ్రీగంగా బ్రహ్మణ స్తథా.

వారాహో వామన శ్చైవ పరశురామ బలౌ తథా,
బుద్ధః కల్కి హయగ్రీవౌ దత్తః కపిల ఏవ చ.

సనకాద్యా గవాం శైలః శ్రీరాధాకీర్తినందినీ,
బృందావనం హరే ర్నామ వాయ్వింద్ర వరుణా స్తథా.

ధర్మరాజః కుబేరశ్చ వహ్ని విష్ణు శివా స్తథా,
శ్రీమద్భాగవత వ్యాసౌ శ్రీశుకః పృథురేవ చ.

ఋషభ ధ్రువౌ తతః ప్రోక్తౌ నరనారాయణ స్తథా,
హంసోఽథ యమునా చైవ శ్రీపుష్కర ప్రయాగకౌ.

కురుక్షేత్రం తథా మాయాక్షేత్రం సాకేతకం తథా,
వారాణసీ ద్వారికా చ గోపీచందన మేవ చ.

ఊర్ధ్వపుండ్రం తథా కాంచ్యవంతికా క్షేత్రమేవ చ,
జగన్నాథోఽథ నైవేద్యం విష్ణుతీర్థం తులస్యథ,

శాలిగ్రామోఽథ బదరీ సేతురబ్ధి స్తథైవ చ.
కాశ్మీరం భారతం ఖండం కాలశ్చ మనసస్థితిః,

హిరణ్యగర్భ స్సేనానీ ర్జననీజనకౌ తథా,
ప్రద్యుమ్నశ్చానిరుద్ధశ్చ ఫల్గున శ్చోద్ధవ స్తథా.

హనుమాన్ గరుడ శ్చైవ సుదర్శన మథో రమా,
అష్టాదశాక్షరో గీతా వేదో గాయత్రికా తథా.

గవాం కులంచ రుద్రాక్ష పంచాక్షరక మంత్రకౌ,
శివలింగం భస్మధృతిః బిల్వవృక్షః స్వయంపతిః.

నవగ్రహా హరే ర్భక్త స్తర్కశాస్త్రం చ పుష్యభమ్,
కలి స్తుర్యాశ్రమశ్చైవ శతంచైతే ప్రకీర్తితాః.

వంశీధరుఁడు పండితరాయలకు ప్రబలప్రత్యర్థిగాఁ గన్పించుచున్నాఁడు. తన వ్యాఖ్యానావతారికలో నాతఁ డొనర్చిన దుర్జననింద జగన్నాథుని విశృంఖలతకుఁ దగినట్లున్నది. వంశీధరుఁడు శ్రీధరుని వ్యాఖ్యానమునకు వ్యాఖ్యాత. ఈ యర్థములు చాలక యతఁడు

'లీలాకల్పద్రుమ' మని మఱియొక గ్రంథమును వ్రాసెనఁట. దానిలో మఱి యిఱువదియై దర్థము లెక్కువగాఁ జేర్చెనని చెప్పికొన్నాఁడు. సత్యాభినవతీర్థులు గూడ మొదటిశ్లోకము నిట్లే పట్టి చూచిరి. ఆయన యా శ్లోకమునకు వ్యాఖ్యాన మొనర్చిన పద్ధతి యిది—

రామాయణములోని ఏడుకాండల కథను జోడించికొనుచు నే డర్థములు.

భారతములోని పదునెనిమిది పర్వముల ననుసంధించుచు అర్థములు పదునెనిమిది.

భాగవతములోని పండ్రెండు స్కంధముల సమన్వయించుచు నర్థములు;

ఇవి చాలక బ్రహ్మసూత్రములలోని 'చతురధ్యాయి' చేర్చి కొని యర్థము,

దశావతారముల నిబంధించుచు పది యర్థములు. ఇన్ని చెప్పి కడపట "అస్య శ్లోకస్య పునరర్థాంతర కల్పనం, స్వబుద్ధిమాంద్యాదే వోపరమతే" అన్నారు. ఇంకను నర్థములు జెప్పుట కవకాశ మున్నది. నా బుద్ధిమాంద్య మడ్డువచ్చుచున్న" దని తాత్పర్యము.

వంశీధరుఁడు శ్రీధరున కనుయాయి యయ్యును నడుమనడుమ స్వాభిప్రాయములను గూడఁ జెప్పికొనుచుఁ బోయెను. శ్రీధరుఁడు మొదటిశ్లోకము నద్వైతి గనుక నిరాకార బ్రహ్మపరముగా నన్వయించెను. భాగవతములోఁ గృష్ణలీలలే ప్రధానము. అందుచే వంశీధరుఁడు సాకారబ్రహ్మపరముగా నర్థ మొనర్చినాఁడు. 'పరం ధీమహి' శ్రీకృష్ణుఁడు సర్వోత్కృష్టమైన వాఁడు. అతఁడు పూర్ణావతారుఁడు. అందుచే నంశావతారములకన్న నుత్కృష్టుఁడన్నమాట. 'ధామ్నా స్వేన' దీనిని వంశీధరుఁడు స్వరూపలక్షణముగా నన్వయించెను, స్వరూపలక్షణ మనఁగా నేమో ముందే చెప్పితిమి. స్వేన=ఆత్మీయమైన,

ధామ్నా=మధురాఖ్యమైన నివాసముచేత నచ్చటనుండువారి కెల్లప్పు డును, 'నిరస్తకుహాకం'=మాయాకార్యమైన సంసార లక్షణములను లేకుండఁ జేసినవాఁడు, జన్మాద్యస్య యతః=అద్యస్యజన్మాదివికార రహితునకును, యతః=ఎచ్చట అనఁగా వసుదేవగృహమునందు. ఇచ్చట సప్తమ్యర్థమందు 'తసిల్' ప్రత్యయము;దానినుండి. ఇతరతః= వేఱుచోటను అనఁగా నందగృహమందును, అన్వయాత్=సంబంధ మేర్పడెనో; కృష్ణపరమాత్మ జన్మాదివికార రహితుఁడయ్యును జన్మ మును స్వీకరించి వసుదేవగృహమం దుద్భవించెను; నందగృహ మందుఁ బారాడినాఁడని తాత్పర్యము. నందగృహమున కెందుకువెళ్లి నాఁడు? దానికి సమాధానమే 'అర్థేష్వభిజ్ఞః'. అర్థేషు=కంసవంచనాది ప్రయోజనములందును, రాసలీల మొదలైన లోకోత్తరవిలాసరూపము లైన యర్థముల యందును, అభిజ్ఞః=తాదృశపరికరసంపాదనా నిపు ణుఁడని తాత్పర్యము. స్వరాట్=స్వైఃరాజత, ఇతిస్వరాట్=తనకు సంబంధించిన గోకులవాసులగు గోపాలకులచేత ప్రకాశించువాఁడు. అనఁగా గోపాలలీలయనెడు అవ్యాహతైశ్వర్యము గలవాఁడు. యః= ఎవఁడు, బ్రహ్మణే=చతుర్ముఖ బ్రహ్మ నాశ్చర్య చకితునిగాఁ జేయుట కొఱకు, హృదా=సంకల్పమాత్రముచేతనే, బ్రహ్మ=సత్యజ్ఞానానంద మాత్రైకరసమూర్తిమయమైన వత్సపాలాదిరూపవైభవమును విస్తరింపఁ జేసెనో, యత్=ఏ వైభవమందు, సూరయః=బలరాముఁడు, బ్రహ్మ మున్నగువారును, ముహ్యంతి=మోహపడిరో-అనఁగా కృష్ణపరమాత్మ వత్స-వత్సపాలాది వైభవమును జూపినప్పుడు ఈ వత్సము లెక్కడి నుండి వచ్చెను? ఈ వత్సపాలు రెవ్వరు? అని బలరామాదు లాశ్చర్య పడినారు. లేక యెవనియొక్క లౌకిక అలౌకిక లీలలచేత లీలాతత్త్వజ్ఞు లైన భక్తులుగూడ ప్రేమాతిశయముతో వివశు లగుచున్నారో ననియుఁ దాత్పర్యము. యత్=ఏ లీలచేత, తేజోవారిమృదాం యథా విని మయో భవతి=అనఁగా ఏ కృష్ణపరమాత్మయొక్క లీలలతో తేజో

వారి మృత్తులయందు వినిమయ మేర్పడుచున్నదో! వినిమయమనఁగా 'అన్యస్మి న్నన్యావభాసః' అని ముందే చెప్పితిమి. వ్రజలీలలోఁ గృష్ణుని ముఖకాంతిచేతఁ జంద్రాదులు నిస్తేజస్కులైనారు. కృష్ణ సమీపమందున్న వస్తువులు అతని తేజస్సుతోఁ జంద్రునికంటె నెక్కువ తేజస్సుగల వైనవి. వేణునాదలీలలలోఁ గొన్నిచోట్ల నీళ్లు రాళ్లైనవి. కఠినపాషాణాదులు కరఁగి నీరైనవి. యత్ర=ఏ కృష్ణనిమిత్తముగా, త్రి సర్గః=గోకుల, మధురా ద్వారవతీపురములందు, సర్గః=గోపాలరాధికల యొక్కయు, అక్రూరోద్ధవులయొక్కయు, రుక్మిణ్యాదులయొక్కయు ప్రాదుర్భావము, అమృషా=సత్యమైనదో, అనఁగా వీరందరు గోలోక వైకుంఠవాసు లగుటచేత, వారి శరీరములుగూడ భగవదవతారతుల్య ములని పిండితార్థము.

ధీమహి=ధ్యానింతుము. ఈ బహువచన మెందుకు? కాలదేశ పరంపరాప్రాప్తములైన సర్వజీవులను, తనయం దిమిడ్చికొని, వారిని ధ్యానమున కభిముఖులనుగాఁ జేయుచున్నాఁ డన్నమాట.

'జన్మాద్యస్యయతః' ఈ ప్రపంచముయొక్క జన్మస్థితిభంగము లెవని వలన నేర్పడుచున్నవో. అవి కాలమువలనఁ గూడఁ గలుగు చున్నవిగదా! కనుక కాలమునే ధ్యానింపరాదా? దానికి సమాధాన మిది.

'అన్వయా దితరతశ్చ' అన్వయాత్ =కారణ రూపముగాఁ గార్యమునం దన్వయించుటచేత; ఘటమునందు మృత్తు నన్వయించి నట్లుగా నని యర్థము.

ఇతరతః=వేరువిధముగా, అనఁగా మృత్తునందు ఘటము లేదు గదా! దీనితో పరమేశ్వరుఁడే ప్రపంచమున కుపాదాన కారణ మని చెప్పిన ట్లైనది. 'చ' కారముతో నిమిత్తకారణ మని గూడ నర్థము. కాలము పరమేశ్వరుని ప్రభావరూపము మాత్రమే. పరమేశ్వరుఁడు

జగత్తున కుపాదానకారణ మైనచో వికారము తప్పదు గదా! కనుక ప్రకృతియే యుపాదాన కారణము. పరమేశ్వరుఁడు నిమిత్తకారణ మని చెప్పికొందము ?

అది పొసఁగదు. శ్రుతి చేతనపదార్థమే జగత్కారణమని చెప్పు చున్నది. 'య స్సర్వజ్ఞ స్స సర్వవిత్ స ఐక్షత లోకాన్సృజ! ఇతి త దైక్షత బహుస్యాం ప్రజాయేతి' ఇత్యాది శ్రుతివాక్యములు ప్రసిద్ధ ములే. కనుక ప్రపంచమున కుభయకారణములును బరమాత్ముఁడే. ప్రకృతి యీశ్వరుని శక్తి. శక్తి శక్తిమంతుల కభేదము. కనుక పర మేశ్వరుఁడు ప్రకృతిద్వారానే జగదుపాదాన కారణ మని చెప్పవచ్చును. స్వరూపముతో నతఁడు ప్రకృత్యతీతుఁడు. అందుచే నిర్వికారుఁడు. ప్రకృతియే స్వతంత్రముగా నుపాదాన కారణమనుటను శాస్త్ర మంగీ కరింపదు.

ఐక్షత=అనుట కేమి యర్థము? చింతించుట; ఏమని చింతిం చుట? జగత్సృష్టికి ముందు పదార్థము లేమైన నున్నఁగదా! వీని నిట్లు పరిణమింపఁ జేయుద మని చింతించుట. అంతకుముందు మహ దాదిభూతములే లేవుగదా! పరమేశ్వరుఁడు నిర్విషయకముగా నెట్లు చింతించినాఁడు?

దీనికి సమాధానమే 'స్వరాట్' అనునది. శ్రుతు లేమను చున్నవి? 'న తస్య కార్యం కరణం చ విద్యతే' 'స్వాభావికీ జ్ఞానబల క్రియాచ' అందుచేఁ దనకు తానే ప్రకాశించువాఁడు. అతని స్వరూప లక్షణమే జ్ఞానబలక్రియ లన్నమాట. 'ధీమహి' యనుటకు ధ్యాన మని గదా యర్థము! దానికిఁ బరమాత్మ విషయ మెప్పు డయ్యెనో అప్పుడు సాకారుఁడే యైనాఁడు. అనిత్యత్వము దానివెంట [illegible]యున్నది గదా! అందుకే 'తేజోవారి మృదాం' తేజస్సునందు [illegible]రనియు, నీటి యందు స్థల మనియు, ప్రాతిభాసికమైన జ్ఞాన ము[illegible]ర్ణించినాఁడు.



యాకారుని యందు 'త్రిసర్గః'. ఇతఁడు త్రిగుణములచేతఁ గూడిన నిర్మాణమనియెడి భ్రాంతి.

"తమేకం గోవిందం సచ్చిదానంద విగ్రహమ్,

బృందావన సురతరు తలాసీనమ్– అని బ్రహ్మగోపాలతాపిన్యుపనిషత్తు.

అర్ధమాత్రాత్మకో రామః, బ్రహ్మానందైక విగ్రహః–అని రామతాపినీ శ్రుతి.

"ఋతం సత్యం పరం బ్రహ్మ, పురుషం నృకేసరి విగ్రహం"– అని నృసింహతాపిని.

"నిర్దోష పూర్ణగుణ విగ్రహ ఆత్మతంత్రో

నిశ్చేతనాత్మక శరీరగుణైశ్చ హీనః"

"ఆనందమాత్ర ముఖపాదసరోరుహాదిః"– ధ్యానబిందూపనిషత్తు.

"నందవ్రజ జనానందీ సచ్చిదానంద విగ్రహః"– బ్రహ్మాండపురాణము.

"సర్వే నిత్యాశ్శాశ్వతాశ్చ దేహాస్తస్య పరాత్మనః

హానో పాదానరహితా నైవ ప్రకృతిజాః క్వచిత్"–మహావరాహపురాణము

"స్వేచ్ఛామయస్య న తు భూతమయస్య"

"బబంధ ప్రాకృతం యథా"

"త్వ య్యేవనిత్య సుఖబోధతనౌ"

"శాబ్దం బ్రహ్మవపు ర్దధత్"

"సత్యజ్ఞానానంతానందమాత్రైక రసమూర్తయః"

ఈ మొదలైన భాగవతవాక్యము లేమి తెలుపుచున్నవి? కృష్ణ పరమాత్ముని యాకారము మాయాసంగతి లేనిది, చిన్మయమైనది. అతఁడే కాదు.

"అనింద్రియా అనాహారా అనిష్పన్నా స్సుగంధినః"

"ఏకాంతిన స్తే పురుషాః శ్వేతద్వీపనివాసినః"– (నారాయణీయము)

"దేహేంద్రియా ఽసుహీనానాం వైకుంఠపురవాసినామ్"-(భాగ. 7 స్కం)

ఈ వాక్యములచేత పరమాత్ముని భక్తులుగూడ శ్వేతద్వీపనివాసులు వైకుంఠపురవాసులు. వారు సాకారులై నప్పటికిని 'అనింద్రియా' ఇత్యాది విశేషణములచేత వారి దేహము లమాయికము లనుటయే స్థిరపడుచుండుట లేదా! భాగవత నవమస్కంధములో 'మాయయో పాత్తవిగ్రహం' మాయచే శరీరమును బొందినవాఁడని యున్నది గదా! మరి యచ్చటి 'మాయా' శబ్దమునకు గతి యేమి? భక్తుల యందలి కరుణచేత అని యర్థము. 'ధామ్నా' ప్రతిపద సముచ్చల న్మాధుర్యైశ్వర్య విభాసితమైన శ్రీవిగ్రహముచేతఁ గాలత్రయము లందును, నిరర్థకములైన కుతర్కములు గలవాఁడు. భగవంతుని నిరూపించుటకు తర్కము పనికిరాదు.

అచింత్యాః ఖలు యే భావా న తాంస్తర్కేణ యోజయేత్,
ప్రకృతిభ్యః పరం యచ్చ తదచింత్యస్య లక్షణమ్.

అసురులు శ్రీవిగ్రహమును జూచినను గుతర్కములతోఁ జూతురు. వారి కది యర్థము గావలసినట్లు గాదన్నమాట. కృష్ణుని శ్రీవిగ్రహము ప్రాపంచిక లోకదృశ్యమైనది గదా. 'యద్దృశ్యం త న్నశ్యం ఘటవత్' కన్పించున దంతయు నశించునదే ఘటమువలె. దానికి 'తేజోవారి మృదాం' అనుట సమాధానము. వీనికిఁ బరస్పరము వినిమయము ప్రాప్తించినట్లు పరమాత్మునియందు త్రిగుణ దేహము మిథ్య. మఱి దర్శన మెట్లుగుచున్నది? విచిత్రలీలలు సాధించెడు నతని యిచ్ఛతో నగుచున్నది. అట్లగుట గూడ నాతని యైశ్వర్యమే. కొందరు 'ఆదికవయే బ్రహ్మా తేనే' అనుట కిట్టర్థముఁ జెప్పెదరు. ఆదికవి విజ్ఞుఁడు, సత్యవ్రతమనువు. అతనికి బ్రహ్మా తన నిర్విశేషమైన స్వరూపమును, తేనే=తన యంశభూతమైన మత్స్యావతారము మాటుగాఁ బ్రకాశింపఁ జేసినాఁడు. మత్స్యావతారస్వామి యన్న వాక్య మిది-

మదీయం మహిమానం చ పరం బ్రహ్మేతి శబ్దితమ్,
వేత్స్యస్యనుగ్రహీతం మే సంప్రశ్నైర్వివృతం హృది.

వంశీధరుఁడు మఱి యొకరీతిగా ని ట్లన్వయించుచున్నాఁడు-

"తత్రాఽపి శుశుభే తాభిః భగవాన్ దేవకీసుతః"

వ్రజాంగనల సహవాసముతోనే కృష్ణావతారములోఁ బరమ మాధుర్య మేర్పడుచున్నది. కనుక కృష్ణచరిత్రలో శృంగారరసమే ప్రధాన మైనది.

అద్యస్య = శృంగారరసము యొక్క, జన్మ = ప్రాదుర్భావము, యతః = ఏ కృష్ణచరిత్రనుండి గలిగెనో, తం ధీమహి = ఆ శృంగార పురుషునకు నమస్కారము. అన్వయాత్ ఇతరతశ్చ = సంయోగ విప్రలంభరూపములతోనే శృంగారరసమునకుఁ బరిపుష్టి. అద్యరసమని చెప్పవలసినపుడు 'అద్య' మనియే నిలిపినాఁడు. ఇదె ట్లుచితము? భీమసేనునకు భీముఁ డనియు, సత్యభామా శబ్దమునకు 'భామ' యనియు వాడినట్లు 'నామైకదేశే నామగ్రహణం' అని వైయాకర ణుల సిద్ధాంతము. లేదా, 'పిబత భాగవతం రసం' అని యున్నది గదా! భాగవతశాస్త్రమే రసరూపము. కనుక 'ఆద్యో రస' అని సుల భముగా నన్వయించికొనవచ్చును.

'అర్థేష్వభిజ్ఞః = చతుష్షష్టికళలు మొదలైన రసోపయోగి వస్తు వులయందు సమర్థుఁడు. ప్రాకృతులైన 'నలా'ది నాయకులవలె కాలకర్మాదిగ్రస్తుఁడు గాఁడనుటకు 'స్వరాట్' అనుచున్నాఁడు.

యః = ఎవఁడు, ఆదికవయే = ఆదిరసమైన శృంగారమును సృష్టించిన భరతునికొఱకు, హృదా = అతని మనస్సుచేతనే, బ్రహ్మ = ఆదిరసమైన శృంగారరసతత్త్వమును, తేనే = వ్యాపింపఁ జేసెనో, యత్ర = ఏ శృంగారతత్త్వమునందు, సూరయః = పరమర్షులును, ముహ్యంతి = భ్రమింతురు. ఎట్లు? ప్రాకృతులైన నలాది నాయకుల

యందు దాని నారోపించి అదియే శృంగారమని భ్రాంతిఁ జెందిరన్న మాట. దానికి దృష్టాంతమే 'తేజోవారి మృదాం' అనుట. భగవదేక నిష్ఠమైన రసమునందు ప్రాకృతజననిష్ఠత్వ బుద్ధియే భ్రాంతి. క్రిమి విడ్భస్మాంతనిష్ఠులైన నశ్వరులైన ప్రాకృతజనులయందు రస మావిర్భవింప నేరదు. విభావాదుల పరిపుష్టి లేకుండుటవలన, తద్విపరీతముగా ఘృణామయమైన వైరస్యమే యేర్పడును. త్రిసర్గో మృషా=వాచ్య, లక్షణ, వ్యంగ్యము లనెడు అర్థములయొక్కయు, లేక వ్యంగ్యము లనెడు అర్థములయొక్కయు, లేక ధ్వనిగుణాలంకారముల యొక్కయు, సర్గః=నిర్మాణప్రపంచము, అమృషా=సత్యమేయై అలౌకికమైనందువలన గొప్ప చమత్కారమును సృష్టించును. ఇతర ప్రాకృత నాయకులయందు కవిప్రౌఢోక్తి మాత్రమే యగును. అక్కడ మిథ్యయనియే సిద్ధాంతము. అర్థేష్వభిజ్ఞః అనుటకు ధీరశాంత ధీరలలిత ధీరోదాత్తపద్ధతులయందుఁ జతురుఁ డనియుఁ గొందరు చెప్పిరి. ఆది కవయె తేనే=ఇట్టి రసమాధుర్యమును, ఆదితః=పుట్టుకనుండియే, కవయే=తత్త్వజ్ఞుఁడైన శుకునికొఱకు, బ్రహ్మ=మూర్ధన్యరసమైన శ్రీభాగవతము, అందులోని మాధుర్యమయమైన రాసపంచాధ్యాయి, హృదా=హృదయ మంతయును, తేనే=వ్యాపింపఁజేసెనో!.

"ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మసమ్మితమ్"

"శుకముఖా దమృతద్రవ సంయుతమ్"

"శుకవా గమృతాబ్ధీందుః"

ఇత్యాదులు పై భావమును దృఢీకరించుచున్నవి. ముహ్యంతి య త్సూరయః యత్=ఏ రాసపంచాధ్యాయి నావిష్కరించుటచేత, సూరయః=మహర్షులును, ముహ్యంతి=రసాస్వాదజనితమైన యానంద మూర్ఛనందెదరో లేక సూరయః=భక్తులు, ముహ్యంతి=మహావిజ్ఞులైనను, మూఢులై, ధర్మవిపర్యయము నందెదరో తేజోవారి మృదాం వినిమయః ఇచ్చట వినిమయమనఁగా స్వధర్మవ్యత్యయము

ఆ రాస లీలను జూచి, చంద్రాదులు చకితులైరి. స్వీయధర్మమైన చలనమును వదలినారన్నమాట. నీటికి మురళీవాద్యధ్వనితోఁగాఠిన్యమేర్పడి మృద్ధర్మము గలిగినది. పాషాణాదులైన మృద్భేదములకు జలధర్మ మేర్పడినది. పరం=సర్వోత్కృష్టమైన, సత్యం=నిత్యమైన, భక్తియోగమును, ధీమహి=ధ్యానింతుమనియు నన్వయించి కొనవచ్చును.

సత్యం తదేవసత్యం తదుహ్యైవమంగళమ్,
యదుత్తమశ్లోక యశోఽను గీయతే. (భాగ. ద్వాదశస్కం)

పరం=వాస్తవ వస్తురూపమైనది. త్రిగుణాతీతమైనది. సత్యం=సత్పురుషుల కిష్టమైనది. పరమకల్యాణగుణాకరమైనది. 'లక్షణం భక్తి యోగస్య నిర్గుణస్య హ్యుదాహృతం' అని భాగవతమే చెప్పుచున్నది. అన్వయాత్=నిరంతరమును భక్తియోగము ననుసరించుట వలన ఇతరతః=నిష్కామకర్మయోగ, జ్ఞానయోగములందు భక్తి చేరుట వలన, అద్యస్య=పరమేశ్వరునియొక్క, జన్మ=ఉపాసకులయందు సాక్షాత్కారభావ మేర్పడుచున్నదో! 'కేవలజ్ఞానము చేతనే బ్రహ్మ సాక్షాత్కార మేర్పడునని ప్రసిద్ధి గదా!'

దానికి 'అభిజ్ఞః' అను పదము చేత సమాధానము చెప్పుచున్నాఁడు-

అభి సర్వతోభావేన, జ్ఞా=జ్ఞానము, యతః=జ్ఞానస్యసాత్త్వికత్వాత్ గుణాతీతాయాః భక్తేః తత్ర అన్వయం వినా పరమాత్మనో జ్ఞానం వినా అన్యథా న భవేత్'-

జ్ఞానము సాత్త్వికము, భక్తిగుణాతీతము. గుణాతీతమైన భక్తి చేరనిది కేవలజ్ఞానముచేత బ్రహ్మత్వజ్ఞానమే యేర్పడదని భావము.

నైష్కర్మ్యమప్యచ్యుత భావవర్జితమ్,
న శోభతే జ్ఞానమలం నిరంజనమ్. (భాగవతము)

నిరంజనమైన జ్ఞానము నైష్కర్మ్యస్వరూపము. దానికి భక్తితోడి సంబంధ మేర్పడితీరవలెను. లేకున్నచో దానికి శోభలేదు. గీతకూడ_

"భక్త్యా మా మభి జానాతి, యావాన్ యశ్చాఽస్మి తత్త్వతః"

అనుచున్నది.

బ్రహ్మసాక్షాత్కారమునకై జ్ఞానయోగము, భక్తి నపేక్షించు నట్లు భగవత్సాక్షాత్కారమునకై భక్తియోగముగూడ జ్ఞానము నపేక్షించునుగదా! అందుకే 'స్వరాట్' స్వయముగాఁ బ్రకాశించును.

భక్తియోగము సమ్రాట్టువలె స్వతంత్రమై యితరమునకు దేనికిని లోఁబడునది కాదు.

అకామ స్సర్వకామో వా, మోక్షకామ ఉదారధీః,
తీవ్రేణ భక్తియోగేన, యజేతపురుషం పరమ్. (భాగవతము)

ఇది భాగవతమందలి విధివాక్యము. అకాముఁడైనను సర్వకాముఁడైనను మోక్షకాముఁడైనను తీవ్రమైన భక్తియోగముతోఁ బరమేశ్వరుని సేవింపవలెనని తాత్పర్యము.

తీవ్రేణ అనుటకేమియర్థము? మేఘాద్యమిళితమైన కేవల సౌరకిరణములచేతవలె జ్ఞానాద్యమిశ్రితమైన భక్తియోగముచేతనని యర్థము.

యత్కర్మభి ర్యత్తపసా జ్ఞానవైరాగ్యతశ్చ యత్,
సర్వం మద్భక్తియోగేన మద్భక్తో లభతే ఽన్యథా. (భాగవతము)

కర్మయోగముచే తపస్సుచే జ్ఞానవైరాగ్యములచేత నే మహాసిద్ధి లభించుచున్నదో ఆ సర్వఫలము సముదితముగ నా భక్తియోగ మొక్కటే ప్రాపింపఁ జేయును. అందుకే_

తస్మాన్మద్భక్తియుక్తస్య యోగినో వై మదాత్మనః,
న జ్ఞానం న చ వైరాగ్యం ప్రాయ శ్శ్రేయోభవే దిహ.

నా భక్తియుక్తుఁడైన యోగికి జ్ఞానముతోడి వై
వైరాగ్యముగూడ శ్రేయస్కరము గాదు అని భగవం

ఇట్టి భక్తియోగము భక్తానుగ్రహము తే
అందుకే 'తేనే బ్రహ్మహృదా' అనుచున్నాఁడు. బ్ర
సః బ్రహ్మహృత్, తేన బ్రహ్మహృదా, నిరంతరము
నము గలిగిన నారదునిచేత, ఆదికవయే=వ్యాసము
తేనే=ప్రకాశిత మైనది.

మఱి వ్యాసుఁడు సర్వజ్ఞుఁడు గదా! అత
తెలియదా?

ముహ్యంతి య త్సూరయః- సూరయః=
ద్యస్మిన్=ఈ గుణాతీతమైన భక్తియోగమునందు,
బుద్ధ్యాది అంతఃకరణములు ప్రవేశించుటచేత వారు
యగుచున్నా రన్న మాట.

హంసగుహ్యోక్తియం దిటు లున్నది-

**యచ్ఛక్తయో వదతాం వాదినాం వై**
**వివాద సంవాద భువో భవంతి,**
**కుర్వంతి చైషాం ముహురాత్మ మోహం**
**తస్మై నమోఽనంతగుణాయ భూమ్నే.**

భగవంతుని యనంతములైన శక్తులు విచిత్రమై
అవి ఇతరములందుఁ బ్రవేశించును, బ్రవేశింపవు న
వివాదములకుఁ గారణము లగుచున్నవి. మహాత్ముల
మోహమును గల్గించుచున్నవి.

భక్తియోగము కేవలము గుణాతీతము గా
తృతీయ స్కంధమునందు దానికిని గుణమయత్వము

యత్ర త్రిసర్గోమృషా- త్రిసర్గః=త్రిగుణములచేత స్పృశింపఁ బడుట, మృషా=అవాస్తవము, యథా తేజోవారిమృదాం వినిమయః వినిమయ మనఁగా మేళనమన్నమాట. పాలు స్వయముగా నిస్తేజము కాని దుగ్ధము తప్తమైనదని వ్యవహారమున్నది. నీటివలె నున్నదను చున్నాము, మలినమైన దనుచున్నాము. అట్లే త్రిగుణాతీతమైన, భక్తి యోగము పురుషవర్తులైన సత్త్వాది గుణయోగము వలన, సాత్త్విక రాజసిక తామసిక భేదము లందుచున్నది.

ఆదికవయే అను శబ్దమును గొందరు వ్యాఖ్యాత లిట్లన్వయించి నారు-

ఆదిభూతం యత్ కం సుఖం, బ్రహ్మానందరూపో మోక్షః తస్య వయః ప్రాప్తిః. అయ వయ గతౌ అని ధాతువు. ఆదిభూతమైన సుఖము బ్రహ్మానందమైన మోక్షము. దాని ప్రాప్తి అనియర్థము. సంసారము లేకున్న, శ్రవణ మననాద్యనుష్ఠాన సాధన సిద్ధింపదు. అవి లేకున్నచో తత్త్వజ్ఞానోదయమే లేదు. అనాద్యవిద్యానివృత్తియు సంభవింప నేరదు. కనుక జీవులయొక్క మోక్షార్థమై సంసారమును సృజించినాఁడని భావము. ప్రౌఢుఁడైన విశ్వనాథచక్రవర్తి తన వ్యాఖ్యానమున కవతారికను చిత్రముగా నిచ్చినాఁడు. అతని యవ తారిక యిది-

ఇహ ఖలు నిఖిలకల్యాణగుణవారిధౌ, మహైశ్వర్యసంరాజి, స్వయం భగవతి, పరమ భాస్వత్యధిధరణి యథా సమయం విలస్య అంతర్హితే నానాశాస్త్రపురాణేతిహాసాదీనాం సర్వజన నికాయత్రాయ కత్వ రూపే ష్వర్థేషు యామికేష్వివ కాలేన దైవాద్వైగుణ్యోదయాత్ ఆలస్యే నేవ కేషు చిత్సుప్తేషు తే ష్వేవ మధ్యే కైశ్చిత్ కైశ్చిత్ ప్రత్యుత.

జుగుప్సితం ధర్మకృతే ఽనుశాసతః,
స్వభావరక్తస్య మహాన్ వ్యతిక్రమః.

ఇత్యాదితో అవగత్తై రనర్థా కార్యైః చోరై రివ ఉద్భ్యాయ తత్త్వ ప్రణేతృ పర్యంతానాం సర్వేషాం చిత్తప్రసాదరూపేషు మహాధనేష్వ పహృతేషు—

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాఽత్మానం సృజామ్యహమ్.

పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచ ఇతిదుష్కృతామ్ ఇతి శ్రీగీతోక్త నిమిత్తలబ్ధక్షణతయా యాదస్సు మహామీన ఇవ, విహంగేషు హంస ఇవ, నృషు స్వయం భగవాన్ శ్రీకృష్ణ ఇవ, దేవేషు ఉపేంద్ర ఇవ వేదేషు శ్రీమద్భాగవతాఖ్యం శాస్త్రమాడామతిః.

కృష్ణే స్వధామోపగతే ధర్మజ్ఞానాదిభిస్సహ,
కలౌ నష్టదృశామేష పురాణార్కో ఽధునోదితః.

ఇతి వచన వ్యంజిత శ్రీకృష్ణప్రతి మూర్తికత్వేన మమ అహమేవాభిరూపః కైవల్యః ఇతి, నిరస్త తద్వినాఽన్య సాదృశ్యతయా శ్రీ శుకపరీక్షిద్భ్యాం శ్రీకృష్ణ ఏవ జ్యోతిస్సు సహస్రాం శురివ, పురాణేషు భాస్వాన్ ద్వాదశస్కంధాత్మకో అష్టాదశ సహస్రచ్ఛదనో మహాజన వాంఛితార్థకల్పతరు రివ అవతతార, కృష్ణపరమాత్మ నిఖిల కల్యాణ గుణ మాధుర్యవారిధి. మహైశ్వర్య సంపన్నుఁడు. అతఁడు గొంత కాలము పృథివి నలంకరించి యంతర్హితుఁడయ్యెను. అప్పుడు నానా శాస్త్రపురాణేతిహాసములు నిద్రించిన వైనది. సమస్తజనులను రక్షింప వలసిన వాని యర్థములును నిద్రించు యామికులు. వాని మధ్యలో గొన్ని లేచి జుగుప్సితములైన మార్గములను 'ధర్మము' లని చెప్పి చాటింపఁ జొచ్చెను. మానవుఁడు సాధారణముగా నింద్రియ లాల సుఁడు. అందుచే జుగుప్సితధర్మము లాచరించి కొన్నవి. విపరీతమైన ధర్మవ్యతిక్రమ మేర్పడెను. చోరులవంటి దురర్థములు లేచి మానవుల యొక్క చిత్తప్రసాద మనెడు మహాధనములను దొంగిలించినవి. గీత యందు భగవంతుఁ డిట్లన్నాఁడు—

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్,
ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే.

ధర్మగ్లాని యేర్పడి నప్పుడు అధర్మోత్థాన మైనప్పుడు నేను చిన్మయమైన శరీరము నంగీకరింతును. ఎందుకు? సాధువులను రక్షించుట కొఱకు, దుర్మార్గులను నాశన మొనర్చుట కొఱకు, ధర్మము స్థాపించుటకొఱకు.

ఈ శ్లోకమునకుఁ గరపాత్రస్వామి చాల ప్రౌఢమైన వ్యాఖ్య నొనర్చినాఁడు. వారి వ్యాఖ్యా పద్ధతి యిది-

ఈ శ్లోకమందలి సాధుశబ్దమునకు గోపాంగనలవంటి సాధువులనియే యర్థము. వీరి పరిత్రాణము భగవంతుని మహా ర్దర్శనముతో గాక యితరముతో గాఁజాలదు. అట్లే దీనియందలి 'దుష్కృతాం' అనుటకును సాధారణ దుర్మార్గులని యర్థము గాదు, భగవంతున కంతరంగులైన జయవిజయులవంటివారని తాత్పర్యము. వీరి దుర్మార్గములు భగవంతుని లీలావిశేషము యొక్క వికాసము కొఱకే. సామాన్యులైన దుర్మార్గులను వారి దుష్కర్మములే నాశ మొనర్చును. ఇక్కడ ధర్మసంస్థాపన మనఁగా భక్తియోగరూపమైన ధర్మమని యర్థము. అది భజనీయుఁడులేక సిద్ధింపదు కదా! భగవంతుని ప్రాదుర్భావమునకుఁ బ్రధానప్రయోజనము అమలాత్ములకు భక్తి యోగమును బ్రసాదించుటయే-

తథా పరమహంసానాం మునీనా మమలాత్మనామ్,
భక్తియోగ విధానార్థం కథం పశ్యేమహి స్త్రియః.

(భాగవతము ప్ర. స్కం.)

కాని అవాంతర ప్రయోజనము మఱియొకటి గూడ కద్దు. సన్మార్గమందున్న సాధువులరక్ష, వైదికస్మార్తాది కర్మముల స్థాపన. భగవంతుఁడు సర్వనియంత. అతని ప్రాదుర్భావము యోగారురుక్షుల

కొఱకును, యోగారూఢుల కొఱకును గూడ, యోగారురుక్షువులను వైదికస్మార్తకర్మములయందుఁ బ్రవృత్తులను గావించును. యోగారూఢులను సర్వకర్మసన్న్యాసపూర్వకమైన కేవల భగవన్నిష్ఠయందే నియుక్తులను జేయును. అందుకే భగవంతుఁ డనుచున్నాఁడు-

నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి.

యది హ్యహం నవర్తేయం జాతు కర్మణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. (గీత)

అర్జునా! మూఁడు లోకము లందును నాకుఁ గర్తవ్యమను టయే లేదు. లేని దానినిఁబొందుట యనుటయును లేదు; కాని కర్మను నేను నిరాదరించుట లేదు. నేను కర్మను జేయకున్నచోఁ దక్కినవారు న న్ననుసరింతురు. లోకము భ్రష్ట మగును.

భగవంతుఁడు విధినిషేధముల కతీతుఁడు. అతఁడు కేవలము లోకశిక్షణకొఱకై విధి నిషేధశృంఖలములు దగిలించి కొనును. లేకున్నచో లోకమర్యాదా పాలనము జరుగదు. భాగవతమే చెప్పుచున్నది-

అథా ఒప్లుతోంభస్యమలే యథావిధి క్రియాకలాపం పరిధాయ వాససీ,
చకార సంధ్యోపగమాది సత్తమో కృతానలో బ్రహ్మ జజాప వాగ్యతః.

భగవంతుఁడు యథావిధిగా స్నాన మొనర్చెను. రెండు వస్త్రములతోఁ గ్రియాకలాపములు ముగించెను. సంధ్య వార్చెను. అగ్నియందు హోమించెను వాగ్యతుఁడై బ్రహ్మమును జపించెను.

ఇదంతయు లోకసంగ్రహము కొఱకు. చంచలమైన మర్కటము నదుపులోనికిఁ దెచ్చికొనుటకు, పొడవైన సంకెలను దగిలింతురు. అది శాంతమగు కొలఁదియు శృంఖల చిన్నదగును; కడకు, సంకెల వదల్చినను అది నిలుకడగనే యుండును. అట్లే అత్యంత

చంచలమైన చిత్తముయొక్క నిరోధమునకు విధి నిషేధరూపమైన పెద్దశృంఖల గావలెను. శాస్త్రీయశృంఖలా శూన్యుఁడైన పురుషుని యొక్క దేహేంద్రియములు విశృంఖలముగ వర్తించును. కనుక మనస్సును నిశ్చేష్ట మొనర్చుకొఱకు దేహాదులను శాస్త్రీయశృంఖలా నిబద్ధముగఁ జేయవలెను. మనస్సుయొక్క విశృంఖలత తగ్గినట్లెంతయు శాస్త్రశృంఖల గూడ చిన్నదగుచు వచ్చును. అట్టివాఁడు మొదలు కామ్యకర్మానుష్ఠానముల ద్వారా ఇతరకర్మల నివారణ మొనర్చి కొనును. క్రమముగాఁ బారలౌకిక మహాఫలకర్మాసక్తుఁ డగును. క్షుద్రఫలదాయకములైన కామ్యకర్మలు వదలును. తరువాత నిష్కామ కర్మమూలమున సకల కామ్యకర్మలను వదలి ధ్యానసమాధులలో సర్వచేష్టలు నిరోధించి నైష్కర్మ్యస్థితి ననుసరించును. ఈ రీతి ఉత్తరోత్తరము సూక్ష్మతరములైన సాధన లభ్యసించుచుఁ గడకు, సమాధి స్థితుఁడై పోవును; అప్పుడే యాలంబనమును లేకయున్నను సర్వథా మనస్సు నిశ్చేష్ట మగును. వానికే శృంఖలయు నక్కఱలేదు.

ఎవ రారురుక్షులో సంసారసాగరము నుత్తరింపలేరో వారి కొఱకై భగవంతుఁడు లౌకిక వైదిక మర్యాదాపాలన మొనర్చుచున్నాఁడు. ఎవరు యోగారూఢులో వారి కే విధియు లేదంటిమి. వారిని ఏకమాత్ర భగవన్నిష్ఠయందే స్థిరులనుగా నొనర్పవలెను. వారికొఱకు భగవంతుఁడు మర్యాదోల్లంఘన మొనర్చును. వాఁడు సమస్త విరుద్ధకర్మముల కాశ్రయము: వానికి మర్యాదాపాలనము, తదుల్లంఘనము రెండును సమానములే; యోగారూఢుల కొఱకునియమోల్లంఘనము శ్రేయస్కరము. ఎందు కనఁగా వారి కభిలషితము భగవత్తత్త్వ మొక్కటే; దానిలో స్వారసికమైన ప్రవృత్తి మాత్రమే. వారికే శాస్త్రీయ నియమ మైనను బాధకమే యగును. ఎక్కడ నే విధమైన విధియుండునో అక్కడ స్వారసికమైన ప్రేమ లేదు. ఇది లోకములో మన కనుభవమం దున్నదే. స్త్రీ పుత్రాదులందు మనకు స్వారసికమైన ప్రీతి యున్నది. అట్టి ప్రీతి శ్రౌత స్మార్తాది కర్మలందు

లేదు గదా! ఎవరు మనోనిరోధపూర్వకముగ బుద్ధిని శుద్ధ పరబ్రహ్మ మందుఁ బ్రతిష్ఠింతురో వారినిగూడ విషయము లాకర్షించును. దుఃఖములు వారినిగూడ వెంటాడును. సర్వసుఖి నారాయణ పరాయణుఁ డొక్కఁడే.

జలజంతువులందు మహామీనము వలె, విహంగములందు హంసవలె, నరులయందు శ్రీకృష్ణునివలె, దేవతలయం దుపేంద్రుని వలె, వేదములందు శ్రీమద్భాగవత మనెడు శాస్త్రచూడామణి యావిర్భవించెను. దాని యావిర్భావముతో నర్కోదయ మైనది. సర్వజగత్తులును దెలివి నందినవి. ఆ భాగవతముతో సమానమైనది మఱి యొకటిలేదు. శుక పరీక్షిత్తులద్వారా అది ప్రపంచమున కవతరించెను. దాని యవతారము శాశ్వతమైన కృష్ణావతారము;

జీవగోస్వామి చైతన్యసంప్రదాయమునకుఁ జెందినవాఁడు. అతఁడు 'క్రమసందర్భ' మనెడు పేరుతో భాగవతవ్యాఖ్యాన మొనర్చెను. దానిలో నతఁడు చెప్పిన కొన్ని విషయము లివి–

భాగవతమందు వృత్రాసురవధ చెప్పఁబడినది. దానికిఁ గల ప్రత్యేకత యేమి?

వృత్రాసురుఁడు పరమభాగవతుఁడు. వామనపురాణమందు 'హయగ్రీవ బ్రహ్మవిద్యగూడ భాగవతమం దున్న' దని చెప్పఁబడినది. వృత్రాసురవధ సాహచర్యముతో హయగ్రీవ బ్రహ్మవిద్య యనఁగా నారాయణ కవచమే; హయగ్రీవ శబ్దముచేత దధీచియే చెప్పఁబడినాఁడు. అత డశ్వశిరస్కుఁడు. అతనిచేతనే నారాయణకవచ మనెడు బ్రహ్మవిద్య ప్రవర్తింపఁ బడినది. అతని హయగ్రీవత్వము షష్ఠస్కంధమందు 'యద్వా అశ్వశిరోనామ' అనుటచేత సూచింపఁబడినది.

ఏత చ్ఛృత్వా తతో వాచ దధ్యఙ్గాథర్వణస్త్వయోః,
ప్రవర్గ్యం బ్రహవిద్యాంచ సత్కృతో సత్యశిల్పితః.

ఈ శ్లోకముయొక్క టీకలో దీని విచారము ముందు వివరింపఁబడును. భాగవతము భగవత్ప్రియ మైనది. భాగవతులకు పరమాభీష్టమైనది. పరమసాత్త్వికమైన పురాణము. పద్మపురాణమందు గౌతమాంబరీష సంవాదమం దిట్లున్నది-

పురాణం త్వం భాగవతం పఠసే పురతో హరేః,
చరితం దైత్యరాజస్య ప్రహ్లాదస్య చ భూపతే.

దైత్యరాజు హిరణ్యకశిపుఁడు, ప్రహ్లాదుఁడు-వీరి చరిత్రపఠనము పరమపావనము. దానిని భగవత్సన్నిధిని బఠించుట యుత్తమమైన సేవ. ఆ పురాణమందే 'వంజులీ' మాహాత్మ్యమం దిట్లు వచ్చును-

రాత్రౌ తు జాగరః కార్యః శ్రోతవ్యా వైష్ణవీకథా,
గీతానామసహస్రం చ పురాణం శుకభాషితమ్,
పఠితవ్యం ప్రయత్నేన హరే స్సంతోషకారణమ్.

రాత్రియందు మేల్కని వైష్ణవమైన కథను వినవలెను. అది యేమి? శుకభాషితమైన పురాణము, గీతాశ్రవణము, విష్ణుసహస్రనామ శ్రవణమును జేయవలెనని భావము. దీనితో వాసుదేవునికి సంతుష్టి యేర్పడును. దీని సారమునే పండితులు హాస్యమును జోడించి యిట్లు చెప్పికొందురు-

ప్రాత ర్ద్యూత ప్రసంగేన మధ్యాహ్నే స్త్రీప్రసంగతః,
రాత్రౌ చోరప్రసంగేన .... .... ....

ప్రాతఃకాలమున ద్యూతప్రసక్తిగల భారతముఁ జదువవలెను. మధ్యాహ్నమున రామాయణము; రాత్రులందు భాగవతమును సేవింపవలెను.

స్కాందపురాణమందలి ప్రహ్లాదసంహితలో నిట్లున్నది-

శ్రీమద్భాగవతం భక్త్యా పఠతే హరిసన్నిధౌ,
జాగరే తత్పదం యాతి కులబృంద సమన్వితః.

రాత్రులయందు నిద్రగట్టి యెవఁడు హరిసన్నిధిని భక్తితో భాగవతమును పఠించునో వాని వంశము వైకుంఠమునం దుండును. గారుడపురాణ మి ట్లనుచున్నది-

అర్థోఽయం బ్రహ్మసూత్రాణాం భారతార్థ వినిర్ణయః,
గాయత్రీ భాష్యరూపోఽసౌ వేదార్థ పరిబృంహితః.
పురాణానాం సామరూపః సాక్షాద్భాగవతోదితః,
ద్వాదశస్కంధయుక్తోఽయం శతవిచ్ఛేదసంయుతః.
గ్రంథోఽష్టాదశ సాహస్రః శ్రీమద్భాగవతాభిధః.

భాగవతము బ్రహ్మసూత్రముల కకృత్రిమభాష్యము. భాగవతమే భారతార్థమును నిర్ణయించుటకుఁ దగినది. గాయత్రీమంత్రమున కిది భాష్యము. సమస్త వేదార్థములతోఁ గూడినది. వేదములలో సామవేద మెట్లో, అట్లే పురాణములలో నిది సర్వోత్తమము. ఈ భాగవతమును చతుశ్శ్లోకీ రూపమున భగవంతుఁడే సాక్షాత్తుగా వెలయించెను. ద్వాదశస్కంధ సంయుతమైన భాగవతమందు శౌనక సూతుల ప్రశ్నోత్తరరూపములుగా నూఱు కథావిభాగము లున్నవి. దీని శరీరము పదునెనిమిదివేల శ్లోకములు.

బ్రహ్మసూత్రములకు స్వరసమైన భాష్యము భాగవతముండగా నర్వాచీనులు స్వకపోల కల్పితములుగా నొనర్చిన భాష్యము లనాదరణీయము లని జీవగోస్వామి యనుచున్నాఁడు.

భాగవతమే అభ్యసింపఁదగినది. అదియే శ్రేష్ఠమైనది అని చెప్పుచు గోస్వామి స్కాందపురాణము ని ట్లుల్లేఖించెను-

శతశోఽథ సహస్రైశ్చ కి మన్యైః శాస్త్రసంగ్రహైః,
న యస్య తిష్ఠతే గేహే శాస్త్రం భాగవతం కలౌ.
కథం స వైష్ణవో జ్ఞేయః శాస్త్రం భాగవతం కలౌ,
న తిష్ఠతే గృహే యస్య స విప్రశ్శ్వపచాధమః.

**యత్ర యత్ర భవే ద్విప్రః శాస్త్రం భాగవతం కలౌ.**
**తత్ర తత్ర హరి ర్యాతి త్రిదశై స్సహ నారదః.**
**యః పఠే త్ప్రయతో నిత్యం శ్లోకం భాగవతం దినే,**
**అష్టాదశ పురాణానాం ఫలం ప్రాప్నోతి మానవః.**

'కలిం సభాజయం త్యార్యాః' పెద్దలు కలియుగమును స్తుతించుచున్నారు. ఎందుకు? కేవల భాగవతపఠనముననే మానవుఁడు తరించిపోయెడు సౌకర్య ముండుటవలన; ఇంతెందుకు?

**వేదాః పురాణం కావ్యం చ ప్రభుర్మిత్రం ప్రియేవచ,**
**బోధయం తీతి హి ప్రాహుః త్రివృద్భాగవతం స్మృతమ్.**

వేదములు ప్రభుసమ్మితములు. 'అది చేయుము, ఇది చేయుము' అని ప్రభు వాజ్ఞాపించినట్లే కర్తవ్యమును బోధించును. పురాణములు వేదార్థములనే మిత్రులవలె చెప్పును. అనఁగా ఈ దుష్కార్యమును జేసినచో నీ దుష్ఫలము వచ్చును. దీనిచే వాఁ డిట్లు గీడు వడెను. ఈ శుభకార్యముచే నీ శుభఫలము గలుగును. దీనిచే వాఁ డిట్లు మేలు పొందెను అని చెప్పును. కావ్యములు ప్రియురాలివలె వ్యంజనలక్షణా పద్ధతులతో రసోల్లసితముగాఁ గర్తవ్యమును బోధించును. ఈ మూఁడు గుణములును భాగవతమందే యున్నవి. కనుక దీనికంటె నన్యము అభ్యసింపవలసినది లేదని తాత్పర్యము.

'పరం ధీమహి' ఇచటి 'పర' శబ్దమునకు 'బ్రహ్మ' మని యర్థము. భగవద్రామానుజుల వ్యాఖ్య యిది–

సర్వత్ర బృహత్త్వగుణ యోగేన హి, బ్రహ్మ శబ్దః ప్రవృత్తః బృహత్త్వంచ స్వరూపేణ, గుణైశ్చయత్ర అనవధికాతిశయం సోఽస్య ముఖ్యార్థః, సచ సర్వేశ్వర ఏవ.

బ్రహ్మ మనఁగా నేమి? బృహత్త్వగుణయోగము గల్గినవాఁడనుట. బృహత్త్వ మె ట్లేర్పడుచున్నది?

స్వరూపముతోను గుణములతోను; ఈ రెంటితో ననవధికాతి శయ మెవనియం దున్నదో వాఁడే బ్రహ్మపదమునకు ముఖ్యార్థము. అతఁడు సర్వేశ్వరుఁడే. అనఁగా పురుషోత్తముఁడు సకలకల్యాణగుణ విశిష్టుఁడనియు, హేయగుణ రహితుఁడనియు, సర్వోత్తముఁ డనియు భావము. భాగవతమందే ప్రచేతు లి ట్లనుచున్నారు-

**నహ్యంతో యద్వి భూతీనాం, సోఽనంత ఇతి గీయతే.**

అతని విభూతుల కంతములేదు. అందుకే అతఁ డనంతుఁడు. ఈ మాటచే వివిధమనోహర అనంత ఆకారత్వ మున్నను తత్తదాకా రాశ్రయమైన పరమాద్భుతముఖ్యాకారత్వముగూడ నతనికి వ్యంజిత మగుచున్నది. ఈ రీతిగా బ్రహ్మమూర్తత్వము సిద్ధింపఁగా నా 'పర' శబ్దప్రయోగము చేతనే బ్రహ్మ శివాదిపరత్వముగూడ దర్శితమైనది.

'ధీమహి' ధ్యానింతుము. దీనిచే 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' సూత్రమందలి జిజ్ఞాసాపదము వ్యాఖ్యాతమైన దైనది. జిజ్ఞాసా తాత్ప ర్యము ధ్యానమే. భాగవతమందే యేకాదశస్కంధములో భగవంతు డి ట్లనుచున్నాఁడు-

**శబ్దబ్రహ్మణి నిష్ణాతో న నిష్ణాయాత్పరే యది,**
**శ్రమ స్త స్యశ్రమఫలో హ్యధేను మివ రక్షతః.**

శబ్దబ్రహ్మయందు నిష్ణాతుఁడై దాని ననుభవమునకుఁ దెచ్చి కొనని వాని శ్రమ మంతయు పాలీయని యావును రక్షించినట్లే. జిజ్ఞాస యనఁగా నిధిధ్యాసన మని యర్థము. రూప మున్నవానినే గదా ధ్యానించుటకు సాధ్యము? కనుక నీ పదము పరమేశ్వరుని సాకారత్వమునే బోధించుచున్నది.

కల్యాణగుణ విశిష్టుడైన పరమేశ్వరుని ధ్యానము సుకరమైనది. నిర్గుణోపాసన కష్టతమము. గీతలో భగవంతుఁ డేమను చున్నాఁడు?

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతాః తే మే యుక్తతమా మతాః.

అర్జునా! మనస్సును నాయందు లగింపఁ జేసి నిత్యయుక్తులై నన్నుపాసించువారు నాకు చాల దగ్గరివారు.

యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
తే ప్రాప్నువంతి మా మేవ సర్వభూతహితే రతాః.
క్లేశోఽధిక తర స్తేషా మవ్యక్తా సక్తచేతసామ్,
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే.

అర్జునా! అక్షరుఁడైన పరమాత్మను ఎవ్వ రవ్యక్తముగా ననిర్దేశ్యముగా నిర్గుణముగా నుపాసింతురో వారుగూడ నన్నేపొందుదురు. వారు సర్వభూతహితరతులు. కాని వారి ధ్యానప్రక్రియ చాల కష్టమైనది. అవ్యక్తోపాసనలో సిద్ధిఁ బొందువారు చాల అరుదు. ఈ యర్థమునే భాగవతదశమ స్కంధములో బ్రహ్మదేవుఁడు వివరించుచున్నాఁడు-

శ్రేయ స్సృతిం భక్తిముదస్య తే విభో
క్లిశ్యంతి యే కేవలబోధలబ్ధయే,
తేషా మసౌ క్లేశ లఏవ శిష్యతే
నాఽన్యద్యథా స్థూల తుషావఘాతినామ్.

స్వామీ! నీ భక్తి సకలశ్రేయము. దానిని వదలి కేవల జ్ఞానము కొఱకుఁ బ్రయత్నము సేయువారు, ధాన్యమును వదలి పొట్టుకై యత్నించువారు. వారికి దక్కునది కేవలము క్లేశము మాత్రమే;

భాగవతము నాశ్రయించుకొని అనేక సంప్రదాయము లభివృద్ధిఁ జెందినవి. వానిలో నింబార్క, చైతన్య, వల్లభ సంప్రదాయములు ప్రధానములు. ఉత్తరహిందూస్థానమున వల్లభసంప్రదాయ

మోతప్రోతముగా నిండికొనియున్నది; అన్ని సంప్రదాయములకును అవకాశ మొసఁగునట్టి గంభీరశబ్దబ్రహ్మనిర్భావము భాగవతశాస్త్రము. దక్షిణదేశమున ముఖ్యముగా మూఁడు మతములు ప్రచారములో నున్నవి. అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతములు. వాని మూలసిద్ధాంతములను స్థూలముగా నైననుఁ దెలిసికొనకున్నచో భాగవతము సమగ్రముగా నర్థమగుట కష్టము. అందుచే వాని మూలసూత్రములను, అత్యంతస్థూలముగా నైనను దెలిసికొనుట మంచిది. చార్వాకులున్నారు. వారికే 'లోకాయతికు' లనిపేరు. వీరు దేహాత్మవాదులు. ఈ జగత్తున జడముదప్ప మఱి యేదియు లేదని తలఁచువారు. వారికి శరీర మొకటే నిజము. శరీరము నాశనమైనంతనే మానవుని చరిత్ర యంతయు ముగిసినట్లే; ఇంద్రియ చరితార్థతయే వారికిఁ బరమావధి. వారిని గూర్చి భగవానుఁడు గీతలో నిట్లనుచున్నాఁడు-

> **అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్,**
> **అపరస్పర సంభూతం కి మన్య త్కామహైతుకమ్.**

అర్జునా! ఆసురీసంపత్తిగలవారు జగత్తును 'వేద పురాణాది ప్రమాణశూన్యము' (అసత్యము) అని తెలుపుచున్నారు. అప్రతిష్ఠ మనఁగా ధర్మాధర్మవ్యవస్థాశూన్య మని వారి మతము. ఈ జగత్తు అనీశ్వరము. కర్తయును ఫలదాతయును నగు నీశ్వరుఁడు లేనిది. కామవశమున స్త్రీ పురుష సంయోగ మేర్పడును. దానిని బురస్కరించికొనియే ఈ జగత్తు ఉత్పత్తియైనది. దీని కితర కారణము లేవియు లేవు.

> **ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మా నోఽల్పబుద్ధయః,**
> **ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః.**

అర్జునా! ఇట్టి నాస్తికదృష్టి నవలంబించి పరలోకసాధనచ్యుతులును, క్రూరకర్ములును, అపకారులును, అల్పబుద్ధులు నగు వారు ప్రపంచవినాశనము కొఱకే పుట్టుచున్నారు.

న్యాయవైశేషికులు దేహాతిరిక్తమైన యాత్మ యున్నదందురు. దానికిఁ గర్తృత్వ భోక్తృత్వములు, కర్మాచరణము, సుఖదుఃఖభోగములును గలవని విశ్వసింతురు.

కర్తృత్వము శరీరస్థితమే యైనను, ఆత్మ నిష్క్రియమైనను సుఖదుఃఖముల భోక్త యని తలఁచువారు సాంఖ్య-పాతంజలులు.

'కర్తృత్వము-భోక్తృత్వము నీ రెండును శరీరమునకే. ఆత్మకు గావు. ఆత్మనిష్క్రియము, సుఖదుఃఖాతీతము. అది ద్రష్ట, నిర్వికారి గూడ'. ఇట్లు వాదించువారు వేదాంతులు, గీతగూడ నీ విషయమునే చెప్పుచున్నది.

**అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మా౽య మవ్యయః,**
**శరీరస్థో౽పి కౌంతేయ! న కరోతి న లిప్యతే.**

అర్జునా! యీ పరమాత్మ అనాది, నిర్గుణము. అనఁగా గుణసంగము లేనిది. ఉత్పత్తి రహితము. ఉత్పత్తి యున్నచో వినాశముండును. గుణసంగ మున్నచో గుణవ్యయము గూడ నేర్పడును. అందుచే నది అవ్యయము. అవికారి యగు నీ పరమాత్మ శరీరమునందున్నను ఏమియును జేయుట లేదు. కనుక దానికిఁ గర్మఫల సంగముగూడ లేదు.

చార్వాకు లాత్మవస్తువునే యంగీకరింప రంటిమి. న్యాయవైశేషికులు కర్తయును భోక్తయును నగు నాత్మ నంగీకరించిరి. సాంఖ్య పాతంజలుల దృష్టిలో నాత్మ కేవలము భోక్తయే; వేదాంతులు నిర్గుణ మను ఆత్మను గ్రహించుచున్నారు. ఆత్మ యేకమా? అనేకమా? 'ఈ విషయమునఁ గూడ మతభేద మున్నది. వేదాంతమత మొక్కటే యేకాత్మవాది. తక్కిన వారందఱును నానాత్మవాదులు. ఆత్మబహుత్వము లేనిచో నొకనికి దుఃఖమో సుఖమో సంభవించి నపుడు తక్కినవారందఱికిని యది అనుభవమునకు రావలసియుండును

గదా! అట్లు జరుగుట లేదు. కనుక ఆత్మల నానాత్వ మంగీకరింప వలెను. ఇదియే నానాత్మవాదుల ముఖ్య యుక్తి. కాని సుఖదుఃఖాదు లాత్మసంబంధములు గావు, మనోధర్మములు. శ్రుతులలోఁ బరమాత్మున కనంతత్వము గూడఁ జెప్పఁబడినది. అనంతమైన దొక్కటియే యుండును. రెండవదియుండిన మొదటిదాని యనంతత్వము బాధిత మగును. అట్టి యాత్మయే పరమాత్మ. ఈ విషయమునే భగవద్గీత యి ట్లనుచున్నది–

> ఉపద్రష్టాఽనుమంతా చ భర్తాభోక్తా మహేశ్వరః,
> పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః.

పరమేశ్వరుఁడు ప్రకృతికార్య మగు నీ శరీరమున వెలయు చున్నను స్వతంత్రుఁడు, ఉపద్రష్ట. అనఁగా సాక్షిభూతుఁడైనవాఁడు. వానికి శరీర ఇంద్రియ వ్యాపారసంసర్గము లేదు. వానినుండి వాఁ డెప్పుడును వేఱే. సామీప్యస్థితివలన నా వ్యాపారములను జూచు వాఁడు, అనుమంతా చ=అనుమోదకుఁడు. ఆత్మకు స్వయంప్రవృత్తి లేదు. కాని శరీరేంద్రియ వ్యాపారములఁ బ్రవర్తిల్లునట్లును, వాని కనుకూలముగను దోఁచువాఁడు. 'సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ' (శ్వేతాశ్వ. 6-11) భర్తా=పాలకుఁడు. చిదాభాసతోఁ గూడిన దేహేంద్రియాదుల స్వరూపముతోఁ గూడుకొన్న చైతన్యాత్మ. కనుక ఈశ్వర రూపమున భర్త. భోక్త=అనుభవించువాఁడు. సుఖదుఃఖమోహాత్మకములైన బుద్ధి ప్రత్యయములు. నిత్యచైతన్య స్వరూపమగు నాత్మచేత కబళింపఁబడి పుట్టువానివలెఁ దోఁచుచున్నవి. కనుకనే భోక్త.

మహేశ్వరుఁడు, పరమేశ్వరుఁడు, సర్వాత్ముఁడు, స్వతంత్రుఁ డైనవాఁడు.

పరమాత్మా=అవిద్యచేత ప్రత్యగాత్మ రూపమునఁ గల్పింపఁ బడిన శరీరాదులనుండి బుద్ధివఱకుఁ గల యన్నిఁటికిని అంతరాత్మ.

**ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతి రేష లోకపాలః (బృహ ఉ. 4-4.22)**

మఱి వేదాంతు లన్నట్లు ఆత్మకర్తృత్వ భోక్తృత్వ రహితమే యైనచో లోకములో మనకుఁ గర్మాచరణఫలభోగముల ప్రతీతి యేల కల్గుచున్నది? ఇందులకు తాదాత్మ్య అధ్యాసయే కారణము. అధ్యాస మనఁగా నారోపము. మిథ్యాప్రత్యయము ఇంద్రియములు, మనస్సు అనెడు ప్రకృతికి ధర్మములైన కర్తృత్వమును, సుఖదుఃఖములును ఆత్మయం దారోపితము లగుచున్నవి; వాస్తవమునకు ప్రకృతి గుణములే కర్తృత్వమునకుఁ గారణములు. సుఖదుఃఖాదుల ననుభవించునది మనస్సు. వీని సంపర్కము కలిగినంతనే జీవుఁడు కర్తృత్వ భ్రాంతియందుఁ జిక్కుకొనుచున్నాఁడు. నిజముగాఁ జూచినచో నాత్మ అవికారి. తాదాత్మ్యముయొక్క అధ్యాసకు మూలము అవివేకమే. దానితోనే అసంగమును ఉదాసీనమును నగు ఆత్మ సంసారియై యహంకారవశమున అనఁగా బుద్ధితోఁ గూడి కర్తృత్వాభిమానమును బొంది సుఖదుఃఖముల ననుభవించు చున్నది. ప్రకృతినుండి ఆత్మను వివేకింపగల వ్యక్తి ఆత్మను ద్రష్టగా గ్రహింపఁ గలుగుచున్నాఁడు.

ఈ యాత్మయే బ్రహ్మము. నిరతిశయము. ఉపనిషత్తులు దీనిని రెండు విధముల వర్ణించుచున్నవి. అది యే స్వరూపతటస్థ లక్షణము. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అనునదే స్వరూపలక్షణము. మిథ్యాత్వ జడత్వ పరిచ్ఛిన్నత్వములు బ్రహ్మమునకు లేవు. జన్మ, స్థేమ, భంగములకు బ్రహ్మమే కారణము.

**యతో వా ఇమాని భూతాని జాయంతే. (తైత్తిరీ 3-1)**

మొదలైన వాక్యములు బ్రహ్మముయొక్క తటస్థ లక్షణమును గూర్చి చెప్పుచున్నవి. గీతలో పదుమూఁడవ యధ్యాయమున బ్రహ్మ విచార మున్నది.

బ్రహ్మము అనాది. అనఁగా నస్పష్టమని యర్థము. అదియే యన్నింటికిని మూలము. నిరతిశయవస్తువు. అది ప్రమాణ విషయము గాదు, నిషేధవిషయమును గాదు.

న సత్తన్నా స దుచ్యతే

అది యచింత్యశక్తివలన సర్వాత్మ సర్వతః పాణిపాదము. అది సమస్తమును వెలయించును. సృష్టికాలమున జీవసృష్టి యొనర్చి, స్థితికాలమునఁ బోషించి ప్రళయమున గ్రసించుచున్నది. అది భూతము లన్నింటికిని లోపలను వెలుపలను వెలయుచున్నది.

**సర్వతః పాణి పాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్,**
**సర్వత శ్శ్రుతిమల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి.** (భగ. 13అ. 13శ్లో)
**అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్,**
**భూతభర్తృచ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ.** (భగ. 13_16)

అర్జునా! పరబ్రహ్మము విశ్వమునంతటను వ్యాపించి వెలయుచున్నది. సర్వత్ర దాని హస్తపాదములు. సర్వత్ర కర్ణనయనములు. సర్వత్ర శిరోముఖములు. (చూ. శ్వేతాశ్వ. 2-16)

ఈ బ్రహ్మము సర్వభూతము లందును గారణరూపమున నభిన్నముగా, గార్యరూపమున భిన్నముగాఁ బ్రతీత మగుచున్నది. సముద్రమునందలి ఫేన బుద్బుదాదులు సముద్రమునకంటెను వేఱు గావు. కాని వేఱైనట్లుఁ గన్పడుచున్నవి గదా!

సాంఖ్యుల యభిప్రాయములో బ్రకృతియే విశ్వరచయిత్రి. ప్రకృతికి స్వయముగా నేర్పడు పరిణామ ఫలమే యీ జగత్తు. జీవ సాన్నిధ్యముతోఁ బ్రకృతియం దీ పరిణామము ఘటిల్లుచున్నది. భగవద్గీతలో నీ ప్రకృతిపురుష సంయోగము ఈశ్వరేచ్ఛ లేనిదే కలుగఁ జాలదని చెప్పఁబడినది ప్రకృతియం దీశ్వరుఁడు సృష్టిబీజము లుంచుచున్నాఁడు.

**మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్,**

**సంభవ స్సర్వభూతానం తతో భవతి భారత ।**

అర్జునా! త్రిగుణాత్మకమైన ప్రకృతి నాకు యోని. అనఁగా గర్భస్థానము. అందు నేను సృష్టిబీజము నుంచుచున్నాను. అనఁగా చిదాభాస నుంచుచున్నానని యర్థము. తర్వాత సమస్తభూతములు సృష్టింపఁబడుచున్నవి. ప్రకృతి దేశకాలముల నతిక్రమించును. సర్వ కార్యరూపమున వృద్ధిని బొందును. అందుచే మహద్బ్రహ్మ యనఁ బడును.

క్షేత్రము - క్షేత్రజ్ఞుఁడు. అనఁగా జీవుఁడు. ఈ ప్రకృతి ద్వయము ఈశ్వరుని శక్తులు. అవిద్యాకామకర్మ రూపమైన యుపాధి ననుసరించు క్షేత్రజ్ఞుని ఈశ్వరుఁడు క్షేత్రముతో సంయోజితునిఁ జేయుచున్నాఁడు. ప్రళయకాలమందు తనలో లీనుఁడైన క్షేత్రజ్ఞుని సృష్టికాలమున క్షేత్రముతో సంయోజించుచున్నాఁడు. అవిద్యనుండి కామమును, కామమునుండి కర్మమును గలుగుచున్నవి. ఈశ్వరుని సంకల్పముచేతనే ప్రకృతి చరాచరమగు విశ్వమును బ్రసవించుచున్నది. ఈశ్వరాధ్యక్షతవలననే ప్రకృతి సృష్టి నొనర్చుట. ఈశ్వరుఁ డాకా శమువలె నిర్వికారుఁడు. యోగ మాయా వైభవముతో సృష్టి స్థితి ప్రళయములు సాధితము లగుచున్నవి.

ఈశ్వరుఁడు సృష్టి స్థితి భంగములు చేయుచున్నాఁడు. అతఁ డాప్తకాముఁడు. అందుచే నింతపని చేయుచున్నను నిరహంకారి.

నానవాప్త మవాప్తవ్యం

అర్జునా! నేను బొందఁదగిన దేమియు లేదు.

**న మే కర్మాణి లింపంతి - న మే కర్మఫలే స్పృహా.**

నాకుఁ గర్మకళ్మల మంటికొనదు. కర్మఫలమునందు నా కభి నివేశము శూన్యము అని స్వామియే తన స్వభావమును బ్రకట మొన

ర్చికొన్నాఁడు. ఎట్టి ప్రయాసమును లేకుండ లీలామాత్రముగ నుచ్ఛ్వాసనిశ్వాస కార్యమువలె నీ సృష్టి యతనినుండి గలుగుచున్నది. సృష్టిలో నుత్తమాధమాది భేదము లున్నవి. కాని యతని కెట్టి వైషమ్యమును లేదు.

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యామయితే తేషు చాప్యహమ్.

అర్జునా! జీవులందరును నాకు సమానులే. నాకు ప్రియాప్రియులు లేరు. కాని నన్ను భక్తిపూర్వకముగ భజించువారు నా యందును, వారి హృదయముల నేనును వెలయుచుందుము.

అగ్ని నుపయోగించు వారికి తమశ్శీతాది జనితమగు బాధ తొలఁగిపోవును. దాని నుపయోగింపని వారికి లేదు, అట్లే భగవంతుని సేవించువారు మిత్రు లగుచున్నారు. భక్తికిగల మహిమయట్టిది. అగ్నికే వైషమ్యమును లేదు. అట్లే భగవంతునకు లేదు, ఇది శ్రీధర స్వామి పై శ్లోకమున కొనర్చిన టీక.

మఱియు సృష్టివైచిత్ర్య మెట్లేర్పడుచున్నది? జీవునకుఁ గర్మానుసార మేర్పడుచున్నది. ఈశ్వరుని కరుణాదృష్టి యంతటను సమానముగనే ప్రసరించును. ఈశ్వరుఁడు కర్మఫలదాత. జీవుఁడు కర్మాధికారి, ఈశ్వరుఁడు ఫలదాన మొనర్చును. అతనినుండి యెవ రేమి కోరిన నది పొందుదురు. అతఁ డంతర్యామియై నిఖిలహృదయముల వెలుఁగుచు నియమనము సేయును. స్వామి జడాతీతుఁడు అగుటచే నాత్మనియంత. అందుచే బరమశబ్దవాచ్యుఁడు. జడవర్గమునకు అనఁగాఁ బ్రకృతికి గూడ నతీతుఁడు. చేతనవర్గముకంటె నుత్తముఁడు. కనుక నాతనికిఁ బురుషోత్తముఁ డని పేరు. సంసారబుద్ధి పూర్వకముగఁ దొలఁగిపోయిన అబ్రహ్మస్తంబపర్యంతము అన్నిఁటను అంతటను బరమాత్మయే వెలుఁగుచున్నాఁ డను జ్ఞానము లభించును.

సాంఖ్యులమతములోఁ బ్రకృతియే జగత్కారణ మని తెలిపియుంటిమి. తార్కికమతములైన న్యాయవైశేషికములు ప్రకృతి నుపాదాన కారణ మన్నారు. వారిదృష్టిలో నీశ్వరుఁడు నిమిత్తకారణము. పృథివి, జలము, తేజము, వాయువు నను చతుర్విధ పరమాణువు లున్నవి. వీని సంయోగముతో ద్వ్యణుక మేర్పడుచున్నది. ద్వ్యణుక సంయోగమున జగత్తును ప్రభవించు చున్నది, ఈ పరమాణువులు నిత్యములు. ఇవియే జగత్తున కుపాదాన కారణములు. కుండకు మట్టియైనట్లు, కుమ్మరి మృత్తికా సంయోగమునఁ గుండలను జేయును. అట్లే ఈశ్వరుఁ డీ పరమాణు సంయోగముతో జగత్తును సృష్టించును. అందుచే నతఁడు నిమిత్తకారణము. ఇట్లు తార్కికు లీశ్వరునిఁ బరమాణువులను జగత్తునకుఁ గారణము లని పల్కుచుందురు. ఈశ్వరుఁడే జగత్తున కుపాదానము, నిమిత్తకారణము గూడ నని వేదాంతు లనుచున్నారు. ఆయన సంకల్పముచేతనే యీ సృష్టి. 'ఏక ఏవ బహుధాస్యాం' నేనే పెక్కులుగ నగుదును అని యతఁడు దలఁచినంతనే యీ బ్రహ్మాండము ప్రస్ఫురిత మగును. 'స ఐక్షత' అతఁ డాలోచించెను. కనుక నీ సృష్టి ఇతని యాలోచనయే. సాంఖ్య, తార్కికాచార్యులు ద్వైతులు. వారు జీవబహుత్వము నంగీకరింతురు. ఈ జీవగణము పరమాత్మ నుండి వే ఱనియు, నీ జగత్తు సత్య మనియు వారివాదము. మధ్వాచార్యుల మతముగూడ నిదియె. ద్వైతసిద్ధాంతములను వ్యాసరాజస్వామి యీ క్రింది శ్లోకములో సంకుచిత రమ్యముగాఁ బ్రతిపాదించినారు–

> శ్రీమన్మధ్వమతే హరిః పరతరః సత్యం జగ త్తత్త్వతో
> భేదో జీవగణాః హరే రనుచరాః నీచోచ్చభావంగతాః,
> ముక్తి ర్నైజ సుఖానుభూతి రమలా భక్తిశ్చ తత్సాధనం
> హ్యక్షాదిత్రితయం ప్రమాణ మఖిలామ్నాయైకవేద్యో హరిః,

ఇవి తొమ్మిది సిద్ధాంతములు. 'హరిః పరతరః' — హరి యొక్కఁడే సర్వోత్తముఁడు. స్వతంత్రము, అస్వతంత్ర మని తత్త్వ

ములు రెండురీతులు. అనంతకల్యాణగుణ పరిపూర్ణుఁడును, అనంతుఁడును నగు శ్రీమన్నారాయణుఁ డొక్కఁడే స్వతంత్రతత్త్వము. తక్కిన జడచేతనసమూహము లన్నియు నస్వతంత్రములే. అతని కధీనములే. సర్వజ్ఞుఁడును, సర్వశక్తిమంతుఁడు, నద్వితీయుఁడునగు పరమాత్మయే జగజ్జన్మాదులకుఁ గారణము. అతఁడే మోక్షప్రదాత. అతఁడు జీవ జడప్రకృత్యాదులనుండి అత్యంతము భిన్నుఁడు. సచ్చిదానందము లాతని స్వరూపములు; నానారూపములు గలవాఁడు. అతని రూపగుణ క్రియాదులకుఁ బరస్పరముగను అతనినుండియు నత్యంతము నభేదము.

'సత్యం జగత్' పరమాత్మునిచే సృష్టింపఁబడిన యీ చరాచరాత్మక ప్రపంచము సత్యము. జీవితములో నిది మనము ప్రతిక్షణ మనుభవించుచునే యున్నాము. ప్రపంచము మిథ్య యని కొందరందురు. సదసద్విలక్షణ మని మఱి కొందఱి మతము. వీరి యభిప్రాయము ననుసరించి త్రికాలాఽబాధితమైన దొక్కటే సత్యము. తక్కినవి గావు. త్రికాలాబాధితమగు టొక్కటే సత్యము గాదు. అది మూఁడు కాలములందును నుండవలె నను నియమము లేదు. భూత భవిష్యద్వర్తమానములందు నెప్పుడైనను అస్తిత్వము కలిగియున్న పదార్థము సత్యమే యగును. పురిటియందు మరణించిన బిడ్డ అసత్యము కాదు గదా! దాని పుట్టుక సత్యము. కొంతకాల ముండి నదియు సత్యము. మరణించుటయు సత్యము. ఈ దృష్టితోఁ జూడఁగా నొకప్పుడుండి మఱియొకప్పుడు నశించు నీ జగత్తు సత్యమనియే చెప్పవలెను. 'తత్త్వతో భేదః'– జీవునకునుఁ బరమాత్మకును జాల భేద మున్నది. జీవుఁ డస్వతంత్రుఁడు, అణుస్వరూపుఁడు. పరమాత్మ స్వతంత్రుఁడు. ఒక పరిమాణమునకుఁ జిక్కువాఁడు గాఁడు. సంసారమందు జీవుఁడు అవిద్య, దుఃఖము, భయము మొదలగు వానిచే బంధితుఁడు. పరమాత్మునిలో దోష లేశమును లేదు. ముక్తియందు జీవునకును బరమాత్మునకును గొన్ని సాదృశ్యములు వ్యక్త మగును.

కాని, అవి గుణమందును పరిమాణమందును, బరమాత్మునకన్నఁ జాల రెట్లు తక్కువైనవి. జీవులలోను బరస్పరము స్వరూపభేద మున్నది. ముక్తిలోఁ గూడ నీ భేదము నశింపదు. జీవు లందఱకు నొక్కటే రూపమైన ముక్తి సిద్ధింపదు. వారి వారి స్వరూపమును బట్టి ముక్తి యుండును. జీవ-ఈశ-జడములందు పంచభేదము లున్నవి. అవి యీ క్రిందివి-

1. పరమాత్మునకు-జీవునకును భేదము
2. జీవునికిని - జీవునికిని భేదము
3. జీవునికిని - జడమునకును భేదము
4. జడమునకు - జడమునకును భేదము
5. పరమాత్మకు - జడమునకును భేదము.

ద్వైతసిద్ధాంతమున కీ యైదు నాయువు పట్టులని చెప్పవచ్చు. ఈ భేద మెట్లు వచ్చినది? ఇది ధర్మియొక్క స్వరూపమే. 'జీవగణా హరే రనుచరాః'- జీవుఁ డస్వతంత్ర తత్త్వమునకుఁ జెందినవాఁడు. అతని యస్తిత్వము, జ్ఞానము, కర్తృత్వము అన్నియును బరమాత్మున కధీనములు. కాని జడమువంటి వాఁడు గాదు. విచక్షణాశక్తిగల వాఁడై తనకు హితమని తోఁచిన కార్యమునందుఁ బ్రవృత్తుఁడుగాఁ గలఁడు. ఇ ట్లొప్పుకొననిచో శాస్త్రములం దితనికై చెప్పఁబడిన విధి నిషేధములకుఁ బ్రయోజనమే లేకపోవును. అందుచే నితని కిట్టిశక్తు లున్నవని యంగీకరింపవలెను. కాని యవి భగవదధీనము లైనవి. జీవుని స్వభావము ననుసరించి యతని పూర్వకృత కర్మముల నను సరించి భగవంతుఁ డాతని శక్తులను గార్యోన్ముఖముగా నొనర్చు చున్నాఁడు. ముక్తిలోఁగూడ జీవుఁడు భగవంతుని కధీనుఁడే. అంతే కాదు; మీఁదుమిక్కిలి ముక్తియందే యతనికి తన స్వభావము భగవ దధీనమని చక్కగా వ్యక్త మగుచున్నది. ఆ స్థితియందు వీ రిరువురి సంబంధము పరమదయాళు వగు యజమానునకు భక్తివినయములు

గలిగిన సేవకునికి నుండు సంబంధము వంటిది. 'నీచోచ్చభావం గతాః'- జీవు లనేకులు. ఒక జీవునకు మఱియొక జీవునకు భేదము గలదు. ఆభేదము సత్యము. అది ముక్తియందుఁగూడ గోచరించును. సంసార మందున్న పరస్పర భేదమును మన మనుభవించుచునే యున్నాము. కర్మసిద్ధాంతము ననుసరించి ఈ భేదము జీవునికి_జీవునికి మధ్యగల పూర్వకృత కర్మలయందలి భేదమువలననే గలుగుచున్నది. ఈ పూర్వజన్మకృత కర్మసంచయ మెట్లేర్పడినది? అంతకుముందు జీవునిచేఁ జేయఁబడిన కర్మఫలముగా సిద్ధించినది. కాని మొట్టమొదటి సారిగా జీవులలోఁ కర్మభేద మెట్లు ప్రాప్తించెను? కర్మసిద్ధాంతము దీనికి సరియైన యుత్తర మిచ్చుటలేదు. ఈ భేదమునకుఁ గారణము జీవునియొక్క ప్రత్యేకతయే యని మధ్వసిద్ధాంతము. ఈ ప్రత్యేకత జీవునిస్వభావమై యుండి ముక్తిలోఁగూడ జీవునికి_జీవునికి మధ్య భేదమునకును, ఆనంద తారతమ్యమునకును గారణ మైనది. జీవులు సాత్త్విక రాజసిక తామసికు లని మూఁడుతీరులు. ఇందు సాత్త్వికులే ముక్తియోగ్యులు.

'ముక్తిర్నైజ సుఖానుభూతిః'- ముక్తి జీవుని చతుర్విధ పురుషార్థములలో నత్యంతము ముఖ్యమైనది. వాని నిజస్వరూపము సచ్చిదానందమే. కాని సంసారదశలో నవిద్య, దుఃఖము, భయము_వీనిచే నావరింపఁబడిన జీవుఁడు దన నిజస్వరూపమును దెలియలేఁడు. అవిద్యా, కామ, కర్మము లితని యైహికబంధములు. వీనిని జీవుఁడు సాధనములచే నివర్తించికొన్నప్పుడు అతని నిజస్వరూపమైన చిదానంద మభివ్యక్త మగును. దానినే ముక్తి యందురు. జీవునికి సంసారదశలో నుండెడు భగవంతునినుండి పృథగ్భావము స్వతంత్రభావము ముక్తిదశలోఁ దొలఁగిపోవును. అప్పుడు వాఁడు జగత్తు సర్వమును బరమాత్మునిచే వ్యాపింపఁ బడిన దనియును, అతని యధీనములో నుండున దనియును జక్కగా గమనించును.

'భక్తిశ్చ తత్సాధనం'-పరమాత్ముని సమీపించుటకు భక్తియే మార్గము. కాని, యది జ్ఞానసహితమై యుండవలెను. జ్ఞానరహితమైన భక్తికి ముక్తి సిద్ధింపదు, జ్ఞానము భక్తియందలి యొకభాగమే. అనంతములైన దోషరహితములైన కల్యాణపూరితములైన గుణములతోఁ గూడినవాఁడు పరమాత్ముఁడను జ్ఞానముండవలెను. తనయందును తనవారైన పుత్త్రకళత్రాదులందును గల ప్రేమకన్నను భగవత్ప్రేమ యధికముగా నుండవలెను. ఆ ప్రేమ విఘ్నసహస్రములచేఁ బ్రతిబద్ధము గారాదు. ఇట్టి ప్రేమప్రవాహమునకే భక్తి యని పేరు. ఇదియే భగవత్ప్రసాద మూలమున ముక్తిని గలిగించును.

'అక్షాది త్రితయం ప్రమాణం'- యథార్థజ్ఞానమును గలుగఁజేయునది ప్రమాణము. పంచజ్ఞానేంద్రియములచే గ్రహింపఁబడుటకే ప్రత్యక్షమని పేరు, జ్ఞానేంద్రియవిషయ సన్నికర్షము నిర్దోషమై యున్ననే ప్రత్యక్షజ్ఞానము ప్రమాణ మగును. లేకున్న నది భ్రాంతి యగును. ప్రత్యక్షముగాలేని దూరవస్తువులను ఊహచేగ్రహింతుము. దానినే యనుమాన మందురు. అనుమానమువలనఁ గలుగు జ్ఞానమునకు 'అనుమితి' యని పేరు. అనుమాన ప్రయోగము దోషరహితమై యున్ననే దానిమూలమునఁ గలుగు జ్ఞానము ప్రమాణము కాఁగలదు. దోషరహితములగు శబ్దములకు 'ఆగమము' లని పేరు. వేదము లపౌరుషేయములు. అందుచే దోషరహితములు, కనుక వానినే ముఖ్యప్రమాణములుగా గ్రహింపవలెను.

'సకలామ్నాయైక వేద్యో హరిః'- పరమాత్ముఁ డనంతుఁడు. అప్రాకృతమైన శరీరము గలవాఁడు. కనుక ప్రత్యక్షమునకు గోచరుఁడు గాఁడు. అనుమానమునకుఁ జిక్కఁడు. అందుచే నాగ[illegible]ణముచేతనే యతనిని గ్రహింపవలెను. కొన్ని శ్రుతులలో పరమాత్ముఁడు 'అవాఙ్మానసగోచరుఁడు' అని చెప్పఁబడినది. మ[illegible] శబ్దప్రమాణముచే గ్రాహ్యుఁడు గాకున్నచో జనులు వే[illegible]యన

మునకుఁ బూనుకొనకయే యుందురు. "పరమాత్ముఁ డనంతుఁడు. అనంత పరిపూర్ణుఁ డగుటచేత వాక్కు అతనిని సంపూర్ణముగా గ్రహింప లేదు". ఇట్లే యా శ్రుతుల కర్థము చెప్పవలెను. నాల్గువేదములును, వేదములలోని ప్రతి భాగమును బరమ ముఖ్యవృత్తిలోఁ బరమాత్మును గూర్చియే చెప్పుచున్నది. అందుచేత వేదములలో నన్ని భాగములును జ్ఞానకాండములే.

కేవలము కర్మలను గూర్చిగాని ఇతర దేవతలను గూర్చిగాని చెప్పు భాగములు వేదమున లేనే లేవు. ఈ మాత్ర మర్థ మొనర్చి కొన్నచో ద్వైతము సంపూర్ణముగా మన కవగాహన మైనట్లే. విశిష్టాద్వైతి యగు రామానుజుల దృష్టిలో బ్రహ్మ సమస్త కల్యాణగుణ పరిపూర్ణుఁడు. సర్వజ్ఞత్వాది గుణశోభితుఁడు. జీవు లా బ్రహ్మ కంశములు. ఆయన కధీనములు. జగత్తు బ్రహ్మపరిణామ మగుటచేత సత్యము. జీవుఁడు, జగత్తు బ్రహ్మమునుండి భిన్నులయ్యును భిన్నులు గారు. బ్రహ్మ మేకము ననేకము గూడ. వృక్షము వృక్షరూపము ననేకమయ్యును శాఖాభేదము ననుసరించి బహుత్వమును బొందినట్లు; బ్రహ్మ రూపమున నేకత్వము, జగద్రూపమున నానాత్వము అతనికి సిద్ధించుచున్నది. అతఁడు శరీరి. జగత్తు శరీరము. కాని శరీరగత దోషము అనఁగా నానాత్వపరిణామదోషము లతనికి లేవు. బ్రహ్మమే జగత్తుగామాఱినను నతని ఏకత్వము అధికారిత్వము నష్టములు గావు. లౌకికదృష్టాంతములతో బ్రహ్మమును బోల్పరాదు. అచింత్యబ్రహ్మము ప్రపంచాకారముగాఁ బరిణమించినను అది ప్రపంచాతీతము.

అద్వైతమత మీ నానాత్వమును బొత్తిగా నంగీకరింపదు. భేదాభేదములు పరస్పర విరుద్ధములు. బ్రహ్మము నిర్విశేషము. సజాతీయ విజాతీయ స్వగతభేద రహితము. ఆత్మ పరమాత్మల కెట్టి భేదమును లేదు. ప్రతీయమాన మగు భేదము ఔపాధికము కల్పితము. జగత్తు దృష్టిగోచర మగుచున్నది. అందుచే గగనకుసుమమువలె కేవ

లాసత్యము గాదు. ఆత్మవలె సత్పదార్థము కూడ కాదు. నామరూపాత్మకమైన యిది ఘటాదులవలె వికారపదార్థము. దీని స్వరూప నిర్ణయము దుస్సాధ్యము. ఇది సత్తు గాదు, అసత్తును గాదు. అందుచే ననిర్వచనీయము, మిథ్య. ఇంద్రజాలికుఁడు అజ్ఞాతమగు నొకానొక శక్తి చేతఁ జూపెడి ఇంద్రజాల మసత్తు. అట్లే మాయాశక్తి చేతఁ దోఁచెడి యీ జగదింద్రజాలము గూడ నసత్తే. బ్రహ్మయే యీ జగత్తునకు మూలము. బ్రహ్మమే సత్యము. జగత్తు మిథ్య. ఇది యద్వైతుల వాదము.

శుకదేవ కృతమైన 'సిద్ధాంతప్రదీపము' భాగవతమునకు మఱియొక వ్యాఖ్య. ఇతఁడు నింబార్క సంప్రదాయమునకుఁ జెందినవాఁడు. 'పరం' అనుటకు 'విశ్వకారణం' అని యితని వ్యాఖ్య. 'జన్మాది' అనుటకు జన్మ స్థితి భంగములే గాక మోక్షమును జేర్చికొన్నాఁడు.

యతో వా ఇమాని భూతాని జాయంతే
యేన భూతాని జీవంతి యత్ప్రయంత్యభిసంవిశంతి
తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి.

దీని కతని వ్యాఖ్యాక్రమ మిట్లున్నది—

యతో జాయంతే ఇతి జన్మోక్తిః, ఏన జీవంతీతి స్థిత్యుక్తిః యం ప్రయంతీతి ప్రళయోక్తిః. అభిసంవిశంతీతి మోక్షోక్తిః.

ఇంకను దీనిపై విస్తరము 'వేదాంతకౌస్తుభ' మనెడు సూత్రభాష్యమునం దున్నది. వేదాంతకౌస్తుభము నింబార్కసంప్రదాయము ననుసరించిన సూత్రభాష్యము. 'యత్ర త్రిసర్గో మృషా'–ఇక్కడ శ్రీధరుఁడు "ఏ బ్రహ్మ సత్యమైనదాని వలన మిథ్యాజగత్తు గూడ సత్యమువలె ప్రతీయమాన మగుచున్నదో" యని వ్యాఖ్యానించెను. దాని నితఁడు ఖండించినాఁడు.

శ్రీధర వ్యాఖ్య 'స దేవ సోమ్యేదమగ్ర ఆసీత్' అను శ్రుతి వాక్యముతో విరోధించుచున్నదఁట. అన్వయాత్ - 'జగత్సత్యం సదుపాదానకత్వాత్ ఘటవత్ ఇత్యన్వయాత్, న యత్సదుపాదానకం న తత్సత్యం ఖపుష్పవత్ ఇతి వ్యతిరేకాచ్చ హేతోః' అని యా ఖండన ప్రకారము సత్పదార్థ ముపాదాన మైనప్పుడు దానిచేత నేర్పడు ఘటాదులు సత్య మెట్లు గాకుండునని యాతని ప్రశ్న. అతఁ డీ శ్లోకము నుదాహరించినాడు-

సర్వేషా మపి వస్తూనాం భావార్థో భవతి స్థితః,
తస్యాఽపి భగవాన్ కృష్ణః కి మసద్వస్తు రూప్యతామ్.

సర్వపదార్థములకును 'ఉన్నది' అను క్రియయందే యన్వయము. దీనికినిఁ గృష్ణుఁడే మూలము. అట్టిచోఁ గృష్ణ భిన్నమైన పదార్థ మేమి యుండును ? బ్రహ్మమునకు 'సత్య' మన్నది స్వరూప లక్షణము. 'జన్మాద్యస్య' యనుట తటస్థ లక్షణమని శ్రీధరులు; దాని నితఁ డంగీకరింపలేదు. జగత్కర్తృత్వముగూడ నతని స్వరూపమందే యుపపన్నమై యున్నందున నది తటస్థలక్షణము గానేరదు. స్వరూప లక్షణమే. మధుసూదన సరస్వతి యద్వైతి యైనను భక్తిసంప్రదాయము వచ్చినపుడు దనవే యైన యమూల్యవిషయము లెన్నో చెప్పినాఁడు. వల్లభాచార్యులు రచించిన వ్యాఖ్యానమునకు 'సుబోధిని' యనిపేరు. భాగవత భాషను గూర్చి వారు 'ఏషా సమాధిభాషా' యనిరి.

'జన్మ అద్యస్య ఆకాశస్య యతః' అని వారి వ్యాఖ్య. 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః' అని శ్రుతి వాక్కు.

'బాలబోధిని' యను పేరిట గిరిధరులు మఱియొక వ్యాఖ్యా

ముగా భాగవతమునకు వ్యాఖ్యాన మొనర్చిరి. వీ రద్వైతులకు ప్రబల ప్రత్యర్థులు. వీరిని సమగ్రముగా నర్థముచేసికొన్నచో నద్వైత భిన్న భావములు ఈషద్భేదముతోఁ జక్కగా నర్థమైనట్లే. వారి వ్యాఖ్యాన మిట్లు సాఁగును. 'జన్మాద్యస్య యతః' అను శ్లోకమందు 'య' చ్ఛబ్ద ప్రయోగ మున్నది. అందుచే తచ్ఛబ్ద మధ్యాహృత మగును. అప్పుడు శ్లోకాన్వయ మిట్లగును-

"అన్వయా దితరతశ్చ, అస్య జన్మాది యతః, యశ్చ అర్థేషు అభిజ్ఞః యశ్చ స్వరాట్-యశ్చ బ్రహ్మహృదా ఆదికవయే తేనే, యం ప్రతిసూరయః ముహ్యంతి. తేజోవారి మృదాం వినిమయః యథా తథా త్రిసర్గః యత్ర మృషా, స్వేన ధామ్నా సదా నిరస్త కుహకం తం సత్యం పరం ధీమహి". 'అన్వయాత్' 'యతో వా ఇమాని భూతాని జాయంతే' మొదలైన శ్రుతి వాక్యములు. 'అహం సర్వస్య ప్రభవః మత్తస్సర్వం ప్రవర్తతే' 'స్రష్టా, పాతా, తథైవాత్తా నిఖిల స్యైక ఏవతు' మొదలైన స్మృతులు. వీని ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వత, ఫలము అనెడు తాత్పర్యమును నిర్ణయించు నైదు కారణములచేత గుణపూర్ణుఁడైన నారాయణుఁడే జగత్కారణ మని నిర్ధారిత మైనది. అంతేకాక 'ఆదికాలీనం' 'చేతనాచేతనాత్మకం జగత్' 'చేతనపూర్వకం కార్యత్వాత్పుత్రవత్' అనెడు అన్వయానుమాన మున్నది. ఈ యనుమానముతో నొక చేతన పురుషుఁడు జగత్కారణ మని నిర్ణీత మగుచున్నది. అతఁ డెవరు? నారాయణుఁడే. తక్కిన రుద్రాదు లెందుకు గారు? వా రందఱును సర్వజ్ఞులు గారు.

'ఇతరతశ్చ'=వ్యతిరేకానుమానము చేతను; వ్యతిరేకానుమాన స్వరూప మిది. 'యచ్చేతన పూర్వకం న భవతి, తత్కార్యం న భవతి యథా నిత్యపదార్థః' అనునదే వ్యతిరేకవ్యాప్తి. ఈ రీతిగా నన్వయ వ్యతిరేకములచేత, అస్య=ప్రత్యక్షమైన సత్యమైన ఈ జగత్తుయొక్క

జన్మాది=జన్మాదులు. ద్వైతుల మతములో సృష్టి స్థితి సంహారములే గాదు పరమాత్మ నడపునవి; ప్రవృత్తి, నియమనము, జ్ఞానము, అజ్ఞానము, బంధము, మోక్షము-ఇవన్నియు నతని యధీనములే.

యతః=ఏ విష్ణువుచే నగుచున్నవో, యశ్చ=ఏ విష్ణువు, అర్థేషు=ఘటపటములు ప్రకృతి, జీవులు మొదలైన వారి విషయమందు, అభిజ్ఞః=సర్వరీతులను దెలిసినవాఁడో. 'యస్సర్వజ్ఞ స్సర్వవిత్ తా న్యహం వేదసర్వాణి న త్వం వేత్థ పరం తప' అను శ్రుతిస్మృతు లిందుకు ప్రమాణము. 'యశ్చ స్వరాట్'-దీనికి నాల్గురీతుల నర్థము చెప్పవచ్చును.

1. ఇతరాపేక్షలేక తనకు తానుగాఁ బ్రకాశించువాఁడు.

2. తనకుఁ దానే రాజు; అతని నియమించువాఁ డెవ్వఁడును లేఁ డన్నమాట.

3. తనయొక్క సృష్టికిఁ గారణమైన మఱియొక యధికారి లేఁడు. అందుచే స్వయంప్రభువు.

4. తనకుఁ దానే తన యిచ్ఛచేత మాత్రమే ప్రకాశపఱచును. మఱి యొకరి యిచ్ఛచేత గాదు.

యశ్చ ఆదికవయే బ్రహ్మహృదా తేనే- చతుర్ముఖుఁ డాదికవి ఎట్లయ్యెను? 'కవిర్యః పుత్రః స ఇమాచికేత' అను శ్రుతి వాక్యమిందుకుఁ బ్రమాణము. దీనితో బ్రహ్మ యాదికవి యని సిద్ధమైనది.

బ్రహ్మ=షడంగసహితమైన వేదరూప శబ్దరాశిని, ఆ సమస్త వేదముయొక్క అర్థభూతమైన పరబ్రహ్మను, హృదా=అనుగ్రహపూర్వకముగా, తేనే=ఉపదేశించెను, యం=ఏ విష్ణువుయొక్క విషయమందు, సూరయః=ఈ కల్పము, గతకల్పములయందలి బ్రహ్మ మొదలైనవారు, గురూపదేశమును బొందిన జ్ఞానులు గూడ ననియు

నర్థము, ముహ్యంతి=వాని యనుగ్రహము లేనిది జ్ఞానమును బొందలేరో; పైఁగా అన్యథా జ్ఞానమును గూడ పొందెదరో, యత్ర=ఏ విష్ణువుయొక్క విషయమందు, తేజోవారి మృదాం=అగ్ని, నీరు, మన్ను-వీనియొక్క, వినిమయః యథా=కార్య మెట్లు సత్యమో, తథా=అట్లే సత్యమైన, త్రిసర్గః=ఈశ్వరసృష్టి, జీవసృష్టి, జడసృష్టి యనెడు మూఁడు విధములైన సృష్టియు సత్యమో; ఈశ్వరసృష్టి యనఁగా నేమి ?

ఒకటే మూలతేజస్సు తన కార్యమైన అరణి మొదలైన పార్థివ పదార్థములయందు అనేకరీతులుగాఁ బ్రవేశించియున్నది. గూఢమై యున్నది. ఘర్షణతో నది వ్యక్త మగుచున్నది. అట్లే శ్రీమహావిష్ణువు జగత్తును సృష్టించి తానే యనేకరూపముల నంది, ఈ జగత్తునందలి సమస్త పదార్థములలో నంతఃప్రవిష్టుఁడై యున్నాఁడు. జీవులయందలి కనికరముతో నతఁడే వాసుదేవాది రూపములతో బయటికి వ్యక్త మగును. సూర్యుఁడు మొదలైన తేజఃపదార్థములకు నీరు మొదలైన యుపాధులు నిమిత్తముగా ననేక ప్రతిబింబము లేర్పడును. అట్లే స్థూల సూక్ష్మాది శరీరము లనెడి ఉపాధులనుండి ప్రతిబింబభూతులైన జీవులు శ్రీహరినుండి జనింతురు. ఇది జీవసృష్టి. కుమ్మరి మట్టిని తీసికొని ఘటాదులను సృష్టించినట్లు ఈశ్వరుఁడు జడప్రవృత్తిని గ్రహించి మహత్తత్త్వము, అహంకారతత్త్వము మొదలైన జడపదార్థములను సృష్టించెను. ఇదే జడసృష్టి. ఈ మూఁడు విధములైన సృష్టులును మృషా=వ్యర్థము; అనఁగా పరమాత్ముఁ డవాప్తసర్వకాముఁడగుటచేత నంతకుముం దతనికిలేని యే ప్రయోజనముగూడ నీ సృష్టితో నేర్పడుట లేదు. కనుక నాతని విషయమందు ఈ పదార్థసృష్టి వ్యర్థము. 'యత్రైవ' పరమాత్మ విషయమందు మాత్రమే వ్యర్థము అనుటచేత పరమాత్మ భిన్నమైన జీవ జడాత్మక ప్రపంచమునకు ఈ త్రిసర్గము-అమృషా=సార్థకము. అనఁగా ఇంతకు ముందు తాము

పొందని ప్రయోజనమును గ్రొత్తగాఁ బొందించును. ఒక అర్థము నందు 'మృషా', రెండవ యర్థమునందు 'అమృషా' అని పదచ్ఛేదము. స్వేనధామ్నా = తన స్వరూపజ్ఞాన మహిమచేత, సదా = నిరంతరమును, నిరస్తకుహాకం = ఇంద్ర జాలాది మాయలనుండి దూరమైన అనఁగా వంచనాదోషదూరుఁడైన యని తాత్పర్యము. సత్యం = దుఃఖము లేనివాఁడు, నిత్యనిరతిశయానందానుభవస్వరూపుఁడు. సత్య శబ్దమునకు వీరిమతములో పదవిభాగ మిట్లు (సత్ = ఉత్తముఁడు, తి = ఆనందము, య = జ్ఞానము), పరం = సకలగుణ పరిపూర్ణుఁడైన నారాయణుని, సర్వోత్తముఁడైననారాయణుని, సకల జగద్భిన్నుఁడైన నారాయణుని, ధీమహి = శ్రవణ మనన నిధిధ్యాసలరూపమైన జిజ్ఞాసతో ఉపాసింతము.

తా. కలియుగమందు జీవరాసుల కజ్ఞానము మొదలైన దోషములు హెచ్చు. తత్ప్రాచుర్యము నణఁచుటకు కరుణాశాలులైన బ్రహ్మ రుద్రాది దేవతలు శ్రీమహావిష్ణువును ప్రార్థించిరి. వారిని మన్నించి విష్ణువు బహుకాలము తపస్సొనర్చి పరిశుద్ధురాలైన సత్యవతీదేవియందు పరాశరుల మూలమున వ్యక్తుఁడై వ్యాసుఁడను నామమునఁ బ్రసిద్ధుఁ డయ్యెను. దైత్యుల దురాగతముచేతను, ఋషుల శాపముచేతను నష్టమైన వేదము లనెడు కల్పవృక్షమును వ్యాసరూప నారాయణుఁడు పునరుజ్జీవింపఁ జేసెను. ఈ యుగమందలి మానవు లల్పమతు లని తెలిసి దయాశాలియై శాఖోపశాఖలుగా వేదములను విభాగించినాఁడు. ఆ వేదార్థ నిర్ణయమునకు బ్రహ్మసూత్రములు రచితము లైనవి. వేదములం దధికారము లేని జనులకై పురాణముల నొనర్చెను. వానిలో ముఖ్యమై వేదాంతతత్త్వమును నిస్సందేహముగ ప్రకటించు శ్రీమద్భాగవతమును రచింప సంకల్పించినాఁడు. కలిదళితములైన భాగవత ధర్మముల కీ గ్రంథము పునఃప్రతిష్ఠ. అయన కే విఘ్నము లున్నవి? తన నిజస్వరూప మాయనకు సర్వదా ప్రత్యక్షము. కాని జ్ఞానులైనవారు గ్రంథ ప్రారంభమునందు మంగళ మాచరించు

టావశ్యకమని తెలుపుటకును, పాఠకులకు సన్మంగళములు ప్రాప్తించుటకును ఇష్టదైవతమైన నారాయణుని వ్యాసరూపియైన నారాయణుఁడు స్మరించుచున్నాఁడు.

లక్ష్మీ బ్రహ్మాది జీవ జడాత్మకమైన ఈ కన్పించు ప్రపంచమునకు యథాయోగ్యముగా సృష్టి స్థితి లయములు నియమన జ్ఞానాజ్ఞానములు బంధమోక్షములు గల్పించువాఁడు శ్రీమన్నారాయణుఁడే. వేదముల తాత్పర్య మిదే. అన్వయ వ్యతిరేక అనుమానముల ద్వారా జగత్కర్త నారాయణుఁ డనియే నిర్ధారితము. జగత్తునందలి సమస్త పదార్థముల, సమస్త విశేషములఁ దెలిసినవాఁ డాతఁడే. ఇతనికి వేఱొక్క నియామకుఁడు లేఁడు. ఇతఁడే ప్రీతితో బ్రహ్మదేవునికి వేదార్థమని చెప్పఁబడు తన స్వరూపము నుపదేశించెను. నారాయణుని యనుగ్రహము లేనిది జ్ఞానులైన బ్రహ్మాదులకును నతని స్వరూపము చక్కగాఁ దెలియదు. ఒక దీపమునుండి వేఱొకదీపము వెల్గింపఁబడినట్లు తన మూలరూపమునుండి వాసుదేవాద్యనంత రూపములు వ్యక్తములగును. నీటియందు ప్రతిబింబములు పడునట్లు స్వరూప మనెడు నుపాధియందుఁ బరమాత్మని ప్రతిబింబములగు జీవు లుందురు. కుమ్మరి మట్టినుండి కుండలు చేయునట్లు శ్రీహరి జడప్రకృతినుండి జడజగత్తును సృష్టించును. ఈ మూఁడు విధములైన సృష్టియు సత్యమే కాని శ్రీమహావిష్ణువునకు నీ కార్యకలాపములచేతఁ గ్రొత్త ప్రయోజన మేమియు లేదు. అందుచే సృష్టి వ్యర్థమని భావించరాదు. జీవుల ప్రయోజనమునకై ఈ సృష్టిని దయామయుఁడైన పరమాత్ముఁ డొనర్చెను. తన మహిమచేతనే తా నెప్పుడును సమస్త దోషములకును దూరుఁడైనవాఁడు. నిత్యముక్తుఁడు. దుఃఖలేశమును లేనివాఁడు. నిరతిశయమైన సర్వశ్రేష్ఠములైన ఆనందాది గుణముల ననుభవించువాఁడు. అందుచే సమస్త గుణగణపరిపూర్ణుఁడు. సమస్త జగత్పాలకుఁడు. సర్వజగద్విలక్షణుఁడు. ఈ రీతి భగవంతుని ఈ భాగవత మూలకముగాఁ బ్రార్థింతు మని తాత్పర్యము.

విశేషార్థములు: 'పరం ధీమహి'. పరం అను శబ్దముచేత శ్రీమన్నారాయణుఁడే ఆధికారికము, అభీష్టమునైన దేవత యని తెల్పినట్లైనది. గ్రంథారంభమం దీ రెండు తెఱఁగులైన దేవతయే నమస్కారార్హము. జ్యోతిశ్శాస్త్ర గ్రంథములలో సూర్యాదిగ్రహ రూపమైన దేవత యాధికారికము. పరమప్రేమ విషయ మైనది, అభీష్టదేవత; శ్రీమన్నారాయణుఁడు. సమస్త ముముక్షుప్రాణులకు సంసారనాశ రూపమైన ఫలము నొసఁగుటకై ఈ భాగవత మనెడు శాస్త్రమందు ప్రతిపాదింపఁబడుచున్నాఁడు. కనుక ఆధికారిక దేవత. 'తదేతత్ప్రేయః పుత్త్రాత్ప్రేయో అన్యస్మాత్సర్వస్మా దంతరం య దయ మాత్మా'-పుత్త్రాదుల కంటెను దక్కిన సమస్త విషయములకంటెను నారాయణుఁడే పరమప్రేమాస్పదుఁ డను శ్రుతివాక్యముచేత పరమప్రేమకు విషయమగుటచేత నభీష్టదేవతగూడ నైనాఁడు. పరుఁడను శబ్దమునకు నారాయణుఁడనియే యర్థము. హరివంశమందు సత్యంతపుని ప్రశ్నకు దుర్వాసుఁడుత్తర మొసఁగుచు పరశబ్దవాచ్యుఁడు నారాయణుఁడే యన్నాఁడు. ఆ శ్లోక మిది-

యదేతత్పరమం బ్రహ్మ వేదవాదేషు పఠ్యతే
స దేవః పుండరీకాక్షః స్వయం నారాయణః పరః.

'బ్రహ్మ విదాప్నోతి పరం' అను శ్రుతి వాక్యమందును, 'బ్రహ్మ', 'పర' శబ్దము లాతనిగూర్చియే యుపయోగింపఁబడినవి. 'ధీమహి' యనుటచే భాగవతశాస్త్రము గాయత్ర్యర్థమే యని చెప్పినట్లైనది. అంతమాత్రమే కాదు. భాగవతము వేదతుల్యము. ఈ విషయమును సూచించుటకే వైదికప్రయోగము జరిగినది. పరశబ్ద మందు చెప్పఁబడిన గుణములనే 'జన్మాద్యస్య యతః' ఇత్యాది విశేషణములతో స్పష్టపఱచు చున్నాఁడు. అలౌకికమైన వస్తువును దెలుపవలెనన్నచో నొక లక్షణము మూలముననే తెలుప వలెను. వేఱుమార్గము లేదు. లక్షణముఁ జెప్పకున్నచో నది శశవిషాణమాత్రమే యగును.

కనుక శ్రీమన్నారాయణుని లక్షణమును జెప్పుటకు 'జన్మాద్యస్య యతః' అను విశేషణమును వాడినాఁడు. 'జన్మాది' యనుటకు సృష్టి స్థితి లయములని మూఁడే యర్థము గాదు.

సృష్టిస్థితిశ్చ సంహారో నియతి ర్జ్ఞాన మావృతిః,
బంధమోక్షౌ చ పురుషాత్ యస్మాత్సహరి రేకరాట్.

అనెడు స్కాంద పురాణ వచనముతో విరోధము ప్రాప్తించును.

ఒకానొక వృద్ధుఁడు గోవున కిది లక్షణమని చెప్ప ననుకొందము. మాణవకుఁ డా లక్షణముతోఁ గూడిన పదార్థము అశ్వాదుల కంటె భిన్నమని గో శబ్దవాచ్య మని తెలియును గదా! అట్లే శాస్త్ర మందుఁ జెప్పిన పరమాత్మలక్షణమును బట్టి జిజ్ఞాసుఁడైనవాఁడు పరుఁడైన హరిని జగజ్జన్మాది కారణ రూపలక్షణయుక్తుఁ డనియు, జీవ జడములకంటెను అత్యంత భిన్నుఁ డనియును, బరశబ్దవాచ్యుఁ డనియును దెలియును. 'శాస్త్రయోనిత్వా' త్తను సూత్రమందు బాదరాయణుఁడు నారాయణుని జగత్కర్తృత్వమునకు శ్రుతిస్మృతులే ప్రమాణమనియు వాని యర్థ ముపక్రమాది సమన్వయముచే సిద్ధించు ననియుఁ దెల్పెను. 'జన్మాద్యస్య యతః' అనుదానిచే నా యర్థమే యనూదితమైనది. రుద్రాదులకును జగజ్జన్మాది కారణత్వము శ్రుతులలో నక్కడక్కడ విన్పించును. కాని అనంత వేదపద సమూహముతో శ్రీమన్నారాయణుఁడే జగత్కారణ మని ప్రతిపాదిత మైనది. 'సర్వే వేదా యత్పద మామనంతి'; 'వేదైశ్చ సర్వైరహ మేవ వేద్యః' అనెడు శ్రుతిస్మృతులే ఈ విషయములకుఁ బ్రమాణము. వైశేషికులు శ్రుతులు పిపీలికాది లిపివంటివి. వానికి నియత ప్రామాణ్యము లేదు. కనుక పరమాణు పుంజమే జగత్కారణము అందురు. ఈ యాక్షేపణకు సమాధానముగనే 'ఇతరశ్చ' అనునది. కేవ లానుమానమే సాధకము గాదు. దానికి ఉపబలముగా ప్రత్యక్షము, ఆగమము అను రెండుఁగూడ నుండవలెను. అట్టి యనుమానముచేతఁ గూడ నారాయణుఁడే జగత్కారణుఁ

డనుట సిద్ధించుచున్నది. పరమాణుపుంజ వాదమును వ్యాసుఁడు 'సముదాయ ఉభయహేతుకేఽపి తదప్రాప్తిః' అనెడు సూత్రముతో ఖండించెను. పరమాణుపుంజ వాదములో శ్రుత్యనుగతమైన అనుమానము లేదు. కేవ లానుమానము సాధకము గాదంటిమి. 'అన్వయా దితరతశ్చ'-ఇక్కడి 'చ'శబ్ద మెందుకు? వేదశ్రుతులవలె అనుమానము గూడ సాధకమే యని ఈ సముచ్చయము దెలుపుచున్నది. జగత్కర్త యెవ్వరని ప్రసిద్ధిలేదు గదా! అతనిని నిరూపించుటకు శ్రుతులే ప్రమాణము. అవి అపౌరుషేయము లగుటచే వాని ప్రామాణ్యమందే సందేహమును లేదు. అట్టి వేదముల యనుగ్రహము చేతఁ గూడిన యనుమానమందు ఏ విధమైన తర్కముచేతను బాధ నాశంకింపఁ గూడదని సముచ్చయము సూచించుచున్నది. ఈ మూఁడు శబ్దములచేత 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' 'జన్మాద్యస్య యతః' 'శాస్త్రయోనిత్వాత్' 'తత్తు సమన్వయాత్' అనెడు మొదటి నాల్గు సూత్రములు వ్యాఖ్యానించిన ట్లైనది. 'ధీమహి' యనుటకు జిజ్ఞాసయే యర్థము. పరమాత్ముని చింతన యనఁగా వేదార్థమును విచార మొనర్చి నిర్ణయించిన గుణముల ధ్యానమే దప్ప వేఱుగాదు. ధ్యానమే జ్ఞానసాధనము. కర్మాదులు గాదు అను విషయముఁ దోపింపఁ జేయుటకే 'ధీమహి' యను పదప్రయోగము; కర్మలచేత శుద్ధమైన మనస్సు గలవాఁడే ధ్యాన మొనర్పఁ జాలును.

'అర్థేష్వభిజ్ఞః'-సాంఖ్యుల ప్రధానము-జగత్కారణముగాదని దీనివలనఁ జెప్పిన ట్లైనది. పాలు, నీరు మున్నగు జడపదార్థములందును జలనము మొదలగు ప్రవృత్తు లున్నవి గదా! కనుక జడప్రవృత్తియే జగత్కారణ మేల కారాదని వారి వాదము. కాని కర్త కెప్పుడును బదార్థములకు సంబంధించిన సమస్త జ్ఞాన ముండవలెను. ప్రధానము జడము. అందుచే జ్ఞానరహితము. విష్ణువు సర్వజ్ఞుఁడనుటలో శ్రుతిస్మృతులే ప్రమాణము. స్వరాట్=రుద్రాది దేవతలును,

వారి వారి యోగ్యతానుసారము సర్వజ్ఞులే. కాని వారు జగత్కార ణముగా లేరు. 'యం కామయే తం త ముగ్రం కృణోమి' లక్ష్మీదేవి యనుగ్రహముచేతనే రుద్రాదులకు జ్ఞానాది గుణములు సంభవించును. అట్టి లక్ష్మీకిని బరమాత్ముని యనుగ్రహము వలననే జ్ఞానాదిప్రాప్తి. మఱియొకరి యధీనములేక జ్ఞానాదిగుణయుతుఁడు శ్రీహరి యొకడే. అతని గుణగతవిశేషము లనంతములు. వానిని పూర్తిగా లక్ష్మీ-బ్రహ్మ మున్నగువారును దెలియ నేరరు. అందుచే వారు నిరవధిక సర్వజ్ఞులు గారు.

'వేదాహమేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమసః పర స్తాత్' అనెడు శ్రుతియందు నారాయణ విషయికమైన జ్ఞానసంపా దనమందు చతుర్ముఖబ్రహ్మకు స్వాతంత్ర్యము చెప్పఁబడినది గదా! అందుచే శ్రీహరి యుపదేశించిన జ్ఞానముచేతనే యతనికి సంబంధిం చిన జ్ఞానోత్పత్తి యగునని ఎట్లు చెప్పవచ్చును? 'యమేవైష వృణుతే తేన లభ్యః' అను శ్రుతియే దీనికి సమాధానము. శ్రీహరి యను గ్రహముచేతనే బ్రహ్మకు వేదార్థజ్ఞాన మబ్బినదని పిండితార్థము. దీనిని సాధించుటకే 'ముహ్యంతి య త్సూరయః' అనెడు ప్రయో గము.

సృష్టికార్యముతోఁ బరమాత్మున కేమి ప్రయోజనము? ప్రయో జనరహితముగాఁ బ్రవర్తించె నందురా? ప్రవృత్తులన్నియుఁ బ్రయో జనము నుద్దేశించియే కదా! 'ప్రయోజన మనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే' సృష్టితో నేదో యొక ప్రయోజన మున్న దందురా? ఆ ప్రయోజన మాతనియం దంతకు ముందు లే దనియేకదా సిద్ధము? అందుచే నపూర్ణుఁడని చెప్పినట్లే యైనది. అపూర్ణుఁ డశక్తుఁడే. అతనితో సృష్టికార్య మెట్లగును? కనుక సృష్టిమాయామయ మనియే యంగీక రింపవలెను. ఈ శంకను బరిహరించుటకొఱకే 'తేజోవారి మృదాం

యథా వినిమయః, తథా త్రిసర్గో యత్ర మృషా' అనునది. భగవంతుని విషయమందు సృష్టి కే ప్రయోజనమును లేదు.

'దేవస్యైష స్వభావోఽయ మాప్తకామస్య కా స్పృహా ।'

'లోకవత్తు లీలాకైవల్యమ్'

అని స్మృతిసూత్రములు చెప్పినట్లు సమస్త ప్రయోజనములు పొందిన శ్రీహరి ప్రవృత్తి కేవలము లీల యనియే చెప్పవలెను. తేజోవారి మృత్తులయొక్క పనులు ఏదో యొక ప్రయోజనమున కగుచున్నవి గదా! కనుక జగత్తు సదసద్విలక్షణ మని చెప్పుటకువీలు లేదు. పరమాత్మునియందున్న ఈ త్రివిధసృష్టియు జీవుల ప్రయోజనమునకే యగుచున్నది. అతని విషయమందు వ్యర్థమే. కుండ అసత్య మైనచో నీరు తెచ్చుట అను కార్యమునకుఁ బనికివచ్చునా? నిరస్తకుహకుఁడైన పరమాత్ముఁడు మాయామయమైన సృష్టిసేయఁడు. సత్యసృష్టినే యొనర్చును. లోకమం దసమర్థులే యింద్రజాలాది కార్యము లొనర్తురు. సమర్థులు సత్యమైనపదార్థమునే చేయుదురుగదా! విష్ణువుపరిపూర్ణ శక్తిగలవాఁడు. ఐంద్రజాలికసృష్టి నతఁ డెందు కొనర్చును? కనుక జగత్సృష్టి 'సదా' విశేషణములతో ముక్తులందు సదా నిరస్తకుహకత్వము లేదని చెప్పిన ట్లైనది. ముక్తు లంతకుఁ బూర్వమం దజ్ఞానబంధము గలవారే కదా! అట్లైనచో లక్ష్మీదేవియు నిత్యనిరస్తమైన అజ్ఞానబంధముఁ గలదే గదా? అందురేమో! తన్నిరాసార్థమే 'స్వేనధామ్నా' అని చెప్పినది. ఆమె నిత్యనిరస్తకుహకత్వము ఆమె స్వసామర్థ్యముచేఁ గాదు. లక్ష్మి మొదలగువా రస్వతంత్రులు గదా! పరమాత్ముని మహిమచేతనే వారు నిత్యముక్తులైనా రని భావము. ఈ శ్లోకమందలి 'ధీమహి' యను ఛాందస పదప్రయోగముతో గాయత్రీ మంత్ర ప్రతిపాద్యుఁడు శ్రీమన్నారాయణమూర్తియే యని తెలిపినట్లైనది. 'చక్షోస్సూర్యో అజాయత' అను శ్రుతివలన సూర్యుఁడు పరబ్రహ్మయొక్క అవయవ జనితుఁడే. వేదాధ్యయనమునకు ముందు

గాయత్రి నెట్లుచ్చరింపవలెనో, అట్లే భాగవత ప్రారంభమందుఁ గూడ గాయత్రీ మంత్రమును జెప్పవలెను అనుటయు దీనిచే సూచితము. తక్కిన పురాణములను బాదరాయణుతే రచించినను వాని యన్నిటి కన్నను దీనికి మహిమ హెచ్చు అని తెల్పుటకే 'ధీమహి' యనెడు ప్రయోగము; వేదసమానమైన ఈ భాగవత వ్యాఖ్యాన ప్రారంభ మందుఁ గొందఱు వ్యాఖ్యానలక్షణము నిట్లు చెప్పిరి -

పరిచ్ఛేదః పదార్థోక్తిః విగ్రహోవాక్య యోజనా,
ఆక్షేపశ్చ సమాధానం ఇతి వ్యాఖ్యానలక్షణమ్.

అతిరిక్తం పదం త్యాజ్యం హీనం వాక్యే నివేశయేత్,
విప్రకృష్టం చ సంధద్యా దానుపూర్వ్యం చ కల్పయేత్.

లింగం ధాతుం విభక్తిం చ యోజయే చ్చానులోమతః,
వాక్యార్థస్యానుసారేణ తేషాం చ ప్రత్యయోపి చ.

ఈ రీతిగా నున్న వ్యాఖ్యానలక్షణము భాగవతవిషయ మందు పనికిరాదు. వేదమునం దెట్లు 'అకః' అను పదము యొక్క స్థాన మందు 'అకరోత్' అని చేర్చుట సాధ్యపడదో, అట్లే ఇక్కడ గూడ ఒకపదమును విడిచి వేఱుపదమును జేర్చుటకు వీలుగాదు. దీనియందు వాడఁబడిన యే పదమును వ్యర్థమైనది లేదు. కనుక ఇతరగ్రంథ ములనువలె భాగవతమును వ్యాఖ్యానింప రాదు. మధ్వాచార్యులు దా మొనర్చిన వ్యాఖ్యానపద్ధతికి తంత్రభాగవతము నుండి ప్రమాణము ని ట్లుదాహరించినాఁడు-

తత్ర భాగవతే చ-
సృష్టిస్థిత్యప్యయేహా దేః శ్రుతిస్మృతి సమన్వయాత్,
యుక్తిత శ్చేత్స్వ పూర్వాదేః శ్రీబ్రహ్మభవపూర్విణః.

సుర గంధర్వ మనుజ పితృ దైత్యాత్మనః పృథక్,
కర్తా విష్ణు రజో నిత్య స్సర్వజ్ఞత్వా న్న చాపరః.

అనన్యాధిపతి శ్చాసౌ గరీయాన్ బ్రహ్మణో యతః,
తత్ప్రసాదమృతే తస్య నాన్యో వేత్తాఽస్తి కశ్చన.

తేజసో రూపవ ద్రూపం బహుధా కురుతే హరిః,
వారిస్థ తేజః ప్రతిమా జీవా స్తస్మా ద్వినిర్గతాః.

కులాలేన మృదా యద్వ న్నిర్మీయంతే ఘటాదయః,
విష్ణు నైవం ప్రకృత్యైవ నిర్మ్యతే జగ దీదృశమ్.

ఏష త్రిసర్గో విష్ణోస్తు వృథా లోకస్య చాఽవృథా,
ఇంద్రజాలవిధాం సృష్టిం మన్యంతే జ్ఞానదుర్బలాః.

నిత్యం నిరస్తేంద్రజాలే స్వత ఏవ కథం భవేత్,
అక్షమాః సత్యసృష్టౌహి మాయాసృష్టిం వితన్వతే.

అనంతాచింత్య విభవః కథం తా మిహ తే హరిః,
నిర్దుఃఖ పూర్ణానందత్వా ద్య మాహు స్సత్య మచ్యుతమ్.

నిర్దోషగుణపూర్ణత్వా త్పరం చాహు ర్జనార్దనమ్,
ఏవం విధోఽనుభావోయః స కథం నిందితం సృజేత్.

స్వప్నాధికం పరో దేవః ప్రాణాదిస్థ స్తనోత్యసౌ,
కేవలస్య పరస్యాఽస్య మాయాసృష్టి ర్న యుజ్యతే.

తస్మా ద్బాధాయుతా స్సర్వే స్వప్నాద్యాయేత్వ కేవలాః,
ఇదం న బాధ్యతే సర్వం జగ త్కేవలజం యతః.

మోక్షవ త్కేవలస్యాఽస్య శక్త్యా సమ్య గ్విజృంభితమ్,
ఏత ద్రహస్యం పరమం బ్రహ్మసూత్ర పదోదితమ్,

యే త్వేవం న విజానంతి తే హి యాంత్యధమం తమః,
యే త్వేతదభ్యసూయంతో నాఽనుతిష్ఠంతి మే మతమ్.

సర్వజ్ఞాన విమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః,
యే త్వేత దనుతిష్ఠంతి పారంపర్యగతం మమ,
తే యాంతి పరమం స్థానం మయైవోదిత మంజసా.

లక్ష్మి, బ్రహ్మ, రుద్రుడు మొదలైన దేవతలు, గంధర్వులు, మనుష్యులు, పితరులు, దైత్యులు మొదలైన జగత్తుయొక్క సృష్టి స్థితి లయములు; ఇచ్ఛ మొదలైన వాని కన్నిటికిని జన్మరహితుఁడైన విష్ణువే కర్త. అతఁడు నిత్యుఁడు (ఈ మాటలలో 'జన్మాద్యస్య యతః' అను దానిని చెప్పినట్లైనది). శ్రుతి స్మృతులకు సరిగా నన్వయించికొని వాని తాత్పర్యము దెలియుటచేతను (దీనితో 'నన్వయాత్' అను శబ్దము వివరింపఁబడినది) వివాద విషయమైన కార్యము చేతన సహాయము వలననే జరుగును.

'వివతం కార్యం చేతనకర్తృకం కార్యత్వాత్ ఘటవత్' అను యుక్తి చేతను పరిశేషానుమానము చేతను (దీనితో 'ఇతరతః' అను పదము వివృతమైనది). శ్రీహరియే జగత్కర్త యని తెలియవచ్చుచున్నది. అతఁడే సర్వజ్ఞుఁడు. అందుచే తప్పిన్నుఁడు జగత్కర్త గానేరఁడు ('అర్థేష్వభిజ్ఞః' అనునది వివరింపఁబడినది). శ్రీమహావిష్ణువుపై మఱియొక్కఁ డధికారి లేఁడు (స్వరాట్ అనుదాని వివరణము). బ్రహ్మదేవుని కంటె నతఁడు శ్రేష్ఠుఁడు (తేనే బ్రహ్మహృదాయ ఆదికవయే అను దాని వివరణము).

పై విషయము లన్నియుఁ బరమాత్మయొక్క సర్వగుణపూర్ణతకుఁ గారణములు; వాని యనుగ్రహము లేనిదే వాని నెవ్వరును దెలియలేరు (ముహ్యంతి య త్సూరయః అనునది గతార్థము). తేజోరూపమునకు సమములైన తన రూపములను శ్రీహరి వాసుదేవాద్యనేకరీతులఁ దోపింపఁజేయును. నీటియందుఁ గనఁబడు తేజోమయమైన సూర్యుని ప్రతిబింబము వలె పరమాత్ముని ప్రతిబింబములుగా జీవు లుదయమైరి; కుమ్మరి మట్టినుండి కుండలను జేయునట్లు, విష్ణువు జడప్రకృతినుండి జడసృష్టి నొనర్చును; ఈ త్రిసర్గమును అవాప్తసర్వకాముఁ డగుటచేఁ బరమేశ్వరుని యందు లీలయైనను జీవుల ప్రయోజనము కొఱకే యగుచున్నది; కనుక పరమాత్ముని విషయమందుఁ

ప్రయోజనరహితమగుటచే మృష; జీవుల విషయమందుఁ బ్రయోజన యుక్తమగుటచే నమృష. కొందఱీ మృషాశబ్దమునకు సృష్టి యైంద్రజాలికము వంటిదని వ్యాఖ్యానింతురు. అది సరిగాదు; వాఁడు సదా నిరస్తకుహకుఁడు. కపటముల నుండి దూరమైన వాఁడు, మాయామయమైన సృష్టి నొనర్పఁడుగదా! అందుచే మాయామయముగాదు. స్వప్నమునం దారోపితమైన జాగ్రదవస్థ ప్రాజ్ఞుఁడైన పరమాత్మతో నగుచున్నది. 'ఇంద్రజాలము' మాయావియైన పురుషుని యందున్న పరమాత్ముని చేతన నగుచున్నది కాని జగత్తు సాక్షాత్తుగాఁ బరమాత్మ నుండియే సృష్టమైనది. స్వప్న జాగ్రద్వాదులు ఇతరుల యందున్న పరమాత్మ నుండి ప్రదర్శితము లగుచున్నవి. ఆ కారణముచేత నవి బాధితములై సత్యములు గాకపోవచ్చును. కేవల పరమాత్మనుండియే సృష్టమైన ఈ జగత్తు అట్లు బాధిత మగుటకు వీలులేదు. సాక్షాత్సృష్టి యగుటచే నిది సత్యము. ఈ మొదటి శ్లోకమునకుఁ బోతనామాత్యుల యనువాద మిట్లున్నది–

సీ. విశ్వ జన్మ స్థితి విలయంబు లెవ్వని
  వలన నేర్పడు ననువర్తనమున
వ్యావర్తనమునఁ గార్యములం దభిజ్ఞుఁడై
  తాన రాజగుచుఁ జిత్తమునఁ జేసి
వేదంబు లజునకు విదితముల్ గావించె
  నెవ్వఁడు బుధులు మోహింతు రెవ్వ
నికి నెండమావుల నీటఁ గాచాదుల
  నన్యోన్యబుద్ధి దా నడరునట్లు

ఆ. త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము
భంగిఁ దోఁచు స్వప్రభానిరస్త
కుహకుఁ డెవ్వఁ డతనిఁ గోరి చింతించెద
నజుని నిత్యుఁ బరము ననుదినంబు.

పోతన్నగారు సామాన్యముగా శ్రీధరవ్యాఖ్యనే అనుసరింతురు. ఒక్కొకసారి దమ స్వాభిప్రాయమును గూడ ననుసరించుట గద్దు. మూలశ్లోకమును 'జన్మాద్యస్య యతః' అని యారంభించినట్లే వీరును దటస్థ లక్షణముతోనే పద్యము నారంభించుచున్నారు. 'అస్య విశ్వస్య జన్మస్థితి భంగాః యతః పరమేశ్వరా ద్భవంతి' అని శ్రీధరులు. అతని యడుగుజాడలలోనే 'విశ్వజన్మ స్థితి విలయంబు లెవ్వని వలన నేర్పడు' నని పోతనామాత్యుఁడు అనువర్తనమున వ్యావర్తనమునన్ అనుటయును శ్రీధరీయమే. కార్యములం దభిజ్ఞుఁడై, అర్థేషు=ఆకాశాది కార్యేషు అభిజ్ఞః అని శ్రీధరుఁడు. కార్యములం దభిజ్ఞుఁడై యని పోతన; స్వరాట్=స్వేనైవ రాజతే యః అనుదానికి దెనుఁగు 'తాన రాజగుచు' ననునది. 'చిత్తమునఁ జేసి వేదంబు లజునకు విదితంబు గావించె నెవ్వఁడు' ఇదంతయు 'బ్రహ్మహృదాయ ఆదికవయే'యనుట.

'యస్మిన్ శబ్దబ్రహ్మణి సూరయోఽపి ముహ్యంతి' అని శ్రీధరుఁడు వ్యాఖ్యానింపఁగా 'బుధులు మోహింతు రెవ్వనికి' అని పోతన్న తనదే యైన మార్గము ద్రొక్కెను. 'ఏ పరమాత్మ విషయ మందు వాని లీలామోహితులై బుధులు గూడ నొక్కొకసారి భ్రమ పడుదురో!' యని యర్థము. త్రిగుణసృష్టి యనునది శ్రీధరీయమే. 'సత్యముభంగి దోఁచు' ననుటయు నతని యనుసరణమే. 'స్వప్రభా నిరస్తకుహకుఁ డెవ్వఁడు?' గూడ శ్రీధరుని వ్యాఖ్యానమే. అకాడమీ ప్రతిలో 'అనఘు విశ్వమయుని ననుదినంబు' అను పాఠమును వారు గ్రహించిరి. 'అనఘ-విశ్వమయ' శబ్దములకు మూలముతో సంబంధమును లేదు. 'అజుని నిత్యుఁ బరము ననుదినంబు' ననుట నాకు జ్ఞాపకమున్న పాఠము. నా దృష్టిలో నదియే సరిగా దోఁచుచున్నది.

'అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణః' అను గీతావచనము నందికొన్నట్లున్నది. 'పర'శబ్దము మూలములోనిదే; అజ-నిత్య శబ్దములు రెండును 'సత్య'శబ్దమునకు వ్యాఖ్యానములు. 'అనుదినంబు'

అనునది 'సదా' అను దాని వివరణము. పోతనామాత్యుఁడు 'సదా ధీమహి' అని యన్వయించికొన్నట్లున్నది.

తెనుగువచనము: "సత్యం పరంధీమహి యను గాయత్రీప్రారంభంబున గాయత్రీ నామ బ్రహ్మరూపంబై, మత్స్యపురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును వృత్రాసురవధంబును నెందుఁ జెప్పంబడు నదియ భాగవతం బని పలుకుటం జేసి ఈ పురాణంబు శ్రీమహాభాగవతం బన నొప్పుచుండు.

సత్యశబ్దముచేత గాయత్రీమంత్రమున కాదిపదమైన తత్పదము చెప్పఁబడినది. 'తత్సత్యమిత్యాచక్షతే' అని శ్రుతి. 'పరం' అను దానిచేత వరేణ్యమను పదము వ్యాకృతము. ధీమహి యనున దట్లే ప్రయోగింపఁబడినది. కనుక సత్యం పరం ధీమహి అను శబ్దములచేత సూచింపఁబడిన గాయత్రీమంత్రముతో నారంభించుటవలన 'గాయత్రీ నామ బ్రహ్మరూపంబై'- గాయత్రి యనెడు పేరుగల వేదస్వరూపమై అనఁగా వేదాధ్యయనము గాయత్రిరూపమైన ఓంకారముతో నారంభింతురు. శ్రీమహాభాగవతము గాయత్రీమంత్రమునకు విస్తృతమైన వ్యాఖ్య యని యభిజ్ఞమతము. మత్స్యపురాణమందు పురాణదాన మహాత్మ్య సందర్భములో నీ శ్లోక మున్నది-

యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మవిస్తరః,
వృత్రాసుర వధశ్చాపి యత్తద్భాగవతం విదుః.

గాయత్రి నధికరించి అనఁగా గాయత్రీ మంత్రముతో నారంభమై యని యర్థము. భక్తిరూపమైన మహాధర్మ మెందు ప్రపంచింపఁబడుచున్నదో, పరమభక్తుఁడైన వృత్రాసురునివధ యెందు చెప్పఁబడుచున్నదో అదియ భాగవత మని పిలువఁబడుచున్నది. అట్లగుటచే నిదియే శ్రీమహాభాగవతము.

శ్లో. ధర్మః ప్రోజ్ఝిత కైతవోఽత్ర
పరమో నిర్మత్సరాణాం సతాం
వేద్యం వాస్తవ మత్ర వస్తు శివదం
తాపత్రయోన్మూలనమ్,
శ్రీమద్భాగవతే మహామునికృతే
కిం వా పరై రీశ్వర
స్సద్యో హృద్యవరుధ్యతేఽత్ర
కృతిభి శ్శుశ్రూషు భిస్తత్క్షణాత్. 2

మహామునికృతే=మహామునిచే రచింపఁబడిన, అత్ర శ్రీమద్భాగవతే=ఈ శ్రీమంతమైన భాగవతమందు, నిర్మత్సరాణాం=మాత్సర్యము లేనట్టి, సతాం=సత్పురుషులయొక్క, ప్రోజ్ఝితకైతవః=కపటము లేనట్టిదైన, పరమఃధర్మః=ఉత్కృష్టమైన ధర్మము (అస్తి=ఉన్నది), వాస్తవం=సత్యమైనదియు, శివదం=మంగళము లొసఁగూర్చునదియు, తాపత్రయోన్మూలనం=మూఁడు విధములైన తాపములను సమూలముగా నశింపఁ జేయునదియునైన, వస్తు=తత్త్వము, అత్ర=దీనిలో, వేద్యం=తెలియఁదగినది, పరైః=ఇతరములచేత, కిం?=ఏమి ఫలము?, కృతిభిః=పుణ్యవంతులును, శుశ్రూషుభిః=వినుట కిచ్ఛగించుచున్నట్టి జనులచేత, తత్క్షణాత్=అప్పుడే, హృది=మనస్సునందు, ఈశ్వరః=ఈశ్వరుఁడు, సద్యః=హఠాత్తుగా, అవరుధ్యతే=అవరోధింపఁబడును. సాక్షాత్కరించునని తాత్పర్యము.

తాత్పర్యము : వ్యాసుఁడు మహర్షులలో శ్రేష్ఠుఁడు. భాగవతము తత్కృతము. ఈ మహాభాగవతమందు మాత్సర్యము మొదలగు దోషవృత్తులు సమూలముగ నశించి పరమశుద్ధులైన సత్పురుష లను క్షించునదియు, ఫలాకాంక్షలేనిదియునైన భక్తిమార్గరూపమైన ధర్మము ప్రతిపాదింపఁ బడుచున్నది. ఎప్పుడును నశింపని మంగళమును గల్గించి యాధ్యాత్మికము, అధిభౌతికము, అధిదైవికము ననెడు త్రివిధ

దుఃఖములకును మూలకారణమైన యహంకారగ్రంథిని సమూలముగ నశింపఁజేసి పరమానందము నొసఁగు పరమార్థవస్తువైన బ్రహ్మస్వరూపము దీనినుండి తెలియసగును. అందుచే దీనిని వదలి ఇతర గ్రంథముల నాశ్రయించియో ఏతద్ధర్మానుష్ఠానమును వదలి అన్యధర్మముల నాశ్రయించియో శ్రమపడవలసిన యావశ్యకత లేదు. ఇదియొక్కటే సమస్త శ్రేయముల నొడఁగూర్పఁ జాలును. అనేక జన్మ సంసిద్ధమైన పుణ్యము ఫలపరిపాకమునకు వచ్చినపుడు మాత్రమే భాగవత శ్రవణ తాత్పర్య మేర్పడును. అట్టి జనులహృదయములం దీశ్వరుఁడు సుస్థిరుఁడై వసించును. దీనికంటె పొందఁదగిన గొప్పసిద్ధి ఏదియు లేదు గనుక శ్రీమహాభాగవత మొక్కటే పరమపురుషార్థము నిచ్చుటకు సమర్థమైన దని పిండితార్థము; దీనికి శ్రీధరుల వ్యాఖ్యాన మిట్లు సాగినది.

అవతారిక యిది: ఇప్పుడు శ్రోతృప్రవర్తనము కొఱకై శ్రీమహాభాగవతము కర్మ జ్ఞాన ఉపాసనాకాండము లనెడు మూటియందునుఁ జెప్పఁబడిన విషయములుగల సర్వశాస్త్రములకంటెను శ్రేష్ఠ మని ప్రతిపాదింపఁ బడుచున్నది. 'శ్రీమద్భాగవతే' సుందరమై ముముక్షువుల కతి రమణీయమైనట్టి భాగవతమందుఁ బరమధర్మము నిరూపింపఁబడుచున్నది. పరమత్వ హేతువును దెల్పుచున్నాఁడు ప్రోజ్ఝితకైతవః= ప్రకర్షముగా నుజ్ఝితమైన ఫలాభిసంధిలక్షణ మనెడు కపటముగలది. 'ప్ర' శబ్దముచేత మోక్షాభిసంధిగూడ నిరస్తమైనదని యర్థము. అనఁగా మోక్షమునందును అభిలాష లే దన్నమాట!

కేవల మీశ్వరారాధన లక్షణమైన ధర్మమిందు నిరూపింపఁబడుచున్నది. అధికారమును బట్టియు భాగవత ప్రతిపాద్య ధర్మమునకుఁ బరత్వమును జెప్పుచున్నాఁడు. 'నిర్మత్సరాణాం' పరోత్కర్ష అసహనమే మత్సరము. అది లేనివారికి, సతాం=సర్వభూతములయందును దయగలవారికి ఈ మాటతోఁ గర్మకాండ విషయకములైన శాస్త్రముల

కంటెను భాగవతమునకు గొప్పతనము ప్రతిపాదితమైనది. జ్ఞానకాండ విషయముల కంటెను శ్రేష్ఠత్వమును జెప్పుచున్నాఁడు. వాస్తవం= పరమార్థభూతమైనట్టి, వస్తు=వస్తువు, వేద్యం=దీనినుండి తెలిసికొనఁ దగినది.

వైశేషికాదులందు వలె ద్రవ్య గుణాదిరూపము గాదన్నమాట. లేక వాస్తవశబ్దమునకు అర్థాంతమును జెప్పుచున్నాఁడు. వాస్తవశబ్దమునకు మూఁడర్థము లిచ్చుచున్నాఁడు.

1. వస్తువుయొక్క అంశమైన జీవుఁడు.

2. వస్తువుయొక్క అంశమైన మాయ.

3. వస్తువుయొక్క కార్యమైన జగత్తు.

ఈ మూఁడును వస్తువు లే. ఇవి పరమాత్మకంటె భిన్నములుగావని తెలియఁబడవలెను. అది ఈ గ్రంథముచే సులభముగనే తెలియుటకు సాధ్యమగును. దానినుండి గలుగు ఫలమేమి? ఫలమునే వివరించుచున్నాఁడు. 'శివదం' పరమసుఖద మన్నమాట. అంతేకాదు ఆధ్యాత్మికాది తాపత్రయములను బూర్తిగాఁ దొలఁగించునది. దీనితో జ్ఞానకాండ విషయములకంటెను భాగవతము గొప్పదని చెప్పినట్లైనది. కర్త్రపేక్షతోను శ్రేష్ఠత్వమును జెప్పుచున్నాఁడు. మహామునికృతే-మహాముని=శ్రీమన్నారాయణుఁడు. అతనిచేత మొట్టమొదట చతుశ్శ్లోకీ రూపమున సంక్షేపముగా కృతమైన దన్నమాట. ఉపాసనాకాండమునకంటెను గొప్పతనమును జెప్పుచున్నాఁడు. కిం వా పరైః ఇతరశాస్త్రములచేతఁ గాని, ఈశ్వరః=ఈశ్వరుఁడు, హృది=మనస్సునందు, కిం వా సద్య ఏవ=అవరుధ్యతే? ఇక్కడ 'వా' శబ్దము కాపత్యలక్షణమైన కాక్వర్థము. అనఁగా వెంటనే హృదయమునందు స్థిరీకరింపఁ బడుచున్నాఁడా? లేదని తాత్పర్యము. మఱి యెప్పుడు? చాల ఆలస్యముగ అతిప్రయాసముతో, అత్ర=ఇక్కడుందామా? శుశ్రూ

షభిః = వినుట కిచ్ఛామా|తము గలిగిన వారిచేత, తత్క్షణాదేవ అవ రుధ్యతే = వెంటనే మనసున స్థిరీకరింపఁ బడుచున్నాఁడు. అట్లైనచో నందఱును దీనినే ఎందుకు వినరు? కృతిభిః = శ్రవణేచ్ఛ పూర్వపుణ్య సంచయములేక ఏర్పడదని భావము. కనుక కాండత్రయార్థములను భాగవత మొక్కటే తత్త్వఫలములందు యథావత్ప్రతిపాదన మొన ర్చుటచేత సర్వశాస్త్రములకంటె నిదియే శ్రేష్ఠము. ప్రతిదిన మిదియే వినఁదగిన దని భావము.

**వంశీధరుని భావార్థదీపిక :**

వైశేషికాది శాస్త్రములుగూడ వాస్తవమైన వస్తువును దెల్పుటకే యుద్యుక్తములైనవి కదా! సర్వపదార్థ నిరూపణముచేత తత్త్వాదార్థము వీని యన్నింటికంటెను భిన్నమైన దని సిద్ధాంతిత మగుచున్నదిగదా! కనుక పదార్థవివేచనా రూపములైన వైశేషికాదులు వ్యర్థము లెట్లగునని ప్రశ్న? శాస్త్రాంతరములందుఁ జెప్పఁబడిన సాధనలతోఁ బరమార్థమును సంపాదించుట దుశ్శకము అని సమాధానము. అవాస్తవ వస్తుచింతన ముతోఁ బరమ పురుషార్థసిద్ధి లభి పదని భావము. కనుక వానియం దాసక్తిని వదలి ముముక్షువులు దీనినే నిరంతరము చింతించవలెనని తాత్పర్యము. తాపత్రయములు మూఁడు. ఆత్మనుగాని, శరీరమును గాని, అంతఃకరణమును గాని యధికరించి యే బాధ యేర్పడునో యది యాధ్యాత్మికతాపము. వాతపిత్తాది కోపజన్యము లేక కామాది జన్యము; ప్రాణుల నాధారముగఁ జేసికొని ఏ తాప మేర్పడుచున్నదో అది యాధిభౌతికము; వ్యాఘ్రచోరాదులచేత నేర్పడునది. దేవతలు అగ్న్యాదులు వాని నాధారముగా జేసికొని జనించునది ఆధ్యాత్మిక తాపము. దాహ శీతాది కృతము లేక యక్ష రాక్షస గ్రహావేశ నిబంధనము; ఇతర శాస్త్రశ్రవణముచేత దేవతాంతరములే మనస్సు నాశ్రయించును. దీని శ్రవణముచేత సాక్షాచ్ఛ్రీహరియే మనస్సు నావేశించును. భక్తియే పరమధర్మము. 'సవై పుంసాం పరో ధర్మో

యతో భక్తి రధోక్షజే' అని భాగవతము. భగవంతునియందు భక్తి దేనివలన నేర్పడుచున్నదో అదియే సర్వోత్కృష్టమైన ధర్మము.

భాగవతము ప్రధానముగాఁ బ్రతిపాదించునది శ్రీకృష్ణపాదారవింద భజనరూపమైన భక్తియోగము. కనుక భక్తియోగ పరముగాఁ గూడ నీ శ్లోకమును వ్యాఖ్యానింప వీలున్నది. దాని యన్వయమిట్లు-

మహాముని కృతే భాగవతే, అత్ర పరమః ప్రోజ్ఝిత కైతవః ధర్మః అస్తి, అత్ర నిర్మత్సరాణాం సతాం, శివదం తాపత్రయోన్మూలనం శ్రీమత్, వాస్తవం వస్తు వేద్యం (అస్తి) పరైః ఈశ్వరః, హృది సద్యః అవరుధ్యతే కిం వా? అత్ర శుశ్రూషుభిః కృతిభిః తత్క్షణాత్ (ఈశ్వరః హృది అవరుధ్యతే).

అన్వయార్థము: మహామునికృతమైన యీ భాగవతమందు పరమమును ప్రోజ్ఝితకైతవమైన ధర్మ మున్నది. దినియందు నిర్మత్సరులైన సత్పురుషులకు శివదమును, తాపత్రయోన్మూలనమును, శ్రీమంతమును, వాస్తవము నైన వస్తువు వేద్య మగును. ఇతరముల చేత ఈశ్వరుఁడు మనస్సునందు వెంటనే యవరోధింపఁ బడునా? లేదు. దీనియందు శుశ్రూషువులైన కృతులచేత తత్క్షణమే ఈశ్వరుఁడు హృదయమం దవరోధింపఁ బడును.

అన్వయపదార్థముల కర్థము: మహామునికృతే=మహాత్ములైన నారదాది మునివరులచేతఁ బ్రవర్తింపఁ జేయఁబడినది, భాగవతం=భగవంతుఁడైన విష్ణువును భజింపవలసిన క్రమము భక్తియోగము, అత్ర పరమః='అత్రపులు' అనఁగా లజ్జలేనివా రన్నమాట, రమః=వారు రమించునట్టిది ఆనందించునది, ప్రోజ్ఝితకైతవః=వ్యాజము లేశమాత్రమును లేనిది అయిన ఈ భక్తియోగము, నిర్మత్సరాణాం=అసూయ, మాత్సర్యము మున్నగు దోషములు లేనివారు, సతాం=

అట్టి భూతదయావంతులకు, శివదం = పరమ మంగళము నొడఁ గూర్చునది, తాపత్రయోన్మూలనం = కామాది దుఃఖముల హరింపఁ జేయునది, శ్రీమత్ = శ్రీతోఁ గూడినది. శ్రీ యనఁగా నిచ్చట రాధా దేవి బృందావనమందు కృష్ణస్వరూప శక్తిప్రాదుర్భావములు, వ్రజ వనితలు: బ్రహ్మసంహితలో నిట్లున్నది-

**ఆనంద చిన్మయ రసప్రతిభావితాభిః**
**తాభి ర్యఏవ నిజరూపతయా కలాభిః,**
**గోలోకయేవ నివసత్యఖిలాత్మభూతో**
**గోవింద మాదిపురుషం త మహం భజామి.**

ఆనంద చిన్మయ రసప్రతిభావితలైన గోపికల కలాశక్తి చేత శ్రీకృష్ణుఁడు వ్రజభూమియందు లీల లొనర్చును. వా రెట్టివారు?

లక్ష్మీ సహస్ర శతసంభ్రమ సేవ్యమానమ్

లక్ష్మీసహస్రశతసంభ్రమములు గలవారు. వారితో శ్రియః కాంతాకాంతుఁడైన పరమపురుషుఁడు ఏకాంతవల్లభుఁడుగా రమించును. భవిష్యోత్తరమల్లద్వాదశీ ప్రసంగములో శ్రీకృష్ణసంవాద మందీ శ్లోక మున్నది. ఆ గోపికల నామము లెట్టివి?

**గోపీ నామాని రాజేంద్ర! ప్రాధాన్యేన నిబోధమే,**
**గోపాలీ పాలికా ధన్యావిశాఖా ధ్యాననిష్ఠికా.**
**రాధాఽనురాధా సోమాభా తారకాదశమీ తథా,**

స్కాందమందును, ప్రహ్లాదసంహితలో 'లలితో వాచ' అనియారంభించి-

**"లలితా, శ్యామలా, ధన్యా, విశాఖా, రాధా, శైబ్యా, పద్మా, భద్రేతి"**

అని ఎనిమిదిమంది పేర్లిన్వఁ బడినవి. ఆగమములందు 'వనితా శతకోటిభిః' అన్నాఁడు. బృందావనమందు రాధికాదేవికే పరమలక్ష్మీత్వము. ఆమెయే బృందవనాధీశ్వరి. పాద్మమం దిట్లున్నది-

బృందావనాధిపత్యం చ దత్తం తస్మై ప్రతుష్యతా,
కృష్ణే నాన్యత్ర దేవి తు రాధా బృందావనే వనే.

బృహద్గౌతమీయమందుఁ గూడ నిట్లు గలదు. బలదేవునితోఁ గృష్ణుఁ డనుచున్నాఁడు—

సత్త్వం తత్త్వం పరత్త్వం చ తత్త్వత్రయ మహం కిల,
త్రితత్త్వరూపిణీసాఽపి రాధికా మమవల్లభా.

ప్రకృతేః పర ఏవాఽహం సాపి మచ్ఛక్తిరూపిణీ,
సాత్త్వికం రూప మాస్థాయ పూర్ణోహం బ్రహ్మచిత్పరః.

బ్రహ్మణా ప్రార్థిత స్సమ్య క్సంభవామి యుగే యుగే,
త్వయా సార్థం త్వయా సార్థం నాశాయ దేవత్మాదుహామ్,

ఇచ్చట సత్త్వ మనఁగా కార్యత్వము. తత్త్వము కారణత్వము. దానికైనను పరమైన తత్త్వము అనఁగా కార్యకారణాతీతమైన తత్త్వ మన్నమాట. ఆ మూఁడును నేనే; అందులోనే రాధనుగురించి ఇంకను

దేవీ కృష్ణమయీ ప్రోక్తా రాధికా పరదేవతా,
సర్వ లక్ష్మీమయీ సర్వకాంతి స్సమ్మోహినీ పరా.

అని యున్నది.

ఋక్పరిశిష్ట శ్రుతియును:

'రాధయా మాధవో దేవో మాధవే నైవ రాధికా, విభ్రాజంతే జనేష్వా యితి' అని గలదు. 'విభ్రాజతే ఆ సర్వతః' అని శ్రుతి పదార్థము.

కనుక రాధాదేవి స్వామియొక్క పరమానంద శక్తిరూపిణి. శ్రీమత్ అనఁగా రాధాదేవీ సహితమైన దని యర్థము. వాస్తవం = సత్యమైన, వస్తు = తత్త్వము, కృష్ణస్వరూపమని తాత్పర్యము. వేద్యం = తెలియఁబడుచున్నది. పరం = ఇతరము అనఁగా కర్మయోగాదులు.

వ్యాసుఁడు శిష్యులను ముముక్షువుల నుద్దేశించి చెప్పుచు న్నాఁడు. ఈ శ్లోకమును మూఁడు భాగములుగా విభాగించుకొన వచ్చును.

1. ధర్మః ప్రోజ్ఝిత కైతవో౽త్ర పరమః
2. నిర్మత్సరాణాం .... .... .... తాపత్రయోన్మూలనమ్
3. శ్రీమద్భాగవతే .... .... ....

అని తక్కిన దంతయు నొక భాగము.

ఓ ముముక్షువులారా! భక్తియోగ మన్నదే సమస్త ధర్మముల సంపుటి; దీనిని దృఢముగా మనసునం దుంచికొనుఁడు. శ్రీమహా విష్ణువును పూజించుట, స్తుతించుట, సమస్కరించుట మొదలైన కార్య ములు భక్తియోగమున కంగములు. గట్టిగా నామసంకీర్తన మొన ర్చుట, సాష్టాంగపడుట అను నీ కార్యములందు లజ్జింపని వారికి వారి మనస్సులం దానంద ప్రాదుర్భావ మగును అట్టి వైష్ణవులు ఈ భక్తియోగమందు రోమాంచకంచుకితులై యానందనర్తన మొనర్తురు. భక్తి లేని వారికి గట్టిగా నామోచ్చారణ సేయుట మొదలగు పనులలో సిగ్గు వొడమును. అట్టివారు లజ్జింపఁదగిన యనేక కార్యములందు లజ్జించుట లేదు. నిర్భయముగా వానియందుఁ బ్రవర్తింతురు; అను చితాలాపము, పరదార గమనము, మోసముచే ఇతరుల వస్తువుల నపహరించుట మొదలైన నీచకార్యము లొనర్చుటలో వారికి లజ్జ వొడమదు. ఈశ్వరారాధనయందుఁ దాము ప్రవర్తింపకుండుటే గాదు. ప్రవర్తించు వారినిగూడ వా రవహేళన మొనర్తురు.

నామోచ్చారేఽథ సాష్టాంగ ప్రణతౌ శ్రీహరేః నృణామ్,
అభక్తానాం యథా లజ్జా జాయతే న తథా ధ్రువమ్.
మృషోక్తౌ వ్యభిచారాదౌ భక్తానాం త్వ న్యథా తతః

విష్ణుభక్తులు లోకనింద్యములైన కార్యము లొనర్చుటకు లజ్జిం తురు. ఈశ్వరారాధనమందు వారు నిస్త్రపులు. పై శ్లోకములు 'శ్రీహరి

భక్తిప్రదీపము'లోనివి. కుంతీదేవి భాగవతమందు కృష్ణభగవానునితో నిట్లు మొఱపెట్టుకొనుచున్నది-

జన్మైశ్వర్య శ్రుత శ్రీభిరేధమానమదః పుమాన్,
నైవార్హత్యభిధాతుం వై త్వా మకించన గోచరమ్.

జన్మచే మద మెచ్చును. ఐశ్వర్యముచే పొగ రేర్పడును. లక్ష్మితో మానవుడు మదాంధుఁ డగును. విద్య యహంకారమును గూర్చును. వీనిచేతఁ గూడినవారు నీ పేరు స్మరింపనొల్లరు. స్వామీ! వీటినన్నిఁటి నుపేక్షించి నీ తిరువడి నాశ్రయించు వారికి మాత్రమే నీవు దర్శన మొసఁగుదువు.

రజస్సత్త్వతమో నిష్ఠా రజస్సత్త్వతమో జుషః,
ఉపాసతే ఇంద్రముఖ్యాన్ దేవాదీన్ న తథైవ మామ్.

ఇష్ట్వేహ దేవతా యజ్ఞైః గత్వా రంస్యామహే దివి,
తస్యాంత ఇహ భూయాస్మ మహాశాలా మహాకులాః.

ఏవం పుష్పితయా వాచా వ్యాక్షిప్తమనసాం నృణామ్,
మానినాం చాతిస్తబ్ధానాం మద్వార్తాపి న రోచతే.

రజస్సత్త్వ తమో గుణములచే నిబిడీకృతులై యాగాదికర్మల నొనర్తురు. తత్ఫలములైన స్వర్గాదులు గాంక్షింతురు. అల్పమైన బుద్ధి యున్నవారికి నా నామము నుచ్చరించుటకుఁ గూడ మనసు పొడ మదు; యాగాది పుణ్యకర్మఫలములను స్వర్గాదిలోకములయం దనుభవించి మఱల వారు క్రిందికి వత్తురు.

వేదము వారిని పుష్పితములైన వాక్యములతో ప్రలోభించును. కాని వేదపురుషుఁడు భంగ్యంతరముగా నివి పుష్పము లనియు, ఫలము వేరున్నదనియుఁ జెప్పుచునే యున్నాఁడు. వీ రంత దూర మాలోచింపరు. ఈ పుష్పభంగియే వారిని విపరీతముగా నాకర్షించు చున్నది. భక్తియోగము శుద్ధ మశుద్ధ మని రెండురీతులు. ఈశ్వరుని

భజించుటకు ఫలముగా నైశ్వర్యాదులు లభింపవలెనను భక్తి యశుద్ధము; భక్తిసుఖముతోఁ బోల్చుకొన్నప్పుడు మోక్షము తుచ్ఛ పదార్థము. మోక్షమునుగూడఁ దిరస్కరింపవలెనని 'ప్రోజ్ఝితకైతవః' అను మాటచేఁ జెప్పుచున్నాఁడు. ఏ ఫలము నాకాంక్షింపకుండుటయే భక్తి యొక్క సుఖము. ఫలాకాంక్ష యున్నచో ప్రేమ లేదని యర్థము. ఉన్నను నది సర్వేశ్వరునందు లేదు. తానాశించిన ఫలమందే యున్నది. తానాశించిన ఫలమును బొందుట కొక ద్వారముగ మాత్రమే సర్వేశ్వరు నారాధించుచున్నాఁడు. ఇదే యశుద్ధమైన భక్తి.

**ఫలేచ్ఛా యత్ర జాయేత న సద్ధర్మస్స కైతవః,**
**నిష్కామో యో భవేద్ధర్మః స శుద్ధః పరికీర్తితః.**

అన్నది స్మృతి వాక్యము. కైతవ మనఁగా విషమభావము. విషమభావలేశము గూడ లేనిది ప్రోజ్ఝితకైతవము.

**విషమమతిర్న యత్ర నృణాం**
**త్వ మహమితి మమతవేతి యదన్యత్ర,**
**విషమధియా రచితోయః**
**సహ్య విశుద్ధః క్షయిష్ణు రధర్మ బహుళః.**

ఎవనికి నేను-నీవు, నాది-నీది అను భావమున్నదో, అదే విషమత. ఈ దృష్టి యెవని భజన మందుండునో అది శుద్ధభక్తియోగము గానేరదు; దానినుండి యేర్పడు ఫలము గూడ నశించునదే. అట్టి భజనలో నధర్మము గూడఁ దిన్నగా వచ్చి చోటుచేసికొనును. సర్వత్ర సర్వేశ్వర దర్శనమే సమభావము; ఇదే శుద్ధభక్తియోగము చూచునది, వినునది, యనుభవించునది సమస్తము నీశ్వరావిర్భావమే. ఈ విధమైన యంతఃకరణశుద్ధియే భక్తియోగముయొక్క పరమలక్ష్యము. ఇది సిద్ధించినచో సమభావము సంపూర్ణముగా సిద్ధించినట్లే. ఈ భావమునే భగవంతు డుద్ధవునకు-

'కర్మశుద్ధి ర్మదర్పణమ్' అను వాక్యముతో నుపదేశించుచు న్నాఁడు. ఈ సమబుద్ధి యేర్పడవలెనన్నచో భాగవతతత్త్వము రక్త మజ్జాగతమై పోవలెను. సత్పురుషులు = సదాచారము ప్రాణమైన వారు. అపేక్షించుచున్న సత్యవస్తువిజ్ఞానము ఈ భక్తియోగముతో సిద్ధించును.

**భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాఽస్మి తత్త్వతః**

భక్తిచేతనే నా యియత్త యేమి? నాస్వరూప మేమి? యనుట తెలియును. పై వాక్యము లర్జునునకు భగవంతుఁ డుపదేశించినవి. ఆ వస్తువిజ్ఞానముచే సిద్ధించున దేమి? దానినే 'శివదం' అనుదానితోఁ జెప్పుచున్నాఁడు. కైవల్యప్రద మని యర్థము. భక్తుఁడు కైవల్యము గోరఁడు. అదియే వానివెంటఁ బడును. మాత్సర్యాదు లున్నవారు సత్పురుషులు గారు. అట్టివారికి భక్తి లేదు అని తెల్పుటకే తాపత్ర యోన్మూలనం అను విశేషణము.

'తపంతి వివిధాస్తాపాః నైతా న్మద్గత చేతసః' వాఁడు నిరంత రము భగవత్పాదార్పితమై యుండును. కామాదివృత్తులు వానిని సమీపింపనేలేవు. ఉపాస్యమైన యీ సద్వస్తుస్వరూపమును 'శ్రీమత్' అను దానితోఁ దెల్పుచున్నాఁడు. శ్రీ అనఁగా రాధాదేవి యంటిమి. శ్రీరాధతోఁ గూడియున్న కృష్ణుఁడే సత్యమైన వస్తువని యర్థము.

**యస్మిన్ సర్వం విలీయేత వస్తు తత్పరమార్థకమ్,**
**ఏతాదృశం పరం బ్రహ్మ రాధాకృష్ణౌ న సంశయః.**

దేనియందు సర్వము లయించునో అట్టి వస్తువే పరమాత్మ. అట్టి వస్తువే రాధాకృష్ణులు. పై వాక్యములు 'జీవగోస్వామి' యన్నవి. ఇట్టి భక్తియోగమును లోకమం దెవ్వరు ప్రాచుర్య మొనర్చిరి? 'మహా మునికృతే' నారదాది మహర్షులు ప్రచారమునకుఁ దెచ్చిరి లేక మహా మునియైన శ్రీమన్నారాయణుఁడే ఉద్ధవాది శిష్యుల కుపదేశించి వారి ముఖాంతరముగా లోకమునఁ బ్రాచుర్యమునకుఁ దెచ్చెనని యర్థము.

'మహాముని ర్మహావంద్యః' అని గోపాలసహస్ర నామము లందు వచ్చును.

'కిం వా పరైః' ఈ విధమైన భక్తియోగమును వదలి తక్కిన యోగముల నవలంబించుటలో ఫల మేమి? ఇతర యోగముల నను సరించు వారి మనసులందు కాలవిలంబములేక ఈశ్వర సాక్షాత్కార మేర్పడదు.

న సాధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మ ముద్ధవః
న స్వాధ్యాయ స్తపస్త్యాగో యథా భక్తిర్మమోర్జితా.

ఓ ఉద్ధవా! ఊర్జితమైన భక్తియోగమే నన్ను స్వాధీనపఱచి కొనుచున్నది. అట్లు యోగమునకు నేను వశుఁడను గాను. సాంఖ్య మునకు లోఁబడను. కర్మమార్గమునకుఁ జిక్కను. అధ్యయన తపో దానములకు స్వాధీనుఁడను గాను. ఈ విధముగా వ్యాసముని తన శిష్యులను మేల్కొలుపుచు నీ గ్రంథముయొక్క స్వభావమును మొద టనే స్పష్టపఱచుచున్నాఁడు.

వంశీధర వ్యాఖ్యలో నాతఁడు గొన్ని విశేషార్థములు దెల్పి నాఁడు. అవి యీ క్రింద నిచ్చుచున్నాఁడు. పరమా=పరా ఉత్కృష్టా మా యస్మాత్సః పరమః. ఉత్కృష్టమైన సంపదగలది యన్నమాట. ధర్మావలంబనముతో సర్వసంపదలు సిద్ధించును.

'వృణుతేహి విమృశ్యకారిణం గుణలుబ్ధాః స్వయమేవ సంపదః' అని భారవి. 'శ్రీమద్భాగవతే' ఋచస్సామాని యజూగ్ంషి సా హి శ్రీరమృతా సతాం అనెడు వాక్యములచేత వేదాభ్యాసమే యుత్తమ సంపద. 'సా విద్యతే అస్మిన్నితి శ్రీమత్' భాగవత పారాయణముతో చతుర్వేద పారాయణఫలము సిద్ధించునని తాత్పర్యము.

ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశస శ్శ్రియః,
జ్ఞానవైరాగ్య యో శ్చైవషణ్ణాం భగ ఇతీర్యతే.

అను స్మృతివాక్యము వలన షడ్విధైశ్వర్యము భగశబ్దార్థము. తత్సంపత్తి గలవాఁడు భగవంతుఁడు కృష్ణుఁడు. అతనికి సంబంధించినవారు భాగవతులు. వారి నధికరించి యొనర్చిన గ్రంథము భాగవతము. 'మహ్యతే పూజ్యతే సర్వైరితి మహాన్, మన్యతే జానాతి సర్వమితి మునిః, మహాంశ్చాసౌ మునిశ్చ మహామునిః'. శ్రీమన్నారాయణుఁడు లేక వేదవ్యాసుడు. సద్యః=తత్క్షణాత్ అని రెండుసమానార్థక పదములున్నవి గదా; అందుచే వంశీధరుఁడు సద్యః అను శబ్దమునకు వేఱు వ్యుత్పత్తిని గల్పించెను.

ద్యేన అబ్ధినా శయనార్థం వర్తత ఇది సద్యః

అనఁగా శయనార్థము క్షీరసముద్రము నాశ్రయించినవాఁడన్నమాట.

'ద్యోఽబ్ధిః ద్యోస్స్యాత్ త్రివిష్టపం' అని సౌభరి నామమాల. అసూయచేఁ గూడుకొన్న వారికి ఒకవేళ జ్ఞానోత్పత్తియైనను అది గళితమై పోవును.

నిశ్శ్రేయసకరం జ్ఞానం సువృత్తానాం ప్రజాయతే,
దుర్వృత్తానాం కథమపి జాతమ ప్యన్యథా భవేత్.

**వీరరాఘవ వ్యాఖ్య:**

విషయ ప్రయోజనసంబంధ అధికారిరూపమైన యనుబంధ చతుష్టయము నీ శ్లోకముతోఁ జెప్పుచున్నాఁడు. విషయమనఁగా నేమి? ప్రధానముగాఁ బ్రతిపాద్యమానమైన వస్తువు; అది ఇచ్చట ధర్మము. ధర్మము సిద్ధసాధ్యరూపములతో రెండు రీతులు. సిద్ధరూపమైన వస్తువునందు ధర్మశబ్దప్రయోగము మహాభారతమందు వచ్చును.

యే చ వేదవిదో విప్రాః యే చాధ్యాత్మవిదో జనాః,
తే వదంతి మహాత్మానం కృష్ణం ధర్మం సనాతనమ్.

ధర్మ మనఁగా నేమి? అలౌకికమై శ్రేయస్సును సాధించునది. పరమాత్ముఁ డట్టివాఁడే. అందుచేత సిద్ధరూపుఁడైన పరమాత్మయందు ధర్మశబ్దము ప్రయుక్తము. సాధ్యధర్మము-పరమాత్మ ఆరాధనాత్మక మైన భక్తి. శ్లోకము మొదటినుండి సతాం = అను వఱకున్న భాగము సాధ్యధర్మమును గూర్చి చెప్పుచున్నది. వేద్యం అనునది మొదలు తాపత్రయోన్మూలనం అను పర్యంతము సిద్ధధర్మము ప్రతిపాదింపఁ బడినది; ఈశ్వరశబ్దముచేత ప్రయోజనము చెప్పఁబడినది. అదియును రెండు రీతులు. వ్యవహితము-అవ్యవహితము. ఏ ప్రయత్నము లేకుండ, మనస్సునందీశ్వరావస్థాన మవ్యవహితమైన ఫలము. భగవ దనుభవ పరంపరచే నేర్పడు తాపత్రయనివృత్తి వ్యవహితమైన ఫలము; సంబంధము గూడ రెండు రీతులు. సాధ్యసాధనభావరూపము, ప్రతి పాద్య ప్రతిపాదక భావరూపమును. ఇక్కడ ప్రయోజనోక్తిచేత సాధ్యసాధన భావరూపము, విషయోక్తిచేత ప్రతిపాద్య ప్రతిపాదక భావరూపమైన యర్థము వివక్షితము. సాధ్యధర్మమును జెప్పు చున్నాడు. ఈ పురాణమందు ప్రోజ్ఝితకైతవమై పరమమై నిర్మత్సరు లైన సత్పురుషుల ధర్మము సాధ్యముగాఁ జెప్పఁబడుచున్నది. సత్పు రుషులకు సంబంధించిన ధర్మము-సాధ్యధర్మము; సంబంధము అనుష్ఠేయ అనుష్ఠాన భావరూపము. నిర్మత్సరాణాం సతాం అని చెప్పుటచేత, వేదోక్తమైన యాభిచారికక్రియావ్యావృత్తి. అభిచారాదిక క్రియ మాత్సర్యముతో నొనర్పఁబడును. పరమశబ్దముచేత క్షుద్రకర్మ ఫలప్రదకార్యవ్యావృత్తి; లేక మత్సరశబ్దము కామాదులకుపలక్షణము. అవిలేనివారు శమదమాద్యుపేతు లని పిండితార్థము; పరమైన దేది? 'సర్వేషా మేవ ధర్మాణాం ఉత్తమో వైష్ణవో విధిః' వేద్యం ఇత్యాదిగా సిద్ధధర్మవివరణము. 'సతాం' అను శబ్దము కాకాక్షిన్యాయముతో నిచ్చటఁ గూడ నన్వయించుచున్నది. భగవంతునియొక్క స్వరూప రూపగుణవిభూతి ప్రతిపాదకమై నందువలన-'భగవత ఇదం' భాగ

వత మని వ్యుత్పత్తి; మహాముని కృతే అనుటచేత వక్తృవైలక్షణ్యము సిద్ధించినది. అందుచేఁ బరమప్రమాణము. ఇతర దేవతలు అసద్గుణవంతులు. శ్రీమన్నారాయణుఁడే వాస్తవమైనవాఁడు. వాస్తవం=వస్తునః భావః వాస్తవం=స్వాభావిక ధర్మయుక్తమైనది. నారాయణతత్త్వము; శివదం అనుటచే నిష్టప్రాపకమని యర్థము. తాపత్రయోన్మూలన మనుటచేత ననిష్టనివృత్తి; వాస్తవశబ్దముచేత శాస్త్రాంతరాభ్యుపేతులైన ఇతర దేవతలనుండి వైలక్షణ్యము ప్రతిపాదింపఁబడినది; వారి యుపాసనలు క్షుద్ర-ఉపద్రవశత ఉపప్లుతములు. పరిమిత సుఖప్రదములు. కనుక ఈ గ్రంథమునందు విషయము మోక్షసాధనమైన ధర్మము; తత్సమారాధ్యమైన పరదేవత. 'ఈశ్వర స్సద్యో హృద్యవరుధ్యతే' అనుటచేతఁ బ్రయోజనమును దెలుపుచున్నాఁడు.

జీవగోస్వామి కృతమైన క్రమసందర్భము:

ఈ శ్లోకమందు 'స వై పుంసాం పరో ధర్మో యతో భక్తి రధోక్షజే' అని యారంభించి

> అతః పుంభి ర్ద్విజశ్రేష్ఠాః వర్ణాశ్రమ విభాగశః,
> స్వనుష్ఠితస్య ధర్మస్య సంసిద్ధి ర్హరితోషణమ్.

అనువఱకును భాగవతమందుఁ జెప్పబడిన భగవత్సంతోషణ రూపమై శుద్ధభక్తిరూపమైన ధర్మము ప్రతిపాదింపఁబడినది.

ప్ర+ఉజ్ఝిత=ప్రోజ్ఝిత. ఇందలి యుపసర్గచేత సాలోక్యాది సర్వరూపమైన మోక్షములు గూడ నిరస్తమైనవి. తాపత్రయోన్మూలనం=తాపత్రయము మాయాకార్యము. దానిని నాశ మొనర్చుటయే గాక తన్మూలమైన యవిద్యను గూడఁ బోకార్చునని యర్థము. ఈ శ్లోకమందు 'అత్ర' అను శబ్దము మూఁడు తడవలు వాడఁబడినది. ఎందుకు? నిర్ధారణార్థము. అందుచేత సర్వులును భాగవతమునే సేవింపవలెనని తాత్పర్యము.

విశ్వనాథ చక్రవర్తికృతమైన 'సారార్థదర్శిని':

శ్రవణసమనంతరమే భగవంతుఁడు హృదయమందు గట్టి వేయఁ బడుచున్నాఁడు. అనఁగా తాదృశమైన గాఢప్రేమ జనించు చున్నదని తాత్పర్యము; భగవంతుఁడు ప్రేమైకవశ్యుఁడు. 'ప్రణయ రశనయా ధృతాంఘ్రిపద్మః' అని భాగవతమే పలుకుచున్నది. తత్క్షణా దేవ శుశ్రూషుభిః— ఈ భాగవతనామము విన్నంతనే శ్రవణేచ్ఛ యేర్పడుచున్నది. అనఁగా శ్రద్ధకంటె ముందు ప్రేమ యేర్పడు చున్నది; దానిపై శ్రద్ధగూడఁ గలిగినచో బంగారునకుఁ బరిమళము

సకృదపి పరిగీతం శ్రద్ధయా హేలయా వా,
భృగువర నరమాత్రం తారయే త్కృష్ణనామ.

అని భాగవతము. ఈశ్వరుఁడు మనసునం దవరోధింపఁబడు చున్నాఁడు. అక్కడి నుండి గడకు వచ్చుటకు సాధ్యము గానట్లుగ నవరోధింపఁ బడుచున్నాఁ డన్నమాట. అదియును నెప్పుడు? సద్య ఏవ. అప్పుడే అనఁగా శ్రద్ధయేర్పడక ముందే యని భావము. కనుక భాగవతము కృష్ణాకర్షకమైన మహావిద్య యని ప్రతిపాదింపఁ బడు చున్నది.

ఇక్కడ కృతిభిః—సద్యః అని రెండుపదము లున్నవి. కృతార్థు లైన వారికి సద్యః ఫలము. అకృతార్థులకుఁ గొంచె మాలస్యముగా నేర్పడునని భావము. 'భావుకాః పిబత' సంసారిణాం కరుణయాహ పురాణ గుహ్యం అని చెప్పుట చేత నిరుత్తెఱగులైన యధికారులకును తత్క్షణాత్—ఆ భాగవత శ్రవణ పూర్వకమైన యుత్సవముచేత ప్రేమ మయమైన మనస్సునందు పరమానందము జనించుచున్నది; దీనితో నీ శాస్త్రముయొక్క ప్రయోజన వైశిష్ట్యము చెప్పఁబడినది. వాస్తవం— అది మధ్యావసానములయం దేది స్థిరమో ఆ వస్తువు నిర్మత్సరాణాం వేద్యం—సాక్షాత్తుగా ననుభవించుటకు శక్యము. నమత్సరులకు

శ్రవణాద్యావృత్తిచేత మత్సరాదులు నశింపఁగాఁ దర్వాత నేర్పడునని భావము. కనుక వారు నిరుత్సాహ పడవలసిన పనిలేదు; 'శివదం' ప్రేమచేత ప్రార్థిదవర్తిత్వము. ఇది అనుసంహితఫలము. తాపత్రయ వినాశరూపనమైన మోక్షము అననుసంహితఫలము; ప్రోజ్ఝిత=అను చోట నుండు 'ప్ర' శబ్దముచేత నిష్కామ కర్మశమ దమాద్యంగ జ్ఞానయోగ అష్టాంగయోగాదులును వ్యావృత్తము లైనవి; 'స వై పుంసాం పరోధర్మః' అనుటచేత ప్రాణిమాత్రులకిం దధికారమని సూచితము. ఈ శ్లోకమందు అత్ర త్రిరావృత్తమంటిమి. దాని కిట్లన్వయము. 'అత్ర వేశ్వరో అవరుధ్యతే నాఽన్యత్ర', అత్రైవ వాస్తవం వస్తు వేద్యం నాన్యత్ర, 'అత్రైవ ప్రోజ్ఝితకైతవో ధర్మః నాన్యత్ర' అని అన్యయోగ వ్యవచ్ఛేదము. అత్రాఽవరుధ్యత ఏవ' అని అయోగవ్యవచ్ఛేదము.

శుకదేవకృతమైన సిద్ధాంత ప్రదీపము :

శ్రీమద్భాగవతే=భగవత్స్వరూప గుణాదివర్ణనరూపా శ్రీర్విద్యతే యత్ = తత్ శ్రీమత్=భగవత్స్వరూప గుణాదివర్ణన ముండుటచేత భాగవతము శ్రీమంతమైనది. 'శివదం=ముక్తిదం', తాపత్రయోపలక్షితం=కార్యకారణరూప ప్రకృతిసంబంధాతిక్రమ పూర్వక భగవద్భావాపత్తి లక్షణ మోక్షప్రదం. 'వస్తులక్షణం' శ్రీకృష్ణాఖ్యంతత్త్వం వేద్యం' అనఁగాఁ గార్యకారణ రూపమైన ప్రకృతిసంబంధము నతిక్రమించిన భగవద్భావాపత్తిరూప మోక్షమును ప్రసాదించు కృష్ణాఖ్య తత్త్వము; వాస్తవం=వస్తువునకు సంబంధించినది. అది ఏది? చేతనా చేతనాత్మకమైన పదార్థ ద్వయము. 'తత్ర చేతనః పదార్థో జ్ఞాన స్వరూపో జ్ఞానాశ్రయః కర్తృత్వ భోక్తృత్వాది ధర్మవాన్, అణుపరిమాణకో బద్ధ ముక్తవాన్ జీవః', జ్ఞానస్వరూపుఁడై జ్ఞానాశ్రయుఁడై కర్తృత్వభోక్తృత్వాదులు గలిగి యణుపరిమాణుఁడై బద్ధముక్తత్వాదులు గలవాఁడు జీవుఁ డొక తత్త్వము. ప్రాకృత అప్రాకృత కాల భేదములతో త్రివిధమైన యచేతన పదార్థ మొక తత్త్వము. బ్రహ్మ

పదార్థ మొక తత్త్వము. ఈ మూఁడును వేద్యము లన్నమాట. ఈ శ్లోకమందుఁ బంచార్థములును ప్రతిజ్ఞాతము లైనవి.

1. వస్తూపాస్యరూపమైన యర్థము.

2. చేతనము, ఉపాసక రూపార్థము.

3. కృపాఫలరూపమైన భగవద్భావాపత్తి లక్షణముక్తి.

4. భక్తిరసము.

5. విరోధి. ఈ విరోధి, శ్లోకమందలి 'పర' శబ్దముచేత సూచితము. ఇతర శాస్త్రములు తదుక్తసాధనములు, తదధికారులు, భాగవతధర్మ తత్ఫలాదులకు విరోధులని భావము. పూర్వాచార్య శ్లోకమిట్లున్నది-

ఉపాస్యరూపం తదుపాసకస్య చ
కృపాఫలం భక్తిరసస్తతః పరమ్,
విరోధినో రూప మథైతదాప్తేః
జ్ఞేయా ఇమేఽర్థా అపి పంచ సాధుభిః.

తత్త్వత్రయము విషయము. పంచార్థములు సంబంధము. నిర్మత్సరు లధికారులు. ముక్తిప్రయోజనము సంక్షేపార్థము.

### వల్లభాచార్య కృతమైన సుబోధినీ వ్యాఖ్య :

భాగవత శ్రవణమందుఁ దప్పఁ దక్కినవాని యం దంతయును గాపట్య ముండు ననుచున్నాఁడు. వేద ప్రతిపాదితములైన యజ్ఞాదులందు ఫలరూపమైన స్వర్గాది పదప్రథమ జననాత్మకమైన కాపట్యము. పౌరాణిక ధర్మమైన యాచారమునందు సమానవస్తువులందే శుద్ధ్యశుద్ధిద్వారా భేదకల్పన మున్నది. ఎందుకు? మానవుని ప్రవృత్తి యొక్క సంకోచార్థము వస్తువులందు గుణదోషము లారోపింపఁబడుచున్నవి. అది గూడ కాపట్యమే. సత్యాది వచనములందు వ్యవహార

ముతో దాని స్వరూపము మారిపోవుచున్నది. అదియును గాపట్యమే; తపస్సు మొదలైన వానియందు 'కః క్షేమో నిజపరయోః, క్రియాన్ వార్థ స్వపరద్రుహా ధర్మేణ, 'కర్షయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః' శరీరమందున్న భూతగ్రామమును గఠిన నియమాదులతోఁ దపింపఁ జేతురు గనుక వానియందును గాపట్యమున్నది. శ్రవణాదు లేతల్లేశమును లేనివి. 'పరమః'– పరో మాయత ఇతి భగవత్సా క్షాత్కార హేతుత్వా త్పరమః'. శ్రీమతి = లక్ష్మీయుక్తే భాగవతే, మహామునికృతే = వేదవ్యాసకృతే. సమాధా వనుభూయ కృత త్వాత్ – సమాధిభావార్థం మహాముని కృత మిత్యర్థః. సమాధియం దనుభవించి వ్రాసినందువలన, ప్రథమపురుషలో 'మహామునికృతే' అని చెప్పికొన్నాఁడు. ఉపాసనాకాండ మంత్రశాస్త్రము, పంచరాత్రము గూడః మంత్రశాస్త్ర మూలమున దేవత స్వాధీన మగును. పంచరాత్ర మూలమునను; కాని యీ రెండింటివలనను మంత్రాధిష్ఠాన స్వరూప ముగనే సాధకునికి స్వాధీన మగుచున్నది. మధురాదిస్థాన విశేషముల ననుసరించికూడ. కాని సాక్షాత్పురాణ పురుషుఁడు భాగవతశ్రవణము చేతనే హృదయస్థితుఁ డగుచున్నాఁడు. విచారచింతనములు లేకు న్నను శ్రవణమాత్రముచేతనే బుద్ధిస్థితుఁ డగుచున్నాఁడు.

గిరిధర కృతమైన బాలప్రబోధినీ వ్యాఖ్య:

భాగవతమందు ప్రతిపాదించు శ్రవణ కీర్తనాది లక్షణము లనేకములు. మఱి 'ధర్మః' అని ఏకవచనమే యున్నదే? వీని యన్నిటి కిని ఫల మొక్కటే. భగవత్స్వరూపప్రాప్తి. ఫలైక్యమునుబట్టి ఏక వచనము. మన్వాది ధర్మశాస్త్రములలోఁ జెప్పిన ధర్మములలో నివి చేరవు, అవియన్నియుఁ గ్రామ్యధర్మములు. భాగవతమునకు శ్రీమ త్వమెట్లు? నానావిధ రసవ్యంజక మధుర యథార్థ శబ్దవత్త్వముచేత; పరమ పురుషాఖ్యమైన వాసుదేవనామక శుద్ధతత్త్వము పరమహంస పరివ్రాజకాదులచేత నితర మార్గములతో నతికష్టముతోఁ బొందఁబడు

చున్నది. భాగవత శ్రవణమాత్రముతో స్త్రీ శూద్రాదులు గూడ నా యనుభూతి నందఁగలరు. మంద్ర మధ్యమ ఉత్తమాధికారులు సర్వు లును దీని కర్హులే. 'సద్యః' 'తత్క్షణాత్' అను పదద్వయము చాల తొందరలో నేర్పడుచున్న దనుటలోఁ దోడ్పడుచున్నది. సర్వతంత్ర స్వతంత్రుఁ డీశ్వరుఁడు. అట్టి వానియొక్క అవరోధము తనకు స్వాధీ నుఁడుగాఁ జేసికొనుట. ఆ యవరోధము గూడ విస్తృతమైన ప్రదేశ మందుఁ గాదు. అతి సంకుచితమైన హృదయమందు; దానికి బహు ప్రయత్నము గూడ లేదు. కేవల శ్రవణేచ్ఛ మాత్రమే. భాగవతము యొక్క గొప్పతన మేమని చెప్పవలెనని పిండితార్థము.

**విజయధ్వజ వ్యాఖ్య :**

మొదటి పద్యమందు సంక్షేపముగాఁ బురాణార్థము వర్ణితము. మంగళాచరణ మనెడు నెపముతో శ్రీమన్నారాయణుని స్మరించిరే గాని ఈ భాగవతమునకు వాఁడే విషయము గాదను సందేహ మేర్పడ వచ్చును. త న్నిరాసార్థము సర్వోత్తముఁడైన పరమాత్మను గూర్చిన యథార్థజ్ఞానమును గలిగించునట్టి పరమ భాగవత ధర్మము లీ శ్లోక మందుఁ జెప్పఁబడినవి. ఇందు చెప్పఁబడినట్లు శ్రీహరియే సర్వోత్తముఁ డనియు సర్వకర్తయనియుఁ దెలిసికొన్నచో వాఁడు మోక్షరూపమైన నిత్యమంగళము నిచ్చును. అంతే కాదు. త్రివిధములైన దుఃఖముల నన్నిటిని సమూలముగ నశింపఁ జేయును; ఈ భాగవతమును నారద మునిచేతఁ బ్రార్థితుఁడై మనుష్యోత్తముల నను గ్రహించు నిచ్ఛతో సర్వ జ్ఞతముఁడై వ్యాసరూపియైన పరమాత్ముఁడు రచించెను. ఇది శ్రవణ మనోహరము; బహ్వర్థగర్భితము; అందుచే శ్రీమద్భాగవతమని పేరు. ఇందులో స్వర్గము మొదలైన నశ్వరఫలముల నొసఁగు ధర్ములఁగాని యర్థకామములను గాని వర్ణించి ప్రయోజనము లేదు; పరమాత్ముని సాక్షాత్కారమును సిద్ధింపఁజేసి వాని యనుగ్రహముతో మోక్షసిద్ధి నొడఁ గూర్చు సద్భక్తధర్మములే ముఖ్యముగాఁ బ్రతిపాదితములు.

ముఖ్యముగానున్న-సర్వకాలనిర్దోషుఁడు గుణపూర్ణుఁడు, కాల, దేశ గుణ అపరిచ్ఛిన్నుఁడు నైన శ్రీమన్నారాయణుఁడే ప్రతిపాదింపఁ బడు చున్నాఁడు. గురుముఖముగా శాస్త్రధర్మమును జక్కగాఁ దెలిసి, గురు వులు మొదలైన స్తోత్తములను సర్వోత్తముఁడైన శ్రీహరిని సేవించు టందాసక్తులగు యోగ్యజీవు లీ భాగవతమును జదువవలెను. అప్పుడు శ్రీహరి వారి హృదయములందుఁ బ్రకాశించును. హరియందు వారికి భక్తి హెచ్చును. భక్తిపాశబద్ధుడై శ్రీహరి వారి హృదయ కమల మును విడిచి కదలనే కదలఁడు; శ్రవణాది సాధనసామగ్రి యున్న వానికి కాలవ్యవధానము లేక పురుషోత్తముఁడు వెంటనేగోచరుఁడగును. సాధనసామగ్రిని సంపాదించికొనుచున్న జీవులకుఁ దక్కిన పురాణ శ్రవణమునకంటె శీఘ్రముగా నేత్రచ్ఛవణముతో పుండరీకాక్షుఁడు గోచరమగును. ఇట్లు భాగవతమును జదువుట కధికారియెవరు? వాని కగు ప్రయోజన మేది? ఈ గ్రంథమందు ముఖ్యవిషయ మేది? అని తెలిసి అధికారి, ఫలము, విషయము, సంబంధము వీనిని స్మరించికొని గ్రంథము నారంభించు వానికి శ్రీహరి మహాఫలము నొసఁగును. 'జన్మాద్యస్య యతః' అనెడు మొదటి శ్లోకముచేతనే భాగవతమందు తెల్పు సర్వ విషయములను దెలిపిన ట్లయ్యెను. కనుక ఈ శ్లోక మనా వశ్యకమైనట్లే యనిపించును. కాని గ్రంథారంభమందు మంగళాచర ణమునకై నారాయణుని ప్రస్తావము వచ్చినది. గ్రంథవిషయము భిన్నమై యుండవచ్చును అను సంశయమును బోఁగొట్టుటకును ఇం దలి విషయమేది? దాని స్థానమేది? అధికారు లెవ్వరు? ప్రయోజన మేమి? విషయమునకును గ్రంథమునకును గల సంబంధ మేమి? యను వాని కుత్తరముగా విషయసాధన అధికారిప్రయోజన సంబం ధములఁ దెల్పుటకును నీ రెండవశ్లోక మారంభింపఁ బడినది. అత్ర= శ్రవణరమణీయమై యాలోచించు కొలఁదియు గంభీరమైన యర్థము గల ఈ భాగవతమునందు, ప్రోజ్ఝితకైతవః = మోసమునుండి సంపూ ర్ణముగ విడివడినట్టి; కితవునియొక్క భావము కైతవము. 'కితవుఁ'

డెవ్వఁడు? మనసులో నొకటి, వాక్కున వే ఱొకటి, పనియందు మఱొకటి గలవాఁడు. ఇట్లుగాఁ జేయఁబడు సకామకర్మనుండి దూర ముగ విడివడిన అనియర్థము. పరమః=దీని క్రైదురీతులుగ వ్యాఖ్యాన మున్నది.

1. ఈశ్వరార్పణముతో నుత్తమ మయిన.

2. పరమాత్మను గూర్చిన యథార్థజ్ఞానమును గూర్చునట్టి.

3. పరమాత్ముఁడే కర్త యను జ్ఞానపూర్వకమైన.

4. శత్రువువలె నున్న సంసారమును నాశ మొనర్చునట్టి.

5. అధికతమమైన సుఖమునకుఁ గారణమైన భక్తియోగ స్వరూపధర్మము.

ఇది ఏమి చేయును? పతితుఁడైన జీవుని నుద్ధార మొనర్చును. సర్వాధారకుఁడైన భగవంతుని జూపించును. తన జ్ఞానము నకుఁ బరమాత్ముని విషయముగా నొనర్చును. సమస్త పాపములను హరించును. ఇట్టి భగవత్ప్రాప్తి సాధనమైన నివృత్తిధర్మ మీ గ్రంథ ములో నప్రధానముగాఁ బ్రతిపాదితమైనది.

అత్ర=ఈ భాగవతమందు, నిర్మత్సరాణాం=స్వోత్తములైన సజ్జనులందు మాత్సర్యము చెందనట్టియు, సతాం=ప్రశస్తకర్మనొనర్చు సజ్జనులగు భగవద్భక్తులకు, వేద్యం=శ్రవణ మనన నిధిధ్యాసలతో జ్ఞానమునకు విషయీకృతుఁడైన, వాస్తవం=సర్వకాలములందును దోషదూరుఁడై గుణపరిపూర్ణుఁడైన; వస్తు=సమస్తకాల దేశములందు నుండెడు స్వభావముగల, శివదం=నిర్మత్సరముగా సర్వులకు తన జ్ఞానమూలకముగాఁ బరమానందము నిచ్చెడు, తాపత్రయములను హరించు వస్తువైన పరమాత్మ ముఖ్యముగా భాగవతమందుఁ బ్రతిపా ద్యుఁడు, కృతిభిః=పెద్దవారినుండి; శాస్త్రార్థశిక్షితమైన బుద్ధిగల్గినవారు, శుశ్రూషుభిః=మనోవాక్కాయ కర్మములచేత గురువులు మొదలగు

నుత్తమజీవులు, పరమాత్మ వీరి పరిచర్యను జేయుటయందుఁ గుశలులైన సాధనసామగ్రి గలవారు. ఈశ్వరః=1. లక్ష్మీ బ్రహ్మాది నియామకుఁడు. 2. సమస్త చేతనులకంటె నుత్తముఁడు, 3. లక్ష్మీ బ్రహ్మాది సకల జగత్తును బ్రవర్తింపఁ జేయుటయే స్వభావముగాఁ గలవాఁడు, అట్టి పరమాత్ముఁడు. సద్యః=జాగ్రత్తగా, అవరుధ్యతే=శ్రోత హృదయ కమలమునందుఁ గానవచ్చుటయేగాదు-అచ్చటనే ప్రకాశించుచు నుండిపోవును. ఈ పురాణమునకు 'శ్రీమత్' అన్న విశేషణము వాడఁబడినది. ఇతర పురాణములకంటె నిది శ్రేష్ఠ మని యర్థము.

రాజంతే తావదన్యాని పురాణాని సతాం గణే,
యావ న్న దృశ్యతే సాక్షాత్ శ్రీమద్భాగవతం పరమ్.

అని వ్యాసవచనమే ఉన్నది. ధర్మమునకు ప్రోజ్ఝితకైతవః-పరమః అని రెండు విశేషణములు వాడఁబడినవి. ఫలాపేక్ష లేనిది, ఈశ్వరార్పణబుద్ధితోఁ జేయఁబడినది యని యర్థము; ఈ విశేషణములతో నివృత్తిధర్మము చెప్పఁబడినట్లైనది; మనస్సునందు స్వర్గము మొదలైన ఫలములను ఉద్దేశముగా నుంచికొని పరమాత్ముని గుణగణములనే ప్రతిపాదించు వేదములకు అర్థాంతరములను జెప్పుచు నా దేహేంద్రియముల కధిష్ఠాత పరమాత్మయే; వానికే ఇవి లోఁబడినవి; కార్యములు చేయించువాఁడు వాఁడే; ఫలదాతయు వాఁడే అని చెప్పుచు నీ కార్యమునకుఁ గర్తను నేనే; నేనే సమర్థుఁడను; నేనే జ్ఞానిని-ఇత్యాది భావములతో నుండువాఁడు కితవుఁడు; వానిధర్మము కైతవము. విష్ణుపురాణమందు బంధమునకుఁ గారణము గానిదే కర్మ. మోక్షమునకుఁ గారణమైనదే విద్య యని చెప్పఁబడినది.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్.

అను గీతావాక్యము ననుసరించి భగవదర్పితమైనదే పరమధర్మము; భక్తియోగమే పరమధర్మమని భారతమున భీష్ముఁడన్నాఁడు.

ఏష మే సర్వధర్మాణాం ధర్మోధికతమోమతః,
యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చేన్నర స్సదా.

సజ్జను లెవ్వరు?

తితిక్షవః కారుణికాః సుకృతా స్సర్వదేహినామ్,
అజాతశత్రవః శాంతాః సాధవ స్సాధుభూషణాః.
మ య్యనన్యేన భావేన భక్తిం కుర్వంతి యే దృఢామ్.

సుఖదుఃఖాది ద్వంద్వములను సహించువారు, కరుణాశీలురు, యోగ్యులైన జీవుల కందఱకును స్నేహితులు, శత్రువులు లేనివారు, పరమాత్మనిష్ఠులు. వానియం దనన్యభావముతో భక్తి నొనర్చువారు; ఇట్టివా రని తెలుపుటకే 'నిర్మత్సరాణాం' అని వాడుట. మహాసంహితలో_

ఉత్తమే ష్వాత్మనోనిత్యం మాత్సర్యం పరివర్జయేత్,
కురుతే యత్ర మాత్సర్యం తత్తస్యైవ విహీయతే.

ఉత్తములందు మాత్సర్యము పరిహరింపవలెను. అది తన్నే చెఱచును అని గలదు. 'వాస్తవం' అని పరమాత్మను జెప్పుటవలన నిత్యసంహితలోని_

నిరస్తాఖిల దోషం య దానందాది మహాగుణమ్,
సర్వదా పరమం బ్రహ్మ తస్మాద్వాస్తవ మీర్యతే.

సర్వదా సమస్త దోషరహితుఁడు, ఆనందగుణ పరిపూర్ణుఁడు అని తెలిపినట్లైనది. వస్తు వన్నను బరమాత్ముఁడే.

వసనా ద్వాసనాద్వస్తు నిత్యాఽప్రతిహతం యతః,
వాసేనేదం యతస్తున్నం అత స్తద్బ్రహ్మ శబ్ద్యతే.

తాను వసించుటవలనను, ఇతరులను వసింపఁజేయుట వలనను అప్రతిహతుఁడు, నిత్యుఁడు నైన పరమాత్మయే వస్తువు. 'అపరైః' అనుటచే నివృత్తిధర్మమున కంటెను అర్థకామాదులు హీనము లని చెప్పినటులైనది. ప్రకృతిధర్మము హేయమే. సజ్జనులు అర్థకామము

లను గురుతుష్టిద్వారా ఈశ్వరుని స్వాధీనపఱచుకొనుట కుపయో
గించికొందురు. ఆ యీశ్వరప్రసాదము శ్రవణాదులచేతనే చిక్క
నపుడువానిని వేఱుగాఁ జెప్పలేదని తెలియవలెను. గారుడములో_

ధర్మార్థ కామమోక్షాణాం ఏకమేవ పదం యతః,
అవరోధో హృదీశస్య పృథగ్వ్యక్త్యై న తానహమ్.
అని వ్యాసుఁడే యన్నాఁడు.

అకామ స్సర్వకామో వా మోక్షకామ ఉదారధీః.
అని భాగవతమే చెప్పుచున్నది. సద్యః_తత్క్షణాత్ ఈ రెండు
పదములును అధికారి భేదమును సూచించుచున్నవి. సద్యః=అనఁగా
శీఘ్రముగా నని యర్థము. కొంద రధికారులు సాధనసామగ్రిని సంపా
దించి కొని యుందురు. మరికొందరు సంపాదనాయత్నములో
నుందురు. సాధనాసామగ్రి సంపూర్ణమైన వానికి భాగవతశ్రవణమైన
క్షణమందే భగవంతుఁడు హృదయమందుఁ దోఁచును. అది పూర్తిగాని
వారికి నితర పురాణ శ్రవణముతో నపరోక్ష మగుట కంటెను ముందే
తొందరగనే యపరోక్షానుభూతి యగునని నర్థము. సద్యశ్శబ్దము
ఇతరాపేక్షకంటె శీఘ్రముగానను నర్థము దోఁపింపఁజేయుచు సాపేక్ష
కముగా నున్నది.

భక్తియోగస్వరూపమైన ధర్మము_ఈశ్వరుఁడు, ఇవి రెండును
విషయములు; నిర్మత్సరులైన సజ్జను లధికారులు; ఇటువంటి యధి
కారుల కేర్పడెడు భగవదపరోక్ష జ్ఞానముతో నుండెడు దుఃఖము లేని
స్వస్వయోగ్యతా పూర్ణమైన యానందమే ఫలము. ఈ మూఁడు విష
యములను దెలుపుటకే మూఁడుసారులు 'అత్ర' అనుపదము వాడఁ
బడినది. కొందరు సగుణబ్రహ్మ, వాని తృప్తికి కారణమైన ధర్మము,
నిర్గుణబ్రహ్మ ఈ మూటిని దోఁపింపఁజేయుటకు 'అత్ర'పదము మూఁడు
సారులు వాడఁబడిన దందురు; ధర్మశబ్దము చేత కర్మకాండార్థమును
మాత్సర్యరహితులు_ముఖ్యసత్త్వాధికారులు. ఉత్తమాధికారులు దేవతలే

యగుటచే 'నిర్మత్సరాణాం సతాం' అనుటతో దేవతాకాండ అర్థమును, వేద్యం—అనుటచే బ్రహ్మకాండ అర్థమును దెలుపఁబడినది. శ్రీమన్నారాయణ స్వరూపుఁడైన కృష్ణద్వైపాయనుఁడు అప్తతముఁడు. ఆ భాగవతము పరమప్రమాణము; కనుక ముముక్షువులందరును భాగవతము నభ్యసింపవలెను; అందుకే ఇతర పురాణములకు లేని శ్రీమచ్ఛబ్దము.

శ్రీమంతమై మునిశ్రేష్ఠకృతం బైన
భాగవతంబు సద్భక్తితోడ
వినఁగోరువారల విమలచిత్తంబులఁ
జెచ్చెర నీశుండు చిక్కుఁ గాక
యితరశాస్త్రంబుల నీశుండు చిక్కునే
మంచివారలకు నిర్మత్సరులకుఁ
గపట నిర్ముక్తులై కాంక్షసేయక యిందుఁ
దగిలియుండుట మహాతత్త్వబుద్ధి
పరఁగ నాధ్యాత్మికాది తాపత్రయంబు
నడఁచి పరమార్థభూతమై యఖిలసుఖద
మై, సమస్తంబుగాకయు నయ్యు నుండు
వస్తు వెఱుఁగంగఁ దగు భాగవతమునందు.

శ్రీమంతమై-శ్రీమచ్ఛబ్దమునకు శ్రీధరుఁడు సుందరమై ముముక్షువుల కతిరమణీయమైనదని యర్థ మొనర్చెను; మునిశ్రేష్ఠకృతము. మునిశ్రేష్ఠుఁడు శ్రీమన్నారాయణుఁడు. అతనిచేత మున్ముందు చతుశ్శ్లోకరూపముగాఁ జెప్పఁబడినది, బాదరాయణునిచేత విస్తృతీకరింపఁబడినది లేక మహాముని వ్యాసుఁడేయని యర్థము చెప్పుకొనవచ్చును భాగవతము భగవంతునికి సంబంధించినది. వినఁగోరువారలు శుశ్రూషుభిః అను దానికిఁ దెలుఁగు. చెచ్చెరన్—శీఘ్రముగా, సద్యః-తత్క్షణాత్ అని రెండు శబ్దములు మూలమం దున్నవి. ఈ రెంటికిని బోతన్నయొక్క టే శబ్దమును వాడెను. 'ఈశ్వరః'అను దాని తెలుఁగు

ఈశుండు; అవరుధ్యతే అను దానిని జిక్కుటగా మార్చెను. ఇతర శాస్త్రములు 'కింవాపరైః' అనుదానికి దెనుగుసేఁత; సతాం=అనుటకు మంచి వారలని తెలుఁగు; నిర్మత్సరాణాం=అనుదానికి నిర్మత్సరులకు అని పోతన్న. 'ప్రోజ్ఝితకైతవ' శబ్దమును మూలకారుఁడు ధర్మమునకు విశేషణము సేయఁగా పోతన్న భక్తులకు విశేషణ మొనర్చెను. కాంక్ష సేయక= ఫలాభిసంధిలేక అని యర్థము. ఇందుఁ దగిలియుండుట ఈ భాగవతమునందాసక్తి గలిగియుండుట-మహాతత్త్వబుద్ధి- గొప్ప జ్ఞానమని యర్థము. వాస్తవం అనుమాటను శ్రీధరుఁడు రెండు రీతుల వ్యాఖ్యానించెను. పరమార్థభూతం అనున దొకయర్థము. దాని నమాత్యుఁ డట్లే వాడినాఁడు; యద్వా-అని యారంభించి శ్రీధరుఁడు జీవుఁడు, మాయ, జగత్తు ఈమూఁడును వస్తువే యన్నాఁడు. సమస్తంబుఁగాకయు నయ్యునుండు అని పోతన్న దానిని జేర్చుకొన్నాఁడు; కాని 'కాక యున్' అనునది పోతన్నగారి చేర్పు. అఖిలసుఖదము అనునది శివదం అనుదానికిఁ దెలుఁగు; మూలములో మంచివారలకు నిర్మత్సరులకు వేద్యమైన వస్తువు భాగవతమం దున్నదని చెప్పఁబడినది. దాని ప్రకారము మంచివారలకు నిర్మత్సరులకు పరఁగ........భాగవతమునందు అని అన్వయించుకొనవలసి యున్నది. దూరాన్వయ మగు నేమో యను శంకపీడించుచున్నది. అట్లుగాక మంచివారలకు నిర్మత్సరులకు నితర శాస్త్రంబుల నీశుండు చిక్కనే!' అని యైన నన్వయముఁ జేసికొనవచ్చును.

తాత్పర్యము; భాగవతము శ్రీమంతమైనది. మునిశ్రేష్ఠకృతమైనది. దీనిని సద్భక్తితో వినఁ గోరువారి పరిశుద్ధములైన మనస్సులకే ఈశ్వరుఁడు చిక్కును. ఇతరములకుఁ జిక్కఁడు. కాపట్యమునువదలి భగవత్ప్రీతి దప్ప ఇతరకోర్కులులేక నిరంతరము నీగ్రంథము నుపాసించుచుండుట గొప్ప తత్త్వబుద్ధి; భాగవతమందలి వస్తువు అధ్యాత్మికాదితాపత్రయమును బోఁదట్టెడు పరమార్థభూతము; అఖిలసుఖదము. సమస్తము గాకయు నయ్యు నుండునది.

నిగమకల్పతరోర్గళితం ఫలం
శుకముఖా దమృత ద్రవ సంయుతమ్,
పిబత భాగవతం రసమాలయం
ముహురహో! రసికాః భువి భావుకాః. ౩

భాగవతము సర్వశాస్త్రముల కంటెను శ్రేష్ఠమైనది. అందుచే దాని శ్రవణ మవశ్యముఁ గావింపఁ దగినది. ఈ విషయము ముందే ప్రతిష్ఠింపఁబడినది. ఇప్పు డిది సర్వశాస్త్ర ఫలరూప మనియు నందుచేఁ బరమాదరముచే సేవింపఁదగిన దనియుఁ జెప్పుచున్నాఁడు.

నిగమ=వేదమనెడు, వేదమే కల్పతరువు. ఎందు కనఁగా నది సర్వ పురుషార్థోపాయ భూతము. దానిఫలమువంటిదే భాగవతము. అది వైకుంఠగతమై యుండెను. దానిని నారదుఁడు దెచ్చి నాకిచ్చి నాఁడు. నేను దానిని శుకముఖనిహితము గావించితిని. అది తన్ముఖమునుండి భూమికి గళితమైనది. శిష్యప్రశిష్యాదిరూపమైన పల్లవ పరంపరగా మెల్లమెల్లఁగా నఖండముగా భూమికిఁ దిగివచ్చినది. పై నుండి పడుటవలన స్ఫుటితము గాలేదు. వ్యాసమహర్షి భాగవతము రచించు నాటికి శుకుని వృత్తాంతము ప్రవృత్తము గాలేదు. భవిష్యదర్థమును భూతకాలికమువలెఁ జెప్పుచున్నాఁడు. ఈ శాస్త్రప్రవృత్తి యనాగ=తాఖ్యానమే గదా! శుకముఖ నిహితమైన దానివలననే యమృతరూపమైన ద్రవముచేఁ గూడికొన్నది. శుకవదనస్పృష్టమైన ఫలము అమృతమువలె రుచికరముగా నుండుననునది లోకప్రసిద్ధ విషయము. ఇక్కడ శుకశబ్దము శ్లిష్టము. వేరొక యర్థము శుక నామధేయుఁడైన యొకముని. అమృత మనఁగా రసము, 'రసో వై సః' రసగ్ హ్యేవాలయం లబ్ధ్వానందీ భవతి అని శ్రుతివాక్యము. పరమాత్ముఁడు రసస్వరూపుఁడు. వాని యనుభవముతో జీవుఁ డానందమయుఁ డగును. అందుచేత హేరసికాః= ఓ రసజ్ఞులారా! అంత మాత్రమేగాదు. భావుకాః=రసవిశేషభావనాచతురులారా! ఓహో! మీ

యదృష్ట మెంతని చెప్పవచ్చును. భువి గళితం = భూమిపైననే గళిత మైనది. అట్టి యీ భాగవతమనెడు ఫలమును, పిబత = త్రావుఁడు. ఫలమును దినునప్పుడు పొట్టు, గింజ మొదలగు వానిని బాఱవేసి తక్కిన దానినిఁ దిందుము. అందుకే 'రసం' అనుచున్నాఁడు, ఈ ఫలమే రసరూపమైనది, కనుక హేయాంశమే లేదని అర్థము. ఫలమునకు రసతాదాత్మ్యమును వివక్షించినాఁడు. రసముచేతఁ గూడినది యని మతుబర్థము గాదు. రసరూపమైన ఫలమని తాత్పర్యము, ఇక్కడ కేవల 'ఫలం' అని చెప్పినచో హేయాంశప్రసక్తి వచ్చును. దానిని నివారించుటకు రసమన్నాఁడు. కేవల రసమని చెప్పినచో గళితమైన రసమును త్రావుటశక్యము. తన్నివారణార్థమే ఫలమన్నాఁడు. ఈ భాగవత మనెడు అమృతపానము మోక్షమునందుఁగూడ విడువఁ దగినది గాదని చెప్పుచున్నాఁడు

ఆలయం = మోక్షప్రాప్తిని గూడ వ్యాపించి, అనఁగా మోక్ష ప్రాప్త్యనంతరము గూడ భాగవతము చదువఁదగినదని భావము. స్వర్గాదిఫలములవలె మోక్షప్రాప్త్యనంతరము ఉపేక్షింపఁదగినది గాదు, లేక ఆలయం = శరీరపాత పర్యంతము, ముహుః పిబత = మాటిమాటికిని త్రావుఁడు. త్రాగుకొలఁదియు నానంద మతిశయించునే గాని తగ్గుట లేదు. భాగవతము నిగమకల్పతరు ఫలమని చెప్పుటచేత నుపాసనా కాండకంటె నిది యెక్కువని చెప్పుట యైనది. నిగమయతి = ధర్మార్థ కామమోక్షములను గూర్చి బోధించుచున్నది గనుక వేదమునకు నిగమ మనిపేరు. చతుర్విధ పురుషార్థములలో దేని నిచ్ఛించినవారికి దానిని వేదము ప్రసాదించును. అందుచే నది కల్పవృక్షము. తుముల మగు దీనిని శుకమహర్షి యాస్వాదించి లోకోపకారమునకై శిష్య ప్రశిష్యపరంపరగా భూమియందు వ్యాపింపఁజేసెను. జన్మసాఫల్య మార్గమును వివేకించి తెలిసికొను సామర్థ్యముగల భావుకులారా! యీ భాగవతము శుకుని దయచేత భూలోకమందు వ్యాపించినది..

అమృతరసముతోఁ గూడినది. వేదమువలె సర్వాభీష్టములను ప్రసాదించునది. వేదమను కల్పవృక్షముయొక్క సారభూతమైన ఫలమే యీ భాగవతము. శ్రీవైకుంఠమందు భక్తిమాహాత్మ్యమును ప్రకాశింపఁజేయు నీ భాగవతముండెను. శ్రీనారదుని దయచే నాకు సిద్ధించినది. నే నిది నా కుమారుఁడైన శుకున కుపదేశించితిని. శిష్యప్రశిష్య రూపముగా నిది లోకమంతయు వ్యాపించినది. జీవన్ముక్తులుగూడ దీని నుపేక్షింపఁ దగదు.

పరాశరునకు భవిష్యత్ జ్ఞానముండెను. ఆ జ్ఞానము నీ శ్లోక రూపమున నిబంధించినాఁడు. ఈ గ్రంథమం దే యల్ప విషయము గూడ నుపేక్షింపఁ దగినది గాదు. సర్వరసస్వరూపము. ఆ రసమే మీ యందలి దయచే ఫలరూపమును ధరించి మీచెంతకు వచ్చినది. దీని స్వరూపమే సర్వాత్మనా యానందము. పరమానందానుభవమే జీవన్ముక్తుని స్థితి. కనుక ముక్త్యనంతరము కర్మనువలె దీనిని విడువఁ దగదు. ఈ భాగవతము సేవించు నదృష్టము రసజ్ఞులకే భావుకులకే దక్కును. భావుకు లనుటకు సదసద్వివేచనము గల్గిన వారని అర్థము.

శుకముఖాత్ = శుకుని ముఖము నుండి అనఁగా కేవల భక్తి స్వరూపమైన యీ మహాగ్రంథములోని భక్త్యంగములను వివరించెడి పరిశ్రమను స్వీకరించె నని భావము.

అమృతు లనఁగా భక్తులు. ద్రవ మనఁగా వారి మానసికార్ద్రత. భాగవత గ్రంథపఠనమందు భక్తుల చిత్త మడుగడుగునను ద్రవించు నని భావము. భాగవతం = భగవత్స్వరూపము. ఆ స్వరూప మమృతులైన భాగవతులయం దార్ద్రభావముతోఁ గూడి యుండును. రసం = ఆనందము లేక రసమూర్తియగు కృష్ణుఁడు. పదిరసములచేఁ గూడి కొన్నవాఁడు. రసస్వరూపుఁడు. శృంగార వీర కరుణ అద్భుత హాస్య భయానక భీభత్స రౌద్రరసములు వీనితోపాటు శాంత ప్రేమ భక్తి యనునవియుఁ జేరినవి. అందుచేఁ బదియైనవి. పైఁజెప్పిన యన్వయ

క్రమము ననుసరించి యీ విధమైన వేరొకయర్థమును స్ఫురించును. ఓ విద్వాంసులారా! మీరు ముక్తిపర్యంతము భగవంతుఁడైనశ్రీకృష్ణుని స్వరూపము ధ్యానదృష్టితోఁ జూచి యానందింపుఁడు. నిర్గుణబ్రహ్మము ధ్యానవిషయము గానేరదు. అందుకే భగవంతుఁడు భక్తుల ననుగ్రహించు కొఱకు స్వేచ్ఛతో వేణుగోపాలస్వరూపము నంగీకరించెను. ఆ స్వరూపము విహరించిన దే ప్రదేశమందు? బృందావనమందు. బృందావన విహారి కేవల మనుష్యుఁడని భావింపరాదు సుమా! వేద కల్పవృక్షఫల మాస్వరూపము. వేదము చతుర్విధపురుషార్థములను వారివారి యుపాసనను బట్టి యొసఁగునట్లే కృష్ణపరమాత్ముఁడును వారి వారి యుపాసనాపద్ధతులను బట్టి ఫల మొసఁగును. కాని వేద ప్రతిపాదితులైన యింద్రాది దేవతలు త్రిపురుషార్థములను మాత్రమే యొసఁగఁ గలిగినవారు. కృష్ణోపాసకులకు మాత్రమే మోక్షసిద్ధి. కనుకనే క్షుద్రములైన త్రిపురుషార్థములను మాత్రమే యిచ్చుట కర్హులైన యింద్రాదులు వేద కల్పవృక్షమునకు శాఖలు. వారొసఁగు స్వర్గాదులు పల్లవపుష్పాదులు. ఫలస్వరూపము కృష్ణుఁడు మాత్రమే. అందుకే కృష్ణునే సేవింపుఁడు. నిగమశబ్దమునకు మఱియొక యర్థము గూడఁ జెప్పవచ్చును. 'నిగమయతి నితరాం ప్రాపయతీతి నిగమః.' అనఁగా పురుషార్థముల నెక్కువగాఁ బొందించునది, మనుష్యశరీరము. ఈ మనుష్యజన్మ కల్పవృక్షము వంటిది. దీని ఫలము శ్రీకృష్ణప్రాప్తి. తక్కినపురుషార్థములతో జరామరణ జన్మాది నివృత్తిలేదు. కృష్ణప్రాప్తితోనే దుఃఖముల కాత్యంతికనాశము. ఆనందప్రాప్తి.

దుర్లభో మానుషో దేహో దేహినాం క్షణభంగురః,
తత్రాఽపి దుర్లభం మన్యే వైకుంఠ ప్రియదర్శనమ్.

మనుష్యజన్మ మహాదుర్లభము. అదియును బుద్బుదప్రాయము. ఆ జన్మలో విష్ణుభక్తులు లభించుట పరమ దుర్లభము. సత్పురుషుల సంసర్గముచేతనే భక్త్యుద్రేక మేర్పడును. వీని యన్నిఁటికిఁ గారణమైన

మనుష్యశరీరము కల్పవృక్షమే. వేదాది సమస్తవిద్యలు సాధించి శుక నారదాదులును శరణుఁ జొచ్చినది కృష్ణస్వరూపమునే. ఈ యర్థ మునే 'శుకముఖాత్' అని చెప్పుట.

**వేదానాం చేహ సాంగానా మితిహాస పురాణయోః,**
**అధ్యాపనాది సాఫల్యం శ్రీకృష్ణం భజతాం భవేత్.**
**అధీత్యచతురో వేదాన్ యో న ధ్యాయేత కేశవమ్,**
**వృథా శ్రమో భవేత్తస్య పిష్టం పిష్టవతో యథా.**

వేదములు, వేదాంతములు, ఇతిహాసములు, పురాణములు వీనినిఁ జదువుట చదివించుట ఈ కార్యములకన్నిఁటికి ఫల మేదిగలదో అది కృష్ణభజనముచేతనే గలుగును. నాల్గువేదములు చదివియు కృష్ణ భజనములేనివారు పిండినే మరల విసరు చున్నారు.

**భగవాన్ బ్రహ్మ కార్త్స్న్యేన త్రి రన్వీక్ష్య మనీషయా,**
**తదధ్యవస్యత్ కూటస్థో రతి రాత్మన్యథో భవేత్.**

సకల వేదభాగములను మూఁడుసారులు సర్వతః పరిశోధించి సర్వేశ్వరుఁడు తీర్మానించిన దేమి? పరమాత్మ విషయమందుఁ బరమ ప్రేమయున్నచో సమస్త వేదార్థమును అనుష్ఠానమునకు వచ్చినట్లే యని భాగవత దశమస్కంధమం దిట్లున్నది-

**దాన వ్రత తపో హోమ జపస్వాధ్యాయ సంయమైః,**
**శ్రేయోభి ర్వివిధై శ్చాన్యైః కృష్ణభక్తిర్హి సాధ్యతే.**

దానము, వ్రతము, తపస్సు, హోమము, జపము, వేదపాఠము ఇంద్రియనిగ్రహము-వీనివంటి పలు విధములగు నితర శ్రేయస్సాధన ములు. వీనియన్నింటితో సాధింపవలసినదేమి? శ్రీకృష్ణభక్తియొక్కటే. అదియున్నచో సర్వపుణ్య కర్మలఫలము సిద్ధించినట్లే. అది లేనిచో ననుష్ఠించిన యా కర్మ లన్నియు రిత్తలు. ఇన్ని యర్థములను మూల శ్లోకమందున్న 'రసం' అను శబ్దము సూచించుచున్నది. అనఁగా

నానందస్వరూపుఁడని యర్థము. నదులగమన మెంతవఱకు? సముద్ర మందైక్యమై నామరూపములను ద్యజించువఱకు! కృష్ణుఁ డానంద సముద్రుఁడు. జీవుఁ డానందసముద్రమందుఁ జేరిపోవువఱకు నామ రూపములు అవస్థాభేదములు దప్పవు. శ్రీకృష్ణుఁడు రసమూర్తి యను విషయము దశమస్కంధము కంసవధఘట్టములోని యీ శ్లోకమును బర్యాలోచించినఁ దెలియును.

మల్లానా మశని ర్నృణాం నరవరః స్త్రీణాం స్మరో మూర్తిమాన్
గోపానాం స్వజనో సతాం క్షితిభుజాం శాస్తా స్వపిత్రో శ్శిశుః,

మృత్యు ర్భోజపతేః విరాడవిదుషాం తత్త్వం పరం యోగినామ్
వృష్ణీనాం పరదేవతేతి విదితో రంగం గతస్సాగ్రజః.

శ్రీకృష్ణుఁడు కరుణామూర్తి, భక్తవత్సలుఁడు. కనుకనే మనుష్యలీలతో భక్తజనుల హృదయములను దనవైపున కాకర్షించి కొనుట. అతని చిత్తము భక్తుని విషయమందు నిరంతర కరుణా భరితము. ఈ విషయమును దెలుపుటకే 'అమృతద్రవసంయుతమ్మనుట' 'న మే భక్తః ప్రణశ్యతి' అని భగవంతుఁ డన్నట్లు అతని భక్తు లమృత స్వరూపులు. ద్రవ మనఁగా నిక్కడ అనురాగము. 'భక్తిమాన్ మే ప్రియో నరః'. ఇదియే పరమాత్ముఁడు పెట్టెడు శంఖఘోష. అట్టి యా గోపాలకృష్ణుని నిరంతరము సేవించుటే జన్మఫలము. పండ్రెండు స్కంధములలో భగవల్లీలలను వర్ణించు నీ మహాగ్రంథము నందలి స్థాయి రసము భక్తి, శృంగారాదు లక్క డక్కడ నున్నను భక్తికే ఇందు ప్రాధాన్యము. ఈ విషయముల నన్నిఁటిని పరాశరాత్మజుఁ డీ శ్లోకమున సంక్షేపముగ వివరించినాఁడు.

'కల్పతరుః' ఈ శబ్దమునకు వంశీధరుఁడు రెండు వ్యుత్పత్తులు చెప్పెను. 'కల్పితం సంకల్పితం రాతి దదాతీతి కల్పతరుః'. మనస్సు నందుఁ గోరినదాని నిచ్చును. కల్పిత శబ్దమునందలి 'ఇ' కారమునకు

ఇది అకృతిగణము. లేక అర్ష మగుటచే సాధువని మఱియొక సమాధానము. 'కల్పం' అతీవసమర్థం చతుర్వర్గం తరతి దదాతీతి కల్పతరుః అని మఱియొక వ్యుత్పత్తి. సమర్థమైన చతుర్విధ పురుషార్థముల నిచ్చుచున్నది గనుకఁ గల్పతరు వగునని భావము. మోక్షమును గల్పతరు వెట్లొసఁగునో యాతఁడే చెప్పవలెను. గిరిధరుఁడు 'కల్పశ్చాసౌ తరుశ్చ' అని విగ్రహించెను. త్రిపురుషార్థముల నొసఁగుటలో సమర్థమని యతని భావము.

వ్యాసభగవానుఁడు భాగవతమును రచింపలే దనియు భాగవత ప్రాకట్యమే యాతని పని యనియు వంశీధరుఁడు. భాగవతము వ్యాసకల్పిత మైనచో నితర ప్రాకృతగాథలవలె నిదియు నయ్యెడిది. అపుడు సంసారనిస్తారకత్వము పూర్తిగా సిద్ధించెడిది గాదు. 'కృతవాన్ ద్వాపరస్యాంతే' అని భాగవతమందే యున్నది గదా! అక్కడి కృతవాన్ అనుటకేమి యర్థము? ప్రకటీకరణ మనియే దానికినిఁ దాత్పర్యము.

సృష్ట్యాదియందు భగవంతుఁడు గూడఁ జతుశ్శ్లోకిని దాను రచియించి బ్రహ్మదేవున కుపదేశింపలేదు. అది వేదములవలె నంతకు ముందే యాతని హృదయస్థితమై యున్నది. దానిని బ్రహ్మదేవునకు బహిర్గత మొనర్చెను. అందుకే భాగవత పురాణము బ్రహ్మ సమ్మితమైనది. 'ముహుః పిబత' ముహుః పలుమారు ననుట. సాలోక్యాది జీవన్ముక్తి యేర్పడినను భగవల్లీలాగాన ముండనే యుండును గదా యని యభిప్రాయము. 'లయ' మనుటకు రసాస్వాదజనితమైన ప్రళయ మని యర్థము. ఇది యెనిమిదవ సాత్త్వికభావము; తత్పర్యంత మని తాత్పర్యము. భాగవతపానమందు 'స్తంభాది' సాత్త్వికభావము లేర్పడును. ఎనిమిదవదియైన ప్రళయ మనెడు సాత్త్వికభావమందు విరామము. కాని, ప్రబోధము గల్గినవెంటనే మరల నష్టమసాత్త్వికభావము వఱకుఁ బాన మొనర్పవలెనని భావము.

మాంచయో ఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.

నన్నవ్యభిచారభక్తితో సేవించువాఁడు గుణముల నతిక్రమించి పోవును. అట్టివాఁడు బ్రహ్మైక్యకత్వమును తప్పక పొందును.

బ్రహ్మణోహి ప్రతిష్ఠాహం. అహం=నేనే, బ్రహ్మణః=సాధన దశ యందును, ఫలదశయందును అనువర్తించునట్టి భక్త్యాఖ్యధర్మము నకుఁ బ్రతిష్ఠ. బ్రహ్మభూయమునే గోరువాఁడు నా యందు పరమ ప్రేమను సంపాదించుకొని కైవల్యకామనతో నొనర్చిన నా భజన వలననే బ్రహ్మయందు లీయమానుఁడై బ్రహ్మధర్మమునుగూడ పొం దును. ఈ యర్థమే విష్ణుధర్మమునందును చెప్పఁబడినది.

ప్రకృతౌ పురుషే చైవ బ్రహ్మణోపిచ స ప్రభుః.
యథైక ఏవ సర్వాత్మా వాసుదేవో వ్యవస్థితః.

ప్రకృతి పురుషులకును బ్రహ్మకును ప్రభువైనవాఁడు వాఁడే. వాఁడే సర్వాత్ముఁడు. ఆ వాసుదేవుఁ డొక్కఁడే యుండునది. అందు ననే మఱియొకచోట-

యథా ఽచ్యుత ! త్వం పరతః పరస్మా
త్స్వబ్రహ్మభూతాత్పరతః పరాత్మా,
తథాఽచ్యుత త్వం కురువాంఛితం త
న్మమాపదం చాపహరా ఽప్రమేయ!

స్వామీ ! నీ వచ్యుతుఁడవు. పరునికంటెఁ బరుఁడవు. ఆత్మ స్వరూపుఁడవు. నా సమస్త వాంఛితములును నీ స్వరూపమై పోవున ట్లొనర్పుము.

హరివంశమందును విప్రకుమారానయన ప్రస్తావమందు అర్జు నుని గూర్చిన భగవద్వాక్య మిట్లు గలదు-

**తత్పరం పరమం బ్రహ్మ సర్వం విభజతే జగత్,**
**మమైవ తద్ఘనం తేజో జ్ఞాతు మర్హసి భారత ।**

అర్జునా! నేనే యీ పరబ్రహ్మను. నా తేజము నెఱిఁగినచో సమస్తము నెఱిఁగినట్లే.

బ్రహ్మసంహితలోఁ గూడ నిదే యున్నది.

**యస్య ప్రభా ప్రభవతో జగదండకోటి**
**కోటిష్వశేష వసుధాది విభూతిభిన్నమ్,**
**తద్బ్రహ్మ నిష్కల మనంత మశేషభూతం**
**గోవింద మాదిపురుషం త మహం భజామి.**

అశేష బ్రహ్మాండములకంటెను వాని తేజస్సు భిన్నము. అదే బ్రహ్మ, నిష్కలము, అనంతశేషభూతము.

గోపాలతాపిన్యుపనిషత్తు గూడ నీ రీతిగనే వాకొనుచున్నది-

**యోఽసౌ జాగ్రత్స్వప్న సుషుప్తిమతీత్య,**
**తుర్యాతీతో గోపాలః తస్మై వై నమో నమః.**

జీవగోస్వామి అమృత మనఁగా లీలారసమని వ్యాఖ్యానించెను. ఈ లీలారసాభివర్ణనము రెండు రీతులు. అతని ప్రీతి కుపయుక్తమైన దొకటి అతని ప్రీతిగనే పరిణమించిన దొకటి. రెండును మహనీయములే. సాధన మొదటిదానితో నారంభమై రెండవదిగా పరిణమించును. భావుకు లనఁగా రసవిశేష భావనాచతురులు.

**స్మరన్ ముకుందాం ఘ్ర్యుపగూహనం పునః**
**విహాతు మిచ్ఛే న్న రసగ్రహో జనః.**

పరమపురుషుని పాదములను గౌఁగిలించి దాని రస మెఱిఁగిన వాఁడు దానిని వదలలేఁడు. వైకుంఠమందుఁ గల్పతరు వున్నదఁట. దానిఫలములలో రసమాత్రము లేనఁట. హయశీర్ష పాంచరాత్ర

మందు 'పంచతత్త్వ నిరూపణము'లో నీ శ్లోకము లున్నవని జీవ గోస్వామి యుద్ధృతీకరించెను.

ద్రవ్యతత్త్వం శృణు బ్రహ్మన్ ప్రవక్ష్యామి సమాసతః,
సర్వభోగప్రదా యత్ర పాదపాః కల్పపాదపాః.

గంధరూపం స్వాదురూపం ద్రవ్యం పుష్పాదికం చ యత్,
హేయాంశానా మభావాచ్చ రసరూపం భవేచ్చ తత్.

త్వం బీజం చైవ హేయాంశం కఠినాంశం చ యద్భవేత్,
సర్వం తద్భౌతికం విద్ధి। నహ్య భూతమయం హి తత్.
రసవ ద్భౌతిక ద్రవ్య మత్రస్యా ద్రసరూపకమ్.

అత్ర అనఁగా వైకుంఠమందని యర్థము. వైకుంఠమందు సర్వము రసమయమే. హేయాంశమే లేదని పై దాని భావము.

విశ్వనాథచక్రవర్తి రసికశబ్దము నిట్లు వ్యాఖ్యానించినాఁడు. 'భక్తులచే రతి యేర్పడునది. రతియే స్థాయీభావము. అదియే రస్యమాన మగునది. కనుక నిచ్చట జ్ఞాన కర్మయోగులకు భాగములేదు'. వల్లభుల యభిప్రాయ మిది.

'నిగమకల్పతరు వన్నపుడు రూపకాలంకార మగును. అది కావ్యధర్మము. భాగవతము సర్వవేద సారోద్ధారము, బుద్ధిపరికల్పితములైన రూపకాద్యలంకారముల కందు తావు లేదు. కనుక వాచ్యార్థమునే చెప్పవలెను. అప్రమేయ మప్రసిద్ధమైనను సరే అది చెప్పకున్నచో వాక్యార్థము వ్యర్థ మగుచున్నది. భాగవతవాక్య మట్లు వ్యర్థమగుటకు వీలు లేదు'. వ్యాపకవైకుంఠము అక్షరాత్మకము. దాని యందు ప్రణవబీజమైన వేదతరు వున్నది. అక్కడనుండి సర్వజనాహ్లాదమునకై దేవతాత్మకమైన యొకఫల మానీత మైనది. ఆ ఫలమే ఇక్కడ నిరూపింపఁ బడుచున్నది.

'తత్ర అసౌ వా ఆదిత్యో దేవమధు' అని శ్రుతి. స్వర్గస్థులకు సూర్యుఁడే మధువు. మనకు తేనెవలె, స్వర్గమందుఁ గల్పవృక్షమువలె వేదైక సమధిగమ్యమైన వైకుంఠమందును శబ్దరసాత్మకమైన కల్ప వృక్ష మున్నది. 'అమృత ద్రవసమ్మితం'. అమృత మనఁగా మోక్షము. దానిని గూడ ద్రవింపఁ జేయునది. ఆలయం— 'ఈషల్లయః మోక్షః యస్మాత్' అనఁగా మోక్షానందము దీనికన్న నత్యల్పము. ముహుః అను మాట వ్యాసముని పారవశ్యమును దెల్పుచున్నది. రసికులు స్వయముగనే ద్రావుదురు గదా !.

శరీరమును మఱచి పరాశరుఁడు 'ముహుః పిబత ముహుః పిబత !' అనుచున్నాఁడు. రసికాః అనుటచే నొకఁడే త్రావినచో రసాభినివేశము సంభవింపదు కనుక గుంపుగాఁ ద్రావుఁ డనుచు న్నాఁడు. బోధయంతః పరస్పరం అనునట్లు—

పరస్పరం తద్గుణవాదసీధు
పీయూష నిర్యాపిత దేహధర్మాః.

అని భాగవతమే పల్కుచున్నది.

శుకముఖాత్ అనుటకు విజయధ్వజుల వ్యాఖ్యాన మిది. 1. శుకాచార్యుల ముఖమునుండి, 2. శుకాచార్యుఁడు మొదలైన పురాణవక్తల సమూహమునుండి అమృతద్రవ సంయుతం పరీక్షిత్తు నుద్దేశించి చెప్పఁ బడుటచేత నమృతమువలె రసయుక్తముగ నొనర్పఁ బడినదఁట ! మోక్షమునకు గురూపదేశమువలె వేదమునకు వ్యాఖ్యాన రూపమైనది. దేవలోకమందు దేవతలే మననము సేయుచున్న ఈ భాగ వతమును సజ్జనులయందలి దయచే బాదరాయణుఁడు భూలోకము నకుఁ దెచ్చెను. ఈ ఫలము వేదవృక్షమునుండి రాల్పఁబడలేదు. స్వయ ముగ నదియే పక్వమై రాలినది. బ్రహ్మాండపురాణము నుండి మధ్వా చార్యు లీ శ్లోకము నుదాహరించినారు—

**ధర్మపుష్పస్త్వర్థపత్రః కామపల్లవసంయుతః,**
**మహామోక్షఫలో వృక్షో వేదోఽయం సముదీరితః.**

**కాతితాని ఫలానీహ కృష్ణద్వైపాయనేన తు,**
**భారతాదీని యానీహ తథా భాగవతం భువి.**

**అర్ద్రీకృతాని యానీహ శుకప్రభృతిభి ర్జనైః,**
**ఖ్యాపయద్భిః గురుప్రోక్తాన్ వేదార్థాన్ గ్రంథనిష్ఠితాన్.**

**కానిచి ద్దర్శయామాస వృక్షస్యాగ్రే ఫలాని తు,**
**వ్యాచక్షమాణో వేదార్థం భగవాన్ లోకపూజితః.**

**ఏతేషా మథకేషాం వా రసాన్ పిబత సజ్జనాః,**
**ఆమోక్ష న్మహతీ తృప్తిః అహో! మే పశ్యతో భవేత్.**

వేద మనునది మహావృక్షము. ధర్మమే దాని పుష్పము. అర్థమే ఆకులు. కామమే చిగురు, మోక్షమే దానిఫలము. భారతాది పురాణములు భాగవతము ఆ వేదవృక్షమునుండి వేదవ్యాసుఁ డుద్ధృతీకరించిన ఫలములు. శుకాదులు సద్గురువులవలె వానియందున్న వేదార్థములను వివరించి వ్యాఖ్యానించిరి. ఆర్ద్రము లొనర్చిరి. ఈ మాత్రమేగాదు. వ్యాసుఁడు మూలరామాయణము పంచరాత్రము మొదలైన ఫలములను గూడ రాల్చెను. అవి వీనికన్నను మొదటే యుండినవి. వానిని వ్యాసరచితములైన యితర గ్రంథములను మోక్ష పర్యంతము మోక్షమునందును సజ్జనులు పాన మొనర్చవలెను. భగవత్ప్రీతియే భాగవతశ్రవణఫలము.

**వేదకల్పవృక్ష విగళితమై శుక ముఖసుధాద్రవమున మొనసియున్న,**
**భాగవతపురాణ ఫలరసాస్వాదన పదవిగనుఁడు రసికభావవిదులు.**

వేదకల్పవృక్ష విగళితమై, వేద మనెడు కల్పవృక్షము నుండి జారినదై, శుకముఖ=శుకమహర్షి యొక్క ముఖమందలి, సుధాద్రవమునన్=అమృతద్రవముచేత, మొనసియున్న=నిండియున్న, భాగవత

పురాణ=భాగవతపురాణమనెడు, ఫలరసాస్వాదనపదవిన్=ఫలరసము యొక్క ఆస్వాదనమనెడు మహాభాగ్యమును, రసికభావవిదులు=రసికమైన భావములను గుర్తించి, అనుభవింపఁగల ధన్యులు, కనుఁడు=పొందుఁడు, విగళితము=దానియంత కదేజాఱినది, ఎవరును బలవంతముగ రాల్చినది గాదని యర్థము. ఆ భాగవత ఫలములో శుకమహర్షి తనవ్యాఖ్యాన మనెడు నమృతమును నింపినాఁడు. మూలమందున్నట్లు శుకముఖమునుండి గళితము గాలేదు. శుకమహర్షియే తన వివరణ మనెడు నమృతము నింపి యార్ద్రి మొనర్చి పరీక్షిత్తునకుపదేశించెను. వేద మనెడు కల్పతరువునుండి నేరుగా నీపండు క్రిందఁబడలేదు. శ్రీమన్నారాయణమూర్తినుండి బ్రహ్మశాఖపైఁ బడ్డది. అక్కడనుండి నారదశాఖనందికొన్నది. అటునుండి పారాశర్యుఁడనెడి కొమ్మపై; అచట శుకముఖమునకుఁజిక్కినది. ఆ ఫలమున కాశుకమే తన చంచువుచేత నమృతనిష్క్రమణార్థము ద్వారము నొనర్చినది. శుక మాస్వాదించుటతో నా ఫల మింకను మధుర మైనది. సూతుఁడు మొదలైన సద్గురువులను కొమ్మలపైఁబడి భూలోకమునకు వచ్చినది. గురుపరంపర లేనిదే కేవల బుద్ధిబలముచేత భాగవతము నర్థ మొనర్చికొనుట కష్టము. భాగవతపురాణము వేదమువలెనే నిత్యము.

పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణా స్మృతమ్,
అనంతరం చ వక్త్రేభ్యో వేదాస్తస్య వినిర్గతాః.

పురాణ మేక మే వా సీ త్తదాకల్పాంతరే ఽనఘ,
త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్.

అంగాని చతురో వేదాః పురాణన్యాయ విస్తరమ్,
మీమాంసా ధర్మశాస్త్రం చ ప్రతిగృహ్య మయా కృతమ్.

ప్రవృత్తి స్సర్వశాస్త్రాణాం పురాణస్య తతో నృప,
వ్యాసరూప మహం కృత్వా సంహరామి యుగే యుగే.

చతుర్లక్షప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా,
తథాఽష్టాదశధా కృత్వా భూర్లోకేఽస్మిన్ ప్రకాశ్యతే.
అద్యాఽపి దేవలోకేఽస్మిన్ శతకోటి ప్రవిస్తరమ్,
తదర్థోఽత్ర చతుర్లక్షం సంక్షేపేణ ప్రకీర్తితమ్.

(మత్స్య....50 అధ్యా.)

పై వాక్యములు మత్స్యమూర్తి చెప్పినవి. వానితోఁ బురాణము లనాదియని యేర్పడుచున్నది.

ఫలరసాస్వాదనపదవి: మూలమందు ఫలం రసం అను రెండు శబ్దము లున్నవి. రసరూపమైన ఫలమని శ్రీధరుల వ్యాఖ్య. దానినే తక్కినవారుగూడ ననుసరించిన ట్లున్నది.

హేయాంశమే లేదని చెప్పుటకు రసరూప మన్నాఁడు. గళిత మైన రసము ద్రావుటకు బనికిరాదు గనుక 'ఫల' మన్నాఁడు అని వ్యాసరచనను సమర్థించుటకు శ్రీధరుఁడు కొంచెము శ్రమపడెను. పైఁగా 'రసవత్తు' అని యర్థము వచ్చును గనుక మతు బర్థమున కవకాశ మున్నది. అది రానిదానికి 'వివక్ష' యను నొకకారణము నాశ్రయించి వ్యాకరణమును దృప్తిపఱచుటకై యాతఁడు గష్టపడెను. ఈ బాధను గమనించిన యమాత్యుఁడు 'ఫలరస' మను షష్ఠీతత్పురు షముగాఁ జమత్కార మొనర్చినాఁడు. ఇందులోఁ గూడ నాతఁడు 'రస' శబ్దమును విడువలేదు. ఫలమునుగూడఁ జేర్చికొన్నాఁడు. పోతన్న యి ట్లొనర్చుటతో ననేకక్లిష్టవ్యాఖ్యానములకుఁ జోటులేక పోయినది. మూలములో 'రసికాః భావుకాః' అని విడివిడిగా పదము లున్నవి. రసికశబ్దమును భావమునకుఁ బోతన్న విశేషణ మొనర్చెను. రసికమైన భావముల నెఱిఁగిన వారని తాత్పర్యము. భక్తియోగు లన్నమాట. ఈ మాటతో జ్ఞానకర్మయోగుల కిందు తావులేదని తేలి నది. భక్తియోగ మడుగడుగునను రాసిక్యముతోఁ గూడికొన్నది. భావములలోని రాసిక్యమును హృదయార్ద్రిత నుపాసించు భక్తి

యోగులే యెఱుఁగుదురు. శుకముఖ సుధాద్రవము 'ఫలరసాస్వాద నము' రసికభావవిదులు.- ఈ మూఁడును బోతనామాత్యుఁ డొనర్చిన సమర్థవంతములైన మార్పులు.

నైమిశేఽనిమిష క్షేత్రే మునయ శ్శౌనకాదయః
సత్రం స్వర్గాయ లోకాయ సహస్రసమ మాసత. 4

త ఏకదా తు మునయః ప్రాత ర్హుతహుతాగ్నయః,
సత్కృతం సూత మాసీనం పప్రచ్ఛు రిద మాదరాత్. 5

ఋషయ ఊచుః:

త్వయా ఖలు పురాణాని సేతిహాసాని చానఘ,
ఆఖ్యాతా న్యప్యధీతాని ధర్మశాస్త్రాణి యాన్యుత. 6

యాని వేదవిదాం శ్రేష్ఠో భగవాన్ బాదరాయణః,
అన్యేచ మునయ స్సూత! పరావరవిదో విదుః. 7

వేత్థత్వం సౌమ్య! తత్సర్వం తత్త్వత స్త దనుగ్రహాత్,
బ్రూయు స్స్నిగ్ధస్య శిష్యస్య గురవో గుహ్య మప్యుత.8

అనిమిషక్షేత్రే=వైష్ణవక్షేత్రమైన, నైమిశే=నైమిశారణ్యమందు, శౌనకాదయః=శౌనకుఁడు మొదలైన, మునయః=మునులు, స్వర్గాయ లోకాయ=స్వర్గవాసులైన దేవతలచేత నుతింపఁబడు హరింజేరుకొఱకు, సహస్రసమం=వేయివర్షములు పర్యాప్తముగాఁగల, సత్రం=సత్రయాగమును, ఆసత=చేయదొరకొనిరి, తే మునయః=ఆ మహర్షులు, ఏకదాతు=ఒకానొకనాఁడు, ప్రాతః=ప్రాతఃకాలమందు, హుతహుతాగ్నయః=నెరవేర్పఁబడిన, నిత్యనైమిత్తికహోమములు గలవారై, సత్కృతం=గౌరవింపఁబడి, ఆసీనం=ఆసనోపవిష్టుఁడైన, సూతం=సూతునిగూర్చి, ఇదం=ఈ విషయమును (ఇట్లుగా), ఆదరాత్=ఆదరముతో, పప్రచ్ఛుః=ప్రశ్నించిరి, ఋషయ ఊచుః=ఋషు లన్నారు, అనఘ!=పాపములేని వాఁడా! త్వయా=నీచేత, సేతిహాసాని=ఇతిహాసములతోఁ గూడికొన్న పురాణాని=పురాణములు, ఉత=ఇంకను, యాని ధర్మశాస్త్రాణి=ఏ ధర్మశాస్త్ర

ములు గలవో అవియును, అధీతాని=చక్కఁగా నభ్యసింపఁబడినవి. అఖ్యాతాని చ=వ్యాఖ్యానింపఁ బడినవిగూడ, విదాం=జ్ఞానులలో, శ్రేష్ఠః=శ్రేష్ఠుఁడైన, భగవాన్ బాదరాయణః=భగవంతుఁడైన వేదవ్యాసుఁడును, యాని=ఏ విషయములను, వేద=తెలియునో, పరావరవిదః=సగుణ నిర్గుణ బ్రహ్మల తత్త్వమును గూర్చి, అన్యేచ మునయః=తక్కిన మునులును, యాని విదుః=ఎయ్యవి తెలిసికొన్నారో, హే సౌమ్య! సూత!=ఓ సౌమ్యుఁడవైన సూతా! తత్సర్వం=ఆ సమస్త విషయ గణమును, తదనుగ్రహాత్=వారి యనుగ్రహమువలన, త్వం=నీవు, వేత్థ=తెలిసికొన్నావు, గురవః=గురువులు, స్నిగ్ధస్య శిష్యస్య=తమయందు ప్రేమగల శిష్యునకు, గుహ్యమపి=రహస్య విషయమును గూడ, బ్రూయుః ఉత=స్పష్టముగాఁ జెప్పుదురు గదా!

విష్ణుక్షేత్రమైన నైమిశారణ్యమందు, శౌనకాది మహర్షు లందరును జేరిరి. వారు స్వర్లోక గీయమానుండైన, హరిం జేరుకొఱకు, సహస్రవార్షికమైన సత్రయాగము నొనర్చుచున్నారు. ఒకనాఁడు వారి కడకు సూతుఁ డేతెంచెను. అతనిని వారు అర్ఘ్యపాద్యాదులతో నర్చించి, సుఖాసీనునిఁ జేసిరి. వారిట్లు ప్రశ్నించినారు. 'ఓయీ! సూతా! పాపదూరుఁడవు. వ్యాస భగవానునిచెంత సమస్తపురాణము లభ్యసించితివి. ఇతిహాసములు చదివితివి. ధర్మశాస్త్రములు అధ్యయన మొనర్చితివి. కేవలాధ్యయనము గాదు. వానిని పలుమాఱు వ్యాఖ్యానించితివి. భగవంతుఁడైన బాదరాయణున కెన్నివిషయము లవగతములో నన్నియు నీకుఁ దెలియును. అతని హృదయమం దట్టి స్థానమును నీవు ప్రేమబలమున సంపాదించుకొంటివి. పరావరవిదులైన యితరమహర్షులకుఁ దెలిసిన విషయములుగూడ నీ వెఱుఁగుదువు. ఎట్లెఱుఁగవలెనో అట్లే యెఱుఁగుదువు. వారికి నీయందుఁగల వాత్సల్య మట్టిది. భక్తిగల శిష్యునకు గురువులు రహస్యార్థములను గూడ బోధింతురు గదా!.

## శ్రీధరవ్యాఖ్య :

ఇంతకుముందు వ్యాసభగవానుఁడు శ్లోకత్రయముతో విశిష్ట ఇష్టదేవతాస్మరణ మొనర్చినాఁడు. ప్రారంభింపఁ బోవు శాస్త్రము

నందలి విషయప్రయోజనాది వైశిష్ట్యమును దెలిపినాఁడు. భాగవతము సుఖసేవ్య మనియు నిరూపించినాఁడు. ఈ రీతిగా శ్రోతల నభిముఖుల నొనర్చికొని శాస్త్రము నారంభించుచున్నాఁడు. బ్రహ్మదేవుఁ డొకసారి మనోమయమైన చక్రమును వదలెను. ఎందుకు? మహర్షులు తమ తపస్సుల కనువైనచోటుఁ దెలుపుమని ప్రార్థించినారు. అతఁడీ మనోమయ చక్ర మెక్కడ శీర్య మగునో అది మీ కర్హమైన చోటని యా చక్రమును వదలెను. వాయుపీయమం దీ వృత్తాంత మున్నది.

ఏత న్మనోమయం చక్రం మయా యత్ర విసృజ్యతే,
యత్రాస్య శీర్యతే నేమిః స దేశ స్తపస శ్శుభః.

ఇత్యుక్త్వా సూర్యసంకాశం చక్రం సృష్ట్వా మనోమయమ్,
ప్రణిపత్య మహాదేవం విససర్జ పితామహః.

తేఽపి హృష్టతమా విప్రాః ప్రణమ్య జగతాం ప్రభుమ్,
ప్రయయు స్తస్య చక్రస్య యత్ర నేమి ర్వ్యశీర్యతే,
తద్వనం తేన విఖ్యాతం నైమిశం మునిపూజితమ్.

నేమి విరిసినచోటు నేమిశం. నేమిశమే నైమిశ మైనది. కొందరు 'నైమిష' మను పాఠమును జదువుచున్నారు. వరాహపురాణమందు తద్వివరణము వచ్చును. గౌరముఖుఁడను ఋషితో భగవంతుఁ డనుచున్నాఁడు_

ఏవం కృత్వా తతో దేవో మునిం గౌరముఖం తథా,
ఉవాచ నిమిషేణేదం నిహతం దానవం బలమ్.

అరణ్యేఽస్మిన్ తత స్త్వేత న్నైమిషారణ్య సంజ్ఞితమ్,
భవిష్యతి యథార్థం వై బ్రాహ్మణానాం విశేషకమ్.

మహావిష్ణు వన్నాఁడు. ఇక్కడ నిమిషుఁడను మహామునిచేత దానవబలము సంహరింపఁ బడినది. నాటనుండి దీనిపేరు నైమిషారణ్య మయ్యెను. ఇది దివ్య తపోభూమి యైనది.

అనిమిషే క్షేత్రే=అనిమిషుఁ డనఁగా శ్రీవిష్ణువు. అలుప్తదృష్టి యైన దానివలన దేవతలకు రెప్పలుండవు గనుక నతఁడలుప్త దృష్టి యైనాఁడు. పైఁగా శౌనకాదులు 'క్షేత్రేస్మిన్వైష్ణవే వయం' అను చున్నారు. ఈ వైష్ణవక్షేత్రమందు అనియర్థము. 'స్వర్గాయలోకాయ' స్వః స్వర్గే గీయత ఇతి, స్వర్గాయో హరిః, స ఏవ లోకః=భక్తానాం నివాసస్థానం తత్ప్రాప్తయే ఇత్యర్థః, స్వర్గవాసులచేత గీయమానుఁడు స్వర్గాయుఁడు- శ్రీమహావిష్ణువు. అతఁడే లోకము. అనఁగా భక్తులకు నివాసస్థానము, అతనినిఁ బ్రాపించుట కొఱకు అని తాత్పర్యము, సత్రం=సత్రయాగము.

సత్ర మాచ్ఛాదనే యజ్ఞే సదా దానే వనేఽపి చ.

అని నిఘంటువు, హుతహుతాగ్నయః=ఇచ్చట రెండు హుత శబ్దము లున్నవి. మొదటిహుతము నిత్యకర్మములకు రెండవ హుతము నైమిత్తిక కర్మములకు; నిత్యనైమిత్తిక హోమములు సాకల్యముగాఁ దీర్చి' అని యర్థము. ఇతిహాసములు మహాభారతాదులు. ఇతి+హ+ఆస అని వ్యుత్పత్తి. 'ఒకనాఁ డిట్లు జరిగెనుగదా! అని యర్థము. వంశీధరుఁడు వరాహపురాణమందు 'బ్రాహ్మణానాం విశేషకం' అను శ్లోకము నిట్లు వ్యాఖ్యానించుచున్నాఁడు. విశేషక మనఁగా వైశిష్ట్యా పాదకము. ఎక్కడ సాధకుఁడు కామాదులను శీఘ్రముగా జయించు టకు శక్తుఁడగునో అక్కడనే నివసింపవలెనని తాత్పర్యము. మొదలు శౌనకాదులకు సకామ పరత్వమేయుండెను. అప్పుడు రోమహర్షణునితో వారికి సంబంధ మేర్పడినది. అతఁడు నానాపురాణములు శాస్త్రములు మొదలైన వానిని వ్యాఖ్యానించెను. వానిని వారు తీవ్రముగా మనన మొనర్చిరి. దానితో జిజ్ఞాస యేర్పడెను. పిదప సాధువైన యుగ్రశ్రవ సునితోడి సంబంధము. దానితో భక్తిరసమునందు స్పృహ యేర్పడి నది. వారే యనుచున్నారు.

కర్మణ్యస్మి న్ననాశ్వాసే ధూమధూమ్రాత్మనాం భవాన్,
ఆపాయయతి గోవిందపాద పద్మాసవం మధు.

ఓ సూతుడా! మే మశాశ్వత కర్మ లొనర్చుచుంటిమి. మా మనస్సులు ధూమముచేత ధూమ్రమము లైనవి. ఇట్టి వారిలో గోవింద పాదపద్మాసవమును బంచితివి.

ఆ తరువాత జిజ్ఞాసయును శిథిలమై పోయెను. భక్తియందుఁ బరిశ్రమ మేర్పడినది. స్వర్గార్థకమైన సత్రయాగము విషమే యైనది. అనఁగా నప్రధానమై పోయినది.

వారే 'కథాయాం సక్షణా హరేః' అనుచున్నారు. మేము భాగవతకథయందు సావధానచిత్తులమై యున్నాము. భాగవతశ్రోత లైన వారియందు కర్మనిష్ఠ గళితమై పోయెను. భక్తిప్రభావ మెచ్చినది. శుకులు గూడఁ 'బరినిష్ఠితోఽపి నైర్గుణ్యే' నిర్గుణబ్రహ్మానుధ్యానమునందు రతులు. కాని భాగవతభక్తి వారి నాయగడ్త నుండి వెలికీడ్చినది. 'స్వర్గాయ లోకాయ' విష్ణులోకమైన వైకుంఠమున కని యర్థాంతరము.

బహుభ్యో దీయతే యత్ర తృప్యంతి ప్రాణినో బహు,
కర్తారో బహవో యత్ర తత్సత్రమభిధీయతే. అని

నీలకంఠుని గచ్ఛద్వ్యాఖ్య:

ఎక్కడ ననేకులకు దాన మీయఁబడుచున్నదో పలు ప్రాణు లెందుఁ దృప్తిపడుచున్నవో దేనియందుఁ గర్తలుకూడ ననేకమందియో యదియే సత్రము. భారతమునందు నీలకంఠుఁ డీ శ్లోకము నుదాహరించినాఁడు-

శౌనకస్య కులపతేః సత్రే ద్వాదశవార్షికే

అనునది సందర్భము. అక్కడ సత్రము ద్వాదశవార్షికము సాఁగినదని యున్నది. భాగవతము సహస్రసమ మనుచున్నది. ఈ

విరోధ పరిహార మెట్లు? దీనిని వంశీధరుఁడు చమత్కారముగా సమ ర్థించెను. 'ద్వాదశ' యనుదానికి 'ద్వాభ్యాం బిందుభ్యాం అధికా దశేతి ద్వాదశ' అని యతని విగ్రహము. అనఁగా పదిపైన రెండు సున్నలని యర్థము. లేక కల్పాంతరాపేక్షతో సమర్థింపవచ్చు నని వేఱు సమాధానము. మూఁడవ సమాధాన మిది. 'యో మాసస్సం వత్సరః' అని వివరణము. అనఁగా సహస్రమాసిక మన్నమాట. ఈ విషయము నీలకంఠుఁడే భారత వనపర్వమందు ముప్పదియైదవ యధ్యాయములో 'మాసః ప్రతినిధిః' అనుచో నుదాహరించినాఁడు. శౌనకః = 'శౌనస్సర్వ వివేకస్స్యాత్' అని లీలావతి సర్వవివేకము గలవాఁడు శౌనకుఁడు. సర్వవివేకము భగవద్భక్తులకే సిద్ధించును. సర్వవ్యాపియైన భగవంతుని యాథార్థ్యముగా గ్రహించువారు వారే గనుక భగవద్భావ రసికుఁడైన మునివరుఁడు శౌనకుఁడు లేక శుకుని కొడుకు శౌనకుఁడు.

శునక శ్శౌనకో యస్య బహ్వృచః ప్రవరో మునిః

అని నవమస్కంధము. ధర్మశాస్త్రము లనఁగా మను యాజ్ఞ వల్క్యాది స్మృతులు.

మన్వాద్యా శ్స్మృతయో ధర్మశాస్త్ర మిత్యభిధీయతే

'అధీతాని' అని చెప్పుటవలనఁ బురాణాదులు వేదములవంటివి గనుక గురుముఖముగనే పఠింపవలెనని సూచితమైనది. భగవాన్ బాదరాయణః = వ్యాసుఁడు నారాయణావతారము. అందుచే భగ వంతుఁడు 'బదరీణాం సమూహో బాదరం తదుపలక్షితం అయనం నివాసస్థానం యస్యసః = బదరీవృక్షములచే నిండిన వనమే వ్యాసుని నివాసస్థానము.

తస్మిన్ స్వ ఆశ్రమే వ్యాసో బదరీ షండమండితే

అని భాగవతము. 'బదరీ తరుషండ మండలాంతర సరణిన' అని పెద్దన. 'వాదాన్ అనీశ్వర వాదాదిన రీణాతి హినస్తీతి బాదరా

యణః' అని వేఱు వ్యుత్పత్తి. 'రీ—గతిపోషణయోః' అని ధాతువు. అనీశ్వరవాదములను ఖండించువాఁడని యర్థము. సూత!—పౌరాణికా! అని సంబుద్ధి. 'సూతాః పౌరాణికాః ప్రోక్తాః పురాణం సర్వసంగ్రహః' అని ధరణిదేవుఁడు.

'నైమిశం' అని పాఠము గూడ నున్నదని వీరరాఘవీయ వ్యాఖ్య. 'నిమిశం త్వత్ర మహర్షయ ఇతి నిమిశమ్. నిమిశమేవ నైమిశమ్', మహర్షులు నివసించుచోటని యర్థము. స్వర్గ మనఁగా నిరతిశయానందము. అట్టి లోకము పరమపదము, వైకుంఠము.

**స్వర్గోలోకోఽత్ర పరమపద మేవ. అనంతే స్వర్గేలోకే ఽజయ్యే ప్రతితిష్ఠతి. స్వర్గే లోకే అమృతత్వం భజంతి.**

స్వర్గమందు నిరతిశయానందము. దానికన్న నధికమైన లోకము పరమపదము.

ఇక్కడ సత్త్ర మనఁగా బ్రహ్మసత్త్ర మని భావము. దాని లక్షణము శ్రుతిగీతయం దిట్లున్నది—

**తుల్యశ్రుత స్తపశ్శీలా తుల్యస్వీయాది మధ్యమాః,**
**అపి చక్రుః ప్రవచనం ఏకం శుశ్రూషవోఽపరే.**

హుతహుతాగ్నయః అనుదాని కితని వ్యాఖ్యాన మీ క్రిందిది—

**హుతేన హోమార్హద్రవ్యేణ పయస్సర్పిరాది సాధనేన**
**హుతా అగ్నయః ఆహవనీయాదయః యై స్తథా భూతాః.**

హోమద్రవ్యములు పయస్సర్పిరాదులు. అవే హుతః వానిచేత ఆహవనీయాదుల నర్చించి యని యర్థము. 'వేద అని యతఁ డొక్కతే పద మొనర్చినాఁడు. 'స్వరూపతః అస పర్యంతార్థతశ్చ వేదం విదంతీతి వేదవిదః'— స్వరూపముతోను స్థానపర్యంతముగను వేదముల నెఱిఁగినవారు. 'పరావరవిదః', పరఁ

పరమాత్మతత్త్వం; 'అవరం ప్రకృతిపురుషతత్త్వం తద్విదః'; ప్రకృతి పురుషతత్త్వమును దెలిసినవారు.

శుకదేవుఁడు స్వర్గాయ లోకాయ అనుదానిని వ్యాఖ్యానించుచు స్వర్గశబ్దమునకు భగవల్లోకమని యర్థము చెప్పెను. అది సత్యలోకమునకుఁ బైనున్నదని ముద్గలోపాఖ్యానము.

బ్రహ్మణ స్సదనా దూర్ధ్వం తద్విష్ణోః పరమం పదమ్,
శుద్ధం సనాతనం జ్యోతిః పరం బ్రహ్మేతి యద్విదుః.

జాపకోపాఖ్యానమందును–

ఏతే వై నిరయస్తాత! లోకస్య పరమాత్మనః,
అభయం చానిమిత్తం చ న తత్క్లేశ సమావృతమ్.
ద్వాభ్యాం ముక్తం త్రిభి ర్ముక్తం అష్టాభి స్త్రిభి రేవచ.

దీని విస్తరము వేదాంతకౌస్తుభమం దున్నదఁట. 'పరావరవిదః ద్వే బ్రహ్మణీ వేదితవ్యే శబ్దబ్రహ్మ పరం చ యత్ శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధి గచ్ఛతి'. అవరబ్రహ్మ, శబ్దబ్రహ్మ, పరబ్రహ్మ పరమాత్ముఁడు.

## వల్లభాచార్యవిరచిత సుబోధినీవ్యాఖ్య :

భాగవతమునకు పరంపరాగతములైన యేడర్థము లున్నవి. అవి కథార్థమునకంటెను భిన్నమైనవి. ఇతర టీకాకారులు వీనిని దెలియరు.

శాస్త్రే స్కంధే ప్రకరణే అధ్యాయే వాక్యరే పదే,
ఏకార్థం సప్తధాఽజ్ఞాన న్న విరోధేన ముచ్యతే.

ఆనందరూపుఁడైన హరిలీలలు శాస్త్రార్థములు. వానికిఁ బ్రయోజనము భక్తి యేర్పడుట. సృష్ట్యాదులు లీలలని తెలిసినపుడే భక్తి యేర్పడును. కార్య మనుకొన్నపుడు లేదు. కౌతుకముతో ననాయా

సముగాఁ జేయఁబడు కర్మ లీల. అట్టి లీలకే మహత్త్వ మేర్పడును. నిర్దుష్టత్వమును బొసఁగును. ఆ లీల ముఖ్యముగాఁ బది రీతులు.

**అత్ర సర్గో విసర్గశ్చ స్థానం పోషణ మూతయః,**
**మన్వంతరే శాఽనుకథా నిరోధో ముక్తిరాశ్రయః.**

అను పైని వచ్చు భాగవతశ్లోకముతో నీ యర్థము నిరూపింపఁ బడుచున్నది. ఈ దశవిధ లీలలును మూఁడవస్కంధము మొదలుకొని పదవస్కంధము పూర్తివఱకును చెప్పఁబడును. ప్రథమస్కంధమున శ్రోతృవక్తృలక్షణము; అంగనిరూపణము ద్వితీయ స్కంధమందు; కనుక గౌణ లీలలు రెండు; వెరసి పండ్రెండు, ప్రథమస్కంధమందు హీన మధ్యమ ఉత్తమ భేదములతో నధికారి లీల నిరూపింపఁబడును. ఎందుకు? భాగవతార్థజ్ఞానమందు తారతమ్య బోధనము కొఱకు; ఈ గ్రంథమందరి కొక్కరీతిగనే యర్థముగాదు. సూతశౌనకుల కర్థమైన దొకరీతి. నారదవ్యాసుల కవగతమైనది వేరొకపద్ధతి. శుకపరీక్షిత్తులకుఁ దెలిసినది యుత్కృష్టమైన మూఁడవపద్ధతి. కనుక నధికారినిబట్టి భాగవత మర్థమగుచున్నదని తాత్పర్యము. మూఁడధ్యాయముల యందలి ప్రశ్నోత్తరరూపములచేత హీనాధికారి తెలుపఁబడుచున్నాఁడు. 'నైమిశే అనిమిషక్షేత్రే మునయశ్శౌనకాదయః'. అక్కడఁ జేరిన మునులు యజ్ఞాదులచేఁ బరిశుద్ధులు. యజ్ఞరూప భగవదావిష్టులు. భగవత్ప్రశ్నమందుఁ బ్రథమాధికారులు. సత్రమందు ఋత్విక్కులు అధ్వర్యులు నందరు సమానులు. ఇక్కడఁ జేరిన వారందరును మంత్రద్రష్టలు. సత్రయాగము భాగవతావిర్భావమునకు ముందొక సారి జరిగినది.

**విశ్వసృజః ప్రథమాస్సత్ర మాసత,**

అప్పు డలౌకిక భగవదావిర్భావమే జరిగెను. శౌనకాదు లారంభించినది రెండవసారి. ఇక్కడఁ గూడ భాగవతరూపమైన భగవంతుని యావిర్భావ మేర్పడినది. ఈ విషయము ఆ మునులకు ముందే తెలి

యును. ఏకదా=హరిగాథోపగాయన కాలమని యర్థము. ఆనాఁడు సూతుఁ డఱుదెంచునని మునులకు ముందే తెలియును వా రందర లౌకిక పరిజ్ఞాన మున్నవారు. పప్రచ్ఛుః=ప్రశ్నించిరి. భగవత్కథా రసాభినివేశముతో నొకరిని మించి యొకరు ముందుపడి యడిగి రనుట. అందుకే బహువచనము. ఇక్కడవారు వేయఁబోవునవి భగవ ద్విషయికములైన యాఱుప్రశ్నలు. ఎందుకు? భగవంతుఁడు షడ్గుణై శ్వర్య పరిపూర్ణుఁడు గనుక, ఖలు=కదా! మే మొనర్చునది స్తుతి కాదు. యథార్థకథన మని భావము.

అనఘ!=విద్యోపజీవనమైన పాపము లేదని యర్థము. ఆఖ్యాతాన్యప్యధీతాని=తొలుత నొకసారి చదివి వ్యాఖ్యానించుట, వ్యాఖ్యానించి మరలఁ జదువుట, మరలఁ వ్యాఖ్యానము. ఇట్లు పునః పునరాఖ్యానములు జరిగినవని భావము. అందుకే వారికి విషయనివేదనమందు నిస్సందేహము. 'ధర్మశాస్త్రాణిచ అధీతాని'

ధర్మార్థకామ మోక్షాఖ్యాః చత్వారోఽర్థా మనీషిణామ్,
జీవేశ్వర విచారేణ ద్వేధాతేహి నిరూపితాః.

ఈశ్వరవిచారి శాస్త్రములు వేదములే. జీవవిచారము నాల్గింటి యందు నున్నది. స్మృతులయందు ధర్మము, నీతిశాస్త్రములం దర్థము వాత్స్యాయనాదులందు కామము, సాంఖ్యాదులందు మోక్షము. జీవ విచారమునకు సంబంధించి వేదభిన్నములైన సమస్త శాస్త్రములందును పౌరాణికులైన సూతులు సమర్థులు. బాదరాయణుఁడు గుహ్యములైన విషయములు సూతున కెట్లు చెప్పెను? సూతుఁ డత్యంత తపశ్శక్తితోఁ దదధికారమును సంపాదించి కొన్నాఁడు. పరావరవిదః =పరులు బ్రహ్మాదులు. అవరులు తక్కినవారు. ఆ మునులు ఈశ్వ రేచ్ఛను భూతభవిష్యత్కాల స్వరూపమును దెలిసినవారు.

గిరిధరకృతమైన బాలప్రబోధిని :

స్వర్గలోక మనఁగా నిక్కడ వైకుంఠమే. 'స్వర్యానంమేఽభి కాంక్షంతి' అని యేకాదశస్కంధమందు వైకుంఠమునకు 'స్వ' శ్శబ్దము భగవంతుఁడే వాడఁబోవు చున్నాఁడు. లేక 'స్వర్గాయ' యనఁగా భగవదానందాంశ లాభనుకొఱకై యనియుఁ జెప్పికొన వచ్చును. కలియుగమందు సాక్షాద్భగవ దావిర్భావ మసంభవము. ఐనను నామాత్మకమైన భాగవతరూపమైన భగవదావిర్భావము జరగినది. ఆసత్ర=ఒనర్చిరి; ఇక్కడ 'అస' ధాత్వర్థ మవివక్షితము. కేవల ప్రత్యయార్థమే వివక్షితము. 'పశోరాలభన మాలభంత', 'శ్రాద్ధం నిర్వపతి', 'పాణిగ్రహణ ముపయంతి' ఇత్యాదులందు ధాత్వర్థమును వదలిపెట్టి 'చేసిరి' అను నర్థమునే స్వీకరించుచున్నాము గదా!

విజయధ్వజవ్యాఖ్య :

> బ్రహ్మజ్ఞానేన వా ముక్తిః ప్రయాగేమరణేన వా,
> అథవా స్నానమాత్రేణ గోమత్యాం కృష్ణసన్నిధౌ.

పైది స్మృతివాక్యము. బ్రహ్మజ్ఞానము, ప్రయాగమరణము, గోమతీస్నానము- ఇవి యొకొక్కటియు మోక్షసాధనము లని తాత్పర్యము. కనుక వేఱురీతితోఁ గూడ మోక్షప్రాప్తి యగును గదా! మరి బ్రహ్మజ్ఞాన జనకమైన యీ భాగవత శ్రవణముతో నేమిప్రయోజనము? అని ప్రశ్న. బ్రహ్మజ్ఞానముననే మోక్షప్రాప్తి. కేవలకర్మతోఁ గాదని సిద్ధాంతము. కర్మచేతనే మోక్షప్రాప్తి యగుచున్నచో నక్కడక్కడ శౌనకాది మహర్షులు హరిమాహాత్మ్యమును గూర్చి ప్రశ్నించుట వ్యర్థ మగును. కర్మ జ్ఞానప్రాప్తికిఁ గారణము. ఈ విషయమును దెలుపుటకే యీ ప్రారంభము. అంతేకాదు; తన శిష్యు లందఱును భాగవతశ్రవణము చేసినవారే యని చెప్పుటకే వ్యాసుఁ డిట్లారంభించినాఁడు. భాగవతముఁ జదువు వారికిని వినువారికిని మహాపుణ్యమును

బ్రాపింపఁజేయుననుటకే శౌనకాదుల ప్రశ్న. సూతసమాధానముతో భాగవత మారంభింపఁ బడుచున్నది. నైమిషే=నిమిషులను మహర్షు లిందుఁ దపమొనర్చిరి, అందుచే 'నైమిషము'. ఆ మహర్షు లారగించు టకుఁ దగిన ఫలములుగల వృక్షములుగల దగుటచేతను నైమిషము. ఇచ్చట శ్రీనృసింహమూర్తి మొదలైన దేవతలు వసింతురు. 'మున యశ్శౌనకాదయః' అనిగాక 'ఋషయశ్శౌనకాదయః' అని పాఠము. మహర్షులు త్రికాలజ్ఞులు మంత్రద్రష్టలు శౌనకాదులట్టివారు. 'స్వర్గాయ లోకాయ'=1. స్వర్గవాచ్యుఁడైన శ్రీమహావిష్ణువు నివసించునది, 2. సర్వకాలములందును నానంద జ్ఞానములే దేహమైన శ్రీమహా విష్ణువుండునది. 3. స్వర్శబ్దవాచ్యుఁడైన విష్ణువును బొందించెడి లేక జ్ఞాపకమెలయించెడి వైకుంఠమునుబొందు నుద్దేశ్యముతో ననియర్థము. సత్రం=సజ్జనులను గాపాడునది, 2. పరమాత్మచేతనే రక్షితమైనది, 3. ప్రశస్తమైన కర్మలలోఁ బ్రశస్తమైనది. కర్మమే మోక్షసాధన మను భావమును నిరోధించుటకే వ్యాసుఁ డీ కథ నారంభించినాఁడు. దీనితో 'శివదం తాపత్రయోన్మూలనం' అని ముందుఁ జెప్పిన విషయమును గూడ సమర్థించినటు లైనది. దీనికిఁ బ్రమాణముగాఁ బద్మపురాణమం దీ శ్లోక మున్నది-

> ఆఖ్యాయికాః ప్రదర్శ్యంతే సర్వవేదేషు సర్వశః,
> ద్యోతయం త్యస్తు మహతాం తాత్పర్యం తత్ర తత్రహ.
> అలాభః పురుషార్థస్య ప్రోక్తమర్థ మృతేత్వితి,
> ద్యోతనాయ మహారాజ! శ్రద్ధావృద్ధ్యర్థ మేవ చ.

"అక్కడక్కడ శాస్త్రములందుఁ జెప్పఁబడిన కథ లన్నియు నా యా ప్రమేయ విశేషములందు మహనీయుల తాత్పర్య మేమి? యను విషయమునే ప్రపంచించును వారు చెప్పిన పద్ధతికంటె భిన్నమైన రీతిలో నీ పురుషార్థము లభింపదు" అను విషయమునే యవి సమ ర్థించుచున్నవి. వారు చెప్పిన రీతియందు శ్రద్ధను గూడ హెచ్చించు

చున్నవి. కనుక కథలును తాత్పర్యలింగము లనియే తెలియవలెను. పప్రచ్ఛ రిద మాదరాత్. ఇచ్చటి 'ఆదరాత్' అనుదానికి బదులుగా 'అదృతాః' అను పాఠమును పీ రాదరించిరి.

1. వినీతులైన, 2. వచ్చిన యతిథులైన సూతుల చేతను, బూజితులైన, తే ఋషయః=సత్రయాగ దీక్షితులైన యా ఋషులు దాము సర్వజ్ఞులైనను, సత్కృతం=తమ యాశ్రయమునకు వచ్చి యోగ్యతకుఁ దగినట్లుగాఁ దమతో నుపచారము లందిన సూతునిఁ జూచి యని యర్థము. శౌనకాది మహామునులు ప్రశ్నించినది ప్రపంచ జనులయందుఁ దమకున్న దయచేతనే గాని తమ యజ్ఞతచేఁ గాదని తాత్పర్యము.

'సూత' ఇది ప్రశంసావాక్యము. తా మతనిఁ బ్రశంసించి నచో నుత్సాహవంతుఁడై హరికథాకథనము సంతోషముతోఁ జక్కగాఁ వివరింతురని ఈ పొగడ్త. అనఘ=సమస్త కార్యములను వదలిపెట్టిన వాఁడా! భగవాన్=శ్రీమన్నారాయణుని యవతారమైన వ్యాస మహర్షి, పరావరవిదః=సర్వోత్తమత్వమును తదితరమైన యస్వతంత్ర తత్త్వమును జక్కగా నెఱిఁగినవారు. గడచిపోయిన విషయములను ముందు రాఁగల విషయములను దెలిసిన బ్రహ్మాదులు శుకాదులునన్న మాట. తత్త్వతః=తమ తమ యోగ్యతకుఁ దగినట్లుగాఁ దమ తమ జీవస్వరూపమున కనుగుణముగా నని తాత్పర్యము.

ఓయి సూతుఁడా! సర్వజ్ఞుఁడైన బాదరాయణుఁడు రచించిన భారతాదులైన ఇతిహాసములను, పురాణ, ఉపపురాణములను జక్కఁగా దెలిసినవాఁడవు. మను, యాజ్ఞవల్క్యాది రచితములైన ధర్మశాస్త్రాదు లందును మేటు రివి. వ్యాసుఁడు, బ్రహ్మాద్యపరోక్షజ్ఞానులు మొదలైన వారి యనుగ్రహముచేత నీ యోగ్యతకుఁ దగినట్లు వేదభిన్నములైన పౌరుషేయ గ్రంథముల నన్నిటిని జదివి వ్యాఖ్యానించిన వాఁడవు. కనుక మా ప్రశ్నములకు సరియగు నుత్తరమిచ్చు సామర్థ్యము నీకుఁ

గలదు అందుచే నీ వెఱిఁగిన పురాణాదులలో ముముక్షుజీవుల కేది ముఖ్యముగా శ్రేయస్సాధనమని తెల్పఁబడినదో దానిని యుపక్రమము మొదలైన తాత్పర్యలింగములతో నిష్పక్షపాతమైన దృష్టితో నీవు తీర్మానించికొన్న దానిని స్పష్టముగా మాకు నిర్వచింపుమని తాత్పర్యము. ఇందుపై నీ భాగమునకుఁ జెందిన పోతనామాత్యుల రచన వ్యాఖ్యానింపఁ బడుచున్నది. వ్యాసుఁడు నైమిశే అనిమిష క్షేత్రే అని నైమిశారణ్యమును సూచింపఁగాఁ బోతన్న యీ యరణ్యమును విస్తృతముగా వర్ణించినాఁడు.

పరమభాగవతుఁడైన పోతనామాత్యుఁడు వ్యాసకృతము మోక్షప్రదము నగు భాగవతము నాంధ్రీకరింపఁ బూని స్తుతిరూపమైన మంగళాచరణము నొనర్చుచున్నాఁడు.

శా. శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోక ర
క్షైకారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దానవో
ద్రేకస్తంభకుఁ గేళిలోలవిలసద్దృగ్జాల సంభూత నా
నాకంజాత భవాండకుంభకు మహానందాంగనా డింభకున్.

లోకరక్షైకారంభకున్ = లోకరక్షణమే ప్రధానలక్షణముగా గలట్టియు, భక్తపాలన కళాసంరంభకున్ = భక్తులను రక్షించుటయే మహాయత్నముగాఁ గలిగినట్టియు, దానవోద్రేక స్తంభకున్ = రాక్షసుల యార్భాటమును దొలఁగింపఁ జేయునట్టియు, కేళిలోల .... భవాండకుంభకున్ = లీలార్థముగాఁ బ్రసరింపఁ జేసిన కటాక్షమాత్రముచేతనే ఏర్పడిన యనేక బ్రహ్మాండములు గలిగినట్టియు, మహానందాంగనా డింభకున్ = నంద యశోదల యింటిముగింటి శిశువుగాఁ బారాడు శ్రీకృష్ణపరమాత్మను గూర్చి శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై మంగళకరమైన కైవల్యముఁ జేరు ప్రయోజనము కొఱకు, చింతించెదన్ = ధ్యానింతును.

తాత్పర్యము: మోక్షమును బొందుటకొఱకుఁ గృష్ణపరమాత్మను ధ్యానింతును. తక్కిన వన్నియుఁ గృష్ణపరమాత్మకు విశేషణములు. కృష్ణపరమాత్మ ధ్యానమునకు మోక్షము ప్రయోజనము. ధ్యానరూపమైన చింతయే సాధన. పోతనామాత్యుని భాగవతమునకుఁ గృతిభర్త పోతనామాత్యుఁడే. భాగవత ప్రతిపాద్యమైనవస్తువు గూడ పరమాత్ముఁడే. 'వేద్యం వాస్తవ మత్రవస్తు శివదమ్' అని వ్యాసభగవానుఁడే పైని చెప్పఁబోవుచున్నాఁడు. కనుక నీ మొదటి పద్యములో పోతన్న నమస్కారముతో పాటు వస్తునిర్దేశము గూడ ఎంతో నిపుణముగఁ గావించియున్నాఁడు. ఈ పద్యమున నమస్కరింపఁబడు వాఁ డెవ్వఁడు? మహానందాంగనాడింభకుఁడు. భాగవతమునందలి స్కంధములలో నెల్ల గథావిషయమందేగాక రసవిషయమందును దశమస్కంధము మహోదాత్తమైనది. నందాంగనాడింభకుఁడైన కృష్ణుని లీలాచరిత్రమే యందలి వస్తువు. ఈ మాట దశమస్కంధ కథనంతయు రేఖామాత్రముగ సూచించుచున్నది. భాగవత కథయంతయు దశమస్కంధ పరిపోషణకే. 'దశమస్య విశుద్ధ్యర్థం' అని వ్యాసభగవానుఁడే వాడినాఁడు. భగవంతుఁడు ప్రపంచములో నెందు కవతరించెను? భక్తులను రక్షించుటకు; వారిని బాధించు దుష్టులను శిక్షించుటకు. భాగవతమందలి కథ లన్నియు సామాన్యముగా నీ ప్రయోజనమును సాధించుటకే. 'భక్తపాలన కళాసంరంభకు, దానవోద్రేకస్తంభకు' అను నీ రెండు విశేషణములును భాగవతకథల నర్థమునకు పైఁగా తమయందు దిమిడ్చికొన్నవి. కేళిలోల .... కుంభకున్ = లీలావలోకన మాత్రముచేతనే బ్రహ్మాండము లన్నియు సృజించినవాఁడు. ఇది పురాణములలో నొకటైన సర్గమున కుపలక్షణము. ఇతర కవులు కీర్తికో, అర్థమునకో కవిత్వములు వ్రాయుదురు. కాని పోతన్న వాంఛించిన ఫలము వేరు. పునర్జన్మలేని కైవల్యపద మాతనికిఁ గావలసినది. భాగవతపఠన ప్రయోజనము గూడ నిదియే.

తొలివాక్యమందే యాతఁడు తన యభిలాషను, పాఠకులు వాంఛింపఁ దగిన ఫలశ్రుతినిగూడఁ జక్కఁగా సూచించినాఁడు. కావ్యారంభమున 'శ్రీ' శబ్దప్రయోగము, మ గణము రెండును మంగళ ప్రదములు. పోతన్న ఇందులో మూఁడు విధములైన విశేషణము లుపయోగించినాఁడు. భక్తపాలన కళాసంరంభకున్-దానవోద్రేకస్తంభకు-మహానందాంగనా డింభకున్ ఈ మూఁడును ఆతని విభవావతారమునకు సంబంధించినవి. 'లోకరక్షైకారంభకున్' అనునది లీలగా మాయను స్వీకరించిన పరమేశ్వరుని యవస్థను సూచించును. పరమేశ్వరుఁడు స్వాంశ యగు మాయను స్వీకరించినపుడు ఒకఁడే ముత్తెఱఁగులుగా నగుపించును. అపుడు సత్త్వగుణప్రధానమగు మాయ నంగీకరించి విష్ణువై ప్రపంచమును రక్షించును. శివుఁడై లయింపఁ జేయును. బ్రహ్మయై సృజించును. 'కేళిలోల.... ....కుంభకున్' అను విశేషణముతో భాగవతప్రతిపాద్యమైన 'సత్యం-పరం' అనెడు భగవత్తత్త్వమునకు తటస్థలక్షణము నిచ్చుచున్నాఁడు. ఇందులో రెండు బ్రహ్మసూత్రముల యర్థము వివరింపఁ బడియున్నది. పోతనామాత్యుఁడు సాధన చతుష్టయమును సంపూర్ణముగ సంపాదించికొన్నవాఁడు. నిత్యానిత్య వస్తువివేకము, ఇహాముత్రఫలభోగవిరాగము, శమాది షట్కసంపత్తి, ముముక్షుత్వము- ఈ నాల్గును సాధన చతుష్టయము. 'శ్రీకైవల్య పదంబుఁ జేరుటకునై' అనుదానిచేతఁ దన ముముక్షుత్వమును పోతరాజు సూచించెను. అది నాల్గవదియగుటచేః దక్కిన మూటిని సంపాదించికొన్నాఁ డనియే తలఁపవలెను. 'బ్రహ్మయే నిత్యము, ఇతరపదార్థము లనిత్యములు' అని భావించి యనుభవములోనికిఁ దెచ్చికొనుటయే నిత్యానిత్యవివేచనము. మోక్షార్థియగు వానికిది యంతరంగ సాధనము. ఈ లోకమున ననుభవింపఁ బడుచున్న నారీ చందన మాల్యాది భోగములందును పరమున ననుభవింపఁబడు రంభాద్యాలింగనములందును ఇచ్ఛ లేకపోవుట యిహాముత్ర ఫలభోగవిరాగము,

ఇది కలుగుటకు నిత్యానిత్య వస్తువివేకము మూలము. 'తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే. ఏవ మేవాముత్ర పుణ్యచితోలోకః క్షీయతే- పూర్వకర్మచేత సంపాదింపఁబడిన యీ లోక మెట్లు క్షీణించునో' పుణ్యకర్మములచేత సంపాదితములగు స్వర్గాదులు నట్లే క్షీణించును అని శ్రుతివాక్యము. శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము- నీ యాఱును శమాదిషట్కము. మనసును నిగ్రహించుట శమము. ఇంద్రియనిగ్రహము దమము. బ్రహ్మవిషయమందుఁ దప్ప ఇతరములందు సంకల్పము లేకుండుట ఉపరతి. శీతోష్ణాదులను లక్ష్యము చేయకుండుట తితిక్ష. వేదాంతవాక్యములందును గురువాక్యములందును నమ్మకమే శ్రద్ధ. సర్వసంకల్పములను విడిచి మనసును బ్రహ్మమునందే నిలిపి శాంతినందుట సమాధానము.

పై విశేషణములతో రెండు బ్రహ్మసూత్రముల అర్థము గర్భితమైన దంటిమి. మొదటిది 'జన్మాద్యస్య యతః' అనునది. 'అస్య జన్మాదస్య యతః సః' ప్రత్యక్షము మొదలగు సర్వప్రమాణములకు గోచర మగుచు నీ ప్రపంచము గానవచ్చుచున్నది. ఇది దేనివలన జనించుచున్నదో, యెందు నిలిచియున్నదో, నశించిన పిదప యెందు లీనమగుచున్నదో అదియే పరబ్రహ్మ. ఈ ప్రపంచము నానా నామరూపములు గలది, దేశకాలాది బహువిధభేదములు గలది. కర్తలు భోక్తలు అసంఖ్యాకులు. కొందఱు సుఖమును, మఱికొందఱు దుఃఖము నను భవించుచున్నారు. ఈ ప్రపంచస్థితి మనసున కగోచరమై యనిర్వాచ్యమయి యున్నది. ఇట్టి దానిని చక్కగా నిర్వహించుచున్నాఁడు గనుక నా పరబ్రహ్మ సర్వజ్ఞుఁడుగా, సర్వశక్తి యుక్తుఁడుగా నుండవలెను. 'ఇది కుండ. దీని నిట్లు చేయవలె' నని తెలిసికొన్ననే కుమ్మరి కుండలను చేయఁజాలును. కనుక బ్రహ్మము సర్వజ్ఞుఁడు. ఈ యర్థమునే వ్యాసభగవానుఁడు 'అర్థేష్వభిజ్ఞః-స్వరాట్' అను రెండు పదములచే సూచించియున్నాఁడు.

ఇక్కడ పూర్వపక్షము: మీరు సూత్రార్థమును 'జన్మస్థితిభంగం యతః సర్వజ్ఞా త్సర్వశక్తేః కారణాద్భవతి తద్బ్రహ్మేతి వాక్యశేషః' అని నిరూపించితిరి. ఇంత లక్షణ మనవసరము. ప్రపంచ మెవనినుండి పుట్టుచున్నదో అతఁడే బ్రహ్మ యన్నచోఁ జాలును. ప్రపంచోత్పత్తికి రెండవ కారణము లేదనియే గదా మీ మతము? పైఁగా భావవికారము లా ఉన్నవి. 'దేహో జాయతే అస్తి వర్ధతే విపరిణమతే అపక్షీయతే నశ్యతి (యాస్కసూత్రము) అనునవి. వీని నన్నిఁటిని గ్రహింపక కేవల జన్మ స్థితి భంగములనే యేల గ్రహింపవలసి వచ్చినది?

సిద్ధాంతము: లోకమున రెండు కారణములు గన్పించును: ఉపాదాన కారణము, నిమిత్తకారణము. ఏ కారణము కార్యరూపముగాఁ బరిణమించునో అది యుపాదానకారణము. ఏది నిమిత్తమాత్రమై యుండునో అది నిమిత్తకారణము. కుండకు మట్టి యుపాదానము; కుమ్మరి నిమిత్తకారణము. అందుచేఁ గార్యము ఈ రెండుకారణములలో దేనివలనైనను గల్గవచ్చును. కనుక బ్రహ్మము ప్రపంచమున కుపాదానకారణము అని నిరూపించుటకై యిట్లు చెప్పవలసి వచ్చినది.

ఇఁక యాస్కసూత్రములోని ఉండుట, వృద్ధిచెందుట మొదలగు వికారములు పుట్టిన తర్వాతను నశించుటకుముందేగదా సంభవించును? కనుక నివియన్నియు స్థితియందే చేరిపోవును. అన్నియును జెప్పుట నిరర్థకమని జన్మాదులను మూటినే చెప్పితిమి.

'కావచ్చును ప్రపంచమునకుఁ గారణము లనేకము లున్నవి గదా! ప్రధానము పరమాణువులు, జీవుఁడు, స్వభావము మొదలగునవి. మరి బ్రహ్మయొక్కఁడే కారణ మెట్లగును?

ప్రధానాదు లచేతనములని ఆ యా శాస్త్రములవారే అంగీకరించియున్నారు. జీవుఁడు చేతనుఁడైనను సర్వజ్ఞుఁడుకాఁడు. అందుచే నానాభేదములుగల యీ ప్రపంచమును నిర్మింపలేఁడు. స్వభావము

గూడ ప్రపంచకారణము గాదు. స్వభావ మనఁగా నేమి? స్వస్య భావః స్వభావః. ఒకపదార్థముయొక్క స్వస్వరూపస్థితి. ప్రపంచము స్వభావమువలన ఉత్పత్తిస్థితి వినాశములఁ బొందును అన్నచో దేని స్వభావము వలన? అని ప్రశ్నవచ్చును.

తన స్వభావమువలననా? తనకంటె భిన్నపదార్థము స్వభావమువలననా? తన స్వభావమువలన అనుటకు వీలులేదు. ఒక వస్తువునకు విరుద్ధధర్మములు స్వభావముగ నుండవు. అగ్నికి వేఁడియు చల్లదనముగూడ స్వభావము లగునా? కనుక పరస్పర విరుద్ధములైన ఉత్పత్తిస్థితి వినాశములు ఒక పదార్థమునకే అనఁగా ప్రపంచమునకే స్వభావములగుటకు వీలులేదు. అందుచే ప్రపంచము తన స్వభావము చేతనే తాను పుట్టును నశించును అనుటకు వీలులేదుకదా! ఇఁక భిన్నమగు పదార్థముయొక్క స్వభావముచేగలుగు నందువా? నీవును మామతమునే యంగీకరించితివి. మరియొక పదార్థస్వభావమువలన సృష్ట్యాదులు గలుగు నన్నచో నా పదార్థము బ్రహ్మమే గావచ్చును. స్వభావ మనఁగా స్వరూపము. అందుచే బ్రహ్మస్వభావ మన్నను బ్రహ్మస్వరూప మన్నను నొక్కటే. పైఁగా స్వభావముతో నాకస్మికముగా జనించిన దానిలో నిట్టి చక్కని నియమము లుండుట సాధ్యము. కనుక నెట్లు చూచినను సర్వజ్ఞుఁడగు బ్రహ్మయే ప్రపంచమునకుఁ గారణము.

లోకమునఁ బిచ్చివాఁడైనను బ్రయోజనము లేనిది కార్యమును జేయఁడు. పరమేశ్వరుఁడు పూర్ణకాముఁడు గదా! అతఁ డెందులకుఁ బ్రపంచమును సృజించెను? లోకములో జనులు చిన్నపనినైనను బ్రయోజనము నపేక్షింపకఁ జేయరుగదా! మరి పరమేశ్వరుఁడు మహాప్రయాస సాధ్యమగు నీ ప్రపంచ సృష్టిని నిష్ప్రయోజనముగా నెందుకు సృష్టించెను? కొందఱు ప్రమాదమువలన ప్రయోజన రహితముగ గూడ నొకమహాకార్యమును జేయుచున్నారు. విలాసార్థము

గను పరోపకారమునకును బ్రవర్తించు చున్నారు. పైఁగా పరమేశ్వరునకును దీనివలన నేదైన నిగూఢ ప్రయోజన మున్నదేమో! ప్రమాదము కించిజ్జ్ఞులగు పురుషులకును రావచ్చును. పరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁడు గదా! విలాసార్థమై చేయఁబడు పనులకుఁ గూడ నొకానొక సుఖమేఫలము. కనుక నదియును నిష్ప్రయోజనము గాదు. ఒకవేళనైనను నది ప్రపంచనిర్మాణమువలె బహుప్రయాస సాధ్యము గాదు కదా! అంతేకాక లోకదృష్టిలో భేదముండుటచే పరుఁడు పరోపకారము ఇత్యాదు లేర్పడును. పరమేశ్వరునిలో భేదమే లేదు కదా! ఉపాధిభేద మున్నదనుకొన్నను అది జీవదృష్టిలో మాత్రమే భేదము! కాని పరమేశ్వరుని దృష్టికిఁ గాదు. ఇట్లుండగా నాతఁ డెవ్వని కుపకరించుటకై సృష్టికార్యమునఁ బ్రవర్తించును? దీనివలన నాతని కే ప్రయోజన మున్నదనవలెను? అప్పు డతఁడు నిత్యతృప్తుఁడని చెప్పు శ్రుతులకు విరోధము వచ్చును. కనుక సర్వజ్ఞుఁడైన పరమేశ్వరుఁడు ప్రపంచకర్త యెట్లగును? ఇది పూర్వపక్షము.

'లోకవత్తు లీలాకైవల్యం'; లోకవత్ తు లీలాకైవల్యం అని పదవిభాగము. కైవల్యమని విగ్రహము. పైఁజెప్పిన పూర్వపక్షమునకు సమాధాన మీ సూత్రముతో నొసఁగుచున్నాఁడు. లోకములో సర్వసమృద్ధిగలిగి నిశ్చింతులైయున్న ప్రభువులు మొదలగు వారు గూడ జ్ఞానవంతులయ్యును ప్రమాదాదుల నందకయు కేవలము విలాసార్థమై యనేక కార్యము లాచరించుచుందురు. ఇది ప్రత్యక్షసిద్ధము. అట్టి పనులుఁగూడఁగొంతఫలము నొసఁగు ననుట సత్యమే. కాని యా ప్రవర్తించు వాని యుద్దేశము మాత్ర మది గాదు. విహారార్థమై యొక యుద్యాన వనము నాటినాఁ డనుకొందము. అందలి ఫలాదులచేఁ దనకును లోకమునకును గించిత్ప్రయోజన మేర్పడ వచ్చును. కాని నిర్మించిన వాని యభిప్రాయము మాత్రమది గాదు. వాఁడు విహరించుటకే దానిని నిర్మించును. కనుక అనుషంగికమగు ఫలమును

ప్రధానముగా నిర్ణయించుట యుక్తము కాదుగదా! ఇంకను 'లీల' యను నుద్దేశము లేకయే గార్యములందుఁ బ్రవర్తించు సందర్భములుఁ గూడ ననేకములుఁ గలవు. పురుషుఁడు స్వాభావికముగనే శ్వాసము విడుచుచున్నాఁడు. మరలఁ దీసికొనుచున్నాఁడు. దీనికి బాహ్య ప్రయోజన మేమి గలదు? జీవుఁడును నాత్మయు నిరువురును జ్ఞాన స్వరూపులే యగుటచేత వారల కీప్రాణసంచారము జ్ఞానమును గల్గింపదు. శరీరమును బ్రదికించునని చెప్పుద మనుకొన్నచో వాయువు సర్వకాలములయందు నుండుటచే మృతశరీరమందు గూడ శ్వాస ముండవలెను గదా! కావునఁ జక్కగ నాలోచించినచో నీయుచ్ఛ్వాస నిశ్వాసములు జీవకార్యములు. శరీరమును బ్రదికించుటయు జీవుని పనియే. మరి జీవుఁడు ఉచ్ఛ్వాస నిశ్వాసము లేల చేయుచున్నాఁడు? స్వభావముగనే చేయుచున్నాఁడు; స్వేచ్ఛగా నూరకయే చేయుచున్నాఁడు. స్వభావ మన్నపుడిఁక ప్రశ్నకవకాశమే లేదు. కావునఁ బరమేశ్వరుఁడును నట్లే లీలామాత్రముగ నైనను, స్వేచ్ఛగా నైనను, స్వాభావికముగ నైనను బ్రపంచసృష్టియందుఁ బ్రవర్తింపవచ్చును. దీనివలన దనకుఁ బ్రయోజనము లేకున్నను నవిద్యోపాధిగల జీవులకుఁ బ్రయోజనము గల్గవచ్చును. బ్రహ్మసృష్టికి జీవభేదము లేదు. అగుటచే 'జీవులకై ప్రపంచమును గల్పించుచున్నాను' అను నుద్దేశమాయనకుఁ గల్గుటకు వీలులేదు. సృష్టిమాత్రము లీలాదిరూపములతోఁ గల్గవచ్చును. దీనివలన భేదదృష్టిగల జీవులకుఁ బ్రయోజనముండవచ్చును. ఈ కారణముచే 'సృష్టి జీవార్థమై గల్పింపఁబడెను' అని గూడఁ జెప్పవచ్చును.' లీలకుఁగాను మహాప్రయాస సాధ్యమగు వ్యాపారమును జేయుదురా అందువేమో? మనకుఁ గష్టసాధ్యమని తోఁచినంతమాత్రమునఁ బరమేశ్వరునకును గష్టసాధ్యమన నక్కరలేదు. వానరులు అన్యుల కసాధ్యమైన సముద్రబంధనము గావించిరి. అర్జునుఁడు ఖాండవదహనమప్పుడు అకసమంతను బాణములతోఁ గప్పెను.

అగస్త్యుఁడు సముద్రజలము నాపోశన మొనర్చెను. కావున నొకనికిఁ గష్టసాధ్యమని తోఁచినంత మాత్రమున నందఱకుఁ గష్టము గానక్కఱ లేదు. సామాన్యులగు యోగుల విషయమే యిట్లుండ సర్వశక్తుఁడగు పరమేశ్వరుని గుఱించి యే మని చెప్పవలెను? కనుకఁ బరమేశ్వరుఁడు జగత్కర్త యనుటలో నాక్షేపణము లేదు. సృష్టిని గూర్చియు సర్వజ్ఞత్వమును గూర్చియు శ్రుతి చెప్పుచున్నది. కావునఁ బరమేశ్వరుఁడు ప్రపంచమును సృజించు చున్నాఁడు. సర్వజ్ఞుఁడై గూడ నున్నాఁడు. అందుచే మా మతమునకు దోష మేమున్నది? 'శ్రీకైవల్య పదంబు' ఇచ్చటి కైవల్యపదమున కర్థ మేమి? 'కేవలస్య భావః కైవల్యం'- స్వస్వరూపావిర్భావః' తన నైజస్థితిని బొందుట.

ముక్తిర్హిత్వా ఽన్యథారూపం స్వరూపేణ వ్యవస్థితిః

అని భాగవతమే ముక్తికి స్వరూపవ్యవస్థితి యర్థ మని చెప్పుచున్నది. 'దానవోద్రేక స్తంభకున్' దనువుయొక్క వంశమువారు దానవులు. రాక్షసులలో ననేక వంశము లున్నవి. దైత్యులు కాలకేయులు మున్నగువారు. కనుక దానవశబ్దము రాక్షసులకు సామాన్య వాచకముగా వాడఁబడినది. 'కేళిలోల .... .... భవాండకుంభకున్' కంజాత మనఁగా పద్మము. నీటియందుఁ బుట్టునది. కంజాతభవుఁ డనఁగా బ్రహ్మ, విష్ణువు నాభికమలమందుఁ బుట్టినవాఁడు గదా. కంజాతభవాండము బ్రహ్మాండము. కంజాతభవాండము లనెడు కుంభములు గలవాఁడనుట. విష్ణువు కటాక్షమాత్రము చేతనే ప్రపంచమును సృష్టించుచున్నాఁ డనుటకు నీ క్రిందిశ్లోక మాధారము.

క్వాఽజ్ఞాన మాపదపి మందకటాక్ష మాత్రా
త్సర్గస్థితి ప్రళయసంసృతి మోక్షహేతోః
దేవ్యాహరేః కిము విడంబన మాత్రమే త
ద్విక్రీడతోః సురనరాదివ దేవ తస్మాత్.

పై శ్లోకము బ్రహ్మాండపురాణములోనిదని మహాభారత తాత్పర్య నిర్ణయములో శ్రీమదానంద తీర్థులవా రుద్ధృతీకరించినారు.

ఉ. వాలిన భక్తి మ్రొక్కెద నవారిత తాండవకేలికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజాముఖ పద్మమయూఖ మాలికిన్
బాలశశాంకమౌళికిఁ గపాలికి మన్మథగర్వపర్వతో
న్మూలికి నారదాది మునిముఖ్య మనస్సరసీరుహాళికిన్.

అవారిత తాండవ కేళికిన్ = అడ్డగింపఁ బడని విశంకటమైన తాండవ క్రీడగలవాఁడును, దయాశాలికిన్ = కరుణాశాలియు, శూల మునుధరించిన వాఁడును, శిఖరిజా = పార్వతీదేవి; శిఖరము లనఁగా కొండకొమ్ములు; అవిగలది శిఖరి అనఁగా పర్వతము. శిఖరిజ యనఁగా హిమవంతునిబిడ్డ. ఆమెయొక్క ముఖపద్మ = ముఖమనెడు పద్మము నకు, మయూఖమాలికిన్ = సూర్యుఁడైనవాఁడు, బాలశశాంకమౌళికిన్ = శశాంకుఁ డనఁగా కుందేలు చిహ్నముగా గలవాఁడు. చంద్రునిలోని మచ్చను గుందేలుగా గవు లుత్ప్రేక్షింతురు. బాలశశాంకుఁడు బాల చంద్రుఁడు. అది మౌళియందు గలవాఁడు బాలశశాంకమౌళి. ఇది వ్యధికరణ బహువ్రీహి. రెండుపదము లేకవిభక్తియందుండుట వైయ్యా కరణమతమున సామానాధికరణ్యము. భిన్నవిభక్తి యందుండుట వైయధికరణ్యము. బహువ్రీహి సమాసములో రెండు పదములును సామాన్యముగా సామానాధికరణ్యమందేయుండును. బాలశశాంకః మౌళౌయస్య సః అనుచోట మౌళిశబ్దము సప్తమి యందును బాల శశాంకశబ్దము ప్రథమావిభక్తి యందును గలవు గనుక నిది వ్యధికరణ బహువ్రీహి. కపాలికిన్ = కపాలమును ధరించినవాఁడు, మన్మథగర్వ పర్వతోన్మూలికిన్ = మన్మథుని గర్వ మనెడు పర్వతమును పెకలించిన వాఁడు, నారదాదిమునిముఖ్య = నారదుఁడు మొదలైన మునులయొక్క మనస్సరసీరుహ = మనస్సులనెడు పద్మములందు విహరించు, అళికిన్ = తుమ్మెదవంటి వానికి, అనఁగా నారదాది మహామునుల మనస్సులను

హారవల్లు లురగహారవల్లులు గాఁగ
బాలు లీల ప్రౌఢ బాలకుండు
శివుని పగిది నొప్పె శివునికిం దనకును
వేఱు లేమి దెలుప వెలయునట్లు. (దశ. 298 ప.)

అవారిత తాండవ కేలికిన్=పరమశివుఁడు తాండవప్రియుఁడు. రసభావములులేక తాళ లయాశ్రయమై యుండునది నృత్తము. ఈ నృత్తములో నుద్ధతముగా నడచుపద్ధతికి తాండవ మని పేరు. పరమశివుఁ డుభయ సంధ్యలయందును తాండవ మాడుచుండునని ప్రసిద్ధి. దయాశాలికిన్=పరమశివుని దయాగుణము ప్రసిద్ధమైనది. అతని 'ఆశుతోషుఁ' డనిపేరు. భస్మాసురునకు వరము లిచ్చి బాధపడినకథ భాగవతమందే వచ్చును. ఇంద్రాదులచే ప్రార్థితుఁడై మన్మథుఁడు పరమశివుని భంగింప యత్నించుటయు అతని నేత్రాగ్నియందు దహింపఁ బడుటయుఁ బురాణసిద్ధములే, శిఖరిజా .... .... మాలికిన్= సూర్యోదయముతో పద్మములు వికసించును అట్లే పరమశివుని దర్శనముచే పార్వతీదేవి ముఖము వికసించునని భావము. ఈ రెండు సమానములలో గొప్పవైలక్షణ్య మున్నది. నారదాదుల మనస్సులనెడు పద్మములను వెదకికొనుచుఁ బరమశివుఁడే తుమ్మెదగాఁ బోవును. పద్మములందు తుమ్మెదకాసక్తి. సూర్యోదయమైనంతనే పద్మము వికసించును. ఇటు పద్మమున కాసక్తి, అనఁగా పార్వతీదేవిపై కంటెను భక్తుల మనస్సులపై శివునకు లోలుపత యెక్కువని కవి ధ్వనింపఁ జేయుచున్నాఁడు.

తాండవోత్సుకుఁడు, పరమదయాశాలి, శూలాయుధుఁడు, పార్వతీదేవి ముఖపద్మమునకు సూర్యునివంటివాఁడు నగు నా పరమశివునికి నమస్కారము. బాలశశాంకమౌళి కపాలి మన్మథగర్వ పర్వతము నున్మూలించినవాఁడు నారదాది మునిముఖ్యుల మనస్సుల వెంట దిరుగువాఁడు నైన యా పరమశివునకు నమస్కారము.

ఉ. అతతసేవఁ జేసెద సమస్త చరాచర భూతసృష్టి వి
జ్ఞాతకు భారతీహృదయ సౌఖ్యవిధాతకు, వేదరాశి ని
ర్ణేతకు దేవతానికర నేతకుఁ గల్మషజేతకున్, నత
త్రాతకు ధాతకున్ నిఖిల తాపసలోక శుభప్రదాతకున్.

సమస్త=సమస్తములైన చరాచరభూతములకు సంబంధించిన, సృష్టి విజ్ఞాతకుఁ= సృష్టిపద్ధతులు దెలిసినవానికి, భారతీహృదయ సౌఖ్య విధాతకుఁ=సరస్వతీదేవి మనస్సున కాహ్లాదము గలిగించు వానికి, వేదరాశి నిర్ణేతకుఁ=వేదముల స్వరూపమును నిర్ణయించిన వానికి, దేవతానికరనేతకుఁ=దేవతాసమూహనాయకుఁడైన వానికి కల్మషజేతకుఁ= పాపములను జయించిన వానికి, నతత్రాతకుఁ= నమస్కరించువారిని రక్షించువానికి, నిఖిల తాపసలోక శుభప్రదాతకుఁ =సమస్తమునులకు క్షేమమును గల్గించెడు, ధాతకుఁ=అట్టివిధాతకు, అతతసేవఁ జేసెదఁ=విస్తృతముగా సేవఁ జెల్లింతును.

బ్రహ్మ సమస్త చరాచర భూతములకు సంబంధించిన సృష్టి విధానము లెఱిఁగినవాఁడు, భారతీదేవి మనస్సున కాహ్లాదముగల్గించు వాఁడు, శ్రీమన్నారాయణుని సంకల్పశక్తిచేత వేదార్థము లెఱిఁగింపఁ బడిన వాఁడగుటచే సమస్త నిగమ పండితుఁడు, దేవతానాయకుఁడు, కలుష విజేత, తన్ను గొలుచువారిని రక్షించువాఁడు, మహామునులకు శుభప్రదాత అగు నట్టి బ్రహ్మను గూర్చి సేవింతును.

వచనము: అని నిఖిలప్రధాన దేవతావందనంబు సేసి,

వ్యాఖ్య: నిఖిల=సమస్తులైన, ప్రధానదేవతా....సేసిముఖ్యు లైన దేవతలకు వందన మొనర్చి,

ఉ. ఆదరమొప్ప । మ్రొక్కిడుదు నద్రిసుతా హృదయానురాగ సం
పాదికి దోషభేదికిఁ బ్రపన్నవినోదికి విఘ్నవల్లి కా
చ్ఛేదికి మంజువాదికి నశేష జగజ్జననంద వేదికిన్
మోదకఖాదికిన్ సమదమూషక సాదికి సుప్రసాదికిన్.

విఘ్నేశ్వరునకు వందన మొనర్చుచున్నాఁడు.

అద్రిసుతా=పార్వతీదేవియొక్క, హృదయానురాగ=మానసిక ప్రేమయొక్క, సంపాదికి=సంపాదనగల్గినట్టియు, దోషభేదికి=సమస్త దోషములను బరిహరించునట్టియు, ప్రపన్నవినోదికి=శరణుఁజొచ్చిన వారిని వినోదముగా నవ్వునట్లుచేయునట్టియు, విఘ్నవల్లికాచ్ఛేదికి= విఘ్నము లనెడి తీగలను నాశనము చేయునట్టియు, మంజువాదికి= మంగళకర భాషణము గలట్టియు, అశేషజగజ్జన నందవేదికి=అనేకు లైన, జగజ్జన=జగతిలోని జనులందరికిని, నందవేదికి=సంతోషము నందించుట చక్కగాఁ దెలిసినట్టియు; మోదకఖాదికి=కుడుములను భక్షించువాఁ డైనట్టియు, సమదమూషకసాదికి=మదించిన యెలుక వాహనముగాఁగల రౌతునకు, సుప్రసాదికి=మంగళకరమైన ప్రసా దము గలిగిన విఘ్నేశ్వరునకు నమస్కారము.

ఈ పద్యములోని వన్నియును విశేషణములే. కనుక దేనినో యొకదానిని విశేష్యముగా మార్చికొని, తక్కినవాని నన్వయింప వలెను. 'సమదమూషకసాదికి' అనుదానిని విశేష్యముగా నెన్నుకొని తక్కినవానిని దాని కన్వయించుటైనది.

దోషభేదికి='మహావిఘ్నాత్ప్రముచ్యతే, మహాపాపాత్ప్ర ముచ్యతే, సర్వదోషాత్ప్రముచ్యతే స సర్వవిద్భవతి' (గణపత్యథర్వ శీర్షోపనిషత్) కనుక విఘ్నేశ్వరునిఁ దలఁచికొన్నచో గార్యములం దశక్త్యాదులచేఁ గలుగు దోషము లన్నియు శమించునని భావము. విఘ్నవల్లికాచ్ఛేదికి=విఘ్నములనెడు తీగలను ఛేదించువాఁడు. అతఁడు గజాననుఁడగుటచే విఘ్నములను తీగలతోఁ బోల్చుట బాగు గనే యున్నది. కార్యారంభమునందుఁ ద్రిమూర్తులు గూడ నాతనికి నమస్కరించినట్లుగా నొక కవి వర్ణించినాఁడు.

జేతుం య స్త్రిపురం హరేణ హరిణా వ్యాజాద్బలిం బధ్నతా
స్రష్టుం వారిభవోద్భవేన భువనం శేషేణ ధర్తుం ధరామ్,
పార్వత్యా మహిషాసుర ప్రమథనే సిద్ధాధిపై స్సిద్ధయే
ధ్యాతః పంచశరేణ విశ్వజితయే పాయాత్స నాగాననః.

భోజుడు తన రామాయణ చంపువులో విఘ్నములను పర్వతములతోఁ బోల్చెను. ఆ శ్లోకమిది-

లక్ష్మీం తనోతు నితరా మితరా నపేక్ష
మంఘ్రిద్వయం నిగమ శాఖిశిఖా ప్రవాళమ్,
హైరంబ మంబురుహ డంబర చౌర్యనిఘ్నం
విఘ్నాద్రి భేద శతధార ధురంధరం నః.

భోజుఁడు లక్ష్మీగణపతిని మనసున నిలుపుకొన్నాఁడేమో యనిపించును.

వినాయకుఁడు మూషకవాహనుఁడు.

దంతం చ పరశుం పద్మే మోదకాంశ్చ గజాననః,
గణేశో మూషకారూఢో బిభ్రాణ స్సర్వకామదః.

(శారదాతిలకం 13-79)

క్షోణితలంబు నెన్నుదురు సోఁకగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీక చయ సుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాత భవచిత్తవశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ శుక వారిజ పుస్తకరమ్యపాణికిన్.

సరస్వతీదేవిని స్తుతించుచున్నాఁడు-

టీక: వాణికిన్=సరస్వతీదేవికి, క్షోణితలంబు=భూమి, నెన్నుదురు=నెఱ+నుదురు, సోఁకగ=నిటులము సోఁకునట్లుఁగా, మ్రొక్కి=నమస్కరించి; నుతింతున్=స్తోత్రము చేయుదును. తక్కిన వన్నియును

వాణికి విశేషణములు. ఆమె యెట్టిది? సైకతశ్రోణి=ఇసుకతిన్నెలవంటి కటిస్థలము గలది, చంచరీకచయ=తుమ్మెదల గుంపువలె నున్న సుందరవేణికిన్=అందమైన నల్లనిజడ గలది, రక్షిత=రక్షింపఁబడిన, ఆనతశ్రేణికిన్=వినయముతోఁ దన్ను మ్రొక్కు భక్తులు గలది. తోయజాతభవుఁడు=బ్రహ్మ. అతని చిత్తము వశీకరించు పల్కులసొంపు గలది. స్ఫటికాక్షమాల, చిలుక, పద్మము పుస్తకము, వీనిచేత రమ్యమైన నాల్గుచేతులు గలది.

తాత్పర్యము: సరస్వతీదేవి సైకతశ్రోణి. తుమ్మెదలగుంపువలె నల్లని యందమైన జడగలది. తన్నుఁ గొలుచు భక్తుల రక్షించెడిది. బ్రహ్మదేవు నలరించు పల్కుల పొందుగలది. ఒకచేత నక్షమాల, మరియొకచేత కీరము, ఒకచేత పద్మము, మరియొకటు పుస్తకము గల్గి నాల్గుచేతులతో నందమైన మూర్తి. ఆమెకు నమస్కరించుచున్నాను.

పుట్టంబుట్ట శరంబునన్ మొలవ నంభోయాన పాత్రంబున
న్మెట్టం గల్గను గాళిఁగొల్వను బురాణింపం దొరంకొంటి మీ
దెట్టే వెంట జరింతుఁ దత్సరణి నా కీ వమ్మ! యో యమ్మ! మే
ల్పట్టున్ మానకు మమ్మ! నమ్మితిఁ జుమీ! బ్రాహ్మీ! దయాంభోనిధీ!

సరస్వతీదేవి నింకొకపద్యముచే స్తుతించుచున్నాఁడు –

టీక: దయాంభోనిధీ! బ్రాహ్మీ!=దయాసముద్రము వంటిదానా! సరస్వతీ!, పుట్టంబుట్టన్=పుట్టయందు జన్మింపను, శరంబునన్ మొలవన్=తెల్లుగడ్డియందు జనింపను, అంభోయాన పాత్రంబునన్=పడవ యనెడు పాత్రయందు, మెట్టన్=పరాశరుఁడు సత్యవతితో సంగమింపఁగా, కల్గను=జన్మింపలేదు, కాళిన్ కొల్వను=కాళికాదేవి నుపాసింపలేదు, పురాణింపం దొరంకొంటిన్=భాగవతపురాణమును వ్రాయఁ బూనితిని, మీదు ఎట్టు ఏవెంటన్ చరింతున=ఇఁకపైని నెట్లు, ఏ మార్గమునఁ గావ్యమును రచింపఁగలనో, తత్సరణిన=ఆ పద్ధతిని, నా కీవమ్మ=నాకు దయసేయుము, మేల్పట్టున్ మానకు

మమ్ము = నా కాధారముగా నుండుటను వదలకుము తల్లీ!, నమ్మితిఁ
చుమీ = నమ్ముకున్నాను.

తాత్పర్యము : తల్లీ! సరస్వతీ! నేను పుట్టలో జన్మింపలేదు. అనఁగా వాల్మీకిని గానని యర్థము. జెల్లుగడ్డియందుఁ బుట్టలేదు. కుమారస్వామిని గానని తాత్పర్యము. కుమారస్వామి శరవణభవుఁడు చంపూరామాయణమునం దిట్లున్నది-

> సాఽపి సప్తార్చిషా క్షిప్తం తేజస్త ద్వోఢుమక్షమా,
> హిమవత్ప్రాంత కాంతారే భ్రాంతా శరవణే జహౌ.
>
> తత్రాఽభూ త్కృత్తికా ప్రీత్యై షోఢారూఢ ముఖాంబుజమ్,
> తారకధ్వాంత విధ్వంసి సద్య స్తాఙ్మాతురం మహః.

పరాశరుఁడు సత్యవతితోఁ బడవయందు సంగమింపఁగా సద్యో గర్భమున వ్యాసమహర్షి జనించెను. కాళిదాసువలె కాళికాదేవి దయ సంపాదించికొన్నవాఁ డనుగాను, ఐనను, ధైర్యముగా భాగవతము రచింపఁ బూనుకొన్నాను. పైన ఏ రీతిగా రచన సాగింపవలెనో నాకు దిక్కు నీవే. నీవే నా కండగా నిలిచి, కావ్యమును బల్కింప వలెను. నిన్నే నమ్ముకొన్నాను. నీ దయను నానుండి తప్పింపకుము.

ఇక్కడ వాల్మీకి వ్రాసినది పురాణము గాదు. దానిని ప్రాచీను లాదికావ్య మనిరి. పురాణమునకుఁ గావలసిన లక్షణములు వేఱు. సర్గ ప్రతిసర్గాదులు. వానిపై వాల్మీకి దృష్టి నిల్పలేదు. అట్లే కాళిదాసు గూడ పురాణకర్త గాదు. పై నల్వురిలోఁ బురాణకర్త లిర్వురే. కుమార స్వామి, వ్యాసుఁడు. కాని తక్కిన యిర్వురను గూడ ప్రాయోవాద ముతోఁ జేర్చినాఁడని సమర్థించికొనవలెను. అనఁగా గొప్పరచన చేసిన వారని యర్థము. అంభోయాన మనఁగా నీటఁ బ్రయాణ మొనర్చు పడవ. కాళిదాసు కాళికాదేవి నుపాసించి ఆమె దయతోఁ గవితాశక్తి సంపాదించినాఁడని లోకములో వాడుక.

ఉ. అమ్మలగన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల పె
ద్దమ్మ సురారులమ్మకడుపారడి బుచ్చినయమ్మ దన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యీవుత మహత్త్వకవిత్వ పటుత్వ సంపదల్.

అమ్మలగన్న యమ్మ=ఆ కొండ, అనఁగా హిమాలయము గన్న బిడ్డ, ముగురమ్మల మూలపుటమ్మ=మూఁడు శక్తులకును దొలి శక్తి, చాల పెద్దమ్మ=అనాదియైనది, సురారులమ్మ కడుపు=రాక్షసుల తల్లియైన దితిగర్భము, అఱడి బుచ్చినయమ్మ=వ్యర్థముగాఁ జేసినది, తన్ను లో నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ=తన్ను భజించు శచీదేవి, స్వాహాదేవి మున్నగు దేవతాస్త్రీల మనస్సులలో వసించు, దుర్గ=దుర్గ యను పేరు గలిగిన, కృపాబ్ధి=దయాసముద్రురాలైన తల్లి, మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్=గొప్ప మహిమాన్విత కవిత్వసంపదలను, ఈవుతన్=నాకు ఇచ్చుఁగాక!

తాత్పర్యము: ఒకానొక యవతారమందు హిమవంతునకు జన్మించినది. ఆమెయే ముగురమ్మలకును మూలమైనది. అనాదియైన యామె మహాలక్ష్మి, మహాకాళి, మహాసరస్వతిగా నవతరించి రాక్షస సంహారము చేసి, దితి గర్భమును వ్యర్థ మొనర్చిన దామెయే. తన్ను భక్తితోఁ గొలుచు శచి, స్వాహా మున్నగు దేవకాంతల మనస్సుల వర్తించు తల్లి. దుర్గ యనియు నామె పేరు. అట్టి యామె గొప్ప కవితాశక్తుల నొసఁగుఁ గాక!

ముగురమ్మల మూలపుటమ్మ, దేవ్యథర్వశీర్షమం దీ గాథ వచ్చును.

సర్వే వై దేవాః దేవీ ముపతస్థుః. కాఽసిత్వం మహాదేవీతి. సాఽబ్రవీత్. 'అహం బ్రహ్మస్వరూపిణీ మత్తః ప్రకృతి పురుషాత్మకం జగత్, శూన్యం చా శూన్యం చ, అహ మానందానందౌ, అహం విజ్ఞానావిజ్ఞానే, అహం బ్రహ్మాబ్రహ్మణీ వేదితవ్యే. అహం పంచభూతాన్యపంచభూతాని. అహ మఖిలం జగత్. వేదోఽహ

మవేదోఽహం; విద్యాహమ విద్యాఽహం; అజాఽహ మనజాఽహం, అథ శ్చో ర్ధ్వం చ తిర్యక్చాఽహం; అహం రుద్రేభి ర్వసుభిశ్చరామి, అహ మాదిత్యైరుత విశ్వదేవైః; అహం మిత్రావరుణా వుభౌబిభర్మి, అహ మింద్రాగ్నీ; అహ మశ్వినా వుభౌ; అహం సోమం త్వష్టారం పూషణం భగం దదామి, అహం విష్ణు మురు క్రమం బ్రహ్మణముత ప్రజాపతిం దధామి, అహం దధామి ద్రవిణం హవిష్మతే సుప్రావ్యే యజమానాయ సున్వతే, అహం రాష్ట్రీ సంగమనీ వసూనాం చికితుషీ; ప్రథమా యగ్నియానాం, అహం సువే, పితరమస్య మూర్ధాన్మమ యోని రప్స్వం తస్సముద్రే, య ఏవం వేద, స దైవీం సంపద మాప్నోతి,' తే దేవా అబ్రువన్.

నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః,
నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాస్మతామ్.

పై వాని కర్థము. దేవతలు దేవిని సమీపించి 'అమ్మా! నీ వెవ్వర'ని యడిగిరి. ఆమె యన్నది–

"నేను బ్రహ్మస్వరూపిణిని. నా నుండియే ప్రకృతిపురుషాత్మక మైన సద్రూపము నసద్రూపమునై జగత్తు పుట్టెను. నే నానంద మును అనానందమును. విజ్ఞానము, అవిజ్ఞానమును, బ్రహ్మాబ్రహ్మ ములును నేనే. పంచీకృతములు అపంచీకృతములైన భూతములు నేనే. నేనే యీ కన్పించు సమస్తజగత్తును. వేదమవేదము నేనే. విద్యావిద్యలు నేనే. ప్రకృతియు, దానికంటె భిన్నమును నేనే. క్రింద మీదులు ప్రక్కలు నానాస్వరూపములు; నేను రుద్రులు వసువులు వీరి రూపములతో సంచరింతును. ఆదిత్య విశ్వేదేవతల రూపముతోఁ జరిం తును. మిత్రావరుణులు, ఇంద్రాగ్నులు, ఇర్వు రాశ్వినులు, వీరి భరణ పోషణములు గూర్చుదానను నేనే. నేనే సోముఁడు, త్వష్ట, పూష, భగుఁడు వీరిని ధరింతును. మూఁడు లోకముల నాక్రమించుటకుఁ బాదక్షేప మొనర్చిన విష్ణువు, బ్రహ్మ, ప్రజాపతి– వీరిని ధరించునది నేనే. దేవతల కుత్తమ హవిస్సు లిచ్చువాఁడు, సోమము సిద్ధపఱచు వాఁడు అయిన యజమానునకు హవిర్ద్రవ్యములతోపాటు ధనమిచ్చు

దానను నేనే. నేనే గగనాదుల సృష్టిని. నాయొక్కస్థాన మెచ్చట నున్నది? ఆత్మస్వరూపమును ధరించు బుద్ధివృత్తియందున్నది. ఇట్లు నన్నెఱుఁగు వాఁడు దైవీసంపద నందును". అప్పుడు దేవత లన్నారు

"తల్లీ! చేతనములను దమతమ కర్తవ్యములందు ప్రవృత్తుల నొనర్చు కల్యాణకర్త్రికి నమస్కారము. నీవు గుణసామ్యావస్థా స్వరూపిణివి. మంగళమూర్తివి. నీకు నమస్కారము".

దేవికి దుర్గయనియుఁ బేరు.

తామగ్నివర్ణాం తపసా జ్వలంతీం వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్,
దుర్గాం దేవీం శరణం ప్రపద్యే మహేఽసురా న్నాశయిత్రై్య తే నమః.

దుర్గాదేవి అగ్నివంటి శరీరచ్ఛాయ గలది. జ్ఞానముతోఁ బ్రకాశించు దీప్తి వంటిది; కర్మఫలప్రాప్తికి హేతువైన యా దుర్గాదేవికి నమస్కారము. అసురులను సంహరించునట్టి యా దేవికి నమస్కారము.

సౌందర్యలహరిలోఁ గవిత్వప్రాప్తి కి ప్రయోగము చెప్పఁబడినది.

శరజ్జ్యోత్స్నా శుద్ధాం శశియుత జటాజూట మకుటాం
వరత్రాసత్రాణ స్ఫటిక ఘటికా పుస్తక కరామ్,
సకృన్నత్వాం న త్వా కథమివ సతాం సన్నిదధతే
మధుక్షీరద్రాక్షా మధురిమ ధురీణాః ఫణితయః.

ఈ శ్లోకమును దినమునకు సహస్రము జపించినచోఁ గవిత్వస్ఫూర్తి యేర్పడునని సాధకు లందురు. దీనితర్వాత మఱి రెండు శ్లోకములు సారస్వతప్రక్రియకు సంబంధించినవి యున్నవి. వీని విశేషములను తాంత్రికులనుండి గ్రహింపవలెను.

మ. హరికిం బట్టపుదేవి పుణ్యముల ప్రోవర్థంబు పెన్నిక్క చం
దురు తోఁబుట్టువు భారతీగిరిసుతల్ తోనాఁడు పూఁబోడి తా
మరలం దుండెడి ముద్దరాలు జగముల్ మన్నించు నిల్లాలు భా
సురతన్ లేములువాపు తల్లి సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్.

టీక: హరికిం బట్టపుదేవి=శ్రీమహావిష్ణువునకుఁ ప్ర
గృహిణి, పుణ్యముల ప్రోవు=పుణ్యరాశి, అర్థంబు పెన్నిక్క
+ఇక్క=ధనమునకు నివాసస్థానము, చందురు తోఁబుట్టువు=
నకు సోదరి, భారతీగిరిసుతల్=సరస్వతియుఁ బార్వతియు, తో
పూఁబోడి=తనతోఁ బాటు క్రీడించునట్టి యువతి, తామరలం ద
ముద్దరాలు=పద్మవనములం దుండెడునది, జగముల్ మం
నిల్లాలు=ప్రపంచములు గౌరవించు గృహిణి, భాసురతన్=
మానముగా, లేములు వాపు తల్లి=పేదఱికమును బోఁగొ
జనని, సిరి=శ్రీదేవి, నిత్యకల్యాణముల్=శాశ్వతములైన శుభమ
ఇచ్చున్=ఇచ్చునుగాక!

తాత్పర్యము: శ్రీమహావిష్ణువునకుఁ బ్రధాన గృహిణి
బుణ్యస్వరూపిణియు, ధనమునకు మూలస్థానమును, చంద్రుని
రియుఁ, బార్వతీ సరస్వతులు చెలిమికత్తెలుగాఁ గలిగినదియు
వనవాసినియు, పేదఱికమును బోఁగొట్టెడు తల్లి, శ్రీదేవి
నిత్యశుభముల నొసఁగుఁగాక!

హరికిం బట్టపుదేవి– 'విష్ణో రేషా ఽనపాయినీ' వి
నెప్పుడు నెడఁబడి యుండనిది. అందుచేతనే యామెను భగవ
నుజులు 'దేవదేవ దివ్యమహిషీమ్' అని సంబోధించిరి. 'రా
భవే త్సీతా రుక్మిణీ కృష్ణజన్మని' ఇత్యాది ప్రకారము పరమేశ
విభవావతారమును ధరించినఁ దత్స్వరూపానుగుణముగ నా
వర్తించును. నిత్యవిభూతియందును ఆమె భగవంతునకుఁ (

యుండును. చందురుఁడు చంద్రశబ్దభవము. భారతీగిరిసుతల్ తోనాఁడు పూఁబోఁడి. యామునాచార్యుఁడు లక్ష్మీదేవిని చతుశ్శ్లోకిలో నిట్లు స్తుతించినాఁడు-

కాంతస్తే పురుషోత్తమః ఫణిపతి శ్శయ్యాఽఽసనం వాహనం
వేదాత్మా విహగేశ్వరో యవనికా మాయా జగన్మోహినీ,
బ్రహ్మేశాది సురవ్రజ స్సదయితః త్వద్దాస దాసీగణః
శ్రీరిత్యేవచ నామతే భగవతి బ్రూమః కథం త్వాం వయమ్.

పై శ్లోకము ననుసరించి బ్రహ్మేశాది దేవతలు, వారి భార్యలు లక్ష్మీదేవికి నిత్యకింకరులు. తామరలం దుండెడి ముద్దరాలు. ఇందిరాదేవి పద్మవనవాసిని. వేదాంతదేశికు లిట్లనుచున్నారు-

ఆవిర్భావః కలశ జలధౌ వధ్వరే వాఽపి యస్యాః
స్థానం యస్యా స్సరసిజవనం విష్ణువక్షస్థ్సలం వా,
భూమా యస్యా భువన మఖిలం దేవి: దివ్యం పదం వా
స్తోకప్రజ్ఞై రనవధి గుణా స్తూయసే సా కథం త్వమ్.

పై శ్లోకములో లక్ష్మీదేవికి నివాసము విష్ణువక్షస్థ్సల మనియు పద్మవన మనియు జెప్పఁబడియున్నది. పూఁబోణి = పూవువంటి శరీరము గలది. ఇక్కడ వ్యాకరణ సూత్రము ననుసరించి మేనునకు 'బోణి' యని యాదేశము వచ్చును.

వచ: అని ఇష్టదేవతలఁ జింతించి, దినకరకుమార ప్రముఖులం దలంచి, ప్రథమకవితావిరచన విద్యావిలాసాతిరేకి వాల్మీకి నుతియించి హయగ్రీవదనుజకర పరిమిళిత నిగమనివహావిభాగ నిర్ణయనిపుణతా సముల్లాసుండగు వ్యాసునకు మ్రొక్కి, శ్రీమహాభాగవత కథాసుధారస ప్రయోగికి, శుకయోగికి నమస్కరించి, మృదుమధురవచనరచన పల్లవితస్థాణునకుం బాణునకుఁ బ్రణమిల్లి, మహాకావ్యకరణ కళావిలాసుం గాళిదాసుం గొనియాడి, కవికమల విసరరవిం భారవిం బొగడి

కతిపయశ్లోక సమ్మోదితసూరు మయూరు నభినందించి, విదళితాఘు మాఘు నుతియించి, యాంధ్రకవితా గౌరవజనమనోహారి నన్నయ సూరిం గైవారంబు సేసి, హరిహరచరణారవింద వందనాభిలాషిఁ దిక్కన మనీషిం భూషించి, భక్తివిశేషిత పరమేశ్వరుండగు ప్రబంధ పరమేశ్వరుఁ బ్రణుతించి, మఱియు నితర పూర్వకవిజన సంభావ నంబు గావించి, వర్తమాన కవులకుం బ్రియంబు వలికి, భావికవుల బహూకరించి యుభయకావ్యకరణ దక్షుండనై—

కఠినపదముల కర్థములు: ఇష్టదేవతలు = తన కిష్టమైన దేవ తలు, దినకర కుమారప్రముఖులు = సూర్యుఁడు, కుమారస్వామి మొదలగువారు, ప్రథమ ........విలాసాతిరేకి = మొట్టమొదటిసారిగా లౌకికసంస్కృతమందు రచన గావించినవాఁడు వాల్మీకి, క్రౌంచ వధతో మనస్సు గలఁగిన మహాముని వదనమునుండి.

'మానిషాద! ప్రతిష్ఠాంత్వ మగమ శ్శాశ్వతీ స్సమాః' యనెడు శ్లోకము హఠాత్తుగా బయలుదేరినది. ఆ ఛందస్సుయొక్క హఠాదా విర్భూతికి వాల్మీకి వెఱఁగందుచుండెను ఇంతలో బ్రహ్మవచ్చినాఁడు చతుర్ముఖుఁడు—

మచ్ఛందా దేవతే బ్రహ్మన్ । ప్రవృత్తేయం సరస్వతీ,
రామస్య చరితం సర్వం కురుత్వ మృషిసత్తమ ।

వాల్మీకిమునీ! నా యాదేశముచేతనే సరస్వతీదేవి లౌకికఛందో ఽవతారమును ధరించి నీ ముఖమునుండి బయలుదేరినది. కనుక పవిత్రమైన రామకథను రచింపుమని యాజ్ఞాపించినాఁడు. లౌకిక సం స్కృతములో బయలుదేరిన యాదికావ్యము రామాయణమే.

హయగ్రీవదనుజ .... ... నిపుణతాసముల్లాసు = ఆదికాలమున హయగ్రీవుఁడను రాక్షసుఁడొకఁ డుండెను. వాఁడు వేదముల నెత్తి కొనిపోయి వాని నన్నిఁటిని కలగాపులముగఁ జేసినాఁడు. వ్యాస

భగవానుఁడు మరల వానిని శాఖోపశాఖలుగా సంస్కరించినాఁడు. ఈ విషయము స్కాందపురాణమం దిట్లున్నది-

చతురావనాయ చతురః పురాగమాన్,
ప్రదదా వముష్య సురరాశయే సుధామ్,
వినిహత్య హి శ్రుతిముషం పురాతనం
వపుషోద్ధతం హయముఖేన సద్రిపుమ్.

సతాం + రిపుం = సద్రిపుం

పై శ్లోకమును భారతతాత్పర్య నిర్ణయములోఁ బూర్ణప్రజ్ఞు లుద్ధృతీకరించిరి. శ్రీమహా.... యోగికి నమస్కరించి భాగవతకథ యనెడు సుధారసమును బంచెడువాఁడు శుకయోగి.... మృదుమధుర ........ బాణునకుం బ్రణమిల్లి మృదులమై మధురమైన వచనరచనచేత శిలలం గూడఁ జిగురింపఁ జేయువాఁడగు బాణునకు నమస్కరించి, పల్లవితస్థాణుఁడు అనుటకుఁ బుల్కరించిన శివుఁడు గలవాఁడనియు నర్థాంతరము. వచనరచనచేత శివుని మెప్పునందినవాఁడు బాణుఁడు, శాక్తుడు. పేరునందే శివభక్తియున్నది. అతఁడు కాదంబరిలో-

'జయంతి బాణాసుర మౌళిలాలితాః' అని శివస్తుతి నెంతో రమ్యముగ నొనరించెను. బాణమయూరులు ఆదిశంకరులకు సమకాలికులో గాదో నిర్ణీతముగాదు. కాని శాక్తేయుఁడైన బాణునిచేత సౌరుఁడైన మయూరునిచేత శంకరులు తమ భాష్యశ్రవణముఁ జేయించిరని శంకరవిజయములో వచ్చును-

సకథాభి రవంతిషు ప్రసిద్ధాన్
విబుధాన్ బాణమయూర దండిముఖ్యాన్,
శిథిలీకృత దుర్మతాభిమానాన్
నిజభాష్య శ్రవణోత్సుకాం శ్చకార.

కతిపయ .... మయూరు నభినందించి—మయూరుఁడు మహా కవి. అతని సూర్యశతకము ప్రౌఢమైన రచన. ఇతఁడు సూర్యశతక మెందుకు వ్రాసెను? దీనినిఁ గూర్చి యొకటి రెండు కథలున్నవి. బాణమయూరులు బావమఱదులఁట! మయూరుని చెల్లెలిని బాణున కిచ్చినట్లు జనశ్రుతి. మయూరునిదుహిత బాణుని భార్యయైనట్లొక ప్రసిద్ధి. ఒకనాఁడు బాణునిపై భార్యకెందుకో కోపము వచ్చెను. ఎంత బతిమాలినను రోషము తగ్గలేదు. రాత్రి గడచినది. అప్పుడు బాణుఁడు—

గతప్రాయా రాత్రిః కృశతను శశీ శీర్యత ఇవ
ప్రదీపోఽయం నిద్రావశ ముపగతో ఘూర్ణిత ఇవ,
ప్రణామాంతో మాన స్త్యజసి నతథాఽపి క్రుధ మహో
కుచ ప్రత్యాసత్త్యా హృదయమపి తే సుభ్రు:........

అసంపూర్తిగా బాణుఁడు నిలిపినాఁడు. 'చండి! కఠినమ్!' అను కొనుచు మయూరుఁడు గృహమునఁ బ్రవేశించెను. సుభ్రూ పదముకంటెను 'చండి' పద మిచట యుక్తము. దీనివలన బాణుని భార్యకుఁ గోపము వచ్చి యామె 'కుష్ఠరోగివి గమ్ము' ని మయూరుని శపించినది. ఇదియొక కథ. మయూరుఁ డొకనాఁడు ప్రొద్దుట లేచి ప్రియుని మందిరమునుండి బయటికి వచ్చుచున్న యొకానొక స్త్రీని జూచినాఁడు. ఆమె సౌందర్యము నెనిమిది శ్లోకములలో వర్ణించెను. దానికి 'మయూరాష్టక' మని పేరు. ఆ స్త్రీ కర్మవశాత్తు బాణుని భార్యయే యైనది. తత్సన్నివేశమున నామె 'కుష్ఠరోగివి గమ్మని' శపించినది. ఇదిమరియొక కథ. ఒకానొకనాఁడు మయూరుఁడు రాజ దర్శనమునకు వెళ్లెను. కుష్ఠరోగి యగుటచే దర్శనము లభించలేదు. అంతట నూఱుత్రాళ్లతో నొక యుట్టిని గట్టినాఁడు. తా నందుఁ గూర్చుండి క్రింద పెద్దమంటఁ బెట్టించెను. ఒక్కొక్క శ్లోకముఁ జెప్పి నపు డొక్కొక్క త్రాటిని యుట్టినుండి కోయుచుండినాఁడు. నూఱు

శ్లోకములైన తర్వాత సూర్యుఁడు ప్రత్యక్ష మయ్యెను. 'ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్' అన్నట్లు సూర్యుని దయతో మయూరుని రోగము వదలినది. సూర్యశతకములో నూటరెండు శ్లోకములు గలవు. దీనిని మనసున నుంచికొని బాణుఁడు చండీశతకమును జెప్పినాఁడు. బాణ కృతమైన చండీశతకమున్నదని చాలమంది యెఱుఁగరు. కొన్ని శ్లోకములచేతనే సూర్యుని మెప్పించిన వాఁడు మయూరుఁడు. మహా కావ్యకరణవిలాసుఁడు కాళిదాసు. రఘువంశము, కుమారసంభవము, మేఘదూతము నీ మూఁడు మహాకావ్యములు. కవికమల వినర రవి=కవు లనెడు కమలవనములకు సూర్యునివంటివాఁడు భారవి. 'భారవే రర్థగౌరవమ్' భారవి కవిత్వ మర్థ గౌరవమునకుఁ బ్రసిద్ధి. విదళితాఘుమాఘు స్తుతియించి=కవిత్వముతోఁ బాపములు పోఁగొట్టు కొన్నవాఁడు మాఘుఁడు. ఈ వాదుక మాఘుని గుఱించి లేదు. మఱి పోతన్న యభిప్రాయమేమో తెలియదు. బహుశః మాఘుఁడు కృష్ణకథను జెప్పుటతో నిష్పాపుఁ డయ్యెనని యూహించెనేమో!. ఆంధ్రకవితా........మనోహారు=ఆంధ్రకవిత్వమందు గౌరవమున్న జనుల మనస్సులను హరించువాఁడు. కైవారము=పొగడ్త. ప్రబంధ పరమేశ్వరుఁడని యెఱ్ఱాప్రెగ్గడకు బిరుదు. సంభావనము=గౌరవము భావికవులు=పుట్టఁబోయెడి కవులు, ఉభయ కావ్యకరణదక్షుఁడు= తెలుఁగు సంస్కృతములందు రచనసేయు సామర్థ్యముగలవాఁడు.

తా॥ దినకరకుమార ప్రముఖులైన యిష్టదేవతలకు నమస్క రించి వాల్మీకిని స్తుతించి, వ్యాసునకుమ్రొక్కి, భాగవతసుధారసమును బంచిన శుకయోగికి నమస్కరించి, బాణ, మయూర, కాళిదాస, భారవి, మాఘుల గౌరవించి, నన్నయ, తిక్కన, యెఱ్ఱాప్రెగ్గడల నుతియించి, పూర్వకవులకు వర్తమానకవులకు భావికవులకు గౌర వము నిచ్చి రెండు భాషలయందును రచియింప సమర్థుఁడనై-

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురమ్ములు వాహనమ్ములున్
సొమ్ములు గొన్నిపుచ్చుకొని, చొక్కి, శరీరమువాసి, కాలుచే
సమ్మెటవ్రేటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

దీనికిఁ బైనున్న వచనము ఉత్తమపురుషతో ముగియుచున్నది. ఈ పద్యమున బమ్మెరపోతరా జొకఁడని ప్రథమపురుషము గన్పడు చున్నది. వ్రాతప్రతు లన్నింటిలోను నీ పద్య మట్టులనే యున్నది. అందుచే దాని నట్లే యుంచితిమి. ఈ + మనుజేశ్వరాధములు, త్రిక సంధి, చొక్కి = పరవశించి, జగత్ + హితము = జగద్ధితము.

తాత్పర్యము: దుర్మార్గులైన రాజులకుఁ గృతినిచ్చుట దోషము. వా రేవో కొన్ని గ్రామము లిత్తురు. వాహనము లిత్తురు. కాకున్న బంగారుసొమ్ము లిత్తురు. వారి ననుసరించుట మహాక్లేశము. రాజులతో నీ మర్యాద లందినందులకు ఫల మేమి? మరణానంతరము యమునిచేతికిఁ జిక్కుట. యమకింకరులతో సమ్మెటవ్రేటులు దినుట. ఈ బాధ లొల్లని బమ్మెరపోతరాజు తన భాగవతమును శ్రీహరి కిచ్చి నాఁడు. దానితో నాత్మహితమే గాక జగద్ధితము నొనఁగూడినది.

పోతన్న కాలమున నుండిన రాజులు పరస్పర కలహములతోఁ బ్రొద్దులు పుచ్చుచుండిరి. ప్రజాక్షేమము వారి కంతగాఁ బట్టినట్లు లేదు. విజయనగరములో కొడుకులు దండ్రులను, తండ్రు లన్నలను జంపుచుండిరి రెడ్లు వెలమలకు యుద్ధములే కూడయ్యెను. ఈ దురాగతములు చూచియే పోతన్న 'ఇమ్మనుజేశ్వరాధము' లని వాడినాఁడు. విరక్తు లిట్లే యుందురు. దేశికులు—

దురీశ్వరద్వార బహిర్వితర్దికా
దురాసికాయై రచితోయ మంజలిః.

యని దండముఁ బెట్టిరి.

**చేతులారంగ శివునిఁ బూజింపఁ డేని**
**నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁ డేని**
**దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేనిఁ**
**గలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు.**

'అభిషేక ప్రియశ్శివః' శివునిఁ బూజించుట యనఁగా నభిషేకించుటయే. నోరు నొచ్చునట్లు భగవంతుని యశమును బాడవలెను. అంతమాత్రమే గాదు. దయ, సత్యము మొదలైన సాత్త్వికగుణముల నలవఱచికొనవలెను. అప్పుడే భక్తి యర్థవత్తగును నరజన్మ దుర్లభమైనది. ఈ జన్మములో వీనిని సాధించి కొనకున్నచోఁ 'దల్లుల యౌవనము వ్యర్థముఁ జేయ జన్మించినవారే'. **మాతుః కేవల మేవ** యౌవన వనచ్ఛేదే కుఠారా వయమ్. పోతన్నకు శివకేశవు లిర్వురు నొక్కటే యనుట కిది చక్కని యుదాహరణము. వీరశైవములోని రజోభక్తి యాతని నాకర్షింపలేదు. సాత్త్వికమైన విష్ణుభక్తి యాకర్షించినది.

వచనము : అని మదీయ పూర్వజన్మసహస్రసంచిత తపఃఫలంబున శ్రీమన్నారాయణ కథాప్రపంచవిరచనా కుతూహలుండనై యొక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకగని సజ్జనానుమతంబున నభ్రంకషశుభ్ర సముత్తుంగభంగ యగు గంగకుం జని క్రుంకు లిడి వెడలి మహనీయమంజుల పులినతలమండప మధ్యంబున మహేశ్వరధ్యానంబు సేయుచుఁ గించి దున్మీలితలోచనుండనై యున్న యెడ.

మదీయ=నాయొక్క, పూర్వజన్మసహస్ర=వేయి పూర్వజన్మములయందు, సంచిత=సంపాదించికొన్న, తపఃఫలంబునన్=తపఃఫలముగా, శ్రీమన్నారాయణకథా=లక్ష్మీనారాయణ కథలయొక్క, ప్రపంచ=సమూహముయొక్క, విరచనాకుతూహలుండనై=రచించుటయం దాసక్తి గలవాఁడనై, రాకానిశాకాలంబునన్=పున్నమరాత్రి

యందు, సోమోపరాగంబు=చంద్రగ్రహణము, సజ్జనాను మతంబునన్ =సత్పురుషుల సమ్మతితో, అభ్రంకష=ఆకాశము నొరయుచున్న, శుభ్ర=స్వచ్ఛమైన, సముత్తుంగభంగ=సమున్నతములైన అలలు గలది, గంగకుం జని=ఒకానొక పుణ్యనదికిఁ బోయి, మహనీయ.... మధ్యంబున=గొప్పదై అందమైన ఇసుకప్రదేశమందలి మండపములో, మహేశ్వర ధ్యానము=పరమశివుని ధ్యానము, కించిత్=కొంచెము, ఉన్మీలిత=తెఱువఁబడిన, లోచనుఁడు=కన్నులు గలవాఁడు.

తాత్పర్యము: పూర్వజన్మ సహస్రసంచితమైన తపఃఫలము గనే శ్రీమన్నారాయణభక్తి యేర్పడినది. అందుచే పోతన్న భగవత్కథలు వ్రాయుటకుఁ బూనుకొనెను. ఒకానొక పున్నమనాఁటిరాత్రి చంద్రగ్రహణ పుణ్యకాలమున, చెంగటనున్న యొకనది కేగి స్నాన మొనర్చి వాలుకా ప్రదేశమున నొక మండపములో మహేశ్వర ధ్యానము సేయుటకుఁ గూర్చున్నాఁడు. పోతరాజు వ్రాయ సంకల్పించినది నారాయణకథ. ధ్యాన మొనర్చినది పరమేశ్వరునిఁ గూర్చి. కనిపించినవాఁడు రామచంద్రుఁడు. తానుఁ జెప్పిన షష్ఠ్యంతములు కృష్ణపరములు. దీనితో పోతన్నగారి యద్వైతభక్తి యెంత పరిపూర్ణమైనదో మన మూహించికొనవలెను.

మెఱుఁగు చెంగటనున్న మేఘంబు కైవడి
 నువిద చెంగటనుండ నొప్పువాఁడు
చంద్రమండల సుధాసారంబు పోలిక
 ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు
వల్లీయుత తమాల వసుమతీజముభంగి
 బలువిల్లు మూపున బరఁగువాఁడు
నీలనగాగ్ర సన్నిహితభానుని భంగి
 ఘనకిరీటము దల గల్గువాఁడు

ఆ. పుండరీకయుగము బోలు కన్నులవాఁడు
వెడఁద యురమువాఁడు విపులభద్ర
మూర్తివాఁడు రాజముఖ్యుఁ డొక్కరుఁడు నా
కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె.

టీక : మెఱుఁగు=మెఱపు, చెంగటన్=సమీపమందు, కైవడి=వలె, ఇది యుపమావాచకము, ఉవిద=స్త్రీ, సందర్భము ననుసరించి సీతాదేవి; చంద్రమండల సుధాసారము=చంద్రమండలములోని యమృతప్రవాహము, 'ధారాసంపాత ఆసార'అని అమరము; పోలికన=వలె, ఉపమావాచకము; వల్లీయుత=తీఁగచేతఁ గూడికొన్న, తమాలవసుమతీజము భంగి=తమాలవృక్షమువలె, వసుమ+తీజము=భూమినుండి పుట్టినది, బలువిల్లు=పెద్దవిల్లు, మూపునన్=స్కంధమునందు, పరఁగువాఁడు=ఉన్నట్టివాఁడు, నీలనగ=నల్లనికొండల యొక్క, అగ్ర=శిఖరమును, సన్నిహిత=సమీపించిన, భానుని భంగిన్=సూర్యునివలె, ఘనకిరీటము=పెద్దకిరీటము తలగలుగువాఁడు పుండరీక యుగముఁ బోలు కన్నులవాడు=తెల్లదామరల జంటఁ దలపించు నేత్రయుగ్మమువాఁడు; పుండరీకం సితాంభోజం అని అమరము; వెడఁదయురమువాఁడు=విశాలవక్షస్థ్సలము గలవాఁడు, విపులభద్ర మూర్తివాఁడు=పొడగరియై, మంగళప్రదమైన ఆకారము గలవాఁడు.

తాత్పర్యము: సీతాదేవి పచ్చని శరీరచ్ఛాయ గలది. రావణాసురుఁడు సీతను సంబోధించి, 'కాత్వం! కాంచనవర్ణాభే! పీత కౌశేయవాసిని! కమలానాం శుభాం మాలాం పద్మినీ మివబిభ్రతీ' అన్నాఁడు. రామచంద్రుఁడు మేఘశ్యాముఁడు. పోతన్నకు దర్శనమిచ్చిన రాముఁడు సీతాసహితముగ వచ్చెను. ఆమె మెఱుపువలె నున్నది. ఇతఁడు మెఱుపుతోఁ గూడిన మేఘమువలె నున్నాఁడు. ఉపమాలంకారము. ముఖము చంద్రమండలమువలె నున్నది. చిఱునవ్వు చంద్రునినుండి స్రవించు అమృతమువలె నున్నది. ఇదియు

నుపమాలంకారమే. తమాలవృక్షము అనఁగా కానుగు. అది నల్లగా నుండునని కవిసమయము.

**మేఘైర్మేదుర మంబరం వనభువం శ్యామాస్తమాల ద్రుమైః**

అని జయదేవుఁడు, రామచంద్రుని మూపున విల్లున్నది. ఆ విల్లు తీఁగ వలె నున్నది. అతఁడు తీఁగచేఁ గూడుకొన్న తమాలవృక్షము వలె నున్నాఁడు. రాముఁడు నల్లనికొండవలె నున్నాఁడు. ఆ కొండ కొమ్ముపై సూర్యునివలె ఘనకిరీటము ప్రకాశించుచున్నది. ఈ రెండును ఉపమాలంకారములే. మొదటి మూఁడవ పాదములలోని యుపమలలో రామునకుఁ బ్రాధాన్యము. రెండు నాల్గు పాదములలోఁ జిఱునవ్వునకుఁ గిరీటమునకుఁ బ్రాధాన్యము. నాల్గు నుపమాలంకారములే. ఐనను ఉపమలు చెప్పుటలో నొక వైచిత్రిని పాటించినాఁడు. తెల్ల దామరలవంటి కను లాతని ప్రసన్నతకు గుర్తు. కోపము వచ్చినపుడు స్వామి కను లరుణకమలము లగును.

**పుండరీకాక్షుఁడగు వెల్లఁదోయి యప్పు**
**డరుణకమలాక్షుఁ డగుచు మురాంతకుండు**

**(భార. ఉద్యో 3, ఆశ్వా. 384 పద్య)**

సీతాదేవితోఁ గూడ రాముఁడు దర్శనమిచ్చుట చాల శుభసూచకము. ఆమె లక్ష్మీస్వరూపిణి. నిత్యాపురుష కార స్వరూపిణి. భక్తులను రక్షింపవలె ననియే యెప్పుడును భగవంతుని చెవిలో నూఁదిపోయుచుండును. పోతన్నకు దర్శనమిచ్చినపుడు సీతాదేవి వెంటనుండుట, పోతన్నకుఁ బునర్జన్మము లేకుండుటకు ప్రబల ప్రమాణము.

వచ: 'ఏ నా రాజశేఖరునిం దేఱిచూచి భాషింప యత్నంబు సేయునెడ నతండుఁ దా 'రామభద్రుండ, మన్నామాంకితంబుగా శ్రీ మహాభాగవతంబు తెనుంగు సేయుము. నీకు భవబంధములు దెగు'

నని యాన తిచ్చి, తిరోహితుం డయ్యె. నంత నే సమున్మీలితలోచ నుండనై వెఱఁగుపడి చిత్తంబున-

ఏను=నేను, రాజశేఖరుఁడు=రాజశ్రేష్ఠుఁడు, తేఱిచూచి=మొగ మెత్తిచూచి, మన్నామాంకితంబుగన్=నాకుఁ గృతినిచ్చి, శ్రీ మహా భాగవతంబు = భాగవత పురాణమును, భవబంధంబులు = సంసార బంధములు, అనతిచ్చి=ఆజ్ఞ యిచ్చి, తిరోహితుఁడు = అదృశ్యమైన వాఁడు, సమున్మీలితలోచనుండనై = తెఱవఁబడిన నేత్రములు గల వాఁడనై, వెఱఁగుపడి = ఆశ్చర్యపడి.

తాత్పర్యము: నే నా రాజశ్రేష్ఠునిఁ దలయెత్తి చూచితిని. ఏదో మాటాడుద మన్న యాకాంక్ష. ఇంతలో నాతఁడు 'నేను రామభద్రుఁ డను, నాకుఁ గృతినిచ్చి శ్రీమహాభాగవతము దెనుఁగు సేయుము. నీకు భవబంధములు దెగు' నని యానతిచ్చి యంతర్హితుఁడయ్యెను. నేను కన్నులుదెఱచి జరిగిన విషయమున కాశ్చర్యపడుచు, పై పద్య ముతో నన్వయము.

ఇచ్చట శ్రీమహాభాగవత మనఁగా సంపద్యుక్తమైన భగవద్భ క్తుల చరిత్రలతోఁ గూడిన భాగవతమని యర్థము. భాగవతమందుఁ బ్రధానముగాఁ జెప్పఁబడినది అష్టాక్షరీమంత్ర రహస్యమే. గోవింద రాజీయములో 'సితాయాశ్చరితం మహత్' అను దానిని వ్యాఖ్యా నించు సందర్భమున నిట్లున్నది-

**"అష్టాక్షరోప బృంహక శ్రీభాగవతాదిషు హి భగవత్ప్రాధాన్యం, అత ఏవ నారాయణ కథా మిమామితి తత్రోక్తమ్."**

కనుక శ్రీమద్భాగవతమున ముఖ్యముగాఁ జెప్పఁబడినది యష్టాక్షరీమంత్ర మహత్త్వమే, కాని యష్టాక్షరిలోని 'ఓం'కారమందే లక్ష్మిగూడ నున్నదని, రహస్యత్రయసారవ్యాఖ్య. ఓంకారములోని అ-ఉ-మ అను మూఁడు పదములు క్రమముగా పరమాత్మను లక్ష్మిని

భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁ దమ్మి చూలికైన
విబుధజనుల వలన విన్నంత గన్నంతఁ
దెలియవచ్చినంత తేటపఱతు.

భాగవతము నర్థముఁజేసికొని దీనికిదే తాత్పర్యమని నిర్ణయించి చెప్పుటకు బరమేశ్వరునకు శక్తి లేదు. తమ్మిచూలియైన బ్రహ్మ చాలఁడు. ఇఁక నాబోటి వాని దేమున్నది? భావుకులైన యనుభవజ్ఞుల వలన నేను విన్నంత, నా యనుభవమునకు వచ్చినంత, నాకుఁ దెలిసినంత వఱకు అనుభవమును బరిపూర్తిగా మాటలలో నందించుటకు నాకు శక్తి లేదు. నాకు సాధ్యమైనంత భాషలో నెఱిఁగింతును.

సంస్కృతభాషలో భాగవతము చాలప్రౌఢమైనది. ప్రాచీనులు దానికి శాస్త్రగౌరవము నిచ్చిరి. 'భక్త్యా భాగవతం జ్ఞేయం'. భక్తి యొక్కచే భాగవత మర్థమగుటకు మార్గము. ఒక్క ఉత్తర హిందూస్థానమందే భాగవతము నాధారముగాఁ దీసికొని యెన్నో సంప్రదాయములు బయలుదేరినవి. ఉత్తరాపథమందు దానికి సుమారు రెండువందల వ్యాఖ్య లున్నవని. పండితు లందురు–

కొందఱికిఁ దెనుఁగు గుణమగు
గొందఱికిని సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱికి గుణములగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్.

తా. కొందరికిఁ దెనుఁగుపదము లెక్కువగా వాడినచో నిష్టమగును. కొందరికి సంస్కృతము వాడినచోఁ బ్రీతి. రెంటిని సమర్థముగా సమపాళ్లుగా వాడిన మరికొందరికి మెప్పు. నేనందరి నాయా ఘట్టములలో మెప్పింతును.

ఒనరన్ నన్నయ తిక్కనాదికవు లీ యుర్విం బురాణావళుల్
దెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దా నెట్టిదో
దెనుఁగుం జేయరు మున్ను భాగవతముం దీనిం దెనింగించి నా
జననంబుం సఫలంబు సేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్.

ఒనరన్=యుక్తముగా, నన్నయతిక్కనాదికవులు=నన్నయ్య తిక్కన మొదలగు కవులు. పురాణావళుల్=పురాణసమూహములు, మత్పురాకృత శుభాధిక్యంబు=నా పూర్వజన్మ పుణ్యాధిక్యము.

తా. నన్నయ తిక్కనాది కవులింతకుముందే కొన్నిపురాణములను దెనిఁగించిరి. నా పూర్వపుణ్యాతిశయముచేత వారు భాగవతము జోలికి రాలేదు. దీనినిఁ దెనిఁగించి పునర్జన్మము లేకుండఁజేసికొందును అదియే మానవజన్మకు సాఫల్యము. నన్నయతిక్కనలు దెనిఁగించినది భారతము. అది యితిహాసము. పురాణము గాదు. తిక్కన రచన నిర్వచనోత్తర రామాయణ మాదికావ్యము. ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహ పురాణము, హరివంశము పోతన్న చూచియుండె నేమో! అన్నిఁటిని గలిపి పురాణావళు లన్నాఁడు.

మ. లలితస్కంధము గృష్ణమూలము శుకాలాపాభిరామంబు, మం
జులతా శోభితమున్ సువర్ణ సుమన స్సుజ్ఞేయముం సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాల వాలంబునై
వెలయుం భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై.

భాగవత మనెడు కల్పతరువు. రూపక సమాసము అగుటచే, వృక్షపరము గాను, భాగవతపరము గాను రెం డర్థములు చెప్పుచున్నాఁడు. భాగవతము లలితస్కంధము. లలితములైన పండ్రెండు స్కంధములు గలది. కల్పవృక్షము లలితమైన మొదలుగలది. కృష్ణమూలము-కృష్ణపరమాత్మయే ఆధారముగాఁ గలది. అనఁగాఁ గృష్ణ పరమాత్మ నవలంబనముగాఁగొని, యనేకకథలు భాగవతము నందుఁ

ప్రపంచింపఁబడినవి. కృష్ణమూలము నల్లనై లావుగానున్న వ్రేళ్లుగలది కల్పవృక్షము. శుకాలాప + అభిరామము = శుకునిమాటలచే మనోహరమైనది. శుకుఁడు జన్మతః సిద్ధుఁడు. అట్టివాని నోటినుండి వెలువడుటచేఁ గృష్ణకథల కింకను మెఱుఁగు వచ్చినది. కల్పవృక్షము చిలుకల పలుకులచే మనోహరమైనది. మంజులతా శోభితము-సౌందర్యముతోఁ గూడుకొన్నది భాగవతము. మంజు=మనోహరములైన, లతా=తీఁగలల్లుకొనుటచేఁ బ్రకాశించునది కల్పవృక్షము, సువర్ణ=లలితములైన వర్ణములతోఁ గూడుకొని, సుమనస్=చక్కనిమనసుగల సత్పురుషులకు, సుజ్ఞేయము=చక్కఁగా నర్థము చేసికొనుటకుఁ దగినది; సువర్ణ=స్వచ్ఛమైన రంగుతోఁగూడిన, సుమనస్=సువాసనగల పూలచేత, సుజ్ఞేయము=తెలియఁ బడునట్టిది. ఆ కల్పవృక్షము పూలు మనోహరమైన వర్ణములుగలవి. అంతమాత్రమేగాదు. 'దూరా ద్గంధో వాతి' అన్నట్లు తమ సువాసనలచేత దూరమునుండి మనుష్యుల నాకర్షించునవి.సుందరోజ్జ్వలవృత్తంబు=సుందరములై ప్రకాశమానములైన పలువిధములైన వృత్తములచేఁ గూడినది. సుందరమై యుజ్జ్వలమైన మండలముచేఁ గూడినది. మహాఫలంబు=గొప్పదగు మోక్షాఖ్యఫలమిచ్చునది; పెద్దపండ్లు గలది. విమలవ్యాసాలవాలంబు=స్వచ్ఛమైన వ్యాసుఁ డనెడు ఆధారము గలది. అనఁగా వ్యాసునిచే రచింపఁబడినదని తాత్పర్యము. కొందరు పండితులు భాగవతమనుటకు 'ప్రకాశకాః గావో యస్య సః భాగః, పరమాత్మా, భాగోరయ మవతారః భాగవః వ్యాసః తేన తన్యతే ఇతి భాగవతమ్' అనియును విగ్రహము చెప్పెదరు. పరమాత్మ అవతారమైన వ్యాసునిచే రచింపఁ బడినదని యర్థము. సద్విజశ్రేయమై=ఉత్తమ విప్రులకు క్షేమము గల్గించునదై. ఇక్కడ ద్విజు లనఁగా భక్తులనియే సామాన్య తాత్పర్యము. మంచి పక్షుల కాశ్రయభూతమై యని వృక్షపరమైన యర్థము.

తా. ఈ భాగవతమన్నదే గొప్పకల్పవృక్షము. లలితములైన స్కంధములే స్కంధములు. నాయకుఁడైన కృష్ణుఁడే యా కల్ప వృక్షమునకు మూలము. అది శుకాలాపాభిరామము. భాగవతము మంజులతతోఁ గూడినది. కల్పవృక్షము దన్ను పరివేష్టించిన యంద ములైన తీఁగలు గలది. భాగవత రచన లలితాక్షర సంపన్నము. సత్పురుషులకే యర్థ మగును. కల్పవృక్షము పూలు సువర్ణములు. సుగంధ యుక్తములు. భాగవతమునందు మంజుల వృత్తములు. మోక్షమనెడు మహాఫలము భాగవతముచేతనే సిద్ధించును. భాగవత కల్పతరుఫలము కడు గొప్పది. వ్యాసుని వదనమునుండి జారిన సుధాధార యది. కల్పవృక్షమునకుఁ బాదు వ్యాస భగవానుఁడు. భక్తులకు మహాఫలదాయకము.

వ. ఇట్లు భాసిల్లెడి శ్రీ మహాభాగవతపురాణ పారిజాతపాదప సమాశ్రయంబున, హరికరుణా విశేషంబునఁ, గృతార్థత్వంబు సిద్ధించె నని బుద్ధి నెఱింగి లేచి, మఱల గొన్ని దినంబులకు నేకశిలానగరంబు నకుం జనుదెంచి యందు గురు, వృద్ధ, బుధ, బంధు జనానుజ్ఞాతుం డనై—

అర్థములు: భాసిల్లెడు=ప్రకాశించునట్టి, పారిజాతపాదపసమా శ్రయంబున=పారిజాతవృక్షము నాశ్రయించి, పారిజాతము కల్పవృక్ష భేదమే, 'పంచైతే దేవతరవో మందారః పారిజాతకః, సంతానః కల్పవృక్షశ్చ పుంసివా హరిచందనమ్'—అని అమరము.

హరికరుణా విశేషంబునన్=శ్రీహరికరుణచేత, కృతార్థత్వము =జన్మసఫల మయ్యెడి మార్గము, ఏకశిలా నగరంబునకున్=ఒరుగల్లు నకు, గురు వృద్ధ బుధ బంధు జనానుజ్ఞాతుండనై=గురువులు, వృద్ధులు బుధులు, బంధువులు వీరి సమ్మతిని నాజ్ఞారూపముగఁ గైకొన్న వాఁడనై.

తాత్పర్యము. 'భాగవత మనెడు పారిజాత సమాశ్రయము నాకు లభించినది. హరికరుణావిశేషముతో జన్మసాఫల్యము సిద్ధించె' నని తెలిసి ఓరుగల్లున కేతెంచి, గురువృద్ధ బుధ బంధుజనుల యానతి శిరసా వహించినవాఁడనై.

గ్రంథకర్తృవంశ వర్ణనము:

కౌండిన్యగోత్ర సంకలితుఁ డాపస్తంబ
సూత్రుండు పుణ్యుండు సుభగుఁడైన
భీమనమంత్రికిఁ బ్రియపుత్రుఁ డన్నయ
కలకంఠి తద్భార్య గౌరమాంబ
కమలాప్త వరమునఁ గవిన సోమనమంత్రి
వల్లభ మల్లమ వారి తనయుఁ
డెల్లన యతనికి నిల్లాలు మాచమ
వారిపుత్త్రుఁడు వంశవర్ధనుండు

లలితమూర్తి బహుకళానిధి కేసన
దాన మాన నీతిధనుఁడు ఘనుఁడు
తనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ
మనియె శైవశాస్త్రమతము గనియె.

అర్థము; సుభగుఁడు = అందగాఁడు, కలకంఠి = మధురమైన కంఠధ్వని గలది, కమలాప్తువరము = సూర్యునివరము, బహుకళానిధి = అనేక కళలకు నిధివంటివాఁడు, దాన మాన నీతిధనుఁడు, దాన = వితరణము, మాన = వంశాభిమానము, నీతి = న్యాయము - వీనిచే గొప్పవాఁడు, ధర్మగేహిని = భార్య, శైవశాస్త్రమతము = శివభక్తికి సంబంధించిన పద్ధతి.

తాత్పర్యము: పోతన్నగారిది కౌండిన్యగోత్రము. ఆపస్తంబ సూత్రము. ఆ వంశమున భీమనమంత్రి జన్మించెను. అతఁడు సుభగుఁడు. అతని కొడుకు కన్నయ. తద్భార్య గౌరమాంబ. కమలాప్తుని

వరముతో సోమనమంత్రి జన్మించెను. సోమనభార్య మల్లమ. వారి కుమారుఁ డెల్లన. అతని గేహిని మాచాంబిక. వారిపుత్రుఁడే కేసన. ఈతఁడు వంశవర్ధనుఁడు. అనేకకళలయందు గొప్పవాఁడు. దానము-మానము-నీతియుఁ గలవాఁడు అతని భార్య లక్కమ. వా రిద్వరును గొప్ప శివభక్తులు.

లలితమూర్తి=అందమైన శారీరకసంపద గలవాఁడు లేక యాకర్షించు మూర్తిగలవాఁడు. 'ప్రియశిష్యా లలితే కళావిధౌ' (రఘు. స 8 శ్లో. 67), 'సందర్శితేవ లలితాఽభి యస్య శిక్షా' (మాళవికాగ్నిమిత్రము అంక 4, ప. 9) సాహిత్య అకాడమీవారు పరిష్కరించిన భాగవతపీఠికలో పోతనవంశము వారును, బోతనయు వీరశైవులని తెలియుచున్నది. 'క్రమక్రమముగాఁ బోతన తిక్కనగారి వలెనే హరిహరులకు భేదమెంచని యద్వైతిగా మారెను' అన్నారు గురువు సోమనారాధ్యులు. రజోగుణ పూరితమైన వీరశైవ సంప్రదాయాసక్తి తగ్గిపోయిన దన్నారు.

నడవదు నిలయము వెలువడి
తడవదు పరపురుష గుణము దనపతి నొడువున్
గడవదు వితరణకరుణలు
విడువదు లక్కాంబ విబుధవినరము వొగడన్.

అర్థములు: నిలయము=ఇల్లు, తడవు=ప్రస్తావించు, నొడువు=మాట, గడచు=అతిక్రమించు, వితరణకరుణలు=దానమును, దయయు, విబుధవినరము=సత్పురుష సమూహము.

తాత్పర్యము: లక్కాంబ పతివ్రత. ఆమె పనిలేని పనిగా నితర గృహములకు వెళ్ళదు. పరపురుషుల గుణదోషము లెన్నదు. పతియాజ్ఞను దాఁటదు. దానము, కరుణ యీ రెంటి నెప్పుడు నుదాసీనింపదు. ఆమెను సత్పురుషు లెప్పుడును 'గొప్పది' యని పొగడుదురు.

ఉ. మానిను లీడుగారు బహుమాననివారిత దీనమానస
గ్లానికి దానధర్మమతి గౌరవమంజులతా గభీరతా
స్థానికి ముద్దుసానికి సదాశివ పాదయుగార్చనానుకం
పానయ వాగ్భవానికిని బమ్మెరకేసయ లక్కసానికిన్.

అర్థములు: బహుమాన=గౌరవపూర్వకముగా, నివారిత=నివారింపఁబడిన, దీన=దీనులయొక్క, మానసగ్లానికిన్=మనసుయొక్క దైన్యము గలిగినట్టియు, మతిగౌరవ=బుద్ధియొక్క గౌరవము, మంజులతా=అందము, గభీరతా=గాంభీర్యము మొదలైన గుణములకు, అస్థానికిన్=ఆస్థానము వంటిదియునైన, ముద్దుసానికిన్=ముద్దుసాని యను మారుపేరు గలిగినట్టియు, సదాశివపాద యుగార్చనా=పరమశివుని పాదయుగమును బూజించుటయందును, అనుకంపా=దయయందును, నయవాక్=ధర్మముగా మాటాడుటయందును, భవానికిన్=పార్వతితో సమానురాలైనట్టి, బమ్మెర కేసయ లక్కసానికిన్=బమ్మెరగ్రామ నివాసినియైన కేసనభార్య లక్కసాని యను నామెకు, మానిను లీడుగారు=ఇతరస్త్రీలు సాటిగారు.

తాత్పర్యము: బమ్మెరకేసయ లక్కసాని పోతనామాత్యుల తల్లి. 'సాని' శబ్దము స్వామినీ శబ్దభవము గావచ్చును. లక్కమ్మ లక్ష్మమ్మ శబ్దభవము. కేసయలక్కసాని: ప్రాచీనకాలములో భార్యలు భర్తలపేరు తమ నామములకు ముందు ధరించుచుండిరి. 'కేసయ లక్షసాని' యనునదట్టిదే. విజయనగరకాలములోఁ బురుషులు గూడఁ దండ్రులపేర్లు ముందుఁ జేర్చికొనెడివారు. 'రామరాజు తిమ్మరాజు' రామరాజు కొడుకైన తిమ్మరాజని యర్థము. కొంతమంది ప్రభువుల పేర్లు ముందుంచికొందురు. 'రామరాజ విఠ్ఠలరాజు' అనఁగా నళియ రామరాజునకు సామంతుఁడైన విఠ్ఠలదేవుఁ డనుట. లక్షసాని తన్నుఁ దరిసిన దీనుల గ్లానిని బోఁగొట్టునది. ఆ పోఁగొట్టుటలోఁ దన యాధిక్యము నేమియుఁ జూపించుకొనెడిది గాదు. వారియందు గౌరవ

మును గనపఱచుచునే వారి దుఃఖమును దొలఁగించెడిది. దానము-ధర్మము నామెకుఁ బ్రాణములు. తన మనస్సు తన కులగౌరవము నెప్పుడును రక్షించికొనెడిది. ఆమె మనోవృత్తి గంభీరమై, సుందరమైనది. సదాశివుని పాదయుగార్చనయందుఁ దీవ్రమైన యాసక్తి గలది. అనుకంప, నయవాక్కులు వీనియందుఁ బార్వతీదేవికి సమానురాలు. ఆమె కితర స్త్రీ లెవ్వ రీడుగారు.

ఆ మానిని కుదయించితి
మే మిరువుర; మగ్రజాతుఁ డీశ్వరసేవా
కాముఁడు తిప్పయ; వోతన
నామవ్యక్తుండ సాధునయ యుక్తుండన్.

అర్థములు: మానిని=స్త్రీ, అగ్రజాతుఁడు=పెద్దవాఁడు.

పై పద్యమందును దీనియందును 'మానినీ' శబ్దము స్త్రీ సామాన్యవాచకముగనే వాఁడఁబడినది. 'కోపము గలది' అను నర్థమునఁ గాదు. ప్రతిపదమును దాని వ్యుత్పత్తి ననుసరించి సార్థకముగనే వాడవలెనను నియమము చాలమంది కవుల కుండదు. దానిలో ప్రత్యేకతను సాధించినవాఁడు రామరాజభూషణుఁడు మాత్రమే.

తాత్పర్యము: ఆ లక్కసానికి మే మిద్దరము జనించితిమి. మా యన్న తిప్పయ. అతఁడు పరమ శివభక్తుఁడు. నేను పోతన్న నామమునఁ బ్రసిద్ధుడను. సత్పురుషులు మెచ్చు ప్రవర్తన గలవాఁడను.

వచ: అయిన నేను, నా చిత్తంబునఁ బెన్నిధానంబునుం బోని శ్రీరామచంద్రుని సన్నిధానంబు గల్పించుకొని-

తాత్పర్యము: ఇట్టి నేను నా చిత్తమున శ్రీరామచంద్రుని సన్నిధానంబు గల్పించుకొంటిని. అతఁడు నాకుఁ బెద్దనిధానము.

షష్ఠ్యంతములు :

ఉ. హారికి నందగోకుల విహారికి శక్రసమీరదైత్య సం
హారికి భక్తదుఃఖపరిహారికి గోపనితంబినీ మనో
హారికి దుష్టసంపదపహారికి ఘోషకుటీ పయోఘృతా
హారికి బాలకగ్రహ మహాసుర దుర్వనితా ప్రహారికిన్.

అర్థములు : హారికిన్ = మనోహరమైనవాఁడు, భక్తుల హృదయముల నాకర్షించువాఁడు, నందగోకులవిహారికి = నందుఁడున్న గోకులమున విహరించువాఁడు, చక్ర ... ... హారికిన్ = తృణావర్తుని సంహరించినవాఁడు, భక్త .... .... పరిహారికిన్ = భక్తుల దుఃఖములను బోఁగొట్టువాఁడు, గోప ... ... హారికిన్ = గోపస్త్రీల మనస్సుల నాకర్షించినవాఁడు, దుష్ట ... .... అపహారికిన్ = దుష్టుల సంపదలను హరించువాఁడు, ఘోష .... .... హారికిన్ = గోపాలుర ఇండ్లలోని పాలు వెన్న మీఁగడలు భుజించినవాఁడు, బాలక .... .... ప్రహారికిన్ = కంసుని పంపున వచ్చిన బాలగ్రహములు, ఇతర రాక్షసులు పూతన మున్నగువారిని చంపినవాఁడు.

ఇవి షష్ఠ్యంతములు షష్ఠ్యంత విశేషణములతోనే ముగియును. కడపట నిట్టి వానికి నేను గృతి యిత్తునని యన్వయించును.

తాత్పర్యము : భక్తుల నాకర్షించువాఁడు, నందుని నివాసమైన గోకులమందుఁ దిరుగాడు వాఁడు, తృణావర్తునిఁ జంపినవాఁడు, భక్తుల దుఃఖములఁ బరిహరించువాఁడు, గోపికాచిత్తముల హరించిన వాఁడు, దుష్టులసంపదలను బోఁగొట్టెడివాఁడు, గోపాలుర ఇండ్లలోని పాలు వెన్న మీఁగడలను భుజించెడివాఁడు, బాలగ్రహములు పూతన మున్నగు వారిని సంహరించినవాఁడు కృష్ణుఁడు. అట్టి వానికి సమర్పితముగా గ్రంథమును రచించుచున్నానని యన్వయము.

ఉ. శీలికి నీతిశాలికి వశీకృతశూలికి బాణహస్తని
ర్మూలికి ఘోరనీరదవిముక్తశిలాహత గోపగోపికా
పాలికి వర్ణధర్మపరిపాలికి నర్జునభూజయుగ్మ సం
చాలికి మాలికిన్ విపుల చక్రనిరుద్ధ మరీచి మాలికిన్.

అర్థములు: శీలికిన్ = ఉత్తమ గుణములు గలవానికి, నీతిశాలికిన్ = నీతిగలవానికి, వశీకృత శూలికిన్ = లోఁబఱచికొన్న శివుఁడు గలవానికి, అనఁగా శివుఁడు కృష్ణభక్తుఁడని తాత్పర్యము. బాణహస్తనిర్మూలికిన్ = బాణాసురుని హస్తములను ఖండించినవానికి, ఘోర.... పాలికిన్ = ఘోరములైన మేఘములనుండి రాల్పఁబడిన శిలలవంటి వడగండ్లచే బాధితులైన గోపగోపికలను గోవర్ధన పర్వతము నెత్తి రక్షించినవానికి, వర్ణధర్మపరిపాలికిన్ = వర్ణాశ్రమ ధర్మములను రక్షించెడు వానికి, అర్జునభూజ యుగ్మ సంచాలికిన్ = నారద శాపముచే మద్దిచెట్లుగా నైన గంధర్వులను శాపవిముక్తులఁ గావించుటకై యా మద్దులను బడనూకిన వానికి, మాలికిన్ = వైజయంతీమాల గలవానికి, విపులచక్ర నిరుద్ధ మరీచి మాలికిన్ = ఈ విశేషణము భారతకథకు సంబంధించినది.

భారతము ద్రోణపర్వములో జయద్రథవధ వచ్చును. అర్జునుఁడు సంశప్తకులపైకి యుద్ధమునకు వెళ్ళినాఁడు. ఆ యదను గని పెట్టి ద్రోణుఁడు పద్మవ్యూహమును బ్రకటించెను. దానిలోనికిఁ జొచ్చికొనిపోవు వైనము దెలిసినవాఁ డభిమన్యుఁ డొక్కఁడే. ధర్మరాజు 'నీవు మొగ్గరమును జించుము. మేమును రథములపై నీ వెన్నుదన్ని వచ్చెద' మన్నాఁడు. అభిమన్యుఁడు ప్రవేశించెను. అతని వెన్కనే పాండవులను బోనీక సైంధవుఁ డడ్డెను. అభిమన్యుఁడు నికృష్టముగా వధింపఁబడినాఁడు. వధకుఁ గారకుఁడైన జయద్రథుని సూర్యాస్తమయములోఁగా వధింపనిచో గాండీవముతో నగ్నిప్రవేశముచేయుదు నని యర్జునుఁడు ప్రతిజ్ఞ చేసెను.

యద్యస్మి న్న హతే పాపే సూర్యేఽస్త ముపయాస్యతి,
ఇహైవ సంప్రవేక్ష్యామి జ్వలితం జాతవేదసమ్.

ఆ తరువాతి యుద్ధములో సైంధవుని చుట్టును దుర్యోధన, కర్ణ, వృషసేన, శల్య, కృపాశ్వత్థామలు బరిచుట్టి రక్షించుచుండిరి. అర్జునునకు వీరలఁ దలగడచి జయద్రథుని నిర్జించుట దుష్కరమైనది. అప్పుడు తన యోగమాయచేతఁ గృష్ణుఁడు సూర్యునిఁ గప్పెను. సూర్యుఁ డస్తమించెనని సంతసమున సైంధవుఁ డగుపించినాఁడు. అర్జునుఁడు వానితల నుత్తరించెను.

సంస్కృతభారతములో నిట్లున్నది. అర్జునునితోఁ గృష్ణుఁ డనుచున్నాఁడు—

యోగమత్ర విధాస్యామి సూర్యస్యావరణం ప్రతి,
అస్తంగత ఇతి వ్యక్తం ద్రక్ష్యత్యేకస్స సింధురాట్.

హర్షేణ జీవితాకాంక్షీ వినాశార్థం తవ ప్రభో।
న గోప్స్యతి దురాచారః స ఆత్మానం కథం చన.

తత్ర ఛిద్రే ప్రహర్తవ్యం త్వయా స కురుసత్తమ,
వ్యపేక్షా నైవ కర్తవ్యా గతోఽస్తమితి భాస్కరః.

ఏవ మస్త్వితి బీభత్సుః కేశవం ప్రత్యభాషయత్,
తతో ఽసృజత్తమః కృష్ణః సూర్యస్యావరణం ప్రతి.

యోగీ యోగేన సంయుక్తో యోగినా మీశ్వరో హరిః,
సృష్టే తమసి కృష్ణేన గతోఽస్త మితి భాస్కరః.

త్వదీయా జహృషుర్యోధాః పార్థనాశా న్నరాధిపాః,
తే ప్రహృష్టారణే రాజన్। నాఽపశ్యన్ సైనికా రవిమ్.

ఉన్నామ్యవక్త్రాణి తథా స చ రాజా జయద్రథః,
వీక్ష్యమాణో తతస్తస్మిన్ సింధురాజో దివాకరమ్.

పునరే వాబ్రవీత్ కృష్ణో ధనంజయ మిదం వచః,
పశ్య! సింధుపతిం వీరం ప్రేక్షమాణం దివాకరమ్.

భయం హి విప్రముచ్యైత్య త్వత్తో భరతసత్తమ!
అయం కాలో మహాబాహో: వధాయాస్య దురాత్మనః.

ఛింది మూర్ధాన మస్యాశు కురు సాఫల్య మాత్మనః,
ఇత్యేవం కేశవేనోక్తః పాండుపుత్రః ప్రతాపవాన్.

.... .... .... .... .... ....

.... .... .... .... .... ....

తతో వినిహతే రాజన్! సింధురాజే కిరీటినా,
తమస్త ద్వాసుదేవేన సంహృతం భరతర్షభ!

పశ్చాత్ జ్ఞాతం మహీపాల! తవపుత్రై స్సహానుగైః,
వాసుదేవ ప్రయుక్తేయం మాయేతి నృపసత్తమ!.

అర్జునా! నా యోగశక్తిచేతఁ జీఁకటి నావరింపఁ జేతును. కౌరవులకు సూర్యుఁ డస్తమించినాఁ డన్న భ్రాంతిఁ గలుగఁ జేతును.

అర్జునుఁ డన్నాఁడు 'కృష్ణా! అట్లే కానిమ్ము'-

యోగీశ్వరుఁడైన కృష్ణుఁడు కాఱు చీఁకటిని సృష్టించెను. సూర్యుఁ డస్తమించెనని కౌరవులు దలఁచిరి. ఇఁక నర్జునుఁడు అగ్ని ప్రవేశ మొనర్చునన్న ధైర్యముతో సింధురా జొంటిగా నగుపించెను. కృష్ణుఁ డర్జును నెచ్చరించినాఁడు. అతఁడు సైంధవునితల నఱకెను. కృష్ణుఁడు గల్పించిన తమస్సు విఱిగినది. కౌరవుల కా చీఁకటి కృష్ణ మాయ యని యర్థమయ్యెను. కృష్ణుఁడు దన చక్రమును సూర్యున కడ్డుపెట్టినట్లు సంస్కృతభారతమున నగుపడలేదు. తిక్కన్న తెనుఁగు సేతలోఁ గూడ నీ ప్రస్తావము లేదు.

ఇన మండలంబు మఱువడ
నొనరించెదఁ దమము పాండవోత్తమ! యది గ్రుం
కినచందమైన సైంధవుఁ
డును, గౌరవయోధులుం గడుం బ్రమదమునన్.

వచ. 'ప్రతిజ్ఞాభంగం బయ్యెనని కయ్యంబు కడంకఁ దక్కి విచ్చలవిడి నొండొరుల మెచ్చుచుఁ బొంగి చెలంగుదు రప్పుడు నీ పూన్కి దీర్చికొమ్ము' అని పలికినంతఁ దన పరాక్రమంబు నవ్యాజం బయ్యెనని మనోవ్యథం జెందిన సవ్యసాచిం గనుంగొనుచు న మ్మాధవుండు మాయాతిమిరమునం దిమిరవైరిఁ గప్పిన-

అది రవి గ్రుంకుట గాఁగొని
మద మెసకం బెసఁగ నార్చి మనసైన్యంబుల్
వొదలె దలయెత్తి హర్షా
స్పదమతి సింధుపతి యపుడు పడమరఁ జూచెన్.

తదవసరంబున

ఎలమి దేరిమీఁద నిలుచుండి పడమ ర
త్తెత్తి చూచుచున్న యి ద్దురాత్ము
మస్తకంబు దునుము మనలక యని యర్జు
నునకుఁ జూపె సైంధవుని మురారి.

అతఁడు గని గంధమాల్యా
ర్చితమై దొన మెఱయుచున్న శితశర ముగ్రో
ద్ధతి నేయ దేగ పులుఁ గును
గతి గొనుక్రియ నది రహించె గ్రక్కున శిరమున్.

గదగు వీర నారాయణుఁడు రచించిన కన్నడ భారతములో మాత్రము 'చక్రము చేత నడ్డిన' ప్రస్తావ మున్నది.

సలిస బేహుదు భకుతమాడిద
చలదభాషెయ నెనుత రవి మం
డలకె మరెయొడ్డిదను మురరిపు వరసుదర్శనవ।
కళనొళగె కత్తలిసితహితన
కొలెగె కావళ కలెత వోలరె
ఘళిగెయలి సుమ్మాన మసగితు సకల కురుబలకె॥

భక్తుని ప్రతిజ్ఞను జెల్లించవలెనని కృష్ణుఁడు మనసు పెట్టెను. రవిమండలమును దన చక్రముచే నడ్డినాఁడు. రణరంగమునఁ జీఁకటి యాక్రమించినది. కురుబలము జగ మంధకారమయ మయ్యె నని తలఁచెను.

తెనుఁగు దేశమందును నొక సంకటమును నివారింపవలసి వచ్చినప్పుడు 'చక్ర మడ్డు వేస్తావా' అనెడు మాట వాడుకలో నున్నది.

మఱి యీ చక్రప్రసక్తి యెక్కడనుండి వచ్చినట్లు? కుంభకోణమువారు ప్రకటించిన దాక్షిణాత్యప్రతిలోఁ బ్రక్షిప్తముల క్రింద నీ శ్లోకము లున్నవి.

అనస్తమిత ఆదిత్యే ఏతాన్నిర్జిత్య సైంధవః,
న శక్తో హంతు మిత్యేవం మన్యమానో జనార్దనః,
సస్మారచక్రం దైత్యారిః హరిః తత్ర సుదర్శనమ్,
తదాదిదేశ భగవాన్ స్మృతమాత్ర ముపస్థితమ్.

అస్తం గత మివాదిత్యం తమసాఽచ్ఛాద యేతి చ,
తత్తథోక్తం భగవతా తమోభూత్వా విశాంపతే,
అంధం తమ ఇవాజ్ఞానా మాదిత్యస్యాఽహరత్ప్రభామ్.

పై శ్లోకములనుబట్టి పోతన్న దాక్షిణాత్య ప్రతి భారతమును జూచియుండె నేమో యనిపించుచున్నది. మధ్వాచార్యులవారు

'భారతతాత్పర్యనిర్ణయము', 'భాగవతతాత్పర్యనిర్ణయము' గూడ వ్రాసినారు. వారి భారత తాత్పర్య నిర్ణయమునందుఁ జక్రముచేత నడ్డగించిన ప్రస్తావము లేదు. కాని 'తాత్పర్యనిర్ణయ ప్రమాణసంగ్రహ' మను వేరొకగ్రంథ మున్నది. దానిని రచించినవారు 'పాండురంగి ఆనందభట్టారకులు'. అందులోఁ జక్రప్రస్తావము వారు తెచ్చినారు. దానిపై వారొక పూర్వపక్ష మెత్తికొనిరి.

'సుదర్శన స్తోత్రములో' సుదర్శన! మహాజ్వాల! కోటి సూర్యసమప్రభ! అని యున్నది గదా! కోటి సూర్యసమప్రభగల చక్రము సూర్యునడ్డి నప్పుడు చీఁకటులెట్లు గ్రమ్మినవి?' అని ప్రశ్న.

దానికి సమాధానముగా వారి సమర్థన: హరిభక్తుఁడైన యంబరీషుని దుర్వాసుఁ డవమానించెను. వైకుంఠుని యాజ్ఞతోఁ జక్ర మాతని వెంటాడినది. అప్పు డాతఁడు 'నీవు నన్ను వెంటాడితివి గనుక నిస్తేజస్కుఁడవై పొమ్ము' అని శాప మిచ్చినాఁడట. దుర్వాసుఁడు రుద్రాంశ. తారతమ్యమునుబట్టి సుదర్శనమునకు శాపమిచ్చు యోగ్యత దుర్వాసునకు లేదు. ఐనను మహాచక్ర మంగీకరించి 'ఒక్కసారి నీ శాపమును నే ననుభవింతును పొ'మ్మని యన్నాఁడట. ఆ యవకాశ మును సుదర్శనచక్ర మిచ్చట వాడికొన్నాఁడు. ఈ కథ స్కాంద పురాణములో వచ్చునని యా గ్రంథములో నున్నది.

అర్జునున కూర్వశి శాపమిచ్చినది. తారతమ్యదృష్టితోఁ గవ్వ డికి శాపమిచ్చు యోగ్యత యామెకు లేదు. అందుకే యాతఁడు పని బడినప్పుడు వాడుకొందును లెమ్మన్నాఁడు. పెద్దవారికిఁ జిన్నవారు శాప మిచ్చినప్పుడు వారెందు కంగీకరింపవలెను? ఈ విషయమును వివరించుచు మధ్వాచార్యులవారు కాళీయదర్పహరణకథలోని సంద ర్భము విపులీకరించిరి. సౌభరిమహాముని యా హ్రదతీరమునఁ దప మొనర్చుచుండెను. ఒకనాఁడు గరుడుఁ డాఁకలిగొని యా హ్రదమున

దీనిచే హీనుల కాధిక్యము రాదు. కనుక లక్ష్మీదేవి, బ్రహ్మాముస్నగు వారి కెవరికైన వరములిచ్చినపుడు వారు స్వీకరించినట్లే నటింతురు.

ఈ దృష్టితోఁ జూచినప్పుడు రామాయణములోని గౌతముని శాపమును ఇంద్రుఁడు గ్రహించి 'సురకార్య మిదం కృతం' అన్న సందర్భమును గూడ నిట్లే యర్థ మొనర్చికొనుట యుక్తమనితోఁచును.

ఉ. క్షంతకుఁ గాళియోరగ విశాలఫణావళి నర్తనక్రియా
రంతకు నుల్లసన్మగధ రాజచతుర్విధ ఘోరవాహినీ
హంతకు నింద్రనందన నియంతకు సర్వచరాచరావళీ
మంతకు నిర్జితేంద్రియ సమంచిత భక్తజనానుగంతకున్.

అర్థము లు: క్షంతకున్=దోషములను క్షమించువానికి, కాళియోరగ .... .... రంతకున్=కాళియుఁ డనెడు సర్పముయొక్క విశాలములైన ఫణామండలముపై నర్తించుటయందు ఆసక్తి గలవానికి, ఉల్లసన్మగధ .... .... హంతకుఁ=ప్రకాశించుచున్న మగధరాజైన జరాసంధుని రథ గజ తురగ పదాతులను నాల్గు విధముల సైన్యమును నాశన మొనర్చినవానికి, ఇంద్రనందన నియంతకుఁ=ఇంద్రుని కొడుకు జయంతుని శాసించినవానికి, సర్వచరాచరావళీమంతకుఁ= సమస్త చరాచర సృష్టిని బ్రోచెడివానికి, నిర్జితేంద్రియ ... అనుగంతకుఁ=ఇంద్రియముల జయించిన భక్తుల ననుసరించెడు వానికి,

తాత్పర్యము: భక్తాపరాధములను క్షమించెడువానికి, కాళియ ఫణామండలిపై నర్తించు నభిలాష గలవానికి, జరాసంధ చతుర్విధ వాహినులను నాశ మొనర్చినవానికి, సర్వచరాచర ప్రపంచమును సృష్టించి మనుచువానికి, ఇంద్రియజేతలై తనయందే మనసు నిల్పిన భక్తుల ననుగమించెడు వానికి, శ్రీహరికి సమర్పితముగా నీ గ్రంథము రచించుచున్నాను.

'ఇంద్రనందన నియంతకున్' ఈ విశేషణము రామావతార మునకు సంబంధించినది. సీతారాములు మందాకినీ ప్రాంతము లం దుండిరి. ఒకనాఁడు నానాపుష్పసుగంధములు గలిగిన యుద్యానము లందుఁ దిరిగి సీతాదేవి రామునియొడిలో విశ్రాంతి దీసికొనుచుండెను. పర్యాయముగా సీతాంకమున రాముఁడు నిద్రించు తఱి శాపవశమున వాయసముగా నైన ఇంద్రునికొడుకు జయంతుఁడు మాంసబుద్ధితో సీతాదేవి స్తనాంతరమును ఘోరముగఁ జీల్చెను. రక్తస్పర్శతో మేల్కన్న రాముఁడు వాయసమును జూచినాఁడు. కుపితరాముఁడు కాకముపై బ్రహ్మాస్త్రము నభిమంత్రించి విడిచినాఁడు. ఆ సందర్భమును సీతా దేవి సుందరకాండలో హనుమంతునితోఁ బ్రస్తావించినది.

వీక్షమాణ స్తతస్తం వై వాయసం సముదైక్షత,
నఖైస్సరుధిరై స్తీక్ష్ణైర్మా మేవాభిముఖం స్థితమ్.

పుత్త్రః కిల స శక్రస్య వాయసః పతతాం వరః,
ధరాంతరగత శ్శీఘ్రం పవనస్యగతౌ సమః.

తత స్తస్మిన్ మహాబాహుః కోపసంవ ర్తితేక్షణః,
వాయసే కృతవాన్ క్రూరాం మతిం మతిమతాం వరః.

స దర్భం సంస్తరా ద్గృహ్య బ్రాహ్మేణాస్త్రేణ యోజయత్,
స దీప్త ఇవ కాలాగ్నిః జజ్వాలాభి ముఖోద్విజమ్.

సతం ప్రదీప్తం చిక్షేప దర్భం తం వాయసం ప్రతి,
తతస్తం వాయసం దర్భః సోంబరేఽను జగామహ.

అనుసృష్ట స్తదా కాకో జగామ వివిధాం గతిమ్,
లోకకామ ఇమం లోకం సర్వం వై విచచారహ.

స పిత్రాచ పరిత్యక్తః సురైశ్చ స మహర్షిభిః,
త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః.

(సుందర కాండ. సర్గ, 38, శ్లో. 27-34 వరకు)

ఉ. న్యాయికి భూసురేంద్రమృత నందనదాయికి రుక్మిణీ మన
స్స్థాయికి భూతసమ్మద విధాయికి సాధుజనానురాగ సం
ధాయికిఁ బీతవస్త్రపరిధాయికిఁ బద్మభవాండభాండ ని
ర్మాయికి గోపికానివహ మందిరయాయికి శేషశాయికిన్.

అర్థములు: భూసురేంద్ర .... .... దాయికిన్=బ్రాహ్మణుని యొక్క చనిపోయిన కుమారుని వెనుకకుఁ దెచ్చియిచ్చిన వానికి, రుక్మిణీ మనఃస్థాయికిన్=రుక్మిణీదేవి మనస్సునందు నివసించువానికి, భూతసమ్మదవిధాయికిన్=సమస్త భూతములకును సంతోషముగల్గించు వానికి, సాధుజన .... ... సంధాయికిన్ = సత్పురుషులపైఁ ప్రేమ గలవానికి, పీతవస్త్రపరిధాయికిన్ = పీతాంబరమును ధరించువానికి, పద్మభవాండ భాండనిర్మాయికిన్=బ్రహ్మాండము లనెడు కుండలను చేయువానికి- ఈ విశేషణముతోఁ బరమాత్ముఁడు నిమిత్తకారణమనియు చెప్పుచున్నాఁడు. గోపికానివహమందిర యాయికిన్=గోపికాగృహ ములవిహరించువానికి, శేషశాయికిన్=శేషశయ్యపైఁ బవళించువానికి.

తాత్పర్యము: న్యాయమును బరిపాలించు వానికి, గతించిన భూసుర కుమారుని మరల వెనుకకుఁ దెచ్చియిచ్చిన వానికి, రుక్మిణీ మనస్సున వసియించు వానికి, సమస్త భూతములకును సంతోషము గల్గించువానికి, సాధువులఁ బ్రేమించువానికి, పీతాంబరునకు, బ్రహ్మాండ భాండములను సృష్టించిన వానికి, గోపికాగృహముల సంచరించు వానికి, శేషశాయికి సమర్పితముగా నని యన్వయము.

ఈ షష్ఠ్యంతములలో సామాన్యముగా నన్నియుఁ గృష్ణపర ములే. విపులచక్ర నిరుద్ధ మరీచిమాలికిన్=అనునది భారతకథకు సంబంధించినది. ఇంద్రనందన నియంతకున్-రామాయణకథా ద్యోత కము, శేషశాయికిన్=అనునది వ్యూహావతారమునకు సంబంధించిన విశేషణము.

పోతన్నగారిదృష్టిలో నవతారములకు భేదములేదు. శ్రీమన్నా రాయణమూర్తికిని, విభవావతారములకును భేదములేదు. 'శేషశాయి' శబ్దము వాసుదేవ వ్యూహమునకు సంబంధించినది. వైష్ణవసిద్ధాంత ములో భగవంతున కైదు రూపము లున్నవి. పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారములు. తత్త్వత్రయ సారదీపికలో నీశ్వర ప్రకరణమం దిట్లున్నది-

పరత్వమావదు అకాలకాల్యమాన నలమన్త్రమిల్లదోర్,
నాట్టిలే నిత్యముక్తర్కు భోగ్యనాయ్ కొండు,
యెళుం దరుళిమిరుక్కు మిరుప్పు.

పరత్వ మెట్టిదనఁగా 'న కాలస్తత్ర వై ప్రభుః' 'యత్కాలా దప చేళిమం' ఇత్యాదులవలె కాలమువలనఁ గలుగు పరిణామము లేని దేశమై యుండునది. 'నలమందమిల్లదోర్ నాదు' మితము లేని యానందము గలిగినది. అట్టి శ్రీవైకుంఠమందు అనంత, గరుడ, విష్వ క్సేనాది నిత్యసూరులకును నివృత్తసంసారులగు ముక్తులకును, అను భవ విషయభూతుఁడై వేంచేసియుండు స్థితి.

'వ్యూహమావదు- సృష్టిస్థితి సంహారార్థమాకవుం, సంసారి సంరక్షణార్థమాకవుం ఉపాసకానుగ్రహార్థ మాకవుం, సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ రూపేణ నిర్కుం నిలై.'

వ్యూహములకు వినియోగము లీలావిభూతియందే. ఈ విభూతి యొక్క సృష్టిస్థితి సంహారములను నిర్వహించుట కొఱకును బుభుక్షు వులైన సంసారులకు అనిష్టనివారణము ఇష్టప్రాప్తియనెడు రక్షణము కొఱకును, ముముక్షువులై యుపాసించువారు సంసారమును వదలి వైచి తన్నుఁజేరుట కనువైన యనుగ్రహము చేయుటకును, సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధు లగుచు నిలుచుస్థితి వాసుదేవ రూపమైన పరత్వ ములో జ్ఞానశక్తిబలాదులైన యాఱు గుణములును బరిపూర్ణముగా

నుండును. సంకర్షణాది వ్యూహములందు నొక్కొక్క వ్యూహములో రెండేసి గుణము లుండును. వాసుదేవమూర్తియే శేషశాయి.

విభవావతారము లనఁగా స్వసంకల్పముతో స్వామి రామకృష్ణాద్యవతారములుగాఁ గ్రిందికి వచ్చుట. అంతర్యామి యనఁగా సమస్త భూతములందును అంగుష్ఠమాత్రశరీరుఁడై యధివసించి, వారిని నియమించుచుండెడి మూర్తి. అర్చావతారము లనఁగా శ్రీరంగాది దివ్య క్షేత్రములందు స్వామి సాలగ్రామస్వరూపుఁడై ప్రకాశించుచుండుట. శేషశాయియైన వాసుదేవుఁడు లీలావిభూతి నధిష్ఠించి సృష్టి స్థితి సంహారములను సాగించుచుండును. పురాణవాఙ్మయములోఁ బ్రద్యుమ్న సంకర్షణా నిరుద్ధులే త్రిమూర్తులుగా వ్యవహరింపఁ బడుచున్నారు. ఈ వ్యూహావతారములను నమ్మాళ్వార్ తిరువాయ్మొళిలో నిట్లు సాయించిరి.

'విణ్మీ దిరుప్పాయ్ మలైమేల్ నిరుప్పాయ్, కడల్ శేర్పాయ్ మణ్ మీ దుళల్వాయ్ యివత్తుల్ యెంగుం మఱైందురైవాయ్ యెణ్మీది యెన్న పురవండత్తాయనదాపి ఉణ్ మీవాడి యురుక్కాట్టాదే యొళిప్పాయో!'

విణ్మీదు=పరమ పదమందు, ఇరుప్పాయ్=వేంచేసి యుందువు, మలైమేల్=వేంకటాద్రియందు, నిర్పాయ్=నిలిచి నావు, కడల్=క్షీరాబ్ధిలో, శేర్పాయ్=పవ్వళించి యుందువు, మణ్మీదు=భూలోకమందు, ఉళల్వాయ్=సంచరింతువు, ఇవత్తుల్=ఈ పదార్థములందు, ఎంగుం=అంతటు, మఱైందు=మరగియుండి, ఉరైవాయ్=వసింతువు, ఎణ్=సంఖ్యలను, మీదు=అతిక్రమించి, ఇయన్న=ఉన్న, అసంఖ్యేయములైన యని తాత్పర్యము, పురం=బయటనున్న, అండత్తాయ్=అండములలోనున్న నీవు, యెనదు=నాయొక్క, ఆవి=నా యాత్మకు, ఉళ్ మీదు=లోపలను, బయటను, ఆడి=సంచరించి, ఉరు క్కాట్టాదే=నీ తిరుమేను గన్పింపఁజేయక, ఒళిప్పాయో=దాగుకొంటివా?

స్వామీ! నీవు పరమ పదమందు వేంచేసి యుందువు. శ్రీనివాసా! వేంకటాద్రిపై నర్చావతారుఁడవై నిలిచితివి. క్షీరాబ్ధియందు శేష శాయివై లీలావిభూతులను నడపువ్యూహముల నధిష్ఠించి యున్నావు. భూలోకమందు విభవావతారుఁడవై యున్నావు. అసంఖ్యములైన బ్రహ్మాండములలో నెన్నియో రీతుల నున్నావు. నా యాత్మకు నీవే లోపల బయటయుండి దర్శనమీయక దాగికొన్నావు.

వ. సమర్పితంబుగా నేనాంధ్రంబున రచింపఁబూనిన శ్రీ మహాభాగవత పురాణంబునకుం గథాప్రారంభం బెట్టిదనిన-

తాత్ప. ఆ శ్రీరామునకు సమర్పించి నేను దెనుఁగున రచింపఁ బూనుకొన్న భాగవతమునకుఁ బ్రారంభ మెట్టిదనఁగా-

**పుణ్యంబై మునివల్లభ**
**గణ్యంబై కుసుమఫల నికాయోత్థిత సా**
**ద్గుణ్యమయి నైమిశాఖ్యా**
**రణ్యంబు నుతింపఁదగు నరణ్యంబులలోన్.**

వ. మఱియును, మధువైరి మందిరంబునుం బోలె మాధవీ మన్మథమహితంబై, బ్రహ్మగేహంబునుంబోలె శారదాన్వితంబై, నీలగళ సభానికేతనంబునుంబోలె వహ్నివరుణ సమీరణ చంద్రరుద్ర హైమ వతీ కుబేర వృషభ గాలవ శాండిల్య పాశుపత జటిపటల మండితంబై, బలభేది భవనంబునుం బోలె నైరావతామృతరంభాగణికాభిరామంబై, మురాసుర నిలయంబునుం బోలె నున్మత్తరాక్షస వంశ సంకులంబై, ధనదాగారంబునుం బోలె శంఖ పద్మ కుంద ముకుంద సుందరంబై, రఘురామ యుద్ధంబునుంబోలె నిరంతర శరానల శిఖాబహుళంబై, పరశురామ ఖండనంబునుం బోలె నర్జునోద్భేదంబై, దానవ సంగ్రా మంబునుంబోలె నరిష్టజంభనికుంభ శక్తియుక్తంబై, కౌరవసంగరం బునుంబోలె ద్రోణార్జున కాంచన స్యందన కదంబ సమేతంబై, కర్ణ

కలహంబునుంబోలె మహోన్నత శల్యసహకారంబై, సముద్రసేతు బంధనంబునుంబోలె నలనీలపనసాది ప్రదీపితంబై, భర్గు భంజనంబు నుం బోలె నానాశోకలేఖాఫలితంబై, మరుని కోదండంబునుం బోలెఁ బున్నాగ శిలీముఖభూషితంబై, నరసింహరూపంబునుం బోలెఁ గేసర కరజ కాంతంబై, నాట్యరంగంబునుం బోలె నటునటీసుషిరాన్వితంబై, శైలజా నిటలంబునుం బోలెఁ జందన కర్పూర తిలకాలంకృతంబై, వర్షాగమంబునుంబోలెఁ, నింద్రబాణాసనమేఘ కరక కమనీయంబై, నిగమంబునుం బోలె గాయత్రీవిరాజితంబై, మహాకావ్యంబునుంబోలె సరలమృదులతాకలితంబై, వినతా నిలయంబునుం బోలె సువర్ణరుచి రంబై, యమరావతీ పురంబునుం బోలె సుమనోలలితంబై, కైటభో ద్యోగంబునుం బోలె మధుమానితంబై, పురుషోత్తమ సేవనంబునుం బోలె, నమృతఫలదంబై, ధనంజయ సమీకంబునుం బోలె నభ్రంకష పరాగంబై వైకుంఠపురంబునుం బోలె ఖడ్గపుండరీకవిలసితంబై, నంద ఘోషంబునుంబోలెఁ గృష్ణసారసుందరంబై, లంకానగరంబునుంబోలె రామమహిషీ వంచక సమంచితంబై, సుగ్రీవసైన్యంబునుం బోలె గజ గవయశరభశోభితంబై, నారాయణస్థానంబునుం బోలె నీలకంఠహంస కౌశిక శుక భరద్వాజ తిత్తిరి భాసురంబై, మహాభారతంబునుంబోలె నేకచక్ర బకకంకధార్తరాష్ట్ర శకుని నకుల సంచార సమ్మిళితంబై, సూర్యరథంబునుం బోలె నురుతరప్రవాహంబై, జలదకాల సంధ్యా ముహూర్తంబునుం బోలె బహువితతజాతి సౌమనస్యంబై యొప్పు నైమిశారణ్యంబను శ్రీవిష్ణుక్షేత్రంబునందు శౌనకాది మహామునులు స్వర్లోకగీయమానుం డగు హరిం జేరుకొఱకు సహస్రవర్షంబు లను ష్ఠానకాలంబుగాఁ గల సత్త్రసంజ్ఞికంబైన యాగంబు సేయుచుండిరి. అం దొక్కనాఁడు వారలు రేపకడ నిత్యనైమిత్తికహోమంబు లాచరించి సత్కృతుండై సుఖాసీనుండై యున్న సూతుం జూచి.

ఆ తాపసు లిట్లనిరి వి
నీతున్ విజ్ఞానఫణిత నిఖిలపురాణ
వ్రాతున్ నుతహరిగుణ సం
ఘాతున్ సూతున్ నితాంత కరుణోపేతున్.

సమతం దొల్లి పురాణపంక్తు లితిహాస శ్రేణులున్ ధర్మశా
స్త్రములున్ నీవ యుపన్యసింపుదువు వేదవ్యాసముఖ్యుల్ మునుల్
సుమతుల్ సూచిన యెన్నియన్నియును దోఁచు న్నీమదిం దత్ప్రసా
దమునం జేసి యెఱుంగనేర్తువు సమస్తంబున్ బుధేంద్రోత్తమా!

పుణ్యంబై=పుణ్యమును గల్గించునదియై లేక పుణ్యస్వరూపమై, మునివల్లభ=మునిశ్రేష్ఠులచేత, గణ్యంబై=గణింపఁదగినదై, కుసుమ=కుసుమముల యొక్కయు, ఫల=ఫలముల యొక్కయు, నికాయ=గుంపుచేత, ఉత్థిత=ఉత్పన్నమైన, సాద్గుణ్యమయి=సద్గుణముల యొక్క సంబంధము గలదై, నైమిశాఖ్యారణ్యంబు=నైమిశ మనెడు పేరుగలిగిన యరణ్యము, అరణ్యంబులలోన్=అరణ్యములలో, నుతింపందగున్=పొగడ్తకుఁ దగినది.

తాత్పర్యము: నైమిశారణ్యము గొప్పపుణ్యములు సమకూర్చునది. మునిశ్రేష్ఠులచేతఁ దపస్సున కర్హమైన ప్రదేశముగా గుర్తింపఁబడినది. పూలు పండ్లు, వీని గుంపుచేత నేర్పడిన సద్గుణములు గలది. అనఁగా దపస్సుల కర్హమైన పుష్పములు గలది, వారి యాహారములకుఁ దగిన ఫలములు గలది యని తాత్పర్యము.

'మునివల్లభగణ్యంబై' మూలవ్యాఖ్యానమందు 'బ్రాహ్మణానాం విశేషకం' అను నర్థమును వింగడించుచు వంశీధరుఁడు 'ఈ స్థలము యొక్క మాహాత్మ్యముచేత. గామక్రోధాదులు సులభముగా నశించును. అట్టిది నైమిశ' మని చెప్పెను. నైమిష-నైమిశ-నైవిశ అని ముత్తెఱగులుగా నా పదము వ్యాఖ్యానింపఁ బడినది. మూలమునం

దీ విషయము లన్నియు విపులముగాఁ జర్చించితిమి. ప్రమాణములైన శ్లోకములను గూడఁ జూపితిమి. కాశీఖండమందుఁ గూడ 'నైమిశ'మని పేరు వచ్చుటకు శ్రీనాథుఁడు కారణమును దెల్పెను. ఆ పద్య మీ క్రిందిది—

ఆదిమనోమయం బగునొక చక్రంబుఁ
గల్పించె బ్రహ్మ జగద్ధితముగఁ
గల్పించి యా బండి కలుదొల్చె సత్యలో
కంబున నుండి యా కమలగర్భుఁ;
డది డొల్లగిలి విష్టపాంతరంబులు దాఁటి
క్రమముతో భూమిచక్రమున వ్రాలె;
వ్రాలి రంహస్స్ఫూర్తి వచ్చి వచ్చి ధరిత్రి
నిమ్నోన్నతుల శీర్ణనేమి యయ్యె;
నేమి విరిసిన కతన నన్నేలనెలవు
నైమిశం బయ్యె .... .... ....

(కాశీఖం. ప్రథ. 77)

నేమి విరియుటచే 'నేమిశ' మయ్యెను. నేమియే నైమిశ మని శ్రీధరుఁడు.

**వీరరాఘవ వ్యాఖ్య:**

'నైమిశ'మను పాఠమును గ్రహించెను. అనఁగా సత్పురుషులు నివసించునదని యర్థము. మఱియొక పాఠము నైమిషము. నిమిషు లనెడు మహామును లచ్చటఁ దప మొనర్చిరి. అందుచే నైమిషమైనది. దీనికిఁ గూడ నాధారమును శ్రీధరుఁడే వరాహపురాణము నుండి యిచ్చెను. పుష్పఫల .... .... సాద్గుణ్యంబై నిమిషులు దప మొనర్చి రంటిమి. వారు భుజింప యోగ్యములైన ఫలములుగల వృక్షము లనుట. వారి పూజార్హములైనవి కుసుమములు. ఇఁకపై నమాత్యుఁడు దీర్ఘమైన సమాసముతో నైమిశమును వర్ణించుచున్నాఁడు—

శ్లేషసాహాయ్యముతో నుపమాలంకారము లిందు సాధింపఁబడినవి. మధువైరి మందిరంబునుం బోలె=మధుఁడను రాక్షసుని సంహరించిన శ్రీమహావిష్ణువు యొక్క మందిరమైన వైకుంఠమువలె, మాధవీమన్మథ మహితంబై-మాధవీ=లక్ష్మీదేవి చేతను, మన్మథునిచేతను, మహితంబై =గొప్పదై. శ్రీమహావిష్ణుఁడు మధుఁడను రాక్షసుని సంహరించిన కథ భారతము సభాపర్వమున 38వ యధ్యాయమందు వచ్చును. దాక్షి ణాత్య గ్రంథములలో నీ వృత్తాంతము వచ్చునట్లున్నది. ఈ మధు కైటభు లిర్వురును-

కర్ణస్రోతోద్భవౌ తౌ తు విష్ణోస్తస్య మహాత్మనః,
మహార్ణవే ప్రస్వపతః శైలరాజసమౌ స్థితౌ.

వీరు యోగనిద్ర యందున్న నారాయణుని కర్ణస్రోతముల నుండి జన్మించిరి. వారిని బ్రహ్మచోదితమై వాయు వావేశించెను. వాయుప్రాణులై వారు భయంకరముగా సంచరించుచుండిరి. ఒకఁ డందులో మృదువైన కాయము గలవాఁడు. రెండవవాఁడు కఠిన శరీరుఁడు. మృదుశరీరునకు బ్రహ్మ 'మధు' వని నామకరణ మొన ర్చెను. కఠినశరీరుఁడు కైటభుఁడు. వా రేకార్ణవమైన ప్రపంచమందు విశంకటముగఁ జరించిరి. నారాయణుఁడు వారితో యుద్ధ మొనర్చి వధించెను. ఆ దైత్యుల మేదస్సుచేత సమస్త భూమియు నిండినది. నాటినుండి వసుంధర 'మేదిని' యైనది. ఈ కథావివరమును దెలిసి కొనఁ గోరువారు భారతమునఁ జూడవచ్చును.

'మాధవస్య ఇయం మాధవీ' అని వ్యుత్పత్తిని విజయధ్వజ కారుఁడు చెప్పెను. ఆ సందర్భ మిది-

దుర్గేతి భద్రకాళీతి విజయా వైష్ణవీతి చ
కుముదా చండికా కృష్ణా మాధవీ కన్యకేతి చ,
మాయా నారాయణీశానీ శారదే త్యంబికేతి చ.

(భాగ. 10-3)

మాధవుఁ డనుటతోనే లక్ష్మీభర్తయని యౌగికార్థము. మరల 'మాధవస్య ఇయం' అనుటతో సాధించున దేమి? కనుక నచట మాధవశబ్దమునకుఁ గేవల రూఢ్యర్థమునే గ్రహింపవలెను. మాధవుఁ డనఁగా విష్ణువు. అతనికి సంబంధించినది మాధవి.

సకీచకైర్మారుత పూర్ణరంధ్రైః కూజద్భిరాపాదిత వంశ వృత్తమ్.

అనుచోటు మల్లినాథుఁ డీ పనినే యొనర్చెను. కీచకములే మారుతపూర్ణరంధ్రములు. "వేణవః కీచకాస్తేస్యుః యే స్వనంత్యనిలోద్ధతాః' అని యమరమున నాతఁడే యుట్టంకించెను. మరల మారుత పూర్ణరంధ్రైః యను విశేషణమేమి? కనుక నచ్చటఁ గీచకము లనఁగా కేవలము వెదుళ్ళనియే యర్థము. అట్లే యిచ్చటఁ గూడ సమర్థించి కొనవలెను. అరణ్యపక్షమందు: మాధవీ=పూల గురివిందతీఁగలచేతను, మన్మథ=వెలఁగచెట్లచేతను, మహితంబై=గౌరవింపఁ దగినదై అని యర్థము. బ్రహ్మగేహంబునుం బోలె=బ్రహ్మదేవుని సత్యలోకమువలె, శారదాన్వితంబై=సరస్వతీదేవితోఁ గూడినదై, శారద మనఁగా నరణ్య పక్షమందు యేఱాకు లరఁటిచెట్టు; నీలగళ.... ....మండితంబై=నీల గళుఁ డీశ్వరుఁడు. విషపానముచేత నల్లనికంఠము గలవాఁడు. అతని సభామందిరమువలె, వహ్ని=అగ్నిదేవుఁడు, వరుణ=వరుణుఁడు, చంద్ర, రుద్రులు, హైమవతియనఁగాఁ బార్వతి, కుబేరుఁడు. వృషభ= నందీశ్వరుఁడు, గాలవ=శైవుఁడైన యొకముని, శాండిల్యుఁడు= మఱియొకముని, పాశుపతులు మొదలైన జటిపటల=జడలుధరించిన మునుల సమూహముచేత, మండితము=కూడికొన్నది. అరణ్యపక్ష మందు: వహ్ని=చిత్రమూలము, వరుణ=ఉలిమిరిచెట్టు, సమీరణ= మరువకము, చంద్ర=కంపిల్లము, హైమవతి=కరక, కుబేర=నంది వృక్షము, గాలవ=లొద్దుగు, శాండిల్య=మారేడు, పాశుపతవృక్షము, మారేడు, జటి=జువ్విచెట్టు- ఈ వృక్షములతోఁ గూడికొన్నది. బల భేది భవనంబునుం బోలె=బలుఁడను రాక్షసుని సంహరించిన వాఁ

డింద్రుఁడు. బలునికథ భారతమందేవచ్చును. కశ్యపునకు ధనాయు వనెడు స్త్రీమూలమున నల్గురుపుత్రులు గల్గిరి. బలుఁడు, విక్షరుఁడు వీరుఁడు, వృత్రుఁడు.

ధనాయుషః పునః పుత్రాః చత్వారోఽసుర పుంగవాః,
విక్షరో బలవీరౌ చ వృత్రశ్చైవ మహాసురః.

బలదైత్యుని దేవేంద్రుఁడు సంహరించెను. ఈ వృత్తాంతము వనపర్వములో నున్నది.

రథేనానేన మఘవా, జితవాన్ శంబరం యుధి,
నముచిం బలవృత్రౌ చ, ప్రహ్లాద నరకావపి.

(వనపర్వము. 138 అధ్యా. 81 వ శ్లో.)

బలభేది భవనంబునుం బోలె=బలాసుర సంహర్తయైన యింద్రుని భవనమువలె. ఐరావతముచేతను అమృతముచేతను రంభయను గణికచేతను, అభిరామము=అందమైనది, అరణ్యపక్షము: ఐరావత= నారింజ, అమృత=ఉసిరిక, రంభా=అరఁటి, గణికా=అడవిమొల్ల- వీనిచేత మనోహరమైనది. మురాసురభవనంబునుం బోలె=మురుఁడను రాక్షసుని యొక్క గృహమువలె. మురుఁడొక యసురుఁడు. వీఁడు ప్రాగ్జ్యోతిషపురాధీశ్వరుఁడైన నరకాసురుని రాజ్యసీమలను రక్షించు నల్వురిలో నొకఁడు. వీనికిఁ బుత్రులు నేవురు. వారిలోఁబదిమంది నరకుని యంతఃపురరక్షకులు. మురుఁడు దప స్సొనర్చి గొప్పవరము లందెను. వీఁడు భౌమాసురుని రాజ్యసీమలందు అరువేల పాశముల నేర్పాటు చేసియుండెను. వానికి మౌరవపాశము లనిపేరు. ఈ పాశముల కొనలయందుఁ గత్తులు. కృష్ణుఁ డీ పాశములను జక్రముతో ఛేదించి మురుని సంహరించెను.

(భార. సభా. దాక్షిణాత్యప్రతి. 39 అధ్యా.)

ఉన్మత్త=మదించిన, రాక్షసవంశ=రాక్షసులకులములచే నిండినది. అరణ్యపక్షము: రాక్షస=నల్లకచ్చూరము, వంశ=వెదుళ్లు-వీనిచే నిండినది. ధనదాగారంబునుంబోలె=కుబేరభవనమువలె, శంఖ కుంద ముకుంద సుందరంబై-ఇవియన్నియుఁ గుబేరుని నిధులు.

> మహాపద్మశ్చ పద్మశ్చ శంఖో మకర కచ్ఛపౌ,
> ముకుంద కుంద నీలాశ్చ ఖర్వశ్చ నిధయో నవ.

(అమరము)

అరణ్యపక్షమందు: శంఖ=నఖమను గంధద్రవ్యమునకుఁ బనికి వచ్చు రస మొసఁగెడు చెట్టు, పద్మ=పద్మము, కుంద మొల్లలు, ముకుంద=కుందురుష్కమనెడు గంధద్రవ్య మొసఁగెడు చెట్టు-వీనిచే సుందరము; రఘురామయుద్ధం......బహుళంబై=రామునియుద్ధము వలె నెల్లప్పుడును బాణముల నుండి బయలుదేరిన యగ్ని జ్వాలల చేతనిండినది. అరణ్యపక్షము: శర=రెల్లుగడ్డి నంటుకొన్న అనలశిఖల చేత బహుళము. పరశురామ......అర్జునోద్భేదంబై=పరశురాముని యుద్ధమువలెఁ గార్తవీర్యుని భేదించినది. అర్జునమనఁగా శమీవృక్షము. అర్జునోద్భేదము శమీవృక్షములు పరస్పరము రాచికొన్నచో నగ్ని పుట్టును. శమీవృక్షములందు గూఢముగా నగ్నియుండుట ప్రసిద్ధమే. 'అగ్నిగర్భాం శమీ మివ' అని ప్రయోగము. దానవ .... ....శక్తియుక్తంబై=దానవ యుద్ధరంగమువలె నరిష్టుఁడు జంభుఁడు, నికుంభుడు మొదలగు రాక్షసులశక్తిచేఁ గూడినది. అరణ్యపక్షము: అరిష్టము =కుంకుడు, జంభ=నిమ్మ, నికుంభ=అత్తియాకులవంటి యాకులుగల యొకచెట్టు-వీనిచే కూడినది. కౌరవ .... .... సమేతంబై = కౌరవ యుద్ధమువలె, ద్రోణార్జునాదులయొక్క బంగారు రథ సమూహము లతోఁ గూడినది. ద్రోణ=తేళ్లు, అర్జున=కనవు, కాంచన=సంపంగి, స్యందన=నెమ్మిచెట్టు, వీని కఱ్ఱలతో రథములు చేయుదురఁట. కదంబ మనఁగా గుంపు. కర్ణకలహంబు .... సహకారంబై, కర్ణుని యుద్ధము

వలె గొప్పదైన శల్యుని సాయమునఁ గూడికొన్నది. శల్యములనఁగా మంగచెట్లు, సహకారములు, మామిడిచెట్లు. సముద్ర ... ప్రదీప్తంబై = సముద్రమందు రాముఁడు గట్టించిన సేతుబంధమువలె. నలుఁడు, నీలుఁడు, పనసుఁడు మున్నగువారిచేఁ గొనిరాఁబడిన కొండలుగలది. అరణ్యపక్షము. నల=వట్టివేఱు.

'నలనామధేయ తృణంబైన వినపడ్డ' అని నైషధములో శ్రీనాథుఁడు. నీలి = నీలిచెట్టు, పనస = పనసచెట్టు, మున్నగు చెట్లచేతను, గొండలచేతను ప్రకాశించునది అని యర్థము. భర్గు........కలితంబై = శివుని భజనమువలె శోకములేని యనేకులైన దేవతలచేత సార్థకమైనది. అరణ్యపరము: అశోక లేఖ=అశోకవృక్షముల వరుసలు వీనితో నిండినది. నరసింహ ...., .... కాంతంబై = నృసింహుని రూపమువలె కేసరములచేత, వాడియైన గోళ్ళచేతను అందమైనది, అరణ్యపరము: కరజ=కానుగ, కేసర= సురపొన్న-వీనిచేత నందమైనది, నాట్యరం .... .... అలంకృతంబై= నాట్యరంగమువలె నటులు, నటీమణులు, పిల్లనగ్రోవులు వీనితోఁ గూడినది, అరణ్యపరము: నట = దుండిగపుచెట్లు, నటి= నళి యను గంధద్రవ్యము, సుషిర = గువ్వగుత్తికలు, శైలజా .... .... అలంకృతంబై = పార్వతీదేవి నిటలమువలెఁ జందన కర్పూర తిలకములచే నలంకరింపఁ బడినది. అరణ్యపరము : చందనము కర్పూరము తిలకవృక్షములు వీనిచేఁ గూడినది. వర్షాగమం .... .... కమనీయంబై = వానకాలమువలె, నింద్రబాణాసన అనఁగా నింద్రధనుస్సు. 'బాణాః అస్యంతే అస్మిన్నితి'- బాణాసనం= బాణములు దీనియం దుంపఁబడుచున్నవి కనుక బాణాసనము. మేఘ= మబ్బు, కరక=వడగండ్లు. అరణ్యపరము: ఇంద్ర=మద్దిచెట్లు, బాణ= నల్లగోరింట, అసన= వేగిచెట్లు, మేఘ = తుంగముస్తెలు, కరక = కరకచెట్లు-వీనితోఁ గూడినది.

నిగమం....విరాజితంబై=వేదమువలె గాయత్రీమంత్రముతోఁ గూడినది గాయత్రి యనఁగా చంద్రచెట్టు, మహాకావ్యం....కలితంబై =మహాకావ్యమువలె సరళమైమార్దవముతోఁ గూడినది. అరణ్యపరము: సరళములై మృదువులైన లతలతోఁ గూడినది, వినత .... సుపర్ణరుచి రంబై=వినతయింటివలె గరుత్మంతునితోఁ గూడినది. అరణ్యపరము: గరుత్మత్పక్షులు. అమరావతీ........ లలితంబై=స్వర్గమునకు ముఖ్య పట్టణ మమరావతి. సుమనస్సు లనఁగా దేవతలు, అరణ్యపరము: సుమనోలలితంబై=పుష్పములచే లలితమై, కైటభోద్యోగం .... .... మానితంబై=కైటభరాక్షసుని ప్రయత్నమువలె, మధురాక్షసునిచే గౌర వింపఁబడినది. అరణ్యపరము: మధుమానితంబై=తేనెలచేత గౌరవిం పఁబడినది. పురుషోత్తమ.... .... ఫలదంబై=శ్రీ మహావిష్ణువుయొక్క సేవవలె, నమృతమోక్షఫల మొసఁగునదై. పురుషోత్తమ శబ్దము శ్రీ మహావిష్ణువునందే రూఢము. 'బ్రహ్మశబ్దేనచ స్వభావతో నిరస్త నిఖిల దోషో-అవధికాతిశయా సంఖ్యేయ కల్యాణ గుణగణః పురుషోత్తమో ఽభిధీయతే'అని శ్రీభాష్యము. అమృతఫలము లనఁగా నుసిరికలు.

ధనంజయ........పరాగంబై, ధనంజయ=అర్జునునియొక్క, సమీకంబునుం బోలె=యుద్ధమువలె, అభ్రంకష పరాగంబై=ఆకాశ మంటెడు ధూళిగలదై, అరణ్యపరము: ఆకాశమునంటుటయం దానక్తి గల, అంతవరకును బెరిగిన అని యర్థము. అగంబై=వృక్షములుగలదై, వైకుంఠ .... .... విలసితంబై, హరి=హరియొక్క, ఖడ్గ=ఖడ్గమైన నందకముచేతను, పుండరీక=పుండరీకుఁ డను పార్షదునిచేతను, విల సితంబై=ప్రకాశించునదై, హరికి బార్శ్వచరులలోఁ బుండరీకుఁ డను నొకఁడు.

పుండరీకుండు శంఖకర్ణుండు వామ
నుండు కుముదాక్షుఁడును విజయుండు జయుఁడు
సర్పనేత్రుండు నను పార్శ్వచరులలోన
హరికిఁ గుముదుండు మానసీయుండు,.... (పాండురం. 3 అ. 112 ప.)

అరణ్యపరము : హరి = సింహములు, ఖడ్గ = ఖడ్గమృగములు, పుండరీక = పెద్దపులులు, వీనిచే విలసితంబై = ప్రకాశించునదై, నంద ఘోష .... .... సుందరంబై, నంద = నందునియొక్క, ఘోషంబునుం బోలెన్ = గొల్లపల్లెవలె, 'ఘోష అభీరపల్లీస్యాత్' అమరము. కృష్ణ సార = కృష్ణుఁ డనెడు సారముచేత, అనఁగా కృష్ణతత్త్వముచేత నని తాత్పర్యము. సుందరంబై = సుందరమైనదై, అరణ్యపరము: కృష్ణసార = నల్లనియిఱ్ఱులచేత సుందరంబై, లంకానగ ........ సమేతంబై = లంకా నగరమువలె, రామమహిషీ = రాముని భార్యయైన సీతాదేవియొక్క, వంచకసమేతంబై = వంచించు రాక్షసులచేఁ గూడినదై. అరణ్యపరము: రామ = పెద్దదుప్పి, 'గంధర్వశ్శరభో రామః' అమరము. 'వ్యాధాః అస్మిన్ దృష్టే రమంతే ఇతి రామః!' రము క్రీడాయాం అని ధాతువు. బోయలు దీనిని జూచి సంతోషింతురు. మహిషీ = అడ అడవిదున్న, వంచక = నక్కలు, వీనిచేత సమేతంబై = కూడినదై, సుగ్రీవ .... శోభి తంబై = సుగ్రీవుని సైన్యమువలె గజుఁడు, గవయుఁడు, శరభుఁడు అనెడు వానరులచేఁ బ్రకాశించునదై, అరణ్యపరము: గజ = ఏనుఁగు, గవయ-'గాం అయతే సదృశత్వాదితి గవయః అయ గతౌ' గోవును బోలునది దున్నపోతు, శరభ = శరభమృగము 'సృణాతి సింహమితి శరభః శృ హింసాయాం' సింహమును జంపునది; దీని కెనిమిదికాళ్లు 'అష్టపా దూర్ధ్వనయన శ్శరభో వనగోచరః' మహాభారతము. నారా యణ .... .... భాసురంబై, నారాయణ స్థానంబునుం బోలె = నారా యణుని స్థానమైన వైకుంఠమువలె, నీలకంఠ = శివుఁడు, హంస = సూర్యుఁడు లేక విష్ణువు.

> నిర్లోభ నృపతౌ విష్ణౌ అంతరాత్మన్య మత్సరే,
> యతిభేదే చ హంసస్స్యాత్ శ్రేష్ఠే రాజాది పూర్వకమ్.

రాజాదిపూర్వకమైన హంసశబ్దమునకుఁ బై జెప్పినన్ని యర్థము లున్నవి. నిరుపపదముగఁ గూడ నన్వయించికొన వచ్చును. లేక సూర్యుడను నర్థముతోనైన తృప్తిపడవచ్చును. కౌశిక = ఇంద్రునితోను,

'మహేంద్రగ్రుగ్గులూ లూకవ్యాళ గ్రాహిషు కౌశికః' అమరము. భారద్వాజ=భరద్వాజుని అపత్యము లేక గోత్రాపత్యము. ఒకానొక ఋషి యని మేదిని. అగస్త్యముని యని శబ్దరత్నావళి. బృహస్పతి పుత్రుఁడని హేమచంద్రుఁడు (శబ్దకల్పద్రుమము) తిత్తిరి=మునివిశేష మని విశ్వకోశము. 'తిత్తిరి ర్యాజ్ఞవల్క్యశ్చ ససుతో రోమహర్షణః (మహాభార. 2. 4. 12) వీరందఱును విష్ణుభక్తులుగా వైకుంఠమం దుందురని పిండితార్థము.

అరణ్యపరము: నీలకంఠ=నెమళ్లు, హంస=హంసలు, భారద్వాజ=భరద్వాజపక్షులు, తిత్తిరి=తీతువు, 'తిత్తీతి రౌతీతి తిత్తిరిః' తిత్తి యని పలుకును. మహాభారతంబును బోలె.... ....సమ్మిళితంబై, ఏకచక్ర=ఏకచక్ర పట్టణము, బక=బకాసురుఁడు, కంక=కంకభట్టను నామముగల ధర్మరాజు, ధార్తరాష్ట్ర=ధృతరాష్ట్రుని కుమారులైన దుర్యోధనాదులు, శకుని=దుర్యోధనునిమామ, శల్య=ధర్మరాజుమామ, నకులుడు. వీరియొక్క సంచార=సంచారముచేత, సమ్మిళితము= కూడినది.

అరణ్యపక్షము: చక్రములనఁగా చక్రవాకములు, ఏకచక్రపుజంట విడిపోయి యొంటిగా సంచరించెడి చక్రవాకములు. చక్రవాకములకు రాత్రి విరహము. శ్రీరామచంద్రుని శాపముతో సంభవించినదని యాముక్తమాల్యద. ఈ యర్థ మంత సమంజసముగా నగుపించుట లేదు. ఏకలము అనఁగా వనవరాహము. ఏకచరమనఁగా నయ్యదియే ఒంటిగా సంచరించునది. కనుక ఏకమనఁగా వరాహమని చెప్పికొన వచ్చును. ఇదియుఁ గ్లిష్టమే. బక=కొంగలు, కంక=రాపుల్లుఁగు, ధార్తరాష్ట్ర='ధార్తరాష్ట్రాస్సితేతరైః' అని అమరము. నల్లనిముక్కులతో కాళ్లతోఁగూడిన తెల్లనిహంసలు, శకుని=ఇతరపక్షులు, నకుల=ముంగిస వీని సంచారముచేతఁ గూడినదై, సూర్యరథంబునుం బోలె నురుతర ప్రవాహంబై=సూర్యుని రథమువలె నురుతరమైన ప్రవాహము గలది.

ఉరుతర ప్రవాహములనఁగా గుఱ్ఱములు. వానితోఁగూడినది సూర్యుని రథము. జలదకాల .... .... సౌమనస్యంబై = జలదకాలసంధ్యా ముహూర్తమును బోలె=వర్షాకాలపు సాయంకాలమునువలె, బహు వితత=అనేకముగా నల్లుకొన్న, జాతి=జాజిపువ్వులు, సౌమనస్యంబై= అందముగలదై; జాతిపుష్పములు తెల్లనివి. పుష్పాణాంప్రకరస్స్యాత్తేన రచితో నోకుందజాత్యాదిభిః' అని యమరుకము. ఇవి వర్షాకాలమం దెక్కువగాఁ బూచును.

నిలీయమానై ర్విహగై ర్నిమీలద్భిశ్చ పంకజైః,
వికసంత్యా చ మాలత్యా గతోఽస్తం జ్ఞాయతే రవిః.

(రామా. కిష్కిం. 28-52)

నైమిశంబను శ్రీవిష్ణుక్షేత్రంబునందు 'అనిమిష క్షేత్రే' అనుదానికిఁ దెనుఁగు. స్వర్లోకగీయమానుండగు హరిం జేరుకొఱకు స్వర్గాయ లోకాయ అను మూలమునకు శ్రీధరుని వ్యాఖ్యాన మిట్లే యున్నది. అమాత్యుల రచన యీ వ్యాఖ్యానమునకు నేరుగాఁ దెనిగింపు. సహస్రవర్షంబులు సహస్రసమం అని మూలము. వేయివర్షము లన్న మాట. దీని విచారము మూలములో వంశీధరుని వ్యాఖ్యానమందు వివరించితిని. యాగంబు సేయుచుండి 'ఆసత' అని మూలము. ఇక్కడ ధాత్వర్థమవివక్షితమని ముందే వివరించితిని. రేపకడ=ప్రాతః కాలమందు నిత్యనైమిత్తిక హోమంబులు 'హుతహుతాగ్నయః' అను దానికిఁ దెనుఁగు. సత్కృతుండై = గౌరవింపఁ బడినవాఁడై, సత్కృతం అనునది మూలము.

సుఖాసీనుండైయున్న సూతుంజూచి=సుఖకరమైన యాసనమందుఁ గూర్చున్న సూతునిఁజూచి, ఆసీనం అనుటకుఁ దెనుఁగు.

పద్య: విజ్ఞాన = శుద్ధవిజ్ఞానముచేత, ఫణిత = వివరింపఁబడిన నిఖిల పురాణవ్రాతున్=సమస్త పురాణ సమూహములు గలిగినట్టియు,

నుతహరిగుణ సంఘాతున్_పొగడఁబడిన హరిగుణములు గలిగినట్టియు, నితాంత=ఎక్కువైన, కరుణోపేతున్_కరుణా + ఉపేతున్_దయచేతఁ గూడినట్టియు, వినీతున్_వినయము గలిగినట్టి, సూతున్_సూతుని గూర్చి, ఆ తాపసు లిట్లనిరి_ఆ మునులిట్లు ప్రశ్నించిరి. ఇది పోతన్న సొంత పద్యము. సూతున్ ఆ తాపసు లిట్లనిరి, అత్యంత సంయోగ మందు ద్వితీయ.

తాత్పర్యము: సూతుఁడు వినీతుఁడు. శుద్ధజ్ఞానముతో వ్యాఖ్యానింపఁబడిన సమస్తపురాణములు గలవాఁడు. నిరంతరమును హరిగుణ గణములను బొగడువాఁడు. ఎక్కువదయచేఁ గూడినవాఁడు. అట్టి వానిని గూర్చి మును లిట్లు ప్రశ్నించిరి.

తొల్లి_ముందు, పురాణపంక్తులు_పురాణములును, ఇతిహాస శ్రేణులున్_భారతాదులైన ఇతిహాసములగుంపును, ధర్మశాస్త్రములున్_ధర్మశాస్త్రములును, సమతన్_ఆ పాతగోచరములైన విరోధములను బరిహరించి, నీవ_నీవే, ఉపన్యసింపుదువు_వ్యాఖ్యానించితివి. వేద వ్యాసముఖ్యుల్_వ్యాసభగవానుఁడు మొదలైన, సుమతుల్ మునుల్=మంగళకరమైన బుద్ధిగలిగిన మహర్షులు, సూచిన వెన్ని_ఆలోచించి యనుభవించిన వెన్నియర్థములో అన్నియును, ఆ సమస్తార్థములును, నీ మదిం దోఁచున్_నీ బుద్ధియందు భాసించును. తత్ప్రసాదమునం జేసి_వారియొక్క యనుగ్రహమువలన సమస్తంబున్_అంతయును, ఎఱుంగ నేర్తువు_తెలియఁ గలవు, బుధేంద్రోత్తమా=బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడైన వాఁడా.

తాత్పర్యము: సూతా! నీవు పురాణపంక్తులు భారతాదులు ధర్మశాస్త్రములు, వీనిలోఁబైపైనగోచరించు విరోధములను బరిహరించి అన్నిటికిని సమానముగ వ్యాఖ్యానముచేయఁగల నేర్పరివి. వేదవ్యాసుఁడు మున్నగు పరావరులైన మునులు భావించి యనుభవించిన

సమస్తములైన యర్థములును నీ మదియందు భాసించును. వారికి నీ యందుఁగల యనుగ్రహ మట్టిది. నీకుఁ దెలియని విషయము లేదు. నీవు బుద్ధిమంతులలో శ్రేష్ఠుడవు

తత్ర తత్రాంజసా యుష్మన్! భవతా యద్వినిశ్చితమ్,
పుంసా మే కాంతత శ్శ్రేయ స్తన్న శ్శంసితు మర్హసి. 9

ప్రాయేణాల్పాయుష స్సభ్య! కలావస్మిన్ యుగేజనాః,
మందా స్సుమందమతయో మందభాగ్యా హ్యుపద్రుతాః 10

భూరీణి భూరికర్మాణి శ్రోతవ్యాని విభాగశః,
అతస్సాధో! ఽత్ర యత్సారం సముద్ధృత్య మనీషయా 11

బ్రూహి న శ్శ్రద్ధధానానాం యే నాత్మా సంప్రసీదతి,
సూత! జానాసి భద్రంతే! భగవాన్ సాత్వతాంపతిః. 12

దేవక్యాం వసుదేవస్య జాతో యస్య చికీర్షయా,

ఆయుష్మన్! దీర్ఘాయుష్మంతుఁడవైన సూతా! తత్రతత్ర—అచ్చటచ్చట, పుంసాం—పురుషులకు, ఏకాంతతః—నాశములేనట్టి, శ్రేయః—శ్రేయస్సాధనము, భవతా—నీచేత, వినిశ్చితం—నిశ్చయింపఁ బడినది, యత్—ఏది కలదో, (తత్—దానిని) నః—మాకు, అంజసా—పరమార్థముగా, శంసితుం—చెప్పుటకు, అర్హసి—తగినవాఁడవు.

ఆయుష్మంతుఁడవైన సూతా! ఆ యా గ్రంథములందు మనుష్యుల నాశరహితమైన శ్రేయస్సాధనమునకుఁ బర్యాప్తమైన యనుష్ఠానమేది? యని నీవు నిశ్చయించుకొన్నావో దానిని మాకుఁ దెలుపుము. 9

సభ్య—సభయందు యోగ్యుఁడవైనవాఁడా! అస్మిన్ కలౌ యుగే — ఈ కలియుగమందు, జనాః—జనులు, ప్రాయేణ— సామాన్యముగా, అల్పాయుషః—అల్పమైన అయుస్సుగలవారు, మందాః—నిరుత్సాహులు, సుమందమతయః—చాల

తక్కువైన బుద్ధిశక్తిగలవారు, మందభాగ్యాః=భాగ్యహీనులు, ఉపద్రుతాః హి=రోగాద్యుపద్రవములచేఁ బీడితులు, భూరికర్మాణి=అనేకములైన కర్మలతోఁ గూడినవియు, విభాగశః=వేర్వేఱుగా, శ్రోతవ్యాని=వినుట కర్హములైన (శాస్త్రములు) భూరీణి=అనేకములు.

ఓ సభ్యుఁడవైన సూతుఁడా! ఈ కలియుగమందు జనులు సామాన్యముగా నల్పమైన యాయుస్సు గలవారు. నిరుత్సాహులు, బుద్ధిలేనివారు, భాగ్యహీనులు, రోగాద్యుపద్రవపీడితులు. ఇఁక శాస్త్రములా? అనేకములు. అనుష్ఠానయోగ్యములైన యనేక కర్మల నవి చెప్పును. వానిని వేరువేరుగా వినవలెను. 10

అతః=అందుచేత, సాధో!=యోగ్యుడైనవాఁడా! అత్ర=దీనిలో, యత్ సారం=సారమైన దేదిగలదో దానిని, మనీషయా=బుద్ధిశక్తిచేత, సముద్ధృత్య=నీవే వేరుగానెత్తి, శ్రద్దధానానాం=వినుటయందు మహాశ్రద్ధ గలిగినట్టి, నః=మాకు, బ్రూహి=చెప్పుము, యేన=ఏ సారభూతమగు విషయమును నీనుండి వినుటచేత, ఆత్మా=బుద్ధి, సంప్రసీదతి=ప్రసన్న మగునో.

ఓ సాధువైన సూతుఁడా! సామాన్యులు బహుశాస్త్రములను వినలేరు. వానియందుఁ జెప్పఁబడిన కర్మ లనుష్ఠింపలేరు. గ్రహింపను గూడ లేరు. దానికిఁ దగిన యాయుస్సు, ఉత్సాహము, బుద్ధిశక్తి మొదలైనవి లేవు. నీవా! పరానుగ్రహపరుఁడవు. అపౌరుషేయము లన్నియు నీ వెఱుఁగుదువు. వాని సారమునెత్తి మాకుఁ జెప్పుము. మే మా విషయమును గ్రహించుటయందు శ్రద్ధధానులము. దానిని వినుటతో మా మనస్సులు పరమ శాంతిని బొందును. 11

సూత!=ఓ సూతుఁడా!, జానాసి=అ సారభూతమైన రహస్యమును నీ వెఱుఁగుదువు, తే=నీకు, భద్రం=మంగళ మగుఁ గాక!, సాత్వతాం=భక్తులకు, పతిః=పాలకుఁడైన, భగవాన్=శ్రీమన్నారాయణుఁడు, యస్య=ఏ పనియొక్క, చికీర్షయా=నిర్వహించు నిచ్ఛచేత, వసుదేవస్య=వసుదేవుని భార్యయైన, దేవక్యాం=దేవకియందు, జాతః=జన్మించెనో.

**శ్రీధరవ్యాఖ్య :**

అంజసా=గ్రంథార్ణవముతో నని యర్థము. ఏకాంతతః శ్రేయః =అవ్యభిచారియైన శ్రేయస్సాధనము నన్నడుగు టెందులకు? మీరే బహుశాస్త్ర శ్రవణాదులతో నిర్ణయించికొన వచ్చునుగదా! దానికి సమాధాన మిచ్చుచున్నాఁడు-

కలియుగమందు జనులు మందులు. అందునను నలసులు. అందునను సుమందమతులు. చాలని దానికి మందభాగ్యులు- విఘ్నములచే బాధితులని యర్థము. ఉపద్రుతులు=రోగపీడితులు. బహుశాస్త్రశ్రవణముచేనైనను ఫలసిద్ధి యేర్పడదని చెప్పుచున్నారు. భూరి కర్మాణి భూరీణి='భూరీణి కర్మాణి అనుష్ఠేయాని యేషు తాని' అనఁగా నా శాస్త్రములందుఁ జెప్పఁబడిన కర్మల ననుష్ఠించిననే ఫలము. భాగవతము శ్రవణమాత్రముననే ఫల మిచ్చును.

'సూత! జానాసి' అను నైదు శ్లోకములతోఁ బ్రశ్నాంతరము. 'భద్రంతే!' ఔత్సుక్యముతో నాశీర్వాదము. భగవాన్=నిరతిశయైశ్వర్యాది గుణయుక్తుఁడైనవాఁడు, సాత్వతాం సత్ =అనఁగా సత్త్వమూర్తియైన భగవంతుఁడు. వా డెవ్వరి కుపాస్యుఁడో వారు సాత్వతులు, భక్తులు.

**వంశీధరవ్యాఖ్య :**

ఆయుష్మన్! ఓయి సూతా! నీ యాయుస్సు గొప్పది. అందుచే దీరికగా శాస్త్రముల నన్నిటిని విచారించి శ్రేయస్సాధనమును నిర్ణయించి కొంటివి. మేము బ్రాహ్మణులము. నీ కిచ్చుటకు మా కడ నేమి యున్నది? కేవల మొక్క యాశీర్వాదమే నని యును ధ్వని. అంజసా=శీఘ్రముగా, నీ వివరణమునందు వాక్యక్లిష్టతలులేక సులభముగా నర్థమగునట్లు వివరింపుము. ఏకాంతతః-సర్వథా; లేక ప్రథమా విభక్తిపైని 'తసి' ప్రత్యయము. ఏకం-అద్వితీయమైనది.

అంతతః = తారతమ్య పరిగణనలోఁ బరాకాష్ఠకుఁ జెందినది. అనఁగా దానికన్న నుత్తమమైన శ్రేయస్సాధనము మఱియొకటి లేదనుట. అట్టి శ్రేయ మేది? భగవత్ప్రేమయే; బ్రహ్మ = పరమాత్మ- భగవంతుఁడు వీనిలో ముఖ్యమైన భగవత్స్వరూపమును గూడ నా ప్రేమయే వశీకరించికొనును. 'తత్ర తత్ర అంజసా' అనునది మొదలుకొని 'అత స్సాధో!' అనునంత వఱకును సర్వశాస్త్రసారోద్ధారరూపమైన ప్రశ్న; ఈ ప్రశ్న మొదటిది దీని కుత్తరము 'స వై పుంసాం' మొదలుకొని 'వాసుదేవే భగవతి' అనునంతవఱకు 'నా నుండి సర్వశాస్త్రములను విని మీరే శ్రేయస్సాధనమును నిర్ణయించికొనరాదా?' దాని కుత్తరముగా 'హే సభ్య!' అని యారంభించుచున్నారు. సభ్య! = దేశ కాల పాత్రముల నెఱిఁగినవాఁడా! ఈ కలియుగము ప్రమాదాకుల మైనది. సాధారణముగా జను లల్పాయుష్కులు. ఒకవేళ నెవ్వఁడైన దీర్ఘాయుష్కుఁ డుండినను వాఁడు మందుఁడు. అనఁగాఁ బరమార్థ సాధనమం దలసుఁడు. నిరలసుఁడైనను నిర్బుద్ధి, సుబుద్ధియైనను మందభాగ్యుఁడు. అనఁగా నీవంటి సాధువుల సంపర్కము లేనివాఁడు. ఒకవేళ నట్టి సంపర్కము లభించినను రోగాద్యుపద్రవములు. దీనితో సత్పురుషులనుండి ఏదైన వినుటకుఁగాని స్వశ్రేయమును నిర్ణయించి యనుష్ఠించుటకుఁ గాని సాధ్యము గాదు. సాధో! పరోపకార పరాయణుఁడైనవాఁడా! సూత జానాసి మొదలుకొని యశః కలిమలాపహం అనువఱకును రెండవప్రశ్న. (అధ్యా 1-16 శ్లో)

'సూతా! నా కన్నను మీరు మహానుభావులు. ఐనను నన్ను నుగ్రహించి యడుగుచున్నారు అని నిశ్చయించి మా ప్రశ్నకుఁ గాలక్షేపము సేయక తొందఱగా నుత్తర మిమ్ము.'

భగవంతుని వనేకావతారములు. ఐనను ప్రారంభమందే శౌనకాదులకుఁ గృష్ణావతారైక తాత్పర్యము, ముందు వారు 'ఏకాంత శ్రేయ' మేదియో యడిగిరి. సర్వశాస్త్రసారమును జెప్పవలెనన్నారు.

అది యాత్మప్రసాదహేతువై యుండవలెననియు నొక కోర్కి. కాని ఈ ప్రశ్నలకు వారే ముందుగనే తమ మనస్సులలో నుత్తరము నిశ్చయించికొన్నారు. అదేమి? కృష్ణలీలావర్ణనము; ఆ నిశ్చయముతో 'భద్రంతే' అని యారంభించుచున్నారు. కృష్ణలీలా ప్రశ్నమందుఁ గల మహాదరముతోఁ జేసిన యాశీర్వాదము; సాత్వతు లనఁగా యాదవులు. యాదవులకుఁ బరిపాలకుఁడనియు నర్థము. జాతః= జగత్తునందు దృశ్యమానుఁడయ్యెనో! యస్య చికీర్షయా-ఏ కార్యము నిచ్ఛించినవాఁడై. ఆయనకు భూ భారహరణ మొక లెక్కలోనిది గాదు. స్వయశఃఖ్యాపనమే ప్రధాన కారణము; అందుకే కుంతీదేవి తన స్తుతిలో 'శ్రవణ స్మరణార్హాణి కరిష్యన' అని చెప్పఁబోవుచున్నది. వసుదేవః='వసునా గోధనేన దీవ్యత ఇతి వసుదేవః'- గో ధనముతో ప్రకాశించువాఁడు.

వీరరాఘవవ్యాఖ్య :

శ్రేయస్సాధనమైన పరమధర్మముఁ జెప్పుమనుటయే పిండితార్థము త్రివర్గసాధనము-శ్రవణయోగ్యమైనదే గాదు. వానియందాసక్తులు దౌర్భాగ్యులు. వారు వినఁదగిన వనేకములు. మా కా గొడవ వలదు. సర్వశాస్త్రార్థసారభూతమైన ముక్తిసాధనమును జెప్పుమని యడుగుచున్నారు. అల్పాయుషః-కృతాదియుగములందు మానవులు దీర్ఘాయుష్కులు. అందుచే వారు యథేష్టముగా భోగముల ననుభవించి, తర్వాత ముముక్షువులైనను బాధలేకుండెడిది కలియుగమందట్లు గాదని భావము. ఉపద్రుతాః-తాపత్రయములచేతను, ధర్మార్థకామములచేతను, తృష్ణాదులచేతను బీడింపఁబడెడివారు. సుమందమతయః-శ్రేయస్సాధనమును వివరించినను తొందరగా నర్థముచేసికొనలేనివారు. అనేక ఫలములతో ననుష్ఠింపవలసిన ధర్మము లనేకములు. వానిని వినుటకే యెంతయో కాలము పట్టును. పైఁగా భూరికర్మాణి-పౌండరీక వాజసనేయాది భేదములతో ననేకములు.

అందులోను మరల నవాంతరభేదములు. కనుక సారమును నీవే యుద్ధృతీకరించి యనిష్టనివర్తకము ఇష్టప్రాపకమునునైన వైష్ణవధర్మమును, మనీషయా=సూక్ష్మబుద్ధిచేత నిర్ధరించి చెప్పుము. ప్రాయేణ =అనునది ప్రతిహానితోను నన్వయించును. 'ప్రాయేణ మందాః, ప్రాయేణ సుమందమతయః' ఇత్యాదులు. దీనితో 'మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే' అనెడు గీతావాక్యము స్మారితమైనది. 'యే నాత్మా సంప్రసీదతి' ఆత్మప్రసాదమే ముముక్షువునకుఁ గావలసినది.

ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే,
ప్రసన్న చేతసోహ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి.

అను గీతావాక్యప్రకారము ఆత్మప్రసాదముతో దుఃఖహాని తనంతట నదే సిద్ధించును. లేక ఆత్మా=పరమాత్మ, సంప్రసీదతి= ప్రసన్నుఁ డగునో!

కిమలభ్యం భగవతి ప్రసన్నే శ్రీనికేతనే.

భగవంతుఁడు ప్రసన్నుఁ డైనచో సర్వము నప్రయత్నముగా సిద్ధించును. 'భూరీణి విభాగశ స్సంతి తత్రతసారం బ్రూహీత్యనేన భూరికర్మాణి న శ్రోతవ్యా నీతి ప్రతీయంతే. యద్యపి కర్మాణ్యపి ఫల ద్వారాహానాయ స్వరూపేణ ఉపాదానయ చ శ్రోతవ్యాన్యేవ. అన్యథా సాంసారిక ఫలనిర్వేదాసంభవేన నిశ్శ్రేయసస్సాధనావబోధ్య అధ్యాత్మ శాస్త్రశుశ్రూషాయా ఏవ అసంభవాత్ పరమాత్మోపాసనస్య అనభి సంహితఫల కర్మోపకార్యత్వ జ్ఞానాభావ ప్రసంగాచ్చ తథాప్యేకయైవోక్త్యా సర్వాణి ఫలత్యాజ్యా న్యుపాసనాంగతయా యథాశక్త్యా అనుష్ఠేయాన్యేతావదేవ శ్రోతవ్యం ముముక్షుభిఃప్రాయేణైవ ముక్తం'.

శ్రోతవ్యము లనేకవిధములు. అనేకములు. వాని సారమును జెప్పుచున్నారు. ఇట్లుడుగుటతో 'భూరికర్మములు' వినఁదగినవిగావని స్ఫురించు చున్నవి. కర్మములు విడువఁ దగినవి గావు, తత్ఫలమే

త్యాజ్యము. కనుక స్వరూపజ్ఞానముకొఱకు కర్మములు వినఁదగినవే. ఫలాభి సంధిరహితమైన కర్మానుష్ఠానము లేనిచో సాంసారిక ఫల నిర్వేద మేర్పడదు. నిశ్శ్రేయసస్సాధనా కారణమైన యధ్యాత్మ శాస్త్ర శ్రవణేచ్ఛయే జనింపదు. పరమాత్మోపాసనకు అనభిసంహితఫలమైన కార్యముచేత నేర్పడెడు జ్ఞానము ముఖ్యము. అట్టి జ్ఞానముతోఁ బని లేదనెడు విపరీత జ్ఞానప్రసక్తి యేర్పడవచ్చును. ఉపాసనాంగముగఁ గర్మల ననుష్ఠించి తీరవలెను. వాని ఫలములయం దాసక్తి బొత్తిగా పనికిరాదు. ఇట్టివాఁడే ముముక్షువు. ఈ రీతిగా మునులు ముక్తిసాధన మడిగినారు. వానిలోఁ బ్రధానమైనది—

శ్రవణం కీర్తనం విష్ణో స్స్మరణం పాదసేవనమ్,

అని మొదట ప్రతిపాదింపఁ బడినది శ్రవణభక్తి. తదున్ముఖ ముగాఁ గృష్ణావతార చరిత్రను బ్రశ్నించుచున్నారు.

**శుకదేవుని సిద్ధాంతప్రదీపము :**

సాత్వతు లనఁగా వైష్ణవశాస్త్రములను వక్కాణించువారు.

**వల్లభాచార్యుల సుబోధిని :**

ఒక ఫలమును బొందుటకుఁ దత్సాధనమును వెదుకవలెను. ఏది ఫలము? ఏది కాదు? అను విచారము గూడ బయలుదేరును. అభ్యుదయమో నిశ్శ్రేయసమో ఫల మగును. ఈ సందేహముతోనే ప్రశ్న. సూతునకు గురువు లనేకులు. వారిలో నన్యోన్యము విప్రతిపత్తి యున్నను అనేకగురువుల పరిచర్యవలన సూతునకు బుద్ధివైశద్య మేర్పడినది. స్వయముగా నిర్ణయించుకొను శక్తియుఁ గల్గినది. 'ప్రాయేణాల్పాయుషః' అను శ్లోకము తమ్ముగుఱించి చెప్పినది గాదు. తాము ఋషులు చిరంజీవులు. లోకమునందలి యితర మనుజులను గుఱించిన ప్రశ్నయది. 'పుంసాం ఏకాంతతశ్శ్రేయః' అనెడు ప్రశ్నలో ఋషులు దమ్మునుగూడఁ జేర్చికొన్నారు. 'సభ్య!' సభయందుండఁ

దగినవాఁడు గనుక మా ప్రశ్న కుత్తరము హృదయ వంచనలేక యథార్థముగాఁ జెప్పవలెనని భావము.

సభాం న ప్రవిశేత్ప్రాజ్ఞః సభ్యదోష మనుస్మరన్,
అబ్రువ న్విబ్రువన్నజ్ఞో నరః కిల్బిష మశ్నుతే.

అని స్మృతి వాక్యము 'జాయత ఇతి జనః' జన్మగలవారు. అనఁగా సహజసంసారు లనుట. ఇది వారియందుఁ గల సహజమైన దోషము. ఇఁక నాగంతుకదోషము. మందు లనఁగా నలసులు. ఆల స్యము చిత్తజాడ్యము. ఇదియొక దోషము. 'సుమందా మతిర్యేషాం సుమందమతయః. దీనితో జ్ఞానేంద్రియదోషము. మందభాగ్యాః. అదృష్టము కర్మేంద్రియమైన దానివలన తద్దోషము. ఉపద్రుతాః రోగాది దోషములు. ఈ నాల్గును ఆగంతుక దోషములు.

న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్.

కనుక, లౌకిక కర్మవ్యాపృతులు; కర్మశ్రవణమే మోక్షసాధనము గాదు. అనుష్ఠానము గావలెను. సారం=పారంపర్య ఫలవ్యభిచారాది దోషరహితమైనట్టిది. ఏకవచనముచేత నసాధారణ్యము సుగమత్వ మును సూచితము. 'మనీషా'- మనశ్చాంచల్య నివారకమైన బుద్ధి చర్యచేత భగవంతుఁడు షడ్గుణైశ్వర్య సంపన్నుఁడు. అతఁడు గార్య కారణ సంబంధమునకై దేహయోగము నపేక్షింపవలసినది లేదు. జీవసంబంధము బ్రహ్మయందు లేనే లేదు. 'దేవక్యాంజాతః' అను టతో జీవులవంటి ప్రాదుర్భావ మతనికిఁ జెప్పఁబడినది. ఇదెట్లు పొసఁ గును? సత్త్వైకనిష్ఠులు సాత్వతులు. వారు దేవతలు లేక ముక్తుల్యు వారిని వదలి మనుష్యులయం దావిర్భావ మెందుకు? సాత్వతుల కతఁడు పతియైనప్పుడు వారిని బరిత్యజించు టనుచితము గదా! దేవతలు ముక్తులు. వారు బ్రహ్మదేవుని మనస్సునుండి పుట్టిరి. కొంద అతని శరీరమునుండి పుట్టిరి, అంతేగాని స్త్రీలకు జనింపలేదు. మఱి

యితఁడు దేవకి కెందుకుఁ బుట్టెను? అట్లవతరించుటలో సాధించిన పనియేమి? కంసాదులవధను మార్గాంతరములచేతను జేయవచ్చును గదా! కనుక 'యస్య చికీర్షయా జాతః తన్నః కథయ' 'ఏ ఫలము నిచ్ఛించి జన్మించెనో దానిని మాకుఁ దెలుపుము'. ప్రభవరూప కార్యమున్నందునఁ బ్రయోజనముండి తీరవలెను. ఈ రహస్యము యోగులకే తెలియును. నీవు దయచేసి మాకుఁ దెలుపుము. నీవు యోగివి.

**విజయధ్వజవ్యాఖ్య:**

సౌమ్య!—1. భక్తిజ్ఞానరూపమైన సోమరసపానమున కర్హుఁడైన వాఁడా! 2. సాధువైన సూతుఁడా!, తత్త్వతః—నీ యోగ్యతకుఁ దగినట్లని యర్థము. ఆయుష్మన్!—ప్రశస్తమైన ఆయుస్సున్న సూతుఁడా! తత్ర తత్ర—పురాణాది గ్రంథములలో నక్కడక్కడ, అంజసా—1. ఋజుమార్గముతో, 2 ఉపక్రమము మొదలైన తాత్పర్య లింగముల కనుగుణముగా, పుంసాం—మోక్షాధికారులైన పురుషులకు, ఏకాంతతః—1. ముఖ్యముగా, 2. నియమబద్ధముగా, యత్ —ఏది; శ్రేయః—మోక్షాది పురుషార్థసాధనమని, భవతా—సమస్త పౌరుషేయ గ్రంథములను దెలిసిన నీచేత, వినిశ్చితం—నిర్ణీతమో, తత్ —ఆ మోక్షాది పురుషార్థ సాధనమునే, నః—మాకు, శంసితుం—వివరముగాఁ దెలిసి చెప్పుటకు, అర్హసి—తగినవాఁడవు.

తాత్పర్యము: అధికారులైన జనులు బహుకాలము బహుశాస్త్రములను శ్రవణ మొనర్చి, శ్రేయస్సాధనమును దామే నిర్ణయించుకొందురు. మఱి ఇచ్చట సంగ్రహించి తెలుపవలసిన యావశ్యకమేమి? దానికిఁ గారణమునే చెప్పుచున్నాఁడు.

'ప్రాయేణాల్పాయుషస్సభ్య!' అనుదానికి బదులు 'మర్త్యాః' అను పాఠమును విజయధ్వజులు స్వీకరించిరి. మరణమే స్వభావముగా గలవారని యర్థము. అస్మిన్ కలౌ యుగే జనాః—ఈ కలియుగమందు

సాధన మొనర్చికొనుటకై పుట్టిన యధికారి చేతనులు. ప్రాయేణా ల్పాయుషః=స్వల్పాయుష్కులు. అందుచేతనే 'మర్త్యాః'; అందునను మందాః; కర్మ లొనర్చుటకు శక్తి లేనివారు. సుమంద మతయః= అత్యల్పమైన ప్రజ్ఞగలవారు, మందభాగ్యాః=అల్పపుణ్యముతోఁ గూడిన వారు. ఎక్కడో ఒక్కొక్కరు మాత్రమే ఈ గుణముల కపవాదముగా నుందురని తెల్పుటకే 'ప్రాయేణ' అనుట.

అల్పాయుస్సు మొదలైన కారణములతోఁ జాల దుర్బలులైన జనులు, పరమశ్రేయస్సును దెలుపు శాస్త్రమునువదలి, అర్థము మొద లగు విషయములను దెలుపు ననేక శాస్త్రములను విను టశక్యమైనపని యనుచున్నాఁడు. 1. విభాగశః=ప్రతియొక్కటియు వేరు వేరుగా విభక్తమైన, 2. వేరువేరుగా శైవాదివాదులయొక్క విభాగముతో, భూరీణి=అనేకములు, భూరికర్మాణి=కష్టసాధ్యములైన అనేక వ్యాపా రములు గలవి. శ్రోతవ్యాని=1. శ్రవణము సేయఁదగిన యర్థము మొదలైన విషయములను ప్రతిపాదించు శాస్త్రములు, 2. వేరు వేరు సమయములకుఁ జెందిన ప్రతివాదులచేఁ జెప్పఁబడిన శ్రేయస్సాధన ములు (యతస్సంతి=ఏ కారణమువలన నున్నవో), 1. అతః=ఆ కార ణముచేత, 2. సందేహమును గలిగించు విరుద్ధ వాక్యములతో, నిశ్చయ జ్ఞాన మేర్పడనందువలన, 3. అర్థాది విషయములను బోధించు శాస్త్ర ములు తెలిసికొనుట కశక్యమైనదానివలన, 4. తెలిసికొన్నను మోక్ష మునకు విరుద్ధమైనందు వలన, 5. ఆయుస్సు అల్పమైనందుచేత, సాధో! హీనకులజుఁడవైనను దోషరహితుఁడైన సూతుఁడా!, అత్ర= ఈ శాస్త్రములలో, యత్ సారం=1. ఏది ముఖ్యముగా గ్రాహ్యమో, 2. సర్వశ్రేష్ఠమైనదో, 3. తప్పక మోక్షరూప ఫలము నొసఁగునదో, 4. ఋజుమార్గముతో ననుష్ఠింపఁ దగినదో, తత్=అట్టి శ్రేయస్సాధన మును, మనీషయా=నీ బుద్ధితో, సముద్ధృత్య=నిశ్చయించి, భూతా నాం=ముముక్షువులైన జీవరాసులయొక్క, భద్రాయ=మోక్షరూపమైన

మంగళము కొఱకు, బ్రూహి=చెప్పుము, యేన=ఏ నీ చెప్పిన సార మును వినుటవలన, 1. ఆత్మా=శ్రీహరి, 2. మనస్సు, ఆశుప్రసీదతి= శీఘ్రముగాఁ బ్రసన్నుఁడై యనుగ్రహము నొనర్చునో, 2. నిర్మల మగునో, 'సంప్రసిదతి' అనుటకు బదులు 'ఆశుప్రసీదతి' అని వీరి పాఠము.

తాత్పర్యము: ఓయీ సూతా! శాస్త్రములందమా అర్థశాస్త్రము మొదలైనపద్ధతులతో ననేకరీతులుగా విభక్తములు. శివ సర్వోత్తమము శక్తిసర్వోత్తమము మొదలైన వాదము లొనర్చు ప్రతివాదులు, తమ తమ బుద్ధులకుఁ దోఁచినట్లు శ్రేయస్సాధనములను జెప్పినారు. ఈ శాస్త్రములవలెనే కర్మలుగూడ ననేకములు. వానిలోఁ బ్రతికర్మయుఁ గష్టసాధ్యమై యాచరించుటకే భయపడవలసి యున్నది. కనుక బహుదుర్బలులైన కలియుగజనులకు వీని నన్నిఁటిని వినుట, ఆ పై విచార మొనర్చికొని ఇదియే యుత్తమసాధన మని నిర్ణయించి కొనుట చాల కష్టమైన పని. నీవు సకల పౌరుషేయ గ్రంథవేదివి. అందుచే నీ నిర్ణయమునే మాకుఁ దెల్పుము. తప్పక మోక్షరూపమైన శ్రేయస్సు నొసఁగున దేది? దేనిని విన్నచోఁ బరమాత్మ ఆలసింపక మోక్షము నొసఁగు ననుగ్రహముచేయును? దేని శ్రవణము ముముక్షు జీవుల మనస్సులను నిర్మల మొనర్చి మోక్షమునకుఁ గారణమగు న ట్లొనర్చును? ఆ యుత్తమ సాధనమునే లోకకల్యాణమునకై మాకుఁ దెల్పుము. అదియే సమస్తశాస్త్రసారమై యుండును. సందేహము లేదు.

సారభూతమైనది కృష్ణావతార కథాశ్రవణమే. దీనిని మించి నది లేద. ఈ నిర్ణయమునకు మహర్షులు ముందే వచ్చినారు. వచ్చియే ప్రశ్నించుచున్నారు.

హే సూత=ఓయి సూతుఁడా!, జానాసి=కృష్ణావతార •కారము మొదలైన సమస్త రహస్యముల నెఱిఁగినవాఁడవు లేక బింబ

రూపుఁడై వెలసిన, భద్రం—సర్వమంగళకరుఁడైన భగవంతుని, జానాసి —తెలిసినవాఁడవు, 'తే భద్రం అస్తు'—నీకు మంగళమగుఁ గాక! ఇది యౌత్సుక్యముతోఁ జెప్పినమాట. సాత్వతాం పతిః — పాంచరాత్రోక్తమైన కర్మల నొనర్చు యాదవులు మొదలైనవారికి పాలకుఁడైన, భగవాన్—భగవంతుఁడు; యస్య—ఏ విశేషకార్యముయొక్క, చికీర్షయా—చేయు నిచ్ఛతో, వసుదేవస్య దేవక్యాం జాతః—వసుదేవునకు దేవకియందు జన్మించెను.

పోతన్నగారి కవిత్వము:

గురువులు ప్రియశిష్యులకుం
బరమరహస్యములు దెలియఁ బలుకుదు రచల
స్థిరకల్యాణం బెయ్యది
పురుషులకును నిశ్చయించి బోధింపు దగన్.

ఓయి సూతా! ప్రియశిష్యులైన వారికి గురువులు పరమ రహస్యముల నైనను దాపక చెప్పెదరు. మానవులకు అచలస్థిరమైన శ్రేయస్సు నొడగూర్చు సాధన మేది? నీవే దానిని నిశ్చయించి చెప్పుము.

'స్నిగ్ధస్య శిష్యస్య' అను మూలమునకు 'ప్రియశిష్యులకున్' అని తెనుఁగు. 'గుహ్యం'—'పరమరహస్యములు' అని యాంధ్రీకరణము, 'అచలస్థిరకల్యాణంబు'—'ఏకాంతతశ్శ్రేయః' అనునది దీనికి మూలము. ఏకాంతతః—'అవ్యభిచారేణ' అని శ్రీధరుఁడు. 'ఒకప్పుడును వీడక' అని తాత్పర్యము. ఈ యర్థమునే యమాత్యుఁడు 'అచలస్థిరకల్యాణ' మని వివరించినాఁడు. 'నిశ్చయించి'—'సముద్ధృత్య' అనుటకుఁ దెనుఁగు. 'తెలియఁబలుకుదురు'—గుహ్యములైన యర్థములు ఒకసారి చెప్పినంత మాత్రముతోఁ దెలియవు శిష్యునకుఁ దెలియు వఱకును మాటిమాటికిని బోధింపవలెను. ఎన్ని సారులు

గురువు చెప్పెనన్న దచట ప్రశ్న గాదు. శిష్యునకు సమగ్రముగాఁ దెలిసినదా లేదా యనుటయే విచార్యము. పారమార్థికవిషయములు కేవలబుద్ధితోఁ దెలిసికొన్న లాభములేదు. అనుష్ఠానముననే వాని సార్థక్యము. కనుక 'తెలియఁ బలుకుదు' రనుటకు శిష్యున కర్థమగు వఱకును బలుమారు చెప్పి అవి యనుష్ఠించు నపుడు గలిగెడు కష్టములను నివారణమును గావించి యనుష్ఠింపఁజేయుట; బోధింపుతగఁ 'బుధ-అవగమనే' అనిధాతువు. తన కర్థముగానిది యెదుటి వానికి బోధించుట కష్టము. నీవు గొప్పయనుష్ఠాతవు. తగన్‌—నీకుఁజక్కఁగాఁ దెలిసిన విషయమైనను దానిని మా కెట్లు చెప్పిన నర్థమగునో ఆ ప్రకారముగా మలచి చెప్పుమని తాత్పర్యము.

మన్నాఁడవు చిరకాలము
గన్నాఁడవు పెక్కులైన గ్రంథార్థంబుల్
విన్నాఁడవు వినఁదగినవి
యున్నాఁడవు పెద్దలొద్ద నుత్తమగోష్ఠిన్.

'చిరకాలము మన్నాఁడవు'. 'ఆయుష్మన్' అనుటకిది తెలుఁగు. చిరకాలము బ్రదుకుటచేఁ జాలవిషయములు దెలిసికొనుటయు ననుష్ఠించుటయు జరగినది. పెక్కులైన గ్రంథార్థంబుల్ గన్నాఁడవు-పురాణములు ఇతిహాసములు ధర్మశాస్త్రములు మొదలైన గ్రంథములన్నియు నీకుఁ గరతలామలకములే. శబ్దముల కర్థవివరణము వేరు వేరుగా నుండును. ఈ శబ్దమున కీ సందర్భములో నీ యర్థమే దగిన దను నిశ్చయము వానిని బహుకాలము పరిశోధించుటచేఁ గాని యేర్పడదు. కనుక నిస్సందేహముగ గ్రంథార్థములను నిర్ణయించికొన్న వాఁడవు. 'విన్నాఁడవు వినదగినవి'— వినఁదగినవి మాత్రమే విన్నావు, లేనిపోని కుశంకలకు దూరముగా నుండెడ వని తాత్పర్యము. ఉత్తమ గోష్ఠి—గొప్పవారి సంసర్గముతో; సభలు వేరు, గోష్ఠులు వేరు. సభలలో భిన్నభిన్న జనులు. భిన్నభిన్నములైన యభిరుచులు. కనుక నచ్చుట

గంభీరార్థములు వివరింప వీలుండదు. జనరంజనము అచ్చట ప్రధానము. సామాన్య విషయములతోనే సభలు ముగియును. గోష్ఠు లట్లుగాదు. ఒక విషయమం దభిరుచి అధికారము గలవారు మాత్రమే యచటఁ జేరెదరు. వక్త చెప్పుచున్నప్పుడు శ్రోత కేదైన సందేహమేర్పడిన వెంటనే ప్రశ్నించుట కవకాశ ముండును. కనుక ఉత్తమ గోష్ఠులలో నుత్తముల నడిగి యెన్నియో విషయములు దెలిసికొన్నా వని తాత్పర్యము. పెద్దలు జ్ఞానవృద్ధులు వయోవృద్ధులు వయోవృద్ధులనుండిగూడఁ దెలిసికొనవలసిన విషయము లనేకము లుండును.

అలసులు మందబుద్ధియుతు లల్పతరాయువు లుగ్రరోగ సం
కలితులు మందభాగ్యులు సుకర్మము లెయ్యవి సేయఁ జాలరీ
కలియుగమందు మానవులు గావున నెయ్యది సర్వసౌఖ్యమై
యలవడు నేమిటం బొడము నాత్మకు శాంతి మునీంద్ర! చెప్పవేః.

మూలములో సూతుని గూర్చిన విశేషణములు సౌమ్య! సభ్య! రెండే. అమాత్యుఁడు, 'మునీంద్రాః' అన్నాఁడు. సూతుని యం దతనికి ప్రత్యేక గౌరవమని స్పష్ట మగుచున్నది. కలియుగమం దలి మానవు లలసులు, సోమరులు. ఒకవేళ శ్రమించినను మంద బుద్ధులు. ఒక విషయము సరిగా నర్థము గావలెనన్న వారికి బహు కాలము పట్టును. దానికి బాధకమే అలసత్వము. ఈ రెంటిని నవరించి కొన్నను వారి యాయువు చాల స్వల్పము. చాలని దాని కుగ్రరోగ ములు. ఇవన్నియు నెందుకు? మందభాగ్యులు గనుక అనఁగా పూర్వ పుణ్యము చాల కొలఁదిగా నుండు ననుట.

మందాః=దీని వివరణమే 'అలసులు', ఉపద్రుతాః=ఉగ్రరోగ సంకలితులు. కర్మలు రెండు రీతులు. నిత్య నైమిత్తికములు. నిత్యకర్మ లకు వేరు ఫలములేదు. చేయకున్నచోఁ బ్రత్యవాయము. నైమిత్తిక ములు గూడ నట్టివే. వీని నొనర్చుచు, సుకర్మము లొనర్పవలెను. వానిని గూడ ఫలాభిసంధి రహితముగఁ జేయవలెను. ఇంతచేసినను

వాని ఫలము చిత్తశుద్ధివఱకే. కనుక కలియుగమందలి మానవులు గర్మాచరణముతోఁ జిత్తశుద్ధిని సాధించి కొనలేరని తాత్పర్యము. 'ఎయ్యది సర్వసౌఖ్యమై యలవడుఁ', 'సారం' అనుటకిది వివరణ. సిద్ధియందే గాక సాధనా దశయందును సౌఖ్యకరమై యుండవలెను. శాస్త్రనియమములు మనసును వేధింపరాదు. ఆత్మకు సర్వవిధముల శాంతి నొడగూర్చు నదియై యా సాధన యుండవలెను. ఆత్మశాంతి యేర్పడినప్పుడు మోక్షము తనంత వచ్చును.

తన్నశ్శుశ్రూషమాణానా మర్హస్యంగానువర్ణితుమ్, 13
యస్యావతారో భూతానాం క్షేమాయ్ చ భవాయ చ,

ఆపన్న స్సంసృతిం ఘోరాం, యన్నామవివశోగృణన్. 14
తత స్సద్యో విముచ్యేత, యద్బిభేతి స్వయం భయమ్,

యత్పాద సంశ్రయా స్సూత! మునయః ప్రశమాయనాః.
15

సద్యః పునం త్యుపస్పృష్టాః, స్వర్ధున్యాపో ఽను సేవయా,
కోవాభగవత స్తస్య పుణ్యశ్లో కేడ్యకర్మణః. 16
శుద్ధికామో న శృణుయా ద్యశః కలిమలాపహమ్,

తత్ = దానిని, శుశ్రూషమాణానాం = వినుటకు కోరికగల, నః = మాకు, అంగ! = పూజ్యుఁడైన వాఁడా! అనువర్ణితుం = క్రమముగా వర్ణించిచెప్పుటకు, అర్హసి = తగినవాఁడవు, యస్య = ఎవనియొక్క, అవతారః = అవతారము, భూతానాం = ప్రాణుల యొక్క, క్షేమాయ = పాలనము కొఱకు, భవాయ చ = అభివృద్ధి కొఱకును అగుచున్నదో!.

తాత్పర్యము: ఆ విషయమును వినుటకు అత్యంతాసక్తిగల మాకు ఆ యవతారమును, దానికి సంబంధించిన లీలలను, క్రమముగాఁజెప్పవలెను. భగవంతుని యవతారము సకల ప్రాణుల రక్షణకును, సమృద్ధికిని యగుచున్నది గదా! 13

ఘోరాం—భయంకరమైన, సంసృతిం—సంసారమును, ఆపన్నః—పొందినవాఁడును, వివశః—పరవశుఁడును ఐయున్న మానవుఁడు, యన్నామ—ఎవని నామమును, గృణన్—ఉచ్చరించినవాఁడై, సద్యః—తత్క్షణము, తతః—దాని నుండి, ముచ్యేత—విముక్తిని బొందునో, భయం—భీతి, యత్—ఏ నామమునుండి, స్వయం బిభేతి—తానే భయపడుచున్నదో.

తాత్పర్యము: భగవంతుని ప్రభావము సర్వోత్తమమైనది గదా! మహాభయస్థానమైన సంసారమును బొందినవారు అ దుఃఖముతో నవశులై గాని, వాని నామము నొక్కసారి యుచ్చరించిన మాత్రముననే సంసారభయమునుండి తత్క్షణమే ముక్తు లగుదురు. ఎవనినామోచ్చారణముచేత సాక్షాద్భయ స్వరూపుఁడైన యముఁడును భీతిల్లునో, ఆ భగవంతుని మహిమ యత్యాశ్చర్యకర మైనదిగదా!. 14

సూత:—ఓ సూతుఁడా!, యత్పాదసంశ్రయాః—ఎవని పాదమే యాశ్రయముగాఁ గల, ప్రశమాయనాః—కేవల శాంతినే మార్గముగా స్వీకరించిన, మునయః—మునులు, సద్యః—వెంటనే, పునంతి—పవిత్రీకరింతురు, స్వర్ధున్యాపః—గంగాజలము, ఉపస్పృష్టాః—తాకఁబడినవై, అనుసేవయా—క్రమముగా సేవ చేయుటచేతనే, శుధ్యంతి—పరిశుద్ధుల నొనర్చును.

సజ్జనస్పర్శ గంగాస్నానమున కంటెను శ్రేష్ఠమైనదని చెప్పుచున్నాఁడు. భగవంతుని పాదముల నాశ్రయించి పరమశాంతి నుపాసించు మునివరుల సంగతితో సంతఃకరణము తత్క్షణమే శుద్ధమగును. ఆ భగవంతుని పాదములనుండి పుట్టిన గంగాజలము గూడ, చిరకాల సేవనము చేతనే పరిశుద్ధిని గల్గించును. 15

పుణ్యశ్లోకేడ్య కర్మణః, పుణ్యశ్లోక—పుణ్యమైన కీర్తి గలవారు—వారిచేత, ఈడ్య—స్తుతింపఁదగిన, కర్మణః—కర్మలతోఁ గూడిన, భగవతః తస్య—భగవంతుఁడైన వానియొక్క, కలిమలాపహం—కలిమలములను నాశ మొనర్చెడు, యశః—కీర్తిని, శుద్ధికామః—తన మనోనైర్మల్యములను గోరియున్న, కః—ఎవఁడు, న శృణుయాత్—వినఁడు ?

తాత్పర్యము: సత్పురుషులు పవిత్రమైన కీర్తిగలవారు. వారిచే కీర్తింపఁదగినవి భగవంతుని క్రియలు. అవిగూడ ననేకములు. వాని యశస్సు, సమస్త కలిదోషములను హరించును. మనశ్శుద్ధి నాకాంక్షించు నెవ్వఁడైనను దత్కీర్తినే వినవలెను. వేఱుమార్గము లేదు. 16

శ్రీధరుఁడు:

సామాన్యముగా భగవంతుని యవతారము-భూతముల క్షేమమునకును, సమృద్ధికిని హేతువు. కాని యంతమాత్రమే కాదు. జ్ఞానులకు భక్తులకుఁ బరమ ప్రయోజనరూపమైన మోక్షమును గల్గించుటకే భగవంతుని యవతారము.

ఆపన్నః = ఆపదనందినవాఁడు, సంసారమునందు జన్మించుటయే మహాపద. ఉపస్పృష్టాః=సన్నిధిమాత్రేణ సేవితాః = కేవలము వారి సమీపమున నుండుటయే గాదు. వారి తిన్నని కటాక్షవీక్షణమే మనోనైర్మల్యమును గల్గించును.

మోక్షమునకు బాధకమైన పూర్వపాపమునంతయు నష్టమొనర్చును. స్వర్ధున్యాపః = భగవంతుని పాదములందు జన్మించిన జలములు అవి యక్కడనే నిలువలేదు. ముల్లోకములకుఁ బాఱెను. ఆ జలము-తత్సంబంధముచేత మనుష్యులను బావన మొనర్చును. ఎప్పుడు? అనుసేవయా = చాలకాల మనుసరించి సేవించుటవలన. అంతేకాని సన్నిధాన మాత్రముననే మనోనైర్మల్యమును గల్పింపవు. సాధువులో గంగాజలములకంటె నుత్తములు. వారు 'నద్యః పునంతి' తత్క్షణమే పవిత్రుల నొనర్చుచున్నారు. కలిమలాపహం = సంసార దుఃఖోపశమన మని తాత్పర్యము.

వంశీధరుఁడు:

వివశః = విశేషముగా వశుఁడు. అత్యంత పరాధీనుఁ డని యర్థము. యన్నామ-ఏ కృష్ణునియొక్క నామమును; కృష్ణుఁడు

సర్వావతారుఁడు. అందుచే నే యవతార నామమును స్మరించినను, వానియందే పర్యవసించుచున్నది. వాసుదేవ, దామోదర, గోవిందాది నామము లన్నియు కృష్ణపరములే. ఇక్కడ 'ఘోరాం' 'సంసృతిం' 'తతః' 'వివశః' 'సర్వః' అను నీ పదములతో నజామిళాది పరమ పాపులు సూచింపఁబడుచున్నారు. యద్బిభేతి స్వయం భయం—మూల భూతమైన భయము-మహాకాలుఁడు. వాఁడే భయపడుచున్నాఁడు. ఇఁక మృత్యువు యముఁడు యమదూతలు భయపడుటలో నాశ్చర్య మే మున్నది? ప్రశమాయనాః—ప్రశమ మనఁగా భగవన్నిష్ఠమైన బుద్ధిని గల్గియుండుట. 'శమో మన్నిష్ఠతా బుద్ధేః' అని యేకాదశ స్కంధమున భగవంతుఁడే యన్నాఁడు. సాక్షాత్తుగా పూర్ణావతారుఁ డైన శ్రీకృష్ణునియొక్క లీలాకృష్టచిత్తులు, మునులు, శుకదేవాదులు 'సద్యః పునంతి' సహాసనగా సర్వపాపములనుండి విముక్తిని గల్గించుచున్నారు. స్వర్ధుని గంగ–

> యోఽసౌ నిరంజనో దేవః చిత్స్వరూపో జనార్దనః,
> స ఏవ ద్రవరూపేణ, గంగాంభో నాత్రసంశయః.

ఎవఁడు నిరంజనుఁడో, యెవఁడు చిత్స్వరూపుఁడో అట్టి జనార్దనుఁడే గంగ. అతఁడే ద్రవరూపముగఁ బాఱుచున్నాఁడు. ఇందుకు సందేహము లేదు.

గంగ యిట్టిదయ్యును, సాక్షాత్తుగా వామనమూర్తి చరణ నిస్సృత యయ్యును, అనుసేవయా—అనుదిన సేవచేతనే, శుద్ధ్యతి— పవిత్రులనుగాఁ జేయుచున్నది. సన్నిధాన మాత్రముచేతనే పవిత్రీకరింప లేదు. సేవతోనైనను, న సద్యః—అప్పుడే పవిత్రుల నొనర్పలేదు. కాలాంతరమందు. కనుక భగవదవతారమైన గంగాజలమునకంటెను భగవదాశ్రయులు గొప్పవారనుట. 'తీర్థం చక్రే నృపోనం యదజని యదుషు స్వస్సరిత్పాద శౌచం' అంతకు ముందు స్వర్ధునియే సర్వాతిశయమైన తీర్థముగా నుండెడిది. ఇప్పుడు 'యదుషు య దజని'

యాదవులయందే దిగల్గినదో. తీర్థం= శ్రీ కృష్ణరూపమైన గంగాతీర్థము స్వస్సరిత్ = స్వర్గంగను, పాదశౌచం = తాను గల్గించు పుణ్యములోని నాల్గవభాగమును మాత్రమే యిచ్చుదానినిగా, ఊనం చక్రే= తక్కువ పఱచినది.

విశ్వనాథచక్రవర్తి:

సద్యః= స్మరించినంత మాత్రముననే, యవిద్యామాలిన్యమును గూడఁ బోగొట్టుచున్నారు. ఇఁక వారినిఁ జూచుట, తాఁకుట, తట స్థించినచోఁ దత్ఫలమునకు మితి యేమున్నది?

> ఏషాం సంస్మరణాత్పుంసాం సద్య శ్శుద్ధ్యంతి వై గృహాః,
> కిం పునర్దర్శన స్పర్శ పాదశౌచాసనాదిభిః.

వారిని స్మరించినంతనే గృహములు పావనము లగుచున్నవి. ఇఁక తద్దర్శనము, స్పర్శము పాదశౌచాసనార్పణములు వీని ఫలమెంతన వలెను? స్వర్గంగజలములు గూడఁ బుట్టినచోటి నుండి దూరములకుఁ దరలివచ్చినవి.

> ముక్తిస్త్వద్దర్శనా దేవ న జానే స్నానజం ఫలమ్.

గంగాదేవీ! నిన్ను చూచినంతనే ముక్తి. ఇఁక స్నానఫలమేమో నాకుఁ దెలియదు. సద్యః అనుటకు స్మరణమాత్రముననె యని యర్థముఁ జెప్పకున్నచోఁ బై వాక్యముతో విరోధ మేర్పడును శుద్ధి యనఁగా నాత్మప్రసాదము. 'ఏ నాత్మా సుప్రసీదతి' అని శ్రుతి చెప్పెను గదా!

యశః= రాసక్రీడాదికమైన, నాఽన్యతో దర్శనీయమైన విలక్షణమైన కీర్తి, పుణ్యశ్లోకేడ్యకర్మణః-

> పుణ్యశ్లోకో నలో రాజా పుణ్యశ్లోకో యుధిష్ఠిరః
> పుణ్యశ్లోక స్తు వైదేహః పుణ్యశ్లోకో జనార్దనః,
> పుణ్యశ్లోక శ్శంతనవః పుణ్యశ్లోకా స్సనాదయః.

అని పురాణోక్తి పుణ్యశ్లోకులైన యుధిష్ఠిరాదులు పొగడఁదగిన కీర్తిమంతులని యర్థము. లేక పుణ్యశ్లోకశ్చాసౌ ఈడ్యకర్మాచ'అని కర్మ ధారయము. కలిమలాపహం=కలిపురుషుఁడు స్వాంగముల నావేశించుటచేత, దుర్మార్గప్రవృత్తి యేర్పడెను. అదియే కలిమలము. కాయిక మానసికాది పాపము లన్నమాట, కోవా=అనిచెప్పుటచేత, సర్వులును స్వాంతఃకరణ శోధనార్థము, కృష్ణచరిత్రమునే వినవలెనని భావము. సూత జానాసి అన్నది మొదలుకొని, 'కోవా' అన్నంత వఱకును, కృష్ణావతార ప్రయోజనము. ఆ చరిత్ర యీ రెంటికిని, సంబంధించిన ప్రశ్న. తస్య కర్మా ణ్యుదారాణి' అనునది మొదలు కొని విశ్వసృష్ట్యాదిలీలా ప్రశ్నము దానికుత్తరము. 'స ఏవేదం ససర్జాగ్రే' అని యారంభించి చెప్పఁ బోవుచున్నాఁడు-

వీరరాఘవ వ్యాఖ్య:

అర్హసి=సూత! నీవే సత్పురుషానుగృహీతుఁడవు. పూర్తిగాఁ గృష్ణచరిత్ర నెఱిఁగినవాఁడవు, దానిని వర్ణించుట కధికారివి. ఈ మహోపకారము నీ వలననే గావలెను. 'భూతానాం భవాయ' భూతములయొక్క విభవము కొఱకు. అది యోగరూపమైన విభవము. గీతారూపమున నాతఁడే యోగశాస్త్రమును జెప్పెను గదా! క్షేమాయ=వారిని రక్షించుట కొఱకును; ఇక్కడ 'భక్తానాం' అని చెప్పవలసియున్నది. అట్లు చెప్పక భూతానాం అని సామాన్యముగాఁ జెప్పుటలో నుద్దేశ మేమి? శత్రువులను గూడ నాతఁడు దమించి యపవర్గ మొసఁగును. వారినిఁ జంపుట యపవర్గప్రదానము కొఱకే. అందుకే ప్రాణిమాత్రులకు మహోపకారకుఁడు. ఘోరాం=జన్మజరామరణాదిరూపమైన సంసృతిని, అపన్నః=పొందిన శత్రువైనను, వివశః=పారవశ్యముతోనైనను కృష్ణనామమును స్మరించును గదా! పారవశ్యముచే నైనను ఉచ్చారణమాత్రము చేతనైనను శత్రువైనను మోక్షము నందుచున్నాఁడు. ఇక్కడ భవః-అని పాఠము. అతని నామోచ్చారణ

ముతో భవరూపమైన సంసారమే భయపడుచున్నది. 'భయ' మను పాఠమునందును జన్మమరణాది భయహేతువగుటచే భవమే వివక్షిత మైనది. దేహావసానకాలమందు భగవన్నామోచ్చారణము అవ్యవధానముగా ముక్తి నొసఁగుచున్నది. తద్భిన్నకాలమందు, కర్మజ్ఞానయోగములవలె భక్తియోగము అనుగ్రాహకమైనది. తద్ద్వారా ముక్తి నొసఁగును. అజామిళోపాఖ్యానమునందలి యంతరార్థ మిది. అవతారముల నామోచ్చారణ మాహాత్మ్యము గొప్పదగు టట్లుండ నిమ్ము; తదీయుల మాహాత్మ్యముగూడ వాఙ్మనస్సుల కగోచరమని వివరించుచున్నాఁడు. 'యత్పాద సంశ్రయాః' పాదములే ప్రాప్యములుగా ప్రాపకములుగా నున్నవాఁడు. ఉపాయోపేయములు రెండునునతఁడే యనుట. దీనిచే ప్రపత్తిధర్మము సూచితము, మునయః=తత్పాదారవిందమననశీలురు, ప్రశమాయనాః=శమదమాది గుణముల కాశ్రయులు. ఉపస్పృష్టాః= పాదముల స్పర్శ గలిగినవారై, సజ్జనులకు శరణాగతులైనచో నని యర్థము. భగవత్పాదజన్యయైన గంగ 'అనుసేవ' చేతనే పవిత్రుల నొనర్చునది. వీరి పాదములు తాఁకినంతనే పవిత్ర మొనర్చుచున్నవని భావము. భగవంతునికంటె భాగవతులు గొప్పవారనుటయు స్ఫురించుచున్నది. లేక 'స్వర్ధున్యాపః, అనుసేవనయా పునంతి, తథాముననయోఽప్యుపస్పృష్టా పునంతి, దృష్టాంతో వాఽభిప్రేతః' అనఁగా స్వర్గంగాజలము లనుసేవతో నెట్లు పవిత్రీకరించు చున్నవో అట్లే సాధువు లుపస్పృష్టులై పవిత్రీకరించు చున్నారు. ఇది దృష్టాంత దార్ష్టాంతిక భావము.

వల్లభాచార్యుల సుబోధినీవ్యాఖ్య :

మేము వినవలెననెడు కుతూహలముతో నున్నాము. మా కుతూహలమును దృప్తి పఱచుటకుఁ గృష్ణకథలు చెప్పవలెను. శ్రవణేచ్ఛ యోగముతోఁ దొలఁగదు. యోగ మందఱకును సాధ్యము గాదు. యోగ మొనర్చినను భగవదీయమైన పదార్థము శ్రవణముచేతనే

యెఱుఁగ నగుచున్నది. భాగవతము భగవద్వాక్యము. సాక్షాత్తుగాఁ గాని, పరంపరగాఁ గాని భగవన్ముఖోద్గతము.

దేవతిర్యఙ్నరాదులందు భగవంతుని యవతరణము అనఁగా నలౌకికమైన తేజస్సంక్రమణము; భూతానాం = జాతమాత్రములైన స్థావరజంగమముల, క్షేమాయ = ఐహికసర్వసుఖమున కగుచున్నది. 'చ'కారముతో-సర్వదుఃఖనివృత్తిగూడ నేర్పడునని భావము. భవాయ మోక్షాయ = మోక్షము కొఱకు, 'చ' కారముతో నవిద్యా నివృత్తిని గలుపుకొనుచున్నాఁడు. 'భూ సత్తాయాం' అను ధాతువువలన సన్మాత్ర మున కని భావము. కనుక భగవదవతారము సర్వుల యభ్యుదయార్థము-నిశ్శ్రేయసార్థమును. జనిష్యమాణుల గతియేమి? వారికిఁ గూడ నామస్మరణముచేఁ బురుషార్థసిద్ధి యని నామమాహాత్మ్యమును జెప్పుచున్నాఁడు. ఘోరాం సంసృతిం = సర్పాది యోనిభూతము గాని మహావ్యాధ్యాది రూపము గాని యగుటచే ఘోరము, యస్య = ఏ కృష్ణావతారముయొక్క, నామ = నామమును, వివశః = 'వేః కాలస్య వశః' కాలవశుఁడై యని తాత్పర్యము. గృణన్ = ఉచ్చరించినంతనే, ఉచ్చారణ కాలమందే యని భావము. యద్బిభేతి స్వయం భయం = అంత్యకాల మందు-కాలమున కధికారియైన భయనాముఁ డొకఁడు మృత్యుపాశములతో జీవులను బంధించుచున్నాఁడు. 'సైనికా భయనామ్నః' అని భాగవతమందే వచ్చును. నామోచ్చారణకాలమందే వాఁడు తన పాశములను వదలించును. ఎందుకు? బిభేతి = భయనాముఁడే భయపడును. స్వరూపనాశ మేర్పడునని భయము. లేక స్వరూపభూతమైన భయము వదలిపోవుచున్నదని భావము, ద్వైతదృష్టి నశించుచున్నది 'ద్వితీయాద్వై భయం భవతి' అని శ్రుతి. నామోచ్చారణ సామర్థ్యములేని వృక్షపశ్వాదుల గతియేమి? యత్పాదసంశ్రయాః = భక్తులస్పర్శచేత నవిగూడ తరించును. భగవత్సమాశ్రయణము జ్ఞానమార్గమందును కద్దు. కాని వారికి దేహాధ్యాసము లేదు.

అందుచే, వారి పాదస్పర్శ ముక్తినీయదు. వారి యుపదేశమే మోక్ష ప్రదము. పాదసంశ్రయణము భక్తిమార్గమందే; పాదసంశ్రయులైన ఋషులు ప్రశమాయనులై జ్ఞానకర్మల నాశ్రయించియు, భక్తినే చరమోపాయముగా ననుసంధించుచున్నారు. ఈ త్రివేణీ సంగమమే ముక్తిమార్గము. వారు స్వపరిశుద్ధికి జ్ఞానకర్మల ననుష్ఠించుచు భక్తి ద్వారా యితరులను బవిత్రీకరించుచున్నారు. ఇతరోపాయములతో కాలవ్యవధానముచేతనే పావనత్వము సిద్ధించుచున్నది.

త్రిస్స్వాధ్యాయం వేద మధీయీత త్రిరాత్రం వా
సావిత్రీం సంవత్సరాదేవాత్మానం పునీత.

అని శ్రుతి. ఉపస్పృష్టాః=ఉపసర్గతో-వంచనతో-క్రౌర్యముతోఁ దాఁకిన ప్రయోజనములేదు' అని భావము. గంగాజలము భగవద్భక్తు లనే పవిత్రీకరించుచున్నది. 'ప్రాయశ్చిత్తాని చీర్ణాని' అని భాగవతము. భగవద్భక్తులును, గంగాజలమును, భగవంతునియందు ప్రేమౌత్సు క్యము నుత్పన్న మొనర్తురు. భగవత్సేవ కభిముఖుల నొనర్తురు; దానితోఁ బవిత్రత. కలియుగమందు దేశ, కాల, ద్రవ్య, కర్తృ, మంత్ర కర్మములు నీయారు నశుద్ధములే. కనుక భగవత్కథాశ్రవణముదప్ప వేఱుమార్గముతోఁ గలియుగమందు ముక్తి లేదు. 'పుణ్యాః శ్లోకాః ఏషాం' భగవద్భృత్తులుగూడ కీర్తిని సంపాదించికొనుచున్నారు. భగవ త్కీర్తనా మాహాత్మ్య మట్టిది, లేక పుణ్యశ్లోకాః ఈడ్యకర్మాణః ఏన= అని సమాసము. పుణ్యశ్లోకులైన భగవద్భక్తులు ఈ భగవంతు నాశ్ర యించుటచేత పరులచే స్తుతింపఁ దగిన కర్మములు గలవా రగుచున్నా రని యర్థము; 'స్వర్ధున్యాపః' అనునది యితరములైన యమునాది జలములకును ఉపలక్షణము. 'యత్రగంగాదయో నద్యః' అని భాగ వతము. తత్ స్పర్శ జన్మములో సిద్ధింపనివారి గతి యేమి? వారి యుద్ధార మెట్లు? సర్వులకు నుద్ధారమైనచో జగదుత్సేధ మేర్పడును. అది భగవంతున కభిప్రేతము. అందుచేతఁ గొంద రధికారులకే వాని

స్పర్శచేతనుద్ధారము భగవంతున కభిప్రేత మని తాత్పర్యము. కీర్తన మాత్రముచేతనే సంసారభయనివృత్తి యేర్పడుచున్నది గదా! మఱి యందఱును భగవత్సంకీర్తన మేల యొనర్పరు? అనేక జన్మసుకృతానుష్ఠానము లేనిదే భగవద్యశః శ్రవణ సంకీర్తనాదులు దుర్లభము. అందుకే పుణ్యశ్లోకులైన వారిచేత 'ఈడ్యకర్మణః' అనుచున్నాఁడు. అనేక జన్మ సుకృతానుష్ఠానముతోఁ బుణ్యములైన కీర్తులు గలవారు పుణ్యశ్లోకులు. శుద్ధికామః=తన యంతఃకరణశుద్ధి నపేక్షించువాఁడు. అది కలిమలాపహము. ఈ యుగమందు యజ్ఞాది నిర్వహణము దుష్కరము. అందుచేఁ గృష్ణకథాశ్రవణము సమస్త దోషహరము.

**విజయధ్వజులు ;**

యస్య=ఏ పరమాత్ముని, అవతారః=అవతారము, అనఁగా శరీరముతో వ్యక్తిత్వము, భూతానాం=జీవరాసులయొక్క, క్షేమాయ=ఐహికాముష్మికసుఖమునకు, విభవాయ చ=అభివృద్ధికిని, భవతి=అగుచున్నదో, అంగ!=మా కత్యంతప్రియుఁడవైన సూత! తస్య=ఆ కృష్ణుని యొక్క, తం=ఆ కార్యవిశేషమును (వానిచరిత్రను), శుశ్రూషమాణానాం=వినవలెనను నిచ్ఛగల మాకు, అనువర్ణితుం=చక్కఁగా వివరించి తెలుపుటకు, అర్హసి=తగినవాఁడవు.

తాత్పర్యము: కృష్ణపరమాత్ముని యవతార మనఁగా వ్యక్తమగుట. అంతేగాని భౌతికదేహయుక్తుఁడై గర్భమందు పెరిగి జన్మించుట లేదు. గర్భమునందుఁ బెరిగి గడ్డకువచ్చిన ట్లగుపించుట యనధికారిచేతనుల మోహింపఁ జేయుటకే. ఈ విషయమై యెప్పుడును స్పష్టముగా జ్ఞాపక ముంచికొనవలెను. క్షేమ మనఁగా ప్రాప్తమైన వస్తువును రక్షించికొనుట. విభవ మనఁగా సప్రాప్తములైన ఐశ్వర్యములను ప్రాప్తము లగున ట్లొనర్చికొనుట. 'యస్య అవతారః' అను పద్యము మొదలు 'కలిమలాపహం' అనువఱకును పరమాత్ముని మూల

రూపము. అవతారరూపములు వీనికిర్తి తప్పక తెలియవలెనని చెప్పి నట్లైనది. సకలకథాసార మగుటచే గృష్ణుని చరిత్రనే వర్ణింపవలెను. ఇంకొక దానిని గాదు. ఎందుకనఁగా వాసుదేవా! గోవిందా! మొదలైన వాని నామముల నుచ్చరించుటచేతనే సమస్త బంధములును నివృత్తియగును గదా! మఱి వాని చరిత్రశ్రవణము దాని మననము వీనితో బంధనివృత్తి యగుటలో సందేహము లేదు. కైముత్యన్యాయముతోఁ బరమాత్ముని చరిత్రశ్రవణ మావశ్యకమని చెప్పుచున్నాఁడు.

ఘోరాం=దుఃఖభూయిష్ఠమై భయంకరమైన, సంసృతిం=సంసారమును (జననమరణ పరంపరను), ఆపన్నః=పొందిన యధికారియైన చేతనుఁడు, వివశస్సన్=1. బహుకాల మభ్యసించిన మానసిక జపము గలవాఁడై, 2. విషయాసక్తి రహితుఁడై, యన్నామ=ఏ పరమాత్ముని పేరును, గృణన్=అర్థానుసంధాన పూర్వకముగా నుచ్చరించుచు, తతః=ఆ ఘోరమైన సంసారమునుండి, సద్యః=వెంటనే లేక జాగృతుఁడై, విముచ్యేత=విశిష్టమైన మోక్షము నందునో, యం ప్రతి=ఏ పరమాత్ముని నుండి, భవ=1. సంసారము, 2. అహంకారమునిచ్చి జీవులను బద్ధులనుగాఁ జేసెడు రుద్రుఁడు, స్వయం=తానే, బిభేతి=జంకునో, జంకి వెనుకకుఁ దగ్గునో యని యర్థము.

తాత్పర్యము: పరమాత్ముఁడు సంసారమునకు భయప్రదుఁడు. వాని నామోచ్చారణముతో సంసారనివృత్తి; హరి నామోచ్చారణ సంసారమోచక మనుటతో నే రోగమున కెవఁడు వైద్యుఁడో, వాని నామోచ్చారణము తద్రోగవిముక్తికర మని చెప్పినట్లైనది. సర్పభిషక్కైన గరుడుని నామోచ్చారణము సర్పభయము నుండి తొలఁగించినట్లు; వివశః అనఁగాఁ బరవశుఁడని చెప్పరాదు. పరవశుఁడైనవాఁడు నామోచ్చారణమే చేయలేఁడు. చేసినను, దానియందు మనస్సుండదు. వానికి దానితో మోక్షము సిద్ధింపదు. కనుక నిరంతర హరి స్మరణ రూపమైన మానసికాభ్యాస మొనర్పవలెను. దీనితో శరీరము

మొదలైన బాహ్యావిషయములయం దానక్తి తొలఁగిపోవును. బాహ్యా విషయానాసక్తుఁడై జప మొనర్పవలె ననియే 'వివశః' అను పదమున కర్థము. ఇట్టి మానసికాభ్యాసమునకుఁ గారణ మేది? దాని కార్య మేది? అనుటను ప్రమాణమైన ఈ శ్లోకము తెలియఁబఱచుచున్నది-

శారీరా ద్వాచికాభ్యాసో వాచికాన్మానసో భవేత్,
మానసా ద్వివశాన్ముక్తిః నాన్యథా ముక్తిరిష్యతే.

విష్ణు, వైష్ణవసేవారూపమైన శరీరాభ్యాసముతో నధ్యయనము వ్యాఖ్యానము మొదలైన వాచికాభ్యాస మేర్పడును. దీనిచేత నిరంతర హరిస్మరణానురూపమైన మానసికాభ్యాసము గల్గును. ఇది విషయ పరవశతను దప్పించును. దానినుండి మోక్షసిద్ధి. కానిచో మోక్షము రాదు.

సూత=సూతుఁడా, యత్పాద సంశ్రయాః=ఏ పరమాత్ముని పాదములే సంశ్రయముగా నున్న, ప్రశమాయనాః=శ్రేష్ఠమైన భగవన్నిష్ఠ కాశ్రయభూతులైన లేక భగవన్నిష్ఠనే యాశ్రయించిన, మునయః=మననశీలురైన అపరోక్షజ్ఞానులు, ఉపస్పృష్టాః=అధికారిచేతనులతో సేవింపఁబడినవారై, తాన్=అధికారిచేతనులకు, అనుసేవయా=స్నాన, ఆచమన, పానాదులైన సేవచేత, స్వర్ధునీవ=గంగవలె, సద్యః=తత్కాలమే, పునంతి=తత్త్వోపదేశాదులచేత పవిత్రులనుగా నొనర్తురు.

తాత్పర్యము: గంగానది గురూపదేశము ద్వారా, పవిత్రుల నొనర్చునను విషయమును దెలుపుటకే 'అను'అనెడి పదప్రయోగము. సాధువులు తత్కాలముననే విలంబనము లేకుండ పవిత్రుల నొనర్తురు. ఈ విషయము దెలుపుటకే 'సద్యః' అను పదము. ఎవని భక్తుల సేవయు శుద్ధికారకమో అట్టి భగవంతుని యశశ్శ్రవణము శుద్ధి కారకమని వేరు చెప్పవలెనా?

పుణ్యశ్లోకేడ్య కర్మణః=1. పవిత్రమైన కీర్తిగల బ్రహ్మాది చేతనులచేత స్తోత్రము చేయఁదగిన కంసవధ మొదలైన కార్యరూపమైన

చరిత్ర గలిగిన 2. పవిత్రమైన కీర్తిగలవాఁడు. స్తోత్రార్హములైన కార్యములు గలవాఁడును నైన, తస్య=ప్రసిద్ధుఁడైన, భగవతః=షడ్గుణైశ్వర్య సంపన్నుఁడైన శ్రీహరియొక్క, కలిమలాపహం=కలియుగ నిమిత్తముగా నేర్పడిన పాప మనెడు మలమును సంపూర్తిగాఁ బోఁగొట్టినట్టి, యశః=చరిత్ర మనెడు కీర్తిని, శుద్ధికామః=అంతఃకరణము నిర్మలము కావలెనను కోరు, కోవా=ఎవఁడు, న శృణుయాత్=మనశ్శుద్ధిని గోరు ప్రతియొకఁడును వినియేతీరునని యర్థము.

ఎవ్వని యవతార మెల్లభూతములకు
సుఖమును వృద్ధియు సొరిదిఁ జేయు
నెవ్వని శుభనామ మే ప్రొద్దు నుడువంగ
సంసారబంధంబు సమసిపోవు
నెవ్వని చరితంబు హృదయంబుఁ జేర్చిన
భయమంది మృత్యువు పరువువెట్టు
నెవ్వని పదనది నేపారు జలములు
సేవింప నైర్మల్యసిద్ధి గలుగుఁ

దపసు లెవ్వని పాదంబుఁ దగిలి శాంతి
తెలుగు గాంచిరి; వసుదేవ దేవకులకు
నెవ్వఁ డుదయించెఁ దత్కథలెల్ల వినఁగఁ
నిచ్చ పుట్టెడు నెఱిఁగింపు మిద్ధచరిత!

ఇద్ధచరిత!=ప్రశస్తమైన జీవనచరిత్రము గలవాఁడా!, ఎవ్వని యవతారము=ఏ భగవంతుని యవతారము, ఎల్లభూతములకున్=ఎల్ల ప్రాణులకును, సుఖమున్=సుఖమును, వృద్ధియున్=అభివృద్ధియును, సొరిదిన చేయున్=క్రమముగాఁ జేయునో, ఎవ్వని శుభనామము=ఎవని యొక్క శుభములను గలిగించెడు నామము, ఏ ప్రొద్దు=ఎల్లప్పుడు, నుడువంగన్=ఉచ్చరింపఁగా, సంసారబంధంబు=సంసార మను బంధ

మును, సమసిపోవున్_నాశమగుచున్నదో, ఎవ్వనిచరితమ్ము_ఎవని చరిత్రము, హృదయమ్ముఁ జేర్చినన్_మననముద్వారా హృదయమునకు హత్తించినచో, మృత్యువు భయమంది_మరణము భయపడి, పరువు వెట్టున్_పరుగెత్తునో, ఎవ్వని పదనదిన్_ఎవని పాదమనెడు నదిలో, ఎవని పాదజనితమైన నదియందు, ఏపారు జలములు_అతిశయించి, విజృంభించు జలములను, సేవింపన్_సేవింపఁగా, నైర్మల్యసిద్ధి_మనస్సు పవిత్రమగుట యను మహాసిద్ధి, కలుగున్_ఏర్పడునో, తపసులు_మహర్షులు, ఎవని పాదంబున్_ఏ భగవంతుని పాదములను, తగిలి_ఆశ్రయించి, శాంతితెఱఁగున్_శాంతితోఁ గూడిన పద్ధతిని, కాంచిరి_పొందిరో, వసుదేవ దేవకులకున్_దేవకీ వసుదేవులకు, ఎవ్వఁడుదయించెన్_ఎవఁడు ప్రభవించెనో, తత్కథ లెల్లన్ వినఁగన ఇచ్చ వుట్టెడున్_వాని చరిత్రవినుట కాకాంక్ష జనించినది, ఎఱిఁగింపుము_తెలియఁబలుకుము.

తాత్పర్యము: 'అవతారము'_అవతారము లనేకరీతులు. జ్ఞానావతారము, కర్మావతారము, ఆవేశావతారము, అంశావతారము మొదలైనవి. పరమాత్ముఁ డేరీతిగాఁ బ్రపంచమునను వచ్చినను, తద్దర్శనముతో సమస్తప్రాణులకును మేలుగల్గునని భావము. భూతము లన జీవులు. 'భూసత్తాయాం' అని ధాతువు. పలుమారు జన్మించుటయే స్వభావముగాఁ గలవి. మోక్షము నందవలెనను జ్ఞానముగూడ లేనివి. అవిగూడ పరమాత్ముని దర్శన స్పర్శనాదులచేత నుత్తమస్థితిని బొందును. స్థావర జంగమము లన్నియు నని భావము. 'సుఖమునున్_పాలనాయ' అని శ్రీధరుఁడు. ఐహికసుఖములను గూడ నిచ్చునని తాత్పర్యము. వృద్ధియున్_సమృద్ధి నని శ్రీధర వ్యాఖ్య. ఎవ్వనిశుభనామము_ఈ శుభనామము పోతన్న చేర్చినదే. ఏ ప్రొద్దున్_సర్వకాలముల యందునని తాత్పర్యము.

అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా,
యస్స్మరే త్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతర శ్శుచిః.

పుండరీకాక్షుని స్మరించువాఁడు నిత్యశుచి. అపవిత్రుఁడుగా జపించినను, పవిత్రుఁడుగా జపించినను సర్వావస్థలతో చెడి చెన్నుంగియైనను నిరంతర విష్ణునామ మననశీలుఁడు లోపలను బయటను శుచియే, సుఖియే. చైతన్యచరితామృతములో నీ శ్లోక మున్నది–

నో దీక్షాం న చ దక్షిణాం న చ పునశ్చర్యాం మనాగీక్షతే
మంత్రోఽయం రసనాస్పృశేవ ఫలతి శ్రీకృష్ణనామాత్మకః,

మంత్రజపమునకు దీక్ష లేదు. దక్షిణ నివ్వవలసినది లేదు. పురశ్చర్యా నియమము లేదు. కృష్ణనామము నాలుకను దాఁకినంతనే తత్కాలముననే ఫలించుచున్నది. సర్వమంగళకరమైన ఈ నామజప ప్రశస్తి మఱియు నిట్లున్నది–

వేపంతే దురితాని మోహమహిమా సమ్మోహమాలంబతే
సాతంకం న ఖరంజనీ కలయతి శ్రీచిత్రగుప్తః కృతీ,
సానందం మధుపర్క సంభృతివిధౌ వేధాః కరో త్యుద్యమం
వక్తుం నామ్ని తవేశ్వరాఖిలపతే! బ్రూమః కి మన్యం పరమ్.

భగవాన్! నీ నామోచ్చారణ మొనర్పుట కభిలాష జనించినంతనే సంపూర్ణపాపములు గంపించుచున్నవి. సంసారాసక్తిరూపమైన మోహము తానే మోహమంది పరువెత్తుచున్నది. సకల మానవుల పుణ్యపాపములను వ్రాయు లేఖకుఁడు యమునిచెంత చిత్రగుప్తుఁ డున్నాఁడు. నామోచ్చారణ నిష్ఠాపరుఁడైన వానిని నే నింతకు ముందు పాపులలోఁ జేర్చియుంటిని గదా! వాఁ డిప్పుడు నామ జప నిష్ఠుఁడైనాఁడే. నే నిప్పుడు వాని పేరెత్తి వేయవలెనని యాలోచించు చున్నాను. నామనిష్ఠుఁడైన పురుషుఁడు బ్రహ్మాండము భేదించికొని పరమపదము నందును. వానిని నేను దప్పక పూజింపవలెనని

బ్రహ్మదేవుఁడు మధుపర్క సంపాదన కుద్యమించును; స్వామీ! నీ నామమాహాత్మ్యము నింతకంటె నే నేమి చెప్పవలెను.

శ్రీమన్నామ ప్రభోస్తస్య శ్రీమూర్తే రప్యతి ప్రియమ్,
జగద్ధితం సుఖోపాస్యం సరసం తత్సమం నహి.

(బృహద్భాగవతామృతము 2.3.194)

భగవంతునకుఁ దన శ్రీవిగ్రహముపై కంటెను నామముపై నాదరము మెండు. ఈ లోకమునందు సమస్తహితములను సంపాదించును. సుఖోపాస్యమైనది. దీనివంటి సరసమైన సాధన మతి యొకటి లేదు. అందునను కలియుగమందు దీనిని మించిన యుపాయమే లేదు.

కృతే యద్ధ్యాయతో విష్ణుం త్రేతాయాం యజతో మఖైః,
ద్వాపరే పరిచర్యాయాం కలౌ తద్ధరికీర్తనాత్,

(భాగ. 12 స్కం. 3.52)

కృతయుగమందు ధ్యానముతోఁ దరించుచుండిరి. త్రేతయందు యజ్ఞములు తరణమార్గములు. ద్వాపరమందు విధిపూర్వకముగా సేవాదులు. కలియుగమందు భగవన్నామ సంకీర్తన మొకటే మోక్ష మొసఁగఁజాలును. ముక్తులు గూడ భగవన్నామమును స్మరించుచునే యుందురు.

ముక్తా అపి లీలయా విగ్రహం కృత్వా భగవంతం భజంతి.

ముక్తులు గూడ శరీరములు ధరించి భగవంతుని భజించుచుందురు. బృహన్నారదీయములో నీ శ్లోకము గలదు.

హరే ర్నామ హరే ర్నామ హరే ర్నామైవ కేవలమ్,
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా.

కలియుగమందు హరినామమే శరణ్యము. వేఱుసాధనముతో

ముక్తి శూన్యము. నామసంకీర్తనపరుఁడైన మానవుఁడు స్వయముగాఁ బవిత్రుఁడగుచున్నాఁడు. భూమిని గూడఁ బవిత్రమొనర్చును.

వాగ్గద్గదా ద్రవతే యస్య చిత్తం
హసత్య భీక్ష్ణం రుదతి క్వచిచ్చ,
విలజ్జ ఉద్గాయతి నృత్యతే చ
మద్భక్తియుక్తో భువనం పునాతి.

(11 స్కం, 14-24 శ్లో.)

భక్తుఁడు గద్గదవాక్కుతో నామస్మరణ మొనర్చును. భగవంతుని పేరనుకొన్నంత మాత్రమున వానిహృదయము ద్రవించును. ఊరకయే కన్నీరు గార్చును. ఒకసారి యూరకయే యేడ్చును. నిస్త్రపుఁడై గట్టిగా పాడును. నర్తించును. నా భక్తియుక్తుఁడు ప్రపంచమునే పవిత్ర మొనర్చును. ఇంతయేల? చైతన్యమహాప్రభువు ఒక్కతే యన్నాడు-

కలికాలే నామరూపే కృష్ణ అవతార్,
నామ హైతే హయం సర్వజగత నిస్తార్.

కలికాలమందు నామరూపములతో కృష్ణుని యవతారము. నామజపముతోఁ జరాచరప్రకృతియే తరించిపోవుచున్నది.

'నుడువంగన్'-ఉచ్చరించినచో; వైఖరీవాక్కుతో గట్టిగా నామస్మరణమొనర్చినను ఫలముగద్దు. అగ్నిని తెలిసి తాఁకినను దెలియక తాఁకినను దహించును గదా! సంసారబంధంబు=సంసారము. 'సృ గతౌ' అని ధాతువు. నిరంతరము పాఱుచుండుటయే దాని స్వభావము. ప్రారబ్ధము-ఆగామి-సంచితము అను స్వరూపములతో జీవునిఁ దనలో నిరంతరము కొట్టుకొనిపోవునట్లు చేయును. దీనితో జీవునకు విడివడని లంకె. హరినామ జపమాహాత్మ్యముతో దీనిలంకె తొలఁగి పోవును.

'యద్బిభేతి స్వయం భయం=భయ మపి స్వయమేవ బిభేతి' అని శ్రీధరుల వ్యాఖ్య. భయము గూడ భయపడునని తాత్పర్యము. వంశీధరుఁడు భయశబ్దమునకు 'మూలరూప భయ' మని వ్యాఖ్యా నించి మహాకాలుఁ డని నిర్ణయించెను.

**విశిష్టాద్వైతవ్యాఖ్య:**

సంసారరూపభయ మనెను. వల్లభాచార్యుఁడు కాలాధికారి భయుఁ డను నొకపురుషుఁ డని తన యభిప్రాయమును వెల్లడించెను. కనుక మృత్యురూపభయ మనుట పోతన్నగారిదైన వ్యాఖ్య; స్వర్ధున్యాపోనుసేవయా అనుదానికి గంగాజలమునకంటెను సత్పురుషుల సేవ గొప్పదనియే యందఱు వ్యాఖ్యాతలును వివరించిరి. వీరరాఘవ మొక్కఁడే దృష్టాంత దార్ష్టాంతిక భావ మనెను. దానిని పోతన్నగారు చూచియుందు రనుటకు వీలులేదు. కనుక సీసమునందలి నాల్గవ పాదము వారి యభిప్రాయమే. 'తపసులు తాపసులు' రెండు రూపములను వారే ప్రయోగించిరి. ఎవ్వనిపాదంబు దగిలి, 'యత్పాద సంశ్రయాః' అనుటకుఁ దెనుఁగు. 'తగిలి' యనుట సంశ్రయణము నకుఁ దెనుఁగు. 'ప్రశమాయనాః' 'శాంతితెఱఁగు గాంచిరి'. వసుదేవదేవకులకున్=సంబంధసామాన్యషష్ఠి. దేవకీవసుదేవులు కృష్ణజన్మ యందుఁ గేవల నిమిత్తమాత్రులే యని భావము.

భూషణములు వాణికి నఘ
పేషణములు మృత్యు చిత్త భీషణములు హృ
త్తోషణములు గల్యాణ వి
శేషణములు హరిగుణోపచిత భాషణముల్.

హరిగుణ=వాసుదేవుని గుణములచేత, ఉపచిత=కూడుకొన్న లేక వ్యాపించిన, భాషణముల్=మాటలు, వాణికిన్, భూషణములు= వాగ్దేవికి సొమ్ములవంటివి. అఘపేషణములు=పాపములను బిండిగా

రాచునట్టివి. మృత్యుచిత్త భీషణములు:—మృత్యుదేవి మనస్సునకు భయమును గల్గించునవి. హృత్తోషణములు—మనస్సున కానంద కారణములు.

'స్వాంతం హృన్మానసం మనః' అని అమరము. కల్యాణవిశేషణములు=మంగళముయొక్క విశేషములు లేక మంగళమునకే విశేషణభూతమైనవి. అనఁగాఁ గల్యాణమును ఇతరమునుండి వ్యావృత్తమొనర్చుచు దానియందలి గుణవిశేషమును దెలుపునవి.

నీలోఘటః అన్నప్పుడు నీలత్వము రక్తఘటమునుండి నీల ఘటమునకు వ్యావృత్తి యొనర్చుచున్నది. ఘటమునందలి గుణ విశేషమునుగూడ దెల్పుచున్నది. అట్లే కల్యాణమునకుఁ జెప్పిన విశేషణము లశివమునుండి వ్యావృత్త మొనర్చి కల్యాణములోని గుణ విశేషములను చెప్పుచున్నవి. 'కల్యాణం మంగళం శుభం'-అమరము. హరిగుణములచేఁ గూడికొన్నమాటలు. పాపములను పిండిగా నొనర్చును. మృత్యువునకు భయముగల్గించును. మనస్సున కాహ్లాద మొనర్చును. శుభములకే విశేషణము లగును.

భూషణములు వాణికిన్—సరస్వతీదేవికి యలంకార ప్రాయములు. ఈ సందర్భమును తులసీదాసు అవధీభాషలోఁ జక్కగా నిబంధించెను. భాషాంతరమని దానినిఁ జెప్పకపోరాదు గదా!

భగతి హేతుబిధి భవన బిహాయీ
సుమిరిత సారద ఆవతిధాయీ
రామచరిత సరబిను అన్హవాయే
సో శ్రమ జాయిన కోటి ఉపాయే.

కవికోవిద అసు హృదయ విచారీ
గావహి హరిజస కలిమల హారీ
కీన్హే ప్రాకృత జనగుణ గానా
సిరధుని గిరాలగత పఛతానా.

హృదయసింధు మతి సీపిసమానా
స్వాతీసారద కహహి సుజానా
జౌంబరసయి బరచారి విచారూ
హోహికవిత ముకుతామని చారూ.

'భక్తికారణముగా సత్యలోకమును వదలి స్మరించినంతనే సరస్వతీదేవి పరుగెత్తుకొని వచ్చును. అయాసము దీర వలెనన్నచో నామె రామచరితమానసమను సరస్సునం దవగాహన మొనర్పవలెను. దానితోఁ దప్ప కోటియుపాయములతో నైనను ఆ బడలిక దీరదు. కవులు, పండితులు ఈ సత్యమును దెలిసి కలిమలాపహమైన హరిచరిత్రను గాన మొనర్తురు. ప్రాకృతజనులను వర్ణించినచో నే నెందుకిట్లు పరువెత్తి వచ్చితి నని యామె పశ్చాత్తాపపడును. హృదయమే సముద్రము. బుద్ధి ముత్యపుచిప్ప. సరస్వతి స్వాతీనక్షత్రము. శ్రేష్ఠములైన విచారముల నా సమయమున వర్ణించినఁ గవిత్వ మనెడు ముక్తామణులు బయలుదేరును. భగవచ్చరిత్రముతోఁ బాపములు గడగడ వడఁకును. పూర్వపద్యమందు 'భయమంది మృత్యువు పరువువెట్టు' నన్నాఁడు. మృత్యుచిత్తభీషణములని మఱియు ననుచున్నాఁడు. మఱి భక్తుఁడు మరణింపఁడా? వాఁడు శాశ్వతుఁడైనచోఁ బోతనాదు లెట్లు మరణించిరి? కనుక మృత్యువు పరువువెట్టు ననఁగా వాఁడు చావఁడని యర్థము గాదు. సామాన్యులవలె మరణింపఁడని భావము. 'నేను భగవన్నియమనముతో స్థూలదేహమును వదలుచున్నాను. అతని సాన్నిధ్యమున కేగెదను. అర్చిరాదిమార్గమున నా త్రోవ అనెడు జ్ఞానము వానికుండును. అప్పుడు మరణభయ మావంతయు నుండదు. లేక యింతకన్నను గొప్పవంశమున జన్మింపఁబోదు ననెడు ధైర్యమైన నుండును. అందుచే సామాన్యులవలె మృత్యుభయముతో మరణింపఁడని యర్థము. సామాన్యుఁడు పాపదూషితుఁడు, భక్తిరహితుఁడు. మరణముతో స్థూలదేహమే పోవుచున్న దన్న విశ్వాసము పూర్ణముగా వానికిలేదు. 'రాఁబోవు జన్మ మేమి వచ్చునో పశుపక్ష్యాదులందు

జన్మింతునేమో! ఆ సంకటము లెట్లో?' అని భయపడుచు భయ పడుచు పోవును. తుకారాముఁడు ధైర్యముగా నిట్లనెను.

'స్వామీ! నే నెన్ని జన్మల నుండియో నీ యానతిని తల దాల్చి భక్తిప్రచార మొనర్చుచుఁ బ్రపంచమునకు వచ్చిపోవుచు న్నాను. ఇంక వేయిజన్మ లిచ్చినను నేను బాధపడను'.

కులశేఖరాళ్వారు గూడ-

**దివి వా భువి వా మమాస్తు వాసో**
**నరకే వా నరకాంతక! ప్రకామమ్,**
**అవధీరిత శారదారవిందౌ**
**చరణౌ తే మరణేఽపి చింతయామి.**

అన్నాఁడు. ఇందులో నొక చమత్కార మున్నది. 'నరకే వా' అనుచు 'నరకాంతక' అని సంబోధించు చున్నాఁడు. నరకాంతక! శ్లిష్టము. నరకమందైనను నే నుందు ననుచు 'నీవు నరకాంతకుఁడవు. నాకు నరక మెట్లివ్వగల'వని ప్రశ్నించుచున్నాఁడు. ప్రాణప్రయాణ సమయము సామాన్యునకు భయంకరమైనది. కఫ వాత పిత్తములు కంఠము నావరించును. అందుకే మొదటినుండియు జపసాధన మభ్యాస మొనర్చికొనవలెను. ఈ భావముల నన్నింటిని మనస్సులోఁ బెట్టుకొనియే కవికులగురువైన కాళిదాసు ధ్వనిగంభీరముగా-విశాల ముగా ని ట్లనుచున్నాఁడు-

**మరణం ప్రకృతి శ్శరీరిణాం**
**వికృతిర్జీవిత ముచ్యతే బుధైః.**

నాయనా! మరణమే జీవుని ప్రకృతి. అనఁగా జన్మాదులు లేకుండుట స్వస్వరూపస్థితి లేక వైకుంఠవాసము. పండితులు జీవితమే వికృతి యందురు. భగవంతుని మఱచియే ప్రపంచమునకు మాన వుఁడై వచ్చుట. స్వస్వరూపము నుండి పతితుఁడైన మానవుఁడు

మాయావచ్ఛిన్నుఁ డగును. 'హృత్తోషణములు'- మనసున కానందము కల్గించునవి. హరికథలు వినుకొలఁదియు మనసునకు సంతోషము గలుగును. భగవంతుని స్వరూపమే యట్టిది. అందుకే యొకానొక కవి సరస చమత్కారముగా నిట్లు పలికెను-

శక్యం యన్నవిశేషతో నిగదితుం ప్రేమ్ణైవయచ్చింతితం
మృద్వంగీ వదనేందు మండలమివ స్వాంతే విధత్తే ముదమ్,
యన్ముగ్ధా నయనాంత చేష్టిత మివాఽభ్యాసేఽపినో లక్షితం
తత్తేజో వినయా దమంద హృదయానందాయ వందామహే.

అభ్యాసేఽపి=సన్నిధానమం దున్నను అని యర్థము. కల్యాణ విశేషణములు=అనేక కల్యాణములను గలిగించునవి. ఐహికాముష్మిక ఫలము నిచ్చునవి. కనుక నొక్కొక్కకల్యాణ మొక్కొక్క విశేషణముతోఁ గూడినది.

కలిదోష నివారకమై
యలఘు యశుల్ వొగడునట్టి హరికథనము ని
ర్మలగతి గోరెడు పురుషుఁడు
వెలయఁగ నెవ్వాఁడు దగిలి వినఁడు? మహాత్మా!

కలిదోషనివారకమై=కలిదోషములైన పాపములను నివారించునదై, అలఘు యశుల్=గొప్ప కీర్తిగలిగిన సత్పురుషులు, పొగడునట్టి హరికథనము=స్తుతించునట్టి హరికి సంబంధించిన చరిత్ర, నిర్మలగతిఁ గోరెడు పురుషుఁడు=మనశ్శుద్ధి నిచ్చించెడు మానవుఁడు, ఎవ్వాఁడు=ఎవ్వఁడు, తవిలి వినఁడు=ఆసక్తి యమితమై విరామము లేక వినఁడు?

తాత్పర్యము: భగవచ్చరిత్ర కలిమలాపహమైనది. పుణ్యశ్లోకులైన సత్పురుషులు వొగడునట్టి శ్రీహరి కథలను శుద్ధికాముఁడైన యెవ్వాఁడు ఏకాగ్రచిత్తముతో వినఁడు? తప్పక విను నన్నమాట.

హరికథా శ్రవణమువలన సమస్త కలిదోషములు నివర్తించును. తద్ధ్యానము తచ్ఛ్రవణము సమస్తపాపములకు గొడ్డలిపెట్టు. శ్రీవేదాంతదేశికు లిట్లనుచున్నారు-

రమాదయిత ! రంగభూరమణ ! కృష్ణ ! విష్ణో ! హరే !
త్రివిక్రమ ! జనార్దన ! త్రియుగనాథ ! నారాయణ !
ఇతీవ శుభదాని యః పఠతి నామధేయాని తే
న తస్య యమవశ్యతా నరకపాతభీతిః కుతః ?

పాపములతోనే నరకప్రాప్తి. అలఘు యశుల్=పుణ్యశ్లోకులనుట్లుకుఁ దెన్గు. పవిత్రమైన కీర్తి గలవారు. భక్తు లార్జించికొను కీర్తిలో మాలిన్య ముండదు. వారికీర్తి గంగానది. అందులోఁ జేరిన వన్నియు గంగయే. అందుకే వైష్ణవసిద్ధాంతములో భగవదపచారమున కన్నను భాగవతాపచారము గొప్పది. తనయం దొనర్చిన యపచారమును భగవంతుఁడు క్షమించును. భాగవతులయం దొనర్చిన దోషమును క్షమింపఁడు. అంబరీషోపాఖ్యాన మీ విషయమునే దెలుపును.

శ్రీహరి ప్రపంచమం దవతరించి రావణాదులను హతమార్చెను. కేవల సంకల్ప మాత్రముచేతనే వారిని సంహరింపవచ్చును గదా ! వారు పలువిధములైన భాగవతాపచారము లొనర్చిరి. వారిని సంకల్పమాత్రమునఁ జంపినఁ జాలదు. స్వయముగాఁ దానే యవతరించి చేతులార చిత్రవధ చేయవలెనని భూమియం దవతరించెను.

శ్రీవచనభూషణములో నంజియ్యరు వ్యాఖ్య-

యా ప్రీతిర్మయి సంవృత్తా మద్భక్తేషు సదాఽస్తు తే,
అవమానక్రియా తేషాం సంహరత్యఖిలం శుభమ్.

అని భగవద్వాక్యము.

భాగవతాపచారము లేవి? కొన్ని యివి-

**అదిలే యొన్ఱు అవర్‌గళ్ పక్కల్ జన్మనిరూపణమ్,**
**ఇదుదాన్ అర్చావతారత్తిల్ ఉపాదాన స్మృతియిలుం కొట్టిల్ ప్రారం.**

వారి జన్మనిరూపణము, జ్ఞాననిరూణము, ఆచారనిరూపణము, దేహస్థితి, బంధువాసస్థాన నిరూపణములు మొదలైనవి. హీనకుల మందుఁ బుట్టిన భాగవతులను, భగవత్సంబంధముచే వచ్చిన గౌర వమునుజూడక జన్మమును మాత్రమే చూచి, యలక్ష్యము చేయుట మహాపచారము. ఇది అర్చావతారమందు ఉపాదాన విచారము కంటెను గొప్పదోషము. అర్చావతారమం దుపాదాన కారణనిరూపణ మనఁగా నీ విగ్రహ మే లోహముతోఁ జేసిరి? ఏ శిలాకృతము? ఇత్యాదులు.

**అర్చావతారోపాదాన వైష్ణవోత్పత్తి చింతనమ్,**
**మాతృయోని పరీక్షాయాః తుల్య మాహు ర్మనీషిణః.**
**త్రిశకుంవై పోప్పలే కర్మచండాలనాయ్**
**మార్పిలిట్ట యజ్ఞోపవీతం తానే**
**వారాయ్ విడుం.**

ఈయపచార మేర్పడిన తత్క్షణము గర్మచండాలత్వము వచ్చును. యజ్ఞోపవీతము వానికి నిరుపయోగ మగుచున్నది. జన్మచండాలున కీ జన్మమందో వేఱుదానియందో భగవత్కటాక్షమును బొంది భాగ వతుఁడగు యోగ్యత గలదు. భాగవతాపచారరూప కర్మచండాలున కా యర్హత లేదు. ఎందు కనఁగా వాఁడు ఆరూఢపతితుఁడు. ఒక సారి భాగవతుఁడైయుండి భగవదపచారముతోఁ గ్రిందఁబడినవాఁడు. అందుచే వానికి నిష్కృతి లేదు. కనుక ముక్తికి భాగవతసంబంధమే చాలును. వినాశనమునకు భాగవతాపచారమే చాలును. 'తగిలి వినఁడు'-తీవ్రమైన యాకాంక్షతో వినవలెను. భక్తిశ్రద్ధలతో వినవలె నని తాత్పర్యము.

యస్య కర్మాణ్యుదారాణి పరిగీతాని సూరిభిః. 17
బ్రూహి నః శ్రద్ధధానానాం లీలయాదధతః కలాః,

అథాఽఖ్యాహి హరేర్ధీమన్ అవతారకథాః శుభాః. 18
లీలావిదధతస్స్వైర మీశ్వరస్యాత్మ మాయయా,

వయం తు న వితృప్యామ ఉత్తమశ్లోక విక్రమే. 19
యచ్ఛృణ్వతాం రసజ్ఞానాం స్వాదుస్వాదు పదేపదే,

కృతవాన్ కిల వీర్యాణి రామేణ సహకేశవః. 20
అతిమర్త్యాని భగవాన్ గూఢః కపటమానుషః,

లీలయా=లీలచేత, కలాః=కళలను, దధతః=ధరించిన, తస్య=వానియొక్క, ఉదారాణి=గొప్పవైనట్టియు, సూరిభిః=విద్వాంసులచేత, పరిగీతాని=ఆదరపూర్వకముగాఁ గీర్తింపఁబడినవియు నైన, కర్మాణి=కార్యములను, శ్రద్ధధానానాం=శ్రద్ధావంతులైన, నః=మాకు, బ్రూహి=చెప్పుము.

స్వేచ్ఛగా-బ్రహ్మ, శివుఁడు మొదలైన మూర్తులను ధరించెడు భగవంతునియొక్క జీవానుగ్రహసమర్థములైన సృష్ట్యాది వ్యాపారములనుగూర్చి వినుటకు శ్రద్ధధానులమైన మాకుఁ దెలుపుము. సర్గాది లీలలను దెలుపవలెనని మూఁడవప్రశ్న. 17

అథ=అనంతరము, స్వైరం=స్వేచ్ఛగా, ఆత్మమాయయా=తన మాయా శక్తిచేత, లీలాః=లీలలను, విదధతః=చేయుచున్న, ఈశ్వరస్య=ఈశ్వరుఁడైన, హరేః=హరియొక్క, శుభాః=మంగళకరములైన, అవతారకథాః=అవతారకథలను, ధీమన్=బుద్ధిశాలియైన సూతుఁడా! ఆఖ్యాహి=చెప్పుము.

ఓ బుద్ధిమంతుఁడవైన సూతా! జీవుల ననుగ్రహించుటకై, స్వేచ్ఛగా మాయాశక్తితోఁ గూడి సృష్టి, స్థితి, సంహారము, తిరోధానము, అనుగ్రహ మనెడు నైదు విధములైన లీలలను జేయుచున్న సర్వేశ్వరుఁడు శ్రీహరియొక్క మంగళకరములైన మత్స్యాద్యవతార కథలను గూడ వివరింపవలెను.

**యత్=దేనిని, శృణ్వతాం=వినుచున్న, రసజ్ఞానాం=రసజ్ఞులైన వారికి, పదేపదే=ప్రతిపదమునందును, స్వాదుస్వాదు=పై పైని మధురముగా నుండునో, ఉత్తమశ్లోక విక్రమే=ఉత్తమశ్లోకుఁడైన శ్రీహరి విక్రమమునందు, వయంతు=మేము, న వితృప్యామః=తృప్తిఁబొందము.**

భగవంతుని పరాక్రమాది వైభవములను ప్రకటీకరించు కథలను వినుచు, వానిలోని రసమును గ్రహించిన వారికి పదపదమునందు నానంద మేర్పడుచున్నది. అటువంటి యా వీర్యాతిశయములను ఎంత విన్నను, మాకు విన్నది చాలు ననిపించుటలేదు.

**కపటమానుషః=కపటమనుష్యుఁడును, గూఢః=అందఱకును సులభముగాఁ దెలిసికొనరాని, భగవాన్=మహిమోపేతుఁడైన, కేశవః=శ్రీకృష్ణుఁడు, రామేణ సహ=బలరామునితోఁ గూడి, అతిమర్త్యాని=మానవాతీతములైన, వీర్యాణి=పరాక్రమములను, కృతవాన్ కిల=చేసినవాఁ డయ్యెను గదా।**

మానవుఁ డనెడు ఛద్మముతో సంచరించుచున్నవాఁడును, ఎవరికిని గ్రహింప నశక్యమై సకల భూత హృదయాంతరాళములలో గూఢముగ వసించువాఁడును నగు మహామహిమోపేతుఁడైన శ్రీకృష్ణుఁడు బలరామునిఁ గూడి, యతి మానుషపరాక్రమ ప్రవృత్తులను గనుపఱచెను గదా!

శ్రీధరవ్యాఖ్య : ఉదారాణి=గొప్పవైన, విశ్వసృష్టి మొదలైన కార్యములు, సూరిభిః=నారదాదులచేత, కలాః=బ్రహ్మ రుద్రాది మూర్తులను, అవతారకథాః=లోకస్థిత్యర్థమై ఆ యా యవసరములందొనర్చిన మత్స్యాద్యవతారములు, వానికి సంబంధించిన కథలు. కృష్ణావతార ప్రయోజన ప్రశ్నచేతనే, యాతని చరిత్రను వర్ణింపవలెనను విషయము గూడ వచించినట్లే యైనది. వారి కా కథయందత్యంత ఔత్సుక్యము. అందుచే నా చరిత్రను వినుటయం దాసక్తిని గనఁబఱచుచున్నవారై, తమయొక్క తృప్త్యభావమును దెలుపుచున్నారు. యోగయాగాదులందు మాకుఁ దృప్తి యేర్పడినది. కాని

కృష్ణకథాశ్రవణమందు తృప్తి యేర్పడలే దనుచున్నారు. ఉత్తమశ్లోకః ఉద్గచ్ఛతి తమః యస్మాత్సః ఉత్తమః, ఉత్తమః శ్లోకః యస్య సః ఉత్తమశ్లోకః—ఎవరిదర్శన శ్రవణాదులచేఁ దమోగుణము తరలిపోవునో వా రుత్తములు. అట్టిది యుత్తమము. ఉత్తమమైన కీర్తిగలవా రుత్తమ శ్లోకులు. వయం తు_అనుచోట 'తు' శబ్దము వారితృప్తి మెండుగా నున్నదని సూచించుచున్నది కృష్ణకథాశ్రవణముతో నితరులకుఁదృప్తి యేర్పడు గాక! మాకు లేదని భావము. సాధారణముగాఁ దృప్తి మూఁడురీతుల నేర్పడును. ఉదరాదిభరణ మొకటి. అనఁగా నాహారా దులచేఁ గడుపునిండినట్లు. రెండు: వచించు దాని యందలి రసాను భూతి దెలియకపోవుట. మూఁడు: చెప్పెడి దానిలో మాధుర్యము తఱుగుట. ఈ మూఁడును ఉత్తమశ్లోక విషయమునందు లేవు. శ్రోత్ర మాకాశ స్వరూపము. అందుచే నది నిండుట యనున దేర్పడదు. రసానుభూతిఁ దెలియకున్నచోఁ జెప్పెడి విషయము గాఁబట్టకపో వచ్చును. దాని కుత్తరమే 'రసజ్ఞానాం' అనుట. మేము రసజ్ఞులము. నీ చెప్పు విషయము లన్నియు గ్రహించి యానందింపఁ గలవారము. వచించెడి విషయమందు మాధుర్యము తగ్గుట, యతృప్తికి మఱియొక కారణము. ప్రతిపదమందును కృష్ణకథ-మాధుర్యముల కన్నను మధురమైనది. 'అతి మర్త్యాణి' మనుష్యుల కశక్యములైన పనులను జేయుట_గోవర్ధనోద్ధారణాదులు.

**వంశీధరుఁడు:**

కృష్ణచరిత్రములను ముఖ్యముగా వచింపవలెను. తక్కిన వానుషంగికముగా; ఈ విషయమును 'అథ' అను పదము దెలుపు చున్నది. హరేః_ప్రకరణబలముతో దీనికి శ్రీకృష్ణుఁడనియే యర్థము. అవతారాః = పురుషావతారములు, గుణావతారములు, లీలావతార ములు_మూఁడు రీతులు. కొన్ని సృష్ట్యాది కర్మరూపములు. మఱి కొన్ని భూభారహరణాది రూపములు.

**ఆత్మమాయా తదిచ్ఛాస్యాత్ జడమాయా జడాత్మికా.** (మహాసంహిత)

నిజేచ్ఛయా=తన ఇచ్ఛచేతనని భావము. శుభాః=వినువారికి సర్వవిధములైన మంగళములను గల్గించునవి. విదధతః=ధరించు చున్న ఇది వర్తమానార్థకము. కనుక, ఆయన లీలలు నిత్యములని తాత్పర్యము.

శ్రీకృష్ణుఁడు సర్వప్రధానుఁడు. అతని మహైశ్వర్య మాధుర్యము లనన్యాదృశములు. గోలోకధారియైన కృష్ణపరమాత్మునికంటె వైకుంఠనాథుఁడు తక్కువ శక్తిగలవాఁడు. అతని యంశములే మత్స్యకూర్మాదులు. ఎవరియందు ఒకానొక శక్తిమాత్రమే సంక్రమించునో అవి యావేశావతారములు. పృథు నారదాదులవంటివి.

ఈ యవతారములు ముత్తెఱఁగు లంటిమి. కారణోదశాయియైన సంకర్షణాంశ గలిగిన పురుషుఁడు ప్రథమావతారము; ఇతఁడు మహత్తత్త్వమును సృష్టించిన వాఁడు; ప్రకృత్యంతర్యామి; గర్భోదశాయి రెండవవాఁడు. ఇతనిది ప్రద్యుమ్నాంశము; సమష్టివిరాడంతర్యామి; మూఁడవవాఁడు క్షీరోదశాయి; ఇతఁ డనిరుద్ధాంశము. వ్యష్టివిరాడంతర్యామి; ఈ మూఁడును పురుషావతారములు; సత్త్వగుణ ప్రధానుఁడైన పురుషుఁడు పాలనకర్త; ఇతఁడు క్షీరోదశాయియే; రజోగుణప్రధానుఁడైన బ్రహ్మ సృష్టికర్త; గర్భోదశాయి నాభిపంకజము నుండి యుద్భవించినవాఁడు; ఒకానొక కల్పమునందు నాభిపద్మ సంభవుఁడైనబ్రహ్మతో సమానమైన పుణ్యమును గావించిన జీవుఁడును బ్రహ్మ గావచ్చును; అప్పుడు అతనియం దీశ్వరునియొక్క సృష్టిశక్తి సంచారమగును; తదావేశముతో నది యావేశావతారము. రజోగుణ సంబంధముతో గుణావతారత్వము గూడ గావచ్చును. విష్ణువుతో నాతనికి సామ్య మెట్లేర్పడుచున్నది? ఒకానొక కల్పమందు విష్ణువే బ్రహ్మ యగుటయుఁ గద్దు. ఒక కల్పములో యజ్ఞావతారమే యింద్రు

డయ్యెనని భాగవతమే చెప్పుచున్నది. పాతాళాది సత్యలోకాంతమైన స్థూల సమష్టివిరాట్ స్వరూపము, ప్రాకృతమైన బ్రహ్మశరీరమే. ఆ బ్రహ్మ పరమపరిశుద్ధుఁడైన జీవుఁడు; హిరణ్యగర్భుఁడు. ఆతనియందు అంతర్యామిగా నున్న గర్భోదశాయి. తమోగుణముతో రుద్రుఁడు; సంహారకర్త. ఒకప్పుడు విష్ణువే సదాశివుఁడు; బ్రహ్మ శివునికంటె నధికుఁడు గాఁడు. సదాశివుఁడు సగుణుఁడుగా భాసించినను నతనికి విష్ణువుతో సామ్య మున్నది; ఇవి యన్నియు గుణావతారములు, లీలావతారములు. సనకాదులు, నారద, వారాహ, మత్స్య, యజ్ఞ, నరనారాయణులు, కపిల, దత్త, హయగ్రీవ, హంస, పృశ్నిగర్భులు, ఋషభ, పృథు, నృసింహులు, కూర్మ, ధన్వంతరి, మోహినీ, వామన పరశురామ, రఘునాథ, వ్యాస, బలభద్ర, బుద్ధ, కల్క్యాదులు- వీరు ప్రతికల్పమందును బ్రాదుర్భవింతురు. మన్వంతరావతారములు మరికొన్ని. యజ్ఞ, విభు, సత్యసేన, హరి, వైకుంఠులు, జిత, వామన సార్వభౌమ, విష్వక్సేన, ఋషభ, ధర్మసేతు, సుదామ, యోగేశ్వర, బృహద్భానులు యుగావతారములు. శుక్ల, రక్త, పీత, కృష్ణ వర్ణములు వీనిలోఁ గొన్ని యావేశములు; కొన్ని ప్రభావములు; కొన్ని వైభవములు; మరికొన్ని పరావస్థలు. సనాదులు, నారద, హరి, విష్ణు, పృథు ప్రభృతు లావేశములు; వీనికంటెను శక్తి గలవి ప్రభావములు; మోహినీ, ధన్వంతరి, ఋషభవ్యాస, దత్త, శుకాదులు; వీనికన్న నధికములు వైభవములు, మత్స్య, కూర్మ, నరనారాయణ, వరాహ హయగ్రీవ, పృశ్నిగర్భ, బలదేవయజ్ఞాదులు; ఏత దధికము పరావస్థ; వీనిలోఁ గూడ నుత్తరోత్తర శ్రేష్ఠములు నృసింహ రామకృష్ణావతారములు. కృష్ణుఁడే స్వయముగా భగవంతుఁడు. అతనికన్న నధికుఁడు లేఁడు. ఇతని వాసస్థానములు వ్రజ, మధుపుర, ద్వారవతీ, గోలోకములు; వీనిలోఁ బూర్వపూర్వములు ముఖ్యములు. సపరి

వారుఁడై, బలదేవసహితుఁడై, వ్రజనివాసియైన కృష్ణుఁడు పూర్ణతముఁడు; మథురలోఁ బూర్ణతరుఁడు. ద్వారకలోఁ బ్రద్యుమ్న, అనిరుద్ధ సహితుఁడై, సపరివారుఁడై పూర్ణుఁడు; గోలోకమందుఁ బూర్ణకల్పుఁడు. కాని బృందావనమం దేలీలలు జరగెనో అట్టివే గోలోకమందును నిరంతరము జరగుచుండును. అందుచే నక్కడి కృష్ణుఁడు పూర్ణతమసజాతీయుఁడు. ఈ కృష్ణులలోఁ బూర్వపూర్వులందు మాధుర్యాధిక్యము. ఐశ్వర్యప్రకటనమందును దారతమ్య మున్నది. ఉత్తరోత్తరమునందు మాధుర్యహాని. విరజానదీజలములం దనేకకోటి బ్రహ్మాండము లుండును. మహావిష్ణు రోమకూపములం దెన్నియో యన్ని. ఈ విరజానది మహావైకుంఠ లోకమునకు పరిఘ. దానికిఁ బైననే మహావైకుంఠము. తదూర్ధ్వభాగమందు గోలోకము. దానియందు శ్రీకృష్ణుఁడు దేవలీలలతో సపరివారుఁడై వర్తించును. అతని విలాసమే మహావైకుంఠవాసుఁడు. ఇతఁడే పరవ్యోమనాథుఁడు. అతని విలాసము వాసుదేవుఁడు; తద్విలాసము పరమాత్మ. గోలోకనాథుని యొక్క ద్వితీయ వ్యూహము బలదేవుఁడు, తద్విలాసము మహావైకుంఠమందున్న సంకర్షణుఁడు. అతని యంశమే కారణార్ణవశాయి; గర్భోదశాయి తద్విలాసము. ఇతఁడు బ్రహ్మాండాంతర్యామి, ప్రద్యుమ్నాంశము. క్షీరోదశాయి తద్విలాసము అనిరుద్ధాంశము. అతనివిలాసమే అంతర్యామి; మత్స్యాద్యవతారములు గర్భోదశాయి విలాసములు. ద్వారకా, మథురా, బృందావనాఖ్యములైన ధామత్రయము నందు శ్రీకృష్ణుఁడు పరలీలలొనర్చును. ఐశ్వర్యాధిక్యతాతారతమ్య మున్నది. బృందావన కృష్ణుఁడు సర్వోత్తముఁడు. ఈ లీల రెండురీతులు. ప్రకటము, అప్రకటము, బాల్య, పౌగండాది విలాసములు సపరివారముగా, నిత్యమును గోలోకమం దప్రకట లీలగా జరుగుచుండును. అవి తత్కాలమందే తత్సదృశలీలలతో బృందావనమందుఁ బ్రకటింపఁబడినచోఁ బ్రకట లీలలగును. అనంత బ్రహ్మాండము లున్నవి; కాని

బృందావన మధురా ద్వారావతులు మాత్రము బ్రహ్మాండకోటిమధ్య గతమైనవి- భారతభూమియందే యున్నవి; వీనినే తత్తద్బ్రహ్మాండ నివాసులైన జనులు చూతురు; ఈ ప్రకటలీలలో బాల్యాది లీలలు నిత్యములు. ఇవి సచ్చిదానంద రూపములు. మౌశల మహిషీహర ణాది లీలలు కృత్రిమములు; ప్రకటలీలయందును బృందావనము లోను మణిమయభూములు గల్పవృక్షములు మున్నగునవి కృష్ణ పరివారమునకుఁ గన్పింపవు; అతని ఇచ్ఛతో నొక్కొక్కనికి మాత్రమే నయనవిషయ మగును; ప్రకటలీలలు ముగిసిన తర్వాత కృష్ణభక్తులు భజనాధిక్యపరవశులైనపుడు వారి కత్యుత్కంఠ జనించినపుడు కాదా చిత్కముగా నగపడును. అదియును వారి వాసనాధిక్యతను బట్టి, భగవదిచ్ఛనుబట్టి. కనుక నన్ని రూపములకంటెను వ్రజేంద్రనందన రూపము చాలముఖ్యమైనది. అన్ని ధామములకంటెను గోలోకము పరమధామము. అక్కడ గూడ-

చతుర్ధా మాధురీ తస్య వ్రజ ఏవ విరాజతే,
ఐశ్వర్య క్రీడయో ర్వేణో _స్తథా శ్రీవిగ్రహస్య చ.

భాగవతులు ఈ క్రిందివారు-

మార్కండే యోంబరీషశ్చ వసు ర్వ్యాసో విభీషణః,
పుండరీకో బలి శ్శంభుః ప్రహ్లాదో విదురోద్ధవౌ.
దాల్భ్యః పరాశరో భీష్మో నారదాద్యాశ్చ వైష్ణవాః,

వీరిలోఁ బ్రహ్లాదుఁడు శ్రేష్ఠుఁడు. అతనికంటె పాండవులు, వారికంటె గొందరు యాదవులు, వారికంటె యుద్ధవుఁడు, అతని కంటె వ్రజవనితలు శ్రేష్ఠమైనవారు. అందరికంటెను రాధ సర్వోత్తము రాలు.

త్రైలోక్యే పృథివీధన్యా యత్ర బృందావనం వనమ్,
యత్ర రాధా సఖీవర్గః తత్ర రాధాప్రియా మమ.

అని భగవద్వాక్యము, శ్రోత్రమూకాశరూపము, 'కర్ణశష్కుళ్య వచ్ఛిన్నం నభశ్శ్రోత్రం' అని తల్లక్షణము. విక్రమము అమూర్తము. మూర్తద్రవ్యముగాదు. అందుచేఁ జెవులు దానిచేనిండుట సంభవము. కపట మానవః=కైతవమనుష్యుడు. అందుచే గూఢుఁడు. కాని ఆ పురుషుఁడే భగవంతుఁడు. 'ప్రాకృతం పురుషం మత్వా' అని స్యమంతకోపాఖ్యానములో జాంబవద్వచనము.

గూఢుఁ డగుటకు హేతువు కాపట్యము. ఇదియును భక్త హితార్థమే. బ్రహ్మాదుల ప్రార్థనకొఱకు; ప్రాకృతులైన జరాసంధాదుల మోహనము కొఱకు; అప్రాకృతలైన గోపీజనులను వేణునినాదముద్వారా యాకర్షించి, వారి వివిధ రసముల నుల్లసింపఁ జేయుట కొఱకు;

లీలయా=లీలచేత, కర్మణా కాదని యర్థము. చాల సునాయాసముగా స్వాభావికముగాఁ జేయఁబడునది లీల. ఉచ్ఛ్వాస నిశ్వాసములవలె. దీనిచేత హరి యవతారము లన్నియుఁ గర్మతో నేర్పడునవి గాదని భావము. మనజన్మలు గర్మములతోఁ గలుగునవి. 'కలాః దధతః' కళలను ధరించుచున్నట్టి. దీనితోఁ గృష్ణావతారమే ప్రధానమని సూచితమైనది. ఈశ్వరస్య=సర్వనియంతయైన వాని యొక్క ఆశ్రితులదురితములను హరించువానియొక్క, శుభాః=విను వారికి శుభములను గలిగించునట్టి, లోకక్షేమము నేర్పఱచునట్టి, పదే పదే=క్షణ క్షణమును, అనఁగా ప్రతిక్షణమునందును బూర్వాపేక్షతో రుచికరమైనదని యర్థము.

**క ఇతి బ్రహ్మణోనామ ఈశోఽహం సర్వదేహినామ్,**

**ఆవాం త్వదంగసంభూతౌ తస్మాత్కేశవ నామవాన్.** (రుద్రనిరుక్తము)

కేశవపదవాచ్యుఁడైన కృష్ణుఁడు బలరామసహితుఁడై లీలల నొనర్చెను. కపటమానుషః=ఛద్మమానవుఁడు. 'మానుషేష్వపి కం

సుఖం పతతి, ప్రాప్నోతీతి కపటమానుషః'- మానవుల మధ్యనుం డియు, సుఖము ననుభవించువాఁడు. ఉదారాణి=పరమానందదాయ కములు (జీవగోస్వామి), 'భక్తాభీష్టప్రదాని' అని వేఱే యర్థము. (విశ్వనాథ చక్రవర్తి). 'కశ్చ ఈశశ్చ కేశౌ కేశయోః వం అమృతం యస్మాత్ ఇతి కేశవః'-శివునకు బ్రహ్మకునుగూడ నానందమొసఁగు వాడు (వల్లభాచార్యులు). భగవచ్చరిత్ర నాధునికులు గూడ వర్ణిం తురు. అట్టివియుఁ బ్రమాణము లేనా!. పరిగీతాని సూరిభిః-నారద పరాశర పారాశర్యాదులచేఁ గీర్తింపఁబడినవి. అవియే ప్రమాణములు. స్వైరం=యథేష్టముగా లోకమర్యాదనుగూడ నతిక్రమించి లీలలనొనె ర్చును. ఎందుకు? 'స్వభక్తానాం సంసారదుఃఖదూరీకరణార్థం' తన భక్తులకు సంసారదుఃఖములను దొలఁగించుటకు, స్వాదు స్వాదు= శ్రవణముతో నవిద్యానివృత్తి యెంతెంతగా నగునో అంతంతగా లీలా రసాస్వాద మగుచుఁ బోవును. జ్వరము తగ్గుకొలఁదియు నన్నరసా స్వాదము బెరిగెడునట్లు.

**విజయధ్వజులు :**

కృష్ణావతారకథ మాత్రమేగాదు. మూలరూపముయొక్కయు మత్స్యాద్యవతార రూపములయొక్కయు కథలనుగూడఁ జెప్పవలెనని యడుగుచున్నాఁడు.

లీలయా=అనాయాసముగా, కలాః=నాలుగు, ఐదు, పది, పన్రెండు, ఇరవదినాలుగు, నూఱు, వేయి ఇత్యాది సంఖ్యలుగల వ్యూహరూపములను, దధతః=ధరించుచున్న, తస్య=మూలరూపియైన శ్రీమన్నారాయణునియొక్క, సూరిభిః=బ్రహ్మదేవుఁడు మొదలైన అపరోక్షజ్ఞానులచేత, పరిగీతాని=భక్తితో గానము చేయఁబడిన, ఉదా రాణి=1. క్లేశము లేని, 2. దోషరహితములైన, 3. మోక్షాది పురుషార్థ ప్రదములైన, కర్మాణి=కార్యము లనెడు చరిత్రను, శ్రద్దధానానాం= శ్రద్ధగలిగిన, నః=మాకు, బ్రూహి=చెప్పుము.

లీలగా ననేక వ్యూహములను ధరించు మూలరూపియైన శ్రీమ
న్నారాయణునియొక్క కర్మములను మాకు వివరింపుము. మత్స్యా
ద్యవతార కార్యములను గూడఁ దెలుపుము.

విశిష్టాద్వైత సంప్రదాయమందు సాధారణముగా వ్యూహ
ములు నాలుగే. ద్వైతసిద్ధాంతములో సుమారు వేయివఱకునున్నవి.

అథ=మూలరూపచరిత్రను వర్ణించిన తరువాత, శ్రద్ధతో విను
చున్నమాకు కలిదోషములను బరిహరించునట్టి, ఆత్మమాయయా=
తనస్వరూపమైన యిచ్ఛతో, స్వైరం=తన యిష్టమువచ్చినట్లు,
లీలాః=ప్రళయజలమందు విహరించుట మొదలైన క్రీడలను, విద
ధతః=చేయుచున్న, ఈశ్వరస్య= 1. స్వతంత్రుఁడైన హరియొక్క,
2. సంసార విమోచకుఁడైన పరమాత్మయొక్క, శుభాః=మంగళ
కరములైన, అనఁగా- నిష్టమైన మోక్షమునొసఁగి యనిష్టమైనదుఃఖ
మును బరిహరించెడు, అవతారకథాః=మత్స్యాద్యవతారకథలను,
ధీమంతుఁడవైన సూతా! ఆఖ్యాహి=చెప్పుఁడు.

'శుభ' 'శబ్దము' 'లీలా' శబ్దమునకు విశేషణముగఁ గూడ
నన్వయించి కొనవచ్చును.

**విశేషార్థము:** శ్రీహరి తనమూలరూపముతోఁ గొన్నిలీలల
నొనర్చును. అవతారరూపముతోఁ గొన్నిఁటి నొనర్చును. వీని యన్నిఁ
టికిని యతని ఇచ్ఛయే కారణము. వేరు కారణము లేదు. ఇందుకే,
స్వైరం 'అనుపదము వాడఁబడినది'. పరమాత్మునకు జడాంతః
కరణమే లేదుగదా! అట్టిచో నిచ్ఛయెట్లు కలిగినది? ఇట్లు శంకింప
రాదు. పరమాత్ముని స్వరూపభూతమైన యిచ్ఛయే దీని కంతయుఁ
గారణము. దీనినే 'ఆత్మమాయయా' అనుటతోఁ దెలుపుచున్నాఁడు.
మాయాశబ్దము ఇచ్ఛార్థమందుఁ గూడనున్నది. స్కాందము ప్రమా
ణము.

మహామాయే త్యవిద్యేతి నియతి ర్మోహినీతి చ,

ప్రకృతి ర్వాసనే త్యేవ తవేచ్ఛాఽనంత ! కథ్యతే,

అనంతుఁడవైన పరమాత్మా! నీ యిచ్ఛకే 'మహామాయ అవిద్య నియతి మోహిని ప్రకృతి వాసన' యని నామాంతరములు.

ఈ శ్లోకమందు నిచ్ఛకు మహామాయ యని చెప్పుటచేత 'మాయ' యనిగూడ చెప్పినట్లైనది. లేక 'మాయాం తు ప్రకృతిం విద్యాత్' అను ప్రమాణమును బట్టి మాయాశబ్దపర్యాయపదమైన ప్రకృతి శబ్దము పైశ్లోకములో నుండినందున నిచ్ఛయనియే చెప్పఁబడినట్లయ్యెను. ఇచ్ఛ పరమాత్ముని స్వరూపమనుటకుఁ బ్రమాణము.

ఇచ్ఛా శక్తి ర్జ్ఞానశక్తిః క్రియాశక్తి రితి త్రిధా,

శక్తి శక్తిమతో శ్చాఽపి న భేదః కశ్చనేష్యతే,

(విష్ణుసంహిత)

శ్రీహరిశక్తి ఇచ్ఛా జ్ఞానక్రియలని మూఁడురీతులు. శక్తికి శక్తిమంతునకు వైలక్షణ్యములేదు; రూపభేదమునులేదు. ఇట్లు చెప్పుటతోఁ బరమాత్ముని యిచ్ఛ యతనిస్వరూప మనియే చెప్పినట్లైనది.

తాత్పర్యము: శ్రీహరి తనమూలరూపమునుండి వాసుదేవాది చతుర్విధరూపములను ధరించును. వాసుదేవ, ప్రద్యుమ్న, సంకర్షణ, అనిరుద్ధులు. ఈ వ్యూహములలో వాసుదేవునిది శ్వేతవర్ణము. సంకర్షణునిది రక్తవర్ణము. ప్రద్యుమ్నుఁడు పీతవర్ణుఁడు. నీలదేహుఁ డనిరుద్ధుఁడు.

వాసుదేవుని యాయుధములు శంఖ, చక్ర, గదాపద్మములు.

సంకర్షణుఁడు శంఖ, చక్ర, హల, ముసలధారి.

ప్రద్యుమ్నుఁడు శంఖ, చక్ర, ధనుర్బాణధారి.

అనిరుద్ధుఁడు చక్ర శంఖ ఖడ్గ చర్మధారి; నారాయణాది పంచ రూపములను గూడ మూలరూపము ధరించును. మత్స్యాది దశరూపములను, కేశవాది దామోదరాంతములైన పండ్రెండు రూపములను మనము సంధ్యలోఁజెప్పు కేశవ, నారాయణ, మాధవ, గోవింద, విష్ణు, మధుసూదన, త్రివిక్రమ, వామన, శ్రీధర, హృషీకేశ, పద్మనాభ, దామోదరులు. వీరు ధరించు నాయుధములు వేరు వేరు. కేశవాది కృష్ణాంతములైన నామములు రెండు పదులు; కృష్ణుఁడు మొదలుకొని, మఱి నూఱు రూపము లున్నవి. విశ్వాది సహస్రరూపములు; పరాద్యనంతరూపములు; వీని వివరణము మధ్వాచార్య కృతమైన 'తంత్రసారసంగ్రహము' నుండి తెలియవచ్చును. మఱికొంత వివరముగాఁ బంచరాత్రములోఁ గనిపించును. ఇన్నిరూపములను ధరించువాఁడు శ్రీహరియే. ఈ రూపములతో నాతఁ డొనర్చిన క్రీడ లనంతములు. వానిని బ్రహ్మాదులైన యపరోక్షజ్ఞానులు భక్తితో గాన మొనర్తురు. అవి యన్నియు దోషరహితములు, మోక్షరూప పురుషార్థ ప్రదములు. సూతా! శ్రద్ధధానులమైన మాకవియెల్లఁ దెలుపవలెను. అతని చరిత్రము కలిమలహరము. అతఁడు తన స్వరూపమైన యిచ్ఛచేతనే ప్రళయజలవిహారాది క్రీడ లొనర్చును. వాని నన్నిఁటిని మాకుఁ దెల్పుము.

శౌనకాది మహర్షు లింతకుముం దనేక పర్యాయములు పరమాత్ముని కథలను విన్నారు. విన్నను మరల వినుటయం దెక్కువ కుతూహల మున్నది, దానినే వివరించుచున్నారు.

వయం తు=మేమన్ననో, శృణ్వతాం=వినుచున్న, రసజ్ఞానాం=రసవివేకమున్న జ్ఞానులకు, యత్=పరమాత్ముని యే విక్రమసమూహము, పదేపదే=అడుగడుగునను, స్వాదుస్వాదు భవతి=అత్యంత మధురమైయుండునో అట్టి, శ్రుతైః=పలుసారులు విన్న, ఉత్తమశ్లోక

విక్రమైః=తమస్సును నాశమొనర్చు పరమాత్ముని పరాక్రమములను చరిత్రల నుండి, న వితృప్యామః=తృప్తిపడుట లేదు.

తాత్పర్యము : సూతా! భగవంతుని కథలనేక పర్యాయములు విన్నాము. కాని మాకు కుతూహల మాగుటలేదు. అవి రసజ్ఞులకు అడుగడుగునను మధురాతిమధురములైనవి. ఇతరులకేమైన హరికథల యందుఁ దృప్తి కలుగునేమో కాని మాకుఁ గల్గుట లేదు.

వారికిఁ గృష్ణావతార కథయందే తాత్పర్యము. ఈ విషయ మును సూతునకుఁ దెలుపుటకే ముందు సూక్ష్మముగా నడిగిన కృష్ణావతార కథలను నింకను గొంత విశదముగా నడుగుచున్నారు.

భగవాన్=షడ్గుణైశ్వర్య సంపన్నుఁ డైనట్టియు, గూఢః=జను లచేఁ దెలియఁబడని మాహాత్మ్యము గలిగిన, కపటమానుషః=భ్రాంతి జ్ఞానముతో మనుష్యులవంటి దేహమేయని తలఁపఁబడుచున్నది. (పర మాత్మునిదేహ మప్రాకృత మైనది. కాని మనుష్యదేహమువలెనే యుండినది. అందుచే నందఋను దానిని ప్రాకృతదేహ మనియే భ్రమించిరని యర్థము.)

మనుష్యులకుఁ గూడ సుఖకరమగు దేహముండిన, కేశవః= బ్రహ్మరుద్రాది నియామకుఁడైన శ్రీకృష్ణుఁడు, సహ రామేణ= బల రామునితోఁబాటు, యాని=యే, అతిమర్త్యాని=1. మనుష్యుల పరా క్రమములను మీఱిన, 2. మనుష్యులందు సంభావింపని, వీర్యాణి= పరాక్రమ మనిపించుకొను కార్యములను, కృతవాన్ కిల=చేసెనో, తాని=వానిని, నః=మాకు, బ్రూహి=చెప్పుము.

తాత్పర్యము : షడ్గుణైశ్వర్య సంపన్నుఁడైన భగవంతుఁడు దన మాహాత్మ్యమును సామాన్యజనుల కర్థమగునట్లు చేయఁడు. అతఁ డప్రాకృతదేహముతో వచ్చును. కాని, మనుష్యుల దేహమువలెనే యుండును. అందుచే జనులు ప్రాకృతదేహమనియే భ్రమింతురు.

అతని దేహ మెప్పటికి నప్రాకృతమే. ఉపాసించు వారి కది యైహికా ముష్మికముల నొసఁగును. బ్రహ్మరుద్రాది నియామకుఁడైన శ్రీహరి ఇట్టి దేహముతోఁ గూడినవాఁడై బలరామునితోఁబాటు ననేక విక్రమ ములు చేసి చూపెను. అవి మనుష్యులం దసంభావితములు. వాని నన్నిఁటిని దయచేసి సవిస్తరముగా మాకుఁ జెప్పవలెను.

పోతన్నగారు:

> అనఘ! విను, రసజ్ఞులై వినువారికి
> మాటమాట కధిక మధురమైన
> యట్టి కృష్ణకథన మాకర్ణనము సేయఁ
> దలఁపు గలదు మాకుఁ దనివిలేదు;

అనఘ! = పాపదూరుఁడవైన సూతా! 'రసజ్ఞులై, రసజ్ఞానాం అనుటకుఁ దెనుఁగు', శృణ్వతాం = వినువారికి, మాటమాటకున్ = పదే పదే, అధికమధురము = స్వాదు స్వాదు.

ఓయి సూతా! చెప్పుదానిలో రసభావవివేకులైన వారికి మాట మాట కధిక మధురమైనది కృష్ణకథ. కర్షతీతి కృష్ణః = భక్తుల మన స్సుల నీడ్చువాఁడు, ఆకర్ణనం = సవిస్తరముగా వినుట. నీవు మాకుఁ బ్రతివిషయమును స్పష్టముగా నర్థమగువఱకును జెప్పవలెను. నడుమ నడుమ మా ప్రశ్నలకు సరియైన సమాధానము లీయవలె సుమా! 'తలఁపు గలదు'. ఎన్నియో దినములనుండి మేము నీ కొఱకై కాచి యున్నాము. నీ నుండి కృష్ణకథలను మధురమధురముగా వినవలె నను కోరిక మమ్ముఁ జాలకాలమునుండి పీడించుచున్నది; ఆ యౌత్సు క్యముతోనే నిన్ను మాటిమాటి కడుగుచున్నాము. మాకుఁ దనివి లేదు. ఇంతకుముం దెందఱో కృష్ణకథలను వివరించినారు. వినెడు కొలఁదియు మాకుఁ దృప్తికి బదు లతృప్తియే గలుగుచున్నది. అది ఇంతకుఁ బూర్వము కథ వినిపించినవారి యసామర్థ్యము గాదు. కృష్ణకథలలోని యాకర్షణ మట్టిది. ఇట్టి శ్రోతలు దొరకుట నీకు

నదృష్టమే గదా! కృష్ణకథ మాటమాటకు మధురతమము. అందుచేత నే మాటయు మా శ్రవణమునకుఁ దప్పిపోరాదు. ప్రతిపలుకును నీవు స్పష్టముగా వివరింపవలెను. మధురమైన యొకమాట విందుము. దాని ననుభవించునంతలోనే మఱియొకమాట వచ్చును. అది ఇంకను మధురముగా నుండును. తర్వాతి పలుకు ఈ రెంటినిమీఱి తియ్యగా నుండును. కృష్ణకథ యన్నదే యొక యమృతసరస్సు. దాని యందు మున్కలువేయు నదంతయుఁ దీపే. ఎవరికి? వినువారికి; శ్రవణాసక్తులకు; శ్రవణభక్తి పరమేశ్వరున కత్యంతప్రియ మను జ్ఞాన మున్నవారికి. అన్యుల కది యరణ్యరోదనము. ఊరక విన్నచో నేమి ప్రయోజనము? వారు రసజ్ఞులు గావలెను. ఒకమాట వాడి నప్పుడు ఆ శబ్దమెంత రసపౌష్కల్యము గలిగినదో దాని స్వరూపము నంతయుఁ జక్కగా ననుభవించువారు గావలెను. ఇక్కడఁ జేరిన గోష్ఠి యట్టిది. ఈ శ్రోతలకుఁ దగిన వక్త వు నీవు.

ఈ క్రింది రెండు పద్యములును పోతన్నగారి స్వకపోల కల్ప నలు. సాధారణముగా 'భక్తి' వచ్చినప్పుడు భక్త్యుద్రేకముతోఁ బోతనామాత్యులు గొంత సొంతముగా వ్రాయుదురు.

మ. వరగోవింద కథాసుధారస మహావర్షోరు ధారాపరం
పరలంగాక బుధేంద్రచంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి
స్తర దుర్దాంత దురంత దుస్సహ జనుస్సంభావితానేక దు
స్తర గంభీర కఠోరకల్మష కనద్దావానలం బాఱునే!

బుధేంద్రచంద్ర=బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడైనవాఁడా!, వర= ఉత్తమమైన, గోవింద=శ్రీమహావిష్ణువుయొక్క, కథా=కథ లనెడు, సుధారస=అమృతధారలచేఁ గూడిన, (రస=జల మనియు నర్థాంత రము), మహావర=గొప్పవర్షముయొక్క, ఉరుధారా=లావైన ధారల

విశాలమైన, దుర్దాంత=అణఁపరాని, దురంత=అంతములేని, దుస్సహ=భరింపరాని, జనుస్=జన్మములచేత, సంభావిత=కూడుకొన్న, అనేక=అనేకములైన, దుస్తర=దాఁటరాని, గంభీర=అగాధములైన, కఠోర=పక్వమైన, ఫలమునకు సిద్ధముగానున్న, కల్మష=పాపము లనెడు, కనత్=ప్రకాశించుచున్న, దావానలంబు=అడవికంటుకొన్న నిప్పు, అఱునే=అఱునా? యని కాక్వర్థము. అఱదని సిద్ధాంతము.

తాత్పర్యము: బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడవైన సూతా! గోవిందునియొక్క కథయే సుధారసవర్షము. ఆ వర్షమం దున్నవి జలము గాదు. అమృతమే జలముగాఁ బాఱును. ఆ మహార్ణవముయొక్క ధారాపరంపరలచేతనే కల్మష మనెడు దావానలము చల్లారును. ఆ కల్మషమే యనేక జన్మములను గల్గించునది. ఆ జన్మ లొకటి రెండు గాదు. ఇరువదినాలుగు లక్షలు. దానిశక్తి నణఁచుట కెవ్వరికిని సాధ్యము గాదు. ఒకజన్మ నెత్తినప్పుడు మనుష్యుఁ డహంకారముతో మఱికొన్ని పాపము లొనర్చును. అవి వీనికి తోడుగా మఱికొన్ని జన్మల నీనును. ఇట్లే ఈ జన్మపరంపర యంతములేని దగును. పుట్టుటకుముందు గర్భస్థితుఁడైనప్పుడు జీవి యనుభవించెడు యాతన ఘోరముగ నుండును. ఈ పుణ్యపాపవిచారము మహాగంభీరమైనది. ఏది పుణ్యమో, ఏది పాపమో నిర్ధరించుటకు మహామతులైన మనీషులు చాలరు. ఆ పాపఫలము పండి పక్వమైనప్పుడు దాని ననుభవింపక పోవ నెవ్వరికిని సాధ్యము గాదు. ఇది దావానలమువలె జీవిని జుట్టుకొని యెల్లప్పుడును గాల్చుచుండును. ఆ దావానలము ప్రవిస్తరము అగుటచేఁ గొన్నిచోట్ల పలుచగా మఱికొన్నిచోట్లఁ దీవ్రముగా నంటికొన్నట్లు భాసించును. పలుచగా నంటికొన్నచోట నెక్కువ కాలి నట్లగుపించదు. అదియుఁ గూడ నగుపించుట మాత్రమే. వెంటనే యక్కడఁ గూడ నగ్ని చెలరేఁగి గ్రసించును. జీవిగూడ నంతే. పాపఫలము తక్కువగా నున్నప్పుడు సుఖాభానము. దీనితోఁ దాను సుఖి

నని మోసపోవుట. ఆ తృప్తి యెంతవఱకు? క్షణకాలము. వెంటనే దుఃఖము రెండింతలుగాఁ బైకొని బాధించును. ఈ బాధకు విడుమర హరికథాశ్రవణ మనెడు మహావర్షమే. అది సుధామయ మగుటచే సమస్త సౌకర్యములు సమకూర్చును. శరీరమునకు నూత్నమైన యుత్తేజము నొసఁగును. మనస్సు నానందములో ముంచెత్తును.

> ఉదీర్ణ సంసార దవాశుశుక్షణిం
> క్షణేన నిర్వాపపరాం చ నిర్వృతిమ్,
> ప్రయచ్ఛతి త్వచ్చరణారుణాం బుజ
> ద్వయానురాగామృత సిందుశీకరః.

(ఆళవందార్ స్తోత్రం. 29 శ్లో.)

యామునాచార్యులు సంసారమునే దవాగ్నితోఁ బోల్చిరి. కల్మషములతోఁ బ్రాపించునది సంసారము. కారణమును పోతన్న గారు చెప్పగా గార్యమును యామునాచార్యులు వివరించెను. అమృత సింధుశీకరములతో యా మునులు దృప్తిపడిరి. పోతన్నగారి భావము మహావర్షమువఱకును బోయినది. బుధేంద్రచంద్ర! బుధేంద్రులనఁగా బుద్ధిమంతురులు, వారిలోఁ జంద్రుఁడనఁగా శ్రేష్ఠుఁడు, ఇంద్రచంద్ర శబ్దములు రెండును శ్రేష్ఠవాచకములు. బుద్ధిమత్తముఁడని తాత్పర్యము లేక బుధేంద్రులను వాక్కౌశల్యముచేత నాహ్లాదింపఁజేయువాఁడని యును జెప్పికొనవచ్చును. 'చది అహ్లాదనే' అను ధాతువునుండి చంద్రశబ్ద మేర్పడినది. ఇతర + ఉపాయ = ఇతరోపాయ + అనుర క్తిన్ = ఇతరోపాయములను ప్రేమించి వాని ననుసరించుటచేత యోగము జ్ఞానము ఇత్యాదులచేత నని భావము. ప్రవిస్తర = జన్మమరణముల పట్టిక చాలవిస్తారమైనది. మానవుని యహంకృతితోఁగూడిన కర్మా చరణముచే నది ఇంకను పెరిగిఁ పోవును. దానితో వాఁడు నిత్యసంసారిగా నుండుట తటిస్థించును. దుర్గాంత = అణఁచుటకు సాధ్యము గాని వనియు నర్థము. ఎక్కువ గర్వముతోఁగూడిన వనియు స్ఫురించును.

అనఁగా నీ జనన మరణముల ప్రతాప మగమ్య మైనది. ఎంతలేసి వారికి నడ్డగింపరానిది.

దుర్దాంతానాం దమనవిషయః క్షత్రియే ష్వాయతంతే(మహావీరచరిత్రము) అని ప్రయోగము.

దురంత=దానియంతమెప్పటికో తెలియుటలేదు. యామును లీభావమునే చెప్పిరి.

> దురంత స్యానాదే రపరిహరణీయస్య మహతః
> నిహీనాచారో௨హం నృపశు రశుభస్యాస్పద మపి,
> దయాసింధో! బంధో! నిరవధికవాత్సల్య జలధే!
> తవస్మారం స్మారం గుణగణ మితేచ్ఛామి గతభీః.

అది యనాదిగనుకనే దురంతము. అపరిహరణీయము. దాని నుండి తప్పించికొనుట కుపాయమొక్కటే. పరమేశ్వర గుణగణ వర్ణనము, చింతనము లేక మననము. దుస్సహ గర్భవేధ మహా దుస్సహము. అందుకే గర్భస్థజీవుఁడు భగవంతుని నానారూపములఁ జింతించుచున్నాఁడు. వాని యాతనా వర్ణనము భాగవత తృతీయ స్కంధము కపిలదేవ హూతిసంవాదమున వచ్చును. జనుః=జన్మము, 'జనుర్జనన జన్మాని' అమరము. దుస్తరం=దుఃఖేన తర్తుం శక్యం దుస్తరం=ఎంతో దుఃఖముతోఁగాని, దాటుఁటకు సాధ్యముగాదు. ఈ శబ్దము మూలములోనిదే. ఈ సందర్భముననే వచ్చును. 'దుస్తరం నిస్తితీర్ణతాం' అని, గంభీర=గంభీర గభీర శబ్దములు రెండును సమానార్థకములే, అగాధమైన యని యర్థము. కఠోర=కఠినమైనది దయాహీనమైనదియును. అర్థములు పొసఁగవు. అవి రెండును చేతన ధర్మములు. కఠోర మనఁగా బూర్ణమైన యని యర్థము.

> స తప్త కార్తస్వర భాస్వరాంబరః,
> కఠోర తారాధిప లాంఛనచ్ఛవిః.

(మాఘము 1 సర్గ. 21 శ్లో.)

ఆతంక స్ఫురిత కఠోర గర్భగుర్వీమ్,
క్రవ్యాద్భ్యో బలిమివ దారుణం క్షిపామి.

(ఉత్తరరామచరితం. 1 అం.)

కఠోరగర్భః పూర్ణగర్భః అని వ్యాఖ్య. కనుక బాగుగా పక్వమై ఫలమునకు వేచియున్న పాపములని తాత్పర్యము. 'కల్మషం=కర్మ శుభకర్మ, స్యతి నాశయతీతి కల్మషం' అనఁగా పాపము జీవుని శుభ కర్మలను నాశము చేయుచున్న దనుట.

(రస్య లత్వే షత్వే చ, పృషోదరాదిత్వాత్సాధుః)పృషోదరాది గణమునందుఁ బఠింపఁబడుటచేత నీ శబ్దము సాధువు. రకారమునకు లకారాదేశము వచ్చెను. షకారము ప్రాప్తించినది. 'కల్మషం వృజినైనోఘం' అమరము.

యామీస్తా యాతనాః ప్రాప్య స జీవో వీతకల్మషః,
తాన్యేవ పంచభూతాని పునరప్యేతి భాగశః.

(మనుస్మృతి. 12-22)

జీవుఁడు నరకములందు పాపము లనుభవించి కల్మషమును బోఁగొట్టుకొన్నవాఁడై మరల పాంచభౌతిక శరీరము నెత్తుచున్నాఁడని భావము.

హరినామకథన దావానలజ్వాలలఁ
గాలవే ఘోరాఘకాననములు
వైకుంఠదర్శన వాయుసంఘంబుచేఁ
దొలఁగవే బహుదుఃఖ తోయదములు
కమలనాభధ్యాన కంఠీరవంబుచేఁ
గూలవే సంతాప కుంజరములు
నారాయణస్మరణ ప్రభాకరదీప్తిఁ
దీఱవే షడ్వర్గ తిమిరతతులు

నళిననయన భక్తినావచేఁ గాక, సం
సారజలధిదాఁటి చనఁగరాదు
వేయునేల? మాకు విష్ణుప్రభావంబు
దెలుపవయ్య సూత! ధీసమేత!

ధీసమేత! సూత!=హరినామకథన=శ్రీహరియొక్క నామ స్మరణము, కథాశ్రవణమునను దావానల జ్వాలలచేత ఘోరపాపము లనెడు నరణ్యములు గాలవా! కాలియేతీరునని తాత్పర్యము.

వైకుంఠ=శ్రీమహావిష్ణువుయొక్క, దర్శన=స్మృతిరూపదర్శన మనెడు, వాయసంఘంబుచేన్=గాలిగుంపుచేత, బహుదుఃఖ తోయద ములు=అనేకదుఃఖములనెడు మేఘములు, తొలఁగవే=తొలఁగిపోవా? కమలనాభధ్యాన కంఠీరవంబుచే=శ్రీమహావిష్ణువుయొక్క ధ్యానమను కంఠీరవముచేత (సింహముచేత) సంతాపకుంజరములు=సంతాపము లనెడు యేనుగులు, కూలవే=నశింపవా! నారాయణస్మరణ=నారాయ ణుని స్మరణ మనెడు, ప్రభాకర దీప్తిన్=సూర్యప్రకాశముచేత, షడ్వర్గ తిమిరతతులు=కామాదు లనెడు చీఁకటిగుంపులు, తీఱవే=మాసిపోవా! నళినయన భక్తినావచేఁ గాక=శ్రీమహావిష్ణువు యొక్క భక్తి యను నావతోఁ గాక, సంసారజలధిన్=సంసారమను సముద్రమును, దాఁటి చనఁగరాదు=దాటిపోరాదు, వేయునేల=తక్కిన వేయిమాటలెందుకు? మాకు శ్రీమహావిష్ణు ప్రభావమును దెలుపుము.

విశేషార్థములు: హరినామకథన = హరి యను పేరుగల శ్రీ మహావిష్ణువుయొక్క, కథనము = కథావర్ణనము, హరి నాముఁడు అనఁగా సంతస్వారస్యముగా లేదు. అప్రసిద్ధులకే యా యర్థము సరిపోవును. 'ధుంధుమారనామ రాజా' అన్నట్లు. ఇక్కడ నామ చ కథనం చ నామకథనే అని చెప్పికొనవచ్చును. శ్రీమహావిష్ణువు నామ స్మరణము=కథాకథన మని యర్థము. లేక నామకథన మనియుఁ

జెప్పవచ్చును. ఘోరాఘకాననములు– పూర్వపద్యమునందుఁ జెప్పిన 'ప్రవిస్తర' అను శబ్దమున కిది వ్యాఖ్యా ప్రాయముగా నున్నది. 'హరి' యనుట కనేకార్థము లున్నను శ్రీమహావిష్ణువునందే రూఢము.

హరిర్యథైకః పురుషోత్తమ స్మృతో
మహేశ్వర స్త్ర్యంబక ఏవ నాఽపరః,
తథా విదుర్మాం మునయ శ్శతక్రతుం
ద్వితీయగామీ నహి శబ్ద ఏష నః.

(రఘు. 3 స. 47 శ్లో)

హరతి పాపానీతి హరిః. వైకుంఠః=శ్రీమహావిష్ణువు.

తే సాధుకృత సర్వార్థాః జ్ఞాత్వా ఽత్యంతిక మాత్మనః,
మనసా ధారయామాసు ర్వైకుంఠ చరణాంబుజమ్.

అని భాగవతమునందే గలదు. ఇక్కడ దర్శన మనుటకు ధ్యానముచేత నేర్పడు 'దర్శన సమానాకారత' యని యర్థము. ధ్యాన మనుటకు శ్రీమద్రామానుజుల భాష్యము–

ధ్యానం చ తైలధారావ దవిచ్ఛిన్న స్మృతి సంతానరూపం
ధ్రువాస్మృతిః. స్మృతిలంభే సర్వగ్రంథీనాం విప్ర
మోక్ష ఇతి. ధ్రువాయాస్మృతేః అపవర్గోపాయత్వ
శ్రవణాత్. సా చ స్మృతి ర్దర్శనసమానాకారా.

ధ్యాన మనఁగా తైలధారవలె యవిచ్ఛిన్నమైన స్మృతిసంతానము. స్మృతికి ధ్రువత్వ మనఁగా 'విజాతీయ ప్రత్యయాంతరా వ్యవహిత సంతతిత్వ' మని శ్రుతప్రకాశికా వ్యాఖ్య. స్మృతితోఁ దోఁచు దర్శనము క్షణకాలమే యుండును. అట్లుగాక స్మృతి స్థిరముగా నుండుట. అట్టి స్మృతి దర్శనముతో సమానమైనది. అట్టి దర్శనమిక్కడ వివక్షితము. నిజమైన దర్శనమే యైనచో దుఃఖతోయదము లుండుటకు వీలులేదు గదా! విష్ణుపురాణమునందుఁ గూడ నిట్లే యున్నది.

తద్రూప ప్రత్యయైకైక సంతతిస్స్వాఽన్య నిస్పృహా,
తద్ధ్యానం ప్రథమైరంగైః షడ్భిర్నిష్పాద్యతే నృప ।

తద్రూపస్య ధారణాసిద్ధస్య వస్తునః, ప్రత్యయాః యస్యాం సంతతౌ సా ఏకావచ్ఛిన్నా సంతతిః, అన్య నిస్పృహా విషయాంతరేణ అవ్యవధీయమానా, విజాతీయ ప్రత్యయాంతరితః, న జాతీయ ప్రత్యయ ప్రవాహో ధ్యాన మిత్యర్థః, తస్య ప్రథమైః యమాదిభిర్ధారణాంతైః షడ్భిరంగైః నిష్పాద్యతే. (టీక) లేక యర్చావతార దర్శన మనియైన నర్థముఁ జెప్పికొనవచ్చును.

బహుదుఃఖ తోయదములు- ఇక్కడ దుఃఖము లనఁగాఁ త్రితాపము లని యర్థముఁ జెప్పికొన్నచో మఱల మూఁడవచరణములో 'సంతాపకుంజరము' లని యున్నది. సంతాపము లనఁగా దుఃఖము లనియే యర్థము. కనుక నిక్కడి దుఃఖమునకు సంతాపము లని సంసారము లేక రోగ మనియు నర్థముఁ జెప్పినచో సరిపోవును.

ఖే కాభః పీడ్యతే దుఃఖైః శోణిత క్షయసంభవైః.

అని భావప్రకాశము. రోగైః అనుదాని టీక.

కమలనాభః=కమలము నాభియందు గలవాఁడు - వ్యధికరణ బహువ్రీహి; శ్రీమహావిష్ణు వని యర్థము. కంఠీరవమనఁగా సింహము. కమలనాభుని ధ్యాన మనెడు కంఠీరవముచేత, కంఠ్యాం రవో యస్య సః కంఠీరవః = కంఠమందు ఘోరగర్జనము గలది. సంతాపకుంజరములు=త్రివిధములైన తాపములనెడు నేనుఁగులు కూలవే=కూలవా? నారాయణ స్మరణ=నారాయణునియొక్క స్మరణ మనెడు, ప్రభాకర =సూర్యునియొక్క, దీప్తిన్= కాంతిచేత, షడ్వర్గతిమిరతతులు = కామ క్రోధాదులనెడు చీఁకటుల గుంపులు, తీఱవే=తీరిపోవా! నారాయణ శబ్దమున కనేకార్థములు చెప్పిరి.

భాగవతము దశమస్కంధము బ్రహ్మస్తుతిలో నిట్లున్నది-

నలినాక్ష! నీ వాదినారాయణుండవు
జలము నారము జీవచయము నార
మందు నీవుంట నీయం దది యుంటయు
నారాయణుం డను నామ మయ్యె.

నార మనఁగా జలము, జీవసమూహము. జలమం దాతఁడు గలఁడు. 'అబ్ధి నిద్రించు నారాయణుఁడవు' అని పైననే యున్నది. అతనియందు సమస్త బ్రహ్మాండములతో పాటు సముద్రములు గూడ గలవు. అతనియందు జీవచయ మున్నది. జీవచయములలో నతఁ డున్నాఁడు. ఈ రెండర్థములతో నారాయణుఁ డనుట పొసఁగును. ప్రభాకరుఁడు సూర్యుఁడు. ప్రభ కాధారమైనవాఁడు. నళినయనః= శ్రీమహావిష్ణువుయొక్క, 'నళినే ఇవ నయనే యస్యసః' నళినయనః; పుండరీకములవంటి కన్నులుగలవాఁడు. పుండరీకాక్షశబ్దము శ్రీవిష్ణువు నందే రూఢము. నావ=పడవ, స్మరణము ధ్యానమునకును, ధ్యానము దర్శనమునకును గారణ మగుచున్నది. స్మరణ మనఁగా నియమితకాల మందు నియమిత పద్ధతులతో నొనర్చెడి జపాదులు, ఇవి ధ్యానము నకు దారితీయును. ధ్యాన మనఁగా శ్రీభాష్యములోఁ జెప్పిన విధము; దర్శనము ధ్యానముతో నేర్పడు దర్శనసమానాకారమైన దర్శనము.

తాత్పర్యము: శ్రీహరి నామస్మరణము, తత్కథాకథనము నివి దావానల జ్వాలలవలె పాపారణ్యములఁ జుట్టికొనును. వానిని తెగఁ గాల్చివేయును. చాలకాలమునుండి పెరిఁగిన వృక్షములు గూడ దావాగ్నిచే దహింపఁబడినట్లు, అనేక జన్మలనుండి పెరిఁగిన పాపములు నామకథనములచేఁ గాల్పఁబడును. వైకుంఠ తీవ్రధ్యాన మనెడు వాయువులతో దుఃఖతోయదములు చెల్లాచెదరుగా విసరివేయఁబడును. కమలనాభుని ధ్యానమే మహాసింహము. దీనితో దేహియొక్క త్రివిధతాపము లను మహాగజములు నశించును. కంఠీరవంబుచే ననుట చేత కంఠీరవము గర్జింపవలసిన పనిలేదు. దాని చూపే కుంజరము

లకు మరణము. సింహము కలలో వచ్చినను ఏన్గులు మరణించును. అంత భయమన్న మాట! అట్లే ధ్యానారంభమందే సమస్త సంతాపములు నశించుననని తాత్పర్యము. నారాయణ స్మరణమే సూర్యదీప్తి. దానితోఁ గామాదులను తిమిరములు మూలమట్టముగాఁ బోవును.

ఇక్కడ ప్రతిపాదమందును రెండు రెండు రూపకాలంకారములు గలవు. సంసార మన్నదే మహాసముద్రము. అది గంభీరమైనది. కఠోరమైనది. దానిని మానవుఁడు స్వప్రతాపముతో దాఁటలేఁడు. దానిని దాఁటించుటకొక నావ గావలెను. అదియే భక్తి. ఇట్లుగా భక్తిని స్తుతించుచు, మాకు విష్ణుప్రభావమును దెలుపుమని ఋషులు ప్రార్థించుచున్నారు.

వచనము : మఱియును గపటమానవుండును గూఢుండునైన మాధవుండు రామసహితుండై యతిమానుషములైన పరాక్రమంబులు సేసెనఁట; వానిని వివరింపుము. కలియుగంబు రాఁగలదని వైష్ణవ క్షేత్రంబున దీర్ఘసత్రనిమిత్తంబున హరికథలు వినవెడ గలిగి నిలిచితిమి. దైవయోగంబున—

మఱియున్ = ఇంకను, కపటమానవుండును = మానవుఁడుగా బ్రవర్తించుచున్నవాఁడును, గూఢుండును నైన మాధవుండు = భగవంతుఁడని యర్థము చేసికొనరాని శ్రీహరి, రామసహితుండై = బలరామునితోఁ గూడినవాఁడై, అతిమానుషంబులైన పరాక్రమంబులు = మానవులయందు సంభావితములు గాని పరాక్రమరూపములైన లీలలను, చేసెనఁట = కావించెనని వినుచున్నాము. వానిని వివరింపుము = వానిని స్పష్టముగా వ్యాఖ్యానింపవలెను. కలియుగంబు రాఁగలదని = కలియుగము రాఁబోవుచున్నదని, 'కలిమాగతం' అని మూలము. పోతన్న భావ్యర్థమున వాడెను. అనఁగా కలియుగప్రభావ మప్పటి కెక్కువ పడలేదనియు, రాఁగ రాఁగ నెక్కువగుననియు నభిప్రాయము

వైష్ణవే = విష్ణుప్రతిష్ఠ గలిగిన, అస్మిన్ క్షేత్రే = ఈ క్షేత్రమందు, దీర్ఘసత్రేణ = దీర్ఘకాలము వర్తించెడు సత్రయాగముతో, ఆసీనాః = ఉన్నట్టి, వయం = మేము, కలిం = కలియుగమును, అగతం = ప్రాప్తమైన దానినిగా, అజ్ఞాయ = తెలిసికొని, హరేః కథాయాం = హరియొక్క కథయందు, స క్షణాః = అవసరమున్నవారుగా నైతిమి.

ఓ సూతా! కలియుగ మారంభమైనది. దీనిని గ్రహించిన మేము వైకుంఠమును జేరవలెనను నాసతో విష్ణుక్షేత్రమైన నైమిశమందు నిలిచితిమి. దీర్ఘకాలికమైన సత్రయాగము నారంభించినాము. శ్రీ మహావిష్ణువుయొక్క కథాశ్రవణము గావించు నవసర మెప్పుడో యని కాచియున్నాము. 21

పుంసాం = పురుషులయొక్క, సత్త్వహరం = సత్త్వమును హరించునదియు, దుస్తరం = ప్రయాసతోఁ దరింపఁ దగినదియు నైన, కలిం = కలియుగ మనెడు, అర్ణవం = సముద్రమును, నిస్తితీర్షతాం = దాఁట నిచ్ఛించుచున్న, నః = మాకు, కర్ణధార ఇవ = పడవను నడపువాని వలె, త్వం = నీవు, ధాత్రా = బ్రహ్మదేవునిచేత, సందర్శితం = చూపఁబడితివి.

ఈ కలియుగము మహాక్రూరమైనది. దీని దుష్ఫలితమునుండి దాఁటుట యశక్యము. మాగతి మహార్ణవమును దాఁటుటకై యొడ్డున నిలిచినవారివలె నున్నది. దైవయోగమున నీవొక కర్ణధారుఁడవుగా మాకు దొరకితివి. దయచేసి, ఈ కలియుగమను గొప్పసముద్రమును శ్రీహరి కథాశ్రవణమను నావతో మమ్ము దాఁటింపుము. 22

బ్రహ్మణ్యే = బ్రాహ్మణహితకారియు, ధర్మవర్మణి = ధర్మమును గవచము వలె రక్షించువాఁడును, యోగేశ్వరే = యోగేశ్వరుఁడైన, కృష్ణే = శ్రీకృష్ణుఁడు, అధునా = ఇప్పుడు, స్వాం కాష్ఠాం = తనయొక్క స్థానమును, ఉపేతే = పొందినవాఁడగుచుండఁగా. ధర్మః = ధర్మము, కం = ఎవనిని, శరణ్యం గతః = శరణముఁ బొందినది, బ్రూహి = చెప్పుము.

కృష్ణపరమాత్మ బ్రాహ్మణ హితకారి, ధర్మమునకుఁ గవచము వంటివాఁడు. యోగీశ్వరేశ్వరుఁడు. అట్టివాఁ డిప్పుడు వైకుంఠము నకుఁ దరలిపోయెను. ఇఁక ధర్మమునకు గతియేది? అది యెవ్వరిని శరణుఁజొచ్చును? దయచేసి తెలుపుము. కృష్ణావతారము చాలించిన దినమే కలియుగ ప్రవేశము. ఆ పరమాత్ముఁడు జీవించినది నూట యిఱువదియైదు సంవత్సరములు; 23

**శ్రీధరవ్యాఖ్య :**

సూతుఁ డనుచున్నాఁడు: మీ రందఱు యజనాధ్యాపనాది వ్యగ్రులు. మీకు శ్రవణావకాశ మెక్కడిది?

దాని కుత్తరముగా 'కలి మాగతం' అని యారంభించు చున్నాఁడు. కలిభయముతో విష్ణుపదమును బొంద నిశ్చయించిన వారమై వైష్ణవక్షేత్రమున నిలిచితిమి; సత్రయాగము నిమిత్తము మాత్రమే. కలిం=సంసారమును, నిస్తితీర్షతాం=దాఁట నిచ్ఛగించు చున్నట్టి అని యర్థము. ధర్మవర్మణి=ధర్మమునకుఁ గవచమువలె నుండిన, స్వాం కాష్ఠాం=తన మర్యాదయైన స్వస్వరూపస్థితిని.

**వంశీధరునివ్యాఖ్య :**

మీకు యజ్ఞయాగాదులందు తలఁపుగదా! కృష్ణకథోత్సుకత యెట్లేర్పడినదని ప్రశ్న. ఈ కలియుగమందు ద్రవ్య, కాల, దేశశుద్ధి లేకపోవుటచేత, కేవలనామమాత్రమే మా యాజ్ఞికత్వమని యుత్త రము. సక్షణాః= క్షణ మనఁగా నుత్సవము. 'క్షణ ఉద్ధవ ఉత్సవః'- అమరము. కథాశ్రవణోత్సవమునకుఁ బరమాసక్తులమై అని తాత్ప ర్యము. సత్త్వహరము=ధైర్యహరము, 'సత్త్వంధైర్యేగుణే సత్యే' అని నిఘంటువు. యోగీశ్వరే=అనుటతోసామర్థ్యము, బ్రహ్మణ్యే=యనుటతో దయాళుత్వము సూచితము. కాష్ఠాం='కాష్ఠోత్కర్షే స్థితాదిశి' అని

నిఘంటువు. ధర్మః=భక్తిజ్ఞానరూపమైన ధర్మము. ఈ భాగవతమంతయు, నాలు ప్రశ్నలకు సమాధానము. ఆ ప్రశ్నలీ యధ్యాయమందే యున్నవి

1. పుంసామేకాంతతః శ్రేయః. ఇది సాధనకు సంబంధించిన మొదటిప్రశ్న.
2. సర్వశాస్త్రసారమును మాకుఁ జెప్పు మనుట రెండవది. 'బ్రూహి న శ్శ్రద్దధానానాం యేనాత్మా సుప్రసీదతి'.
3. దేవకీదేవియందు కృష్ణుఁ డెందు కుద్భవించెను? 'తన్న శ్శుశ్రూషమాణానాం అర్హ స్యంగానువర్ణితుం'
4. కృష్ణపరమాత్ముని కర్మలను గుఱించిన ప్రశ్న: 'బ్రూహి న శ్శ్రద్దధానానాం లీలయా దధతః కలాః.
5. అవతార కథలు. 'అఖ్యాహి హరేర్ధీమన్? అవతార కథా శ్శుభాః'
6. కృష్ణుఁడు పరమపదింపఁగా ధర్మ మెవరిని శరణుఁజొచ్చినది? 'ధర్మః కం శరణంగతః?'

వీరరాఘవ వ్యాఖ్య:

సూత! కలియుగము తపోవిఘ్నకర మైనది. వే ఉపాయములతో దీనిని జయించుట సాధ్యముగాదు. అందుచేఁగలి కృతములైన దోషములను హరించు కథాశ్రవణమం దాసక్తులైయున్నాము, సత్త్వహరం=తపస్సు మొదలైన సత్త్వములను హరించునది, దుస్తరం=ఉపాయాంతరములతో దాఁటు నశక్యమైనది. మీ మీ వర్ణాశ్రమ ధర్మముల చేతనే కలిని జయింపవచ్చును గదా! హరికథా శ్రవణ మెందుకు? దాని కుత్తరమే- 'బ్రూహి' యనెడు శ్లోకము. వర్ణాశ్రమ

రూపమైన ధర్మమునకుఁ గృష్ణుఁ డింతవఱకును గవచముగా నుండెను. ఇఁక నవి సాఁగవు. అందుకే హరికథా శ్రవణము.

వల్లభాచార్యుల సుబోధినీ వ్యాఖ్య:

సత్త్వహరం=వివేక ధైర్య, జ్ఞానాదుల హరించునది. సత్త్వగుణమును హరించునది. ఇఁక మిగిలినవి రజస్తమస్సులే. అందుచే లయ విక్షేపాదులు తప్పవు. కనుక హరికథా శ్రవణమే సర్వశ్రేయము. కృష్ణుఁడు కనుమఱుఁ గయ్యెను. అతఁడు ధర్మమునకుఁ గవచమువంటి వాఁడు. అతఁడు పోయెనేగాని ధర్మ మున్నది. అందుచే, 'ధర్మః కం శరణం గతః' అనుచున్నాఁడు.

విజయధ్వజ వ్యాఖ్య:

ఋషులైన మేము యజనాధ్యాపనాది కార్యములను వదలి దీర్ఘకాల సత్రయాగమందు దీక్షితుల మైతిమి. అందుచేఁ గథా శ్రవణమునకు అవకాశ మున్నదని శౌనకాదు లనుచున్నారు.

అగతం=జనుల మనస్సులందుఁ బ్రవేశించిన, కలిం= ఈ యుగమున కధీశ్వరుఁడైన కలిని, అజ్ఞాయ=వాని పరాక్రమమును దెలిసికొన్నవారమై, వాని భయముతో, నితరవ్యాపారములను వర్జించి, అస్మిన్ క్షేత్రే= 1. విష్ణు భక్తులు నివసించునట్టి, 2. విష్ణు సన్నిధానముచేఁ బవిత్రమైన నైమిశమందు, దీర్ఘసత్రేణ=సత్రమనెడు నెపముచేత, ఆసీనాః=వసించుచున్నాము. అందుచే, హరేః కథాయాం సక్షణాః= 1. శ్రీహరికథను వినుటయందు, అవసరమున్న వారుగా నైతిమి 2. సంతోషపడుచున్నాము.

ఇప్పుడు నీ దర్శనము దైవికముగా నైనది. సూతా! పుంసాం= ముముక్షువులైన యధికారి చేతనులయొక్క, సత్త్వహరం=సత్త్వగుణ కార్యములైన జ్ఞాన భక్తి వైరాగ్యములను నాశ మొనర్చు, కలిం= ఈ

యుగాధిపతి కలిని, నిస్తితీర్షతాం=1. సంపూర్ణముగ దాటవలెనను నిచ్ఛ గలిగిన, 2. నిశ్చయముగా దాటవలె నను కోర్కిగల.

మఱియొక ప్రశ్న నడుగుచున్నారు. అధునా=ఇప్పుడు, 'ధర్మ కర్మణి' అని పిరి పాఠము. ధర్మములైన కార్యము లొనర్చునట్టి, బ్రహ్మణ్యే=బ్రహ్మజ్ఞానులకు హితకరుడైన, యోగేశ్వరే=1. అణిమాద్యష్ట యోగములకును స్వామియైన, 2. పరమాత్మను బొందెడు భక్తి జ్ఞానాత్మకమైన సాధనాసామగ్రికి నియామకుడైన, 3. బ్రహ్మాది యోగు లందఱికిని, నియామకుడైన, కృష్ణే=సచ్చిదానంద స్వరూపి యైన కృష్ణుడు.

> కృషిర్భూవాచక శ్శబ్దో ణశ్చ నిర్వృతి వాచకః,
> తయోరైక్యం పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే.

స్వాం కాష్ఠాం=తనయొక్క గుణపూర్ణమైన మూలరూపమును ఉపేతే సతి=పొందినవాడు కాగా (అవ్యక్తుడు కాగా), ధర్మః= కృష్ణరక్షితమైన భక్తిజ్ఞానాత్మక ధర్మము, కం శరణం గతః=ఎవరి నాశ్రయించెను?

శ్రీకృష్ణుడు అవ్యక్తుడు కాగా, నిప్పుడు ధర్మరక్షకు డెవ్వ డని తాత్పర్యము.

ఈ యధ్యాయమం దాఱు ప్రశ్న లున్నవి. వంశీధరుడు వానిని జెప్పెను. విజయధ్వజులు గూడ జెప్పినారు. ప్రశ్న లాఱే. కాని వాని స్వరూపమందు భేద మున్నది.

1. పుంసాం ఏకాంతత శ్శ్రేయః?
   ఇది శ్రేయస్సాధన విషయమైన ప్రశ్న.
2. బ్రూహి భద్రాయ భూతానాం
   బింబరూపి పరమాత్మకు సంబంధించిన ప్రశ్న.

3. అర్హస్యంగాను వర్ణితుం
   కృష్ణావతారమునకు సంబంధించిన ప్రశ్న.

4. బ్రూహి న శ్శ్రద్దధానానాం
   మూలరూపముయొక్క యశోవిషయక ప్రశ్న.

5. అథా ఖ్యాహి హరేః
   ఇతరావతారములకు సంబంధించిన ప్రశ్న.

6. బ్రూహి యోగేశ్వరే
   ఇది ధర్మవిషయకమగు ప్రశ్న. దీని సమాధానమే భాగవతము.

తాత్పర్యము: ఈ నైమిశారణ్యము విష్ణువు, విష్ణుభక్తులు—వీరి సన్నిధానముతో వైష్ణవక్షేత్ర మనిపించికొన్నది. ఈ కలియుగమందు ధర్మములేవియు నడువవు. దీనిని గ్రహించిన మేము దీర్ఘకాలిక సత్రయాగ మనెడు నెపముతో నిందు నిలిచితిమి. దానితో శ్రీహరి కథలను జక్కగా విను నవకాశము మాకు లభించినది. ఈ కలియుగము ముముక్షువులైన యధికారి చేతనులయొక్క సత్త్వగుణ కార్యములైన జ్ఞాన భక్తి వైరాగ్యాది కార్యములను నాశ మొనర్చును. దీని బాధను దప్పించికొనుట అంతసులభమైన పనిగాదు ఈ కలిని సంపూర్ణముగా దాఁటువలె నను కోరిక మా కున్నది. దైవయోగముతో నీవులభించితివి. ఒక సముద్రమును దాఁటువలె నను గోర్కి గలవానికి, నావికునివలె నీవుఁ జిక్కినావు. కృష్ణపరమాత్ముఁడు దన మూలరూపముతోఁ జేరి, యవ్యక్తుఁ డయ్యెను. అతఁ డున్నప్పుడు తాను ధార్మికములైన కార్యము లొనర్చెడివాఁడు. బ్రహ్మజ్ఞానులకు హితకారియై యుండెను. అణిమాద్యష్టయోగ సిద్ధుల కతఁడు ప్రభువు. భక్తి జ్ఞానాది సాధ్య సామ్రగికి నియామకుఁడు, బ్రహ్మాది సమస్త యోగిజనులకును నియామకుఁడే. అతఁ డవ్యక్తుఁడైన తరువాత, తద్రక్షితమైన ధర్మము ఇప్డు

డనాథ యైనది. తన రక్షణకై ఇప్పు డెవరి నాశ్రయించును? ధర్మ మును రక్షించుకొను మార్గమేది? కనుక—

1. ముఖ్యమైన శ్రేయస్సాధన మేది?
2. బింబరూపియైన పరమాత్ముని దెలియుటెట్లు?
3. కృష్ణావతార చరిత్ర యేమి?
4. మూలరూపియైన పరమాత్ముని కార్యము లెట్టివి?
5. భిన్నభిన్నములైన యవతారములలో శ్రీహరి చూపిన పరాక్రమముల రహస్య మేమి?
6. ఇఁకమీఁద ధర్మము నిలుచు మార్గ మేమి?

ఈ యాఱుప్రశ్నలకును సమాధాన మీయవలెను.

పోతన్నగారు :

జలరాశి దాటఁగోరెడి
కలముజనుల్ కర్ణధారుఁ గాంచిన భంగిన్
కలిదోషహరణ వాంఛా
కలితులమగు మేము నిన్నుఁగంటిమి సూతా!

జలరాశి దాఁటఁగోరెడి కలము జనుల్=సముద్రమును దాటఁ గోరెడు పడవకొఱకై కాచినవారు, కర్ణధారున్=ఓడ నడపువానిని, కాంచిన భంగిన్=చూచినట్లు, కలిదోషహరణ కాంక్షాకలితులమగు మేము=కలిదోషములను బోఁగొట్టుకొనవలె నను కోర్కితోఁ గూడిన మేము, నిన్నుఁ గంటిమి=నిన్నుఁ జూచితిమి, దుస్తరం-అర్ణవం-నిస్తి తీర్షతాం=అను దాని తెలుఁగే జలరాశిదాఁటుగోరెడి జనులు. 'కర్ణధార' మూలశబ్దమే. కలిం నిస్తితీర్షతాం-కలిదోషహరణ వాంఛాకలితులు.

తాత్పర్యము: సముద్రమును దాఁటఁగోరెడి వారికి కర్ణధారుఁడు ప్రాప్తించినట్లు, కలిదోషహరణ వాంఛాకలితులమైన మాకు దైవయోగ

మున నీవు గన్పించితివి. ఇక్కడ మూలమందు 'కలిం నిస్తీర్షతాం అర్ణవం నిస్తీర్షతాం' అను రెండు రీతులుగా నన్వయము. అమాత్యు లా స్వారస్యమును గమనించి వాని నట్లే చెప్పినారు-

క. చారుతర ధర్మరాశికి
భారకుఁడగు కృష్ణుఁ డాత్మపదమున కేగన్
భారకుఁడులేక యెవ్వని
జేరెను ధర్మంబు బలుపుసెడి మునినాథా!

చారుతర = ఎక్కువ సుందరమైన, ధర్మరాశికిన్ = ధర్మముల సమూహముయొక్క, భారకుఁడగు కృష్ణుఁడు = భారము వహించెడు కృష్ణపరమాత్మ, ఆత్మపదమున కేగన్, భారకుఁడు లేక = భరించువాఁడు లేక, ధర్మంబు = ధర్మము, బలుపుసెడి = పుష్టిని గోల్పడినదై, ఎవ్వనిఁ జేరెను = ఎవరి నాశ్రయించినది?

తాత్పర్యము: రమణీయమైన ధర్మమునకు, కృష్ణుఁడు రక్షకుఁడుగా నుండెను. అతఁడు వైకుంఠమునకుఁ బోఁగా ధర్మమునకుఁ బుష్టితగ్గెను. రక్షకుఁడులేక యా ధర్మమెవని నాశ్రయించినది? ధర్మ రాశి 'చారుతర' మైనదని పోతన్న చెప్పెను. అతని దృష్టిలో ధార్మిక ముగాఁ బ్రదుకుటలో గొప్ప యందమున్నది. భారకుఁ డనఁగా నిక్కడ రక్షకుఁడనియే యర్థము. కృష్ణపరమాత్మ యున్నంత వఱకు ధర్మమునకు గొప్పధైర్యముండినది. 'నాకు రక్షకుఁడున్నా' డనుకొనెను. అతఁ డవతారముఁ జాలించినంతనే యా ధైర్యము తగ్గినది.

పుట్టపర్తి నారాయణాచార్యదాసునిచే విరచింపఁ
బడిన 'భాగవతసుధాలహరి' యందు
ప్రథమాధ్యాయము.

# భాగవత సుధాలహరి

## ద్వితీయాధ్యాయము

* * *

వ్యాస ఉవాచ:

ఇతి సంప్రశ్న సంహృష్టో విప్రాణాం రౌమహర్షణిః,
ప్రతిపూజ్య వచ స్తేషాం ప్రవక్తు ముపచక్రమే. 1

**వ్యాస ఉవాచ:**—వ్యాసుఁ డనెను.

విప్రాణాం—విప్రులయొక్క, ఇతి—ఈ ప్రకారమైన, సంప్రశ్న సంహృష్టః—చక్కని ప్రశ్నచేత చక్కఁగా సంతోషించి, రౌమహర్షణిః—రోమహర్షణుని పుత్త్రుఁడు, తేషాం—వారియొక్క, వచః—వాక్కును, ప్రతిపూజ్య—అభినందించి, ప్రవక్తుం—చెప్పుటకు, ఉపచక్రమే—ఆరంభించెను.

ప్రథమాధ్యాయమందు మును లడిగిన యాఱుప్రశ్నలలో నాల్గింటికి, సమాధాన మీ రెండవ యధ్యాయములో వచ్చును.

బ్రాహ్మణు లడిగిన యీ ప్రశ్నకు రౌమహర్షణుఁ డెంతయో సంతోషించెను. వారివాక్యముల నభినందించి, సమాధానము చెప్పుట కారంభించినాఁడు.

శ్రీధరవ్యాఖ్య:

శాస్త్రోపసారః శ్రీకృష్ణకృత్యం సృష్ట్యాదికేళయః,
అవతారకథాః కృష్ణవృత్తయో ధర్మరక్షణమ్.
తదేవం ప్రథమేఽధ్యాయే షట్ప్రశ్నా మునిభిః కృతాః,
ద్వితీయేతూత్తరం సూతః చతుర్ణామాహ తేష్వథ.

సంప్రశ్నములు చక్కనివి, సంపృష్టః=సమ్యక్ పృష్టః, వా రొనర్చిన ప్రశ్నలకు- సూతునకు మహాసంతోష మైనది. తన కథా కథనమున కర్హులైన శ్రోతలు దొరకినారని హర్షము, ప్రతిపూజ్య= ఎంతచక్కని ప్రశ్నము లొనర్చితిరని వారి నభినందించి-

వచనము: అని యిట్లు మహనీయ గుణగరిష్ఠులైన శౌనకాది మునిశ్రేష్ఠు లడిగిన, రోమహర్షణపుత్రుండై యుగ్రశ్రవసుండన నొప్పి నిఖిలపురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుండు.

అర్థములు: మహనీయ = గొప్పవైన, గుణ = గుణములచేత, గరిష్ఠులు=గొప్పవారైన, 'గరిష్ఠ-ద్రాఘిష్ఠ బృంహిష్ఠాః' అని యమ రము; భారమైనదని యర్థము. సందర్భము ననుసరించి గొప్పవా రనుట శౌనకాదిమునిశ్రేష్ఠులు = శౌనకుడు మొదలైన మునులలో శ్రేష్ఠులైనవారు. రోమహర్షణుఁడు-

రోమాణి హర్షయాం చ క్రే శ్రోతౄణాం య స్స్వభాషణైః,
కర్మణాప్రథిత స్తేన రోమహర్షణ సంజ్ఞయా. (కూర్మపురాణము)

తన భాషణములచేత, శ్రోతలకు రోమోద్గమము గల్గునట్లు చేయువాఁడు. ఆ కర్మచేత రోమహర్షణుఁడని ప్రసిద్ధుఁడయ్యెను. రోమహర్షణుని కొడుకే రౌమహర్షణి. తండ్రియొక్క గుణములన్నియుఁ బుత్రునకు సంక్రమించిన వన్నమాట. ఉగ్రశ్రవసుఁడు- ఉగ్రస్యశ్రవః యస్యసః=ఉగ్రశ్రవాః. నృసింహ తాపినీయోపనిషత్ప్రతిపాద్యుఁడైన, ఉగ్రుఁడనఁగా నృసింహుఁడు. అతనిని గూర్చిన గొప్పశ్రవణము గల వాఁడు, అనఁగా నృసింహోపాసకుఁడని యర్థము, నిఖిల=సమస్తము లైన, పురాణ=పురాణములయొక్క, వ్యాఖ్యాన=వ్యాఖ్యాన మొనర్చెడు, వైఖరీ=వైఖరీ వాక్కుచేత, సమేతుఁడు=కూడినవాఁడు; వైఖరి యను టకు శబ్దకల్పద్రుమమందీ వివరణ మున్నది. బుద్ధ్యుత్థిత-కంఠగతనాద రూపవర్ణః.

మూలాధారా త్ప్రథమ ముదితో యస్తుతారః పరాఖ్యః
పశ్చాత్పశ్యం త్యథహృదయగో బుద్ధియు జ్మధ్యమాఖ్యః,
వక్త్రే వై ఖర్యథ రురుదిషోరస్య జంతోః సుషుమ్నా
బద్ధ స్తస్మాద్భవతి పవన ప్రేరితో వర్ణసంఘః.

(అలంకార కౌస్తుభము)

యస్తు తారోనాదః వర్ణరూపః సనాభిరూప మూలాధారాత్
ప్రథమ ముదయం ప్రాప్తశ్చేత్పర ఇతి ఆఖ్యా,
సంజ్ఞా యస్య తథా భూతో భవతి.

అథ సఏవహృదయం చిత్తం గతశ్చేత్ రోదన సమయే నాసికాద్వారా యథా కథంచి ద్ధ్వనతి, రురుదిషోర్జంతోః నాసామధ్యస్థిత సుషుమ్నానాడ్యాబద్ధః తథా చ, నాసాద్వారైవ యథాకథంచిత్ నాదస్వరూపః ప్రత్యక్షం భవతీ త్యర్థః. తస్మాద్వైఖరీ దశాపన్నాన్నాదాత్. పవన ప్రేరితో వర్ణసమూహో బహి స్సర్వేషాం ప్రత్యక్ష విషయో భవతీత్యర్థః. పరా పశ్యంతీ దశాపన్నస్యతు, యోగినామేవ ప్రత్యక్షో. న తు సర్వేషామిత్యపి బోధ్యమ్.

(తత్ టీకా)

నాదము వర్ణరూపము నాభిరూప మూలాధారమునుండి బయలుదేరును. అప్పుడు దానికి 'పరావా'క్కని పేరు. అదే హృదయ గతమై 'పశ్యంతి' యనఁబడును. రోదన సమయమందు నాసికా ద్వారమున నది శబ్దించును. నాసికామధ్యగతమైన సుషుమ్నా నాడీ బద్ధమై నాసికాద్వారముననే యతికష్టమునఁ బ్రత్యక్షమగును. వక్త్రము నందు 'వైఖరీ' వాక్కని దానికిపేరు. పవన ప్రేరితమై యది సర్వులకును బ్రత్యక్ష మగును. 'పరా' 'పశ్యంతీ' అను రెండువాక్కులును యోగులుమాత్రమే విందురు.

సూత ఉవాచ:

> యం ప్రవ్రజంత మనుపేత మపేతకృత్యం
> ద్వైపాయనో విరహకాతర ఆజుహావ,
> పుత్త్రేతి తన్మయతయా తరవోఽభినేదు
> స్తం సర్వభూతహృదయం మునిమానతోఽస్మి. 2

సూతుఁ డనెను: ప్రవ్రజంతం=సమస్తము నుపేక్షించి పోవుచున్నవాఁడును, అనుపేతం=ఉపనయనము లేనివాఁడును, అపేతకృత్యస్య=సమస్త కార్యములనుండి దూరమైనవాఁడును నైన; యం=ఏ శుకబ్రహ్మ నుద్దేశించి, విరహకాతరః=వియోగభయముతో దుఃఖితుఁడైన, ద్వైపాయనః=వ్యాసభగవానుఁడు "పుత్త్ర! ఇతి"="ఓ కుమారా!" యని, ఆజుహావ=పిలిచెనో, తన్మయతయా=అతని స్వరూపములే యగుటచే, తరవః=వృక్షములు, అభినేదుః=ప్రతిధ్వని నిచ్చినవి, సర్వభూతహృదయం=సర్వభూతములయందును హృదయభూతుఁడై నిలిచిన, తం మునిం=ఆ మునినిగూర్చి, ఆనతః అస్మి=శిరమును వంచినవాఁడనైనాను

సూతుఁడు వ్యాఖ్యారంభమందు తన గురువైన శుకమహర్షి యొక్క సర్వాత్మభావమును ప్రకాశింపఁజేయుచు నమస్కరించుచున్నాఁడు.

శుకబ్రహ్మ కర్మమార్గము నాదరింపలేదు. అందుచే కర్మాధికారము నొసఁగు నుపనయనము నంగీకరింపలేదు. సర్వము నుపేక్షించెను. అతఁ డాత్మారాముఁడు. తండ్రిని గూడ వదలి సన్న్యసించి పోవుచున్నాఁడు. ఆ వియోగదుఃఖము వ్యాసునకు దుస్సహమైనది. అతఁడు 'పుత్త్రా' యని గట్టిగా నఱచెను. ఆ యడవి యందున్న వృక్షము లన్నియు నా శబ్దమునే ప్రతిధ్వనించినవి. ఆ యడవియంతయు శుకమయమే యైనది. ఆత్మస్వరూపుఁడైన శుకుఁడు తండ్రి యొక్క పుత్త్రప్రేమరూపమైన పాశము నుచ్ఛేదించుటకు ఈ రీతియైన శబ్దమును వృక్షముల నుండి బయలువెడలఁ జేసెను. సర్వభూతముల యందును నొకే సమయమందుఁ బ్రవేశింపఁ జాలెడు మహిమగల సర్వాత్ముఁడైన ఈ శుకబ్రహ్మకు నేను నమస్కరించుచున్నాను. వృక్ష

ములు గూడ 'పుత్రా!' యని యఱచుటచేత 'సర్వాత్ముఁడైన తనకు పితృ-పుత్ర భావమే లేదు' అని వ్యక్త మొనర్చిన ట్లైనది.

**శ్రీధరవ్యాఖ్య :**

ప్రవచనమునకు ముందు సూతుఁడు గురుదేవతా నమస్కార మాచరించుచున్నాఁడు. ఇవి మూఁడు శ్లోకములు. శుకమహర్షి యైశ్వర్యము ఆ చరిత్రవర్ణనముచేతనే సూచింపఁబడినది. ప్రవ్రజంతం యం=సర్వమును సన్న్యసించి పోవుచున్నట్టియు, అనుపేతం=నా కుపనయన మొనర్పవలెనని యాచార్యసన్నిధికిఁ బోవనివాఁడును, 'అష్టవర్షం బ్రాహ్మణ ముపనయీత' యను నియమము ననుసరించి యెనిమిదవయేట నుపనయనము గావలసియుండఁగా తద్విధికిఁ గూడ ననర్హమైన వయసువాఁడు, అతిబాల్య మని భావము. లేక, అనుపేతం-ఎవ్వరును వెంటరానివాఁడును, ఏకాకిగాఁ బోవుచున్నవాఁడన్నమాట. అపేతకృత్యం=కృత్యశూన్యుఁడు, నైష్ఠికుఁ డైనందుచేఁ గర్మమార్గమందుఁ బ్రవర్తింపనివాఁడు. ద్వైపాయనుఁడు వ్యాసుఁడు. పుత్రా + ఇతి = పుత్రేతి. ఇక్కడ ప్లుతసంజ్ఞ రావలసి యుండెను. అప్పుడు సంధి కుదరదు. ఆర్షమైన ప్రయోగమిది. తన్మయ తయా-శుకరూపప్రాప్తిచేత, తరవః అభినేదుః-వృక్షములు ప్రత్యుత్తర మిచ్చినవి. తండ్రి స్నేహానుబంధ పరిహారమునకై, వృక్షరూపముగా నుత్తర మిచ్చినాఁడని భావము. సమస్తవృక్షములును శుకరూపము లెట్లైనవి? సర్వభూత హృదయం-సర్వభూతములయొక్క, హృత్-మనస్సును, అయతే యోగబలేన ప్రవిశతీతి సర్వభూతహృదయః=యోగశక్తిచేత సర్వభూత హృదయములను బ్రవేశించినవాఁడు.

**వంశీధరకృతమైన భావార్థదీపికా వ్యాఖ్య :**

'ద్వైపాయనః ద్వీప ఏవ అయనం స్థానం యస్యసః ద్వైపాయనః'- యమున మధ్యమందుఁగల ద్వీపమందు సత్యవతీ పరాశరు

లకు జన్మించినవాఁడని యర్థము. లేక, 'పులినం ద్వీప ముచ్యతే' అని నిఘంటువు. యమునా పులినమే అయనం-తపోభూమిగాఁ గల వాఁడు. వ్యాసశుకుల మధ్య జన్యజనకభావ మున్నను, పితృ పుత్ర వ్యవహారము లేదు. 'నా యందుఁ బుత్రత్వము, నీయందు పితృ త్వము వ్యర్థమైనవే' యని వ్యాసునకుఁ దెల్పుటకే 'పుత్రా!' యని యాతని పిలుపును తరువులయందు వ్యాపింపఁ జేసినాఁడని తాత్ప ర్యము, లేక, అయం సర్వభూతహృత్, అయం-అ శుకబ్రహ్మ, సర్వ భూతహృత్-సర్వభూతములను, హరతి, ప్రాప్నోతి-పొందును. ఎట్లు? అంతర్యామి రూపముతో సర్వమునందు నున్నాఁడని తాత్పర్యము. ఈ దృష్టితోఁ గూడ పుత్రా! యని పిలుచుట గూడ పొసఁగదని భావము. లేక ధ్యానావేశముతో శుకుఁడు పోవుచున్నాఁడు. 'దృష్ట్వానుయాంత మృషి మాత్మ జమప్య నగ్నం' అని పైన భాగవతమందే వచ్చును. అతఁడు వ్యాసున కుత్తరమిచ్చుటయే లేదు. తత్పక్షపాతముతో నంత ర్యామియైన భగవంతుఁడే వృక్షములద్వారా యుత్తర మొసఁగినాఁ డని పక్షాంతరము. శుకుఁడు సర్వాత్మబ్రహ్మనిష్ఠుఁడు. అందుచే నిర పేక్షుఁడు. అతనియందు తండ్రి స్నిగ్ధుఁ డయ్యెను. అతఁడే కాదు. తరువులు గూడ స్నిగ్ధములైనవి. కనుక తన్మయతయా-వ్యాసునివలె స్నేహముచేతఁ గూడినవై చెట్లుగూడ, అభినేదుః-అతి ముఖ్యముగా నదించినవని వే రర్థము. తరువులే యాభిముఖ్యములైనప్పుడు తక్కిన జీవుల మా టేమిటి? అందుకే సర్వభూతముల హృదయములు ఎవని యందుఁగలవో వాఁడు సర్వభూతహృదయుఁడు. ఇది యర్థాంతము.

విశ్వనాథ చక్రవర్తి కృతమైన 'సారార్థదీపిక':

మహర్షులు 'ఏనాత్మా సుప్రసీదతి' యని ప్రశ్నించిరి. 'సర్వ రహస్యసారమును మాకుఁ దెలుపవలెను. అంతమాత్రమే గాదు. ఆ సారము భవ్యులు దేని నాత్మప్రసాదకముగా నిర్ణయించిరో యది కావలెను'. ఆ నిర్ణయమును సూతునకే వదలినారు. కొందరు సాం

ఖ్యమే సర్వసాధన మందురు. కొందఱికి మీమాంసాదులు సాధనములు. వేఱు కొంద ఱుపనిషత్పక్షపాతులు. కొందరు సకలోపనిషత్తాత్పర్య నిర్ణాయకములైన వేదాంతసూత్రములచేత మనఃప్రసాద మేర్పడు నందురు. కాని వేదాంతసూత్రములను రచించిన కృష్ణద్వైపాయనునకే చిత్తప్రసాదము గుదురలేదు. భాగవతనిర్మాణానంతరమే చిత్తశాంతి యేర్పడినది. పరీక్షిత్సభలో నన్ని యభిప్రాయముల వారునుండిరి. ఆ చోట భాగవతమే సకల సారమని నిర్ణీతమైనది. పరీక్షిత్సభ యను నగ్నితాపముతో భాగవత మనెడు బంగారు సర్వశుద్ధమై తేలెను. శౌనకాదు లడిగినప్పుడు వీరికిఁ జెప్పవలసినది భాగవతమే యను నభిప్రాయము సూతునకు దృఢమైనది అందుచే వెంటనే తదుపదేశకుఁడైన శుకునకు నమస్కరించి యారంభించుచున్నాఁడు.

> ఏనార్చితో హరిస్తేన తర్పితాని జగం త్యపి,
> రజ్యంతి జంతవస్తత్ర స్థావరా జంగమా అపి.
>
> (పద్మపురాణము)

కనుకనే తరువులు శుకమయములై యాభిముఖ్యముగఁ బ్రతిధ్వని మిషతో వ్యాసు ననుకరించినవి. వ్యాసునంత వానికి విరహకాతర్య మేల యేర్పడినది? శుకబ్రహ్మ సకల భూతహృదయుఁడు. సమస్త భూతముల మనస్సులును నాతనియం దున్నవి.

అందుచేత సర్వమనోహరమైన భగవచ్ఛ్రీవిగ్రహమునందువలె శ్రీశుకునియందు వ్యాసున కేర్పడినది ప్రాకృత మోహము గాదని తాత్పర్యము.

'ఓ నా కుమారా!' అని వ్యాసుఁ డఱచినప్పుడు శుకరూపమైన తరువులును 'ఓ కుమారా!' అని యఱచినవి. నీవు నేను బుత్త్రుఁడై నప్పుడు నాకు నీ వెందుకుఁగావు అని శుకుఁడు మారుప్రశ్న వేసినట్లు, చెట్లును 'హే పుత్త్రా!' యని శబ్దించినవి.

కస్యకే పితృపుత్రాద్యాః మోహ ఏవ హి కారణమ్.

అను సత్యమును విస్మరించి, 'ఎందుకట్లు మోహపడుచున్నావు' అని తరువులు ప్రతిధ్వని మిషతో నీవిషయమును వ్యంజింపఁజేసెను 'జడములైన వృక్షములయందుఁ బ్రవేశించి, తండ్రికే సమాధాన మొసఁగిన శుకబ్రహ్మ చేతనుఁడైన నాయందుఁ బ్రవేశించి, నానుండి భాగవతమును వ్యాఖ్యానింపఁ జేయునుగాక! యనియును వ్యాఖ్యానము. తానేగాక భాగవతమును వ్యాఖ్యానించు ప్రతియొక్కని వక్త్రమునందును శుకుఁడు సన్నిధానము సేయునుగాక! అని యాశీస్సు. ప్రతివ్యాఖ్యాతయు నిట్లే తలఁపవలెనని విధి.

వీరరాఘవవ్యాఖ్య:

ప్రవ్రజంతం=దైవపిత్రాదీన్ పరిత్యజ్యవ్రజంతం, దైవము పిత మున్నగువారిని విడిచి వెళ్లుచున్నవాఁడు, అపేతకృత్యం=కర్తవ్యాంశరహితుఁడు. ఉపాసనము నిష్పన్నమగుటచే కృతకృత్యుఁడనుట. ప్రవ్రజంతం=అనుటచేత దేహానుబంధిత్యాగము, అపేతకృత్యమనుటతో మమతారాహిత్యము, అనుపేతం=అనుటతో నిస్సహాయత్వము దేహపోషక సహాయాంతర రహితుఁడై యని యర్థము. దేహాత్మ భ్రమరూపమైన యహంకార రాహిత్యము వ్యంజిత మగుచున్నది.

శుకదేవకృత సిద్ధాంత ప్రదీపిక:

శుకా! అని వ్యాసుఁడు పిలిచెను. శుకబ్రహ్మ 'ఓ' యని ప్రత్యుత్తర మిచ్చినాఁడు. ద్రుమాదులుగూడ శుకునివలెనే ధ్వనించినవని యర్థము.

యస్యదేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ,
తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః.

అనెడు శ్రుత్యర్థాను సారముగా, గురువు వాసుదేవునితో నభిన్నుఁడు. సర్వభూత హృదయ మనుటతో నా యర్థమునే చెప్పు

చున్నాఁడు. సర్వేషాం = సర్వులయొక్క, బ్రహ్మాదిస్తంబ పర్యంత జీవులయొక్క, హృది=మనస్సులందు వ్యాపించి, అయతే, గచ్ఛతి= పోవుచున్నాఁడు. సర్వాంతర్యామి వాసుదేవుఁడు.

'ఆచార్యం మావిజానీయాత్ ' అనునట్లు శుకబ్రహ్మను వాసు దేవునిగా నెంచి, సూతుఁడు, నమస్కరించుచున్నాఁడనుట.

వల్లభాచార్యకృత సుబోధినీవ్యాఖ్య:

శుకునిగూర్చిన స్తుతి శ్లోకములు రెండు.

1. అతని వైరాగ్యమును జెప్పుచున్నాఁడు.

2. అతని విజ్ఞానమును,

ప్రవ్రజంతం=ఎంతగా విరక్తుఁడైన, నంతగా నధికారిత్వము సిద్ధించును. శుకునకుఁ బూర్వజన్మమందే, సంపూర్ణ జ్ఞానము లభించి నది. అతఁడు యోగ్యదేహము నన్వేషించు చుండెను. విష్ణుస్వరూపుఁ డైన వ్యాసునినుండి, దేహము నందినాఁడు. పూర్వసంస్కారము దృఢ ముగా నున్నది, అందుచే ననుపనీతుఁడుగనే బయలుదేరెను. శుకునకు దేహపితృసంగతితో స్వనాశరూపమైన భయమేర్పడినది. వ్యాసుఁడు సంపూర్ణాధికారి యగుటచే దేహాది ధర్మములు ప్రవర్తించినను, భయ రహితుఁడు, భగవద్బలమే బలమని, పుత్రుని వారించుచున్నాఁడు, అపేతకృత్యం = కర్మాధికారిత్వమునకే యుపనయనము. పైఁగా నతఁడు విష్ణుసకాశమునుండి పుట్టెను. అందుచే నితర సంస్కారములతో నావశ్యకత లేదు. వ్యాసుఁడు ప్రేమచే సన్నకంఠుఁడైనాఁడు. దానితోఁ బ్లుతమునకు ప్రాప్తిలేదు, సంధివచ్చినది. విష్ణువునుండియే తరువులు జనియించినవి. శుకుఁడుగూడ విష్ణుపుత్రుఁడు. అందుచే వారి కేకోపాదాన కత్వము, తన్మయత. కనుకనే ప్రతిధ్వానము. 'వైష్ణవీ, వై, వనస్పతయః' అని శ్రుతి. లేక 'వాగ్దేవేభ్యోపాక్రమత్ యజ్ఞాయాతిష్ఠమానా సా వనస్పతీన్ ప్రావిశత్, సైషా, వా, గ్వనస్ప

తిషు వదతి', ఈ శ్రుతివలన వృక్షములనుండియే శబ్దోత్పత్తి. సర్వ భూతహృదయములను ప్రేరణార్థమై ప్రవేశించిన వాఁడుగనుక సర్వ భూతహృదయుఁడు. సర్వభూతప్రేరణ సామర్థ్యమున్న వాఁడని తాత్పర్యము.

ద్వైతవ్యాఖ్య:

శౌనకాదుల కుత్తరముగా భాగవతమునుఁ జెప్పనారంభించిన సూతుఁడు శిష్టసంప్రదాయము ననుసరించి, ప్రారంభమందు తన యిష్టగురువైన రుద్రుని యవతారమైన శుకుని నమస్కరించు చున్నాఁడు. ఆతని చరిత్ర వర్ణన మూలకముగా నమస్కారము.

విజయధ్వజము:

విరహకాతరః=పుత్రవియోగముతో నధైర్యమునందిన వానివలెఁ గన్పించుచున్న, నిజమున కధైర్యము వ్యాసునకు లేదు. అతఁడు విష్ణ్వవతారము. అధైర్యమందిన వానివలెఁ గన్పించుచున్నాఁడు. ద్వైపాయనః= 1. యమునానదియొక్క నడిగడ్డయే వాసముగా గలవాఁడు. 2. యమునానది యొక్క పులినతలమే ఉత్పత్తి స్థానము గాఁగలవాఁడు, అనుపేతం=అభిమానము లేదు, అందుచే దేహమునం దాసక్తిలేదు. అపేతకృత్యం= 1. కృతకృత్యుఁడైనవాఁడు, 2. ఛేద నము మొదలైన హింసాకృత్యములను వదలినవాఁడు, దానితో 'ప్రవ్రజంతం' సన్న్యసింపను బయలుదేరిన, యం=ఏశుకుని, పుత్రేతి=కుమారుడా! యని, యదా=ఎప్పుడు, ఆజుహావ=పిలిచెనో తదా=అప్పుడు,తన్మయతయా=ఆశుకునిచేత నధిష్ఠితమైన, తరవోఽపి= వృక్షములుఁగూడ, నేదుః=ప్రత్యుత్తర మొసఁగినవి, తరవోఽభినేదుః= ఇతరులపాఠము. తరవోఽపి నేదుః=వీరి పాఠము.

'మీకు నా వియోగముండదు. నేను సమస్తప్రాణుల దేహము లందుఁగూడ నున్నాను. అందుచే మీరు భీతిల్ల నవసరములేదు.' ఇట్లు తండ్రిని సమాధాన పఱచుటకై తాను సమస్తమునందుండుటను

శుకాచార్యుఁడు ప్రకటించెను. అతఁడే సమస్త ప్రాణులందుండి, తానే వ్యాసున కుత్తర మొసఁగెనని తెలివిడి. సర్వభూతహృదయం = అహంకార తత్త్వాభిమానియైన సమస్తజీవుల హృదయములను బొందినవాఁడు.

ద్వీపమునందు బుట్టినవాఁడనుట ఔపచారికమే. అట్లే పరాశరుని కుమారుఁడనుటయు. ఈ విషయమును దెలుపుటకే ద్వైపాయన శబ్దము వాడఁబడినది. అనుపేతం = ఉపనయనము లేనివాఁడని యర్థము చెప్పరాదు. ఉపనయనము లేనివాఁడు సన్న్యసించుటకు వీలు లేదు. ప్రవ్రజన మనఁగా సన్న్యాసమని యర్థముగాదు. ప్రకర్షముగాఁ బోవుట యనునర్థమునుగాదు. 'యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్ - వైరాగ్యము నెప్పుడు పొందినాఁడో, అప్పుడే సన్న్యాసమును స్వీకరింపవలెను. పై గౌతమసూత్రమందలి, ప్రవ్రజన శబ్దమునకు సన్న్యాస మనియే యర్థము. దానికి విరుద్ధముగా నర్థకల్పనము సరి కాదు. కనుక, అనుపేతం = దేహాదులతో యుక్తుఁడుగాని వాఁడని యర్థము. శుకునకు దేహమున్నదిగదా! లేదనిచెప్పుటెట్లు? అందుకే మధ్వాచార్యులు 'అనభిమానాత్' అన్నారు. అభిమానము లేకుండుటచే దేహ మున్నను లేనట్లే. ఇట్లు నిరభిమాని యగుటయే సన్న్యాసమునకుఁ గారణమని తెలియవలెను; విరహకాతరః = వేదవ్యాసుఁడు విరహకాతరునివలెఁ గన్పించినాఁడేగాని, నిజముగాఁ గాతర్యము లేదని యర్థము. దీనికి స్కాందవచనములు ప్రమాణము.

> నిత్యతృప్తః వరానందో యోఽవ్యయః పరమేశ్వరః.
> యస్య పుత్త్రఫలం నైవ య్జ్ఞాతం జగదీదృశమ్.
> యదధీన శ్రియోఽపాంగాత్ బ్రహ్మరుద్రాది సంస్థితిః,
> స పుత్త్రార్థం తపస్తేపే వ్యాసో రుద్రస్య చేశ్వరః.
> కాతర్యం దర్శయామాస వియోగే లౌకికం హరిః,
> కుతః కాతరతా తస్య నిత్యానంద మహోదధేః.

శ్రీమన్నారాయణుఁడు నిత్యతృప్తుఁడు. పరానందుఁడు. అవ్యయుఁడు. పరమేశ్వరుఁడు. అతనినుండియే యీ దృశ్యప్రపంచము జన్మించినది. కాని, యతనికిఁ బుత్త్ర ఫలము లేదు. ఎవనికి లోఁబడిన శ్రీదేవియొక్క కటాక్షముచే బ్రహ్మరుద్రాదుల సంస్థితియో అతఁడు పుత్త్రార్థమై తప మొనర్చెను. రుద్రుఁడు దనకు గుమారుఁడు గావలెనని; పుత్త్ర వియోగమందు వ్యాసభగవానుఁడు లౌకికము గాతర్యము బ్రదర్శించెను. నిత్యానంద మహోదధియైన వానికిఁ గాతర్య మెక్కడిది? పరమాత్ముఁడు దైత్యుల మోహనార్థమై యప్పుడప్పుడు దన స్వభావమునకు విరుద్ధములైన కార్యము లొనర్చును. దీనికిఁ బ్రమాణము ఉద్యోగపర్వమునందలి యీ శ్లోకము.

> ఈశన్నపి హి లోకస్య సర్వస్య జగతో హరిః,
> కర్మాణి కురుతే విష్ణుః కీనాశ ఇవ దుర్బలః.

శ్రీహరి లక్ష్మీ బ్రహ్మాది సమస్త జగత్తును నియమించువాఁడు, ఐనను వ్యాసాదిరూపధారియైన విష్ణువు సామర్థ్యములేని కర్షకునివలెఁ గాతర్యప్రదర్శకములైన కర్మము లొనర్చును. పరమాత్మ్ముఁ డవతారమెత్తినపుడు అప్రాకృత దేహధారి యైనను ప్రాకృత దేహధారివలె తత్తచ్ఛరీరానుగుణములైన కర్మములే చేయును.

> దేవత్వే దేవవచ్చేష్టా మానుషత్వే చ మానుషీ. (విష్ణుధర్మోత్తరము)

కనుక, మనుష్యరూపియైన వ్యాసుఁడు తదనుగుణమైన కార్యము నొనర్చెనని తెలియవలెను, దీనితో దేవతలుగూడ మనుష్య శరీరధారులైనపుడు మనుష్యులవలెనే వర్తింపవలెనని విధి యేర్పడినది. శుకాచార్యుఁడు సర్వభూత హృదయగతుఁడు. దీనికిఁ బ్రమాణముగా నానంద తీర్థు లీ శ్లోకమును జూపించిరి.

> అహంకారాత్మకో రుద్రః శుకో ద్వైపాయ నాత్మజః.(స్కాందపురాణము)

అహంకార తత్త్వాభిమానియైన రుద్రుఁడే వ్యాసపుత్త్రుఁడు శుకాచార్యుఁడు. కనుక నతఁడు సర్వభూత హృదయగతుఁ డగుటలో

నాక్షేపము లేదు. 'పుత్రా!' యని వ్యాసుఁడఱచినపుడు 'ఓ' యని శుకుఁడు బదులిచ్చెను. ఆ యుత్తరమునే సమస్త వృక్షములు గూడ ప్రతిధ్వనించినవి.

పోతన్నగారు :

మ. సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్న్యాసియై యొంటి బో
ప మహాభీతి నోహో ! కుమార ! యనుచున్ వ్యాసుండు పీరంగ వృ
క్షములున్ దన్మయతం బ్రతిధ్వనులు నక్కంజేసె మున్నట్టి భూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపోధన్యాగ్రణిన్ ధీమణిన్.

అర్థములు : మున్ను = ఒకనాఁడు, సముఁడై = బ్రాహ్మీస్థితిని బొందినవాఁడై, ముక్తకర్మచయుఁడై; ముక్త = వదలఁబడిన, కర్మచయుఁడై = కర్మకాండమునకు సంబంధించిన సకల ప్రవృత్తులు గలవాఁడై, సన్న్యాసియై = సన్న్యసించినవాఁడై, ఒంటిన్ + పోవన్ = ఏకాకియై పోవుచుండఁగా, మహాభీతిన్ = ఎక్కువ కాతర్యముతో, వ్యాసుండు = వ్యాసభగవానుఁడు, ఓహో కుమార యనుచున్ = ఓ కుమారా యని, చీరంగన్ = పిలువఁగా, తన్మయతన్ = శుకరూపముతో, వృక్షములున్ = ఆ యడవియందున్న చెట్లు గూడ, ప్రతిధ్వనులు = ప్రతిశబ్దములను, చక్కంజేసెన్ = చక్కగా నొనర్చినవి. అట్టి భూతమయున్ = అట్లు సమస్త భూతముల హృదయములందును వర్తించుచున్న వాఁడైన, తపోధనాగ్రణిన్ = తపస్సుతో ధన్యాత్ములైన మహామునులలో శ్రేష్ఠుఁడును; ధీమణిన్ = బుద్ధిమంతులలో నుత్తముఁడును నైన, బాదరాయణిన్ = వ్యాసుని కుమారుఁడైన శుకబ్రహ్మను గూర్చి, మ్రొక్కెదన్ = నమస్కరించెదను.

విశేషార్థములు : సముఁడై = బ్రాహ్మీమయుఁడగుటచే, సమస్త ద్వంద్వములందును, సమభావముగల స్థితప్రజ్ఞుఁడు. అతఁడు నిరహంకారుఁడు, నిర్మముఁడు, శాంతియుక్తుఁడు, సర్వదుఃఖహానికిఁ గారణ

మైన చిత్తనైర్మల్యము గలవాఁడు. 'ముక్తకర్మచయుఁడై'-కర్మమార్గము విధినిషేధములతో నానాప్రకారము. ఇంతచేసినను దానితో లభించునది చిత్తశుద్ధియే. వేదపురుషుఁడు పుష్పితములైన వాక్కులతోఁ గర్మమార్గమునకుఁ బ్రేరేచెను. కర్మభేదముతో బుద్ధి బహుశాఖలై యనంతమై పోవుచున్నది. దీనినే భగవానుఁ డిట్లన్నాఁడు.

కామాత్మానః స్వర్గపరాః జన్మకర్మ ఫలప్రదామ్,
క్రియావిశేష బహుళాం, భోగైశ్వర్య గతిం ప్రతి.

భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృత చేతసామ్,
వ్యవసాయాత్మికాబుద్ధిః, సమాధౌ న విధీయతే.

త్రైగుణ్య విషయా వేదాః, నిస్త్రైగుణ్యో భవార్జునః
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్.

అర్జునా! కర్మమార్గరతులు కామాత్ములు, స్వర్గపరులు వారు. జన్మములను, గర్మఫలములను నొసఁగునదియైన కర్మమార్గము ననుసరింతురు. అది భోగైశ్వర్యముల కుపాయము. వివిధ కర్మకలాపములతోఁ గూడినది. భోగైశ్వర్యప్రసక్తులైన వారిబుద్ధి సమాధియందు నిలువదు. వేదములు త్రైగుణ్యవిషయములు. అర్జునా! నీవు నిస్త్రైగుణ్యుఁడవు గమ్ము. నిర్ద్వంద్వుఁడ వగుము. నిత్యసత్త్వస్థుఁడవై యుండుము. యోగక్షేమ రహితుఁడవు గమ్ము. ఆత్మవంతుఁడ వగుము.

ప్రవ్రజంతం=అనుదానికి సన్న్యాసియై, యనునది తెనుఁగు, అనుపేతం=అనుటకు, శ్రీధరుఁడు రెండర్థములు చెప్పినాఁడు. 1. నాకుపనయనము సేయుఁడని యాచార్యుల చెంతకుఁ బోవనివాఁడు. 2. ఎవ్వరును వెంటలేనివాఁడు, ఏకాకి యనుట.

రెండవయర్థ మెందుకుఁ జెప్పవలసి వచ్చినది?

అనుపనీతునకు సన్న్యాసాధికారములేదు గనుక.

అందుకే శ్రీధరుఁడు 'ప్రవ్రజంతం' సర్వం సన్న్యస్య గచ్ఛంతం అని మాత్రమే చెప్పెను. సన్యస్య=వదలి అని యర్థము. దీనిని మనసులోఁ బెట్టికొనియే యమాత్యుఁడు 'సన్న్యాసియై' అన్నాడు. శుకాచార్యుని సన్న్యాసము విధిపూర్వకమా కాదా యను ప్రశ్న యిరువురును బెట్టుకొనలేదు. విజయధ్వజవ్యాఖ్యాత దీనికిఁ జక్కని యుపపత్తి నిచ్చినాఁడు. అది యిది.

అనుపేతుఁ డనఁగా దేహ మున్నను దేహబుద్ధి లేనివాఁడు. మధ్వాచార్యులు 'అనభిమానాత్' అన్నారు. నిరభిమాని. నిరభిమాని యగుటయే సన్న్యాసి యగుటకుఁ గారణమైనది. మహో భీతిన్-కాతరః అనుటకుఁ దెనుఁగు. సంస్కృతములో పుత్త్రేతి పుత్త్రా + ఇతి అని విభాగము. అక్కడ సంధి యార్షము. తెలుఁగులో నా వింగడింపు కష్టము. కనుక తెనుఁగుఁదనము నాకళించికొన్న పోతనామాత్యుఁడు 'ఓహో! కుమార' యన్నాఁడు. దీనితో ప్లుతసంజ్ఞ స్వరసముగా నేర్పడినది. తన్మయతన్-శుకరూపము లగుటచేత, వ్యాసుని యఱపునకుఁ బ్రతి శబ్దమొసఁగినవి అనఁగా శుకుఁడు సర్వభూతమయుఁడు. సమస్త భూతములయం దాతఁడున్నాఁడు. ఈ విషయము వ్యాసభగవానుని జ్ఞప్తి కెలయించి, పితృ పుత్త్ర సంబంధము కృతకమైనదని తెలిపినాఁడని భావము. నేనెట్లు నీకుఁ బుత్త్రుఁడనో అట్లే నీ వెన్నోసారులు నాకుఁ బుత్త్రుఁడవై యుందువు' అని తెల్పినట్లైనది. సర్వభూత హృదయం=అనుటకు సర్వభూతమయుఁడని యమాత్యుని దెనిఁగింపు. సమస్తప్రాణులును దానే యైనాఁడని యర్థము. మూలార్థముగూడఁ దాత్పర్యములో నమాత్యుని యర్థమందే పర్యవసించుచున్నది. 'బాదరాయణి' బాదరాయణునియొక్క కుమారుఁడు. బదర మనఁగా రేగు. దాని సమూహము బాదరము. ఎవని తపోభూమి బాదరమో యాతఁడు బాదరాయణుఁడు. ఈ శబ్ద మెందుకు వాడవలసి వచ్చినది? శుకుని మహత్త్వ కేవల వ్యక్తిత్వముతోనే రాలేదు. అతని తండ్రి

గొప్పవాఁడు. అతని తపోభూమిగూడ గొప్పది. అనఁగాఁబరంపరగా శుకుని కౌన్నత్య మేర్పడినది. బదరీవనమునందు వ్యాసుఁడు దప మొనర్చి, తత్ఫలముగా శుకునిఁ గాంచెను. బదరికాశ్రమము జ్ఞాన భూమి. అక్కడి తపము విలక్షణమైనది. శుకుఁడు పూర్వజన్మమందు భగవంతునకు బరమాంతరంగుఁడు. నికుంజ మందిరమందున్న లీలా శుకమే శుకుఁడుగా జన్మించెను. వ్యాసుఁడే స్వయముగా నారా యణుఁడు. తీవ్రమైన తపము. అదియును బదరికాశ్రమమందు. దీని ఫలమే శుకుఁడు. దీనితో నేమి తెలియుచున్నది? అతఁడు చెప్పఁబోవు కథ సామాన్యమైనది గాదని యర్థము. ఏ మహాపురుషుఁడును గ్రామ్య కథను వచింపఁడు. వాని సన్నిధానముగూడ గ్రామ్య కథా భంజకము. వాని యెదుటనే యెవ్వఁడును గ్రామ్యకథాకథనమునకు సాహసింప లేనిచో వాఁడెట్లు గ్రామ్యకథలు చెప్పును? అతఁ డేదో దివ్యాతిదివ్యమైన రహస్యమునే యుద్ఘాటించును. ఇట్లు భగవంతుఁడైన బాదరాయణుఁడు మాతృమంతుఁడు; పితృమంతుఁడు; ఆచార్యవంతుఁ డైనాడు.

యస్స్వానుభావ, మఖిలశ్రుతిసార మేక
మధ్యాత్మదీప మతితీరషతాం తమోఽంధమ్
సంసారిణాం కరుణయాహ పురాణగుహ్యం
తం వ్యాససూను ముపయామి గురుం మునీనామ్. 3

స్వానుభావం=సాధారణమహిమ గలదియు, అఖిల శ్రుతిసారం=సమస్త వేదసారమును, ఏకం=అద్వితీయమును, అంధం తమః=సంసారమనెడు గాఢాంధకారమును, అతితీరషతాం=దాఁటఁ గోరుచున్న, సంసారిణాం=సంసారబంధమున్నవారికి, అధ్యాత్మదీపం=ఆత్మస్వరూపమును ప్రకాశింపఁ జేయునదియునైన, పురాణగుహ్యం=పురాణరహస్యమును, కరుణయా=దయతో, యః=ఎవఁడు. ఆహ=పలికెనో, మునీనాం గురుం=మునిశ్రేష్ఠులకును గురువైన, తం వ్యాససూనుం=ఆ వ్యాసపుత్త్రుఁడైన శుకమహర్షిని. ఉపయామి=శరణ మందెదను.

సంసారమనునది ఘోరమైన యంధకారము. దీనిని దాటం గోరెడు, సామాన్యులపై నున్నదయతో శుకమహర్షి భాగవతమును వచించెను. ఇది యసాధారణ మహిమగలది. వేదసార మంతయు నిమిడ్చికొన్నది. దీనితోఁ బోల్పఁదగినది మఱియొకటి లేదు. ఆత్మ స్వరూపమును జక్కగాఁ బ్రకాశింపఁజేయు దీపమువంటిది. అతఁడు మహర్షులకును గురువు. అట్టి వ్యాసపుత్త్రునకు నేను నమస్కరించు చున్నాను.

> నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
> దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్. 4

నారాయణం=శ్రీమన్నారాయణుని, నరోత్తమం=నరులలో శ్రేష్ఠుఁడైన, నరం చ=నరుని, దేవీం సరస్వతీం=వాగ్దేవియైన సరస్వతిని, వ్యాసం=వ్యాసభగవానుని, నమస్కృత్య=నమస్కరించి, తతః = అనంతరము, జయం = గ్రంథమును, ఉదీరయేత్=చెప్పవలెను.

శ్రీనారాయణునకును, నరోత్తముఁడైన నరునకును, వాగ్దేవియైన సరస్వతికిని, వ్యాసునకు నమస్కరించి, తర్వాత గ్రంథారంభ మొనర్పఁబడును.

శ్రీధరీయము:

ముందటి శ్లోకములో, శుకుని యైశ్వర్యమును, బ్రకటించినాఁడు. ఈ శ్లోకములో నాతని దయను వివరించుచున్నాఁడు. అంధం తమః=సంసారమును, అతితీర్షతాం=దాటఁగోరుచున్నవారు. 'అతితీర్షతాం'=అని యుండవలెను. వ్యాసభగవానుఁడు అతితీరషతాం, అని ప్రయోగించినాఁడు. రేఫరకారవిశ్లేషము ఛాందసము; పురాణములలోనిది మహారహస్యమైనది. ఈ విషయమున కుపష్టంభకముగా నాల్గువిశేషణములున్నవి. స్వానుభవం-స్వ=తనయొక్క, అసాధారణ

మైన అని యర్థము. అనుభవ మనఁగా, ప్రభావము. అది కలది స్వానుభావము.

స్వః అనుభావః యస్య తత్ - అని సమాసము, అఖిల శ్రుతిసార మన్ననది రెండవ విశేషణము. ఏకం-అనునది మూఁడవ విశేషణము. అద్వితీయ మనుట. ఆత్మతత్త్వం 'ఆత్మానం కార్యకారణ సంఘాత మధికృత్య వర్తమానం అధ్యాత్మం' ఆత్మతత్త్వ మనుట. ఆత్మ కార్య మం దున్నది, కారణ మందున్నది. ఇది యద్వైత ప్రక్రియ. దీనిని గూర్చి మొదటి శ్లోకవ్యాఖ్యానమందే వివరించితిమి. అట్టి యాత్మ తత్త్వమును గనుపింపఁజేయు దీపమువంటి దీ గ్రంథము.

ఇట్లు రెండు శ్లోకములతో గురువందన మొనర్చి యిష్టదేవతా ప్రార్థనముఁ జేయుచున్నాఁడు.

జయత్యతి నే సంసారతి మిజయో గ్రంథః. ఈ గ్రంథముచే సంసారమునుండి నరుఁడు తరించుచున్నాఁడు.

వంశీధరుని భావార్థదీపిక :

'తద్వ్యావృత్తి స్తదితరా దావృత్తి రసాధారణః' తనయందుండి ఇతర మందేగుణము లేదో అది యసాధారణ గుణము. భాగవతమం దున్న ప్రభావము మఱిదేనియందును లేదు. శుకమహర్షి తనతండ్రి యైన కృష్ణద్వైపాయనుని యందే అనుసంధాన రహితుఁడు. ఇట్టి వాఁడు భగవల్లీలా వర్ణనామయమైన భాగవతగ్రంథావేశముతో నిట్టి వాఁ డయ్యెనని తాత్పర్యము. ఈ యర్థమును యః అనునది తెలుపును. భాగవతగ్రంథమందే మఱియొకచోట శుకస్తుతి వచ్చును. అది యిది.

స్వసుఖనిభృతచేతాః తద్వ్యుదస్తాన్యభావో
ప్యజిత రుచిరలీలాకృష్ట సార స్తదీయమ్,
వ్యతనుత కృపయాయస్తత్త్వ దీపం పురాణం
త మఖిల వృజినఘ్నం వ్యాససూనుం నమామి.

స్వసుఖ నిభృతచేతాః=స్వానందముచేత నిండిన మనస్సుగల వాఁడు. సాధారణముగా ప్రాణులచిత్తములు విషయములతోఁ బూర్ణమైయుండును. కాని, స్వభావతః అది యాత్మానందపూర్ణమైనదే. ఒక ఘటమున్నది. దాని యందు దాకాశ మున్నది, ఘటాకాశము; ఆకాశముతో ఘటము పూర్ణమైనదే, కాని జలముతో నింపెదము. ఈ యస్వాభావికమైన పూర్ణత్వముతో, స్వాభావిక పూర్ణత్వము లోపించును. అట్లే చిత్తమునకు స్వాభావికమైన బ్రహ్మాకార కారిత్వము అస్వాభావికమైన విషయాకారకారిత్వముచే నివృత్తమై పోవును. ఇది సామాన్యులస్థితి. కాని శుకబ్రహ్మచిత్తము విషయ వ్యామోహము నుండి నివృత్తమైనది గదా! అందుచే నాత్మానందముచేత మాత్రమే పూర్ణమైయుండినది. కనుకనే 'స్వసుఖ నిభృతచేతాః' అను విశేషణము 'తద్వ్యుదస్తాన్య భావః' ఆత్మానందమందు విశ్రాంతుఁ డగుటచే, నన్యపదార్థముల నటసికి, సత్యత్వబుద్ధి లేదు. ఇట్లుండగా– 'అజిత రుచిర లీలాకృష్టసారః'– అజితునియొక్క లీలలు శుకమహర్షి చిత్తములో వ్యాపించినవి. అతని బ్రహ్మాకారవృత్తియొక్క నిశ్చలత కృష్ణ భగవానుని లీలలచే నపహృతమై పోయినది. అప్పుడు శుకుఁడు కృపావశుఁడై, తత్త్వప్రదర్శకమైన నీ పురాణమును విస్తరించెను. అతఁడు సమస్త జనుల పాపములను హరించువాఁడు. సామాన్యులందఱికిని, 'అజిత రుచిరలీల' లందలి రహస్య మవగాహనము గాదు. వారు అజితలీలాశ్రవణము వఱకును బోఁగలరు. అటుతరువాత వాని మననముతో రహస్యమును దెలిసికొనుటకై యత్నింతురు. 'సంసారిణాం కరుణయాహ' కేవలము పరీక్షిత్తు ఒక్కఁడే గాదు తరింపవలసినది. పుట్టఁబోవు సంసారులును దీనిచేఁ దరింతురు గాక యనెడు విశాలభావము గలవాఁడు శుకమహర్షి. అధ్యాత్మతత్త్వం– ఆత్మయందధిష్ఠించిన మహదాది తత్త్వములు. వానియొక్క స్వరూపమును స్పష్టముగాఁ దెలియఁ జేయును; భాగవత పఠనముతో సంసారుల

కవిద్యాక్షయ మగుచుండును. శుద్ధభక్తులకు అఖిలములైన శ్రుతుల నఁగా నుపనిషత్తులు వానిసారము దొరకుచుండును. శ్రుతీనాం=చెవులకు, సారం=ఆస్వాద్యమానమగు వానిలో శ్రేష్ఠమని యర్థాంతరము. 'స సంహితాం భాగవతీం'- 'యత్రైషాసాత్వతీ శ్రుతిః' అనుచు, 'సంహిత'- 'శ్రుతి' ఇత్యాది శబ్దములు భాగవతమును గూర్చి వాడినందువలన నిది వేదస్వరూపమేగాని యన్యముగాదని భావము.

**నారాయణం నమస్కృత్య:**

పురుషోత్తముఁడైన శ్రీకృష్ణుఁడు భాగవతమునకు దేవత. సరస్వతి శక్తి; వ్యాసుఁడు ఋషి; బీజ మోంకారము. దీనిలోఁ బ్రధానముగా గాయత్రీఛందము. దానితోనే గ్రంథారంభ మగుట వలన- 'ఉదీరయేత్' గ్రంథము నారంభింపవలెను అనుటచేఁ బ్రతిపౌరాణికుఁడు నిట్లే చేయవలెనని విధించినట్లైనది. నమస్కృత్య=నమస్కరించి, జయం=గ్రంథమును, ఉదీరయేత్=అరంభింపవలెను. ఇంత మాత్రమే చాలును; తతః=అను టనవసరము. దీనిని గర్తృవిశేషణముగా నన్వయింపవచ్చును. 'తన్యతే అనేనేతి తతః'- ఇతనిచేత గ్రంథము, స్వబుద్ధ్యనురూపముగా విస్తరించి చెప్పఁబడుచున్నది. కనుక నమస్కృత్య=పైదేవతలకు నమస్కరించి, తతః=పౌరాణికుఁడు, జయం=గ్రంథమును, ఉదీరయేత్=చెప్పవలెను.

కొంతమంది నర శబ్దమును 'గురుపరముగా నన్వయింతురు'. 'నృణాతి ఇతి నరః'- అనఁగా నయోపదేశములచేత శిష్యుని సంసారమునుండి యుద్ధరించువాఁడు. నరోత్తముఁ డనఁగా వాయువు. 'నరాః ఉత్తమాః ఏన'- యని సమాసము. ప్రాణసంచారములేనిది దేహము శవమై పోవుచున్నది. ఉపనిషత్తులలో వచ్చు ప్రాణేంద్రియ సంవాదకథచే ప్రాణవాయువునకే యుత్కర్ష చెప్పఁబడినది. వాయువునకు నమస్కార మెందుకు? శ్రుతిలో నిట్లున్నది.

'ఓం నమో బ్రహ్మణే నమస్తే వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాఽసి, త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి. ఋతం వదిష్యామి, సత్యం వదిష్యామి. తన్మా మవతు, తద్వక్తార మవతు. అవతు మా మవతు వక్తారమ్'-

జయతి సంసార మనే నేతి జయః- సంసారము దీనిచేత జయింపఁబడును. పురాణ, మహాభారతాదు లన్నియు జయములే.

అష్టాదశపురాణాని రామస్య చరితం తథా,
కార్ష్ణం వేదం పంచమం చ, యన్మహాభారతం విదుః.
తథైవ విష్ణుధర్మాశ్చ శివధర్మాశ్చ శాశ్వతాః,
జయేతి నామ తేషాంచ ప్రవదంతి మనీషిణః.

(భవిష్యపురాణము)

## వీరరాఘవీయవ్యాఖ్య:

పురాణగుహ్యం, గుహ్యం పురాణం అనుట. 'విశేషణం విశేష్యేణ బహుళం' అను సూత్రమందున్న బహుళగ్రహణముతో విశేష్యమైనను పురాణశబ్దమునకుఁ బూర్వనిపాత మేర్పడినది. గుహ్యమైన పురాణమని యర్థము. స్వానుభావం స్వ=శుకునిచేత, అనుభావం=మొదట ననుభ వింపఁబడినది. కర్మణి 'ఘఞ్' ప్రత్యయము, అఖిల శ్రుతిసారం= సమస్తవేదసారము. వేదపూర్వభాగమైన కర్మకాండ విషయములు గూడ భాగవతమునం దక్కడక్కడ భగవదారాధనా రూపములుగాఁ జెప్పఁబడినవి. కనుక, ఫలాఽనభిసంధి పూర్వకముగాఁ గర్మలొనర్ప వలెననియే భాగవత భావము. అధ్యాత్మదీపం=ఆత్మన్యధి అధ్యా త్మం, విభక్త్యర్థమం దవ్యయీభావ సమాసము. పరమాత్మ స్వరూప మును జీవ స్వరూపమును స్పష్టముగాఁ జూపుటలోఁ దెల్పుటలో దీపము వంటిదని యర్థము. అతితీర్షతాం=సంసారమునుండి తరింప నిచ్ఛ లేనివారైనట్టి సంసారులయొక్క, తమః=సంసృతిరుచి జనక మైన యజ్ఞానమును, అంధయతి=తిరోధానమును బొందించుచున్నది.

సంసారసాగరము నుండి దాఁటు నిచ్ఛలేని వారిని గూడ నాకర్షించి కొని, సంసారమందు రుచి గల్గించు వారి యజ్ఞాన మను చీఁకటిని నివారించుచున్నదని భావము. జయం=ఇది ఈ గ్రంథమునకే సార్థకనామము. అఖిలదురితజయ మనుట కర్థమైన దిది యొక్కటే గనుక; నరనారాయణు లిద్దఱును నమస్కరింపఁ దగినవారే.

యో వై భారతవర్షేఽస్మిన్, క్షేమాయ స్వస్తయే నృణామ్,
ధర్మజ్ఞాన సమోపేత, మాకల్పా దాస్థిత స్తపః.

అను భాగవతము ప్రకారము శిష్యాచార్యరూపులైన వారు జన క్షేమము కొఱకుఁ, గల్పాంతమువఱకుఁ దప మొనర్చుచున్నారు. దేవీం సరస్వతీం=దేవీం అనుటచేత, చతుర్ముఖుని భార్యయైన సరస్వతి. కనుక చతుర్ముఖుని స్తుతి గూడఁ జేయవలెనని యర్థము. చతుర్ముఖ బ్రహ్మ అనిరుద్ధుని నాభికమలమునుండి జన్మించెను. అనిరుద్ధుఁడు నారాయణుని తురీయవ్యూహము. బ్రహ్మ తన స్తుతితో ననిరుద్ధుని సంతసింపఁ జేసి, చతుశ్శ్లోకీ భాగవతము నుపదేశమందెను. అతఁడు నారదున కుపదేశించినాఁడు. అందువలన నా బ్రహ్మమహోపకర్త, నారదానిరుద్ధులుగూడ నీ సందర్భమున స్తుత్యర్హులు. వ్యాసుఁడు భాగవతకర్త. ఈ శ్లోకమం దీక్రమము వివక్షింపఁబడినది. మొదట నమస్కారము శుకునకు. తరువాత వ్యాసుఁడు, పిమ్మట నారదుఁడు, అటుపై సరస్వతీ బ్రహ్మలు, తదుపరి అనిరుద్ధుఁడు, ఆ పై నరనారాయణులు.

శుకదేవకృత సిద్ధాంత ప్రదీపము :

యః=ఏ శుకుఁడు, సంసారిణాం=సంసారులకు, తమోఽంధం=అవిద్యను బోఁగొట్టుటకును, సంసారమునుండి, అతితితీర్షతాం=దాఁటు నిచ్ఛగల ముముక్షువులకు, సూక్ష్మదేహనాశనమగు పఱకుఁ బఠించుట కర్థమైన దానిని భాగవతమును జెప్పెను. స్వానుభావం=సర్వజీవోపకారకమైన ప్రభావము గలది. అఖిలశ్రుతిసారం=సర్వ

వేదప్రతిపాద్యుఁడైన భగవంతుని స్వరూపమును దెలుపునది. అధ్యాత్మ దీపం_'ఆత్మని జీవే వర్తమానం అధ్యాత్మం' జీవునియం దంగుష్ఠ మాత్రశరీరుఁడై వర్తించువాఁడు.

యద్విజ్ఞాతేన సర్వం విజ్ఞాతం భవతి య ఆత్మని తిష్ఠన్ ఆత్మ నోంతరోయ మాత్మానం వేద.

ఇత్యాది శ్రుత్యర్థభూతమైన భగవత్తత్త్వమును బ్రతిపాదించునది.

## వల్లభాచార్య కృతమైన సుబోధిని:

శుకబ్రహ్మ సంగభయముతో వ్యాసుని విడిచివెళ్లెను. తర్వాత నిరంతర మననముతో భగవదావేశ మేర్పడి మరల వ్యాససమీపమునకు వచ్చినాఁడు. భాగవతపాఠము జరిగినది, తర్వాత భాగవత రసావిష్టమైన మనస్సుగల భాగవతుల కాతఁడు పురాణగుహ్యము నుపదేశించినాఁడు. అందుకే 'గురుం మునీనాం' అని ప్రయోగము. మహర్షులకుఁ గూడ గురువైనాఁడు. భాగవతమునకు నాల్గు విశేషణము లున్నవి.

1. ప్రమేయరూప, 2. ప్రమాణరూప, 3. సాధారణ్యరూప, 4. సాధనోత్తమరూప ప్రతిపాదకములు. స్వానుభావం_భాగవతము భగవద్రూపము. భగవంతునకు సర్వభక్తులయందు నసాధారణమైన యనుభావము. అనఁగా ప్రభావ ప్రదర్శన మున్నది. భాగవతము గూడ నిట్లే. తన్నుఁ జింతించువారియందుఁ దన ప్రభావోత్కర్షమును జూపును.

అఖిలశ్రుతిసారం_కర్మ జ్ఞాన కాండాదుల యందును, వేదములలో భక్తి ప్రతిపాదింపఁ బడినది. సర్వశ్రుతి ప్రతిపాద్యుడైన భగవంతుని బ్రతిపాదించు భక్తిశాస్త్ర మిది. అఖిలశ్రుతిసార మనుటలో

'అఖిల' శబ్దముచేత వేదము దైత్యులయందును, దేవతల యందును వ్యాపించిన దని యర్థము. దైత్య దానవులు వారి వారికిఁ దోఁచిన యర్థములు చెప్పెదరు. శ్రుతుల కిట్లే యర్థము చెప్పవలెనని భాగవతము సూచించును. ఏకం=అసాధారణమైనది. అట్లుగానిచో దీనియందును నితర రసములకుఁ బ్రాధాన్య మిచ్చి వ్యాఖ్యానించుట జరుగవచ్చును. భక్తికే యిది యసాధారణశాస్త్ర మని యర్థము. అధ్యాత్మదీపం= బహుపురాణములలో నధ్యాత్మమును నేరుగాఁ జూపించునది గనుక నిది యధ్యాత్మదీపము. ఇక్కడ వల్లభులు వాడిన వాక్యము లద్భుతముగా నున్నవి. వానినే యెత్తి చూపింతును.

బహిస్సంతి దీపాః బోధకాః పురుషాశ్చ. ఆత్మని పునర్విరళాః; వాచాబోధయం త్యేవ; నహి తాదృశో భాగవతా దన్య ఉపాయోఽస్తి. గురూపదేశ తపస్సాధన వ్యతిరేకేణ ఏన సర్వేషా మాత్మసాక్షాత్కారో భవేత్. యథా గృహే దీపే స్థాపితే ఘటాదీనాం న గుర్వాద్యపేక్షా, తథా భాగవతేన న కావ్యపేక్షేత్యర్థః.

భాగవత మున్నచో గుర్వాద్యపేక్ష లేదు. అది యొక్కటే మానవునిఁ దరింపఁ జేయు ననుచున్నారు. సంసారులకును మునులకును భాగవతము గావలసినదే. ఈ సందర్భములో వల్లభు లిట్లనిరి.

యథా మలాపకరణే వస్త్రాదౌ మలిన నివృత్తిః శుద్ధిశ్చ భవతి. శుభ్రాణాం తు కర్మయోగ్యతైవ తథా సంసారిణాం మునీనాంచ విశేష ఇతి భావః.

వస్త్రాదులందు మలమును దొలఁగించినచో మలనివృత్తి, శుద్ధి రెండును నేర్పడుచున్నవి. శుభ్రములైన వస్త్రములకు మలాపకరణముతోఁ బూర్ణసందేహనివృత్తి, పూర్ణయోగ్యతయు నేర్పడుచున్నది.

**విజయధ్వజము :**

అహంకార తత్త్వాభిమాని రుద్రుఁ డంటిమి. తత్త్వాభిమానులైన దేవతలకుఁ గొన్ని గుణము లుండును. అవిమాత్రమే గాక, శుకబ్రహ్మయందు గొన్ని యసాధారణ గుణములు గూడ నున్నవి.

అందుచే నతిశయముగా నమస్కరింపఁ దగినవాఁడు. ఈ విషయ
మును సూచించుచు, భక్త్యుద్రేకముతో మరియొక్కమారు నమస్క
రించుచున్నాఁడు. మరి, శుకబ్రహ్మ స్వానుభావం—ఇతరులకధీనము
గాని, సామర్థ్యము గలిగిన గుణపూర్ణుఁడైన పరబ్రహ్మను, అహ—
నాకుపదేశించెనో, చ—ఇంకను, యః—ఎవఁడు, అంధంతమః—గ్రుడ్డి
వారి నొనర్చు నజ్ఞానమను పెనుజీఁకటిని, తితీర్షతాం—సంపూర్ణముగా
ననఁగాఁ, దమతమ యోగ్యతకుఁ దగినంతఁ బోగొట్టు కొనవలెనను
నాశ గలిగిన, సంసారిణాం—మూవంటి ముముక్షువులైన యధికారుల
విషయమందు, కరుణయా—కనికరముతో, అఖిల శ్రుతిసారం— 1.
సమస్త శ్రుతుల యర్థమును దెలుపుటచేత నుత్తమ మనిపించికొన్న,
2. అధికారులైన జీవులయొక్క కర్ణములకు సుఖప్రదమైన, 3. సమస్త
శ్రుతులకును, విషయమై, తాత్పర్యభూతమైన, ఏకం— 1. సమస్త
పురాణముల కంటెను, ముఖ్యమైన, .. సర్వోత్తమమైన, అధ్యాత్మ
దీపం— 1. దేహము మొదలు కొని, యీశ్వర పర్యంతమున్న తత్త్వ
ముల ప్రకాశపఱచు నట్టి, 2. జీవులదేహమందు దీపమువలె, ప్రకా
శించుచున్న, పురాణగుహ్యం— 1 పురాణములం దన్నిటను, రహస్య
ప్రతిపాదకమైన పురాణ మనిపించికొనిన—భగవంతుని సన్నిధానము
నకు యోగ్యమైన శ్రీమద్భాగవతమనెడు పురాణమును, 2. భాగవ
తాది సమస్త పురాణముల రహస్య మనిపించికొనిన, స్వానుభావం—
స్వతంత్ర మాహాత్మ్యము గలిగిన పరబ్రహ్మను, అహ—వ్యాఖ్యాన
మొనర్చెనో అందుచేత, మునీనాం గురుం—సమస్త ఋషులకును
గురువులైన, తం—ప్రసిద్ధుఁడైన, వ్యాససూనుం—వ్యాసభట్టారకుని
కుమారుఁడైన శుకబ్రహ్మను, ఉపయామి—శ్రీమహాభాగవతమును
వ్యాఖ్యానించు కార్యమందు శరణుఁ జొచ్చెదను.

ఈ శ్లోకముతో శుకునియందు దయాళుత్వ ముపపాదితమైనది.
జైమిని మొదలగు సమస్త ఋషులకుఁ బరబ్రహ్మ నుపదేశించుటచే,

మునులకుఁ గూడ గురువైనాఁడు. ఈ రెండు గుణములును అతని పునర్నమస్కారమునకుఁ గారణము లని యర్థము. ఈ శుకుఁడే సూతునకు పరబ్రహ్మను తెలియఁజేసెను. పరబ్రహ్మయనఁగా స్వతంత్రుఁడు గుణపూర్ణుఁడును నైన శ్రీమన్నారాయణుఁడే అతని సామర్థ్యము ఇతరుల కధీనమైనది గాదు. సమస్త వేదముల ముఖ్యతాత్పర్యమతఁడే. ఆ నారాయణచరిత్రము అధికారుల కెల్లను గర్ణరసాయనము. అతఁడే సమస్తజీవుల దేహమందు దీపమువలెఁ బ్రకాశించుచున్నాఁడు. సంసారమందుఁ జిక్కి యజ్ఞానముతో గ్రుడ్డివారై దానినుండి తప్పించికొనవలెనను యాశగల జీవరాసులకు శ్రీమహావిష్ణువు అనుగ్రహమే ముఖ్యము. అందుచే నీ జీవరాసులపైఁ గనికరముతో శుకబ్రహ్మ సమస్త పురాణములందును రహస్యముగాఁ బ్రతిపాదింపఁబడిన విష్ణుస్వరూపమును భాగవతమందు వివరించెను. ఇది సమస్త వేదసారము. విమర్శించి చూచిన పురాణములలో నిదియే ముఖ్యము. శరీరము మొదలుకొని పరమాత్మవఱకును గల సమస్తతత్త్వములను బ్రతిపాదించును. అంధత్వమును గలిగించు నజ్ఞానమును దొలఁగించి కొనునిచ్ఛగల జీవులకు దీనిశ్రవణమునకన్న వేఱు మార్గములేదు దయాశాలియైన శుకుఁడు దొలుతఁ దాను మునుల కుపదేశించి, గురుపారంపర్యముతో నీ దీపమును జగత్తున వెలిగించినాఁడు. ఇట్టివ్యాసపుత్త్రునకు నమస్కరింతును. గురువుల పేరుచెప్పి నమస్కరించు టనుచితము. అందుచే నతని గుణములను వర్ణించి, శుకుని వ్యంజింపఁజేసి సూతుఁడు నమస్కరించుచున్నాఁడు.

ఇట్లు గురువులను నమస్కరించి శాస్త్రారంభమం దవశ్యముగా నమస్కరింపఁదగిన దేవతలకు నమస్కరించి, గ్రంథారంభమున బ్రతిజ్ఞచేయుచున్నాఁడు. సూతున కిష్టదేవతయు శాస్త్రగురువు నొకరే యని తెలియవలెను.

నారాయణం=సమస్త శాస్త్రప్రతిపాద్య దేవతయైన నారాయణుని, దేవీం=సకల భాగ్యాత్మికయైన లక్ష్మీదేవిని, నరోత్తమం=జీవోత్తముఁడైన వాయుదేవుని, సరస్వతీం=విద్యాభిమానినియైన సరస్వతీదేవిని, నరం చ=ఉపసాధకుఁడైన యాదిశేషుని, నమస్కృత్యైవ=నమస్కరించియే, తతః=వారి యనుగ్రహమువలన, గ్రంథం=భాగవత గ్రంథమును, ఉదీరయే=మీ ప్రశ్నలకుత్తరముగాఁ జెప్పఁబోవుచున్నాను. 'ఏవ'కారముచేత వక్తలును శ్రోతలును నీ దేవతలకు నమస్కరించియే తీరవలెనని విధి. తతోజయ ముదీరయేత్=అనుపాఠమును వదలి 'తతోగ్రంథముదీరయే' యని వీరు స్వీకరించిరి. జయ మనుమాట యెగిరి పోయినది. 'ఉదీరయేత్'=అను క్రియాపదము ఉదీరయే యని యుత్తమపురుషగా నైనది. గ్రంథారంభమందు తత్ప్రతిపాద్యదేవతలు, గర్తలు, భాగ్యదేవతలు, సాధకనియామకులు విద్యాభిమానిని, ఉపసాధకులును స్తుత్యార్హులు.

పోతన్నగారు:

కార్యవర్గంబును గారణసంఘంబు
  నధికరించి చరించు నాత్మతత్త్వ
మధ్యాత్మ మనఁబడు నట్టి యధ్యాత్మముఁ
  దెలివిసేయఁగఁ జాలు దీప మగుచు
సకలవేదములకు సారాంశమై యేక
  మై, యసాధారణమగు ప్రభావ
రాజకంబైన పురాణమర్మంబును
  గాఢసంసారాంధకార పటలి

దాఁటఁగోరెడు వారికి దయదలిర్ప
నే తపోనిధి వివరించె నేర్పడంగ
నట్టి శుకనామధేయు మహాత్మగేయు
విమల విజ్ఞానరమణీయు వేడ్కఁగొలుతు.

అర్థములు: కార్యవర్గంబునన్-కార్యస ఘాతమును, కారణ సంఘంబున్-కారణములగుంపును, అధికరించి-వీనిపై యధికారమును నెఱపుచు, అనఁగాఁ గార్యకారణములు దన సత్తచేతనే వ్యావహారిక ప్రపంచమందు సత్యములై భాసించుచున్నవని తాత్పర్యము. ఈ యద్వైతసంప్రదాయము ప్రథమ శ్లోకార్థమునఁ గొంత వివరింపఁబడినది. ప్రపంచము మిథ్య, కనుకఁ గార్యకారణములును మిథ్యలే. కాని, యాత్మయొక్క సత్తచేత వ్యావహారిక కార్యకారణములు రెండును సత్యములైనట్లు భాసించుచున్నవి. అట్టి యాత్మయొక్క తత్త్వమని పిండితార్థము. అట్టి యాత్మతత్త్వరహస్యమును దీపమువలె నీ భాగవత పురాణము దెలివిడి సేయుచున్నది ఇది సకలవేదములకును సారభూతమైనది. ఏకమై యద్వితీయమైనది అసాధారణమగు తనదేయైన ప్రభావముచేత, రాజకంబైన-ప్రకాశించుచున్నది. అట్టి పురాణమర్మంబు-పురాణముయొక్క రహస్యమైన భాగవతమును, గాఢ-దట్టముగ నున్న, అనఁగా ననాదికాలము నుండి తన్ను వెంబడించి వచ్చుచున్న యని యర్థము స సారమను, నంధకార పటలిన్-చీకటి గుంపును, దాఁటఁ గోరెడివారికిన్-దాఁటెడు గోర్కిగల వారికి, ఏ తపోనిధి-ఏ తపశ్శాలియైన శుకుఁడు, ఏర్పడంగన్-స్పష్టముగా, దయదలిర్పన్-దయ చిగురించినట్లుగా, వివరించెన్ భాగవత మనెడు రహస్యమును వివరించెనో, అట్టి-అటువంటి, మహాత్మగేయున్-మహాత్ములచేఁ బొగడఁదగిన వానిని, విమల-స్వచ్ఛమైన, విజ్ఞాన-అధ్యాత్మ విజ్ఞానముచేత, రమణీయున్-మనోహరుఁడైనట్టియు, శుకనామధేయున్-నా గురువైన శుకబ్రహ్మర్షిని, వేడ్కన్ కొలుతున్-ఉత్సాహముతో నమస్కరింతును.

విశేషార్థములు: కార్యవర్గంబులు........అధ్యాత్మ మనఁబడు. ఇదియంతయు శ్రీధరుని వ్యాఖ్యానములోని వాక్యమే. అధ్యాత్మము .... ... దీప మగుచు. 'అధ్యాత్మదీపం' అనుటకుఁ దెనుఁగు 'అఖిల శ్రుతిసారం' అనునది సకల వేదములకు సారాంశమై యని తెనుఁగు

లోనైనది అసాధారణమగు ప్రభావరాజకంబు, 'స్వానుభావం' అను దాని కాంధ్రీకరణము. 'పురాణమర్మం' పురాణగుహ్యం అనుటకుఁ దెనుఁగు. తమోఽంధం-సంసార మనెడు చీఁకటి గంపు. ఇదియు శ్రీధరుల యభిప్రాయమే కరుణయా=దయదలిర్పన్ అతితీర్షతాం= దాఁటఁగోరెడు వారికిన్,

నారాయణునకు నరునకు
భారతికిని మ్రొక్కి వ్యాసుపదములకు నమ
స్కారము సేసి వచింతు ను
దారగ్రంథంబు దళితతనుబంధంబున్.

నారాయణునకును, నరునకును, భారతికిని నమస్కరింతును. వ్యాసునకు నమస్కార మొనర్తును. దళిత=పోఁగొట్టఁబడిన, తనుబంధంబున్=తనువుతోడి సంబంధము గలది. అనఁగా శరీరమే యాత్మ యనెడు నజ్ఞానమును బోఁగొట్టి, యధ్యాత్మజ్ఞానమును గలుగఁజేయు నుదారగ్రంథంబు=గొప్పగ్రంథమును, వర్ణింతున్=వర్ణింతును.

ఇక్కడఁ బోతనామాత్యుఁడు గూడ 'జయ' మని వాడలేదు. అతఁ డనుసరించిన ప్రతిలో 'గ్రంథ'మనియే యున్నదేమో! మూల మందలి 'నరోత్తమం' అను శబ్దము నాతఁడు వదలెను. నారాయణ సంయోగముచే నరుఁ డనఁగా సులభముగా 'నర్జునుఁ'డని తెలియు నని భావించెనేమో! భారతి యనఁగా వాగ్దేవి. 'బ్రాహ్మీతు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ' అని యమరము 'దేవీం' అనుపదము గూడఁ దెనుఁగులోఁ బోయినది. అన్నిపదములు నట్లట్లే యనుసరింప వలె ననుచో యతిప్రాసలు-ఛందశ్శరీరము మొదలైన చిక్కులుండును గదా!

మునయ స్సాధుపృష్టోఽహం భవద్భిర్లోక మంగళమ్,
యత్కృతః కృష్ణసంప్రశ్నో యే నాత్మా సుప్రసీదతి. ౫

అర్థములు: కార్యవర్గంబునన్_కార్యస ఘాతమును, కారణ సంఘంబున్_కారణములగుంపును, అధికరించి_వీనిపై యధికారమును నెఱపుచు, అనఁగాఁ గార్యకారణములు దన సత్తచేతనే వ్యావహారిక ప్రపంచమందు సత్యములై భాసించుచున్నవని తాత్పర్యము. ఈ యద్వైతసంప్రదాయము ప్రథమ శ్లోకార్థమునఁ గొంత వివరింపఁబడినది. ప్రపంచము మిథ్య, కనుకఁ గార్యకారణములును మిథ్యలే. కాని, యాత్మయొక్క సత్తచేత వ్యావహారిక కార్యకారణములు రెండును సత్యములైనట్లు భాసించుచున్నవి. అట్టి యాత్మయొక్క తత్త్వమని పిండితార్థము. అట్టి యాత్మతత్త్వరహస్యమును దీపమువలె నీ భాగవత పురాణము దెలివిడి సేయుచున్నది ఇది సకలవేదములకును సారభూతమైనది. ఏకమై యద్వితీయమైనది అసాధారణమగు తనదే యైన ప్రభావముచేత, రాజకంబైన_ప్రకాశించుచున్నది. అట్టి పురాణ మర్మ బు_పురాణముయొక్క రహస్యమైన భాగవతమును, గాఢ_దట్టముగ నున్న, అనఁగా ననాదికాలము నుండి తన్ను వెంబడించి వచ్చుచున్న యని యర్థము స సారమును, నంధకార పటలిన్_చీకటి గుంపును, దాఁటఁ గోరెడివారికిన్_దాఁటెడు గోర్కిగల వారికి, ఏ తపోనిధి_ఏ తపశ్శాలియైన శుకుఁడు, ఏర్పడంగన్_స్పష్టముగా, దయదలిర్పన్_దయ చిగురించినట్లుగా, వివరించెన్ భాగవత మనెడు రహస్యమును వివరించెనో, అట్టి_అటువంటి, మహాత్మగేయున్_మహాత్ములచేఁ బొగడఁదగిన వానిని, విమల_స్వచ్ఛమైన, విజ్ఞాన_అధ్యాత్మ విజ్ఞానముచేత, రమణీయున్_మనోహరుఁడైనట్టియు, శుకనామధేయున్_నా గురువైన శుకబ్రహ్మర్షిని, వేడ్కన్ కొలుతున్_ఉత్సాహముతో నమస్కరింతును.

విశేషార్థములు: కార్యవర్గంబులు........అధ్యాత్మ మనఁబడు. ఇదియంతయు శ్రీధరుని వ్యాఖ్యానములోని వాక్యమే. అధ్యాత్మము ... .... ... దీప మగుచు. 'అధ్యాత్మదీపం' అనుటకుఁ దెనుఁగు 'అఖిల శ్రుతిసారం' అనునది సకల వేదములకు సారాంశమై యని తెనుఁగు

లోనైనది అసాధారణముగు ప్రభావరాజకంబు, 'స్వానుభావం' అను దాని కాంద్రీకరణము. 'పురాణమర్మం' పురాణగుహ్యం అనుటకుఁ దెనుఁగు. తమోఽంధం-సంసార మనెడు చీఁకటి గంపు. ఇదియు శ్రీధరుల యభిప్రాయమే కరుణయా=దయదలిర్పన్ అతితీర్షతాం= దాఁటఁగోరెడు వారికిన్,

నారాయణునకు నరునకు
భారతికిని మ్రొక్కి వ్యాసుపదములకు నమ
స్కారము సేసి వచింతు ను
దారగ్రంథంబు దళితతనుబంధంబున్.

నారాయణునకును, నరునకును, భారతికిని నమస్కరింతును. వ్యాసునకు నమస్కార మొనర్తును. దళిత=పోఁగొట్టఁబడిన, తనుబంధంబున్=తనువుతోడి సంబంధము గలది. అనఁగా శరీరమే యాత్మ యనెడు నజ్ఞానమును బోఁగొట్టి, యధ్యాత్మజ్ఞానమును గలుగఁజేయు నుదారగ్రంథంబు=గొప్పగ్రంథమును, వర్ణింతున్=వర్ణింతును.

ఇక్కడఁ బోతనామాత్యుఁడు గూడ 'జయ' మని వాడలేదు. అతఁ డనుసరించిన ప్రతిలో 'గ్రంథ'మనియే యున్నదేమో! మూలమందలి 'నరోత్తమం' అను శబ్దము నాతఁడు వదలెను. నారాయణ సంయోగముచే నరుఁ డనఁగా సులభముగా 'నర్జునుఁ' డని తెలియునని భావించెనేమో! భారతి యనఁగా వాగ్దేవి. 'బ్రాహ్మీతు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ' అని యమరము 'దేవీం' అనుపదము గూడఁ దెనుఁగులోఁ బోయినది. అన్నిపదములు నట్లట్లే యనుసరింపవలె ననుచో యతిప్రాసలు-ఛందశ్శరీరము మొదలైన చిక్కులుండును గదా!

మునయ స్సాధుపృష్టోఽహం భవద్భిర్లోక మంగళమ్,
యత్కృతః కృష్ణసంప్రశ్నో యే నాత్మా సుప్రసీదతి. 5

స వై పుంసాం పరోధర్మో యతో భక్తిరధోక్షజే,
అహైతుక్య ప్రతిహతా యయాత్మా సుప్రసీదతి.
వాసుదేవే భగవతి భక్తియోగః ప్రయోజితః,
జనయత్యాశు వైరాగ్యం జ్ఞానం చ యదహైతుకమ్.

మునయః – ఓ మునులారా!, భవద్భిః – మీచేత, అహం–నేను, సాధ యోగ్యరీతిలో, పృష్ట–పృచ్ఛింపఁబడితిని, యత్–ఏ యొక్కటి, లోకమంగళ లోకమంగళమైనదో, కృష్ణసంప్రశ్నః–కృష్ణునిగురించియున్న ఆ విధమైనప్ర కృతః–చేయఁబడినది, యేన–దేనిచేత, ఆత్మా–ఆత్మ, సుప్రసీదతి–గొప్పళా వందుచున్నదో.

మహామునులారా! మీరు లోకమంగళమైన కృష్ణచరిత్ర గూర్చి యడిగిరి. ఈ ప్రశ్నతో నేను పరమధన్యుఁడనైనాను. శ్రే స్సాధనమైన కృష్ణచరిత్రను జెప్పవలెనంటిరి. ఈ ప్రశ్న వేయుట మీరు నన్నను గ్రహించినట్లైయైనది; ఎందు కనఁగా కృష్ణకథ వి వారికిఁ జెప్పువారికి నవశ్యము మనఃప్రసన్నత చేకూర్చును.

యతః–దేనినుండి, అహైతుకే–ఒక హేతువునుబట్టి కలుగనిదియు, అ హతా–విఘ్నములచే నప్రతిహతయునైన, అధోక్షజే భక్తిః–శ్రీకృష్ణభక్తి, సాం– పురుషులకు సిద్ధించునో, స వై = అదే, పరోధర్మః = పరమధర్మః యయా–దేనిచేత (ఏ భక్తినుండి), ఆత్మా–మనస్సు, సుప్రసీదతి– చక్క శాంతిని బొందునో!

ఏ విధమైన ప్రపత్తితో నహైతుకమును నప్రతిహతమును భక్తి శ్రీకృష్ణునియం దేర్పడునో ఆ ప్రవృత్తియే నాశరహితమైన ముకు నిశ్చయముగా నొసఁగెడు పరమధర్మము. భక్తి యున్నప్ప మనస్సు రజస్తమముల నధిగమించి సత్త్వగుణమును మాత్ర యవలంబించును. పరమానందప్రాప్తికి యోగ్యత యున్నదగు స్వర్గాదిఫలముల నాకాంక్షించి, ఈశ్వరునియందు ప్రేమ సేయ

శుద్ధభక్తి గాదు. ఫలకాంక్షతో సంబంధములేని భక్తి పరమానంద హేతు వగును. అదియే శాశ్వతము. 6

**భగవతి**—భగవంతుఁడైన, **వాసుదేవే**—వాసుదేవునియందు, **ప్రయోజితః**—ప్రయోగింపఁబడిన, **భక్తియోగః**—భక్తియోగము, **ఆశు**—శీఘ్రముగా, **వైరాగ్యం**—విరక్తిని **అహైతుకం**—శుష్కహేతువాదములచేఁ గూడని, **జ్ఞానం**—ఆత్మజ్ఞానమును, **జనయతి**—కల్గించుచున్నది.

యజ్ఞము, జ్ఞానము, తపస్సు మొదలైనవానితో నేర్పడు జ్ఞానమే గదా మోక్షమునకు హేతువు? భక్తితో మోక్ష మెట్లు సిద్ధించుచున్నది? ఈ శంకకు సమాధానమే ఈ శ్లోకము. జ్ఞానము, వైరాగ్యము మొదలైన యైశ్వర్యములకు కృష్ణచరిత్రము పరమాశ్రయము. మహనీయమైనది అట్టి కృష్ణచరిత్రమందుఁ బరమప్రేమ లక్షణమైన భక్తి యేర్పడినప్పుడు ఇతర తుచ్ఛవిషయముల యందు రతి తోఁపదు. దానితో వైరాగ్య మప్రయత్నముగా లభించును. అంతఃకరణము దనకుఁ దెలియకయే పరిశుద్ధ మగును. దానితో నుపనిషత్తులతోఁ బ్రతిపాదింపఁబడిన యాత్మస్వరూపజ్ఞానము లభించును. కనుక భక్తి జ్ఞానసాధక మగునని తాత్పర్యము.

> ధర్మస్స్వనుష్ఠితః పుంసాం విష్వక్సేన కథాసు యః,
> నోత్పాదయే ద్యదిరతిం శ్రమఏవ హి కేవలమ్. 8

**స్వనుష్ఠితః**—చక్కఁగా ననుసరింపఁబడినదైన, **యో ధర్మః**—ఏ ధర్మము, **పుంసాం**—పురుషులకు, **విష్వక్సేన కథాసు**—విష్ణుకథలయందు, **ప్రీతి**—తాత్పర్యమును, **న ఉత్పాదయేద్యది**—కలిగింపకపోయినచో ఆ ధర్మము, **కేవలం**—నిశ్చయముగ, **శ్రమ ఏవ**—శ్రమమాత్రమే, **హి**—కదా!

ఏ విధమైన ప్రవృత్తియైనను భగవద్భక్తిని జనింపఁజేసినచో నదియే శ్రేయస్సాధనము. దీనినే వ్యతిరేక ముఖముగాఁ జెప్పుచున్నాఁడు. ధర్మము వర్ణాశ్రమాదులతో విభక్తము. ఇట్టి ధర్మమును

చక్కగా ననుసరించిన, నది శ్రీహరి కథయందు తాత్పర్యము నేర్ప రుప వలెను. అట్టి తాత్పర్యమున కభిముఖమైన యంతఃకరణశుద్ధిని గల్పింపవలెను. అది శ్రీహరి కథలయందు తాత్పర్యమును గల్గింప లేనిచో నది కేవలము కాయిక కష్టము మాత్రమే; ధర్మానుష్ఠానము నకు ఫలము అంతఃకరణశుద్ధి. దాని లక్షణము భగవత్కథారతి.

శ్రీధరీయము :

"ప్రతిపూజ్య వచస్తేషాం" వారి ప్రశ్నమును చక్కగా నభి నందించి అని యర్థము. ఆ యభినందన ప్రకారముతో శ్లోకము నారంభించుచున్నాడు–

ఓ మునులారా! చాల సముచితముగ నడిగితిరి మీ రడిగిన ప్రశ్న లోకమంగళమైనది. కృష్ణవిషయ ప్రశ్నను మీ రొనర్చితిరి అంతకన్నను లోకమంగళ మేమున్నది? సర్వశాస్త్రార్థసారము నుద్ధ రించి చెప్పవలెననియు మీ రెండవప్రశ్న దాని యుత్తరముగూడ కృష్ణునియందే పర్యవసించుచున్నది. సర్వశాస్త్రసారమైన యైకాంతిక శ్రేయము నడిగితిరి. దానికి సమాధానము చెప్పుచున్నాను.

'స వై పుంసాం' అను శ్లోకముచేత ధర్మము రెండు రీతులు. ప్రవృత్తి ధర్మము, నివృత్తి ధర్మము. స్వర్గాదులను గోరునది ప్రవృత్తి ధర్మము. ఏ ధర్మముచేత శ్రవణాదరాది లక్షణమైన భక్తియేర్పడునో యది పరమధర్మము. అదియే యైకాంతికమైన శ్రేయము. ఆ శ్రేయ స్సాధనమైన భక్తి యెట్టిది?, 'అహైతుకీ' హేతు వనగా ఫలాను సంధానము. అదిలేనిది. 'అప్రతిహతా' విఘ్నములచేత ప్రతిహతము గానిది. 'తమేతం' వేదాను వచనేన బ్రాహ్మణా వివిదిషంతి, యజ్ఞేన దానేన తపసా నాశకేన'–స్వాధ్యాయము చేతను యజ్ఞాదులచేతను, అనాశకమైన తపస్సుచేతను భగవంతుని దెలిసికొనుచున్నారు. ఇత్యా దులచేత ధర్మము జ్ఞానాంగమని తేలుచున్నది గదా! ఇట్టి ధర్మము

భక్తిహేతు వెట్లైనది?' నిజమే, ధర్మము జ్ఞానాంగమనుట భక్తిద్వారా; ఈ విషయమునే 'వాసుదేవే భగవతి' అను శ్లోకముతోఁ జెప్పు చున్నాఁడు, 'అహైతుకీం' శుష్కతర్కాద్యగోచరమైనది. ఔపనిషద మైనది వ్యతిరేకలక్షణముతోను నీ యర్థమును నిరూపించుచున్నాఁడు. 'ధర్మస్స్వనుష్ఠితః' అనుచు; మోక్షార్థమైన ధర్మములోఁ గూడ శ్రమ యున్నదిగదా! నిజమే. కాని, భక్తిభిన్న ధర్మాచరణము 'శ్రమ ఏవ హి' కేవలము విఫలమైన శ్రమమాత్రమే. భక్తిలోఁగూడ స్వర్గాది ఫలము లున్నవి గదా? ఏవకారముతో దానిని నిరాకరించుచున్నాఁడు. స్వర్గాదులు భక్తికి ఫలముగావని యర్థము. అవి క్షయిష్ణువులు. కాని 'అక్షయ్యం హ వై చాతుర్మాస్య యాజినః సుకృతం భవతి'. చాతు ర్మాస్య యాజికి అక్షయమైన సుకృతము లభించుచున్నది. ఈ శ్రుతిచేత స్వర్గాది ఫలములు క్షయిష్ణువులుగావని చెప్పఁబడినదే? కాదని 'హి' శబ్దముచే సాధించుచున్నాఁడు. 'తద్యథేహ కర్మచిత్ లోకః క్షీయతే' అనెడు తర్కానుగృహీతమైన శ్రుతిచేత స్వర్గాదిఫలములకు క్షయిష్ణు త్వమే యని తాత్పర్యము.

వంశీధరకృత భావార్థదీపిక:

'మునయః' మనన శీలురైనవారే యిట్టి ప్రశ్నలు వేయఁ గలరని భావము. అందుకే పైశ్లోకము లందును, అధోక్షజ, వాసు దేవ, సాత్వతాంపతి కృష్ణ శబ్దములు తత్తత్ప్రాధాన్య వివక్షతోనే వాడఁబడినవి.

వంశీధరుఁడు తన వ్యాఖ్యలో నక్కడక్కడ విశ్వనాథు ననుసరిం కించుచుఁ బోవును. వి రిరువురును శ్రీధరునివ్యాఖ్యకు వ్యాఖ్యాతలు. అందుచేత వంశీధరవ్యాఖ్యను జెప్పినప్పుడు అందులో విశ్వనాథ చక్రవర్తి భావములుగూడ మిళితములై యుండునని యెఱుఁగవలెను. 'పుంసాం' పురుషమాత్రులకు, పరః=పరమమైన ధర్మము, శ్రవణ కీర్తనాది లక్షణము,

ఏతా వా నేవ లోకేఽస్మిన్ పుంసాం ధర్మః పరస్స్మృతమ్,
భక్తియోగో భగవతి తన్నామ గ్రవణాదిభిః.

కనుక, పరధర్మ మనఁగా భక్తియోగమే. 'ఏతావానేవ' అను చోట మతుప్పును, ఏవకారమును, భక్తిభిన్నత్వమునకు పరధర్మత్వము నిషేధించుచున్నవి. భక్తికి ప్రేమయే లక్షణము. శ్రవణకీర్తనాది రూపమైన ధర్మము సాధనావస్థలో భక్తి, పాకదశయందు ప్రేమ. ఈ రెండును భక్తిశబ్దముచేతనే వ్యవహరింపఁబడును. 'భక్త్యాసంజాతయా' 'భక్త్యాబిభ్రత్యుత్పులకాం తనుం' 'యతో భక్తి రధోక్షజే' ఇత్యాదులందు భక్తికి తత్పూర్వమున్న భక్తికారణము. పండునకు కసుగాయ కారణమన్నట్లు స్వాదభేదనిబంధనమే దానికిఁ గారణము. ఇది కాల్పనికమే; వాస్తవముగాదు; బాలబోధనార్థము; ఒకానొక పురుషునియందు బాల్య యౌవనాదు లుండును. వానికి హేతుహేతు మద్భావము ఘట పట ఓదనాదులందు మృత్తంతు తండులాదులకువలె తాత్త్వికముగాదు. మృత్తంత్వాదులందు నామరూపభిన్నత యున్నది. ఇట్టి హేతుహేతుమద్భావము భక్తియందుఁ గల్పించుటకు వీలులేదు భక్తికి సాధుసంగము కారణ మనుటకును లేదు. దానికి హేతువు శ్రద్ధ. శ్రద్ధతో సాధుసంగము; దానితో భజనక్రియాదులు. భక్తిశాస్త్రములో భక్తి ద్వితీయభూమికకుఁ జెందినది. భక్తియే 'స్స్యాన్మహత్సేవయా విప్రాః' అన్నట్లు సాధుసంగముతో నేర్పడినది. దాన వ్రత తపో హోమాదినిష్కామ కర్మయోగము జ్ఞానాంగభూతమైన సాత్త్వికభక్తికి అతికష్టముతో హేతు వగుచున్నది, నిర్గుణభక్తికి గాదు.

యన్నయోగేన సాంఖ్యేన దానవ్రత తపోఽధ్వరైః,
వ్యాఖ్యా స్వాధ్యాయ సన్న్యాసైః ప్రాప్నుయాద్యత్నవా నపి.
అని ఏకాదశస్కంధము.

నిర్గుణభక్తికి భగవత్కృపయే కారణ మనుటకును వీలు లేదు. దానికి హేతువేది? ఇట్లు ప్రశ్నించుచుఁ బోయినచో ననవస్థా దోష

మేర్పడును. భగవత్కృప నిరుపాధికము. నిరుపాధికమై హేతువగు చున్నది అని చెప్పుదురా! అట్లనుటకు వీలులేదు. భగవత్కృప అందఱి యందును అనఁగా సార్వత్రికముగఁ బ్రవర్తించుట లేదు. కనుక భగవంతునికి వైషమ్యాభావ మారోపిత మగును. భక్తులయొక్క కృపయే హేతువని చెప్పికొన్నచో నే బాధయు నుండదు. ఉత్తమ భక్తులకు వైషమ్యాభావ ముండకపోయినను-

ప్రేమ మైత్రీ కృపోపేక్షా యః కరోతి సమధ్యమః

అనురీతి మధ్యమభక్తులందు వైషమ్యాభావము గనుపడుచున్నది. కనుక భగవంతుఁడు భక్త్యధీనుఁడగుటచేత, భగవత్కృప భక్త కృపానుగామిని యని సిద్ధాంతము. అప్పుడు భక్తికి అహైతుకత్వ మెట్లు సిద్ధించినది? ఇట్లు. భగవత్కృప భక్తకృపాంతర్భూతమైనది. భక్తకృప భక్తిసంగాంతర్భూత మైనది. భక్తసంగము భక్త్యంగము. అందుచే భక్తి కహైతుకత్వమే సిద్ధించినది. భక్తకృపకు హేతువు భక్తునియొక్క హృదయమందున్న భక్తియే. అదిలేనిది కృపోదయమే యేర్పడుట లేదు. కనుక నెట్లు చూచినను భక్తికి భక్తియే కారణము.

'అప్రతిహతా' సర్వథా ధ్వంసరహితం సత్యపి ధ్వంసకారణే (రూపగోస్వామి). జ్ఞానకర్మాదులచేత ననావృతమైనదే భక్తి. భక్తిచేతనే మనస్సు ప్రశాంతమగును. కామనామాలిన్య మున్నపుడు మనఃప్రసాద మేర్పడదు. కనుక భక్తి నిష్కామమనుట స్వభావముగనే సిద్ధించినది. 'వేదానువచనం' వేదాభ్యాసము, 'అనాశకేన' జీవాఽభయప్రదాన మొనర్చునట్టిది. ఆత్మప్రసాద మెట్టిది? సర్వదుర్విషయ వైముఖ్యా పాదకమైన భగవద్రూపగుణ మాధుర్యాద్యనుభవజ్ఞానము. 'ప్రయోజితః' దాస, సఖ్య, వాత్సల్య, మధురభావాదియుక్తమై భగవంతునితోఁ బెనవేసికొన్నది. ప్రయోజిత మనుటకుఁ బ్రయోజనముగాఁ జేయఁబడినది యనియు నర్థము. భక్తియోగమునకు భక్తియోగమే

ప్రయోజనము. వేరొకటి గాదు. జ్ఞానవైరాగ్యాదులను సంపాదించి కొనుటకు భక్తుఁ డెప్పుడును వేఱుగాఁ బ్రయత్నింపరాదు. 'ఆశు' వైరాగ్యజ్ఞానములు భక్తితోఁ దత్కాలముననే యేర్పడుచున్నవి.

భక్తిః పరేశానుభవో విరక్తి
రన్యత్ర చైష త్రిక ఏకకాలః,
ప్రపద్యమానస్య యథా శ్నతస్స్యుః
తుష్టిః పుష్టిః క్షుదపాయోఽనుఘాసమ్.

గడ్డి దినుచున్న జంతువునకు తుష్టి పుష్టి క్షుణ్ణివారణ ఇవి చెప్ప కయే యేర్పడుచుండును. అట్లే భక్తి, సర్వేశానుభవము, అన్యవిషయ విరక్తి ఇవి యేకకాలమునందే యేర్పడుచున్నవి. 'జ్ఞానాన్మోక్షః' అని యున్నదిగదా! మఱి భక్తి యహైతుక మెట్లు?' 'అన్నస్య హేతో ర్వసతి'– అన్నము హేతువుగా వసించుచున్నాఁడు అన్నట్లు; వసిం చుట కన్నమును గారణము గావచ్చును. కాని యది యొక్కటియే గారణము గాదు. అట్లే యంగీకరించినను భగవద్రూపగుణ మాధు ర్యానుభవమయమైన జ్ఞానము వానికుండనే యున్నది. చతుర్థస్కంధ ములో–

వాసుదేవే భగవతి భక్తియోగ స్సమాహితః,
సధ్రీచీనేన వైరాగ్యం జ్ఞానం చ జనయిష్యతి.

అని యున్నది. సధ్రీచీన మనఁగా నొకదానితోడనేఁ బోవుట వాసు దేవప్రయుక్తమై సమాహితమైన భక్తియోగము తనతోడనే వైరాగ్య జ్ఞానముల నేర్పఱచుకొనునని భావము; తత్ఫలముగా భక్తుఁడు మోక్షాదిఫలాంతరాసక్తి నుండి దూరమగుచున్నాఁడు. కనుక భక్తికి కారణము భక్తియే; లేక భక్తికిఁ బ్రయోజనము వాసుదేవుఁడు. విష్వ క్సేనః–విష్వక్ = అంతటను వ్యాపించియున్న, భక్తిలక్షణమైన సేన గలవాఁడు. 'విష్వక్ సర్వవ్యాపినీ సేనేవ సేనాభక్తి లక్షణా–భక్త

సంసారదుఃఖ జేతృత్వాద్యస్య సః విష్వక్సేనః'- కర్మణా=కర్మచేత, చితః=సంపాదింపఁబడినది కర్మచితము. ఘటాది పుణ్యముచేత సంపాదితము. పుణ్యచితము స్వర్గాది. 'కర్మణా పితృలోకః' అని శ్రుతి. వాసుదేవుని కథలయందు ప్రీతి జనింపఁజేయని వర్ణాశ్రమాచారరూప ధర్మము కేవలము పితృలోకమునే ప్రసాదించును. కనుక స్వధర్మమును విడిచియైనను శ్రవణ కీర్తనాది లక్షణమైన పరధర్మము నాశ్రయింపవలెనని తాత్పర్యము; అచ్యుతభక్తివర్జితమైన నైష్కర్మ్యము గూడ నిష్ఫలమే

'శ్రేయః సృతిం భక్తిముదస్య' అని భాగవతమే భక్తిహీనమైన నైష్కర్మ్యము లాభము లేదని తెలుపుచున్నది. ఇంతకును భక్తి నిరపేక్షమైనది. జ్ఞానవైరాగ్యములు సాపేక్షములు. ఇది పిండితార్థము

వీరరాఘవీయము:

> సర్వత్రాఽసౌ సమస్తేచ వసత్యత్రేవ వై యతః,
> తతస్స వాసుదేవేతి విద్వద్భిః పరిగీయతే. (వాసుదేవనిరుక్తము)

భగవతి=షాడ్గుణ్యపరిపూర్ణుఁడైన యని యర్థము.

విజయధ్వజము:

మునయః=శౌనకాది మునులారా!, లోకమంగళం=సజ్జనులకు మంగళమగుఁగాక యని, యత్=ఏ కారణముచేత, కృష్ణసంప్రశ్నః=పరమాత్ముని మూలరూపము, కృష్ణాద్యవతార రూపమునకు సంబంధించిన, సంప్రశ్నః=చరిత్రప్రశ్నయు, కృతః=మీచేత చేయఁబడినదో, అతః=దానితో, అహం=నేను, భవద్భిః=మీచేత, సాధు=అన్నిసాధనముల కంటెను ఉత్తమసాధనమును, మఱియు లోకమంగళం=అధికారి చేతనుల కందఱకు శ్రవణ మననాదులతో శ్రేయస్కరమైన విషయమునే, పృష్టః=అడుగఁబడితిని, ఏన=ఏ కృష్ణచరిత్ర ప్రశ్నచేత, ఆత్మా=1. మనస్సు 2. పరమాత్ముఁడు, ప్రసీదతి=

ప్రసన్నమగునో; కనుక మీ ప్రశ్న మోక్షకరము; సర్వపురాణసార ముగా కృష్ణచరిత్రనే శౌనకాదు లడిగిరని దీనితోఁ దెల్లము.

తాత్పర్యము: శౌనకాదులారా! మీరడిగిన మూలరూపము, అవతారములు వీనిచరిత్ర ప్రశ్న; అధికారులైన చేతనుల కందఱికిని మోక్షకారకమైనది, సమస్త కల్యాణకరము. మీరు సాధనోత్తమము నడిగితిరి. ఇట్టి కృష్ణసంప్రశ్నముతో మనస్సు ప్రసన్న మగును. ప్రసన్నమైన మనస్సుగలవానిని భగవంతుఁడు వలచును.

భగవంతునియందు భక్తిని గల్పించుటతో కృష్ణచరిత్రప్రశ్నమే యుత్తమధర్మము. అధికారులైన సమస్తచేతనులకు నిదే ముఖ్యమైన శ్రేయస్సు. ఇది ఋషు లడిగిన మొదటిప్రశ్న కుత్తరము.

యతః = 1. ఏ కృష్ణచరిత్ర ప్రశ్నచేత 2. ఏ ధర్మముచేత, అధోక్షజే = ఇంద్రియజన్య జ్ఞానమైన ప్రత్యక్షమునకు విషయముగానట్టి (భూతేంద్రియ గోచరుఁడు గానట్టి) పరమాత్మయందు, అహైతుకీ = పరమాత్ముని ప్రసాదముదప్ప వేరైన యే కామ్యఫలము అపేక్షింపని, అవ్యవహితా = మనస్సు ఇతర విషయములయం దాసక్త మగుటచేత నేర్పడెడు వ్యవధానము లేనట్టి, యయా = ఏ భక్తిచేత, ఆత్మా = పరమాత్ముఁడు, ప్రసదతి = ప్రసన్నుఁ డగునో, స వై = ఆ ధర్మమే, ఆ కృష్ణ ప్రశ్నమే, పుంసాం = అధికారులైన చేతనులకు, పరోధర్మః = అత్యుత్తమ ధర్మము.

తాత్పర్యము: ఏ ధర్మాచరణముతో నింద్రియప్రత్యక్షమునకు దూరగుఁడైన యధోక్షజునియందు భక్తి యేర్పడునో అదే యుత్తమ ధర్మము. అట్టి ధర్మముచేత నేర్పడు భక్తి పరమేశ్వరుని యనుగ్రహము దప్ప నితరమైన యే ఫలమును ఆకాంక్షించునదిగా నుండరాదు, విషయసుఖముల యాలోచనతో విక్షిప్తము గారాదు. కొందఱ 'రవ్యవహిత' శబ్దమునకు జ్ఞానముతో సంబంధము లేనిది యని యర్థము,

జెప్పుదురు. వారు 'అథ యోఽన్యాం దేవతా ముపాస్తే, అన్యో సావన్యో ఽహమస్మీతి. న స వేద యథా పశుః' అనెడు బృహదారణ్యక వాక్యమును 'నా విష్ణుః కీర్తయే ద్విష్ణుం' అనెడు స్మృతిని ఉదాహరింతురు. అది సరిగాదు, 'న అవిష్ణుః' అనుచోట 'అవిష్ణుః' అనఁగా విష్ణుభక్తుఁడు గానివాఁడని యర్థము. శ్రుతివాక్యములోని 'యన్య' శబ్దమునకు స్వతంత్రుఁడని యర్థము; కనుక నీ శ్రుతిస్మృతుల యాధారముతో 'భేదబుద్ధి లేక' అని యర్థము చేయుటకు వీలులేదు. అంతేగాక 'వ్యవధానం తిరోధాన మపిధాన మథోచ్యతే' యనెడు కోశము ననుసరించి, యవ్యవహిత మనుట కతిరోహిత మనుటయే శాస్త్రీయమైన యర్థము. 'అప్రతిహతా' యనెడు పాఠము అంగికార్యము గాదు. ఒకవేళ దాని నొప్పికొన్నను 'స్ఖాలిత్యము లేనిది' అనియే యర్థముఁ జెప్పవలెను. 'అవ్యవహితా' అని వీరి పాఠము.

భక్తిగూడ వైరాగ్యమును గల్గించియే యపరోక్షజ్ఞానమునకు సాధన మగుచున్నదని చెప్పుచున్నాఁడు—

భగవతి=షడ్గుణైశ్వర్య సంపన్నుఁడైన, వాసుదేవే=1. సర్వత్ర వసించెడు, 2. సర్వమును దనయందుగల క్రీడాది గుణవిశిష్టుఁడైన శ్రీహరియందు, ప్రయోజితః=ఉపయోగింపఁ బడిన, భక్తియోగః=భక్తి యనెడు పరమాత్మ దర్శనోపాయము, వైరాగ్యం=విషయముల సారమనెడుబుద్ధిని, అహైతుకం=1. అకారవాచ్యుఁడైన విష్ణుప్రసాదమే నిమిత్తముగానున్న, 2. శుష్కతర్కముతో సంబంధములేని, యుపనిషత్తుల కనుగుణమైన, యత్=ఏ, జ్ఞానం=జ్ఞానము కలదో, తచ్చ=దానిని, శాస్త్రీయమైన పరమాత్మ విషయక జ్ఞానమును, ఆశు=శీఘ్రముగా, జనయతి=కల్గించుచున్నది. తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసా నాశకేన'

అనెడు శ్రుతులలో ధర్మము జ్ఞానహేతువనుట ప్రసిద్ధము. అది భక్తికిఁ గారణ మెట్లైనది?

యజ్ఞాది ధర్మములు భక్తివైరాగ్య మూలకముగానే జ్ఞానమును గల్గించునని యర్థము. అహైతుకం అనుటతో ధనలాభాదులకుఁ గారణమైన యింద్రజాలాది జ్ఞానముగాదని తాత్పర్యము.

అన్నిటియందు నున్నవాఁడు అన్నియుఁ దనయందున్న వాఁడు వాసుదేవుఁడు. ఇట్టి వాసుదేవునియందుఁ బ్రయుక్తమైన భక్తి యోగము, అధికారిచేతనునకు విషయముల సారములను వైరాగ్యము గల్గించును తద్వారా అకారవాచ్యుఁడైన విష్ణువుయొక్క అనుగ్రహమే ఫలమైన జ్ఞానమును గల్గించును. పరమాత్మయందు నిజమైన భక్తిగల వానికి ద్రవ్యసంపాదనా కారణమైన జ్ఞాన మేర దదు. కనుక, భక్తి వైరాగ్యమును గల్గించి, యపరోక్షజ్ఞానమునకు సాధన మగును.

నిత్యనైమిత్తిక కర్మలున్నవి గదా! వానికంటె నిది యుక్తమైన దని చెప్పుట యెట్లు? అని యాశంకించి, యా రెండు ధర్మములును బరమాత్ముని కథయందు దాసక్తిని గల్గించుచున్నవి. అందుచేనవి దీనికి సాధనములు, కనుక నిదియే పరమధర్మమని చెప్పుచున్నాఁడు.

యః= (పురుషైః=జనులచేత) స్వనుష్ఠితః=సాంగముగా నెర వేర్పఁబడిన, ధర్మః=శాస్త్రోక్తమై, సదాచారద్రవ్యదేశకాలానుగుణముగాఁ జక్కగా నాచరింపఁబడిన స్వధర్మము, విష్వక్సేన కథాశ్రయాం= 1. నామకీర్తిచేతనే దైత్యసేనలనుగూడ సమస్త దిక్కులకును బరువెత్తఁ జేయు, 2. సమస్త దిక్కులందును, బ్రహ్మాదిరూపమైన సైన్యము గల్గిన, శ్రీహరియొక్క కథాశ్రయమైన, రతిం=ఆసక్తిని, ఆనందమును పుంసాం=అధికారులకు, నోత్పాదయేద్యది=కల్గింపకున్నచో, సః ధర్మః=ఆ ధర్మము చక్కగా ననుష్ఠితమైనను, కేవలం శ్రమ ఏవ= కేవలము శ్రమమాత్రమే. అనుష్ఠానకాలమునందును, అనుష్ఠానానం

తరమును, కేవల మాయాసమునే గల్గించుటతో శ్రమమాత్రమేనని యర్థము. ధర్మానుష్ఠానము చేయుచున్నకాలమందు సుఖకరము గాదు. ఈ విషయమును, 'ఏవ' కారముతోఁ దెల్పుచున్నాఁడు. అనుష్ఠానానంతరము నశ్వరఫలమునే యొసఁగుటచేఁ బూర్ణసుఖకరముగాదని 'కేవల' శబ్దముచేఁ దెల్పుచున్నాఁడు. కనుక, 'ఏవ' కార 'కేవల' శబ్దములు పునరుక్తులు గావు. 'హి' అనుటతో నిది శ్రుతి సమ్మతము అనుచున్నాఁడు. అనేవం విత్ మహత్పుణ్యకర్మ కరోతి, తద్వాస్యాం తతః క్షీయతే, యతే' అని శ్రుతివాక్యము. ఇట్లుగాఁ బరమాత్మను దెలియక మహత్తర పుణ్యకర్మమునే యొనర్చినను కడకదియును నశించి నశ్వరమైన ఫలమునే యొసఁగును అనెడు శ్రుతివాక్య మా యర్థమునే దెలుపును.

నిత్యనైమిత్తిక ధర్మము లున్నను భక్తియోగమే పరమ సాధనము. అధికారి చేతనుఁ డొనర్చు ధర్మములు పరమాత్ముని కథలయం దాసక్తిని బుట్టింపవలెను. సదాచారసంపన్నుఁడై ద్రవ్యదేశకాలానుగుణముగా సాంగముగా నొనర్చినదే ధర్మానుష్ఠానము. ఎవనిపేరు నుచ్చరించినంతనే దైత్యసేన పరుగెత్తునో యా పరమాత్మునకు విష్వక్సేనుఁడని పేరు. అట్టిపరమాత్మకథను వినుటయం దాసక్తిని గల్గించి దానియం దానందమును, వినకుండుటతో దుఃఖమును, గల్గించుటయే యనుష్ఠానమునకుఁ బ్రధానఫలము. అట్టిదిగానిధర్మము అనుష్ఠానకాలమందును తదనంతరమును కేవలశ్రమము మాత్రమే. పరమాత్మజ్ఞానములేనివాఁడు గొప్పపుణ్యము చేసినను ఆ పుణ్య మంతమందు క్షయమై పోవును.

ధర్మస్య హ్యాపవర్గ్యస్య నార్థోఽర్థాయోపకల్పతే,
నార్థస్య ధర్మైకాంతస్య కామో లాభాయ హి స్మృతః. 9

ఆపవర్గ్యస్య=అపవర్గము నుద్దేశించియున్న, ధర్మస్య=ధర్మముయొక్క, అర్థాయ=ప్రయోజనమునకు, అర్థః=అర్థము, న ఉపకల్పతే=సమర్థమైనది గాదు.

ధర్మైకాంతస్య=ధర్మమునే ముఖ్యముగా నిశ్చయించికొన్నట్టి, అర్థస్య= అర్థము యొక్క, లాభాయ=లాభముకొఱకు, కామః=విషయభోగము, న స్మృతః=స్మరింపఁ బడలేదు.

హరిభక్తితో విషయవైరాగ్య మేర్పడుచున్నది. దానినుండి యాత్మజ్ఞానము. కనుక, హరిభక్తియే పరమధర్మమని, యింతకు ముందు శ్లోకములలో వివరింపఁబడినది. కొందరి యభిప్రాయ మిది కాదు. ధర్మమునకు ఫలము అర్థము. అర్థమునకు ఫలము కామము అనఁగా విషయభోగము. కామఫల మింద్రియప్రీతి. ఈ ఇంద్రియ ప్రీతికై మఱల ప్రవృత్తి. మఱల ధర్మార్థాదిప్రాప్తి. ఇది చక్రవర్తనము, కనుక ధర్మానుష్ఠానము గావలసినదే యని వారందరు. ఈ యభిప్రాయమును గాదనుటకై మూఁడు శ్లోకములు.

సంసార సంకటముల బొత్తిగా నశింపఁ జేసి, నిత్యానంద స్వరూపమైన మోక్షము సాధించుటకుఁ, బ్రధానసాధనమైన ధర్మమునకు ముఖ్యప్రయోజనము అర్థసంపాదన మనుట సరిగాదు. అర్థము నశ్వరమైనది. అది యిచ్చునది క్షణికసుఖమునే. శాశ్వతసుఖమును గాదు. అందుకే యర్థప్రాప్తితోమాత్రమే ధర్మము చరితార్థము గాలేదు. అట్లే ధర్మసాధనమునకు, ముఖ్యకారణమైన యర్థము ఇంద్రియ ప్రీతిని గల్గించెడు విషయభోగమునే ఇచ్చును. దీనితోఁ గామము కృతకృత్యమైన దని చెప్పుటకు వీలులేదు. భోగావసానమందు ఇంద్రియప్రీతి గూడ నశించునదే! కనుక నర్థమునకు ఇంద్రియప్రీతి రూపమైన, తుచ్ఛఫలము ప్రయోజనముగాదు. దానినట్లు వినియోగింపరాదని తాత్పర్యము.

కామస్య నేంద్రియ ప్రీతిః లాభో జీవేత యావతా,
జీవస్య తత్త్వజిజ్ఞాసా నార్థో యశ్చేహ కర్మభిః. 10

కామస్య = విషయభోగమునకు, ఇంద్రియప్రీతిః = ఇంద్రియములప్రీతి, న లాభః=ప్రయోజనముగాదు, యావతా=ఎంతమాత్రముచేత, జీవేత జీవిం

చునో, (తావాన్ లాభః=అంతమాత్రమే లాభము) జీవస్య=జీవించుటయొక్క, అర్థః=ప్రయోజనము, ఇహ=ఈ లోకమందు, కర్మభిః=కర్మములచేత, యః=ఏ ఫలమో, సః న=అదికాదు, తత్త్వజిజ్ఞాసా=తత్త్వజిజ్ఞాసయే ఫలమని యర్థము.

విషయభోగరూపమైన కామముయొక్క పరమ ప్రయోజన మింద్రియప్రీతి గాదు. ఇంద్రియములు కామోపభోగముతోఁ దృప్తి జెందవు. మరల మరల వానికై దేవులాడుటయే జరుగును. కనుక, నే మాత్రమైన విషయోపభోగము జీవించుట కావశ్యకమో ఆ మాత్రమే యనుభవించుట కామమునకు ముఖ్యప్రయోజనము. జీవనప్రయోజనము గర్మ లాచరించి, మరల మరల నర్థాదుల సంపాదించుట గాదు. దేనిని తెలిసికొనుటచే మఱల నిట్టి సంసారదుఃఖ మనుభవించు నవసర ముండదో ఆ పరమతత్త్వము దెలియుట కుపకరించెడు ప్రవృత్తిమాత్రమే జీవితమునకుఁ బరమ ప్రయోజనము.

వదంతి తత్తత్త్వవిద స్తత్త్వం యద్జ్ఞాన మద్వయమ్,
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే. 11

తత్త్వవిదః=తత్త్వము నెఱిఁగినవారు, తత్ తత్త్వం=ఆ తత్త్వమును, అద్వయం=రెండుగా గాని, యత్ జ్ఞానం=ఏ జ్ఞానము గలదో, అదియే యని, వదంతి=చెప్పెదరు, బ్రహ్మ ఇతి=బ్రహ్మ మనియును, పరమాత్మా ఇతి=పరమాత్మ యనియును, భగవా నితి=భగవంతుఁ డనియును, శబ్ద్యతే=కీర్తింపఁబడుచున్నది.

అవ: 'తత్త్వజిజ్ఞాస యనుట ధర్మజిజ్ఞాసయే గదా! ధర్మమే గదా తత్త్వము?' ఈ యభిప్రాయము గొందరిది. దీనిని ఖండించుటకే ఈ శ్లోకము.

తత్త్వస్వరూపమును జక్కఁగా నెఱిఁగిన ఋషులు అద్వయమైన జ్ఞానమే పరమతత్త్వ మని పలికిరి. క్షణక్షణమునకును మారుచుండెడు జ్ఞానము, తత్త్వము గాదు; జ్ఞాన మవికారి; ఏకరూపము; ప్రతి

ద్వంద్విలేనిది; ఈ విషయమును దెల్పుటకే పై శ్లోకమందు అద్వయం అనునది జ్ఞానవిశేషణముగా వాడఁబడినది.

'తత్త్వవిదు లందఱును నొకతేరీతిగఁ జెప్పుటలేదు. పలురీతులఁ బల్కుచున్నారు'. ఈ వాదము సరికాదు. ఒకటే తత్త్వమును మూరు పేరులతో వారు పిలుతు రంతే. దానితో వస్తుభేదము లేదు. ఉపనిషత్తులను ప్రబలప్రమాణముగాఁ బాటించువారు పరమాత్మతత్త్వమును బ్రహ్మ మందురు. హిరణ్యగర్భోపాసకులు ఆ తత్త్వమునే పరమాత్మ యనియు, భక్తులు దానినే భగవంతుఁ డనియు వ్యవహరింతురు.

తచ్ఛ్రద్దధానా మునయః జ్ఞానవైరాగ్య యుక్తయా,
పశ్యం త్యాత్మని చాత్మానం భక్త్యా శ్రుత గృహీతయా. 12

మునయః=మునులు, శ్రుతగృహీతయా=వినుటతో గ్రహింపఁబడిన దానిగను, జ్ఞానవైరాగ్యయుక్తయా=పరోక్షమైన జ్ఞానముతోను, విషయవైరాగ్యముతోను గూడినదైన, భక్త్యా=భక్తితో, ఆత్మానం=పరమాత్మను, ఆత్మని=క్షేత్రజ్ఞునియందు, పశ్యంతి=చూచుచున్నారు.

పైఁ బ్రస్తావింపఁబడిన భిన్నవ్యక్తులు భిన్ననామములతో వ్యవహరించెడు నా పరమార్థతత్త్వమును దెలిసికొనుటలో శ్రద్ధగలమునులు ఆ జ్ఞానమును బ్రతిపాదించెడు వేదాంతములు, ఉపనిషత్తులు మొదలైన వాని నాచార్యముఖముగా విందురు. అప్పుడు వారికి నాశరహితమైన యొక తత్త్వ మున్నదను పరోక్షజ్ఞాన మేర్పడును. ఆ పరోక్షజ్ఞానముతో నితర విషయముల యందలి శ్రద్ధ తగ్గును. తత్త్వమునందుఁ బరమప్రేమ లక్షణమైన భక్తి జనించును. దానితో వారు శరీరాదిజడతత్త్వములను బ్రకాశింపఁజేయుచు, నీ శరీరమందుఁ బ్రకాశించుచున్న క్షేత్రజ్ఞుఁ డని పిలువఁబడెడు జీవాత్మ పరమాత్మలొక్కటే యను అనుభవ మా మునుల కేర్పడును.

శ్రీధరీయము :

ఇక్కడ నొక విషయముఁ జెప్పవలసి యున్నది. వావిళ్ళవారి ప్రతిలో ధర్మస్య హ్యాపవర్గస్య అనెడు శ్లోకమునకు ముందు ఈ క్రింది శ్లోక మున్నది.

> శ్రుత మప్యౌపనిషదం దూరే హరికథామృతాత్,
> యన్న సంతి ద్రవచ్చిత్త ప్రేమాశ్రు పులకోద్గమాః.

ఈ శ్లోకమునకు వావిళ్ళవారిప్రతిలో శ్రీధరీయ వ్యాఖ్యగూడ కద్దు.

'వేదాంతశ్రవణాదులతోనే తత్త్వసాక్షాత్కార మగుచున్నది గదా! భక్తితో నేమి పని?' యని యవతారిక. ఆస్వాద్యమానమైన హరికథనుండి ద్రవచ్చిత్తము, ప్రేమాశ్రువులు, పులకోద్గమము ఎవ్వరి కేర్పడవో వారికి శ్రుతమైన యాత్మతత్త్వము గూడ సరిగాఁ దెలియదని తాత్పర్యము. భాగవతమునకు వ్రాయఁబడిన 'భాగవత చంద్రిక' యను విశిష్టాద్వైతవ్యాఖ్యలోను ఈ శ్లోక మున్నది. కాని, మఱి యితరములలో అనఁగా వంశీధర, రూపగోస్వామి, వల్లభాదులలో దీనికి వ్యాఖ్య లేదు. వీరరాఘవీయములోను గన్పింపదు. మధ్వాచార్యులవారి భాగవతతాత్పర్య గ్రంథమందును నిది లేదు. కనుక నిది ప్రక్షిప్తమనియే చెప్పవలెను. శ్రీధరీయ మిట్లారంభింపఁ బడుచున్నది. 'హరిభక్తి ద్వారా వైరాగ్య ఆత్మజ్ఞానపర్యంతము పరమైన ధర్మము'- కొందఱు దీని నంగీకరింపరు. ధర్మమున కర్థము, అర్థమునకుఁ గామము అనఁగా నింద్రియప్రీతి ఫలమనియు వారియూహ. మఱల ధర్మార్థాదుల సంపాదన. ధర్మాదర్థశ్చ కామశ్చ స కి మర్థం న సేవ్యతే' అని వారి ప్రశ్న; 'అపవర్గ్యస్య'-అపవర్గపర్యంతమైన ధర్మము యొక్క ఫలముగా నర్థమును నిర్ణయింప వీలులేదు. అది యోగ్యము గాదనుట. అట్లే ధర్మైకాంతస్య-ధర్మఅవ్యభిచారియైన, అర్థస్య-అర్థమునకు కామమును లాభముగాఁ జెప్పుటకు లేదు. కామమున కింద్రియ

ప్రీతిఫలము గాదు. జీవయాత్ర ఎంతవఱకు సాఁగునో అంతమాత్రమే కామమునకు ఫలము. కర్మానుష్ఠానముతో మఱల చక్రవద్భ్రమణమే యగును. తత్త్వజిజ్ఞాసయే జీవనఫలము.

'తత్త్వజిజ్ఞాసయు, ధర్మజిజ్ఞాసయు నొక్కఁటే గదా! ధర్మమే గదా తత్త్వము?'- దీనినే 'వదంతి తత్తత్త్వ విదః' అను శ్లోకముతో ఖండించుచున్నాఁడు. తత్త్వవిదులు జ్ఞానమునే తత్త్వ మని చెప్పుదురు. అది యద్వయము. బ్రహ్మ-పరమాత్మ-భగవాన్ ఇత్యాదులకు నామభేదమే గాని వస్తుభేదము లేదు. ఈ పరోక్షజ్ఞానమును జ్ఞానవైరాగ్యయుక్తమైన భక్తి చేత క్షేత్రజ్ఞుని మునులు ప్రత్యక్షీకరించి కొందురు. ఎట్లు? వేదాంతాది శ్రవణగృహీతమైన భక్తి చేత.

విశ్వనాథచక్రవర్తి:

లోకమందు నాల్గువిధములైన మనుష్యు లున్నారు. కేవల కర్మనిష్ఠులు, జ్ఞానులు, యోగులు, భక్తులు, ధర్మార్థకామములను చక్రవత్పరివర్తనముగ ననుసరించువారు కేవల కర్మనిష్ఠులు. వారికి ధర్మము అర్థముకొఱకే; తక్కినవారికిగాదు. జ్ఞానులకు ధర్మము శమదమాదుల కొఱకు; యోగులకు యమ నియమాదులకు; భక్తులకు శ్రవణ కీర్తనాదులకు; వీరికి అర్థము ప్రధాన ఫలము గాదు, అనుషంగికమే. దానిని దృష్టిలోఁ బెట్టికొని వీరు ధర్మము ననుసరింపరు గనుక; వారిదృష్టిలో నపవర్గమే ధర్మమునకుఁ బ్రధానఫలము. జ్ఞానులు, యోగులు- వీరి యభిప్రాయములో నపవర్గ మనఁగా మోక్షము. భక్తులయభిప్రాయములో నపవర్గ మనఁగా ప్రేమభక్తి.

'ఏనాపవర్గాఖ్య మదభ్ర బుద్ధిః' ఖగేంద్రధ్వజ పాదమూలః ఇత్యాదులు ప్రథమస్కంధములోనే యున్నవి.

నిశ్చలాత్వయి భక్తిర్యా సైవముక్తి ర్జనార్దన।
ముక్తా ఏవ హి భక్తాస్తే తవవిష్ణో! యతో హరే।

అని స్కాందరేవా ఖండములోని శ్లోకముగూడ నేతదర్థకమే. అట్లే అర్థమునకుఁగూడఁ బ్రధానఫలము కామము గాదు. ఎందుకనఁగా నర్థము ధర్మైకాంతము. అర్థమునకుఁ బ్రధానఫలము ధర్మానుష్ఠానమే. కనుక జ్ఞానులు యోగులు, శమ దమాద్యనుకూలములును- యమ నియమాద్యనుకూలములునునైన, ధర్మములకే యర్థమును వినియోగింతురు. భక్తుఁడు భగవంతునకును, భాగవతసేవకును వెచ్చించును. అట్లే కామమున కింద్రియప్రీతి లాభమని వీ రంగీకరింపరు. ఎంత వఱకు బ్రదుకున కవసరమో యంతవఱకే కామమును సేవింతురు. ఇక్కడ నొకవిషయ మున్నది. జ్ఞానులు యోగులు- వీరికి అర్థ, కామ ఇంద్రియప్రీతులు జ్ఞాన, యోగములకు అనుషంగిక ఫలములు. అవి గర్మఫలములైనట్లే లెక్క. ఎందుకనఁగా జ్ఞాన, యోగములందు అర్థకామములు నిష్కామ కర్మపరిణామములు; కనుక జ్ఞానులకును యోగులకును గల్గెడు సుఖదుఃఖములు కర్మఫలములే. భక్తులకుఁ గల్గెడు అర్థ, కామ, ఇంద్రియప్రీతులు భక్తికే అనుషంగిక ఫలములు. భక్తి కర్మముగాఁ బరిణమించుట లేదు గనుక వారి సుఖదుఃఖములు భక్తిఫలములే.

యస్యాహ మనుగృహ్ణామి హరిష్యే తద్ధనం శనైః,
తతోఽధనం త్యజం త్యస్య స్వజనాదుఃఖ దుఃఖితమ్.

అను భాగవతవచనముతో వారిదుఃఖము భగవంతుని నుండి యేర్పడినదే. లేక భక్త్యాపరాధఫలమైనను గావచ్చును; కనుక జీవుని యొక్క జీవనమునకు తత్త్వజిజ్ఞాసయే ప్రధానఫలము. కర్మాదులతో నేర్పడు స్వర్గముగాదు.

వదంతి తత్త్వవిదః—ఈ శ్లోకములో 'నద్వయం' అను పద మున్నది. అద్వయమైన యే జ్ఞాన మున్నదో అది తత్త్వమని భావము. ఔపనిషదుల బ్రహ్మమే జ్ఞానుల జ్ఞానము. జ్ఞానుల మతములో జ్ఞాన మద్వయమెట్లో వివరింతుము. వీరిమతములో జ్ఞానము నిరాకారము.

జ్ఞాతృజ్ఞేయాది విభాగశూన్యము, చిత్సామాన్యము. చిద్విశేషములైన భగవద్ధామములు మొదలైన వానిని జ్ఞానమునకంటె భిన్నముగా వారు భావింపరు. అభిన్నముగనే మననచేతురు. జీవుఁడు మాయ యీ రెండును జ్ఞానముయొక్క శక్తులు. అందుచే నంతర్భూతములే; కనఁబడు ప్రపంచము కారణమాత్రాత్మకము. అందుచే నద్వైతము. యోగులు పరమాత్మయని దేనినందురో యదియును జ్ఞానమే. దీని కద్వైతమెట్లు? యోగుల మతములోఁ బరమాత్ముఁడు చిదేకరూపుఁడు. కనుక జ్ఞానమాత్రుఁడు. జ్ఞానమాత్రుఁడైనను. సాక్షిత్వాది జ్ఞానవిశేష ముల కాశ్రయుఁడు; ద్యుమణి దీపములు జ్యోతిస్స్వరూపములే. కాని, జ్యోతిష్మంతములనియుఁ బ్రతీతి; వీరిలో మరియొక తెగయున్నది. వా రిట్లందురు.

స్వదేహాంతర్హృదయావకాశే ప్రాదేశమాత్రం పురుషం వసంతం.

వీరిసిద్ధాంతములోఁ బురుషుఁడు సాకారుఁడు. అప్పుడద్వైత మెట్లు? ఇట్లు.

మాయ వానిశక్తి. జీవుఁడు తద్విభిన్న పదార్థాంశము. మాయి కము లన్నియు తదన్యములు. కనుక ద్వితీయమైన వస్తువు లేదు. అందుచే నద్వయము. భగవంతుఁడని భక్తు లందురు. వారి విషయ ములో నద్వైతమెట్లు?. భగవంతుఁడు జ్ఞానస్వరూపుఁడు. షడ్గుణము లాతని కున్నను అవియుఁగూడ నప్రాకృతములైన దానివలన చిన్మాత్ర ములే. కనుక తద్రూపములే. విష్ణుపురాణ మిట్లున్నది.

ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః,
జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణాః.
జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్యతేజాం స్యశేషతః,
భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయైర్గుణాదిభిః.

భగవంతుఁడు ఒక్కొక్కసారి ద్విభుజుఁడు, చతుర్భుజుఁడు. అయన చిద్ఘనాకారము లనేకములు. అట్లే యాతఁడు బహిరంతరము

లందు వర్తించును. అప్పు డద్వయ మెట్లు సిద్ధించును? స్కాంద మిట్లను చున్నది.

న చ్యవంతే చ యద్భక్తా మహాత్యాం ప్రలయాదపి.

ఆయనచిద్ఘనాకారము లెన్నియున్నను, సేవ్య, సేవక, సేవాది విభేదము లున్నను వాఁడొక్కఁడే యనుటయే యద్వైతము. వాని శక్తులైన చిదాదులు, వానివిలాసములైన వైకుంఠాదులు, వాని స్వరూప ములుగనే వీరు భావింతురు. కనుక జ్ఞానాధికారులు బ్రహ్మయందురు. యోగాధికారులు పరమాత్మయందురు, భక్త్యధికారులు భగవంతుఁ డందురు. వీరిదృష్టిలో అచింత్యానంత చిదానందమయుఁడు భగవం తుఁడు. స్వరూపరూపగుణ లీలాద్యనేక ధర్మవంతుఁడు.

'యన్మిత్రం పరమానందం పూర్ణబ్రహ్మ సనాతనమ్' 'బ్రహ్మణో హి ప్రతి ష్ఠాఽహం' మదీయం మహిమానం చ పరంబ్రహ్మేతి శబ్దితమ్. 'విష్టభ్యాహ మిదం కృత్స్నం ఏకాంశేన స్థితో జగత్.'

ఇత్యాది వచనములచేత, భక్తులకు మోక్షప్రాప్తియు నున్నదని సూచింపఁ బడుచున్నది. బ్రహ్మ పరమాత్మోపాసకులకు భగవద్విష యిక ప్రేమప్రాప్తిలేదు. బ్రహ్మత్వ పరమాత్మత్త్వములు భగవంతుని రెండువిశేషములే, కనుక భగవత్తత్త్వమే మూలరూపము. బ్రహ్మో పాసకులకంటెను యోగి శ్రేష్ఠుఁడు, వానికంటెను భగవదుపాసకుఁడు ముఖ్యము. ఈ విషయము గీతయందే యున్నది.

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున.
యోగినా మపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యో మాం సమేయుక్తతమో మతః.

'యోగినా మపి' అనుచోట నున్నషష్ఠి పంచమ్యర్థమందని భగవద్రామానుజు లన్నారు; ఈ జ్ఞానము నెట్లు సాధించుట? దానిని చెప్పుచున్నాఁడు.

'తత్ శ్రద్దధానామునయః' అను శ్లోకముచేత; మూఁడురూపముతైన యీజ్ఞానము మననశీలురైన జ్ఞానులు, యోగులు, భక్తులు భక్తిచేతనే పొందుచున్నారు. జ్ఞానులు ఆత్మయందు, సత్పదార్థమైన యీశ్వరునియందు త్వం పదార్థమైన జీవుని పశ్యంతి=అనుభవించుచున్నారు. యోగులు అంతర్హృదయమం దంతర్యామిగా ధ్యానముతో ననుభవించుచున్నారు. భక్తులు, ఆత్మని=అనఁగా మనస్సునందు 'చ' కారముతో బయటఁగూడ ఆత్మానం=భగవంతుని, పశ్యంతి=తమకనుల చేతనే వానిమాధుర్యము ననుభవించుచున్నారు. శ్రుతిగృహీతయా=గురుముఖమునుండివిని, తర్వాత గృహీతమైన భగవద్విషయకమైన శ్రవణకీర్తనాదిరూపమైన భక్తిచేత భక్తుఁడు భగవంతు ననుభవించుచున్నాఁడు. బ్రహ్మపరమాత్మోపాసకులు భక్తిని వేఱుగా సాధించికొనవలసియున్నది.

తస్మాన్మ ద్భక్తియుక్తస్య యోగినో వై మదాత్మనః,
న జ్ఞానం న చ వైరాగ్యం ప్రాయః శ్రేయో భవేదిహ.

శుద్ధభక్తుఁడు వానిని వేఱుగా సంపాదించికొన నవసరము లేదు, ఆ త్రిరూపమైన జ్ఞానమును భక్తిచేతనే వాఁ డనుభవించుచున్నాఁడు; వాని కప్రయత్నముగనే సిద్ధించుచున్నవని భావము.

**విజయధ్వజవ్యాఖ్య :**

ధర్మము హరిభక్తిని గలిగించును. దానితో విషయవైరాగ్యము భగవద్విషయక జ్ఞానము నేర్పడుచున్నవి. కనుక, ధర్మ మా రెండింటికిఁ గారణ మగును. అట్టి ధర్మమే ఉత్తమమైనది. ధర్మమున కర్థము, దానికిఁ గామము, కామమున కింద్రియప్రీతి, దానికి మఱల ధర్మానుష్ఠానము– ఈ చక్రకవత్పరివర్తనము కేవల శ్రమ మాత్రమే.

ఈ వాదము సరికాదని త్రివర్గవాదులైన యర్థశాస్త్రకారులు వచింతురు. వారిమాట ముముక్షువు లాదరింపఁ దగినదికాదు. త్రివర్గ

వాదము కేవల బహిర్ముఖులకు మాత్రమే యని ఈ శ్లోకములోఁ దెల్పు చున్నారు. 'అపవర్గ్యస్య'- మోక్ష మనెడు మహాఫలమునకు సాధన మైన, ధర్మస్య=శాస్త్రవిహితములైన ధర్మకార్యములకు, ఇహ=మోక్షాధి కారుల విషయమందు, 'అర్థః అర్థాయ న కల్పతే హి'. అందుచే శ్రీహరి కథయందు ఆసక్తి గల్గించుటయే ధర్మమునకు ఫలము. ధర్మైకాం తస్య=భక్తిని గల్గించి మోక్షమునకు సాధనమైన, ధర్మమే ఫలమైన, 'అర్థస్య, కామః, లాభాయ న స్మృతః'=జ్ఞానులచేత చెప్పఁబడలేదు. హి=అందుకే,సంపాదించిన ధనమునకు ధర్మమే ఫలమని తాత్పర్యము.

తాత్పర్యము: "ధర్మము భగవంతుని కథయందు ఆసక్తిని గల్గింపకున్నను ధర్మ మర్థమునకు, అది కామమునకుఁ బ్రయోజనము. కామముతో సుఖ మేర్పడుచున్నది. మఱల దానికై ధర్మము". ఈ వాదము అర్థశాస్త్రపరులది. భగవద్భక్తి లేనివారి మత మది. భక్తుల నిశ్చయ మది గాదు. వారి ధర్మమునకు మోక్షమే ఫలము. బంగారు మొదలైనవి కావు. సంపాదించిన ద్రవ్యమునకు మోక్షసాధకమైన ధర్మమే ఫలము. విషయసుఖానుభవము గాదు.

"కామస్య ఇంద్రియప్రీతిః న లాభః యావతా జీవేతలాభః" అర్థశాస్త్రములోఁ జెప్పిన వాదము కేవల సంసారులకే, ముముక్షువు లకుఁ గాదు. యావతా=హరి కల్పించిన విషయముల ననుభవించుట యనెడు కామముతో, జీవేత=విష్ణువు, వైష్ణవులు- వీరి సేవకొఱకై ఎట్లు బ్రదుకవలెనో యట్లు, సత్కామము ననుభవింపవలెనని భావము. హరిభక్తులసేవ కుపయుక్తమైన జీవనమే కామమునకు మహాఫలము. ఇంద్రియప్రీతి యధమఫలము. ఇహ=పైఁ జెప్పిన ప్రకారము, కర్మ భిః =యజ్ఞాది కర్మలచేత, యః = ఏ ప్రయోజనము, భక్త్యాదులఁ గల్పించు జ్ఞాన మనెడు ఫలము గలదో, సః=అది, అతత్త్వజిజ్ఞాసోః= భగవత్తత్త్వమును దెలియని లేక తెలిసికొన వలెనను బుద్ధియే లేని, జీవస్య=జీవునకు, న భవతి = కలుగదు. భగవదర్పణబుద్ధితోఁ జేసిన

కర్మలే ఐహికాముష్మిక ఫలముల నిచ్చును. అనర్పణబుద్ధితో నొనర్చి నవి నిరర్థకములు. కనుక యజ్ఞాది ధర్మాచరణముతో సామాన్యభగవ ద్భక్తి యేర్పడును. దానితో వైరాగ్యము, వైరాగ్యముతో శ్రవణము మొదలైన తత్త్వజిజ్ఞాస కలుగును. దానితో జ్ఞానము. ఆ జ్ఞానము సుదృఢమైన భక్తి నేర్పఱచును.

సుఖానుభవరూపమైన కామమునకు జీవనయాత్ర గడచుటయే ఫలము. జీవించుట కెంతమాత్రము సుఖానుభవ మావశ్యకమో అంతయే సేవింపవలెను. ఇంద్రియములను దృప్తిపఱుప వలెనను నాసతో దానియందే మగ్నుఁడు గారాదు. కనుక విషయసుఖాను భవము జీవనమును, జీవన మర్థమును, అర్థము ధర్మమును, ధర్మము మోక్షమును గల్గించునని తెలియుటయే భక్తుల జీవనరహస్యము. తత్త్వజ్ఞాని కానివాఁడు సేయు కర్మల కెప్పుడును భగవద్భక్తిఫలము కానేరదు. కర్మములను భగవదర్పణబుద్ధితోఁ జేసిననే ఫలకారులగును. అట్లు గానివి ఐహికాముష్మికములలో దేనినిగూడ నొసఁగ లేవు. కనుక తత్త్వజ్ఞానమే యావశ్యకము.

తత్త్వజిజ్ఞాసువులు గానివాని కర్మ పురుషార్థజనకము గాదని చెప్పినట్లైనది. ఆ తత్త్వ మేది? దాని నీ క్రింద విచారించుచున్నారు-

తత్త్వవిదః=తత్త్వమును జక్కఁగా నెఱిఁగిన లక్ష్మీబ్రహ్మాది చేతనులు, యత్=ఏ, అద్వయం=తనతో సమానమైనది గాని,యధిక మైనది గాని లేనట్టి, జ్ఞానం=జ్ఞానమే స్వరూపముగా నున్న, తత్త్వం= సర్వదా నొకరీతిగా నున్న, అందుకే తత్త్వ మనఁబడునట్టి పదార్థమని, వదంతి=చెప్పుదురో, తత్=అది, ఆ తత్త్వశబ్దవాచ్యమైన పదార్థము, బ్రహ్మేతి=అనంతగుణగణములచేత బృంహిత మగుటచే బ్రహ్మ మని (గుణపూర్ణుఁ డనియు), పరమాత్మేతి=సర్వాంతర్యామి యగుటచేఁ బర మాత్ముఁ డనియు, భగవానితి=ఐశ్వర్యాది గుణవిశిష్టుఁ డగుటచే భగ వంతుఁ డనియు, శబ్దతే=ప్రతిపాదితుఁ డగుచున్నాఁడు.

విశేషార్థములు : 'అద్వయం'- అనుటకు అద్వైతులు తదను యాయులు, తనకన్న భిన్నమైన పదార్థము లేనిదని యర్థము చెప్పెదరు. ఇంచుమించు శంకరమతానుయాయులైన మఱికొందఱు నిట్లే వ్యాఖ్యానింతురు. దాని కా రీతి యర్థము చెప్పుటకు వీలు లేదు. భాల్లవేయశ్రుతిలో నిట్లున్నది. 'స పురుషస్సోఽద్వయః', 'న హ్యేన మభి కశ్చన', 'హ్యేన మభికశ్చన'- వాఁడే పురుషుఁడు, వాఁడే అద్వయుఁడు. వీనికి సముఁ డెవ్వఁడును లేఁడు. మీఱినవాఁ డెవ్వఁడును లేఁడు. కనుక అద్వయ శబ్దమునకు సమానాధిక రహితుఁడనియే యర్థము. ఇంతమాత్రమే గాదు. ఈ యర్థమే స్పష్టముగా మహాసంహితలో నున్నది.

సోఽద్వయః పురుషస్తస్మా న్నసమో నాఽధికోహ్యతః

ఏ కారణముతో శ్రీహరికంటె నధికుఁడును, సమానుఁడును లేఁడో ఆ కారణముతో నతఁ డద్వయుఁడు. దీనిలోనే తత్త్వశబ్దార్థము గూడఁ జెప్పఁబడినది.

**అతీతా నాగతేకాలే యస్త్రాద్భశ ముదీర్యతే,**
**తతశ్చిదన్య ధానేయా త్తత్తత్త్వం తత్త్వతో విదుః.**

త్రికాలములయందును నేది యున్నట్లే యున్నదని (మారకున్నదని) దేని నందురో, యే కారణముతోనైనను, నితరమున కేది యధీనము గాదో అదే తత్త్వము. ఒకతేరీతితో సర్వకాలములయందు నుండి స్వతంత్రముగా నుండునది యని పిండితార్థము. కనుక తత్త్వ శబ్దమునకు అనారోపితమైన దనియు, నిది తప్పఁ దక్కినదంతయు నారోపిత మనియు నర్థము సేయరాదు.

**సత్తామాత్రం తు యత్కించిత్ సదసచ్చాఽ విశేషణమ్,**
**ఉభాభ్యాం భాష్యతే సాక్షాద్భగవాన్ కేవల స్మృతః.**

యచ్చ=ఏ తత్త్వము, సత్తామాత్రం=కేవల మానందమే దేహముగా నున్నదో, యస్య=ఏ జ్ఞానాత్మకమైన తత్త్వమునకు, సద

సచ్చ=కార్యభూతములైన మహదాదులు, కారణభూతమైన యవ్యక్త తత్త్వము, అవిశేషణం=తాము విషయము లగుట యను దానివలననే విశేషమును గల్పింపలేవో, యత్=ఏ తత్త్వము, యత్కించిత్=లోక విలక్షణమైనదో, యత్=ఏది, ఉభాభ్యాం=కార్యకారణము లనెడు రెంటిచేతను, భాష్యతే=చెప్పఁబడుచున్నదో, అనఁగా కారణమైన మట్టిని సృష్టించినవాఁడు కార్యమైన ఘటమును సృష్టించినవాఁడు, లేక కారణమైన మట్టిని కార్యమైన ఘటమును దెలిసినవాఁడు, అనంత కార్యకారణ విశిష్టుఁడుగా వ్యవహరింపఁబడువాఁడు అని యర్థము. ఆ తత్త్వమే బ్రహ్మ మని తెలియఁబడుచున్నది. ఆ తత్త్వమునకే పరమాత్మఁడని భగవంతుఁడని పేరులు. కనుక, భగవాన్=ఆ భగవంతుఁడు, సాక్షాత్=ముఖ్యరీతితో, కేవలః=ప్రకృతిసంబంధము లేనివాఁడని, స్మృతః=స్మృత్యాదులందుఁ జెప్పఁబడినాఁడు.

విశేషార్థములు : సత్తామాత్రమని చెప్పుటచేత నున్నది స్వరూపశక్తి యొక్కటే తదన్యము లేదని యర్థము చెప్పరాదు. దీనికిఁ బ్రమాణము 'పైంగి' శ్రుతి.

**అథ కస్మాదుచ్యతే సత్తేతి. నందతి నందయతి చేతి.**

సత్త యని యెందు కందురు? తాను సంతోషపడుటచేత, ఇతరులను సంతోషపెట్టుటచేత. 'మాత్ర' శబ్దమునకు దేహ మనియు నర్థము వచ్చును. కనుక ఆనందరూపమైన దేహ మున్నవాఁడని యర్థము.

పరమాత్మను జ్ఞానస్వరూపుఁడంటిమి. జ్ఞానము విషయాపేక్షము. అందుచే నుత్పత్తి వినాశములు గలది. 'జ్ఞానస్వరూపుఁడైన భగవంతుఁడును ఉత్పత్తి వినాశము లున్నవాఁడే. కనుక ననిత్యుఁడేగదా?' యని ప్రశ్న. దీని కుత్తరమే 'సదసచ్చా విశేషణం' అనునది.

ప్రపంచమందున్న విషయము లన్నియును కారణములుగనో కార్యములుగనో యుండును. కనుక సదసత్ అను పదములకు విషయ

సమూహము లని యర్థము. జ్ఞానము విషయసంపర్కముగల ఇంద్రియములచేఁ బుట్టినదైనచో నప్పుడు విషయప్రయుక్తవిశేషము జ్ఞానమున కేర్పడును. పరమాత్ముని స్వరూపమైన జ్ఞానము విషయము నపేక్షించి పుట్టునది గాదు. 'దీనిని దీనితోఁ జేయును' ఇత్యాదిగాఁ బరమాత్మయందుండు ధర్మములే తత్స్వరూపజ్ఞానమునకు విశేషమును గల్పించుచున్నవి. కనుక పరమాత్ముఁడు విషయాపేక్షయున్న జ్ఞానము స్వరూపముగాఁ గలవాఁడని యర్థము గాదు. జడసంపర్కము లేని జ్ఞానస్వరూపుఁడు. ఇట్టి జ్ఞానమును తదభిన్నుఁడైన పరమాత్ముఁడును నిత్యులే. 'ఉభాభ్యాం భాష్యతే' అన్నదెందుకు? కనుక కార్యకారణాపేక్ష పరమాత్మజ్ఞానమునకు లేదని యర్థము. ఇవి యముఖ్యములు. అనఁగా బరమాత్ముఁడు స్రష్టయైనందువలన వానికిఁ గార్యకారణరూపములైన విషయములనుండి వ్యావర్తకమైన జ్ఞాన ముండవలెను. అట్లుగానిచో నతనిని సృష్టికర్త యనుటే పొసఁగదు. 'యత్కించిత్' అనుమాట అప్రసిద్ధమైన దానినిఁగూర్చి తెల్పును. ఇక్కడ నామాట వాడుటవలన నీశ్వరతత్వము లోకవిలక్షణమైనదని యర్థము. ఈ వ్యాఖ్యానమునకు తంత్రభాగవతములోని ఈ శ్లోకము ప్రమాణము.

విషయాపేక్షి నజ్ఞానం విషయైశ్చ విశేషితమ్,
యత్తదానంద మాత్రంచ తద్బ్రహ్మే త్యవధార్యతామ్.

ఈ శ్లోకమందలి 'విషయాపేక్షి' యనుటతో సదసద్భ్యాం విశేషణం' అను నర్థము వివరింపఁబడినది. 'ఆనందమాత్రం' అనునది సత్తామాత్రం అను దానికి మూలము.

తాత్పర్యము: తత్త్వ మన్నచో సమము, అధికములేని జ్ఞానము. దీనినే తత్త్వవిదులు తత్త్వ మందురు. జ్ఞానాత్మకమైన ఈ వస్తువునే శాస్త్రమందు బ్రహ్మ మని, పరమాత్మ యని, భగవంతుఁడని వ్యవహరింతురు. బ్రహ్మ మనఁగా సర్వదేశ సర్వకాల సర్వగుణముల యందును పూర్ణుఁడై యుండువాఁడు; పరమాత్మ యనఁగా సర్వ

జీవాంతర్యామి; భగవంతుఁ డనఁగా నైశ్వర్యము మొదలైన గుణ ములతోఁ గూడినవాఁడు. జ్ఞానాత్మకమైన ఈ వస్తువున కానందమే దేహము. తా నానందపడుటయే గాదు, ఇతరులను గూడ నానంద పఱచును. ఇది లోకవిలక్షణము, ఆశ్చర్యకరము. ప్రపంచమందున్న కార్యకారణరూపమైన ఏ విశేషము గూడ నీ జ్ఞానమును, తన నిమిత్త మున విశేషమున్న దానినిగాఁ జేయలేదు. అది నిత్యము; విషయ మైన కార్యభూతమైన మహాదాది తత్త్వములు ఘటము మున్నగు నవి గాని కారణభూతములైన అవ్యక్తతత్త్వము, మన్ను మొదలైనవి గాని పరమాత్మజ్ఞానమునకు విశేషమును గల్పింపలేవు. ఆ జ్ఞానము స్వధర్మములచేతనే దన విశేషమును దోపింపఁజేయ గలది. దానికి విషయాపేక్ష లేదు. ఆ జ్ఞానమునే తత్త్వమని, బ్రహ్మ మని పిలుతురు. తత్త్వ మనఁగాఁ త్రికాలములయం దొక్కరీతిగనే యుండు వస్తువు. జ్ఞానస్వరూపుఁడైన పరబ్రహ్మ ప్రకృతిసంబంధము లేనివాఁడు.

తత్=ఇట్లు, బ్రహ్మ పరమాత్మ మొదలైన అనంత వైదిక పద వాచ్యుఁడైనట్టియు, సగుణుఁడు సర్వజగత్కర్త పరమాత్ముఁడు నైన వస్తువే తత్త్వ మగుటచేత, మునయః=జ్ఞానులు, శ్రద్ధధానాః=శాస్త్ర మందు జెప్పఁబడిన ఈ వస్తువునం దాస్తిక్యబుద్ధి గలవారై, శ్రుతిగృ హీతయా=హరిమాహాత్మ్య రూపమైన శాస్త్రశ్రవణముచేత దృఢముగాఁ జేయఁబడిన, జ్ఞానవైరాగ్యయుక్తయా=శ్రవణాది రూపమైన పరోక్ష జ్ఞానముచేతను, విషయవిరక్తిచేతను గూడియున్న, భక్త్యా=పరమాత్మ యందున్న ప్రేమప్రవాహముతో, ఆత్మని=తమ హృదయములందు, ఆత్మానం చ=పరమాత్మనే, పశ్యంతి=చూతురు. అనఁగా నపరోక్షజ్ఞాను లగుదురని భావము.

విశేషార్థములు: ఇందున్న 'చ' కారము 'ఆత్మన్యేవాత్మానం పశ్యేత్' అనెడు శ్రుతిప్రసిద్ధిని తెలుపును. కొందఱు 'చ' కారముతో **'ఆత్మని'** యనఁగా క్షేత్రజ్ఞుఁడైన జీవునియందు, ఆత్మానం=పరమా

త్మను, చ=ఆ పరమాత్మయందు జీవునిఁ జూతురు అని వ్యాఖ్యానిం తురు. దీనితో నేమైనది? జగదాకారముగా వివర్తితమైన తత్త్వమే వేఱు. నిర్గుణతత్త్వమే వేఱన్నట్లైనది. ఇది శ్రుత్యర్థానుసారి గాదు.

తాత్పర్యము: ఇట్లు ఆ పరబ్రహ్మ పరమాత్మ మొదలైన అనేక వైదికపదములతో వాచ్య మగుటచే సగుణము, సకల జగత్కర్త, సర్వ నియామకుఁడు. ఈతఁడే తత్త్వము; అందుచే జ్ఞానులు శాస్త్రోక్తపద్ధతి యందు శ్రద్ధగలవారై ఆస్తిక్యబుద్ధితో వేదాంతశాస్త్రశ్రవణముచే నేర్పడిన దృఢతర తత్త్వజ్ఞానముతో విషయవైరాగ్యమును బొందెదరు. పొంది, యా పరమాత్మను భజింతురు. వానినే తమ హృదయములందుఁ బ్రత్యక్షీకరించి కొందురు. 'ఆత్మన్యే వాత్మానం పశ్యేత్' అనెడు శ్రుతియు నీ యర్థమునే తెల్పుచున్నది.

అతః పుంభి ర్ద్విజశ్రేష్ఠా వర్ణాశ్రమ విభాగశః,
స్వనుష్ఠితస్య ధర్మస్య సంసిద్ధి ర్హరితోషణమ్. 13

తస్మా దేకేన మనసా భగవాన్ సాత్వతాం పతిః,
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ ధ్యేయః పూజ్యశ్చ నిత్యశః. 14

యదనుధ్యాసినా యుక్తాః కర్మగ్రంథి నిబంధనమ్,
ఛిందంతి కోవిదాస్తస్య కో న కుర్యా త్కథారతిమ్? 15

శుశ్రూషోః శ్రద్దధానస్య వాసుదేవ కథారతిః,
స్యాన్మహత్సేవయా విప్రాః పుణ్యతీర్థ నిషేవణాత్. 16

అతః=ఆ కారణముచేత, ద్విజశ్రేష్ఠాః=ఓ బ్రాహ్మణోత్తములారా!, పుంభిః=పురుషులచేత, వర్ణాశ్రమవిభాగశః=వర్ణము, ఆశ్రమము వీని విభాగముల ననుసరించి, స్వనుష్ఠితస్య=చక్కఁగా నాచరింపఁబడిన, ధర్మస్య=ధర్మమునకు. సంసిద్ధిః=ఫలప్రాప్తి, హరితోషణం=హరికి సంతోషమును గలిగించెడు-అతని యారాధనము.

భక్తిచేతనే పరమాత్మ యనుభవ మేర్పడుచున్నది. కనుక బ్రాహ్మణాది వర్ణభేదములను, బ్రహ్మచర్యాద్యాశ్రమ భేదములను అనుసరించి విధింపఁబడిన నిత్యనైమిత్తిక కర్మలను శ్రద్ధగా ననుష్ఠించుటకు సరియైన ఫలము ధనము గాదు. శ్రీహరి సంతోషమున కుపకరించెడి యారాధనమే ధర్మమునకు యథార్థమైన ఫలము. 13

**తస్మాత్**—అందువలన, **ఏకేన మనసా**—ఇతరవిషయములచేఁ జలింపని, నివాతదీపమువలె స్థిరమైన మనస్సుతో, **సాత్వతాం పతిః**—భక్తులను పరిరక్షించి పాలించెడి నాథుఁడైన, **భగవాన్** — భగవంతుఁడైన శ్రీహరి, **శ్రోతవ్యః** — వినఁదగినవాఁడు, అనఁగా నతని కథలను నిరంతరము వినవలెనని భావము. **కీర్తితవ్యః**—కీర్తింపఁదగినవాఁడు, **ధ్యేయః** — ధ్యానించుటకు యోగ్యుఁడు, **నిత్యశః**—దినదినమును, **పూజ్యః చ**—పూజింపఁదగినవాఁడు,

భక్తిహీనమైన ధర్మానుష్ఠానము కేవలము శ్రమ మాత్రమే. భక్తియే ప్రధానమైనది. తత్సంపాదనమునకే ధర్మానుష్ఠానము. ఇదే వ్యాసమతము. దీనినే క్రింది శ్లోకముతో మఱలఁ జెప్పుచున్నాఁడు. భక్తియే ప్రధాన మగుటతో నో మునీశ్వరులారా! ఏకాగ్రమైద మనస్సుతో సాత్వతుల కధినాథుఁడైన భగవంతునిఁ గూర్చి నిత్యమును శ్రవణ మొనర్పవలెను. ధ్యానింపవలెను; పూజింపవలెను. 14

**యదనుధ్యాసినా** — ఎవనికి సంబంధించిన ధ్యాన మనెడు **ఖడ్గముతో**, **యుక్తాః**—కూడినవారై, **కోవిదాః** — పండితులు, **గ్రంథినిబంధనం** — అహంకార మనెడు గ్రంథిని నిబంధించునట్టి, **కర్మ**=కర్మమును, **ఛిందంతి**—నాశమొనర్తురో, **తస్య**— అట్టివాఁడైన భగవంతునియొక్క, **కథారతిం** — కథయందు దాసక్తిని, **కః** — ఎవఁడు. **న కుర్యాత్**—చేయఁడు ?.

ఇదివఱకుఁ జెప్పిన శ్లోకములో భక్తిరహితమైన ధర్మము వ్యర్థప్రాయమని నిరూపింపఁబడినది. ఇఁక పై శ్లోకములతో భక్తి ముక్తి నొసఁగునను విషయమును విస్తరించుచున్నాఁడు. భగవంతునిస్వరూప ధ్యానమే మహత్తరమైన ఖడ్గము. ఈ ఖడ్గమును విద్వాంసులు ధరిం

తురు. దీనితో వారు అహంకారమును వృద్ధినొందించెదు కర్మమును నాశ మొనర్తురు. 'నేను కర్మ నొనర్చుచున్నాను. నేనే దానిఫల మను భవింపఁ బోదును'. ఈ విధమైన భావములను క్రమముగా నశింపఁ జేసికొని 'భగవత్ప్రేరణచేతనే సమస్త కర్మలును జేయఁబడుచున్నవి. అందుచే నే తత్ఫలమైన పుణ్యపాపములు రెండును భగవంతునకే సమ ర్పితములు' అని దృఢభావమును బూనుదురు. దీనితో వారియహం కారగ్రంథి విడివడును. భగవత్ప్రేరితములైన కర్మలొనర్చుటకు సాధక మైన భగవత్కథాశ్రద్ధ వారి కుండును. ఇట్టి సులభమార్గముతో నహం కారమును దొలఁగించుకొనుట కెవఁ డిష్టపడఁడు? భగవత్కథారతి యహంకారగ్రంథిని నాశ మొనర్చునని పిండితార్థము. 15

**పుణ్యతీర్థ నిషేవణాత్**—పుణ్యకరములైన **తీర్థసేవనములతో, మహత్సే వయా**—గొప్పవారిని సేవించుటచేతను, **విప్రాః**—ఓ విప్రులారా!, **శుశ్రూషోః**— వాసుదేవుని **కథలను** వినవలెనను కోర్కి గల్గినట్టియు, **శ్రద్దధానస్య**—తత్కథా **శ్రవణమందు** కేవల మిచ్ఛయే గాక **తీవ్రమైన** శ్రద్ధగలిగిన **పురుషునకు, వాసు దేవ కథారతిః**—వాసుదేవుని కథలయందలి పరమప్రేమ, **స్యాత్**—ఏర్పడును.

భక్తి ముక్తినిచ్చును. అట్టి భక్తిని బొందెడి మార్గము నీక్రింది శ్లోకముతోఁ జెప్పుచున్నాఁడు. పుణ్యతీర్థములు పాపములను నశింపఁ జేయును. పుణ్యములను వృద్ధిఁబొందించును. అందుచే పుణ్యతీర్థము లందు స్నాన మొనర్పవలెను. ఆ క్షేత్రదర్శనము చేయవలెను. ఈ పుణ్యఫలముగా మహాత్ములసేవ లభించును. వారు వచించు హరి కథలు వినవలెనను నాస గలుగును. క్రమముగా వాసుదేవుని కథల యందుఁ దీవ్రమైన యభిరుచి యేర్పడును. 16

**శ్రీధరీయము :**

ధర్మమునకు ఫలము భక్తియే. అర్థకామాదికములు గావు. ఈ విషయ మింతవఱకు నుపపాదింపఁ బడినది. దీనితో ముగించు చున్నాఁడు.

హరితోషణం=హరికి సంతోషకారణమైన యారాధన. సంసిద్ధిః అనఁగాఁ ప్రధానఫలము.

భక్తిహీనమైన ధర్మము కేవల శ్రమ మని చెప్పెను. కనుక భక్తిప్రధానమైన ధర్మమే అనుష్ఠేయ మనుచున్నాఁడు. ఏకేన=ఏకాగ్ర మైన మనస్సుచేత.

భక్తిహీనధర్మము శ్రమ మాత్రమని చక్కగా ప్రపంచితమైనది. ఇప్పుడు భక్తికి ముక్తిఫలకత్వమును సాధించుచున్నాఁడు.

యదనుధ్యాసినా = ఎవనియొక్క యనుధ్యాన మనెడు-అను ధ్యానమనఁగా తైలధారవలె నవిచ్ఛిన్నమని తాత్పర్యము. అట్టి యను ధ్యానమే, అసిః=ఖడ్గము. దానిచేత యుక్తులు, అప్రమత్తులు, కోవి దాః=వివేకులు. గ్రంథిం=అహంకార మనెడు ముడిని. నిబంధనం= గట్టిగా బిగించుచున్నదో అటువంటి కర్మ=కర్మను, ఛిందంతి=ఛేదించు చున్నారు. తాను కర్తగాదని కర్మము లొనర్చుటచేత, తత్పుణ్య పాపములు, భగవంతునకే చెందుచున్నవని భావము. తస్య కథా యాం రతిం=కోన కుర్యాత్ =అట్టి భగవంతుని కథలందు తీవ్రమైన యాసక్తి నెవ్వరైన నేల పూనరు? పూనుదు రని భావము.

నిజమే. హరికథారతి సమస్త కర్మలను నిర్మూలించును. కాని దానియందభిరుచి యేర్పడుటలేదు. ఏమిసేయవలెను? ఏర్పడుటకు మార్గమునే చెప్పుచున్నాఁడు. పుణ్యతీర్థ నిషేవణాదులతో పాపము నశించును. దానితో మహాపురుషులసేవ యేర్పడును. ఆ సేవాఫలమే వా రనుసరించు ధర్మమునందు శ్రద్ధ. అశ్రద్ధతో శ్రవణేచ్ఛ గలుగును; వినఁగా వినఁగాఁ బరమాత్మునికథలందు తీవ్రమైన యభిరుచి గల్గును. సత్పురుషుల సంగతి చాలగొప్పది. తులసీదాను సత్పురుషుల మాహా త్మ్యమును తన రామాయణమునందు బహుధా ప్రపంచించెను.

బిను సతసంగ బిబేక న హోయీ.

సత్పురుషుల సంగతితోనే వివేకలాభము. వారి దర్శన మెట్లగును?

**రామకృపా బిను సులభన సోయీ॥**

శ్రీరామచంద్రుని దయ లేనిదే వారు లభింపరు.

**సతసంగతి ముదమంగల మూలా**

**సోయిఫలసిధి సబ్ సాధనపూలా॥**

సత్పురుషుల సహవాస మనెడు మహావృక్షమునకు సంతోషము మంగళ మనునవే పాదులు. వారి సహవాసముతోఁ దా నొనర్చిన సాధనలే పుష్పములు. ఏర్పడెడు మోక్షమే ఫలము. ఒక్క తులసిదాసే కాదు. సత్పురుషులందరును సాధుసంగమును గొనియాడినవారే. ఆ విషయము లన్నిటినిఁ బై శ్లోకము సూత్రప్రాయముగా వచించినది.

విజయధ్వజము :

అవతారిక : ఇట్లు పరంపరగా నున్న యాత్మసాక్షాత్కారమునకును ఫలమును దెలిపి యుపసంహరించుచున్నాఁడు.

హే ద్విజశ్రేష్ఠాః ఓ ఉత్తమబ్రాహ్మణులారా! పుంభిః=అధికారులైన చేతనులచేత, వర్ణాశ్రమవిభాగశః=వర్ణములకు ఆశ్రమములకు భిన్నభిన్న రీతులతో శాస్త్రములందు విధింపఁబడిన పద్ధతుల ననుసరించి స్వనుష్ఠితస్య = జ్ఞాన పూర్వకముగా ననుష్ఠింపఁబడిన, సాంగమైన, ధర్మస్య=వేదవిహితకార్యములకు, అతః=భక్తినుండి పరమాత్ముని యపరోక్షత వఱకునున్న క్రియాపద్ధతిలో, హరితోషణం=శ్రీహరిప్రీతి, అనఁగా నతని ప్రసాదము, సంసిద్ధిః=ఫలము.

తాత్పర్యము : ధర్మము వర్ణములకు ఆశ్రమములకుఁ దగినట్లు భిన్నభిన్నముగా నున్నది. ఆ యా వర్ణములవారు ఆశ్రమములవారు తమ తమ ధర్మములను సాంగముగా ననుష్ఠింపవలెను. ఇట్లు లోపము

లేక యనుష్ఠింపఁబడిన ధర్మమునకు శ్రీహరిప్రీతియే ప్రధానమైన ఫలము.

కృష్ణుని కథాప్రశ్నయే పరమధర్మమని నిగమన మొనర్చుచున్నాఁడు.

తస్మాత్=కృష్ణుని గూర్చినకథా సంప్రశ్నమే పరమధార్మికమైన దానివలన, పుంభిః=అధికారులైన చేతనులచేత, సాత్వతాం పతిః=సాత్వతు లనఁబడు యాదవులకు పాలకుఁడైన, భగవాన్=షడ్గైశ్వర్యయుక్తుఁడైన శ్రీకృష్ణుఁడు, నిత్యదా=సర్వకాలముల యందును ఏకేన మనసా=ఏకాగ్రమైన మనస్సుచేత, శ్రోతవ్యః=శ్రవణమొనర్చుటకుఁ దగినవాఁడు. కీర్తితవ్యశ్చ=కీర్తించుట కర్హమైనవాఁడు, ధ్యేయః=ధ్యానింపఁ దగినవాఁడు, పూజ్యశ్చ=అర్చించుటకుఁ దగినవాఁడు. ఇక్కడ పూజ యనఁగా యజ్ఞాది సకల కర్మలచేత నని యర్థము. నిత్యదా=అనుటచేత, శ్రవణము మొదలైనకర్మలు. ఆ యా కాలములందుఁ జేయఁదగినవి. వ్యర్థముగాఁ గాలము గడుపరాదని చెప్పినట్లైనది.

తాత్పర్యము: కనుక, శ్రీకృష్ణ కథాప్రశ్నయే పరమమైన ధర్మము. పరమపూజ్యుఁడు యాదవపతియునైన కృష్ణునికథ నేకాగ్ర మనస్సుతో వినవలెను. దానినే నోటితోఁ బలుకుచుండవలెను. వాని గుణగణములనే ధ్యాన మొనర్పవలెను. యజ్ఞయాగాది కర్మములచేత వానినే పూజింపవలెను. ఇట్లు భగవత్కథా శ్రవణమందు కాలము గడుపవలెనే కాని, వ్యర్థముగా నెప్పుడును ప్రొద్దుపుచ్చరాదని తాత్పర్యము.

ఒక కార్యమున కొక ఫలమున్నదని తెలిసికొనియే దాని యందు మనుష్యుఁడు ప్రవృత్తుఁ డగును. కనుక శ్రవణాది కర్మములతో నేమిఫలమని ప్రశ్నించుచున్నాఁడు.

యదనుధ్యాయినః = ఏ పరమాత్మను నిరంతరము ధ్యాన మొనర్చుటే స్వభావముగాఁ గలవారు, యుక్తాః=1. మనస్సును పరమాత్మునియందు దాసక్తమగునట్లుగాఁ జేసికొనుటకు సామర్థ్యమున్న, 2. పరమాత్ముని యపరోక్షజ్ఞానమునుబొంది దానిచేత హరిప్రసాదము లభించినవారైన, కోవిదాః=అపరోక్షజ్ఞానులు, కర్మగ్రంథి నిబంధనం =కర్మలనెడు పాశములచేత నేర్పడునట్టి యతిశయమైన బంధనమును ఛిందంతి=పోవునట్లు చేసికొందురో, కర్మక్షయరూపమైన ముక్తిని బొందుదురని యర్థము, తస్య=అట్టిపరమాత్ముని యొక్క, కథారతిం =పరమోపకారియైన భగవంతుని కథలను వినుటయం దాసక్తిని, కః=ఎవఁడు, న కుర్యాత్ =చేయఁడు ?

కృతజ్ఞుఁడైన ప్రతియొక్కఁడును పరమాత్మకథల యందాసక్తి గల్గియుండునని భావము. దీనితో శ్రవణాదులు అపరోక్ష జ్ఞానమును గల్గించును. కనుక వానికి ముక్తియే ఫలమని తెలిపినట్లైనది. పరమాత్ముని ప్రసాదముచేత కర్మక్షయరూపమైన ముక్తిని బొందినవారు గూడ, శ్రీహరికిఁ గృతజ్ఞులై యుందురు. దానితో వారు సదా పరమాత్ముని కథలను వినుట మొదలైన కర్మలయం దాసక్తులైయుందురనియే తెలియవలెను.

పై శ్లోకమందు ఇతర వ్యాఖ్యాత లందఱును 'యదనుధ్యాసినా' యనియే వ్యాఖ్యానించిరి. వీరు 'యదనుధ్యాయినః' అను పాఠమును స్వీకరించినారు. పూర్వవ్యాఖ్యాతల యభిప్రాయములో కర్మ 'గ్రంథినిబంధనం' అని పాఠము. అహంకార మను గ్రంథిని ఛేదించునట్టి కర్మ యని వారి భావము. మధ్వవ్యాఖ్య కర్మగ్రంథి నిబంధనం అనుదానిని ఒక్కటే సమాసముగ నన్వయించినది ద్వికర్మము లనెడు పాశములతో నేర్పడిన బలిష్ఠమైన బంధనము. పూర. శ్లోకమందుఁ గూడ 'నిత్యశః' అని ఇతరుల పాఠము. నిత్యదా అని వీరి పాఠము.

హరికథాశ్రవణమం దాసక్తి దేనిచే నేర్పడుచున్నది? ఆ విష యమునే తెలుపుచున్నాఁడు.

హే విప్రాః=పరమాత్మునియందే ఆసక్తులైన యో బ్రహ్మజ్ఞానులారా! శుశ్రూషోః=1. గురువు మొదలైనవారిని సేవించుటయే స్వభావముగా నున్న, 2. భగవంతుని స్వరూపమును విని తెలిసికొనవలె ననెడు కోర్కిగల్గిన, శ్రద్దధానస్య=వేదాది గ్రంథములందు శ్రద్ధ నేర్పఱచికొన్న అనఁగా నాస్తిక్యబుద్ధిగల ముముక్షువులైన జీవునికి, పుణ్యతీర్థ నిషేవణాత్ =1. పవిత్రములైన గంగాది తీర్థములను భక్తితో సేవించుటచేత, 2. భాగవతాది సచ్ఛాస్త్రములను శ్రద్ధతో పఠించుటవలన, మహత్సేవయా=1. తనకన్న నుత్తములైన జీవులను పరమభక్తితో సేవించుటచేత, 2. జీవోత్తముఁడైన వాయుదేవుని సదా సేవించుటవలన, వాసుదేవ కథారతిః=మోక్షప్రదుఁడైన భగవంతుని కథలను వినుట మొదలైన కార్యములందు శ్రద్ధ, స్యాత్=అగును. గంగాది తీర్థస్నానాదులతో, మహాత్ములను సేవింపవలె నను బుద్ధి యేర్పడును. వారిసేవతో వేదాదులందు ప్రామాణ్యబుద్ధి గల్గును. ఆస్తిక్యము సిద్ధించును. దానితో పరమాత్ముని స్వరూపమెట్టిదో తెలిసికొనవలెననియు, దానిని పెద్దలచేత వినవలెననియుఁ దీవ్రాకాంక్ష జనించును. వెంటనే వారు భగవత్కథాశ్రవణమం దాసక్తు లగుదురు.

కొందఱు మనస్సును బరమాత్ముని యందే లీనముగు నట్లొనర్తురు. అట్టి సామర్థ్యము వారికుండును. పరమాత్ముని గుణగణములనే ధ్యానించెడు స్వభావము వారిది. వీరే యోగులు, అపరోక్షజ్ఞానులు. వీరు కర్మము లనెడు పాశములను ఛేదించికొందురు. అటుపై వారు కర్మబద్ధులుగా లెక్కింపఁబడరు. ఇట్లు పరమాత్ముఁడు జీవుల ననాది కర్మపాశములనుండి వదలించువాఁడు, నిర్వ్యాజబంధువు. కనుక, యోగులు గూడ వానికి కృతజ్ఞులై వాని కథాశ్రవణ మొనర్చుట యందే యాసక్తు లగుదురు. వారే కాదు. ముక్తియోగ్యుఁడైన

స్వామి సత్పురుషులకు సత్ఫలము లొసఁగు మిత్త్రుఁడు. శ్రవణ కీర్తనములయందు తత్పరులైన వారియొక్క పుణ్యములను వర్ధింపఁ జేయువాఁడు. అట్టి శ్రీకృష్ణుఁడు తనకథలను వినువారి మనస్సుల నుండి వారి దుర్వాసనలను నశింపఁజేయును. కథాశ్రవణ మొనర్పని వారి హృదయములందుఁ గృష్ణపరమాత్మ లేఁడా? ఉన్నాఁడు. కాని కథాశ్రవణాదులతో వాఁ డుద్దీపితుఁ డైనప్పుడు శుశ్రూషువుల పాపములు నశింపఁజేయునని తాత్పర్యము. కాష్ఠాదులందు సహజముగా నగ్ని యున్నది. కాని, యా కాష్ఠమును దహించుటలేదు. మథనాదులతోఁ బ్రజ్వలింపఁ జేసినచో దహించును గదా! 18

**నిత్యం=నిరంతరమును, భాగవత సేవయా=భాగవతుల సేవచేతను, భాగవతమును జదివించుటచేత, అభద్రేషు=అమంగళములు, నష్టప్రాయేషు=చాల మట్టుకు నశించినవి కాఁగా, ఉత్తమశ్లోకే=ఉత్తమకీర్తిగల, భగవతి=భగవంతుని యందు, నైష్ఠికీ=విఘ్నాదులచేత ప్రతిహతము గాని, భక్తిః=పరమానురాగము, భవతి=ఏర్పడుచున్నది.**

నిత్యమును భాగవతుల సేవించుటచేతను, భాగవతశ్రవణ పారాయణాదులచేతను, హృదయమందలి మలినవాసనలు నష్టప్రాయము లగును. హృదయకల్మషము నశింపఁజేయునట్టి పవిత్ర కీర్తిగల వాసుదేవునియందు విఘ్నప్రతిహతముగాని భక్తి యేర్పడును. జ్ఞాన మనుభవమునకు వచ్చునప్పు డమంగళములు నశించును. శ్రవణాదులతో నవి పూర్తిగాఁ బరాస్తము లగుచున్నవి. కామాదులు నశించు కొలఁదియు భక్తి దృఢ మగుచుఁ బోవును. దానితో జ్ఞాన మేర్పడును. జ్ఞానముతో నానందానుభవము. 19

**తదా=అప్పుడు, రజస్తమోభావాః=రజస్తమో గుణములు వాని భావము లైన, యే కామలోభాదయశ్చ=ఏ కామలోభాదు లున్నవో అవియును, (నశ్యంతి=నశించును) ఏతైః=వీనిచేత. అనావిద్ధం=స్పృశింపఁబడని, సత్త్వే=సత్త్వగుణమందు, స్థితం=నిలువఁద్రొక్కికొన్న, చేతః=మనస్సు, ప్రసీదతి=శాంతి నొందుచున్నది.**

అవిఘ్నప్రతిహతమైన భక్తి ఏర్పడినప్పుడు రజస్తమస్సులును వీనితో నేర్పడు నమంగళములైన కామ లోభాది వికారములును నశించును. అట్టి దోషములు నశించినపుడు సత్త్వగుణమందు మనస్సు స్థిరముగా నిలుచును. దానికున్న చాంచల్యాది గుణములు తొలఁగి పోవును. నివాతదీపమువలె మనస్సు నిశ్చల మగును. ఇదే మనస్సు యొక్క ప్రసాదము. 20

**ఏవం = ఇట్లు, భగవద్భక్తియోగతః = భగవంతుని యందలి తీవ్రమైన భక్తియోగము హేతువుగా, ప్రసన్నమనసః = ప్రసన్నమైన మనస్సున్న, ముక్త సంగస్య = సర్వవిధములైన సంగములను వదలుకొన్నవానికి, భగవత్తత్త్వ విజ్ఞానం = భగవంతుని పరమార్థతత్త్వమును గుఱించిన జ్ఞానము, జాయతే = కలుగును.**

భగవంతుని నిరంతరభజనతో మనఃప్రసాద మేర్పడునంటిమి. అప్పుడు వానికి సమస్తములైన సంగములును నిస్సారములై తోఁచును. వాఁడు సర్వవిధసంగరహితుఁడు. అట్టివానికి భగవంతుని సత్యస్వరూపమును గుఱించిన జ్ఞానము జనించును. 21

**శ్రీధరీయము :** 'పుణ్యే శ్రవణకీర్తనే యస్యాసః పుణ్యశ్రవణ కీర్తనః' పుణ్యములైన శ్రవణకీర్తనలు గలవాఁడు బహువ్రీహి. సుహృత్ హితకారి, హృది యాన్యభద్రాణి వాసనాః = హృదయమందున్న అమంగళములైన వాసనలను, అంతస్థః = హృదయస్థితుఁడై విధునోతి = నశింపఁజేయును.

నష్టప్రాయేషు = ఇక్కడ ప్రాయగ్రహణ మెందుకు? సర్వామంగళముల యొక్క నాశము జ్ఞానోత్తరకాలమందే. అనఁగా జ్ఞానోత్పత్తి తరువాతనే అమంగళములు మూలమట్టుముగ నశించుచున్నవని భావము. భాగవతసేవయా = భాగవతము, భాగవతులు వీరిసేవచేత, నైష్ఠిక = నిశ్చలమైనది. అనఁగా నప్పుడు విక్షేపము లేవియునుండవని

యర్థము. 'నిత్యం భాగవతసేవయా' అనుచోట ఛందస్సులో నొక యక్షర మెక్కువైనది. ఆర్షమని దానిని సవరించి కొనవలెను. లేక, 'సద్భాగవతసేవయా యని దిద్దికొనవచ్చును.' కాని, భాగవతము సర్వరీతుల వేదసమ్మితము. శ్రీధరుని దిద్దుబాటు లేకుండుటయే మంచిది.

అనావిద్ధం=అనభిభూతమని యర్థము.

'ప్రసన్నమనసః అత ఏవ ముక్తసంగస్య'. ప్రసన్నుఁడైన దానివలననే ముక్తసంగుఁడని యర్థము. రెంటికిని, కార్యకారణ భావము వివక్షితము.

**వంశీధరుఁడు:**

అంతస్థః=కథాశ్రవణముచే భావనాపదవినిఁ బొందినవాఁడు.

నష్టప్రాయేషు=నామాపరాధలక్షణములైన యభద్రములలోఁ గొంత ప్రబలమైన భాగము నశించును. అప్పుడు పరమాత్మునియందు రతి యేర్పడునని భావము.

రజస్తమోభావాః=రజస్తమోభ్యాం భావః ఉత్పత్తిః యేషాంతే= చిత్తవిక్షేప లయాదయః-రజస్తమోగుణములతో నేర్పడు చిత్తవిక్షేపల యాదులు. ఆదిశబ్దముచేత క్రోధమోహమాత్సర్యములు. అనావిద్ధం= అవికృతమైనదై; యిట్టి మనస్సునకు విషయములపైన రుచి యేర్పడును. శ్రవణకీర్తనాదులందు స్వాదుత్వ మాభాసించును. పూర్వదశ యందు తీక్ష్ణశరాయితములైన కామలోభాదులతో హృదయ మావిద్ధ మైనది. అట్టిమనస్సు ప్రసాదము నెట్లుపొందును? వ్యాధిచే జర్జరితుఁడైన వాని కన్నాదులు రుచింపవు గదా! అందుకే సత్త్వే ప్రసీదతి= శుద్ధసత్త్వ మూర్తియైన భగవంతునందు, స్థితం=ఆసక్తమైన దగును. భగవంతునే గట్టిగానమ్మి వాని పాదములను భజించునని భావము. అప్పుడు భగవంతునందు పరమప్రేమరూపమైన భక్తియోగమేర్పడును.

భగవత్త్వమైన స్వరూపగుణ లీలా ఐశ్వర్యమాధుర్యాదు లనుభవమునకు వచ్చును.

**వీరరాఘవ వ్యాఖ్య:**

సతాంసుహృత్ = సుహృత్ = అనునది హేతుగర్భమైనది. మంగళకరమైన హృదయము గలవాఁడు గనుకనే పాపములను నశింపఁ జేయునని వ్యాఖ్య.

**వల్లభాచార్య వ్యాఖ్య:**

స్వకథాః=వానికి సంబంధించిన కథలు. ఈకథ లనేకములు. వినునప్పు డొక్కొక్క టొక్కొక్కరీతిగ భాసించును. అందుచే వినుటలో నాసక్తి యేర్పడును. ఇట్లనేక భావావిష్టములైన కథలుగల వాఁడు కృష్ణమూర్తియొక్కఁడే. అందుకే 'కృష్ణః' అని చెప్పఁబడినది. భక్తియోగ విధానమునకే యవతారము. శ్రవణకీర్తనాదుల చేతనే సంచితములైన సమస్తపాపములును నశించును. వానికి వేరు సాధన మక్కరలేదని భావము. ఇట్టిశ్రవణకీర్తనములు గలవాఁడు గనుకనే పుణ్యశ్రవణ కీర్తనుఁడైనాఁడు. శ్రోతృవక్తృదోషముల కిట తావులేదు. శ్రవణకీర్తనములను వాఁడెప్పు డారంభించునో అప్పుడే సకల పాప నివృత్తియైనది. తూర్పుదిశ యెఱ్ఱనైనంతనే చీఁకటులు పరువెత్త నారంభించును గదా! కామాదులు ధుతములైన వేగాని పూర్తిగా నాశన మందలేదు. అక్కడక్కడ వానిస్వరూపము గనపడుచునే యుండును. రూపము మారునంతే. శ్రవణమందాగ్రహము, శ్రవణప్రతిబంధముతో క్రోధము శ్రవణసంబంధమందు లోభము. ఈ స్థితిని చెప్పుటకే ప్రాయో గ్రహణము. కాని యివి నిజమునకు ప్రతిబంధకములు గావు. నిత్యమును భగవత్కథాశ్రవణ మొనర్చుచున్నచో వాని స్వరూపము మారును. భగవంతునియందలి పరమప్రేమయే పూర్వము చెప్పిన యాకారములు ధరించుచున్నది. ఉత్తమశ్లోకః=ఉత్తమమైన శ్లోకము

అనఁగా గీర్తి, యెవనికిఁగలదో వాఁ డుత్తమశ్లోకుఁడు. స్థితం సత్త్వే ప్రసీదతి=చిత్తముయొక్క స్వరూపమే నశించుచున్నది. చిత్తమనఁగాఁ త్రిగుణాత్మకమే గదా! సత్త్వగుణము మెల్లఁగా రజస్తమస్సులకు దారి తీయును. మరల యథాప్రకారము. కొంతకాలము మిశ్రస్వభావము. తర్వాత రజస్తమస్సుల విజృంభణము. వీని యన్నిఁటికిఁ బ్రతీకార మొక్కటే. నిరంతరోత్పన్నమైన భక్తి. భగవత్తత్త్వవిజ్ఞానం=మనస్సు సత్త్వాత్మకమైనప్పుడు 'సత్త్వా త్సంజాయతే జ్ఞానం' అనునట్లు సర్వ వస్తువులను గూర్చిన తత్త్వజ్ఞాన మేర్పడును. భగవత్స్వరూపజ్ఞానము గాదు. అందుకే 'భగవద్భక్తి యోగతః' అనుచున్నాఁడు. అంతః కరణ ప్రసాదము భక్తికొఱకే. భక్తితోనే భగవద్జ్ఞాన మేర్పడును. 'భక్త్యా మా మభిజానాతి' అని గీత.

విజయధ్వజము:

ఇట్లు, పరమాత్మునికథలు వినుటయం దాసక్తియేర్పడిన పిదప నింకను గథాశ్రవణ మొనర్చుటచే నగు ప్రయోజనమును దెల్పు చున్నాఁడు.

సతాం=ముక్తియోగ్యులైన జీవులకు, సుహృత్=నిర్హేతుక బంధువైన, పుణ్యశ్రవణకీర్తనః=పవిత్రమైన, పవిత్రులనొనర్చు శ్రవణ కీర్తనములుగల, (అనఁగా నెవనికథాశ్రవణాదులతో జనులు పవిత్రు లగుదురో యని యర్థము) కృష్ణః=సర్వుల పాపములను కర్షణ మొనర్చి తనవైపునకు లాగికొను శ్రీహరి, స్వ కథాం=తన కథను, శృణ్వతాం=ఆసక్తితో విను వారియొక్క, హృది=హృదయమందు అంతస్థస్సన్=లో నున్నవాఁడై-హృదయమందుఁ బ్రకాశించుచున్న వాఁడై, అభద్రాణి= 1. పాపములను, 2. పరమాత్మభిన్నమైన యితరాలోచనలను, విధునోతి=నశింపఁజేయుచున్నాఁడు, హి=ఈ విషయము ప్రసిద్ధము గదా!

అవతారిక : అమంగళకరములైన సమస్తాలోచనలు నశించుట వలనఁ గలుగు ఫలమును దెలుపుచున్నాఁడు. అభద్రేషు—1. పాపములు 2. భగవదితరములైన యాలోచనలు, నష్టప్రాయేషు సత్సు—నష్ట ప్రాయములు కాఁగా, లింగశరీరమునందు నంతవఱకును నమంగళము లుండుటకు సంభవ మున్నది. అందుకే ప్రాయశ్చిత్తము సంపూర్ణ ముగా నాశన మగుట జ్ఞానానంతరమే. అందుకే నష్టమైన వానివలె నుండుననుట. నిత్యం—నిరంతరమును, భాగవతసేవయా—1. భగవ ద్భక్తులసేవవలన, 2. భగవంతునికి సంబంధించిన గుణములను ధ్యానించుటచేత, ఉత్తమశ్లోకే భగవతి—ఏ దోషమును లేని కీర్తిగల పరమాత్మునియందు, నైష్ఠికీ—స్థిరమైన, భక్తిః భవతి—భక్తి యేర్పడును. తీర్థయాత్రాది ధర్మములు భక్తి జనకములు. అందుచే పరమధర్మములు. యాత్రాదులతో మహాత్ములసేవ లభించును. ఆ రూపమున, నవి భక్తికిఁ గారణము లగునని వివరించిన ట్లైనది.

భక్తియొక్క ఫలమును జెప్పుచున్నాఁడు. తదా—శ్రీహరియందు నిశ్చలభక్తి యేర్పడినప్పుడు, యే రజస్తమోభావాః—రజస్తమో జనిత ములైన యే, కామలోభాదయః—అసద్విషయకములైన అరిషడ్వర్గము లున్నవో, ఏతైః—వానిచేత, అనావిద్ధం—ఆక్రమింపఁబడని, చేతః— మనస్సు, సత్త్వే—బలజ్ఞానాదుల సమాహారమైన శ్రీహరియందు, స్థితం సత్—ఆసక్తమైనదై, అనఁగా శ్రీహరినే ధ్యానించుచున్నదై, ప్రసీదతి—నిరంతరమును శ్రీహరిని స్మరించుటయందు సమర్థమగును. ఇట్లు చెప్పుటచేత భక్తితో వైరాగ్యము దానితో శ్రవణాదిరూపమైన జిజ్ఞాస యేర్పడునని ముందుచెప్పిన విషయమునే మరలఁ జెప్పినట్లైనది.

అవతారిక: నిరంతరమును పరమాత్మను స్మరించుట యొక్క ఫలమును వివరించుచున్నాఁడు. ఏవం—ఇట్లు, భక్తితో భగవంతుని నిరంతరమును స్మరించుచు, భగవద్భక్తియోగతః—పరమాత్మునియందే భక్తితో నాసక్తుఁడైన దానివలన, ముక్తసంగస్య—సర్వసంగరహితుఁడైన

ప్రసన్న మనసః=ఎప్పుడును భగవద్విషయకమైన స్మరణ మొదలగు జిజ్ఞాసగల జీవునకు, భగవత్తత్త్వవిజ్ఞానం=భగవంతుఁడనెడు తత్త్వము యొక్క విశిష్టమైన జ్ఞానము-అనఁగా నా యా ముక్తియోగ్య జీవునకు యోగ్యమైన వారివారి బింబాపరోక్షజ్ఞానము, జాయతే=కలుగును.

ఈ శ్లోకములలో నంతకుముందు వివరించిన సాధనముల నన్నిటిని, మరల నొకసారి యనువాద మొనర్చి బింబాపరోక్షజ్ఞానమే విజ్ఞానమని తెలిపిరని గ్రహింపవలెను.

తాత్పర్యము: భగవత్కథాశ్రవణమునం దాసక్తి జనించిన తర్వాత యోగ్యజీవులు శ్రీహరిమాహాత్మ్యమును వినుచునేయుందురు. కృష్ణకథ-కీర్తన-ఇవి, తాము పవిత్ర మగుట మాత్రమే గాదు. తత్కథా శ్రవణకీర్తనపరులను గూడఁ బవిత్రులనుగా నొనర్చును. భగవంతుఁడు సజ్జనులకు నిష్కారణబంధువు. తన కథలు వినువారి మనస్సులందు వాఁడు స్థిరముగాఁ బ్రకాశించి అట్టివారి సమస్త పాపములను నాశన మొనర్చును. జీవుల లింగదేహ మున్నంతవఱకును నశుభసంభవము దీఱదు. కాని శ్రవణాదులతోఁ బాపములు చాలవఱకు నశించి నష్ట ప్రాయము లగును. ఇట్లు దురిత నాశనానంతరము, నిరంతర భాగ వత సేవచేత భగవత్సంబంధి కర్మాచరణచేత, భగవంతునందు నిశ్చల భక్తియేర్పడును. తీర్థయాత్రాది ధర్మకార్యములు సత్పురుష సేవకుఁ గారణములై భగవద్భక్తిని గల్గించును. పరమాత్మయం దిట్టి నిశ్చల భక్తి యేర్పడిన తర్వాత రజస్తమస్సులచేఁ గలుగుఁ గామలోభాదు లంట నేరవు. దుర్భావసంసక్తి వదలిన సజ్జనుల మనస్సు బలజ్ఞానాది సమా హారమై సత్త్వమను పేరుగల శ్రీహరియం దాసక్తమగును. వానిని దప్పమఱి యే విషయము నాలోచింపదు. అప్పుడది నిరంతర శ్రీహరి స్మరణ సమర్థ మగును. ఈ స్థితియే యపరోక్షజ్ఞానమునకు హేతువైన భక్తి. ఇట్టివాఁడు విషయాసక్తుఁడు గానేరఁడు. వైరాగ్యశాలి; ఇట్లు శ్రీహరినే భక్తితో నిరంతరము స్మరించెడు ప్రసన్నమతియైన జీవునకు

వానివాని యోగ్యతకుఁ దగిన బింబభూతుఁడైన పరమాత్ముని యప రోక్ష జ్ఞాన మేర్పడును. పైనిఁ జెప్పిన సాధనములు లేనివానికి శ్రీహరి తన యపరోక్షము ననుగ్రహింపఁడు. ఇదే బింబాపరోక్షము.

భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్యకర్మాణి దృష్ట ఏవాత్మనీశ్వరే. 21

హృదయగ్రంథిః=హృదయ మనెడుగ్రంథి, భిద్యతే=భేదింపఁబడుచున్నది, సర్వసంశయాః=సమస్తసంశయములు, ఛిద్యంతే=ఛేదింపఁబడుచున్నవి, ఆత్మని=ఆత్మయైన, ఈశ్వరే=ఈశ్వరుఁడు, దృష్టే ఏవ=చూడఁబడినంతనే, అస్య=వీని యొక్క, కర్మాణి=కర్మములు, క్షీయంతే=నశించుచున్నవి.

అవ: భగవత్తత్త్వవిజ్ఞాన మనఁగానేమి? దానితో నేర్పడు ఫల మేమి? ఈ విషయములనే వివరించుచున్నాఁడు.

సర్వేశ్వరుఁడైన భగవంతుఁడే యాత్మ. ఈ ప్రత్యేక జ్ఞానమే ఈ యపరోక్షానుభూతియే తత్త్వ జ్ఞానము. ఈ జ్ఞాన మెప్పుడుండునో అప్పుడు 'నేను' అని తోఁచుచుండెడి భావనారూపమైన యహంకారము. అదే హృదయగ్రంథి. అది నశించును. దేహముతో సంబంధము లేని వేరొక చైతన్య మున్నదా? ఉన్నచో నే ననెడు పదార్థము ఈ దేహమా? లేక తద్భిన్నమా? ఈ విధమైన యసంభావన విపరీత భావన లనెడు దోషరూపములైన సంశయము లన్నియు నశించును. దీనితోఁ దమతమ ఫలముల నొసఁగుటకు సంసిద్ధమైయున్న కర్మ ములు (సంచిత కర్మములు) నశించును. ఇట్టి యవస్థకే మోక్షమని పేరు.

శ్రీధరస్వామి భావార్థదీపిక:

హృదయగ్రంథిః = హృదయమేవ గ్రంథిః-హృదయ మను నదే ముడియని తాత్పర్యము. చిజ్జడగ్రథనరూపమైన యహంకారము;

సర్వసంశయాః=అసంభావనా విపరీత జ్ఞానాది సర్వవిధములైన సంశయములు, కర్మాణి=అనారబ్ధఫలములైన కర్మములు ఆత్మస్వరూపుఁడైన ఈశ్వరుఁడు, దృష్టే ఏవ=ఇచ్చటి ఏవ కారముతో-జ్ఞానానంతరమే యివన్నియు నేర్పడుచున్నవని భావము.

వంశీధరుఁడు :

శ్రీధరుఁడు 'ఆత్మన్' శబ్దమును ఈశ్వరునకు విశేషముగా వాఁడెను. ఆత్మని=మనస్సునందు, ఈశ్వరేదృష్టే అని యన్వయము. మనస్సునం దీశ్వరుఁడు గన్పించినంతనే ఈ ఫల మేర్పడుచున్నది. ఇఁకఁ బ్రత్యక్షముగ సాక్షాత్కరించినపు డేమని చెప్పవచ్చును? ఇట్లనుటతో స్ఫూర్తి సాక్షాత్కారములు రెండును జెప్పఁబడినట్లైనది.

సతాం కృపా మహత్సేవా శ్రద్ధా గురుపదాశ్రయః,
భజనేషు స్పృహా భక్తిః అనర్థాపగమ స్తతః.
నిష్ఠా రుచి రథాసక్తిః రతిః ప్రేమా౽థదర్శనమ్,
హరే ర్మాధుర్యానుభవః ఇత్యర్థాస్స్యుః చతుర్దశ.

(విశ్వనాథుఁడు)

పై దానిలో దర్శనము గూడ నున్నది. దర్శనానంతరమే మాధుర్యానుభవము. ఇవన్నియు భక్తునకు సాధనములు. దర్శనమైనప్పుడు సాధకుఁడు పరమానంద స్వరూపుఁడే యగును. అప్పుడు ఫలరూపమైన సాక్షాత్కార మానుషంగిక ఫలమే. శ్రవణ మననాదులతో సర్వసంశయనివృత్తి. శ్రవణముతో జ్ఞేయగతమైన సంభావన భేదింపఁబడుచున్నది. మననముతో తద్గతవిపరీతభావనానాశము, సాక్షాత్కారముతో నాత్మయోగ్యతాగతములైన యసంభావన, విపరీత భావనలు నశించును. క్షీయంతే=భగవదిచ్ఛామాత్రము చేతనే యనారబ్ధఫలములైన కర్మలు నశించునని తాత్పర్యము.

**వీరరాఘవవ్యాఖ్య :**

సర్వసంశయాః = అన్యథాజ్ఞాన, విపరీతజ్ఞాన, అజ్ఞానాదులు. హృదయగ్రంథిః = హృదయమును ముడివలె చుట్టుకొన్న అహం, మమతా, జ్ఞానములు సమూలముగా నశించుచున్నవి.

**విజయధ్వజము;**

స్వబింబాపరోక్ష జ్ఞానమనెడు విజ్ఞానఫలమును చెప్పుచున్నాఁడు.

ఆత్మని = హృదయ కమలముయొక్క కర్ణికా మధ్యమందు, ఈశ్వరే=తనబింబమైన సర్వేశ్వరుఁడు, దృష్ట ఏవ=కనులకుఁ గన్పడి నంతనే విలంబములేక యని భావము. హృదయగ్రంథిః = జడ మనస్సు పొందియున్న లింగదేహము, భిద్యతే=నిర్వీర్యమగుచున్నది. ఇట్లు లింగదేహము నిర్వీర్యమైనపుడు, సర్వసంశయాః = ఈశ్వరుఁడు మొదలైన సర్వతత్త్వములకును సంబంధించిన సందేహములు, ఛిద్యంతే=ఛేదింపఁ బడుచున్నవి. ఏ సందేహములు నుండవని భావము. అస్య = ఈ యపరోక్షజ్ఞానియొక్క, కర్మాణి = ప్రారబ్ధములను వదలి తక్కిన పూర్వజన్మకృతములైన సమస్త పాపకర్మములు, అనభీష్టము లైన పుణ్యములును, ముందు చేయఁబోవు పాపములు-అనభీష్టము లైన పుణ్యములును, క్షీయంతే చ=నశించిపోవుచున్నవి.

తాత్పర్యము : హృదయకమలముయొక్క కర్ణికామధ్యమందు తన బింబమైన శ్రీహరిని జీవుఁడు చూచినంత నేమగును? అవిలంబ ముగా జడమనస్సుతోఁ గూడిన లింగదేహ మనెడు గ్రంథికిఁ దనకార్య మొనర్చుటకు సామర్థ్యము దొలఁగును. అది నిర్వీర్య మగును. నిర్వీర్య మైనపుడు పరమాత్ముఁడు మొదలైన తత్త్వములయందున్న సంశయ ములు తమకుఁ దామే పరిహృతము లగును. అంతమాత్రమే గాదు. ఆ యపరోక్షజ్ఞాని ముందుచేసిన పాపములును ననిష్టములైన పుణ్యము లును సర్వమును నాశ మగును. అట్లే చేయఁబోవు పాపకర్మములు,

పుణ్యములు వాని నంటికొనవు. కాని ప్రారబ్ధము మాత్రము మంటిపెట్టి కొనియేయుండును. ఇదెప్పుడు నశించును? లింగశరీరము భంగమైనప్పుడు. అప్పుడే దుఃఖము నిశ్శేషముగా బోవును. తృప్తిని గల్గించు సుఖము అనుభవమునకు వచ్చును ఇదే మోక్షము. ఇదే పరమపురుషార్థము.

ఈ సందర్భములో మనము బింబాపరోక్ష మను మాటను వాడుకొంటిమి. బింబాపరోక్ష మనగా నేమి?

ద్వైతప్రక్రియలో సృష్టి మూడు రీతులు. అందుకే ప్రథమ శ్లోకములో 'త్రిసర్గః' అన్నా డందురు. జీవేశ్వర జడముల సృష్టి యని యర్థము. 'ఏకస్య తేజసో బహుత్వవ దీశ్వర సర్గః'-ఒకతేజము బహుధా భాసించినట్లు ఈశ్వరసర్గము బ్రహ్మరుద్రాదు లనుట. వారి నిమిత్త ప్రతిబింబవత్ జీవసర్గః'. జీవసర్గము నీటియందు ప్రతిబింబించిన సూర్యుని ఛాయవంటిది 'మృదో ఘటాదివత్' 'అవ్యక్తాజ్జడ సర్గః'. మట్టినుండి కుండవలె, అవ్యక్తమునుండి జడసర్గ మేర్పడును. ఇక్కడ బింబాపరోక్ష మనగా ప్రతిబింబభూతుడైన జీవుడు బింబభూతుడైన ఈశ్వరుని దర్శించుట.

పోతన్నగారు :

అని యిట్లు దేవతాగురు నమస్కారంబు సేసి యిట్లనియె. మునీంద్రులారా! నన్ను మీరలు నిఖిలలోక మంగళంబయిన ప్రయోజనం బడిగితిరి. ఏమిటం గృష్ణసంప్రశ్నంబు సేయంబడు, నెవ్విధంబున నాత్మప్రసన్నం బగు, నిర్విఘ్నయు నహైతుకయు నైన హరిభక్తి ఏ రూపంబునం గలుగు నది పురుషులకుం బరమధర్మం బగు; వాసుదేవుని యందుం బ్రయోగింపంబడిన భక్తియోగంబు వైరాగ్య విజ్ఞానంబులం బుట్టించు. నారాయణకథల నెయ్యే ధర్మంబులు, దగులువడవవి నిరర్థకంబులు. అపవర్గ పర్యంతంబయిన ఈ పరమధర్మంబునకు

దృష్టశ్రుతప్రపంచార్థంబు ఫలంబు గాదు ధర్మంబునం దవ్యభిచారియైన యర్థంబునకుఁ గామంబు ఫలంబు గాదు విషయభోగంబైన కామం బున కింద్రియప్రీతి ఫలంబు గాదు. ఎంత తడవు జీవించు నంతియ కామంబునకు ఫలంబు. తత్త్వజిజ్ఞాసగల జీవునకుఁ గర్మంబుచేత నెయ్యది సుప్రసిద్ధంబది నిరర్థకంబు. తత్త్వజిజ్ఞాస యనునది ధర్మ జిజ్ఞాస యగుటఁ గొందఱు ధర్మంబే తత్త్వం బని పలుకుదురు. తత్త్వ విదులు జ్ఞానంబను పేర నద్వయంబైన యది తత్త్వం బని యెఱుం గుదురు ఆ తత్త్వంబు నౌపనిషదులచేత బ్రహ్మ మనియు, హైరణ్య గర్భులచేతఁ బరమాత్మ యనియు, సాత్వతులచేత భగవంతుఁ డని యును బలుకంబడు వేదాంతశ్రవణంబున గ్రహింపంబడి జ్ఞాన వైరా గ్యముల తోడం గూడిన భక్తిచేతఁ దత్పరులైన పెద్దలు క్షేత్రజ్ఞులైన యాత్మయందు బరమాత్మం బొడగందురు. ధర్మంబునకు భక్తిఫలంబు. పురుషులు వర్ణాశ్రమ ధర్మభేదంబులం జేయు ధర్మంబునకు మాధ వుఁడు సంతోషించుటయె సిద్ధి. ఏకచిత్తంబున నిత్యంబును గోవిందు నాకర్ణింపను వర్ణింపనుం దగు చక్రాయుధారాధనం బను ఖడ్గంబున వివేకవంతు లహంకార నిబద్ధంబైన కర్మంబు ద్రుంచివైతురు. భగ వంతునియందలి శ్రద్ధయు నపవర్గదంబగు తత్కథాశ్రవణాదులయం దత్యంతాసక్తియుఁ బుణ్యతీర్థావగాహన మహత్సేవాదులచే సిద్ధించు. కర్మనిర్మూలన హేతువులైన కమలలోచను కథలం దెవ్వఁడు రతిసేయు, విన నిచ్ఛగించు వాని కితరంబు లెవ్వియు రుచిపుట్టింపనేరవు పుణ్య శ్రవణకీర్తనుండైన కృష్ణుఁడు దనకథలు వినువారి హృదయంబులందు నిలిచి, శుభంబు లాచరించు. అశుభంబులఁ బరిహరించు. అశుభం బులు నష్టంబులయిన భాగవతశాస్త్రసేవనా విశేషంబున నిశ్చలభక్తి యుదయించు. భక్తి గలుగ రజస్తమోగుణ ప్రభూతంబులైన కామ లోభాదులకు వశంబుగాక చిత్తంబు సత్త్వగుణంబునఁ బ్రసన్నం బగు. ప్రసన్నమనస్కుండైన ముక్తసంగుం డగు. ముక్తసంగుండైన నీశ్వర తత్త్వజ్ఞానంబు సిద్ధించు. ఈశ్వరుఁడు గానంబడినఁ జిజ్జడగ్రథన రూపం

బైన యహంకారంబు భిన్నంబగు; నహంకారంబు భిన్నంబైన నసంభావనాది రూపంబులగు సంశయంబులు విచ్ఛిన్నంబులగు. సంశయ విచ్ఛేదంబైన నవారబ్ధఫలంబులైన కర్మంబులు నిశ్శేషంబులై నశించుం గావున–

'అని యిట్లు దేవతాగురు నమస్కారంబు సేసి'–ఈ పాఠము సరిగాదని నా యూహ. మొట్టమొదట మూలకారుఁడును శుకబ్రహ్మ స్తుతియే యొనర్చెను. తెనుఁగుసేతగూడ నట్లే సాఁగినది. మొదటి శ్లోకముతో నాతని చరిత్రను వర్ణించుచు తన్మూలమున నాతని యైశ్వర్యమును స్ఫురింపఁజేసినాఁడు. తెనుఁగు గూడ నంతే. రెండవదానిలో శుకుని కృపాళుత్వము వర్ణింపఁబడినది. పోతన్నయు దానినే యనుకరించెను. తరువాత దేవతాస్తుతి రూపమైన 'నారాయణునకు నరునకు' అను రచన. కనుక మొదట నొనర్చినది గురునమస్కారమే. అందుకే శ్రీధరుఁడు 'గురుదేవతయో ర్నమస్కారః' అన్నాఁడు. 'నారాయణం నమస్కృత్య' అను శ్లోకమున కవతారికగా 'ఏవం ద్వాభ్యాం గురుం నమస్కృత్య దేవం ప్రణమతి' అని యారంభించినాఁడు. అందుచే, నీ వచనమందు 'దేవతాగురు నమస్కారంబుసేసి' అని యుండుటకు వీలులేదు. 'గురుదేవతా నమస్కారంబుసేసి' అని యుండవలెను. ఇది గద్యము. ఎవ్వరిదో లేఖకదోషమై యుండును. ఆధ్యాత్మికమార్గమందు ముఖ్యముగా భక్తిమార్గమందు గురువునకున్న గౌరవము మఱియెవ్వరికిని లేదు. భగవంతుఁడు గురువునకుఁ గ్రిందే. గురుదైవతములలో నెవ్వరిని విడుతువని యొకరు ప్రశ్నించినపుడు 'భగవంతునే వదలెదనని' కబీరు ప్రతివచనము. తులసీదాసు గురుమాహాత్మ్యమును చాల విపులముగ వర్ణించినాఁడు. నీ రిరువురేకాదు. భక్తిగ్రంథము లన్నియు గురువునకు మహాగౌరవము నొసఁగెను. సాధకుఁడై సాక్షాత్కారమందిన పోతన ఈ విషయమును విస్మరించి యుండు ననుటకు వీలులేదు. కొందఱు వ్యాఖ్యాతలు భాగవతసేవనమున కధిష్ఠానదైవము గురువు రెండు శుకుఁడే యన్నారు.

నిఖిలలోకమంగళంబు- 'లోకమంగళం' అనునది మూలము. లోకములకు సమస్త మంగళములను గలిగించునదని తాత్పర్యము. మంగళకరమని భావము. కాని, మంగళకరమనియే యభేదముగాఁ జెప్పినాఁడు. మును లడిగినది సర్వశాస్త్రోద్ధారరూపమైన ప్రశ్న. కృష్ణ సంప్రశ్నయే సకల శ్రుతిసారమని ఫలితాంశము. 'సంప్రశ్న 'శబ్దము మూలమున నున్నదే. చక్కగాఁ బ్రశ్నించుట యని యర్థము. అన్ని విషయములును సమగ్రముగాఁ దెలియువఱకు నడుగుట; దీనిచే నేర్పడున దేమి? ఆత్మయొక్క ప్రసాదము. ఇచ్చట నాత్మ యనఁగా మనస్సు. ప్రసన్న మగుట యనఁగా లయవిక్షేపాదులు లేక భగ వంతునందు స్థిరముగా నుండుట. నిర్విఘ్నయు.... పరమధర్మంబగు; ధర్మము రెండురీతులు. ప్రవృత్తిధర్మము నివృత్తిధర్మము. ప్రవృత్తి ధర్మము స్వర్గాదులనుగోరి చేయునది. నివృత్తిధర్మము శ్రవణాదరాది లక్షణమైన భక్తిని గలుగఁ జేయును. ఇదియే పరమధర్మము. ఇది ఐకాంతికమైన శ్రేయము.

నిర్విఘ్నయు - నిర్గతాః విఘ్నాః యస్యాస్సా=నిర్విఘ్నా. ఇది భక్తికి విశేషణము, అందుచే స్త్రీలింగము. విఘ్నముల వంటిదని భావము. అప్రతిహతా అని మూలము. విఘ్నైరనభిభూతా అని వ్యాఖ్య. కనుక నిర్విఘ్నయు నను శబ్దమునకు వ్యాఖ్య మూలము. నిర్హేతుక=నిర్గతో హేతుః యస్యాస్సా. ఇదియు భక్తికి విశేషణమే. బహువ్రీహి సమాసమగుటచే 'క' ప్రత్యయము వచ్చినది. హేతు వనఁగా నిచట ఫలము. ఫలానుసంధానము లేనిదనియు నర్థము. ఏ కోరికయు లేనిది. వాసుదేవుని .... .... పుట్టించు=భగవంతుని యందు సమర్పింపఁబడిన భక్తియోగము. జ్ఞానవైరాగ్యములను గల్గించునదని భావము. వాసుదేవశబ్దము మూలములోనిదే. ప్రయో జితః - అనుకర్మణ్యర్థమునకు 'ప్రయోగింపఁబడిన' అని తెనుఁగు. మూలమందలి 'ఆశు' శబ్దము తెనుఁగులోఁ బోయినది. శీఘ్రముగా

జ్ఞానవైరాగ్యములు గల్గించునని మూలకారుని భావము. సాధన సాగెడు కొలఁది క్రమక్రమముగా జ్ఞానవైరాగ్యము లేర్పడు ననియు పోతన్నగారి భావము.

తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి,
యజ్ఞేన దానేన తపసాఽ నాశకేన.

అని శ్రుతివాక్యము. వేద మేమని విధించుచున్నది? యజ్ఞ దానములచేతను, నిశ్చలమైన జ్ఞానము చేతను జ్ఞానప్రాప్తి యేర్పడు చున్నది. కనుక జ్ఞానమునకు ధర్మానష్ఠానము హేతువు. మఱి భక్తి హేతు వెట్లైనది? దీనికి సమాధానముగనే 'వాసుదేవునియందు .... .... అని వచన మారంభిప బడినది. ధర్మము జ్ఞానహేతువగుట భక్తిమూలముననే యని యభిప్రాయము. 'ఽహైతుకం' అని మూలముననే శబ్దమున్నది. 'శుష్కతర్కాద్యగోచర మౌపనిషద మిత్యర్థః' అని శ్రీధరుఁడు. ఇది యాంధ్రీకరణమందు లేదు. 'నారాయణకథల .... ...అవి నిరర్థకంబులు. వ్యతిరేకలక్షణతో నిరూపించుచున్నాఁడు. ఏ యే ధర్మానుష్ఠానములు శ్రీమన్నారాయణుని కథలయందు భక్తిని బుట్టింపవో ఆ ధర్మములు వ్యర్థములు. మూలమందు 'స్వనుష్ఠితః' అను పదమున్నది. చక్కఁగా నిర్వర్తింపఁబడినను అని యర్థము. ఈ పదమిందు లేదు. 'రతిం' అనునొకమాట గూడ మూలమందుగద్దు. ఈ పదము భక్తిపంథలో చాలచిత్రమై గంభీరమైనది. దీని నెందుకో పోతన్న వదలెను. 'అపవర్గపర్యంతంబైన .... ఇంద్రియప్రీతిఫలంబు గాదు'. కొందరిట్లు పూర్వపక్షింతురు. ధర్మమున కర్థము ఫలము. దానికి కామము ఫలము. కామమున కింద్రియప్రీతి. దానిని సంపాదించి కొనుటకు మరల ధర్మానుష్ఠానము. 'ధర్మాదర్థశ్చ కామశ్చ స కిమర్థం న సేవ్యతే'. అని వారిథంకా. దీనిని రెండు శ్లోకములతో మూలకారుఁడు ఖండించెను. 'అపవర్గస్య' అపవర్గ పర్యంతస్య అని శ్రీధరవ్యాఖ్య దానినే పోతన్నగారు అపవర్గపర్యంతంబైన' ధర్మంబు

అని తెనిఁగించినారు. ధర్మైకాంతస్య ధర్మాఽవ్యభిచారిణః అనివ్యాఖ్య. ధర్మంబునం దవ్యభిచారియైన యర్థమునకు అని తెనుఁగు. వ్యభిచరించు టనఁగా నిర్ణీతమైన మార్గమును వదలి యితర మార్గమందు చరించుట. అర్థమెప్పుడును ధర్మము నంటి పెట్టికొనియే యుండునన్న మాట. కామమున కింద్రియ ప్రీతిఫలము గాదని యర్థము. పిదప దార్థమిట్లుగా తెలియును. త్రివర్గఫలవాదుల యభిప్రాయములో స్వర్గము ధర్మమునకు ఫలము ముముక్షువులకుఁ గాదు. వారికపవర్గమే ఫలము. మోక్షపర్యంతము ధర్మమును వా రాచరింతురు. వారిదృష్టిలో స్వర్గము ధర్మము ననుసరించికొనియే యుండును. అర్థమునకు లోకు లనుకొన్నట్లు విషయోపభోగమైన యింద్రియ ప్రీతి ఫలము గాదు. ముముక్షువైనవాఁడు సుఖము లనుభవించును. ఎంతవఱకు? జీవితమును కొంతవఱ కనసరమో యంతవఱకు. ఈ కామమునకై మునుల ధర్మానుష్ఠానమందు వాఁడు దగుల్కొనఁడు. ఈ చక్రవత్పరివర్తనము త్రివర్గముల నాశించు వారికే. ముముక్షువునకుఁ బ్రధానమైన దృష్టి తత్త్వజిజ్ఞాసయందే. కొందఱు తత్త్వజిజ్ఞాసయే ధర్మజిజ్ఞాస యని పలుకుదురు. వారి సిద్ధాంతములో తత్త్వ మనఁగా ధర్మమే. తత్త్వవిదులట్లు భావింపరు. అద్వయమైన జ్ఞానమే వారిదృష్టిలో తత్త్వము. అద్వయమను మాటచేత క్షణికవిజ్ఞానవాదమును ఖండించుచున్నాఁడు. ఇది బౌద్ధులమతము. జ్ఞానము క్షణక్షణమును మారుచుండునని వారి సిద్ధాంతము. అద్వయమైన యీజ్ఞానమునే తత్త్వమును ఔపనిషదులు- అనఁగా నుపనిషత్తులందుఁ జెప్పఁబడిన మార్గము ననుసరించువారు దానిని బ్రహ్మమందురు. హిరణ్యగర్భు నుపాసించువారు 'పరమాత్మ' యని పిలుతురు. సాత్త్వతు లనఁగా భక్తులు భగవంతుఁడందురు. ఈ విషయమెందుకు వచ్చినది? 'ఔపనిషదులు బ్రహ్మమనిరి. హైరణ్యగర్భులు పరమాత్మయనిరి. సాత్వతులు భగవంతుఁడనిరి. 'మీకుఁ గూడ నేకవాక్యత లేదు గదా!' అని పూర్వపక్షము. దానికి సమాధానముగనే ఇది వచ్చినది మాటలలో భేదమేకాని వస్తు

భేదములేదని తాత్పర్యము. హైరణ్యగర్భులు హిరణ్యగర్భునుపాసించు వారు. 'వేదాంతశ్రవణంబున.... ....సంతోషించుటయ సిద్ధి.' 'శ్రుతి గృహీతయా' అనుదానికి తెలుఁగు. వేదాంతశ్రవణంబున గ్రహింపఁ బడి యనుట. గృహీతయా – గ్రహింపఁబడి యనుట. ఇట్టి శబ్ద ములచేతఁ బోతనామాత్యుఁడు మూలమును, వ్యాఖ్యానమును ఎంత చక్కగా ననుసరించుచున్నాడో వ్యక్తమగును. వ్యాఖ్యలోనూ 'వేదాం తాది శ్రవణేన గృహీతయా' అనియున్నది. 'జ్ఞాన వైరాగ్య యుక్తయా' జ్ఞానవైరాగ్యములతోఁ గూడిన భక్తిచేత. సమాసమును విశకలితముగ వాడునంతటి చొరవగూడఁ దీసికొనఁడు మహాత్ముఁడు. 'శ్రద్దధానాః' తత్పరులైన పెద్దలు. ఆత్మతత్త్వమందుఁ దీవ్రమైన యాసక్తిగలవారని తాత్పర్యము. క్షేత్రజ్ఞుఁడైన యాత్మయందు 'ఆత్మని చాత్మానం' అనిమూలము. 'ఆత్మని క్షేత్రజ్ఞే' అని శ్రీధరుఁడు. అదియే తెలుఁగులో వచ్చినది. వేదాంత శ్రవణజన్యమై జ్ఞానవైరాగ్యయుక్తమైన భక్తిచేత శ్రద్ధధానులైన ముముక్షువులు క్షేత్రజ్ఞుడైన జీవునియందు ఆత్మను పొడగందురని భావము. ధర్మమునకుఁ జక్రవత్పరివర్తనము ఫలము గాదని ప్రారంభించిన విషయమును ఉపసంహరించుచున్నాఁడు. ధర్మ మునకు భక్తియే ఫలము. వర్ణాశ్రమ భేదములతో ననుసరింపఁబడిన ధర్మమునకు హరితోషణమే ప్రధానఫలము. 'ఏకచిత్తంబున గోవిందు నాకర్ణింపను వర్ణింపను' – దీనికి మూలము 'ఏకచిత్తంబునన్' ఏకేన మనసా అనునది. నిత్యశః అనుశబ్దము నిత్యంబును అని యైనది. వ్యాసభగవానుఁడు 'శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ ధ్యేయః పూజ్యశ్చ నిత్యశః' అని నాల్గు చెప్పినాఁడు. పోతన్నగారు రెండే గ్రహించిరి. 'ధ్యేయః పూజ్యః' వదలినారు. ఆకర్ణన వర్ణనములతోనే ధ్యానమను గతమైయుండునని భావించిరేమో! 'పూజ్యః' భాగవత రచన నాటికి బాహ్యపూజలపై నాసక్తి వదలెనేమో! 'చక్రాయుధ ధ్యానమను .... సిద్ధించు' అనుధ్యా + అసినా, అనుధ్యాసినా అని మూలములో పద

విభాగము. నిరంతరధ్యానమనెడు ఖడ్గముచేత, యుక్తాః=అప్రమత్తాః వివేకినః' అనివ్యాఖ్య. పోతన్న రెండవ యర్థమునే గ్రహించినాఁడు. కర్మగ్రంథి నిబంధనం అని మూలమునందలి పదవిభాగము. అహంకార మనెడు గ్రంథిచేత కూడిన కర్మయని యర్థము. కర్మానుష్ఠానములో 'చేయువాఁడు చేయుట' యను భిన్నదృష్టియున్నది. నేను చేయుచున్నానను నహంకారము మొదటిది. దానిపిల్లలు మఱెన్నియో కనుక వివేకవంతుఁడైనవాఁడు భిన్నదృష్టి కాకరమైన యహంకారమును బెంచు కర్మజోలికిఁ బోఁడు. నిరంతరధ్యాన మనెడు ఖడ్గముచేత కర్మను భేదించును. భగవంతునియందలి శ్రద్ధ మోక్షమును గల్గించును. వాని కథలను వినుటయం దాసక్తి, మహాత్ముల సేవచేతను పుణ్యతీర్థావగాహనమునను లభించును. 'కర్మనిర్మూలనం .... .... రుచి పుట్టింపనేరవు' ఇదియొకరీతిగా పోతన్నగారి సొంతము. వాసుదేవ కథారతిః అనుసూత్రమున కిది విస్తృతి. ఇక్కడి 'రతి' శబ్దము, పోతన్నదృష్టిని దప్పించికొనలేదు. భగవంతుని కథలను వినుటయందు శ్రద్ధగలవానికి మఱి యితరములయం దాసక్తి యుండదని భావము. 'పుణ్యశ్రవణకీర్తనుండైన.... ....నిశ్చలభక్తి యుదయించు' 'పుణ్యశ్రవణకీర్తనః' దానికిఁ దెనుఁగు పుణ్యశ్రవణ కీర్తనుఁడు. అభద్రాణి విధునోతి' అశుభంబులు నిరసించు, శుభంబు లాచరించు అనునది పోతన్నసొంతము. పుణ్యాకరములైన శ్రవణకీర్తనములుగల కృష్ణుఁడు శ్రవణాసక్తులైన పురుషుల మనస్సులందు నిలిచి కథాశ్రవణమునకు విఘ్నకరములైన యశుభములు పరిహరించును. అంతమాత్రమే గాదు, కథాశ్రవణానుకూలములైన శుభములను గూడ గల్గించును. 'నిత్యం భాగవతసేవయా' దీనికి శ్రీధరుఁడు 'భాగవతానాం భాగవతశాస్త్రస్య వా సేవనం' అని రెండు రీతుల నర్థముఁ జెప్పెను. రెండవదానినే పోతన్న యాదరించినాఁడు. దాని ఫలమే 'భాగవత శాస్త్రసేవా విశేషంబున' అనునది. భాగవతమునకు శాస్త్రగౌరవ మెట్లో ముందే చెప్పినాము. భాగవతశాస్త్ర పఠన శ్రవణాదులే యప

వర్గముచు గల్గి చునని వల్లభుల మతము. దానినిగూడ ముందే విస్తరించితిమి. నిశ్చలభక్తి-విక్షేపములులేని భక్తి యని యర్థము. నైష్ఠికీ అని మూలము. దానికి శ్రీధరియ మది. 'భక్తిగలుగ........నశించుగావున' 'రజస్తమోభావాః' అని మూలము. రజస్తమస్సులు వాని నుండి ప్రభవించు కామాదులైన భావములు. ఈ యర్థమును పోతన్న స్పష్టముగ వివరించినాడు. 'సత్త్వే ప్రసీదతి' సత్త్వగుణంబున ప్రసన్నం బగు. నిశ్చలభక్తి ఏర్పడినప్పుడు రజస్తమస్సుల ప్రేరణముచేఁ గలిగెడి కామాదుల నశించును. అప్పుడు మనస్సు సత్త్వగుణమందు స్థిరమై విక్షేపాదులు లేక యుండును. ముక్తసంగుఁడు=వదలఁబడిన సంగములు గలవాఁడు. విషయసుఖముల సంగమును వదలిన వాఁడని భావము. అట్టివానికి ఈశ్వరతత్త్వజ్ఞానము. ఈశ్వరుఁ డెట్టి వాఁడు? వాని క్రియ లెట్టివి? అనువానిని గూర్చిన జ్ఞానమేర్పడును ఈశ్వరుఁడు గానంబడినన్, అనఁగా క్షేత్రజ్ఞుఁడైన జీవునియందు ఈశ్వరుఁడు సాక్షాత్కరించినపుడు చిజ్జడగ్రథనరూపమైన యహంకారము నశించును. సర్వసంశయాః-అసంభావనాది రూపములైన 'నేను తగుదునా? ఇది నిజమేనా' ఇత్యాదులన్నియును తొలఁగిపోవునన్నమాట. ఆ సంశయములు విచ్ఛేదములైన ననారబ్ధఫలములైన కర్మలు నశించును. అనఁగా ప్రారబ్ధము నశింపదన్నమాట దాని ననుభవించి తీర వలసినదే. 'ప్రారబ్ధం భోగతో నశ్యేత్'- పరమభక్తుఁడైనవాఁడు ముక్తసంగుఁ డగును. అనఁగా కర్మను జేసికొనక సాధనతో సంచితమును దొలఁగించికొనుచు ప్రారబ్ధమును దృప్తిగా ననుభవించును. పై వాక్యములకుఁ బోతన్న కార్యకారణభావమును నిర్దేశించినాఁడు. సత్త్వగుణముతో మనస్సు ప్రసన్నమగుచున్నది. అట్టివాఁడే విక్షేపాదుల కగుపడక ముక్తసంగుఁ డగును. అప్పుడే ఈశ్వరతత్త్వజ్ఞానము సిద్ధించును. క్షేత్రజ్ఞునియందు భగవంతుఁడు సాక్షాత్కరించినపుడు హృదయగ్రంథిరూపమైన యహంకారము దొలఁగును. తదనంతరము

సర్వసంశయములకును విచ్ఛిత్తి అప్పుడు కర్మములు నశించును. ఏవి? అనారబ్ధములు. ప్రారబ్ధము లట్లే యుండును

> అతో వై కవయో నిత్యం భక్తిం పరమయా ముదా,
> వాసుదేవే భగవతి కుర్వం త్యాత్మప్రసాదనీమ్. 22

**అతః—ఈ కారణముచేత, కవయః—వివేకవంతులు, నిత్యం—ఎప్పుడును, భగవతి వాసుదేవే—షడ్గుణైశ్వర్య సంపన్నుఁడైన వాసుదేవునియందు. పరమయా—సర్వోత్తమమైన, ముదా—సంతోషముతో, ఆత్మప్రసాదనీం—మనఃప్రసాదమును గల్గించునట్టి, భక్తిం—భక్తిని, కుర్వంతి—చేయుదురు.**

శ్రీహరిభక్తితో జ్ఞానప్రాప్తి, దానితో మోక్షము సిద్ధించును. కనుక హరికథా ప్రసంగము సదాచారముగాఁ బరిణమించినది. ఈ విషయమును స్పష్టపఱచి ప్రసంగమును ముగించుచున్నాఁడు.

పై వివరించిన విధమునబట్టి దీర్ఘదర్శులైన విద్వాంసులు పరమసంతోషముతో నిత్యమును భగవంతుఁడైన వాసుదేవుని నిండు ప్రేమతో భజింతురు. తనకుఁ దానే స్వయముగా జ్ఞానస్వరూపుఁడై ఎవఁడు ప్రకాశించునో వాఁడే వాసుదేవుఁడు వానియందు మనస్సును స్థిరముగా నిలుపుటయే భక్తి. వసించువాఁడు గనుక వాసువు. ప్రకాశించువాఁడు గనుక దేవుఁడు.

విజయధ్వజము:

అతః—దుఃఖము సంపూర్తిగా నశించి తృప్తి ఏర్పడెను. సుఖానుభవరూపమైన మోక్షమనెడు పురుషార్థము చిక్కుటచేత కవయః—బ్రహ్మాదులైన జ్ఞానులు-ముక్తులు-అముక్తులు గూడ, పరమయా—అతిశయమైన, ముదా—సంతోషముచేత, ఆత్మప్రసాదనిం—1 మనోనైర్మల్యము నేర్పఱచు, 2. విష్ణుప్రసాదము గల్గించెడు, భక్తిం—ప్రేమప్రవాహమును, వాసుదేవే—సర్వత్ర వసించు, ప్రకాశమానుఁడై

వెలుఁగుచున్న, భగవతి= అవ్యాహత సమస్తైశ్వర్యపూర్ణుఁడైన పరమాత్మునియందు, నిత్యం= ఎల్లవేళలను, కుర్వంతి= చేయుచున్నారు.

ఈ శ్లోక మందున్న 'వై' అను అవ్యయము-ముక్తులు, అముక్తులు ఈ రెండు తెగలవారును శ్రీహరియందు భక్తి సేయుదురని సూచించుచున్నది.

తాత్పర్యము : ఇట్టి మోక్షము పరమగుటచే బ్రహ్మాదులు ముక్తులైన జీవులుగూడ శ్రీహరిని భజింతురు. ఎందుకు? అది మనస్సును నిర్మల మొనర్చును. శ్రీహరి యనుగ్రహమును గల్గించును. ధారావాహికమైన ప్రేమప్రవాహమునకే భక్తి యనిపేరు. ఎవనియందు భక్తి సేయుదురు? సర్వత్ర వ్యాపించియున్న వాసుదేవునందు నిరంతరము ప్రకాశించుచుండెడి భగవంతునందు. వాఁడు సమస్తైశ్వర్య పూర్ణుఁడు. అన్యదేవతలను వారు భజింపరు. కారణమేమి? వారు సర్వోత్తములు గారు. ఇట్లు ముక్తులు నముక్తులు గూడఁ బరమాత్మ యెడ భక్తి సేయుదురు.

పోతన్నగారు :

గురుమతులు తపసు లంతః
కరణంబులు శుద్ధిసేయ ఘనతరభక్తిన్
హరియందు సమర్పింతురు
పరమానందమున భిన్నభవబంధనులై.

అర్థములు : గురుమతులు = తపసు లనుదానికి విశేషణము. గురు= గొప్పదైన, మతి= బుద్ధిగలవారు. తద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి అంతఃకరణము = మనస్సు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు మొదలైనవి. ఘనతరభక్తిన్= కర్మధారయము. గొప్పదైన భక్తిని అని యర్థము. సమర్పింతురు= అతని కర్పణముగాఁ జేయుదురు. పరమానందమునన్ = గొప్ప యానందముచేత, కర్మధారయము. విశేషణ

విశేష్యములకు కర్మధారయము వచ్చును; భవ=సంసారముయొక్క బంధనము, సంసారమునందుఁ దగుల్కొనియుండుట. భిన్న=పోఁ గొట్టఁబడిన, పోఁగొట్టుకొనఁబడిన సంసారబంధము గలవారై అని యర్థము.

తాత్పర్యము : గొప్పమనస్సు గలిగిన మహర్షులు అంతఃకరణ మును శుద్ధిచేయునట్టి ధారావాహికమైన భక్తిని, సంసారసంసక్తిని వదలి హరియందు సమర్పింతురు. అట్టి భక్తియే వారికి పరమానంద మును గలిగించును. కవయః అనుదాని పొడిగింపే 'గురుమతులు, తపసు' లనునది, 'పరమయా ముదా' అనుదానికి తెలుఁగు పరమా నందమునన్; భిన్నభవబంధనులై అనునది పోతన్నగారు చేర్చినచేర్పు. 'వాసుదేవే భగవతి' అను మూలమును 'హరి' యను మాటతో నమాత్యుఁడు చెప్పెను. 'కుర్వంతి' అను దానిని 'సమర్పింతురు' అని మార్చినాఁడు. చాల మంచిపదము. 'ఘనతరభక్తి' యతికొఱకు వచ్చినదే. ఇక్కడ 'తర' ప్రత్యయమునకంటె 'తమ' ప్రత్యయ ముండి యుండునని నా యూహ. ఆత్మప్రసాదనీం 'మనశ్శోధనీం' అని శ్రీధరుని వ్యాఖ్య. అంతఃకరణంబులు అని పోతన్న మార్చెను. శ్రీధరునివలె మనస్సు మాత్రమేనని యాతని భావమైనచో 'అంతః కరణ' మనియే వ్రాసియుండును. కనుక అంతః అనుదానితో మన స్సును కరణములతో జ్ఞానేంద్రియ కర్మేంద్రియములును గ్రహింప వలసియుండును.

> సత్త్వం రజస్తమ ఇతి ప్రకృతేర్గుణాస్తై
> ర్యుక్తః పరః పురుష ఏక ఇహాస్యధత్తే,
> స్థిత్యాదయే హరివిరించి హరేతి సంజ్ఞాః
> శ్రేయాంసి తత్ర ఖలు సత్త్వతనో ర్నృణాం స్యుః. 23

ప్రకృతేః=ప్రకృతియొక్క, సత్త్వం రజః తమః ఇతి గుణాః=సత్త్వ రజస్తమస్సు లనెడు గుణములు, తైః=వానిచేత, యుక్తః=కూడుకొన్నవాఁడై,

ఏకః = ఒక్కడేయైన, పరః పురుషః = పరమపురుషుడు, అస్య = ఈ జగత్తు యొక్క, స్థిత్యాదయే = స్థితి మొదలైన వానికొఱకై, హరి విరించి హరాః ఇతి = విష్ణువు బ్రహ్మ ఈశ్వరుఁ డనెడు, సంజ్ఞాః = సంజ్ఞలను, ధత్తే = ధరించుచున్నాఁడు. తత్ర = వారిలో, సత్త్వ తనోః = సత్త్వమూర్తియైన శ్రీమహావిష్ణువు నుండి, నృణాం = మనుష్యులకు, శ్రేయాంసి = సమస్తములైన సుఖములు, స్యుః ఖలు = కలుగుచున్నవి గదా!

అవ: శ్రీహరియే భజింపఁదగినవాఁ డను సిద్ధాంతమెందుకు? దానికిఁ గారణమును దెలుపుచున్నాఁడు. ఒక్కడేయైన పరమపురుషుఁడు ప్రకృతిగుణములైన సత్త్వము, రజస్సు, తమస్సు అనెడు ఈ గుణములను తనపై వేసికొనును. ఏల? ఈ జగత్తుయొక్క పరిపాలనము, సృష్టి, సంహారము అనెడు కార్యములను నిర్వహించుటకొఱకు. విష్ణువు, బ్రహ్మ, శివుడు అనెడు మూఁడు పేరులను భిన్నమూర్తులను ధరించును. వీరిలో సత్త్వమూర్తియైన శ్రీమహావిష్ణువును సేవించు వారికి సమస్తశుభములు నిశ్చయముగా సమకూరును. నాశరహితమైన పదవి నొసఁగుటకు సమర్థుడు శ్రీహరి యొక్కఁడే అందుచేత నాతఁడే భజింపఁదగినవాఁడు.

పరః పురుషః = సర్వోత్తముఁడైన పురుషుడు. అందుకే యాతనికి పరమపురుషుఁ డని పేరు. స్థిత్యాదయే = సృష్టి స్థితి ప్రళయముల కొఱకు, తద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి. హరి విరించి హరేతిసంజ్ఞాః = వ్యాకరణ శాస్త్రప్రకారము ఇక్కడ సంధిరాదు. అర్షమగుటచేత సంధి వచ్చినది. సత్త్వతనోః = సత్త్వస్వరూపుఁడైన వాసుదేవుని నుండియే, స్యుః = ఏర్పడుచున్నవి.

విజయధ్వజము:

అవ: పైఁ జెప్పిన శ్రవణభక్తి మొదలగు వానితో మోక్షము సిద్ధించుచున్నది. ఈ మోక్ష మిచ్చుట కధికారి యెవఁడు? సాత్త్విక ప్రకృతియున్న శ్రీమహావిష్ణువే ఈ విషయమును జెప్పుటకు సత్త్వము మొదలైన గుణములను వాని కాశ్రయములను జెప్పుచున్నాఁడు.

పురుషః=షడ్గుణైశ్వర్యవంతుఁడైన శ్రీహరి, ప్రకృతేః పరో౽పి=అప్రాకృతమైన విగ్రహము గలవాఁడైనను, సత్త్వం రజస్తమ ఇతి=సత్త్వరజస్తమములనెడు, యే ప్రకృతే ర్గుణాః=జడప్రకృతియొక్క స్వరూపభూతములు, చిత్ప్రకృతియైన రమాదేవిచేత నభిమన్యమానములునైన ఏ గుణములు గలవో, వానిని. అవి ఎట్టివి? శ్రీహరి జగత్తును సృష్టించుటందు ఉపాదాన కారణములైనవి; అట్టి ఏ గుణములు గలవో, తైః=ఆ గుణములచేత, యుక్తః=కూడికొన్నవాఁడై. తాను ప్రాకృతగుణరహితుఁడైనను, ఆ గుణములకుఁ బ్రవర్తకుఁడై, అస్య=ఈ జగత్తుయొక్క, స్థిత్యాదయే=పాలన పోషణ సంహారము మున్నగు కార్యములఁ జేయుటకు, ఇహ=ఈ జగత్తునందు, ఏకఏవ=తా నొక్కఁడే యై యుండి, హరివిరించి హరేతి సంజ్ఞాః=బ్రహ్మ, విష్ణు మహేశ్వరులను పేరులచేత (పేరులను), ధత్తే=అవతరించును (పొందును). ఈ గుణములలో శ్రీహరి సత్త్వగుణ సంబంధము లేనివాఁడైనను, ఆ గుణమును బ్రవర్తింపఁజేయుటచేత, జగత్తును పాలించువాఁడను పేరు గలవాఁడై ఇంకొక్క యధిష్ఠానమం దుండక వేరుగనే విష్ణువనెడు తన రూపమును బొందియుండును. చతుర్ముఖబ్రహ్మయందున్న బ్రహ్మనామకుఁడైన శ్రీహరి రజోగుణసంబంధము లేనివాఁడైనను ఆ గుణమునే యుపాదానముగా జగత్తును సృష్టించును. శివునియం దుండెడి శివనామకుఁడైన విష్ణువు తమోగుణసంబంధరహితుఁడు. కాని తమోగుణప్రవర్తకుఁడై జగత్తును సంహరించును. ఇట్లీ మూఁడు గుణములును విష్ణువునే యాశ్రయించియుండును. ఐనను తత్ర=గుణాత్మకమైన ఈ జగత్తుననుండు, నృణాం=(మధ్యే)సాత్త్వికరాజస తామస శరీరులైన మనుష్యదేహముగల జీవులమధ్యలో, సత్త్వతనోః=సాత్త్వికశరీరియైన, ముక్తియోగ్యతా స్వరూపియైన జీవరాశియందే, శ్రేయాంసి=జ్ఞాన, భక్తి వైరాగ్యములు మొదలైన మోక్షసాధనరూపశ్రేయస్సులు, స్యుః ఖలు=అగును. రాజసశరీరులైన మిశ్రజీవ

రానులందును, తామసశరీరులైన యసురులందును శ్రేయములు గలుగవు. సత్త్వతనోః అనుటకు బదులుగా సత్త్వతనో అని పీఠిపాఠము.

విశేషార్థములు: హరివిరించి హర-అను నేకవచన ప్రయోగముతో ప్రమాణసిద్ధమైన విశేషార్థమును సూచించుచున్నాఁడు.

> బ్రహ్మ విష్ణ్వీశరూపాణి త్రీణి విష్ణోర్మహాత్మనః
> బ్రహ్మణి బ్రహ్మరూపస్థః శివరూపీ శివేస్థితః
> పృథగేవ స్థితో విష్ణుః విష్ణురూపీ జనార్దనః. (వామనపురాణము)

అర్థము: విష్ణువునకు బ్రహ్మ-విష్ణువు-శివుఁ డను మూఁడు రూపములు. బ్రహ్మరూపియైన విష్ణువు బ్రహ్మయందును, శివరూపి విష్ణువు శివునందును నుండును. విష్ణురూపి తనకే యధిష్ఠానమును వేఱుగా లేక తనకుఁ దానై యుండును. ఇట్లు శ్రీహరి విశేషరూప సన్నిధాన ముండుటచేతనే బ్రహ్మ శివుల కా సంజ్ఞలు వచ్చినవని తెలియవలెను. ఖలు అనుటలో 'సత్త్వగుణ ముత్తమ మగుటచే' అనుకారణము సూచింపఁబడినది. కొందఱు సత్త్వాది ప్రకృతిగుణములతోఁ గూడిన పరమపురుషుఁడు, హరి విరించి హరు లను సంజ్ఞలను జగత్తుయొక్క సృష్టి స్థితి లయములకై బొందెనందురు. వారిలో సత్త్వశరీరియైన విష్ణువువలననే శ్రేయస్సులు గలుగునని వ్యాఖ్యానించినారు. ఈ యర్థము 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ', 'సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ' అనెడు శ్రుతులకు 'గుణాస్సర్వేపి వేత్తవ్యాః' 'ధ్యాతవ్యాశ్చన సంశయః' 'ఆనందాదయః ప్రధానస్య' మొదలైన స్మృతులకు విరుద్ధము.

తాత్పర్యము: శ్రీహరి కేవల మప్రాకృత శరీరుఁడు, అనఁగా త్రిగుణముల ప్రభావములకుఁ జిక్కనివాఁడు. ఈ సత్త్వ రజ స్తమస్సులకుఁ గ్రమముగా శ్రీ భూ దుర్గా రూపమైన రమాదేవియే యభిమాన దేవత. ఈ గుణములే జగత్తుగాఁ బరిణమించెను. కనుక, జగత్తున కవి

యుపాదానకారణములు. వీనికిఁ బ్రవర్తకుఁడైన శ్రీహరి జగత్తుయొక్క సృష్టి స్థితి సంహారములకై బ్రహ్మ విష్ణు మహేశ్వరులను నామములను ధరించెను. బ్రహ్మనామకుఁడైన విష్ణువు బ్రహ్మయందుండి సృష్టి కార్యము నొనర్చును. శివునియం దీశ్వర నామకుఁడై లయము నొనర్చును. విష్ణురూపముతో దానే పాలించును. ఇట్టి మూఁడు గుణ ములును విష్ణువునే యాశ్రయించినవి. త్రిగుణాత్మకమైన జగత్తు నందున్న జీవులమధ్యలో సాత్త్వికశరీరులైన జీవరాసులుండును. వారే ముక్తియోగ్యులు, వారికి దేవతాస్వభావముండును, అట్టివారికి మోక్ష సాధనములైన జ్ఞానభక్తి వైరాగ్యాది శ్రేయస్సులు గలుగును. రాజస శరీరులు మిశ్రజీవులు, తామసశరీరులు దైత్యులు. వీరి కా శ్రేయస్సు సిద్ధింపదు. మూఁడును ప్రాకృతగుణములే యైనను సత్త్వగుణమే శ్రేయఃకారణము, సాత్త్వికజీవియే యుత్తమమైన బ్రహ్మవిద్యకధికారి.

పార్థివా ద్దారుణో ధూమ స్తస్మాదగ్ని స్త్రయీమయః,
తమసస్తు రజ స్తస్మా త్సత్త్వం యద్బ్రహ్మదర్శనమ్. 26

**పార్థివాత్**=పృథివీవికారమైన, **దారుణః**=కాష్ఠమునకంటెను, **ధూమః**=పొగయు, **తస్మాత్**=దానికంటె, **త్రయీమయః**=వేదోక్తకర్మహేతుకమైన, **అగ్నిః**=వహ్నియు నుత్తమము, **తమసస్తు**=తమోగుణమునకంటెను, **రజః**=రజస్సును, **తస్మాత్**=దానికంటె, **యద్బ్రహ్మదర్శనం**=దేనినుండి బ్రహ్మదర్శన మేర్పడునో, అట్టి **సత్త్వం**=సత్త్వగుణము (శ్రేష్ఠమైనది).

పృథివీవికారమైన కాష్ఠములు రెంటి నొకదానిపై నొకటి రాచినచో అగ్నిలక్షణమైన పొగ జనించును. తర్వాత దానినుండి యగ్ని ప్రాదుర్భవించును. అగ్ని గలిగినప్పుడు దానినుండి వేదోక్త మైన యజ్ఞాదికర్మల నొనర్పవచ్చును. పొగ బయటికి వచ్చినపుడు అగ్ని గల్గునను సంభావన మేర్పడును. యాగాదికర్మలు నిర్వహింప వచ్చునను భావము గల్గును. కేవల ధూమమేయైనచో యాగప్రసక్తి

లేదు. అట్లే తమోగుణమందు బ్రహ్మప్రకాశసంగమే శూన్యము రజోగుణమందు దాయన కొద్దిగా నుండును. రజోగుణపూరితుని శ్రద్ధ కర్మ పైన. ఆ స్థితిలో కొద్దిగా బ్రహ్మప్రకాశ మేర్పడునని భావము. సత్త్వగుణము బ్రహ్మమును బూర్తిగాఁ బ్రకాశింపఁజేయును. అందుచే బ్రహ్మానందానుభవము సత్త్వమూర్తియైన విష్ణువును భజించు వారికే గల్గునని పిండితార్థము.

**శ్రీధరీయము :**

అవ: ఉపాధివైశిష్ట్యముతో ఫలవైశిష్ట్యమును దృష్టాంతపూర్వకముగా వివరించుచున్నాఁడు.

పార్థివాత్ = పృథివీవికారమైన కాష్ఠము, స్వతః ప్రవృత్తి= ప్రకాశరహితమైనది. దానికంటె, ధూమః=ఇది ప్రవృత్తి స్వభావము గలది కర్మ ప్రచురమైనది, త్రయీమయః = అగ్ని త్రయీమయ మెట్లైనది? సాక్షాత్కారసాధనమైన దానివలన. ఇట్లు లయాత్మకమైన తమస్సునకంటెను రజోగుణము, దానికంటెను సత్త్వగుణము శ్రేష్ఠములని భావము. బ్రహ్మదర్శనం=బ్రహ్మప్రకాశ మైనది. 'తు' శబ్దము చేత లయాత్మకమైన తమస్సునకంటె రజస్సు శ్రేష్ఠమన్నట్లైనది. ఎట్లు? రజోగుణము సోపాధికమైన జ్ఞానమునకు హేతువు. అందు చేత కించిద్బ్రహ్మదర్శన ప్రత్యాసక్తి. సర్వథా తత్ప్రకాశకత్వము రజోగుణమునకు లేదు. ఎందుకు? విక్షేపములు గలది గనుక. సత్త్వగుణము సాక్షాద్బ్రహ్మదర్శనము, అనఁగా బ్రహ్మప్రకాశకము. ఇట్లే యేతద్గుణము లుపాధిగాగల బ్రహ్మాదులందును యథోత్తరము వైశిష్ట్యమని భావము.

**విజయధ్వజము :**

అవ: మూఁడుగుణములును ప్రాకృతికములే. మరి సత్త్వగుణ మెట్లు శ్రేయస్కారణమైనది? ఇది యాశంక. ఉత్తములగుటచే సాత్త్వి

కులకే బ్రహ్మవిద్యయం దధికారమని స్థాపించుటకు మూఁడుగుణము లందును, సత్త్వగుణమునకే ప్రాధాన్యమని సోదాహరణముగఁ జెప్పు చున్నాఁడు. 'యథా–తథా–ఉత్తమః' ఈ మూఁడు పదములను అధ్యాహార మొనర్చి కొనవలెను.

అర్థము: యథా=ఎట్లు, పార్థివాత్ = 1. ప్రథివీకార్యమైన, 2. పృథివీలోకసంబంధమైన, దారుణః = 1. వృక్షమునకంటెను, 2. కాష్ఠమునకంటెను, ధూమః=1. పృథివీకార్యమైనపొగ 2. మేఘము, ఉత్తమః = లోకోపకారకమైన మేఘముగా మారుటచేత నుత్తమమో, తస్మాత్ =మేఘరూపి పొగకంటెను, త్రయీమయః=1. వేద ప్రతిపాదితమైన, 2. వేదప్రతిపాద్యులైన యింద్రాది దేవతలఁ జూపించు సామర్థ్యముగల, సకల పదార్థప్రకాశకమైన, అగ్నిః=సంస్కృతమైన యగ్ని యుత్తమమో, తథా=అట్లు, తమసః=అధోగతికి సాధనమైన ప్రాకృత తమోగుణమునకంటెను, రజః=రజస్సు, ఉత్తమం=స్వర్గాది సాధనకర్మ జనకమగుటచే, నుత్తమము, తస్మాత్ =ఆ రజోగుణమునకంటెను, సత్త్వం=సకల దేవతాతత్త్వ ప్రకాశకమైన సత్త్వగుణము, ఉత్తమం= శ్రేష్ఠము, యత్ =ఎందువలన, (ఆ సత్త్వగుణము) బ్రహ్మదర్శనం=1. బ్రహ్మజ్ఞానము లభింపఁజేయునో, 2. వేదార్థమైన పరబ్రహ్మను జూచునట్లొనర్చునో(ఆ కారణముతో నుత్తమమని యర్థము).

విశేషార్థము: రజస్తు ఇచ్చట 'తు' శబ్దముతో రజోగుణముత్తమ మనుటకు హేతువుగా ఫలవిశేషమును సూచించుచున్నాఁడు. అగ్నియెట్లు వేదార్థప్రకాశకమగుటచే దారుధూమములకంటె శ్రేష్ఠమో అట్లే వేదార్థప్రకాశకమైన సత్త్వగుణము రజస్తమస్సుల కంటె శ్రేష్ఠమని భావము. దీనితో సాత్త్వికజీవులే బ్రహ్మజ్ఞానాధికారులని సిద్ధమైనది. జీవులు మూఁడు రీతులు–మోక్షప్రాప్తియోగ్యులు, నరకప్రాప్తియోగ్యులు, తమఃప్రాప్తియోగ్యులు. ఈ విషయముగూడఁ జెప్పినట్లైనది.

భేజిరే మునయో౾థాగ్రే భగవంత మధోక్షజమ్,
సత్త్వం విశుద్ధం క్షేమాయ కల్పంతే యే౾నుతానిహ. 25

అథ=అందువలన, అగ్రే=ఆదికాలమందు, మునయః=మునులు, భగవంతం=మహిమగలవాఁడును, విశుద్ధం సత్త్వం=పరిశుద్ధమైన సత్త్వగుణముచే నిండిన వాఁడునైన, అధోక్షజం=శ్రీమహావిష్ణువును, భేజిరే=భజించిరి, ఇహ=ఈ లోకమందు, యే=ఎవరు, తాన్ అను=వారి ననుసరించి వర్తింతురో, తే=వారు, క్షేమాయ కల్పంతే=క్షేమమున కగుచున్నారు, క్షేమమును బొందుచున్నారని భావము.

అవ: విష్ణువే సేవింపఁ దగినవాఁడు. దీని కుపబలముగా సదాచారమునుగూడఁ దెల్పుచున్నాఁడు. ఆదికాలము నుండియును మహర్షులు శ్రీమహావిష్ణువునే భజించిరి. అతఁడు సత్త్వగుణ స్వరూపుఁడు, భగవంతుఁడు. ఆ మహర్షి మార్గము ననుసరించువారు క్షేమములను బొందుదురు.

శ్రీధరీయము:

అధః కృతం అక్షజం జ్ఞానం యస్మాత్తం అధోక్షజం=ఇంద్రియ జన్య జ్ఞానముచేత నెప్పటికిని దెలిసికొనుట కసాధ్యమైనవాఁడు.

విజయధ్వజము:

సత్త్వగుణమే శ్రేయస్సాధన మనుటకు శిష్టాచారమును జూపుచున్నాఁడు.

అథ=సాత్త్వికులే యుత్తమాధికారు లగుటచేత, అగ్రే=ముందు, మునయః=1. జ్ఞానులైన బ్రహ్మాదులు, 2. సాత్త్వికస్వభావులైన జీవులు, అధోక్షజం=ఇంద్రియగోచరుఁడు గాని పరమాత్మను, భేజిరే=1. సేవించిరి, 2. ప్రత్యక్షీకరించి కొనిరి. అందుచేత, ఇహ=ఈ మూఁడు గుణములలో, విశుద్ధం సత్త్వం=రజస్తమో గుణములతోఁ దిరోహితముగాని సత్త్వగుణమే, క్షేమాయ=మోక్షమునకు, కల్పతే=

సమర్థమగుచున్నది, ఇతరౌ = తక్కిన రజస్తమములు, న కల్పేతే = మోక్షసమర్థములు గావు. 'కల్పంతే యేను తానిహ' అని శ్రీధరుల పాఠము. 'కల్పేతే నేతరావిహ' అని వీరి పాఠము.

తాత్పర్యము: సాత్త్వికస్వభావులైన బ్రహ్మాదిజ్ఞానులు ఇంద్రియాతీతుఁడైన శ్రీహరినే సేవించిరి. వారే యుత్తమాధికారులు. కనుక ప్రాకృతములైన ఈ మూఁడు గుణములలో సత్త్వగుణమే మోక్షకారణము; తక్కిన రెండును గానేరవు.

ముముక్షవో ఘోరరూపాన్ హిత్వా భూతపతీ నథ,
నారాయణ కలాశ్శాంతాః భజంతి హ్యనసూయవః. 26

ముముక్షవః = మోక్షమును గోరువారలు, ఘోరరూపాన్ = భయంకరరూపులైన, భూతపతీన్ = భూతపతులను, హిత్వా = వదలి, అనసూయవః = అసూయయనెడు గుణము లేనివారై; శాంతాః = శాంతములైన, నారాయణ కలాః = నారాయణుని యంశములను, భజంతి = సేవింతురు.

అవ: బ్రహ్మ, శివుఁడు మొదలైన ఇతర దేవతలను భజించువారు లేరా? ఉన్నారు. వా రెవరు? తుచ్ఛసుఖములను గాంక్షించువారు. వివేకరహితులు. నాశరహితమైన మోక్షమును గోరువారు, ఘోరస్వరూపులైన భూతములను వారి కధినాథులైన శివబ్రహ్మాదులనుపేక్షింతురు. కాని ఆ దేవతలను గాని, వారిని భజించువారిని గాని వీరు నిందింపరు. నారాయణుని యంశములు పరమ శాంతములు. అతని యంశము లేవి? రామకృష్ణాద్యవతారములు. ఇవియే మోక్షప్రదములు. వీనినే వారు సేవింతురు. సాత్త్వికమైన మనస్తత్త్వము గలవారే ఈ దారికి వత్తురు.

శ్రీధరీయము:

భూతపతి యనుట పితృప్రజేశ్వరాదుల కుపలక్షణము.

**విజయధ్వజము :**

పూర్వమందే గాదు. నేడు గూడ మోక్షకాములు పరమాత్మనే సేవింతురని చెప్పుచున్నాడు.

అథ = బ్రహ్మాది పరమసాత్త్వికచేతనులు పరమాత్మను సేవించుటచేత, అనసూయవః = అసూయ మొదలగు దుర్గుణములు లేని, ముముక్షవః = ఇప్పటి - రేపటి సాత్త్వికజీవులు దుస్తరమైన సంసారము నుండి ముక్తి నపేక్షించువారై, ఘోరరూపాన్ = రాజస తామస ఫలముల నొసగుటచేత, భయంకరమైన సంసారమునకుఁ గారణభూతములగుటచేత, భూతపతీన్ = రుద్రుఁడు మొదలగు దేవతలను, హిత్వా = వదలి, శాంతాః = పరిపూర్ణసుఖస్వరూపములైన, నారాయణ కలాః = భగవంతుని మూర్తులను. భజంతి = వర్తమానకాలమందు సేవింతురు. హి = భవిష్యత్తునను సేవింతురు.

తాత్పర్యము: బ్రహ్మాది పరమసాత్త్వికులు శ్రీహరినే సేవించిరి. అందుచే ననూయ మొదలగు దుర్గుణములు లేనివారు వారినే యనుసరింతురు. దుస్తరమైన ఈ సంసారమును దాఁటిపోవలె నను తీవ్రేచ్ఛ వారిది. వారు ఘోరరూపులైన రుద్రాదులనుఁ బరిత్యజింతురు. ఎందుకు? వారు రాజస తామస ఫలముల నొసఁగువారు. అందుచే వారిని వదలి సుఖపూర్ణుఁడైన సుఖశరీరియైన శ్రీహరిమూర్తులనే సేవింతురు. ఇక మీద వచ్చు సాత్త్వికులును ఈ మార్గమునే త్రొక్కెదరు.

> రజస్తమ ప్రకృతయ స్సమశీలా భజంతి వై,
> పితృభూత ప్రజేశాదీన్ శ్రియైశ్వర్య ప్రజేప్సవః. 27

రజస్తమ ప్రకృతయః = రజ స్తమోగుణములు స్వభావముగా గలవారు. సమశీలాః = తాము గొల్చు దేవతలతో సమానమైన శీలము గలవారు (కనుకనే), శ్రియా = సంపదతోఁ గూడ. ఐశ్వర్య = వైభవము, సంతానము వీనిని ఇచ్చింతు చున్నవారై. పితృభూత ప్రజేశాదీన్ = పితృదేవతలు, భూతములు, బ్రహ్మ

మొదలైన దేవతలను, భజంతి = సేవింతురు, వై = ఈ విషయము ప్రసిద్ధము. రజస్తమోగుణములే స్వభావముగాగలవారు, పితృభూత ప్రజేశాదులతో సమానమైన గుణములు గలవారు. ఆ దేవతలేమి యొసఁగుదురు? సంపత్తు వైభవము, సంతానము మొదలైన వాని నిత్తురు. వీరికిఁ గావలసిన వవే.

## శ్రీధరీయము :

రజస్తమసి ప్రకృతిః స్వభావో ఏషాం తే=రజస్తమో గుణములే స్వభావముగా గలవారు, కనుక పితృభూత ప్రజేశాదులతో సమానమైన శీలము గలవారు.

## విజయధ్వజము :

అవ : ప్రాసంగికముగా రాజస తామసిక స్వభావు లెవరిని సేవింతురని తెలుపుచున్నాఁడు.

శ్రియైశ్వర్య ప్రజేప్సవః = సంపద, అధికారము, సంతానము వీనిని బొందవలెనని యపేక్షించు, రజస్తమః ప్రకృతయః = రాజస తామస స్వభావులైన జీవులు, సమశీలాన్ = నిర్దోషియైన బ్రహ్మనే సేవించెడు స్వభావముగల, పితృభూత ప్రజేశాదీన్ = పితృదేవతలును, భూతేశ్వరుఁడైన రుద్రుఁడు మొదలైన దేవతలను, ప్రజాపతులను, భజంతివై = సేవింతురు; శ్రీకాములు ప్రజాపతులను, ఐశ్వర్యకాములు రుద్రుని, ప్రజాకాములు పితృదేవతలను సేవింతురని తెలియవలెను. ఇట్లు శ్రేయస్కాము లితర దేవతలను సేవించువా రున్నను వారు ముముక్షువులు గారని తెలియవలెను. సమశీలాః = శ్రీధరీయపాఠము. సమశీలాన్ = మధ్వాచార్యుల పాఠము.

తాత్పర్యము : రాజస తామస స్వభావులు తమవంటి గుణములే గలిగిన లేక నిర్దోషుఁడైన శ్రీహరిని సేవించుటయే స్వభావముగాఁగల ప్రజాపతులు మున్నగువారిని సేవింతురు. ఐహికఫలము నాశించెడి జీవులు రాజస తామస స్వభావులని తెలియవలెను.

వాసుదేవ పరా వేదా వాసుదేవ పరా మఖాః,
వాసుదేవ పరా యోగా వాసుదేవ పరాః క్రియాః. 28

వాసుదేవ పరం జ్ఞానం వాసుదేవపరం తపః,
వాసుదేవపరో ధర్మో వాసుదేవపరా గతిః. 29

వేదాః = వేదములు, వాసుదేవ పరాః = పరమాత్మ పరమైనవి, మఖాః = యజ్ఞములు, వాసుదేవ పరాః యోగాః—యోగములు, వాసుదేవ పరాః—పరమాత్మ పరమైనవి, క్రియాః—క్రియలు, వాసుదేవ పరాః. జ్ఞానం—జ్ఞానము, వాసుదేవ పరం—వాసుదేవపరమైనది, తపః—తపస్సు, వాసుదేవపరం—వాసుదేవపరమైనది. వాసుదేవ పరోధర్మః—ధర్మము వాసుదేవపరము, గతిః—ఉత్తమమైన మోక్షము, వాసుదేవ పరా—వాసుదేవ పరమైనది.

వేదములు వాసుదేవ పరములు. యాగము లంతే. యోగములు, క్రియలు వాసుదేవ పరములే. జ్ఞానశాస్త్రము, తపస్సు, ధర్మశాస్త్రము, పరమగతి ఇవన్నియు వాసుదేవుని పరమతత్త్వమును స్పష్టీకరించునవే. అనఁగా వాసుదేవునిఁ బొందుట కుపకరించు సాధనములు.

శ్రీధరీయము:

వాసుదేవ ఏవ పరః తాత్పర్యగోచరో యేషాం తే— వాసుదేవ పరాః. వేదాదు లన్నిటికిని పరమ తాత్పర్యభూతుఁడు—వాసుదేవుఁడే యనియర్థము. వేదములు యజ్ఞ యాగాదులను బోధించునవి గదా! అవివాసుదేవుని పరము లెట్లైనవి? యాగాదులును తదారాధన రూపములే. అందుకే తత్పరము లైనవి. ఆసన ప్రాణాయామాది క్రియా పరములైన యోగము లన్నియును బరమాత్మ నుద్దేశించి చేయునవే గనుక వాని తాత్పర్యము వాసుదేవుఁడే యైనాఁడు. యోగములు పరమాత్మనుబొందుట కుపాయభూతములని పిండితార్థము. జ్ఞానము, జ్ఞానశాస్త్రము ఇవియును వాసుదేవ పరములే. అతనిని బొందుటకే గదా జ్ఞానము! ధర్మశాస్త్రము దాన వ్రతాది విషయమైనది. దాన

వ్రతాదులకు స్వర్గముగదా ఫలము! అదియును పరమాత్మని యానందాంశమే.

**వంశీధరుఁడు :**

వేదములే పితృప్రజేశాదులు భజనీయులుగాఁ జెప్పుచున్నవి గదా! వారి నుపాసించు వారిదేమి దోషము? అట్టి వారు వేద ముఖ్య తాత్పర్యము నరయక పిత్రాదులను భజింతురని భావము. 'వేదైశ్చ సర్వైరహ మేవ వేద్యః' అని భగవద్గీత చెప్పుచున్నది గదా!

**స్వంలోకనం న విదుస్తే వై యత్ర జీవో జనార్దనః,**
**అహుర్ధూమ్రధియో వేదం స కర్మక మతద్విదః.**

అని నారదపురాణమందును గలదు అనుటచే ధర్మము గూడ భగవత్పరమే.

**వీరరాఘవీయము :**

వేదములు కర్మకాండ, జ్ఞానకాండ అని రెండు విధములు. కర్మకాండలోఁ జెప్పు ఇతర దేవతలును వాసుదేవాంతర్యామ్యతులే.

**సర్వే వేదా యత్పద మా మనంతి,**
**తపాంసి సర్వాణి చ యద్వదంతి.**

**ఇష్టాపూర్తే బహుధా జాతం జాయమానమ్,**
**విశ్వం బిభర్తి భువనస్య నాభిః.**

**తదేవాగ్ని స్తద్వాయుః తత్సూర్యస్తదు చంద్రమాః,**
**యో యో యాం యాం తనుం భక్తః.**

ఇత్యాది వాక్యములతో భాగద్వయాత్మక వేదవేద్యుఁడు వాసుదేవుఁడే. అతఁడే చతుర్ముఖాదులయం దంతర్యామియై, యైశ్వర్యాది ఫలముల నొసఁగును. అందుకే 'వాసుదేవపరా వేదాః' అనుట. యాగాదులును వాసుదేవుఁడే.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ,
న తు మామభిజానంతి తత్త్వే నా ఽతశ్చ్యవంతి తే. (గీత)

అవ: సమస్త శాస్త్రములను తాత్పర్యమును బర్యాలోచించు నపుడు సర్వులచేతను సేవింపఁదగినవాఁడు శ్రీమన్నారాయణుఁడే యని చెప్పుచున్నాఁడు.

వేదాః=వేదములు, వాసుదేవ పరాః=వాసుదేవుని గుణోత్కర్ష మును బ్రతిపాదించుటయందే తాత్పర్యము గలవి. మఖాః=సంసార మదమును నాశ మొనర్చు అగ్నిష్టోమాది యాగములు, వాసుదేవ పరాః=పరమాత్మనుద్దేశించియే యున్నవి. యోగాః=అష్టాంగయోగ ములు, ప్రాణాయామాదులు, వాసుదేవ పరాః=పరమాత్మ నుద్దేశించి యే యున్నవి. క్రియాః=శ్రుతి స్మృతులయందుఁ జెప్పఁబడిన సంధ్యో పాసన మున్నగు క్రియలు, వాసుదేవ పరాః, జ్ఞానం=ఉపనిషత్తుల యందుఁ జెప్పఁబడిన జ్ఞానము దేవతా తారతమ్యము మొదలైనది వాసుదేవపరం=వాసుదేవుఁడే విషయముగాఁగలది, తపః=కృచ్ఛ్ర చాంద్రాయణాది కాయక్లేశరూపమైన తపస్సు, వాసుదేవపరః= వాసుదేవుని ప్రీతికొఱకే యేర్పడినది, ధర్మః=ఇష్టాపూర్తము మొద లైన ధర్మము, వాసుదేవపరాః=పరమాత్మప్రీత్యర్థమే చెప్పఁబడినది. గతిః=పొందఁదగిన సత్యలోకము మొదలైన గతులు, వాసుదేవ పరాః=వాసుదేవుని యనుగ్రహమువలననే చిక్కునవి. వేదములందుఁ జెప్పఁబడిన అవాంతర తాత్పర్య విషయములు గూడ వాసుదేవు నుద్దేశించి చెప్పఁబడినవే. కనుక ఋగ్వేదాదులకు ముఖ్యతాత్పర్య విషయము గూడ వాఁడే. దీనిచే హరియే సర్వోత్తముఁడని చెప్పి నట్లైనది.

స ఏ వేదం స సర్జాగ్రే భగవా నాత్మమాయయా,
సదస ద్రూపయా చాఽసౌ గుణమయ్యా ఽగుణోవిభుః.30

సదసద్రూపయా= కార్యకారణాత్మక రూపమైనట్టియు, గుణమయ్యా= గుణరూపమునునైన, ఆత్మమాయయా=తన మాయచేత, అగుణః=గుణముల పరిధిని మించినవాఁడును, విభుః=సర్వవ్యాపియునైన, అసౌ స ఏవ భగవాన్= ఆ యీ భగవంతుఁడే, ఇదం=ఈ సమస్త ప్రపంచమును, అగ్రే=ఆదియందు, ససర్జ=సృష్టించెను.

లోకమును సృష్టించి, దానియందుఁ బ్రవేశించి, ఆ యా పదార్థములను స్థిరముగ నుంచుటకుఁ దగిన సామర్థ్యమున్న వస్తువునందే గదా సమస్త శాస్త్రములును సమన్వయించుచున్నవి. మరి వానికన్నిటికిని వాసుదేవ పరత్వమెట్లు సిద్ధించును? ఈ యాశంకను నాల్గు శ్లోకములతోఁ బరిహరించుచున్నాఁడు.

జగత్సృష్ట్యాదిలీలలు నిర్వహించెడు పరమ తత్త్వము వాసుదేవుఁడనియే యీ క్రిందిపద్యములలోఁ జెప్పఁబడు పాఠము.

కార్యకారణభావ మవలంబించుట స్వభావము చేతఁగూడినది. సత్త్వాదిగుణ సముదాయాత్మికయునైన తనమాయచేత గుణాతీతుఁడు సర్వవ్యాపియు, భగవంతుఁడునైన వాసుదేవుఁడు తొలుత నీ లోకమును సృష్టించెను.

శ్రీధరీయము :

ఈ నాల్గుశ్లోకములతో 'తస్య కర్మాణ్యుదారాణి' అని మునులు వేసిన ప్రశ్నకుత్తరము చెప్పఁబడినది. జగత్తును సృష్టించి, దానియందు భగవంతుఁడు ప్రవేశింపవలెను. ప్రవేశించి, దానిని నియమనము సేయవలెను. ఇట్టి లీలలతోఁ గూడిన పరమాత్మునందే సర్వశాస్త్రములును జేరుచున్నవి. మరి వాసుదేవుఁ డీ ప్రపంచమందుఁ బ్రవేశించుచున్నాఁడా! ఆ విధమెట్లు? దానికుత్తరమే యీ క్రిందిది. ఈ శ్లోకముచే భగవంతుని జగత్కారణత్వము చెప్పఁబడుచున్నది. సదసద్రూపయా = కార్యకారణాత్మకమైన, అగుణః = తాను నిర్గుణుఁడయ్యును గూడనని యర్థము.

**విజయధ్వజము :**

అవ: ఈ శ్లోకముతో జగత్సృష్టిరూపమైన కర్మను దెలుపు చున్నాఁడు.

స ఏవ = సమస్త వేదములు, శాస్త్రములు మొదలైన వానికి, ముఖ్యతాత్పర్య మెవఁడో, పరమ సాత్త్వికులైన బ్రహ్మాదిదేవతల కిష్ట దైవ మెవఁడో అట్టి, భగవాన్=అవ్యాహత సకలైశ్వర్య సంపన్నుఁడైన వాసుదేవుఁడే, అగుణః=సత్త్వాదిప్రకృతిగుణ సంబంధము లేనివాఁడై, వానికి ముఖ్యకారణమైనవాఁడై, విభుః=సమస్త కారణములందును ప్రవర్తకుఁడై, వ్యాప్తుఁడైనవాఁడై, అగ్రే=సృష్టికి మొదలు, ఆత్మమాయయా=తన స్వరూపమైన యిచ్ఛచేత (నిమిత్తకారణముచేత) సదసద్రూపయా=కార్యకారణాత్మకమైనట్టియు, గుణమయ్యా చ=సత్త్వాది గుణాత్మకమైన జడ ప్రకృతి చేతను, (ఉపాదానకారణము చేతను) ఇదం=మహత్తత్త్వము మున్నగు కార్యసమూహమని చెప్పఁబడు జగత్తును, ససర్జ=సృష్టించెను. ఇట్లు, సత్యమైన ప్రపంచమును సృష్టించుటచే, విష్ణువే సర్వోత్తముఁడని చెప్పఁబడి నట్లైనది.

తాత్పర్యము : సకల వేదాది శాస్త్రముల తాత్పర్యము నాలోచించినను సర్వులకును నారాయణుఁడే సేవ్యుఁడని తెలియుచున్నది. వేదాది సమస్త శాస్త్రముల ముఖ్యతాత్పర్యము వాసుదేవుఁడు గుణపూర్ణుడైనందుచేత సర్వోత్తముఁడని చెప్పుటయే. ఇంతకుమించి వేఱు తాత్పర్యము లేదు. సంసార మదభంజకములైన యగ్నిష్టోమాది యాగములు శ్రీహరి నుద్దేశించి వాని ప్రీత్యర్థమై యొనర్పఁదగినవే. ఇతరుల నుద్దేశించి చేయఁదగినవి గావు. యమ నియమాద్యష్టాంగ యోగములు శ్రీహరిని ధ్యానించుట కేర్పడినవే. అణిమాది సిద్ధులు వాని ముఖ్యప్రయోజనము గాదు. శ్రుతిస్మృతి విహితకర్మములైన సంధ్యావందనాదులును, శ్రీహరి నుద్దేశించి యేర్పడినవే. వానికి విషయము వేరొకవస్తువుగాదు. ఉపనిషత్తులచేతఁ జెప్పఁబడు జ్ఞానము

ఇంకనుఁ దెలియఁదగిన దేవతా తారతమ్యము మొదలైన విషయములు శ్రీహరి నర్థము చేసికొనుట కేర్పడినవే; శ్రీహరి ప్రీతికొఱకే. కృచ్ఛ్రచాంద్రాయణాది కాయక్లేశకరములైన తపస్సులు, దానము మొదలైనవి హరిప్రీతికొఱ కేర్పడినవే. అంతమాత్రమే గాదు, కర్మ ఫలముగా లభించు సత్యలోకము మున్నగు లోకములు మోక్షము గూడ శ్రీహరినుండియే పొందఁదగినవి. అందుచే నాతఁడే సర్వోత్తముఁడు; అతఁడే సర్వసంసేవ్యుఁడు.

తయా విలసితేష్వేషు గుణేషు గుణవానివ,
అంతః ప్రవిష్ట ఆభాతి విజ్ఞానేన విజృంభితః. 31

తయా=ఆ మాయచేత, విలసితేషు=ఉద్భవించిన, యేషు గుణేషు=ఏ గుణములయందు, అంతఃప్రవిష్టః=లోపల ప్రవేశించినవాఁడై, గుణవానివ=గుణములయం దభిమానమున్న వానివలె, ఆభాతి=ప్రకాశించును, (వస్తుతః=పరమార్థ రూపముగా) విజ్ఞానేన=జ్ఞానముచేత, విజృంభితః=విజృంభించినవాఁడు.

జగత్తునకు కారణము భగవంతుఁడైన వాసుదేవుఁడే యని నిరూపితమైనది. ఇప్పుడు జగత్తునందుఁ బ్రవేశించుట అందునిలుచుట యనెడు లక్షణములతోఁగూడిన లీలలు నిర్వచించుచున్నాఁడు.

త్రిగుణములు మాయచే నేర్పడినవి. వానికార్యము లేవి? ఆకాశాదిభూతపంచకము-వానియం దాభగవంతుఁడు బ్రవేశించును. 'నన్నాశ్రయించుట చేతనే యీ పంచభూతములు స్థిరములైయున్న' వని యభిమానమున్న వానివలె, నాతఁడు గన్పించును. కాని పరమార్థముగా, నా విధమైన యభిమాన మాతనికి లేదు. గుణములతోడి సంబంధము శూన్యము. ఎందువలన? అతని స్వరూపమే చిచ్ఛక్తితోఁ గూడినది, దానితో నాతఁ డత్యంతమూర్జితుఁడు. అందుచే నాతనియం దభిమానముండుటకు వీలులేదు.

**శ్రీధరీయము :**

గుణవానివ = మదధీనా ఏతేగుణా ఇత్యభిమానవానివ 'ఈ గుణములు మదధీనము' లని యభిమానమున్న వానివలె నగుపించును. నిజముగా నట్టిదిలేదు. ఎందుకనఁగా నాతని స్వరూపమే చిచ్ఛక్తి. దానితో నాతఁ డతూర్జితుఁడు.

**విజయధ్వజము :**

ఈ సమస్తజగత్తుయొక్క నియమన కర్తృత్వము ఆ శ్రీమన్నారాయణుని యొక్కనియందే యున్నదని చెప్పుచున్నాఁడు.

భగవంతుఁడు ప్రకృతిగుణ రహితుఁడు. కొందఱు గుణబద్ధుఁడైన జీవునకు భగవంతునకు భేదములేదని యందురు. అది వారి భ్రాంతి. దీనికిఁ గారణమేమి? సృష్ట్యనంతరము తన్నియమనమునకై భగవంతుఁగు జగత్తునందుఁ బ్రవేశించెను. ఎందుకుఁ బ్రవేశించెను? తత్తదాకారము గలవాఁడై తచ్ఛక్తిని బ్రకాశింపఁ జేయుటకొఱకు. ఆ శ్రీహరి, తయా=కార్యకారణరూపమైన జడప్రకృతిచేత, విలసితేషు= ప్రకాశితములైన పంచభూతములు, భౌతికదేహము, ఇంద్రియములు మొదలైన రూపములుగాఁ బరిణామమందిన, యేషు-ఈ కన్నులకుఁ గన్పించెడు, గుణేషు=ప్రాకృత గుణములయొక్క కార్యములందు, అంతఃప్రవిష్టః-ప్రేరణ మొనర్పవలెనను నే కారణముచేత లోపలఁ బ్రవేశించెనో ఆ కారణముచేత, గుణవానివ=ప్రాకృతగుణబద్ధుఁడైన జీవునివలె, అభాతి=అజ్ఞానులకుఁ గన్పించును. అంతే గాని, అతఁడు గాఁడు. ఎందుకనఁగా, విజ్ఞానేన-విశేషవిషయకజ్ఞానముచేత, విజృంభితః-పరిపూర్ణుఁడైనవాఁడు. పరమాత్ముని జీవభిన్నుఁడని తోఁపింపఁ జేయుటకే ఈ విశేషణము వాఁడఁబడినది. నానావిధములైన కర్మవిపాకములకు లోఁబడిన జీవులకు విజ్ఞానము లేదు. అందుకే వారందఱును నియమ్యులు. శ్రీహరియే నియామకుఁడు. కనుక శ్రీహరి సర్వజీవభిన్నుఁడే.

తాత్పర్యము: శ్రీహరి సర్వోత్తముఁ డగుట కేవల సంకేత మాత్రమేయని తెలియరాదు. సకలశాస్త్రములకు ముఖ్యవిషయమును బ్రహ్మాది సాత్త్వికజీవుల కిష్టమైన శ్రీమన్నారాయణుఁడు ప్రాకృత రహితుఁడు. సమస్తమునకు ముఖ్యకారణ మతఁడే. సర్వత్ర వ్యాపించిన శ్రీహరి తన స్వరూపభూతమైన యిచ్ఛను నిమిత్తకారణముగాఁ జేసికొని, కార్యకారణాత్మకమైన ఈ జడప్రకృతి అనఁగా సత్త్వ రజస్తమో గుణాత్మకమైన ప్రకృతిని యుపాదాన కారణముగాఁ జేసికొని కన్పించెడి ఈ సత్యమైన జగత్తును మొదట సృష్టించెను. ఈ చిత్రమైన సత్యజగత్తును సృష్టించుటచేతనే యాతఁడు సర్వోత్తముఁడు, సృష్టిసేయుట మాత్రమే గాదు. ఈ జగత్తును నియమించువాఁడు గూఁడ నాతఁడే. జడప్రకృతియొక్క పరిణామములైన పంచభూతములు, భౌతికదేహము మొదలగు పదార్థములు, ఇంద్రియములు వీనికి ప్రేరకుఁ డాతఁడే, వాని కా యా శక్తుల నొసఁగుటకే నాతఁడు వానిలోఁ బ్రవేశించెను. అందుచే మూఢుల కాతఁడు ప్రాకృతగుణబద్ధుఁడైన జీవునివలెఁ గన్పించును. కాని సమస్తమునందును శ్రీహరి విశిష్టజ్ఞాన పరిపూర్ణుఁడైయే యుండును. అందుచే నాతనికి జీవభావ మెప్పుడును రాదు. జీవులందనూ? వివిధకర్మల ఫలము ననుభవించువారు విజ్ఞానరహితులు గనుక హరియే సర్వనియామకుఁడు. తక్కిన వారెల్ల నాతనిచే నియమింపఁ బడువారే.

యథా హ్యవహితో వహ్నిర్దారుష్వేక స్స్వయోనిషు,
నానేవ భాతివిశ్వాత్మా భూతేషు చ తథా పుమాన్. 32

స్వయోనిషు=తన యుత్పత్తిస్థానములైన, దారుషు=కాష్ఠములయందు, అవహితః=ఉండునట్టి, ఏకః వహ్నిః యథా=ఒక్క అగ్నియే యే ప్రకారమో, తథా=అట్లు, విశ్వాత్మా=సర్వాత్మయైన, పుమాన్=పురుషుఁడు, భూతేషు = భూతములయందు, నానా ఇవ=బహురూపములు గలవానివలె, భాతి=ప్రకాశించును.

అవ: బహురూపములతోఁ గానఁబడెడు వాఁడును, వాసుదేవుఁడే యని చెప్పుచున్నాఁడు. ఉపాధిభూతములైన కాష్ఠముల యందుఁ బ్రవేశించి శోభించు నేకరూపుఁడైన యగ్ని, వాని స్థౌల్య దైర్ఘ్యాదుల ననుసరించి బహురూపుఁడుగాఁ గనపడును గదా! అట్లే యొకఁడైన భగవంతుఁడు సమస్తమునందును అంతర్యామియై యున్నను చతుర్విధ సృష్టివర్గములలో జీవరూపుఁడుగా వసించు నప్పుడు బహురూపములు గలవాని తెఱఁగున శోభించును.

శ్రీధరీయము:

బహురూపత్వము లీలలను జెప్పుచున్నాఁడు. స్వయోనిషు = తన కభివ్యంజకములైన కాష్ఠాదులందు, అవహితః = ఉన్నవాఁడై, నానాత్వమును బొందిన వానివలెఁ గనిపించును.

వీరరాఘవ వ్యాఖ్య:

ఇచ్చట యోనిశబ్దముచేత నభివ్యక్తిస్థానము మాత్ర మనియే గ్రహింపవలెను. కాష్ఠ మగ్ని కుపాదానముగాదు. నిమిత్తమాత్రమే. దారువులనుండి వహ్ని వ్యతిరిక్తుఁడుగనే యుండి స్వాభివ్యక్తస్థలము లైన దారువులయం దనేకరూపములుగాఁ గన్పించుచున్నాఁడు. అగ్ని యొక్కటైనను తృణ పర్ణ శాఖాదులం దెట్లు భిన్నముగాఁ గన్పించునో అట్లే ప్రకృతి పరిణామరూపములైన దేహములం దభివ్యక్తుఁడైన జీవుఁడు జ్ఞానానందరూప ధర్మములతో నేకరూపుఁడే కాని "నేను దేవతను, నేను మనుష్యుఁడను" అనెడు భిన్న భావము నందుచున్నాఁడు. మూలమందలి 'పుం' శబ్దము జీవ వాచి. దానికి తచ్ఛరీర పరమ పురుష పర్యంతమర్థముఁ జెప్పికొనవలెను. 'పుమాన్ విశ్వాత్మా' జీవ శరీరకుఁడైన సర్వేశ్వరుఁడు ఒక్కఁడే. దేవాదిరూపములతో భిన్నభిన్నములుగాఁ బ్రకాశించుచున్నాఁ డని భావము. 'దారుషు' 'భూతేషు' అను రెండింటికిని దృష్టాంత దార్ష్టాంతికభావము. ఈ రెండును బహు

వచనమందే యున్నవి. దారువులందే హ్రస్వత్వ స్థూలత్వ వక్రత్వాది ధర్మములు. అగ్నియందు లేవు. అట్లే దేవత్వ అజ్ఞత్వ దుఃఖిత్వాది భేదములు గూడ విశ్వాత్మునియందు లేవు. దారుభేదములవంటి దేవాది శరీరముల యందున్న జీవులయందే యీ ధర్మములున్నవని భావము. 'వహ్నిః-విశ్వాత్మా' ఈ రెండు నేకవచనములే. కనుక వహ్నివలె విశ్వాత్ముఁడును, సర్వత్రావస్థితుఁడైనను స్వరూపముతోఁ గాని, స్వభావముతోఁ గాని నానావస్థలఁ బొందుటలేదు. ఈ రెంటికిని కించిద్భావము మాత్రమున్నది. దారువులనుండి అగ్ని సాక్షాత్తుగా నభివ్యక్తమై నానారూపములుగా భాసించుచున్నది. దార్ష్టాంతికమందు విశ్వాత్ముఁడు జీవునిద్వారా దేవాదిరూపములతో ననేకములుగా భాసించుచున్నాఁడు. జీవవిశిష్టములైన దేవాదిశరీరములకే యధిష్ఠేయత్వము.

విజయధ్వజము :

అవ: పంచభూతములు, భౌతికదేహము, ఇంద్రియములు వీనికి ప్రేరకముగా నాయా శక్తుల నొసఁగుటకు భగవంతుఁడు వాని యందుఁ బ్రవేశించునని చెప్పితిమి. 'వాఁడు పూర్ణరూపుఁడై సర్వస్థలముల యందును నున్నచో స్థానభేదముతో వానియందును భేదమేర్పడవలెను గదా!' అని యాశంక. దీనిని బరిహరించుటకై ఈ శ్లోకము ప్రవృత్తమైనది. పరమాత్ముఁ డొక్కఁడే యనేక పదార్థములందు బహురూపములతో నుండును. అద్వయుఁడైన శ్రీహరికి స్థాన భేదముతో భేద మేర్పడదు. ఈ విషయమునే యుదాహరణపూర్వకముగాఁ దెల్పుచున్నాఁడు.

అర్థము: యథా=ఎట్లు, ఏకః వహ్నిః=ఒకఁడేయైన యగ్ని యనెడు యభిమానదేవత, స్వయోనిషు=తన యభివ్యక్తికిఁ గారణములైన, దారుషు=కట్టెలయందు, వ్యవహితః=కన్నులకుఁ గనఁబడక యున్నవాఁడై, నానేవభాతి=బహురూపములు గల దానివలె గనుపించునో (నిజమునకు భిన్నముగాదో), తథా=అట్లే, ఏకః=ఒకఁడేయైన

విశ్వాత్మా=ప్రపంచమునం దెల్లెడ వ్యాపించిన, పుమాన్=పరమపురుషుఁడైన శ్రీహరి (విశ్వాత్మా ఏవ=పరిపూర్ణరూపముతోనే), భూతేషు ప్రవిష్టోఽపి=ప్రపంచ పదార్థములందుఁ జేరికొనియున్నను, నానేవ భాతి=భిన్నభిన్న రూపములు గలవానివలె గన్పించుచున్నాఁడు. నిజమునకు వాఁడు భిన్నుఁడుగాఁడు. అనేక రూపములు గలవాఁడైనను స్వగతశూన్యుఁడు. 'నేహ నానాస్తి కించన' అనెడు శ్రుతిగూడ శ్రీహరియందు భేదము లేదనియే చెప్పుచున్నది. అతనికి సర్వథా ఏ రూపమందును నే భేదమును లేదు. ఎక్కడనున్నను వాఁడు పరిపూర్ణుఁడే.

తాత్పర్యము: భిన్నభిన్నపదార్థములందున్న శ్రీహరి పదార్థములు పరస్పరభిన్నములైనట్లుగాఁ దన రూపములయందును బరస్పర భేదములు గలవాఁడని తెలియరాదు. అనేక కాష్ఠములలో నగ్ని (అభిమానదేవత) అణఁగికొని యుండును. ఆ కట్టెలను బరస్పరము రాచినప్పుడు బయటికివచ్చి కాన్పించును. కట్టెలు భిన్నమైనను తద్గతమైన యగ్ని యొక్కటే. అట్లే భిన్నవస్తువులందు శ్రీహరి ప్రవేశించి యున్నను బహురూపములుగల వాఁడేగాని యా రూపములలో నే భేదమునుఁ బొందిన వాఁడుగాఁడు. అద్వయుఁడైన శ్రీహరికి స్వగత భేదములేదు. ఈ యర్థమునే 'నేహనానాస్తికించన' అనెడు శ్రుతి వాక్యముగూడ స్పష్టపఱచుచున్నది. అవహితః అనునది శ్రీధరుల పాఠము. వ్యవహితః అనునది వీరి పాఠము.

> అసౌ గుణమయైర్భావైః భూతసూక్ష్మేంద్రి యాత్మభిః,
> స్వనిర్మితేషు నిర్విష్టో భుంక్తే భూతేషు తద్గుణాన్. 33

అసౌ=ఈ పరమాత్ముఁడు, గుణమయైః=గుణస్వరూపములైన, భావైః=భావములచేత, భూతసూక్ష్మేంద్రియాత్మభిః=భూతసూక్ష్మములు, ఇంద్రియములు, ఆత్మ=వీనితో, స్వనిర్మితేషు=తనచేత నిర్మితములైన, భూతేషు=భూతములయందు, నిర్విష్టః=వసించుచున్నవాఁడై, తద్గుణాన్=ఆ యా భూతముల కనుగుణములైన విషయములను, భుంక్తే=భుజించును (భుజింపఁజేయును).

అవ: సుఖవిషయముల ననుభవింపఁజేసెడు లీలను వర్ణించుచున్నాఁడు. ఆకాశాదులు సూక్ష్మభూతములు. శ్రోత్రాదు లింద్రియములు. మనస్సు, శ్రీహరి వీనితోఁబాటు భూతములను సృష్టించెను. ఆ సృష్టి నాల్గువిధములు. వానియందుఁ దాను బ్రవేశించును. ప్రవేశించి, ఆయా సృష్టివర్గముల కనుకూలములైన సుఖవిషయములను భుజింపఁజేయును. ఆయా ప్రాణివర్గములలో జీవరూపముతో వ్యాపించియుండునది శ్రీహరియే. అందుచే, నాయా జీవులనుభవించెడు సుఖదుఃఖములభోక్త వాసుదేవుఁడే. జ్ఞాన స్వరూపుఁడైన భగవంతుఁడజ్ఞాన సంబంధము లేని వాఁడు. అందుకే జీవుల సుఖదుఃఖములకుఁ గారణభూతుఁడై మాత్రమే యుండునని చెప్పుటకే 'భుంక్తే' అనుదానికి, 'భోజయతి' యను నర్థముఁ జెప్పికొనుట యైనది.

శ్రీధరీయము:

భోగరూపమైనలీలను జెప్పుచున్నాఁడు. శ్రీహరి, భూతసూక్ష్మములు, ఇంద్రియములు, మనస్సు వీనిచే నిర్మింపఁబడినట్టి నాల్గుతెఱఁగులైన భూతములందు, అనఁగా నాయా వర్గమునకుఁ జెందిన భూతములు అవి తమ తనుకు సబ్బెడు సుఖము ననుభవించుటలో స్వాతంత్ర్యముగలవి యని భావము. తద్గుణాన్=తత్తదను రూపములైన విషయములను, ఇచ్ఛయా భుంక్తే=కోరికతో ననుభవించుచున్నాఁడు.

వంశీధరుఁడు:

అంతర్యామి స్వరూపముగాఁ దమయందు వాసుదేవుఁ డుండి, వాని ప్రేరణలేక జీవులకు భోక్తృత్వము సిద్ధింపదు. వాసుదేవుని తటస్థశక్తియైన జీవునిద్వారా స్వయముగా నంతర్యామియే సుఖదుఃఖముల ననుభవించుచున్నాఁడని తెలుత శ్రీధరుఁడు 'భుంక్తే' అని యర్థముఁ జెప్పెను. జీవునివలె నీశునికి గుణభోక్తృత్వ మనుచితమని తోఁచి ప్రేరణార్థమును జెప్పుచున్నాఁడు.

వీరరాఘవీయము :

అవః విశ్వాత్ముఁడైన భగవంతునకు స్వశరీర భూతప్రకృతి పురుషద్వారా దేవాది రూపములుగా ననేక ప్రకారముగా భాన మని ముందుఁ జెప్పఁబడినది. సుఖదుఃఖాది భోక్తృత్వము తన్నిమిత్తమైన కర్తృత్వము రెండును స్వశరీర భూతమైన జీవుని మూలముననే. స్వయముగాఁ బరమాత్ముఁడు భయరహితుఁడని చెప్పుచున్నాఁడు.

అర్థము : అసౌ=విశ్వాత్ముఁడైన పరమాత్ముఁడు, గుణమయైః= సత్త్వాది గుణపరిణామరూపమైన దానివలన తత్ప్రచురములైన భూత సూక్ష్మాదిరూపములైన, భావైః=పదార్థములచేత, ఇచ్చట భూతము లనఁగా పృథివ్యాదులు, సూక్ష్మములు గంధాదులు. ఇంద్రియములు శ్రోత్రాదులు. ఇవి రెండు రీతులు. జ్ఞాన కర్మేంద్రియములు. జ్ఞానేం ద్రియములు వాగాదులు, కర్మేంద్రియములు పాదాదులు. ఆత్మ= అంతఃకరణమైనను గావచ్చును. ఇవి తనచేత నిర్మింపఁబడినవే. ఈ దేవాదిభూతములందు, నిర్విష్టః=జీవునిద్వారా ప్రవేశించినవాఁడై, తద్గుణాన్=పృథివ్యాది భూతగుణములైన గంధాది విషయములను, భుంక్తే=జీవునిద్వారా అనుభవించుచున్నాఁడు. స్వయముగాఁ గాదని తాత్పర్యము. జీవునిద్వారానే పుణ్యపాపరూపములైన కర్మల నాచ రించుచున్నాఁడని యర్థము.

వల్లభాచార్య సుబోధినీ వ్యాఖ్య :

సృష్టి నాల్గురీతులు గదాః అంతఃకరణములు, ఇంద్రియములు తన్మాత్రలు, భూతములు. ఈ నాల్గును త్రిగుణాత్మకములు. వీనిచే నిర్మింపఁబడిన దేవ తిర్యఙ్నరాది భూతములయందు, నిర్విష్టః = నిత రాం విష్టః అని విగ్రహము. ఎక్కువగా నున్నవాఁడై, స్వనిర్మితేషు= దీనికి విగ్రహము మూఁడురీతులు. 'స్వస్మిన్ నిర్మితేషు, స్వార్థం నిర్మి తేషు, స్వేన నిర్మితేషు'– తనయందు నిర్మింపఁబడినవి, తనకొఱకై

నిర్మింపఁబడినవి, తనచేత నిర్మింపఁబడినవి. త్రిగుణములు. సాత్త్విక మైన దంతఃకరణము. సాత్త్వికరాజసము లింద్రియములు. రాజస తామసములు తన్మాత్రలు. తామసములు భూతములు. ధర్మార్థకామ మోక్ష చతుర్విధ పురుషార్థసిద్ధ్యర్థమే నాల్గురీతులుగా భేదము. దేహము చేత ధర్మము, తన్మాత్రలచే నర్థము, ఇంద్రియములతోఁ గామము, అంతఃకరణముతో మోక్షము. జీవుఁడు వీని యనుభవములలో ముఖ్యుఁడు, తక్కిన వంగములు. అందుకే తద్గుణాన్ అన్నాడు. చతుర్విధ పురుషార్థరూపములైన గుణముల ననుభవించు చున్నాఁడని భావము.

విజయధ్వజము :

అవ : హేయములైన దేహములందుఁ బ్రవేశించిన శ్రీహరి, ఆ యా దేహములందున్న జీవునివలె భోగము ననుభవించునని తలఁప రాదని చెప్పుచున్నాఁడు.

అసౌ = ఆ సర్వోత్తముఁడైన శ్రీహరి, గుణమయైః = సత్త్వము మొదలైన గుణముల వికారములైన, భూతసూక్ష్మేంద్రియాత్మభిః భావైః = పృథివ్యాది పంచమహాభూతములు, శబ్దాది పంచతన్మాత్రలు, శ్రోత్రాది దశేంద్రియములు, మన స్సనెడు తత్త్వములచేత (ఉపాదాన కారణములచేత), స్వ నిర్మితేషు = ఆ తత్త్వములయందుఁ బ్రవిష్టుఁడైన తనచే నిర్మింపఁబడిన, భూతేషు = ప్రాణుల దేహములందు, నిర్విష్టః = తన మహిమతో, అసంగుఁడుగనే ప్రవేశించి, తద్గుణాన్ ఏవ = ఆ యా ఇంద్రియముల విషయములైన ఆనందాది గుణములనే, భుంక్తే = అను భవించును. దోషనిమిత్తములైన గుణముల ననుభవించుట లేదు. స్వతంత్రుఁడైన శ్రీహరి శరీరమందున్నను దుఃఖము నెప్పు డనుభ వింపఁడు.

విశేషార్థములు : శ్రీహరి యానందాది గుణములనే యనుభ వించును. దుఃఖముల ననుభవింపఁడు. ఈ విషయమునకుఁ బ్రమా

ణముగా మధ్వాచార్యులు వామన పురాణములో నీ క్రింది శ్లోకము లుదహరించిరి.

సర్వత్ర సారభు గ్దేవో నాఽసారం స కదాచన.

సమస్త ప్రాణిదేహములందును శ్రీహరి శ్రేష్ఠవిషయములను మాత్రమే యనుభవించును. అసారములైన దుఃఖముల ననుభవించుట లేదు. ఉపనిషత్తులలో నీ శ్లోక మున్నది.

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే,
తయో రన్యః పిప్పలం స్వాద్వ
త్త్యనశ్నన్ అన్యో అభిచాకశీతి. (ముండకోపనిషత్)

ఒక చెట్టుకొమ్మపై రెండు పక్షులున్నవి. రెండును బంగారు రంగు గలవి, అవి యొక జంట. అభిన్నమైన మైత్రి. వీనిలో నొక పక్షి పిప్పలమును దినుచున్నది. రెండవది తినక తినుదానిని జూచుచున్నది. ఈ రెండు పక్షులును జీవాత్మ పరమాత్మలు.

మధ్వాచార్యులవారు 'అనుభవించు' నని వ్యాఖ్యానించిరి. ఈ శ్రుతిలోని 'అనశ్నన్' అనుట కేమిగతి? ఇది ప్రశ్న. దీనికి సమాధానము 'అనశ్నన్' అనఁగా నశుభవిషయముల ననుభవించుటలేదని మాత్రమే యర్థము. అశుభవిషయములను పరవశమైన దానిని యత్నసాధ్యమును భగవంతుఁ డనుభవించుట లేదు.

అక్షప్త్యాచ స్వతంత్రత్వా దశుభస్య చ వర్జనాత్,
అభోక్తా శుభభోక్తృత్వా ద్భోక్తేత్యేవ చ తం విదుః.
న్యూనాఽనధికత్వాచ్చ పూర్ణస్యానంద భోజనాత్,
విరాగాచ్చ పరస్యాస్య భోక్తృత్వ ప్రతిషేధనమ్. (స్కాందము)

ప్రయత్నము లేకుండుటచేతను పరవశుఁడు గాకుండుట చేతను అశుభవిషయములను బొందకుండుట చేతను శ్రీహరి నభోక్త

యందురు. అశుభవిషయమునే యనుభవించుటచే భోక్తయుఁ గూడ నగును. లేక భోగముచేత నుచ్చనీచభావము లేకుండుట చేతను స్వరూపభూతమైన యానందమునే యనుభవించుట చేతను, విషయ భోగములందాసక్తి లేకుండుటచేతను సర్వోత్తముఁడైన హరికి శ్రుతి యందు భోక్తృత్వము నిషేధింపఁబడినది.

భావయత్యేష సత్త్వేన లోకా న్వైలోక భావనః,
లీలావతారానురతో దేవతిర్యఙ్నరాదిషు. 34

**లోకభావనః**_లోకముల నభివృద్ధిపఱచుచున్న; **ఏషః**_ఈ భగవంతుఁడు, **దేవతిర్యఙ్నరాదిషు**_దేవతలు, తిర్యక్కులు, మనుష్యులు-వీరియందు, **లీలావతారానురతః**_లీలావతారమును స్వీకరించుటయం దిష్టమున్నవాఁడై, **సత్త్వేన**_సత్త్వగుణముతో, **లోకాన్**_లోకములను, **భావయతి**_పాలించుచున్నాఁడు.

లోకములకు సుఖమును వర్ధింపఁజేయు భగవంతుఁడైన శ్రీహరి దేవతలు, మృగాదులు, మనుష్యులు-వీరియందు స్వేచ్ఛగా నవతరించి యొక్కొక్కవిధమైన లీలను ప్రకాశింపఁ జేసి, సత్త్వగుణముతో లోకములనుఁ బాలించుచున్నాఁడు.

శ్రీధరుఁడు:

భావయతి_పాలించుచున్నాఁడు. ఇది సర్వావతారములకును సాధారణమైన ప్రయోజనము. విశేషముగాఁ గృష్ణావతారమునకు. లోకభావనః=లోకకర్తయైనవాఁడు. దేవాదులందే లీలావతారము లున్నవో వానియం దనురతుఁడై యని విగ్రహము.

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే
అష్టాదశ సహస్రికాయాం, సంహితాయాం
పారమహంస్యాం, శ్రీవైయాసిక్యాం, శ్రీహయగ్రీవ
బ్రహ్మవిద్యాయాం ప్రథమస్కంధే ద్వితీయోధ్యాయః.

విజయధ్వజము :

అవ : పూర్వాధ్యాయ మందలి 'అథాఖ్యాహి హరేర్ధీమన్' అనెడు ప్రశ్నకుత్తరముఁ జెప్పుచు నా విషయమునే యిచ్చట సంక్షేపముగాఁ జెప్పుచున్నాఁడు. లోకభావనః=జగత్కర్తయైన, ఏషః= పురుషోత్తముఁడైన శ్రీహరి, సత్త్వేన=సత్త్వగుణముతోఁ దక్కిన రజస్తమస్సులను క్రుంగఁదీసి, లోకాన్=సజ్జనులను, భావయన్=పాలనతో నభివృద్ధి పఱచెడువాఁడై, తిర్యఙ్నరాదిషు=వరాహాది తిర్యగ్జాతుల యందు, మనుష్యులందును, దేవతలందును, ఆదిపదముతో స్తంభము మొదలైన వానియందును, (నృసింహమూర్తి) ఋషుల యందును, లీలావతారాను గతః భవతి=క్రీడతోనే జగద్రక్షణ కనుకూలమైన యవతారములను బొందును. (వాని యవతారములు కర్మఫలముగా గాదు. తా నుద్భవించెడు జాతికిఁదగినట్లు చేష్టల నొనర్చును.) 'భావయత్యేషః' అని శ్రీధరపాఠము. 'భావయన్నేషః అని వీరిపాఠము' 'లీలావతారానురతః అని ' శ్రీధరుఁడు.

'లీలావతారానుగతః' అని వీరు. 'దేవతిర్యఙ్నరాదిషు' అని శ్రీధరపాఠము. తిర్యఙ్నరసురాదిషు అని వీరి పాఠము.

తాత్పర్యము : ఆ యా జీవుల దేహములయందు వసించు చున్నను శ్రీహరి జీవులవలె దుఃఖము ననుభవింపఁడు. పృథివ్యాది పంచభూతములు గంధాదిపంచతన్మాత్రలు, దశేంద్రియములు, మనస్సు ఈ తత్త్వములతో వానియందుఁ బ్రవేశించిన శ్రీహరియే దేహములను నిర్మించినవాఁడు. ఆ ప్రాణిదేహములలో వాఁడు దన సామర్థ్యముచేత ససంగుఁడుగనే ప్రవేశించెను. ఇట్లు దేహము లందున్న వాఁడై తత్తదింద్రియ విషయములందు శ్రేష్ఠములైన స్వాత్మకములైన శుభవిషయములనే యనుభవించును. అసారములైన విషయముల ననుభవించుట లేదు. శ్రుతిలోని 'అనశ్నన్' అనుటకు 'అశుభము లను శుభముల యందును బరవశమైన వానిని ప్రయత్న సాధ్యము

లను అనుభవింపవలెనను నాసతో ననుభవింపక ' అనియే యర్థము. స్వతంత్రుఁడైన శ్రీహరి యీ శుభానుభవముతో నుచ్చనీచముల కొప్ప డుఁడు గాఁడు. విషయజన్యమైన యానందము ననుభవించుట లేదు. తద్గతమైన స్వరూప భూతమైన యానందమునే యనుభవించును. ఇట్లు లోకకర్తయైన శ్రీహరి సజ్జనులను రక్షించి వారి సాధనతో వారి నభివృద్ధిపఱచుటకు లీలగనే వరాహాది తిర్యక్కులు, మనుష్యులు, ఋషులు, దేవతలు, స్తంభములు, మొదలైన స్థలములు, వీనియందు వ్యక్తుఁడై యవతరించును. ఆయా జాతులందు జన్మించి నపుడు తదను గుణముగనే కర్మలనుజూపి సజ్జనులను రక్షించును. వాఁడవతరించుట కర్మఫలముగా గాదు. వాఁడు గర్మబద్ధుఁడు గాఁడు. వాని యవతా రము లన్నియుఁ గ్రీడకొఱకై స్వేచ్ఛతో గ్రహించినవే. కనుక హరియే సర్వోత్తముఁడు. సర్వసంసేవ్యుఁడు.

**పోతన్నగారు:**

**త.** **పరమపూరుషుఁ డొక్కఁ డాఢ్యుఁడు పాలనోద్భవ నాశముల్**
**సొరిదిఁ జేయు ముకుందపద్మజ శూలిసంజ్ఞలఁ బ్రాకృత**
**స్ఫురిత సత్త్వరజస్తమంబులఁ బొందు నందు శుభస్థితుల్**
**హరిచరాచర కోటి కిచ్చు ననంతసత్త్వనిరూఢుఁడై.**

అర్థము: ఒక్కఁడు=ఒకఁడేయైనట్టియు, ఆఢ్యుఁడు=సర్వసమర్థుఁ డైనట్టియు, పరమపురుషుఁడు = సర్వోత్తముఁడైన వాసుదేవుఁడు, ముకుంద పద్మజశూలిసంజ్ఞలన్ = విష్ణుబ్రహ్మశివ సంజ్ఞలనుబొంది పాలనోద్భవనాశముల్ = సమస్త ప్రపంచముల యొక్క పాలనము, సృష్టి, లయము మొదలైన పనులను, సొరిదిన్ చేయున్=క్రమముగాఁ గావించును. ప్రాకృతస్ఫురిత=ప్రకృతిగుణములైయున్న, సత్త్వరజస్త మంబులన్=సత్త్వ రజ స్తమోగుణములను-వీనిని, పొందున్=ప్రాపిం చును. అందున్=ఆ మువ్వురిలో, హరి=వాసుదేవుఁడు, అనంత సత్త్వ నిరూఢుఁడై=అనంతమైన సత్త్వగుణము నాశ్రయించినవాఁడై,చరాచర

కోటికిన్=చరాచరములైన ప్రాణులకు, శుభస్థితుల్=ఉత్తమములైన శ్రేయస్సులను, ఇచ్చున్=కల్గించును.

తాత్పర్యము: సర్వస్వతంత్రుఁడైన పరమపురుషుఁ డొక్కఁడే. అతఁడే ప్రాకృతగుణములైన సత్త్వరజస్తమస్సులను బొంది విష్ణువు, బ్రహ్మ, శివుఁడను పేరులతో వెలయును. ఈ బ్రహ్మాండములయొక్క పాలనము సృష్టిలయము మొదలైన కార్యము లొనర్చును. ఆ ముగ్గు రిలో సత్త్వగుణసంబంధము గలిగిన శ్రీమహావిష్ణువు తన్నుఁ గొలుచు వారికి సమస్తశ్రేయము లొడఁగూర్చును.

తరలవృత్తము:

పలుకుచో తరళంబులందుల భానువిశ్రమ పద్ధతిన్
గలియ నభ్రసజాగముల్ సమకట్టి చెప్పుదు రుత్తముల్.

న, భ, ర, స, జ, జ, గ, లు. 12వ యింట విశ్రమము.

పాలనోద్భవనాశముల్ 'పద్మజశూలిసంజ్ఞలన్' 'సత్త్వరజ స్తమంబులన్' అను చోటులందుఁ గ్రమాన్వయము. 'పరః పురుషః' అను సంస్కృతపదమునకు పరమ పూరుషుఁడని యున్నది. 'ఏక' శబ్దము మూలములోనిదే. ముక్తిందదాతీతి ముకుందః. ఈ శబ్దమిచ్చట చాల సముచితముగా వాఁడఁబడినది. పరమాత్ముని నాభికమలమున నుద్భవించినవాఁడు గనుక, పద్మజుఁడు బ్రహ్మదేవుఁడు. శూలాయు ధమును ధరించువాఁడు శూలి. రుద్రుఁడు, ముకుందపద్మజ శూలులు అనుట ద్వంద్వసమాసము 'ద్వంద్వాంతే శ్రూయమాణం పదం ప్రత్యేకేన సంబధ్యతే' అను నియమము ననుసరించి, సంజ్ఞాశబ్దము నకుఁబ్రత్యేకాన్వయము. ప్రాకృతస్ఫురితము. ప్రాకృతములనఁగా ప్రకృతికి సంబంధించినవి. ప్రాకృతములై స్ఫురితములైనవి. రెండును విశేషణములు. రెండువిశేషణములకుఁగూడ కర్మధారయము వచ్చును. 'ఉపస్నాత ప్రయాత ద్విజావలి పిండీకృత శాటులన్ నవిన్' అని యాముక్తమాల్యదా ప్రయోగము 'స్నాతాశ్చతే ప్రయాతాశ్చ' అని

సమాసము. ఇక్కడఁగూడ 'ప్రాకృతాశ్చ తే స్ఫురితాశ్చ' అని సమాసము. పాలనోద్భవనాశములు, సత్త్వ రజ స్తమములు ఈ రెండును ద్వంద్వసమాసములే. 'హరి విరించి హరేతి సంజ్ఞాః' అనిమూలము. హర ఇతి హరేతి-ఇక్కడ సమాసమార్ష మని శ్రీధరుఁడు. ఒక్కవ్యక్తికే శివ విష్ణు బ్రహ్మనామము లని సమాసస్వారస్యము. పోతనామాత్యుఁడును 'ముకుంద పద్మజ' సంజ్ఞలని, సమాసము నొనర్చుటచే నా స్వారస్యము తెలుఁగునఁగూడ వచ్చినది. నిరూఢుఁ డనఁగా నధిష్ఠాత యని యర్థము. వాని కధీనుఁడై కాదు వానిని నియమించునని భావము. అందున్-ఆ మువ్వురియందును, శుభస్థితుల్-ధర్మార్థకామ మోక్షము లనెడు శుద్ధఫలములు. బ్రహ్మ శివుఁడు ధర్మార్థ కామాదు లొసఁగినను, ఉపాధిదృష్టితో నతి సుఖములు గావు. ఎందుకనఁగా రజోగుణము ఘోరము, తమోగుణము మూఢము. ఆ యుపాధులను వదలి వారిని సేవించినను మోక్షము తొందరగ రాదు. సాక్షాత్తుగ లభింపదు. అతికష్టముతో నేర్పడును. ఈ బ్రహ్మ శివులు పరమాత్మ యంశభూతులే. ఈ విధమైన యనుసంధానాభ్యాసము చాల దినములు సాఁగవలెను. అపుడు తదంతర్యామియైన పరమాత్మనుండియే ముక్తి లభించును. ఉపాధిదృష్టితో నైనను విష్ణువును సేవించినపుడు, సత్త్వము పరమశాంతరూప మైనందున దానినుండి ప్రాప్తించు ధర్మార్థ కామములును సుఖదములై యుండును. నిష్కామముగ నాతని సేవించినపుడు 'సత్త్వా త్సంజాయతే జ్ఞానం' అనుటచేత జ్ఞానము, తత్ఫలమైన మోక్షము శీఘ్రముగ నేర్పడును. స్కాందమం దిదియే చెప్పఁబడినది.

> బంధకో భవపాశేన భవపాశాచ్చ మోచకః,
> కైవల్యదః పరంబ్రహ్మ విష్ణురేవ సనాతనః. (స్కాందము)

సర్వథా ఉపాధిని పరిత్యజించి నందువలన పంచమ పురుషార్థమైన భక్తియే సిద్ధించును. ఆ భక్తి పరమాత్మాకారముతోనే భాసించు

నది గనుక; కర్మ జ్ఞానాదులను వదలి భక్తియే యెట్లు సేవింపఁదగి నదో అట్లే దేవతాంతరోపాసనమును వదలి విష్ణువునే యుపాసింపవలె నని సిద్ధమైనది. 'ఒక్కఁడు'—ఆ భగవంతుఁ డొక్కఁడేయైనను క్రీడగా నవతరించి, యనేక రూపములుగా భాసించుచున్నాఁడు. దశమ స్కంధములో 'బహుమూర్త్యేక మూర్తికం' అని చెప్పఁబడినది. అతని యవతారములు రెండు రీతులు, చిచ్ఛక్తితో నేర్పడునవి. మాయా శక్తితోఁ గలుగునవి. చిచ్ఛక్తికృతములు మత్స్య కూర్మాదులు. మాయాకృతములు సత్త్వ రజ స్తమోగుణముల ద్వారా విష్ణు బ్రహ్మ రుద్రులు. వాసుదేవుఁడు గుణయుక్తుఁడైనను అచింత్యశక్తి చేత నా గుణములకు బహిర్భూతుఁడై యుండును. పరమపురుషునియందు మాయాగుణమైన సత్త్వగుణ మున్నను దానితో నతనికి యోగమే. సత్త్వ మాతని ప్రకాశము. లేక దానియం దాతఁ డుదాసీనుఁడు. కనుక సచ్చిదానంద వస్తువైన పరమాత్మకు సత్త్వగుణముచేత ఉప రాగము సంభవింపదు. కనుక నది వారి శరీరముతోడి సంబంధ మున్నది గాదు.

బ్రహ్మశివుల కట్లుగాదు. ఆ రెండుగుణములును విక్షేపరూపములు. ఆవరణములు; ఉపకారాపకారములు గల్గించును. కనుక, వారితో వారి యానందస్వరూపమునకు విక్షేప మేర్పడును. ఉపరాగముగూడ ప్రాప్తించును. బ్రహ్మ రుద్రాదులకు రజస్తమస్సులు ఉన్నందువలన వారు సగుణులే. హరియే నిర్గుణుఁ డనుటయు నుక్తిసిద్ధమే, హరి నిర్గుణుఁడైనను ప్రాకృతమైన సత్త్వగుణము ప్రకాశరూపముతో నాతని సమీపమం దున్నదిగదా! తద్ధర్మమైన విశ్వపాలనమును నాతనియం దేర్పడినది; మఱి నిర్గుణుఁ డెట్లయ్యెను? అతఁడు దానియందుఁ గేవల ముదాసీనుఁడని యుత్తరము. ఉదాసీనుఁడైనంత మాత్రముతో సంబంధ మెట్లు పోవును? సత్త్వగుణము శ్రీమహావిష్ణువునందు సంయోగ సమవాయ సంబంధములతో లేదు, కేవల సామీప్య సంబంధముతోనే యున్నది. స్వభక్తపాలనము స్వరూపభూతమైన

శుద్ధసత్త్వముయొక్క ధర్మముగాఁ దెలియవలెను. బ్రహ్మజీవుఁడే. రజోగుణయుక్తుఁడైన బ్రహ్మయందు పరమాత్మయోగము కేవలమావేశమే. బ్రహ్మసంహితలో నిట్లున్నది-

భాస్వాన్యథాశ్మ శకలేషు నిజేషు తేజః
స్వీయం కి యత్ప్రకట యత్యపి తద్వదత్ర,
బ్రహ్మయ ఏవ జగదంత విధానకర్తా
గోవింద మాదిపురుషం తమహం భజామి.

శివునకు జీవత్వము లేదుగనుక నతనికి గుణయుక్తేశ్వరత్వమే. ఆ బ్రహ్మసంహితలోనే యిట్లున్నది-

క్షీరం యథా దధివికార విశేషయోగా
త్సంజాయతే న తు తతః పృథగస్తి హేతోః,
యశ్శంభు తామపి తథా సముపైతి కార్యా
ద్గోవింద మాదిపురుషం తమహం భజామి.

ఇది కొందఱివాదము. కొందఱు నియామక సంబంధముతోఁ గాని, సామీప్య సంబంధముతోఁ గాని భగవంతునికి సత్త్వగుణసంబంధముఁ జెప్పెదరు. నియామకతా సంబంధమైనచో విష్ణువు స్వరూపేణ నిర్గుణుఁడే యగుచున్నాఁడు. రజస్తమస్సులు సంయోగసంబంధము చేత బ్రహ్మ శివులయం దుండఁగా వారు సగుణులే యగుచున్నారు. సత్త్వమందు సామీప్యసంబంధ మాత్రముచేతనే యోగమని పక్షాంతరము. అట్టి యెడలఁ గూడ నాత్మఁడు నిర్గుణుఁడే. భాగవత చతుర్థ స్కంధమం దీ శ్లోక మున్నది.

త్రయాణా మేవ భావానాం యో న పశ్యతి వై భిదామ్,
సర్వభూతాత్మనో బ్రహ్మన్! స శాంతి మధిగచ్ఛతి.

ఇక్కడ 'శాంతి' యనఁగా మోక్షము. ఒక్కఁడేయైన పరమాత్మ సోపాధికమైన మాయాగుణములైన గుణత్రయములతోఁ

గూడినవాఁడు. అప్పుఁ డాతనికిఁ గర్మభేదత్వములతో నామభేదము. ఒక క్షేత్రమందు సేద్యగాఁడు బీజములను విత్తునపుడు ఆవాపకుఁడు. సస్యోపేతమైన క్షేత్రమును జలములతోఁ దడుపుచు పాలకుఁడు. కొడవలి మొదలైన వాటితో పంటఁ గోయుచు లావకుఁడు. కారణ భూతమైన రజోగుణగ్రహణముతో సర్వప్రపంచమును సృష్టించుచు బ్రహ్మ మనిపించికొనును. హిరణ్యగర్భుఁడు పంచీకృతమైన సృష్టినే యొనర్చును. పంచీకృతభూతభౌతికసృష్టి యొనర్చినను నాతఁ డపు డపుడు బ్రహ్మ యనిపించికొనును. కాని యది యౌపచారికమే. ఆ జీవుఁడు గల్పాంతమున జేసిన 'యహంగ్రహోపాసన'చే బ్రహ్మ భావమును బొందినవాఁడు. ఈ విషయ మితిహాసాదులందుఁ బ్రసిద్ధమే. అతనియందు వాఁడఁబడు 'ఈశ'త్వాది పదములు తదంతర్యామియైన పురుషునకుఁ జెందినది. అట్లే వహ్నీంద్రసూర్యాదులకు వాఁడు నీశత్వాదులు, తదంతర్యామి పదములు. వహ్న్యాదులకును, తదంతర్యామికిని అభేదమైనను భేదము గ్రహింపఁ బడుచున్నది. శ్రుతియే దానికిఁ బ్రమాణము.

**యశ్చాదిత్యే తిష్ఠన్ ఆదిత్యాదంతరః యమాదిత్యో న వేద యస్యాదిత్య శ్శరీరం య ఆదిత్యమంతరోయ మయతి భీషాస్మాద్వాతః పవతే.**

కనుక వ్యావహారికభేద మంగీకార్యమే. కారణీభూతమైన సత్త్వ గుణముతోఁ జరాచరమును బాలించుచు విష్ణు వనఁబడుచున్నాఁడు. తమస్సుతో రుద్రుఁడు. కనుక పరబ్రహ్మ, పరమశివ, మహావిష్ణు, వాసుదేవాది శబ్దగోచరుఁడైన యొకటే వస్తువునకు చతుర్ముఖ, చతుర్భుజ, పంచముఖరూపములైన పుమాకారములు వాణీ రమా ఉమాకారములైన స్త్రీరూపములును, లీలావిగ్రహములు. చతుర్ముఖాకారము బ్రహ్మకు, చతుర్భుజాకారము విష్ణునకు, పంచముఖాకారము రుద్రునకు. అట్లే వాణ్యాకారము విధికి, రమాకారము హరికి, హరున కుమాకారము అని వేరువేరుగాఁ జెప్పవలెను గదా! గుణత్రయ

భేదముతో తదవచ్ఛిన్నులకును భేదమున్నది. ఒకనికే యిన్నియునని యెట్లు చెప్పఁబడినది? ఇది పూర్వపక్షము.

సమాధాన మీ క్రిందిది. చతుర్భుజశరీరునకు పాలకత్వ ప్రయోజనము విష్ణుత్వమే యనుటకు వీలులేదు. అతఁడును దైత్య సంహారాది కార్యము లొనర్చినవాఁడే. నిజమున కవి తమోఽవచ్ఛిన్న రుద్రకార్యములు గదా! అట్లే పంచముఖాకారావచ్ఛిన్నుఁడైన యీశ్వ రుఁడును త్రిపురాది సంహారరూపమున దేవతాపాలనాదుల నొనర్చెను. ఇవి విష్ణుకార్యములే గదా! 'శివ ఏకో ధ్యేయ శ్శివంకరః' 'ప్రజ్ఞాచ తస్మాత్ప్రసృతాపురాణీ' అనెడు శ్రుతిచేతను 'సమోచయతిసుప్రీతః' 'మోచయామి శ్వపాకం వా' అనెడు స్మృతిచేతను సత్త్వావచ్ఛిన్నుఁ డైన విష్ణుకార్యముగూడ శివునియందుఁ గన్పడుచున్నది.

త మాచుర్బ్రాతరో రుద్రః సేవిత స్సాత్త్వికై ర్జనైః,
మో చ యేత్సత్త్వ సంయుక్తః పూజయే శమతో హరమ్.

అని భాగవతమే యనుచున్నది. కౌర్మమునందు రుద్రునికి సాక్షాత్సత్త్వగుణమే ప్రతిపాదితము. ఈ మాటలతో తమోగుణాశ్ర యత్వముతో రుద్రున కపకర్షణ మాపాదించిన వాదన వీఁగిపోయి నది. జీవులు నిరంతరదుఃఖమయ సంసార పరివృత్తిచేత శ్రాంతులు. వారికిఁ గొంతకాలము విక్షేప విగమ సముల్లసితమైన యానందాను భవము నొసఁగి విశ్రాంతిని గల్గింపవలెను. అందుకే పరమాత్మ తత్సంహారమునకై తమోగుణమును స్వీకరించెను. దుశ్చికిత్స్యవ్రణ పీడితులైన జనులకు వైద్యుఁడు శస్త్రప్రయోగ మొనర్చినట్లు. శివ పురాణవ్యాఖ్యాన మిట్లే యనుచున్నది.

నిదానజ్ఞస్య భిషజో రుగ్ణహింసాం ప్రయుంజతః,
న కించిదపి నైర్ఘృణ్యం ఘృణైవా త్రప్రయోజితా.

కనుక పరమ శివుఁడు నిరతిశయ కరుణాంబునిధియే. విష్ణు పురాణాదులందు 'సత్త్వోద్రిక్తస్తతోబ్రహ్మా' అని బ్రహ్మకుఁగూడ సత్త్వ

గుణయోగముతో విష్ణుత్వము ప్రతిపాదింపఁబడుచున్నది. భారతమం దతివృద్ధులైన ప్రజలను విధి కోపాగ్నిచే దహించెనని యున్నది. అది రుద్రత్వ ప్రతిపాదకమే. వసిష్ఠపురాణమందు 'సత్త్వం దేవా హరాదయః' ఇత్యాదులతోఁ ద్రిమూర్తులకును శుద్ధసత్త్వప్రధానమైన మాయోపాధికత్వము చెప్పఁబడినది. అట్లే భవానియు దైత్యాది సంహారమొనర్చినను పాలనరూప విష్ణుకార్యమును జేసినది. 'నృణాం భవతి ముక్తయే' అను మార్కండేయ పురాణవచనముతో మోచకత్వ గుణావచ్ఛిన్నమైన విష్ణుకార్యము పార్వతికిఁ జెప్పఁబడెను. మహిషా సురయుద్ధమందు అనేక గణములను సృష్టించినది. బ్రహ్మకార్యము. మోక్షప్రదత్వము మహాలక్ష్మికే మార్కండేయమునందుఁ జెప్పఁ బడినది.

'సాచాన్యైవ సమష్టిరూపా' అని మార్కండేయ ప్రాధానిక రహస్యములోఁ గలదు. మరి పార్వతియందు మోచకత్వాదిరూపమైన విష్ణుత్వము చెప్పఁబడుచున్నది నిజమే. దీని నింకను గూఢముగ శోధింతము.

మార్కండేయమునకు భిన్నముగా మహిష, శుంభ, నిశుం భాది సంహారము నందపుత్రీత్వము హరివంశమందు గౌరీదేవికే చెప్పఁబడినది. సందర్భము ప్రద్యుమ్న శంబరాసురుల యుద్ధము. ఆ శ్లోకము లీక్రిందివి.

> హతాయాం సర్వమాయాయాం శంబరోఽచింతయ త్పునః,
> అస్తిమే కాలదండాభో ముద్గరో హేమభూషితః.
>
> పురాయో మమపార్వత్యా దత్తఃపరమ తుష్టయా,
> గృహాణ శంబరే మంత్వం ముద్గరం హేమభూషితమ్.
>
> మాయాంతకరణం నామ సర్వాసుర వినాశనమ్,
> అనేన దానవౌ రౌద్రౌ బలినౌ కామరూపిణౌ.
> శుంభశ్చైవ నిశుంభశ్చ సగణౌ సూదితౌ మయా.

ఈ ముద్గరవృత్తాంతమును ప్రద్యుమ్నునితోఁ దెల్పుటకు, దేవేంద్రుఁడు నారదునంపెను. అతఁడు వచ్చి, ప్రద్యుమ్నునకుఁ గౌర్యుపాసనాక్రమము నెఱిఁగించి వెళ్లినాఁడు. యుద్ధమున శంబరుఁడు గౌరీదత్తమైన ముద్గరమును గ్రహించెను. వెంటనే ద్వాదశాదిత్యుల వెలుఁగులు మాసినవి, ఉత్పాతములు జనించినవి. ప్రద్యుమ్నుఁడు దేవి నిట్లు స్తుతించినాఁడు—

ఓం నమః కాత్యాయన్యై గుహస్య జనన్యై నమః,
నమస్త్రైలోక్య మాయాయై కాత్యాయన్యై నమో నమః,
నమస్తే శంభుమథనీం నిశుంభఘ్నీ ద్విదారిణీమ్,
వింధ్యవాసినీం దుర్గఘ్నీం రణదుర్గాం రణప్రియామ్.
త్రిశూలినీం నమస్యామి. మహిషాసురఘాతినీం,
సింహవాహాం నమస్యామి.

ఈ విధముగా మార్కండేయ మధ్యమ ఉత్తమ చరితోక్తమైన సర్వవిషయము నక్కడఁ జెప్పినాఁడు. ప్రథమచరిత్ర దేవత యోగనిద్రారూపిణియైన తామసీశక్తి. అది రుద్రాంతర్భూతమే యనుట నిర్వివాదము. మార్కండేయమందు శుంభనిశుంభవధ శూలఖడ్గములతోఁ జేసినట్లున్నది. ఇక్కడ ముద్గరము వాడఁబడినది. ఇంతమాత్రమే రెంటికిని భేదము. దీనిని కల్పభేదముతో సమర్థించికొన వచ్చును. 'వైవస్వతేంతరే' అని భగవతియే చెప్పుచున్నది. అనిరుద్ధ విష్ణువులు హరివంశమందు దేవీప్రార్థన మొనర్చిరి. భీష్మపర్వమం దర్జునుఁడును. ఇది తక్కిన పురాణములందుఁ గూడఁ గలదు. ఇట్టి చోటులందును మాహాత్మ్యవర్ణనములో హరివంశోక్తమైన యర్థమే చెప్పఁబడినది. ఉమాదిశక్తులు మహాలక్ష్మీ విభూతిపరములే యనుట ఉపాసనార్థస్తుతిపరము, నృసింహస్తుతిలో విష్ణ్వాదులు నృసింహుని విభూతులే యని చెప్పఁబడినట్లు. కనుక మహాలక్ష్మ్యాదులు గౌరీదేవి విభూతులేయనుట స్పష్టము. ఈ వాక్యములన్నియు వివిధమూర్తులకభేదపరములు. రామస్తుతిలో 'త్వమక్షరం బ్రహ్మ' అని యున్నది. అప్పుడేమగును? అక్షరుఁ

డైన పరబ్రహ్మగూడ రామచంద్రుని విభూతియే యగునుగదా
తారములెత్తు మూలరూపమునకును, అవతారములకును అభేదః
ఇత్యాది వచనముల యభిప్రాయము. కూర్మపురాణమం దిట్లు

న మే నారాయణాద్భేదో విద్యతే హి విచారతః,
తన్మయాఽహం పరంబ్రహ్మ స విష్ణుః పరమేశ్వరః.

తన కే విష్ణురూప మున్నదని గౌరీదేవి చెప్పుచున్నది.
లోనే_

సదా శివాంక మారూఢా శక్తి రిచ్ఛాత్వయా శివా,
మహాలక్ష్మీ ....  ....  ....  ....

శివునియందు మహాలక్ష్మీరూపముగా మాయ యా్రక
దనియు నొకమాట. లక్ష్మీతంత్రములో ఉమాదేవి లక్ష్మీదేః
తారమే యని ప్రతిపాదితము.

హిరణ్యగర్భ రుచిరౌ స్త్రీపుంసౌ కమలాసనౌ

ఇత్యాది ప్రాధానిక రహస్యమందును రమాదేవికి ఏ
చ్ఛిన్న బ్రహ్మరూపత్వము ప్రతిపాదింపఁబడినది. కనుక నామె
విష్ణురూపత్వమే గాదు. అట్లని కేవల విధిరూపత్వము మాత్ర
దనియుఁ జెప్పరాదు.

ఇయం సా పరమాశక్తిః మన్మయా బ్రహ్మరూపిణీ.

అని కౌర్మమందు విష్ణువనుట చేతను, విష్ణుపురాణా
నముచేతను నామెకు విష్ణుత్వముగూడఁ గలదని విదితమగు
అట్లే రుద్రయామళములో 'మోక్షదే ముక్తిమార్గే' అని స
గూర్చి వాడఁబడినది. కనుక నామెకు మోక్షాదిరూప సత్త్వా
కార్య మున్నట్లే, ప్రాధానిక రహస్యమందును_

సత్త్వాఖ్యేనాతి శుద్ధేన గుణేనేందు ప్రభం దదౌ

అనుటతో సరస్వతి శ్వేతరూపిణి. సత్త్వయోగ
శివునకుఁ గూడ నీ గుణములే చెప్పఁబడినవి. కనుక సర్వులకు

దేహము లున్నవని సిద్ధమగుచున్నది. సర్వులకు నేకరూపత్వమనియు పర్యవసానము. హరివంశమందు-

యో విష్ణు స్తతో రుద్రో యో రుద్రస్స పితామహః.
ఏకమూర్తి స్త్రయో దేవాః రుద్రవిష్ణు పితామహాః,
వరదా లోకకర్తారో లోకనాథా స్స్వయంభువః,
అర్ధనారీశ్వరా స్తేతు వ్రతం తీవ్రం సమాస్థితాః.

అనెడు శ్లోకము లున్నవి. వీనిచేత నే మగుచున్నది?

రుద్రో నారాయణశ్చైవేత్యేకం సత్త్వం ద్విధా కృతమ్.

ఇత్యాది భారతవచన ముపపన్న మగుచున్నది. అందుచే శివ విష్ణువు లిర్వురును సత్త్వావచ్ఛిన్నులే. పైం జెప్పిన విషయముచేత, బ్రహ్మ జీవుండే యనువాదము పరాస్తమయ్యెను. ఒక్కొక్కచోట పురాణాదులలో శివునినుండి విష్ణు వుద్భవించినట్లును విష్ణువునుండి శివుండు జన్మించినట్లును చెప్పంబడుచున్నది.

అండం హిరణ్మయం రుద్రస్య వీర్యాత్ప్రథమం సంబభూవ తత్ర బ్రహ్మా విష్ణుర్జాతః.

హరివంశమందును, శివునితో విష్ణు వన్న వాక్యము-

అహం బ్రహ్మ కపిలో ఉధావ్యనంతః
పుత్రా స్సర్వే బ్రహ్మణ శ్చాతివీర్యాః,
త్వత్త స్సర్వే దేవదేవ ప్రసూతాః
ఏవం సర్వే కారణాత్మా త్వమీడ్యః.

అని యున్నది. శ్రుతి 'నారాయణాద్బ్రహ్మా జాయతే, నారాయణాదింద్రో జాయతే, నారాయణాద్ద్వాదశాదిత్యాః రుద్రస్సర్వే దేవతాః' అనియును గలదు. ఇట్లే అనేకము లున్నవి. ఇవన్నియుం గల్పభేదముచే జరిగినవని సమాధానపడవలెను. ఈ విషయమింకను విపులముగా వసిష్ఠుండు రామునకుం జెప్పినట్లుగా వాసిష్ఠములో గలదు. వసిష్ఠునితో నీశ్వరుం డనుచున్నాండు-

ఏవం సర్గే హి కస్మింశ్చిత్ ప్రథమోఽథ సదాశివః,
కస్మిం శ్చిద్విష్ణు రిత్యుక్తో నా భ్యుత్పన్న పితామహః,
పితామహస్య కస్మింశ్చిత్ కస్మింశ్చి దపిచేతరః.

ఇక్కడి 'ఇతర' శబ్దముతో దుర్గా భైరవ వినాయకాదులు గ్రాహ్యులు. తన్మాహాత్మ్య ప్రతిపాదిక పురాణాదులు వారినుండియే బ్రహ్మాదు లుద్భవించినట్లు చెప్పుచున్నవి. వాయుపురాణమందును—

బ్రహ్మనారాయణౌ పూర్వం రుద్రః కల్పాంతరేఽ సృజత్,
కల్పాంతరే పునర్బ్రహ్మ రుద్ర విష్ణూ జగన్మయః.
విష్ణుశ్చ భగవాన్ తద్వత్ బ్రహ్మాణ మసృజత్పునః,
నారాయణం పునర్బ్రహ్మా బ్రహ్మాణం చ పునశ్శివః.
ఏవం కల్పేషు కల్పేషు బ్రహ్మవిష్ణు మహేశ్వరాః,
పరస్పరస్మా జ్జాయంతే పరస్పర జయైషిణః.
తత్తత్కల్పాంత వృత్తాంత మధికృత్య మహర్షిభిః,
ప్రభావః కథ్యతే తేషాం పరస్పర సముద్భవాత్.

అని పై వాక్యము లున్నవి. కౌర్మములో—

క్వచిద్రుద్రః క్వచిద్బ్రహ్మ క్వచిద్విష్ణుః ప్రశస్యతే,
నాన్యేన తేషామాధిక్యం న్యూనత్వం వా కథంచన.
తత్త త్కల్పాంతవృత్తాంత మధికృత్య మహర్షిభిః,
తాని తాని ప్రణీతాని విద్వాన్ తత్ర న ముహ్యతి.

అని యున్నది. మార్కండేయములో—

విష్ణు శ్శరీరగ్రహణం అహమీశాన ఏవ చ,
కారితాస్తే యతో ఽతస్త్వాం కస్తోతుం శక్తిమా న్భవేత్.

ఇత్యాదులతో విష్ణ్వాదులు దుర్గాదేవినుండి పుట్టినట్లు గలదు. కనుక త్రిమూర్తుల నుండి దేవీజన్మము గూడఁ గల్పభేదముతో సమర్థనీయమే. అట్లే గణేశ పురాణాదులందును వినాయకాదుల నుండి

బ్రహ్మోద్యావిర్భావ మని చెప్పఁబడిన విషయముగూడ సమర్థింపఁదగి నదే. కనుక సర్వులును సత్త్వతనులే. సత్త్వతనుత్వముతో బ్రహ్మా దుల నుపాసించినను శ్రేయమే గలుగునని స్థిరమైనది.

ఐనను, మహావిష్ణువునకు సాక్షాత్త్వ అసాక్షాత్త్వ భేదములతోఁ బ్రకాశమందు తారతమ్య మేర్పడుచున్నది. ఆ దృష్టితోఁ జూచినపుడు విష్ణూపాసనే తక్కినవానికంటె నుత్తమమనియే చెప్పవలెను. ఈ మాటలనే వంశీధరుఁడు తనవ్యాఖ్యలో నిట్లు బేర్కొన్నాఁడు-

**తథాపి తస్య తత్ర తత్ర సాక్షిత్త్వ అసాక్షిత్త్వ భేదేన ప్రకాశేన తార తమ్యం దుర్నివార మేవేతి స దృష్టాం త మాహ పార్థివాదితి.**

వచనము: మరియు నొక్కవిశేషంబుఁగలదు. కాష్ఠంబుకంటె ధూమంబు, ధూమంబుకంటెఁ ద్రయీమయంబయినవహ్ని, యెట్లు విశేషంబగునట్లు తమోగుణంబుకంటె రజోగుణంబు, రజోగుణంబు కంటె బ్రహ్మప్రకాశంబగు సత్త్వగుణంబు విశిష్టంబగు. తొల్లి మునులు సత్త్వమయుండని భగవంతు హరి నధోక్షజుంగొలిచిరి. కొందఱు సం సారమందలి మేలుకొఱకు నన్యుల సేవింతురు. మోక్షార్థులయిన వారలు ఘోరరూపులయిన భూతపతుల విడిచి దేవతాంతరనింద సేయక శాంతులయి నారాయణ కథల యందుఁ బ్రవర్తింతురు. కొందరు రాజస తామసులయి సిరియునైశ్వర్యంబును బ్రజలనుంగోరి పితృభూత ప్రజేశాదుల నారాధింతురు. మోక్షమిచ్చుటంజేసి నారాయ ణుండు సేవ్యుండు. వేద యాగ యోగక్రియా జ్ఞానతపోగతి ధర్మం బులు వాసుదేవపరంబులు. నిర్గుణుండైన పరమేశ్వరుండు గలుగుచు లేకుండుచుఁ ద్రిగుణంబులతోడం గూడిన దనమాయచేత నింతయు సృజియించి గుణవంతుని చందంబున నిజమాయా విలసితంబులైన గుణంబులలోఁ బ్రవేశించి విజ్ఞాన విజృంభితుండై వెలుంగు. అగ్ని యొక్కరుండయ్యుఁ బెక్కు గ్రాకులందుఁ దేజరిల్లుచుఁ బెక్కండై తోఁచు తెఱంగున, విశ్వాత్మకుండైన పురుషుండొక్కండ తనవలనం

గలిగిన, నిఖిలభూతంబులందు నంతర్యామి రూపంబున దీపించు. అతండు మనోభూతసూక్ష్మేంద్రియంబుల తోడంగూడి గుణమయంబులైన భావంబులం దనచేత నిర్మితంబులైన భూతంబులందుఁ దగులు వడక తద్గుణంబు లనుభవంబుసేయు. లోకకర్తయైన యతండు దేవ తిర్యఙ్మనుష్యాది జాతులందు లీల నవతరించి లోకంబుల రక్షించు అని మఱియు సూతుం డిట్లనియె.

మఱియు నొక్కవిశేషంబు గలదు. ఆ విశేషమేమి? ఉపాధి వైశిష్ట్యముచేత ఫలవైశిష్ట్యమే విశేషము. ఆ యుపాధి విశేషమునే చెప్పుచున్నాఁడు.

అర్థములు: కాష్ఠంబుకంటెన్=స్వయముగాఁ బ్రవృత్తి ప్రకాశ రహితమైన కట్టెకంటెను, ధూమము విశేషము. ఎట్లు విశేషము? దానికిఁ బ్రవృత్తి యున్నది. ప్రవృత్తిస్వభావమైన ధూమముకంటెను త్రయీమయంబైన వహ్ని=వేదోక్త కర్మప్రచురమైనయగ్ని. అగ్నియే వేదోక్త సమస్తకర్మలకును సాధనము. తమోగుణము లయాత్మకము. దానికన్నను రజోగుణము గొంతమెఱుఁగు. కొద్దిగా దానియందుఁ బ్రవృత్తియున్నది. అది సోపాధికమైన జ్ఞానమునకు హేతువు. కాని విక్షేపాదు లుండుటతో ధ్యానము నిలుకడగా నిలువదు. కొద్దికొద్దిగా మాత్రమే బ్రహ్మదర్శన సంభావనయుండును. రజోగుణమునకంటెను 'బ్రహ్మప్రకాశకము', బ్రహ్మానుభూతిని సాక్షాత్తుగా గలిగించునది. అట్టి సత్త్వగుణము శ్రేష్ఠము. కాష్ఠమునకంటె ధూమమును, ధూమమునకంటె వైదికకర్మానుష్ఠానమునకుఁ బ్రధాన హేతువైన వహ్నియు నెట్లు విశిష్టములో, అట్లే తమస్సుకంటె రజోగుణము దానికంటె సత్త్వగుణము విశిష్టములని పిండితార్థము. 'బ్రహ్మదర్శనం' దీనియర్థ వివరణమే బ్రహ్మప్రకాశకము అనునది. తొల్లిమునులు .... .... .... కొలిచిరి. అధోక్షజ శబ్దము మూలమందున్నదే ఇంద్రియజన్య జ్ఞానమున కతీతుఁడని యర్థము. భగవచ్ఛబ్దమును మూలములోనిదే.

'సత్త్వం విశుద్ధం' అను దానికి 'సత్త్వమయుండగు' అని పోతన్న రచన. కొందరు .... .... .... సేవించుచుందురు. ఇది పోతన్నగారి సొంతము. అనఁగా మూలార్థమునకు వివరణప్రాయమైనది. 'నన్వ న్యానపి కేచిద్భజంతో దృశ్యంతే' అని శ్రీధరుఁడు ఒక శ్లోకమున కవతారికగా వాడెను. దానినే పోతన్నగారి వాక్యములో వివరించినారు. సంసారమందలి మేలుకోలకు—మేలనఁగా సుఖములని యర్థము. సంసారమందలి తాత్కాలికములైన కష్టములుతొలఁగి సుఖము లనుభవించుటకని తాత్పర్యము. మోక్షార్థులైన .... .... .... ప్రవర్తింతురు— 'ముముక్షవః' అనుదానికి మోక్షార్థులైన అనియాంధ్రము. ఘోరరూపులైన—ఇది మూలపదమే. భూతపతిశబ్దమును అట్టిదే. దేవతాంతర నింద సేయక—అనునది 'అనసూయవః' అను దానివివరణము. 'నారాయణకలాః శాంతాః' ఇది మూలమందలి పదము, ఇక్కడి 'శాంతాః' అను శబ్దమును 'ముముక్షవః' అను దానితో నన్వయింపవచ్చును. 'నారాయణకలాః' అనుదానితోను జేర్చికొనవచ్చును. ఈ శబ్దముభయగాన్వయి. పోతన్నగారు మోక్షార్థులైనవారికే యన్వయించికొన్నారు. దీనితో నొకస్వారస్యమేర్పడినది. నారాయణకళలు సహజముగనే శాంతములైనవి. వానికి మరల విశేషణాంతర మక్కఱలేదు. మోక్షార్థులైనవారు కేవలము నారాయణ కథలయందుఁ బ్రవర్తించుట మాత్రమేగాదు. పరమశాంతులైగూడ నుండవలయును. అనఁగా సంసారమందలి మేలుగీళ్లతో తమ శాంతిని బోఁగొట్టుకొనరాదని తాత్పర్యము. వారు ఘోరరూపులైన భూతపతులను వదలి నారాయణ కథలందే ప్రవర్తింపవలెను. శాంతియను కవచమును ఎప్పుడును వదలరాదు. దేవతాంతర నింద సేయకుండుటయుఁ బ్రధానమైన లక్షణము. కొందఱు రాజస .... .... .... సేవ్యుండు— కొందరు మానవులు, రజస్తమోగుణములు గలవారై పితృభూతప్రజేశాదుల నారాధించుచుందురు. ముముక్షువులైనవారికి నారా

